అనువాద వాఙ్మయము - 2
చరిత్ర

# భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర

## ప్రథమ భాగము




ఆంగ్ల రచన
శ్రీ తారాచంద్

అనువాదము
ఆచార్య భూపతి లక్ష్మీనారాయణరావు







తెలుగు అకాడమి
హైదరాబాదు-29
1973

BHARATA SWATANTRYODYAMA CHARITRA, PART-I (History of the Freedom Movement In India); *English Original* : Sri Tarachand — *Translation* : Prof. B. Lakshminarayana Rao ; First Edition, 1973, pp. 70+352.



*First Edition 1973*
*Copies : 3,000*



Published by TELUGU AKADEMI, HYDERABAD-500029 (Andhra Pradesh) under the Centrally Sponsored Scheme of Production of Books and Literature in Regional languages at the University level, of the Government of India in the Ministry of Education and Social Welfare (Department of Culture), New Delhi.





Price : Rs. **15-50**

---

PRINTED IN INDIA
Text at Chary & Co., 103 Sardar Patel Road, Secunderabad.
Jacket at M/s. Dolton Press,
Hyderabad-500001, Andhra Pradesh.

# భూమిక

స్వాతంత్ర్యానంతరం దేశకాల పరిస్థితుల దృష్ట్యా కళాశాలలలో గూడా విద్యాబోధన మాతృభాషలోనే జరపడం అభిలషణీయమని అధిక సంఖ్యాకులైన విజ్ఞులు, విద్యావేత్తలు, అధికార అనధికార ప్రముఖులు భావించినారు. తత్పర్యవసానంగా మన రాష్ట్రంలో మొదట ఇంటర్మీడియట్ స్థాయిలో, ఆ తరవాత డిగ్రీ స్థాయిలో తెలుగును బోధనాభాష చేయడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాలు ప్రగతిశీలమైన చర్యలు తీసుకోవడం జరిగింది. ఈ సందర్భంలో విద్యార్థులకు, అధ్యాపకులకు అవసరమైన పాఠ్యగ్రంథాలు (text-books), పఠనీయ గ్రంథాలు (reading material) ప్రచురించే బాధ్యత తెలుగు అకాడమికి అప్పగించినారు.

ఈ బాధ్యతను విజయవంతంగా నిర్వహించడంలో ఉండే సాధకబాధకాలు సహృదయులకు తెలియనివి కావు. మొదటిసారిగా తెలుగులో విభిన్న శాస్త్రవిషయాలపై గ్రంథరచన చేయించవలెనంటే సమర్థులైన రచయితలను, సంపాదకులను నియమించి, వారు సకాలంలో నిర్దుష్టమైన వ్రాతప్రతులను మాకు అందించే విధంగా కార్యక్రమాలను రూపొందించి నడపడం, వారికి సముచితరీతిని పారిభాషిక పదాలను అందించడం, పుస్తకాలకు అవసరమైన చిత్రాలు తయారుచేయించడం — వంటి పనులన్నిటిని సక్రమంగా సమన్వయించవలె. తరవాత అందంగా ముద్రించవలె. అప్పుడే విద్యార్థులకు సకాలంలో పుస్తకాలను అందజెయ్యడం సాధ్యమవుతుంది. ఈ అన్నింటికీ మాకు లభించిన వ్యవధి చాలా తక్కువ అనే విషయంతోపాటుగా మన రాష్ట్రాన్ని సంక్షోభస్థితి ఆవరించి ఉన్నదనే సంగతి కూడా అందరికి తెలిసినదే. అయినా, శక్తియుక్తులన్నిటినీ కేంద్రీకరించి అకాడమి చాలావరకు విజయవంతంగానే ఆ సవాలును ఎదుర్కొనగలిగింది.

విశ్వవిద్యాలయ స్థాయిలో తెలుగులో శాస్త్రగ్రంథాలను ప్రచురించే కార్యక్రమాన్ని మేము మూడు దశలుగా విభజించుకొన్నాము. అవి :

1. మౌలికమైన పాఠ్య, పఠనీయ గ్రంథాలు (Original text-books and reading material) ప్రచురించడం.
2. ఆంగ్ల భాషలో ఉన్న కొన్ని ప్రామాణిక శాస్త్రగ్రంథాలకు తెలుగు అనువాదాలను ప్రకటించడం.
3. కొన్ని శాస్త్రాంశాలపైన మౌలికాలైన బృహద్వ్యాసాలు(monographs) రచింపజేసి ప్రకటించడం.

వీటిలో మొదటి అంచెగా ఇంటర్మీడియట్, డిగ్రీస్థాయి పాఠ్య, పఠనీయగ్రంథాల ప్రచురణ దాదాపు ముగియవచ్చింది.

ఇంటర్మీడియట్ స్థాయిలో మొత్తం 12 శాస్త్రాలలో రమారమి 60 మౌలికములైన

పాఠ్యగ్రంథాలు ప్రచురించడమే కాకుండా, రాష్ట్రంలో విభిన్నప్రాంతాలలో అధ్యాపకుల ప్రతినిధులను సమావేశపరిచి, ఆయా గ్రంథాలను కూలంకషంగా విమర్శింపజేసినాము. చర్చా ఫలితాలను నిపుణుల, సంపాదకుల, రచయితల దృష్టికి తెచ్చినమీదట ఆయా గ్రంథాలను పరిష్కరించినాము.

డిగ్రీ స్థాయిలో 21 శాస్త్రాలలో దాదాపు 800 మౌలికమైన పఠనీయగ్రంథాల ప్రచురణ కూడా మేము చేపట్టినాము. మూడు విశ్వవిద్యాలయాలలోను అమలులో ఉన్న పాఠ్యప్రణాళికలను సమన్వయపరిచి, కొందరు సామాన్య విషయం (general study) గా, మరికొందరు ఐచ్ఛిక విషయం (Optional or elective) గా చదివే శాస్త్రవిషయాలను సంబద్ధంచేసి గ్రంథాలు తయారుచేయించవలసి వచ్చింది. ఇంతవరకు మొదటి, రెండవ సంవత్సరాలలో కావలసిన దాదాపు 200 పుస్తకాలను వెలువరించడం జరిగింది. తక్కిన గ్రంథాల ప్రచురణ కూడా త్వరలోనే పూర్తి కాగలదని ఆశిస్తున్నాము. పూర్తి అయిన వెంటనే వీటిని కూడా క్షుణ్ణంగా పునర్విమర్శించే కార్యక్రమాన్ని రూపొందించటం జరుగుతుంది.

ఉన్నత పాఠశాల స్థాయిలో కూడా విద్యార్థుల పరిశ్రమ పాఠ్యగ్రంథాలకుమాత్రమే పరిమితం కారాదనీ, ఆయా పాఠ్యాంశాలమీద విస్తృతాధ్యయనం (extensive study) చేయించడం అత్యావశ్యకమనీ విద్యావేత్తల అభిప్రాయం. అటువంటప్పుడు కళాశాల స్థాయిలో విస్తృతాధ్యయనం ఎంత ముఖ్యమో వేరే చెప్పనక్కరలేదు. ఈ స్థాయిలో విస్తృతాధ్యయనానికి ప్రామాణికగ్రంథాలు విరివిగా లభింపజేయడం అకాడమీ ధ్యేయం. ఈ దృష్టితోనే కొన్ని ప్రామాణికగ్రంథాల అనువాదాలూ, కొన్ని ముఖ్య శాస్త్రాంశాలపై బృహద్వ్యాసాలూ ప్రచురించవలెనని అకాడమి తలపెట్టింది. ఒకపక్క పఠనీయ గ్రంథాలను సిద్ధం చేయిస్తూనే ఇందుకు కూడా ప్రయత్నాలు ఆరంభించినాము. దీనివల్ల తెలుగులో శాస్త్రవిద్యాభ్యాసం చేసే విద్యార్థికి, శాస్త్రబోధనచేసే అధ్యాపకునకు ఎంతో మేలు సమకూరగలదని మా విశ్వాసము.

మేము చేపట్టిన అనువాదాల కార్యక్రమం ఈవిధంగా ఉంది – శాస్త్రగ్రంథాలు అనువాదం చేయగోరేవారిని ఆయా శాస్త్రాలలో ఎన్నుకొన్న ఒకటో రెండో ప్రామాణిక గ్రంథాలలోనుంచి కొన్ని పుటలు అనువదించి పంపవలసినదిగా మేము కోరినాము. ఆవిధంగా వచ్చిన నమూనా అనువాదాలను నిపుణులైన విశ్వవిద్యాలయాచార్యులకు పంపి ఎన్నిక చేయించినాము. ఒక్కొక్క గ్రంథానికి, విస్తృతినిబట్టి, ఒకరినిమించి అనువాదకులు ఉండవచ్చు. కాని ఒక్కొక్క గ్రంథానికి ఒక్కొక్క పర్యవేక్షకుడు మాత్రమే ఉంటాడు. ఆయా ప్రత్యేక గ్రంథాలలో ఉండే సాధకబాధకాలను దృష్టిలో ఉంచుకొని ఈపర్యవేక్షకులను నియమించడం జరిగింది.

ఉన్నత విద్యాబోధన భాషగా తెలుగు సుప్రతిష్ఠితం కావలెనన్న కోర్కెతో శక్తి వంచన లేకుండా మేము చేస్తున్నపని విజయవంతం చేయడంలో మాకు ఎంతో మంది అండదండలు లభించినాయి. కేంద్ర రాష్ట్రప్రభుత్వాల ఔదార్యము, అకాడమి పాలక వర్గం చేదోడువాదోడు, విశ్వవిద్యాలయాలతోడ్పాటు ; వివిధకళాశాలాధికారులు, అధ్యాపకులు, రచయితలు, నిపుణులు, సంపాదకులు, ముద్రాపకులు, బ్లాక్ మేకర్స

అందజేస్తున్న సహాయ సహకారాలు, విధి నిర్వహణలో మా ఉద్యోగి బృందం చూపుతున్న శ్రద్ధాసక్తులు - ఇవన్నీ మా విజయ హేతువులే. వీరందరికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ ప్రచురణలో మాకుతోడ్పడిన ముఖచిత్రరచయిత శ్రీ ఎ. సత్యంగారికి మా కృతజ్ఞతలు.

అప్పుడప్పుడు అంతో ఇంతో మారుతూ ఉండే పాఠ్యప్రణాళికలను దృష్టిలో ఉంచుకొని, మా ప్రచురణలపై సహృదయులైన విజ్ఞులు, అనుభవంగల అధ్యాపకులు చేసే సూచనలను గమనించి, సముచిత రీతిని ఈ గ్రంథాలను పరిష్కరించి పునర్ముద్రించే విషయంలో మేమెప్పుడూ సావధానులమయ్యే ఉన్నాము. మునుపటివలెనే మునుముందు కూడా విద్యార్థులు, అధ్యాపకులు, విజ్ఞులు మాకు సహాయ సహకారాలను అందించగలరనే మా విశ్వాసము.

# తొలిపలుకు

అధికారము, సర్వోత్కృష్టత అనేవి, జ్ఞానాన్ని అనుసరించి సిద్ధిస్తాయని మానవజాతి పరిణామ చరిత్రవల్ల ధ్రువమౌతుంది. మానవునికిగల జ్ఞానసముపార్జన సామర్థ్యాన్నిబట్టే, అతనికి ప్రాణికోటిలో ఉత్కృష్ట స్థానం సిద్ధించింది. ఇక, జ్ఞానాన్ని సముపార్జించి సద్వినియోగం చేయడంలో మిక్కిలి సమర్థులైనవారికి మాత్రమే, మానవ సంఘంలో ఉత్కృష్ట స్థానం లభించింది. ప్రాచీనకాలంలో పురోహితులు, మంత్రవాదులు తమ జ్ఞానాధిక్యతనుబట్టి సంఘంలో ప్రాబల్యం సంపాదించినారు. కనుక, అట్టి ప్రాబల్యాన్ని తమకు సిద్ధింపజేసిన జ్ఞానాన్ని, వారు పరమ రహస్యంగా దాచి రక్షించుకొంటూ వచ్చినారు. విజ్ఞానాన్ని దాచి ఉంచడానికిగాని, కొద్దిమందికి మాత్రమే పరిమితం చేయడానికిగాని ప్రయత్నించడం, ఆత్మవినాశకరమనీ, అట్టి ప్రయత్నంవల్ల విజ్ఞానం నశించడమే కాక, సంఘంలో తమకుగల ప్రాబల్యమూ అధికారమూ నశిస్తాయనీ వారు గ్రహించలేదు. ప్రత్యేకమైన వర్గాలవారికీ, కూటములవారికీ మాత్రమే విజ్ఞానాన్ని ప్రత్యేకించి సంకుచిత పరచినందువల్ల, దేశప్రజలు ఎంత నష్టపడినారన్న విషయానికి భారతదేశ చరిత్రలో ఉదాహరణ లనేకము లున్నాయి.

భౌతిక సంపదవలె కాక, జ్ఞానము, ప్రసార వ్యాపకములవల్లనే అభివృద్ధి చెందుతుంది. అనేకవిషయాలలో చాల సంకుచిత దృక్పథం కలవాడు ఔరంగజేబు. బహిష్కార నీతి నవలంబించి, తన రాజ్యాధికారాన్ని సంరక్షించుకోడానికి ప్రయత్నించినాడు. ఐనా, అధికార ప్రాబల్యాన్ని సిద్ధింపచేసే ఉత్తమసాధనం జ్ఞానమే అని, తత్ప్రాధాన్యాన్ని గుర్తించిన కొద్దిమంది భారత సార్వభౌములలో ఇత డొకడు. తనకు విద్యాబోధ గావించిన పండితు డొకప్పుడు ప్రత్యేకాదరాన్ని ఆశించగా, ఔరంగజేబు ఈవిధంగా అతనికి సమాధాన మిచ్చినాడు. "మనస్సును హేతువాదానుబద్ధం కావించేదే, నిజమైన తత్త్వశాస్త్రం. అతిబలీయములైన తార్కిక ప్రమాణములతో తప్ప, ఇతరములతో తృప్తిపొందని విధంగా అది మనస్సును శిక్షిస్తుంది. అట్టి తత్త్వాన్ని నీవు నాకు బోధించలేదు. మానవస్వభావ పరిచయం నాకు కలిగించి, అన్ని సమస్యలలోనూ మానవ ప్రకృతి ప్రథమ సూత్రాలతో సమన్వయపరచే శిక్షణ నిచ్చి, విశ్వమును గూర్చిన పరమోదాత్తభావనను కలిగించి, విశ్వ రచనా విన్యాసమును గూర్చి, విశ్వమునందలి వివిధభాగముల సక్రమగతిని గూర్చి నాకు చాలినంత నీవు బోధించియుంటే, అరిస్టోటలుకు (Aristotle) ఋణపడిన అలెగ్జాండరు కంటె ఎక్కువగా నీకు నేను ఋణపడి ఉండేవాడిని." పరిపాలకుడైనవానికి అవసరమైన జ్ఞానాన్నిగూర్చి ఔరంగజేబు ఈవిధంగా తన అభిప్రాయాన్ని ప్రకటించినాడు. "భూమిపై గల ప్రతి మానవజాతినీ గుర్తించి ప్రత్యేకించే లక్షణాలను, ఆయా జాతుల సాధనసంపద, బలసంపద, వారి యుద్ధవిధానాలు, వారి మత, ప్రవర్తనలు, ప్రభుత్వవిధానము,-

మున్నగు విషయాలను ప్రతిరాజ్య పరిపాలకుడూ తెలుసుకోవలసిన అవసరమున్నది." ప్రపంచ రాజ్యముల పుట్టుక, వాటి అభ్యుదయము, క్షీణత, ఇత్యాదులను గూర్చి, ఆయా రాజ్యములలో ఏర్పడిన మహా పరివర్తనాలకు, విప్లవాలకు, కారణములైన సంఘటనలు, ప్రమాదములు, తప్పులు, ఇత్యాదులను గూర్చి, తెలిసికోడానికి అనువైన చారిత్రిక క్రమ పఠనము, పరిపాలకుల విద్యాశిక్షణలో ముఖ్యభాగంగా ఉండవలెనని ఔరంగజేబు గుర్తించినాడు.

బుద్ధిశక్తి సంపన్నుడైన ఔరంగజేబుకు ఇట్టి శిక్షణ లభించియుండి, జాతి, మత, కుల, రాజకీయాభిప్రాయములతోనూ, వ్యక్తుల స్థానముతోనూ ప్రసక్తిలేక, ప్రజలందరికీ సమానమైన విధంగా న్యాయాన్ని ప్రవర్తింపచేయడంవల్లనే జాతియొక్క సంపదా, అభ్యుదయమూ సిద్ధిస్తాయని, అతడు గ్రహించియుంటే, భారతదేశ చరిత్ర పరిణామము ఏ విధంగా ఉండేదో అని ఊహించడానికి ఆసక్తి కలుగుతుంది. ఆ విషయమెట్లున్నా, రాజ్యముల అభివృద్ధి క్షీణతలకు హేతువులైన ఆధార సూత్రములను, భిన్నపరిపాలన వ్యవస్థలకు లోనైన మానవుల ప్రతి వర్తన విధానములను, చక్కగా అవగాహన చేసుకోవడం, ప్రజా వ్యవహార పరిపాలనకు పూనుకొన్న వారికి అత్యవసరమనే ఔరంగజేబు అభిప్రాయాన్ని, మనం అంగీకరించకతప్పదు.

అట్టి చారిత్రిక వ్యాసంగానికి గల ప్రాధాన్యం ఈ అధునాతన యుగంలో ఇంకా ఎక్కువయింది. అంతేకాదు. మానవుని మనుగడకే అది ఆవశ్యకంగా ఏర్పడింది. ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడియున్న నేటి ప్రపంచంలో - సాంప్రదాయకంగా ప్రజాస్వామ్య ప్రభుత్వ మేర్పడని దేశాలకు కూడా ఇది చాలవరకు వర్తిస్తుంది. తన దేశం అనుసరించే ప్రభుత్వ నీతి విషయంలోనూ, కార్య ప్రణాళిక విషయంలోనూ, దేశంలోని ప్రతి వ్యక్తికీ బాధ్యత ఉంది. విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్రములలో జరిగిన అభ్యుదయము కారణంగా, మానవ సౌభాగ్యము వివిధదేశముల పరస్పర సంబంధముతో పెనవేసుకొన్నది. కావున, వ్యక్తుల బాధ్యత తమ దేశముల సరిహద్దులను దాటి ఇతర దేశములపట్ల కూడా వర్తించవలసిన పరిస్థితి ఏర్పడింది. అంతేకాదు. కడపటికి, మన బాధ్యత సమగ్ర ప్రపంచానికీ వర్తించవలసి ఉంటుంది. ఒక దేశములో జరిగిన ప్రతి సంఘటనకూ ప్రతి ధ్వనిగా తక్కిన అన్ని దేశాలలోనూ ప్రతి క్రియలు జరగడం తప్పవు. కనుక, మానవజాతి భవిష్యత్తు విషయంలో పూర్వపురాజులు, ప్రభువులు కూడా వహించని బాధ్యత నేడు సమాజములోని ప్రతి వ్యక్తీ వహించవలసిఉంది. ప్రజాపాలకులైన రాజులకు చారిత్రిక శిక్షణ వ్యాసంగములు అత్యవసరమని ఔరంగజేబు గుర్తించి యుండినాడు. ప్రజాస్వామ్య గణతంత్ర ప్రభుత్వము నెలకొనియున్నట్టి మన భారతదేశములోని పౌరులందరికీ, అట్టి చారిత్రిక శిక్షణ నేడు అత్యావశ్యకమై యున్నది.

రెండు శతాబ్దాలకాలం పరదేశ ప్రభుత్వాధికారానికి లోబడి యుండిన అనుభవం కారణంగా భారతీయులు, ఇతర దేశాల క్షీణతాపతనముల హేతువులపట్ల సులభ శీఘ్రంగా ఆవేగాన్ని పొందుతారు. నెమ్మదిగా, క్రమేణా, తమ స్వాతంత్ర్యాన్ని మరల సంపాదించుకొన్న భారతీయులు, పూర్వము జరిగిన విషాదోదంతము మరల జరగకుండా ఉండడానికై, తాము నేర్చిన గుణపాఠాన్ని పవిత్ర విషయంగా స్థాపించ దలచుకొన్నారు.

అదికాక, భారతదేశం స్వాతంత్ర్యాన్ని గోల్పోయిన విధములోను, ఆ స్వాతంత్ర్యాన్ని పునః సంపాదించుకొన్న విధానములోను కొన్ని అపూర్వములైన లక్షణాలున్నవి. ఈ లక్షణాలకారణంగా, భారత దేశచరిత్ర అర్థ భావగర్భితమై, ప్రపంచాని కంతటికీ ప్రయోజనకారిగా ఉన్నది. అందును విశేషంగా మహాత్మాగాంధి అభివృద్ధికి తెచ్చిన అహింసాత్మక సంగ్రామ ప్రక్రియ, మానవుల పరస్పర సంబంధ విషయకములైన క్లేశకర సమస్యలన్నిటికీ పరిష్కార మార్గంగా కనబడుతుంది. కనుక, భారతదేశ స్వాతంత్ర్యోద్యమము యొక్క వివిధావస్థలను సమగ్రంగాను, ప్రామాణికంగానూ చరిత్ర రూపంగా రచియింపచేయడానికి, స్వాతంత్ర్య సంప్రాప్తి తర్వాత సమావేశమైన ప్రథమ చారిత్రిక అభిలేఖ సంఘంవారు తీర్మానించడంలో, ఆశ్చర్యములేదు. ఈ సంఘముయొక్క శిఫార్సును, స్మరణీయులు మౌలానా అబుల్ కలాం అజాద్‌గారు వెంటనే ఆమోదించడమే కాక, దానిని అమలు జరపడానికి తగిన చర్యలు వెంటనే జరగవలసిందిగా ఆదేశించిరి.

అధికార సంస్థ ద్వారా ఈ కార్యం జరగవలసిందని కొందరు అభిప్రాయపడిరి. కాని, అట్టి సంస్థలు ఈ కార్య నిర్వహణకు అనువైనవి కాజాలవని గ్రహించడం జరిగింది. ప్రథమంగా జాతీయహితము, చారిత్రిక ప్రామాణికత, అనే ప్రయోజనాల ననుసరించి, భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్ర వాస్తవికంగానూ, పక్షపాతరహితంగానూ ఉండడం అవసరం. ఇట్టి పనికి ఏ ప్రభుత్వ సంస్థ పూనుకొన్నా, ఆనాటి ప్రభుత్వపు అభిప్రాయాలూ, భావాలూ రచనలో ప్రతిబింబింపక పోవు. ఇక రెండవది,- చరిత్ర రచనకు వలసిన ముడి పదార్థాలు చారిత్రిక వాస్తవ విషయాలు. ఇవి దేశమంతటా, పలుచోట్ల వికీర్ణమై ఉన్నవి. స్వాతంత్ర్యోద్యమంలో సాక్షాత్తుగా పాల్గొన్న వ్యక్తులవద్ద కూడా చాలా విషయాలు నిలిచిఉన్నాయి. అట్టివారికిగల పక్షపాతాభిప్రాయాలను, విశిష్ట మానసిక ప్రకృతులను, సహృదయంతో సర్దుకొని, వారి నుంచి చారిత్రిక విషయాలను, అధికార సంస్థలు ప్రామాణిక విధానముల ద్వారా గ్రహించగలవా, అనే సంశయం కూడా కలిగింది. కనుక, ప్రభుత్వ పత్రాగారాలలోనూ, స్వంత పత్రాగారాలలోనూ ఉద్యమము యొక్క కడపటి అవస్థలలో పాల్గొన్న స్త్రీ పురుషులవద్దనూ, దేశమంతటా వికీర్ణమై విస్తరమై ఉన్న, ఈ చారిత్రిక వాస్తవవిషయముల సంగ్రహణకు జాతీయ స్థాయిలో ప్రయత్నం అవసరమయింది.

ఆనాడు భారత ప్రభుత్వ విద్యాశాఖకు సలహాదారుడుగా ఉండిన డాక్టరు తారాచంద్ అధ్యక్షతలో, ప్రసిద్ధ విద్యావంతులతో కూడిన విచక్షణ సమితి ఒకటి, ఈ కార్యాచరణకు ప్రథమ ప్రయత్నంగా ఏర్పడింది. చారిత్రిక విషయముల సేకరణకు తగిన మార్గములను, సాధనములను సూచించడము, చారిత్రిక రచనకై తీసుకోవలసిన ఇతర ప్రయత్నములను వివరించడము - ఈ సమితియొక్క పర్యాలోచనాంశములు. చరిత్రకారులతోను, రాజకీయ సేవకులతోను కూడిన ఒక కేంద్ర వ్యవస్థను ఏర్పరచడమే కాక, దేశముయొక్క వివిధప్రాంతాలలో కూడా అట్టి వ్యవస్థలను ఏర్పరచవలసిందని ఈ సమితి వారు సలహా ఇచ్చిరి. తదనుగుణంగా, డాక్టరు సయ్యద్ అహమ్మద్ అధ్యక్షుడుగా, శ్రీ ఎస్. ఎన్. ఘోష్ కార్యదర్శిగా, కేంద్ర సంపాదకీయం ఏర్పాటయింది. 1953 లో జరిగిన మొదటి సంపాదకీయవర్గ సమావేశాన్ని ఉద్దేశించి, మౌలానా అజాద్‌గారు

ప్రసంగిస్తూ, స్వాతంత్ర్యోద్యమ చరిత్ర రచన వాస్తవికంగానూ, పక్షపాతరహితంగానూ ఉండవలసిన అవశ్యకమును గూర్చి నొక్కి చెప్పినారు. భావోద్రేకంవల్ల నిర్ణయాలు విరూపాన్ని పొందుతాయి; అట్టి నిర్ణయాలపై ఆధారపడిన కార్యక్రమం జాతీయ హితానికి విరుద్ధంగా పరిణమిస్తుంది. కనుక, స్వాతంత్ర్య లాభానంతరం భావోద్రేకాన్ని పరిహరించడం మిక్కిలి అవసరం; దానిని పరిహరించడం సాధ్యంకూడా. ఈ చరిత్ర, ప్రధానంగా రాజకీయ సమరోదంతానికి సంబంధించినదే ఐనా, సారస్వత, విద్యా, సాంఘిక సంస్కరణ రంగాలలోనూ, విజ్ఞానశాస్త్ర పరిశ్రమ రంగాల్లోనూ కలిగిన జాతీయ చైతన్యానికి కూడా ప్రాధాన్యం ఇవ్వవలసి ఉన్నదని తెలియచేసిరి.

సంపాదకవర్గం మూడు సంవత్సరాలకాలం కృషిచేసి, వివిధ ప్రాంతీయ సంపాదక సంస్థల సహాయంతో, భారతదేశంలోని వివిధరంగాలలో జరిగిన జాతీయ చైతన్యానికి సంబంధించిన అన్ని విషయాలనూ సేకరించింది. కేంద్రప్రభుత్వ చారిత్రిక పత్రాగారాలనూ, వివిధరాష్ట్రాల పత్రాగారాలనూ మాత్రమేకాక, జాతీయ స్థానిక వార్తా పత్రికలను కూడా ఉపయోగించుకొని, వాటి నుండి చారిత్రికాంశాలను సేకరించుకొన్నారు. అల్లే, విభిన్న రాజకీయ పక్షాలకు చెంది, సాంఘిక ఆర్థికాది విషయములలో, విభిన్న అభిప్రాయాలుగల వ్యక్తుల సాక్ష్యాన్ని కూడా గ్రహించిరి. చారిత్రిక విషయం సాధ్యమైనంత సమగ్రంగా ఉండవలెననే ఉద్దేశంతో, ఇతర దేశాలలో లభించే చారిత్రిక సామగ్రిని కూడా సంపాదించుకొన్నారు.

ఈ విధంగా, సంపాదకీయ సంస్థ ఎంతో ప్రయోజనకరమైన సేవచేసింది. కాని, క్లుప్తప్రయోజనోద్దేశంతో తాత్కాలికంగా మాత్రమే ఏర్పడినది, ఈ సంస్థ. చరిత్ర రచనకవసరమైన విషయాన్నంతటినీ సేకరించడానికిగాని, సేకరించిన చారిత్రిక విషయాన్ని విడదీసి, శోధించి, వ్యాఖ్యానించి, ఏకరూపమైన చరిత్రను రచించడానికిగాని, ఇట్టి తాత్కాలిక సంస్థ సమర్థమైనది కాజాలదని, శీఘ్రమే వ్యక్తమయింది. పండిత సంప్రదాయానికి దాసులైన చరిత్రకారులూ, రాజకీయాలలో స్వయంగా పాల్గొంటున్న రాజకీయ వాదులూ, కూడా, ఈ సంపాదక వర్గంలో చేరియున్నారు. ఈ రెండు వర్గాల వారికీగల భిన్నదృక్పథమూ ప్రయత్న భేదమూ, మూల విషయ సేకరణకాలంలోనే గోచరించినవి. సేకరించిన మూల విషయాన్ని వివరించి వ్యాఖ్యానించే సందర్భంలో, ఈ భిన్నదృక్పథాలూ, విభిన్నాభిప్రాయాలూ మరింత బాహాటంగా వ్యక్తమైనవి. కనుక, ఇక ముందు జరగవలసిన చారిత్రిక సామగ్రి సేకరణ కార్యం, జాతీయ పత్రాగారాలకునూ, వ్యాఖ్యానించి చరిత్రను రచించే కార్యం, ప్రఖ్యాతుడైన ఒక విద్యావంతునికీ, అప్పజెప్పవలెననే నిర్ణయం జరిగింది. ఈ కార్య నిర్వహణకు తగిన యోగ్యత, సామర్థ్యము కలవాడూ, ఇది వరకు ప్రణాళిక సమితికి అధ్యక్షుడూ ఐన, తారాచంద్‌కు ఈ పనిని అప్పగించినారు. సేకరించిన చారిత్రిక సామగ్రిని శోధించి, ఏకీకరణ మొనర్చి, భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రను రచించే బాధ్యత, అతనిపై పడింది.

విశాలమూ, భావనాత్మకమూ ఐన వ్యాఖ్యాన మార్గాన్ని అనుసరించి, తారాచంద్, బ్రిటీషు పరిపాలనకు పూర్వపు భారతదేశ పరిస్థితులను సమగ్రంగా వర్ణించియున్నాడు. అంతేకాక, బ్రిటనుదేశముయొక్క అభ్యుదయానికి భారతదేశముయొక్క

క్షీణతకూ కారకములైన హేతువులను, మనము గ్రహించవలెననే ఉద్దేశంతో, ఆ కాలానికి సంబంధించిన భారతదేశ యూరోపుదేశాల చరిత్రలను, తులనాత్మక విధానంతో వివరించి మన యెదుట ఉంచినాడు. ఈ విషయాన్ని పాఠకులే గ్రహించగలరు. వాస్తవిక దృక్పథాన్నీ, చారిత్రిక ప్రమాణ పద్ధతినీ అవలంబించి, అతడీ చరిత్రను రచించినాడు. ఆయా సందర్భాలలో చారిత్రిక ప్రమాణాలను అనుసరించి నిందాస్తుతులను అంటగట్టడానికి ప్రయత్నించినాడేకాని, జాతీయ పక్షపాతాన్నికాని, జాతి దురభిప్రాయాన్నికాని అనుసరించి కాదు. చారిత్రిక విషయములను వ్యాఖ్యానించిన విధానము, వాటినిగూర్చి వివరించిన అభిప్రాయము, కేవలం రచయితవి. అతని అన్ని సిద్ధాంతాలనూ, వ్యాఖ్యలనూ, అందరూ అంగీకరించకపోవచ్చు. కాని పరిపూర్ణమైన నైపుణ్యముతోను, కళాదృష్టితోనూ చారిత్రిక విషయాలను ఉచిత క్రమంలో కూర్చినాడనే విషయాన్ని అందరూ అంగీకరిస్తారని నా విశ్వాసము.

భారతదేశ స్వాతంత్ర్య నష్టము, దాని పునఃసంపాదన, అనే ఉదంతము, మానవ జాతి చరిత్ర వ్యాసంగములో అత్యాకర్షణీయమైన ఘట్టము. గర్వింపదగిన ప్రాచీన వైభవంతో, సమగ్ర సుందరంగా వర్ధిల్లిన కళలతో, శిల్పరచనా కౌశలంతో ఒప్పి, బహుళమైన మానవ సంపదతోనూ, వస్తుసంపదతోనూ విలసిల్లిన ఒక గొప్పజాతి, దైన్యాన్నీ అపజయాన్నీ అనుభవించవలసి వచ్చింది. సమాజములోని అన్నివర్గాలలోనూ, తరగతులలోనూ జాతీయ భావం ప్రసరించి ఉండడంలోనే జాతియొక్క బలం ఇమిడి ఉన్నదనే సత్యాన్ని, భారతీయులు తెలుసుకోలేదు. అట్లే, ఇతర దేశాలలో విజ్ఞానశాస్త్ర సాంకేతిక శాస్త్రాలలో జరిగిన అభ్యుదయాన్ని అనుసరించి, తాము అభ్యుదయాన్ని పొందలేదు. పరాజయంవల్ల కలిగిన దైన్యస్థితి కారణంగా జాతీయచైతన్యం, భారతీయులలో ఇతోధికంగా ఉత్పన్నమయింది. దానికి తోడుగా, పాశ్చాత్య పరిపాలకులు ప్రవేశపెట్టిన విజ్ఞానశాస్త్రయుక్తమైన ఆధునిక విద్యయొక్క ప్రబలశక్తులు, ఈ ప్రాచీన భారతజాతిని ఒక్కసారిగా కదలించివేసినవి. ఈ రెండూ హేతువులుగా, జాతిపునరుజ్జీవనం ప్రారంభమయింది. ఆవిధంగా జాతిలో ప్రవేశించిన క్షోభ నేటికిని, జాతిజీవనముయొక్క అన్నిస్థాయిలలోనూ వ్యాపించి, సాంఘిక వ్యవస్థలలోనూ మనోభావ విషయాలలోనూ, మతభావ ప్రవృత్తులలోనూ కూడా, విస్తారమైన పరివర్తనలను కలిగిస్తూ ఉన్నది. జాతీయచైతన్యం ఉద్దీపనం కావడంతో, జాతీయాత్మాభిమానం మరల ఏర్పడింది. రెండవ ప్రపంచ యుద్ధానికి కారకములైన ప్రపంచ శక్తులు కూడా, భారతజాతి పునరుజ్జీవనానికి దోహదం చేసినవి. అంతతో భారతదేశంలో స్వాతంత్ర్య భావం సిద్ధించింది.

ఒక్కొక్క సంపుటికీ నాలుగైదు వందల పుటలుండేటట్లు, మూడు సంపుటాలలో భారతదేశ స్వాతంత్ర్యోద్యమ చరిత్రను రచించవలెనని, మా అభిప్రాయము. బ్రిటీషు వారి సర్వాధిపత్యాన్ని, తప్పనిసరి కావించిన పానిపట్ యుద్ధము జరిగిన రెండువందల సంవత్సరాల తర్వాత, నేడు ఈ ప్రథమ సంపుటి వెలువడుతూ ఉన్నది. భారతీయుల జీవితాన్నీ, చరిత్రనూ తీర్చిన ప్రాచీన చారిత్రిక పరివర్తన పరంపరలను పశ్చాద్భూమిగా చేసుకొని, పద్ధెనిమిదవ శతాబ్దపు భారతదేశ సాంఘిక రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక పరిస్థితులను ఈ సంపుటం వివరిస్తుంది. పాశ్చాత్యదేశాలతో పోల్చిచూస్తే చలన రహితంగా

తోచే భారతీయ పమాజంపై, క్రియా శక్తమైన పాశ్చాత్య సంస్కృతియొక్క సంఘట్టనం ఎట్టిదో సులభంగా మనం గ్రహించడానికై, యూరోపులో ఆధునిక యుగాన్ని ప్రవేశ పెట్టిన పరివర్తనల చరిత్ర, స్థూలంగా ఇందులో వర్ణింపబడింది.

భారతదేశంలోనూ, ఇతర దేశాలలోనూగల పెక్కు అధికార అనధికార సంస్థలూ, స్త్రీ పురుషులూ సహకరింపకపోతే ఇంతటి మహాకార్యం సాధ్యమై ఉండేదికాదు. ఈ జాతీయ మహాకార్య నిర్వహణను పూర్తిచేయడంలో సహాయపడిన వారందరికీ మనం రుణపడియున్నాము. వారికి మా కృతజ్ఞతలు. విప్లవాత్మకమైన అవస్థా పరివర్తనకాలంలో, భారతీయులకూ బ్రిటిషు వారికీ మధ్య, సంబంధాలు వ్యత్యస్తములుగానూ, పరస్పర విరుద్ధములుగానూ ఉండినవి. అతి విస్తృతమైన చారిత్రిక పామగ్రిని శ్రద్ధాసక్తులతో శోధించి, భిన్న ప్రవృత్తులకు ఐక్యమును గూర్చే సూత్రాలను వాటి నుండి గ్రహించిన డాక్టరు తారాచంద్‌కును, అతని సహోద్యోగులకును, మనము అంతకంటె ఎక్కువగా రుణపడియున్నాము.

న్యూఢిల్లీ,
జనవరి 26, 1961.

*హుమయూన్ కబీర్*

# పీఠిక

స్వాతంత్ర్యోద్యమ చరిత్రను రచించడానికి పూనుకోవడంలో, నన్ను పెక్కు సమస్యలు ఎదుర్కొన్నవి. ఎచ్చటి నుంచి చరిత్ర రచన ప్రారంభించవలెను ? 1885 లో భారత జాతీయ కాంగ్రెసు స్థాపితమైనప్పటి నుంచి, అనేది ఒక జవాబు. కాని, క్రమంగా అభివృద్ధిచెందుతున్న జాతీయోద్యమముయొక్క వ్యవస్థిత భావవ్యక్తీకరణమే కాంగ్రెస్. కనుక, జాతీయ చైతన్యముయొక్క వికాసాన్ని వివరించక, కాంగ్రెసుయొక్క ఉత్పత్తి వికాసాలను వివరించడం, సాధ్యముకాని పని. ఐతే, జాతీయ చైతన్యము ఎప్పుడు ఉత్పన్నమైనది ? 1857 వ నాటి దహనరూప సర్వనాశక సంఘటనలోనా, లేక అంతకు పూర్వమేనా ? అంతకంటె పూర్వపు రామ్‌మోహన్‌రాయ్ కాలమువరకు పోవడం అవసరమయింది. కాని, బ్రిటీషువారి విజయ సంఘటన కారణంగా ఉత్పన్నమైన ఫలమే, రామ్‌మోహన్‌రాయ్. కనుక బ్రిటీషువారి సంఘటన స్వభావాన్ని, ఆది నుండి పరిశీలించి వివరించడం, తప్పనిసరి అనే నిశ్చయం, జరిగింది.

నన్నెదుర్కొన్న మరియొక ప్రశ్నకు జవాబు చెప్పడం మరింత కష్టమయింది. స్వాతంత్ర్య సంపాదన చరిత్రను వర్ణించడం మాత్రమే నా కర్తవ్యంకాదు. స్వాతంత్ర్యోద్యమ చరిత్ర క్రమ పరిణామాన్ని చిత్రించడం నాపని. స్వాతంత్ర్యం అనేది నిషేధార్థక భావం. అస్వాతంత్ర్యము లేదనే భావాన్ని మాత్రమే అది అనుమితి ద్వారా తెలియ చేస్తుంది. స్పష్టమైన వాస్తవ లక్షణార్థాన్ని అది తెలియచేయదు. పరప్రభుత్వాధిపత్యాన్ని త్రోసివేసి, రాజకీయ పరమాధికారాన్ని సంపాదించుకొన్న తర్వాత, ఆ సమాజము యొక్క శీల స్వభావము లెట్టివి, అనే విషయాన్ని స్వాతంత్ర్యము అనే పదము సూచించదు. స్వేచ్ఛ అనేది పరాధికార రాహిత్యము మాత్రమేకాదు. అది అంతకంటెను విశిష్టమైనది. ప్రజాభిప్రాయానికి అనుగుణంగా తన దేశ వ్యవహారాలను దిద్దుకోవడము, పౌరులందరికీ సమానమైనవిధంగా, స్వేచ్ఛా సమత్వములను స్థిరీకరించడము, అనే, విధివిహితమైన లక్షణములతో కూడిన ప్రజాస్వామ్య సమాజాన్ని, స్వాతంత్ర్యము అనే శబ్దం తెలియచేస్తుంది.

పద్దెనిమిదో శతాబ్దంలో బ్రిటీషువారు కలుగజేసుకొన్న జోక్యము ఫలితంగా, భారతదేశము స్వాతంత్ర్యాన్ని గోల్పోయింది. ఐనా, సుమారు రెండు వందల సంవత్సరాలు సాగిన బ్రిటీషు ప్రభుత్వ సంరక్షణ కాలంలోనే, భారతదేశము స్వాతంత్ర్యాన్ని మరల సంపాదించుకొంది. దీన్ని అనుసరించి రెండు సమస్యలు ఉత్పన్న మౌతున్నవి. ఏ కారణంవల్ల భారతదేశం స్వాతంత్ర్యాన్ని గోల్పోయింది ? నైతిక విషయంలోను, భౌతిక సంపద విషయంలోను ఈ స్వాతంత్ర్య నష్టంవల్ల కలిగిన పరిణామమెట్టిది ? ఇక, స్వాతంత్ర్యపునస్సంపాదనకు తగిన యోగ్యత భారతదేశానికి ఏ విధంగా సిద్ధించింది ? అనేది

రెండవ ప్రశ్న. అదివరకే స్వతంత్రమైయుండిన యూరోపు ఖండము, క్రమంగా స్వేచ్ఛను సంపాదించుకోడానికి వేయి సంవత్సరాలకాలం పట్టింది. ట్యూటానిక్ జన-జాతులు రోమన్ సామ్రాజ్య ప్రాంతాలలో నెలవులు ఏర్పరచుకొన్నప్పటినుంచి, పద్దెనిమిదో శతాబ్దంవరకు జరిగిన కాలమిది. కాని, పరదేశీయుల ఆక్రమణకుగాని, పర ప్రభుత్వ పరిపాలనకుగాని యూరోపు. లోబడలేదు. భారతదేశ విషయం తద్భిన్నమైనది. మొదట తన సార్వభౌమాధికారాన్ని పరులకు సమర్పణ గావించి, తరువాత ఆపత్కరమైన మార్గాన్ని అనుసరించి, స్వయం పరిపాలన ప్రభుత్వాన్ని సాధించుకోవలసి వచ్చింది. ఈ ప్రభుత్వసంపాదనావస్థలన్నీ, రెండువందల సంవత్సరాలలోనే, [అనగా స్వేచ్ఛా సిద్ధికి యూరోపుఖండము తీసుకొన్న కాలంలో ఐదవభాగం మాత్రమే] పూర్తి కావలసి వచ్చింది.

ఈ స్వాతంత్ర్య సాధన, భారతదేశములో ఎట్లు జరిగినదనే విషయాన్ని వివరించడానికి, ఈ విషయంలో పాశ్చాత్య ఖండముయొక్క అనుభవము ఎట్టిదో, సంగ్రహంగానైనా వివరించడం మంచిదని, నాకు తోచింది. కాబట్టి, యూరోపులో జరిగిన సంఘటనల చరిత్రను భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర ఉపోద్ఘాతంలో సంగ్రహపరచి చెప్పడానికి సాహసించినాను.

భారతదేశము స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడం, అద్భుతకరమైన లోకోత్తర విషయం. ఒక గొప్ప నాగరకత జాతీయతగా పరివర్తన మొందడమే ఈ స్వాతంత్ర్య సిద్ధి. స్వాతంత్ర్య సంపాదన ప్రయాణకాలమంతటా, ఈ ఉద్యమము పరప్రభుత్వముయొక్క హింసాకాండను మాత్రమేకాక, తన దేశములోని అవివేకాన్ని కూడా ప్రతిఘటించవలసి వచ్చింది. పరప్రభుత్వ విషయంలోనూ నూతన సమాజంలోని వ్యక్తులవిషయంలోనూ కూడా జరిగిన నైతిక సంఘర్షణమే స్వాతంత్ర్యోద్యమమని, సారాంశంగా వర్ణించవచ్చు. ఇతరదేశాలలో జరిగిన ఇట్టి సంఘర్షణలు రక్తపాతముతో కూడుకొన్నవి. కాగా, భారతదేశంలోని స్వాతంత్ర్యోద్యమం తీవ్రమైనదైనా, సంతాపకర కష్టములతో కూడినదే ఐనా, అహింసాత్మకంగా సాగింది.

స్వాతంత్ర్య చరిత్ర అనేది ద్వంద్వాత్మక ప్రక్రియ. ప్రాచీన వ్యవస్థయొక్క వినాశంతో ఉద్యమం ప్రారంభమయింది. కనుక, దాని మొదటి ప్రయత్నం విరోధ భావయుక్తమైనది. పద్దెనిమిదోశతాబ్ద మధ్యకాలంలో ప్రారంభమైన ఈ ప్రక్రియ 1857 నాటి విప్లవరూపంగా పరిణమించడం, విరోధభావయుక్తమైనదని తర్కం. ఒక నూతన వ్యవస్థ నిర్గమనం చెంది, 1857 తరువాతి అర్ధశతాబ్దంలో క్రమంగా శక్తిమంతం కావడం ఉద్యమముయొక్క రెండవమెట్టు. ప్రాచీన నూతన వ్యవస్థలకూ, ప్రాక్పశ్చిమ సంస్కృతులకూ సంఘర్షణ జరగడము, తుదకు రెండు వర్గాలకూ సంయోజనం సిద్ధించి, భారత జాతీయ రాజ్యమనే నూతన సమాజము ప్రపంచములో ఏర్పడడము అనేది మూడవమెట్టు.

ద్వంద్వాత్మకమైన ఈ చారిత్రిక వస్తువును మూడు సంపుటాలలో నేను వర్ణించియున్నాను. చర్చనీయాంశానికి మొదట నిర్దిష్టమైన విషయాన్ని. ఈ సంపుటం వివరిస్తుంది. స్వాతంత్ర్యోద్యమ చరిత్రను రచియింప చేయవలెననే ఉద్దేశము, భారత ప్రభుత్వ విద్యాశాఖకు మంత్రిగా ఉండిన మౌలానా అబుల్ కలాం అజాద్‌గారికి, మొదట కలిగింది. పాండిత్య రాజనీతిజ్ఞతలు మేళవించిన అసాధారణ వ్యక్తి మౌలానా అజాద్. ప్రాచీన

వ్యవస్థలోని నాజూకుతనము, సంస్కృతి, మరిన్నీ, స్వేచ్ఛా అభ్యుదయాలపట్ల ఆధునిక ఔత్సుక్యము, ఇతనిలో పెనవేసుకొన్నవి. అతని జీవితంలో చాలభాగం ఉద్యమ సంఘర్షణలో గడచిపోయింది. స్వాతంత్ర్య ప్రయోజనము ధ్యేయంగా తన సర్వస్వాన్నీ ధారపోసినాడు. అద్వితీయమైన అతని వాగ్ధోరణి, సమతతో కూడిన నిర్ణయశక్తి, వివేచనాత్మకమైన ఆదేశము, హృదయవైశాల్యంతో కూడిన దేశభక్తి, తీక్ష్ణమైన ఉత్సాహము, ఆత్మాభిమానము, ఉదాత్త ధ్యేయనిష్ఠ,- అనే అన్ని శక్తులనూ భారతదేశ స్వాతంత్ర్య సిద్ధికై కానుకగా, అర్పించినాడు. ఐనా, తీవ్రసంఘర్షణ జరుగుతున్న కాలంలోనూ, తాత్కాలిక శాంతి నెలకొన్న రోజులలోనూ కూడా, జ్ఞాన సంపాదనపట్ల తనకుగల శ్రద్ధాసక్తులను విడిచిపెట్టినవాడు కాదు. అత్యాశ్చర్యకరమైన జ్ఞాపకశక్తి అతనిది. ఉర్దూ, పర్షియన్, అరాబిక్, మొదలైన పలుభాషల కవితకూ, పలుదేశముల చరిత్రలకూ, మత సంబంధమైన విద్వత్తుకూ అతని మనస్సు ఒక జ్ఞాన భాండారమై ఉండినది. గ్రంథముల మధ్య కాలం గడపడంవల్లను, సారస్వత వ్యాసంగమువల్లను, అతనికి లభించినంత సంతోషము మరెందును లభించలేదు. భారతదేశానికి స్వాతంత్ర్యం సాధించడం అతనికి గాఢానురాగమైన విషయం. స్వాతంత్ర్యసిద్ధి తర్వాత, ఆ వీరగాథను రచియింపచేయడం అత డెంతో అభిమానంతో ఆదరించిన కోరిక.

విద్యాశాఖలో నాలుగు సంవత్సరాల కాలం వారితో పనిచేసే భాగ్యం నాకు లభించింది. చరిత్రలో నాకుగల ఆసక్తి వారెరుగుదురు. కనుక, నన్ను ఈ పనికి పూనుకోవలసిందని వారు కోరడంతో, నేను సంతోషంతో గ్రహించినాను. నా హృదయానికి అభిమానకరమైన కార్యాన్ని నిర్వహించే అవకాశాన్ని కలిగించినందుకు నేను వారికి కృతజ్ఞుడను. డా. వి. జి. దిఘే, డాక్టరు ఆర్. కె. పార్ము, డా. బి. ఎమ్. భాటియా, వంటి ముగ్గురు విద్వాంసులను నాకు సహాయులుగా వారు నియమించినారు. హృదయపూర్వకమైన శ్రద్ధాసక్తులతో, సంపూర్ణమైన మనస్సుతో, వారు కృషిచేసినారు. ఈ గ్రంథాన్ని రచించడంలో గమనార్హమైన విషయాలను ఒదిగించిఉన్నారు. ఈ సంపుటాన్ని పూర్తిచేయడంలో వారు నాకిచ్చిన అమూల్యమైన సహాయానికి నేనెంతో కృతజ్ఞుడను. నాకు ఆలంబనంగా నిలిచిన శ్రీ హుమయూన్ కబీర్ (విజ్ఞాన సంస్కృతి శాఖామంత్రి) గారికి నా నమస్కారాలు. ఈ చరిత్ర రచనా విషయంలో వారు చూపిన ఉత్సుకతా ఆసక్తులకు, వారిని అభినందిస్తున్నాను. ఈ కార్యనిర్వహణ విషయంలో ఏర్పడిన కష్టాలను,- అందునూ ముఖ్యంగా, గ్రంథ ప్రకటనకు సంబంధించినవాటిని- జయించడం, వారి అభిమానము లేకుంటే, సాధ్యమయ్యేది కాదు. తమ గ్రంథాగారాలలోని చారిత్రికాభిలేఖలను, గ్రంథాలను, పరిశీలించడానికి నాకు ఎంతో సౌలభ్యంకలిగించిన, జాతీయ చారిత్రికాభిలేఖాగారాధ్యక్షులకూ, కలకత్తా జాతీయ గ్రంథాగారాధ్యక్షులకూ నేను కృతజ్ఞుడను.

న్యూఢిల్లీ,
జనవర 5, 1961.

తారాచంద్

# ప్రవేశిక

ఒక విశిష్ట ప్రయోజనాన్ని ఉద్దేశించి, ఈ గ్రంథరచనకు పూనుకొన్నట్లు, గ్రంథస్థ విషయాన్ని బట్టి స్పష్టమౌతుంది. రచనా ప్రణాళిక కూడా ఈ ప్రయోజనానికి అనుగుణంగా నిర్మితమయింది. స్వాతంత్ర్యోద్యమ ప్రక్రియలో జరిగిన సంఘటనలను, ఉదంతాలను, వరుసగా వర్ణించడం మాత్రమే చరిత్రకాదు, అనే సత్యాన్ని గ్రహించినవాడు గ్రంథకర్త. భారత స్వాతంత్ర్య వినాశానికి మూల హేతువులైన విషయాల పరిశోధనలో, గ్రంథాన్ని ప్రారంభించినాడు. ప్రకృతి సిద్ధములైన భౌగోళిక పరిసరాలు, విస్తారమైన భూభాగము, సహనశీలమైన ప్రజాబాహుళ్యము, అఖండమైన మూల సాధనాలు, – ఇత్యాది సౌకర్యాలతో ఏర్పడినది ఇండియాదేశం. అతిప్రాచీనమైన నాగరకతకు, సంస్కృతికి, విజ్ఞానానికి, ఆకరమైనది భారతజాతి. సమృద్ధమైన వ్యవసాయము, ప్రపంచ దేశాలను కూడా మభ్యపెట్టిన చేతి పరిశ్రమలు, అభివృద్ధిలో ఉండిన దేశం ఇది. వైభవోపేతములైన రాజ్యాలు, సామ్రాజ్యాలు కూడా, ఆయాకాలాలలో వర్ధిల్లినవి. అనేక దండయాత్రలకు, ఆక్రమణలకు గురియైనా కూడా, దేశం తన వ్యక్తిత్వాన్ని, విశిష్టతను, గోల్పోలేదు. దేశంలోని పారిశ్రామిక వస్తువుల వాణిజ్యము ఆధారంగా, విదేశాల వెండిబంగారాలు దేశంలోనికి ప్రవాహ రూపంలో వచ్చి, దేశాన్ని సంపన్నం కావించినవి. అట్టి భారతజాతి, కేవలం వర్తక వ్యాపారాలకై ఇండియాకు వచ్చిన విదేశీయులకు, అల్ప సంఖ్యాకులకు, సులభంగా వశమైపోయింది. వశమైపోవడంకాదు; తన చేతులకు తానే సంకెళ్ళు తగిలించుకొని, దాస్య జీవితాన్ని కోరుకొని, లొంగిపోయింది. ఆంతర జాడ్యమేదో, జాతిని ఆక్రమించి, దుర్బలమొనర్చి, మనస్సును వికల మొనర్చియుంటేతప్ప, ఈ సంఘటన జరిగి యుండేదికాదు. ఆ జాడ్యమేది, దాని ప్రవృత్తి ఎట్టిది, అనే మూల విషయ పరిశీలనతో ఉపక్రమిస్తాడు గ్రంథకర్త.

భారతజాతిని ఇట్టి హీనస్థితికి తెచ్చినజాడ్యం, కేవలం బాహ్యజీవిత సంబంధమైనది కాదు. జాతిస్థైర్యానికి మూలాధారములైన సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలన్నిటినీ ఆక్రమించి, వాటిని భ్రష్ట మొనర్చిన ఆంతర జాడ్యమిది.

మతం పేరిట సృష్టికి వచ్చిన కులవ్యవస్థ, సమాజాన్ని ముక్కలు ముక్కలుగాచేసి, ప్రజల అన్యోన్య సంఘీభావాన్ని నశింపచేసింది. అతి స్వార్థపరులైన పురోహిత వర్గంవారు కల్పించిన అంధవిశ్వాసాలవల్లను, అర్థరహితములైన బాహ్యాచారాలవల్లను, మూఢ భక్తివల్లను, ప్రజలలో భావస్వాతంత్ర్యం నశించింది. ఒక దేశంలో నివసిస్తూ, ఒకే దేశంపై ఆధారపడి జీవిస్తున్న ప్రజా సమస్తమూ, ఒకే జాతి వర్గము, అనే భావమే దేశంలో ఉత్పన్నంకాలేదు. కనుకనే, విదేశీయుల దండయాత్రలను దేశోపద్రవాలుగా ప్రజలు భావించి, ప్రతి క్రియకు పూనుకోకపోయిరి.

జాతీయ భావోదయాన్ని కలిగించే విద్యావిధానం కూడా దేశంలో ఏర్పడలేదు. లౌకిక జీవితానికి అవశ్యకమైన విద్యావిధానాన్ని స్థాపించడానికి, రాజులూ పూనుకోలేదు; విద్యాబోధనలు వృత్తిగాగల బ్రాహ్మణులూ పూనుకోలేదు. పారలౌకిక సంబంధమైన విద్య ఒక్కటే ఉన్నత వర్గాలలో వ్యాపించింది. ప్రజల జీవితానికి నిష్ప్రయోజనములైన ధర్మశాస్త్ర సంహితలను, తర్కమీమాంసాది శాస్త్రాలను, చర్విత చర్వణం కావిస్తూ, బ్రతకడమే పండితుల వృత్తిగా ఏర్పడింది. శుష్కపాండిత్యానికి, కుతర్కాలకు, ఆకరమైన ఈ విద్యవల్ల, పండితయాచకుల సంఖ్య, పురోహితుల సంఖ్య, పెరిగిందే కాని, దేశసౌభాగ్యానికి అణుమాత్రమూ ప్రయోజనం కలుగలేదు. అజ్ఞానాంధకారంలో మునిగి, అంధవిశ్వాసాలకు, పురోహితుల ఆంక్షలకు బద్ధులై పడియున్న ప్రజానీకంలో జాతీయ భావోదయం కలిగే అవకాశమే లేకపోయింది.

గ్రామసీమలను ఆశ్రయించి, కేవలం ఉదరపోషణమే జీవితధ్యేయంగా బ్రతుకుతున్నవారు సామాన్యప్రజలు. ఆర్థికాభివృద్ధి ప్రయత్నంకాని, జీవితాన్ని బాగుపరచుకొనే ఉత్కాంక్షలుకాని, వీరి భావపరిధిలో లేనివి. ప్రాపంచిక సుఖజీవితమే అస్థిరమని, దానికి సామాన్యులు దూరంగా ఉండడమే మోక్షహేతువని మతబోధకుల ప్రచారం. పట్టణసీమలలోని సంపన్నవర్గాలవారికి, రాజులకు మాత్రమే యోగ్యమైనది ఐశ్వర్యం, అనే భావాన్ని ప్రజలకు నూరిపోసినారు. కనుక, ఉత్సాహశక్తి, ఉద్యమ ప్రయత్నమూ ప్రజలలో ఎన్నడూ ఉత్తేజనం పొందలేదు. ఇక, దేశపరిపాలన విషయంలో, ప్రజలు పూర్తిగా బాహ్యులైనవారు. ఇట్లు, కేవలం ప్రాణపోషణ కావించుకొని, కాలం వెళ్ళబుచ్చే మానవరూప పశువుల స్థితిలో, ప్రజానీకాన్ని నిలిపింది మతవ్యవస్థ.

రాజకీయ వ్యవహారాలు, కేవలం రాజులకూ, వారి ఆశ్రితులకూ మాత్రమే సంబంధించినట్టివి. దేశశ్రేయస్సునుకాని, ప్రజాశ్రేయస్సునుకాని, ఏమాత్రమూ పట్టించుకోక, స్వాతిశయాన్ని, భోగజీవితాన్ని, మాత్రమే, పోషించుకొంటూ వచ్చిన అతి స్వార్థపరులు వీరు. పరస్పర ఈర్ష్యా భావాలతో, ద్వేషాలతో, ఒకరిపై ఒకరు యుద్ధాలు సాగిస్తూ, దేశాన్నీ ప్రజానీకాన్నీ నష్టకష్టాలకు గురిచేసిన అవివేకులు. హిందువులమని, ముస్లిములమని చెప్పుకొంటున్నాకూడా, మత విశ్వాసము, ధర్మనిష్ఠ లేని పాషండులు. పరదేశీయులను అహ్వానించి, వారి సహాయంతో ఇతర దేశీయ రాజులను నాశంకావించి, తన్మూలంగా స్వదేశాన్ని ధ్వంసంకావించిన మాతృ ఘాతుకులు. మహమ్మద్ ఘోరీని పిలిపించి, తన కూతురిని, అల్లుణ్ణి, చంపించి, ఢిల్లీ రాజ్యాన్ని కూలదోసిన జయచంద్రుడు, తాను హిందువని చెప్పుకొన్నాడు. ఢిల్లీనగరంపై దాడి జరపడానికి నాదిర్ షాను ప్రోత్సహించిన వ్యక్తి ముస్లిం సేనా నాయకుడు. దక్కనులోని బహమనీ ముస్లిము రాజ్యాలపై దీర్ఘకాలం దండయాత్ర సాగించిన ఔరంగజేబు పవిత్ర ముస్లిమ్. హిందూరాజపుత్ర రాజ్యాలపై ముల్కగిరి దండయాత్రలు సాగించిన మహారాష్ట్రులు కూడా, హిందువులే. ఢిల్లీ ప్రజలను సామూహిక సంహారానికి గురిచేసి, ముస్లిములను హిందువులను కూడా సమానంగా హతమార్చిన అహమద్ షా అబ్దాలీకూడా ముస్లిమే. మథురా, బృందావన్, గోకుల, పుణ్యక్షేత్రాలను ధ్వంసంచేసి, ఏడు రోజులు యమునానదిని రక్తప్రవాహంలో ముంచినప్పుడు, ముక్కోటి దేవతలలో ఒక్కరూ సహాయపడలేదు. 'హిందూ పద్ పాదషా

హీని' స్థాపించినామని ఆడంబర వాక్యాలు పల్కిన మహారాష్ట్రీలు, ఆ సమయంలో ఇతర హిందూ ప్రాంతాలలో ముల్క్‌గిరిదాడులను జరుపుతూ ఉండినారు. సురాజ్-ఉద్-దౌలాకు ద్రోహంచేసి, క్లైవు సింహాసనానికి నక్కమంత్రిత్వాన్ని నెరపిన మీర్‌జుమ్లా, ముస్లిం సేనానాయకుడు. ముస్లిం నవాబులూ, హిందూరాజులూ, భారతదేశానికి చేస్తూ ఉండిన సేవ ఇట్టిది.

దేశంలోని ప్రధాన వర్గాలైన హిందువులకు ముస్లిములకు మధ్య, ఆరని చిచ్చును రగులుకొల్పినవారు పండితులు, పురోహితులు, ఉలామాలు, మౌల్వీలు. కాబట్టి, దేశంలో, రాజకీయ ఐక్యత, అనేదే ఏర్పడలేదు. అజ్ఞానులైన ప్రజల నిస్సహాయ స్థితి, విజ్ఞాన విషయకమైన హీనస్థితి, దేశరాజుల పరస్పర వైషమ్యాలు, కులమత సంబంధమైన ఉన్మాద ప్రవృత్తులు, దేశాన్ని ఛిద్రం గావించి, దుర్బలమొనర్చినవి.

ఈ పరిస్థితులను ఉపాయకౌశలంతో స్వప్రయోజనార్థం ఉపయోగించుకొని, దేశీయుల సహాయసంపదతోనే, దేశీయుల సాధనాలతోనే దేశీయరాజులను, ఒక్కొక్కరినే నశింపజేసి, ఆంగ్లేయులు దేశాన్ని వశపరచుకొని, రాజ్యాన్ని స్థాపించుకొన్నారు.

ఇదివరకే, ఈస్టిండియా కంపెనీ మాత్రమేకాక, కంపెనీలోని, చిన్నాపెద్దా ఉద్యోగులుకూడా, దేశంలో అన్ని విధములైన వ్యాపారాలనూ సాగిస్తూ, దేశవర్తకులను, రైతులను, వృత్తి కార్మికులను దోచుకొంటూ ఉండిరి. ఇప్పుడు, దేశాధిపత్యం లభించడంతో, అధికారరీత్యా జరిగే దోపిడీ ప్రారంభమయింది. పంటలతోనూ, నేత పరిశ్రమలతోనూ కళకళలాడుతూ, ప్రపంచ దేశాలకు కూడా వస్తువులను ఎగుమతిచేస్తూ, "ప్రాచ్య దేశ భండారమని", ప్రసిద్ధిచెందియుండిన బెంగాలు ప్రాంతాన్ని పూర్తిగా ఊడ్చివేసి, ప్రజలను పిప్పిపిప్పిచేసి, ఇంగ్లాండు దేశాన్ని సంపన్నం కావించుకొన్నారు బ్రిటిషు పరిపాలకులు. కంపెనీ ఉద్యోగులందరూ, యథాశక్తిగా, ఇండియా ధనాన్ని సంగ్రహించుకొని సుఖ జీవితాన్ని గడపడానికై ఇంగ్లాండును చేరుకొన్నారు. సంవత్సరానికి 40000 పౌనుల ఆదాయంవచ్చే, ఆస్తిని క్లైవు ఒక్కడే జమచేసుకొన్నాడు; తన బంధువుల నిమిత్తం 50000 పౌనుల మొత్తాన్ని ద్రవ్యరూపంలో తరలించుకొనిపోయినాడు. దేశంలోని ధనాన్ని దోచుకోడానికి వీరు అవలంబించిన మార్గాలు అనేకములు. ప్రాచీన రాజవంశాల మూల కోశాలన్నీ ఖాళీ ఐపోయినవి.

పారిశ్రామికంగా అత్యుచ్ఛ్రయ స్థితిలో ఉండిన భారతదేశాన్ని, కేవలం ముడి సరకులను ఉత్పాదించే వ్యావసాయిక దేశంగా మార్చివేసినారు బ్రిటిషు పరిపాలకులు. ఇండియాలో వీరు అవలంబించినవి, - సామ్రాజ్యవాదము, వాణిజ్యవాదము. తాము జయించిన పరదేశాల మూలసాధనాలను, ప్రజలను తమదేశ ప్రయోజనాలకై ఉపయోగించుకోవడం, ఈ రెండు వాదాలకూ సమానమైన అంశం. దీనిని, అతి సమర్థతతో వీరు నిర్వహించుకొన్నారు.

కాని, వీరు అవలంబించిన విధానాలే వీరి సామ్రాజ్య వినాశానికి హేతువులైనవి. నష్టకష్టాలకు గురియైన పారిశ్రామికులు, వ్యాపారస్థులు, ఉన్నతోద్యోగావకాశాల నుంచి బహిష్కృతులైన విద్యావంతులు, - మొదలైన వారితో ఒక నూతన ప్రజావర్గం దేశంలో సృష్టికి వచ్చింది. భారత జాతీయోద్యమానికి పూనుకొన్న మధ్యమ తరగతి, ఈవర్గమే.

జాతీయోద్యమాన్ని, స్వాతంత్ర్యోద్యమంగా పరిణమింపచేసి, నూరు సంవత్సరాల కాలం బ్రిటిషువారితో శాంతి సమరం సాగించి, పర్యవసానంగా స్వాతంత్ర్యాన్ని సాధించిన వ్యక్తులు ఈ వర్గములో ఉత్పన్నమైనవారే.

భారతదేశం స్వాతంత్ర్యాన్ని గోల్పోయిన ప్రక్రియను, సమగ్రంగా, చారిత్రిక సాక్ష్యంతో, నిష్పక్షపాతంగా చిత్రిస్తుంది, ఈ మొదటి సంపుటి. మన స్వార్థము, సంకుచిత భావాలు, ఈర్ష్యాద్వేషాలు, మత సంబంధములైన భ్రష్టాచారాలు, మూఢవిశ్వాసాలు, పరమత అసహన భావాలు, స్వాతిశయ మత దురహంకారాలు, నిష్ప్రయోజకములు, భావచైతన్య ప్రతిబంధకములు, ఐన ఉన్నత వర్గాలవారి చదువులు,- ఇవి భారతదేశ జీవితాన్ని ఆక్రమించిన చీడపురుగులు. దేశాన్ని దుర్బలమొనర్చి, ప్రజల ఐక్యభావాన్ని నశింపచేసి, శత్రువుల ప్రవేశానికి సులభ మార్గాలు కల్పించి, దేశాన్ని పరుల హస్తగత మొనర్చినవి, ఉన్నత వర్గాలవారి ఈ ప్రవృత్తులే.

యువతీ యువకులు, ముఖ్యంగా విద్యార్థులు, ఈ గ్రంథాన్ని చదవ వలసిన అవసరం ఎంతైనా ఉంది.

—బి. లక్ష్మినారాయణరావ్

# విషయసూచిక

# ఉపోద్ఘాతము

## I. సింహావలోకనము

పద్దెనిమిదో శతాబ్దంలో, భారతదేశం బ్రిటీషువారి ఆధిపత్యానికి వశమైపోయింది. ఇండియాకు వేలకొలదిమైళ్ళ దూరములో నివసించే ఒక పరజాతి, భారతదేశ పరిపాలనాధికారాన్ని చేజిక్కించుకొని, దేశభవిష్యత్తును నడపడానికి పూనుకొన్నది. ఇట్టిది జరగడం, భారతదేశ చరిత్రలో ఇదే మొదటిసారి. ఈవిధమైన దేశాక్రమణము భారతీయులకు, నూతనమైన అనుభవం. పూర్వము ఎన్నో దండయాత్రలకు దేశం గురిఅయింది. పదేపదే భారతదేశ భూభాగాలు తాత్కాలికంగా విజేతల ఆధిపత్యానికి వశమైనాయి. ఐనప్పటికీ, అట్టి సందర్భాలు స్వల్పములు ; పరాక్రమణ కొద్దికాలం మాత్రమే నడిచింది. పర్షియావారి అఖమేనియన్ సామ్రాజ్యము భారతదేశముయొక్క సరిహద్దు భూభాగాలను వశంచేసుకొని, సింధునది ప్రాంతాల నుంచి కప్పాన్ని లాగుకొంది. ఇది ఒక ఉదాహరణ. కాశ్మీరుపైనా, పశ్చిమోత్తర ప్రాంతంపైనా, కుషానులు దండయాత్రలు సాగించి, ఆ ప్రాంతాలపై శతాబ్దకాలం పైగా తమ ఆధిపత్యాన్ని సాగించినారు. పహ్లావులు, శకులు, హూణులు గావించిన దండయాత్రలు శీఘ్రకాలికములైన సంఘటనలు మాత్రమే. ఘజ్నీవీద్ రాజ్యంలో, పంజాబును కూడా కలుపుకొన్నారు. సింధుప్రాంతాన్ని అరబ్బులు పరిపాలించినారు. తాత్కాలిక పరపరిపాలనకు సంబంధించిన ఈ ప్రాసంగిక సంఘటనలేకాక, భారతదేశంపై అనేక దండయాత్రలు సాగించిన ఈ శత్రువులు, దేశాన్ని కొంతకాలం కొల్లగొట్టి మరలిపోయినారు. అట్టివారిలో, అలెగ్జాండరు, తైమూర్, నాదిర్‌షా, అహమద్‌షా అబ్దాలీలు ప్రముఖులు. మధ్యయుగ తొలిభాగంలో వచ్చిన టర్కులు, తరువాతికాలంలో వచ్చిన భగ్తే ముఘలులు మాత్రమే, భారతదేశంలో అధిక భూభాగాన్ని ఆక్రమించి శాశ్వతములైన సామ్రాజ్యాలను నెలకొల్పిన విజేతలు.

పశ్చిమోత్తర భారతదేశంపై అధికారం నెరపిన కుషాను విజేతలు పూర్తిగా భారతీయులైపోయిరి. భారతీయమతాన్ని, భాషలను, సంప్రదాయాలను అవలంబించి, భారత సమాజములో ఒక భాగంగా కలిసిపోయిరి. తొలిరోజులలో ఆఫ్గనిస్తాన్‌నుంచి, మధ్య ఏషియానుంచి, వచ్చిన విజేతల చరిత్ర వేరు. మహమ్మద్ ఘజినీ, షహాబుద్దీన్ ఘోరీ, బాబర్‌లను అనుసరించి వచ్చిన ముస్లిము సైనికులూ, వారి క్యాప్తానులూ (captains), విద్వాంసులూ, వర్తకులూ, మున్నగువారు, శకులూ, హ్యూచీలు (yuehchis) హూణులువలె, తమ ప్రత్యేకతను కోల్పోలేదు. తమ మతాన్ని అంటిపెట్టుకొంటూ, తమ సంస్కృతిని చాలవరకు రక్షించుకొంటూ వచ్చిరి. ఐనా, ఈ దేశంలో శాశ్వతంగా నిలిచిపోవడానికీ, తమ పూర్వపు నెలవులను త్యజించడానికీ నిశ్చయించుకొని, భారతదేశీయులతో తమ జీవితాన్నీ, భవిష్యత్తునూ చేర్చివేసిరి. జీవనమునకు సంబంధించిన కార్యరూపావసరముల ప్రాబల్యంవల్ల, ప్రజలతో సాంఘిక

సంబంధాలను ఎక్కువ చేసుకోవలసి వచ్చింది. నూతన పరిస్థితుల ప్రాబల్యాన్నిబట్టీ, పరిపాలనవిధానము యొక్క ప్రయోజనాలనుబట్టీ, ప్రభుత్వానికీ, శాసనానికీ, సామాజిక వ్యవస్థకూ సంబంధించిన తమ అభిప్రాయాలను మార్చుకొనిరి. పరదేశీయ ప్రవర్తనలను, సంప్రదాయాలను చాలవరకు పరిత్యజించి, భారతీయ జీవిత స్వభావములను, సంస్కృతిని గ్రహించి, జీర్ణించుకొనిరి. వివిధమత భండారమైయున్న భారతదేశం, మరియొక నూతన మతాన్ని చేర్చుకొని, పుష్టి చెందింది. నానావిధ చిత్రవర్ణ శోభితమైయుండిన భారత నాగరికత, నూతనాంశముల మేళనంవల్ల రూప వైవిధ్యాన్ని పొందింది.

ఇట్లు, ముస్లిములు భారతదేశాన్ని ఆక్రమించడంవల్ల, ప్రాచీన భారత సమాజములలో పెక్కు రాజకీయ సాంస్కృతిక పరివర్తనలు కలిగినప్పటికీ, పురాతన సంస్కృతియొక్క పునాదులుకాని, కట్టడములుకాని, ఎక్కువమార్పుకు లోనుకాలేదు. నూతనాగతులైన ఈ విదేశీయులకు భారతీయులు తమ నాగరికతను పంచి ఇవ్వడమేకాక వారి నాగరికతను తాముకూడ ఇతోధికంగా పరిగ్రహించినవారైరి. విజేతలు ప్రవేశపెట్టిన నూతన సాంఘిక పద్ధతులను, వర్తనలను, భారతీయులు నేర్చుకొనిరి. ఏకేశ్వరోపాసనకు ఇస్లాము ఇచ్చే ప్రాధాన్యము, ముస్లిముల కులతత్త్వ (వ్యక్తి భేద) రహితమైన సామాజిక వ్యవస్థా తత్త్వము, ఇవి భారత సమాజంలో ప్రతి క్రియారూపమైన అలజడిని కలిగించినవి. తత్ఫలితంగా బయలు దేరిన ఉద్యమాల ప్రాబల్యంవల్ల, హిందూమత సాంఘిక వ్యవస్థలలో పరివర్తనం కలిగి, రెండు మతస్థులవారి భావాలకు పద్ధతులకు సన్నిహితత్వం ఏర్పడింది. ముస్లిముల భాషా సారస్వతముల ప్రభావం, హిందువుల భాషా సారస్వతములపై బాగా వ్యాపించింది. నూతన శబ్దజాలం, పలుకుబళ్లు, సాహిత్య ప్రక్రియలు దేశంలో స్థిరపడినవి. నూతనాభిప్రాయాలు, నూతన కావ్య వస్తువులు, దేశీయుల భాషప్రపంచాన్ని విస్తరింపచేసినవి. ఒక నూతన సారస్వత భాష ఏర్పడింది. మధ్యస్థములైన ఇండో-ఆర్యన్ వ్యవహార భాషలనేకములు మార్పులకు లోనై, ఆధునిక సారస్వత భాషలుగా వికసించినవి. వాస్తు శిల్పము, చిత్రకళ, సంగీతము, ఇతర సాధారణ కళలు,-మొదలైనవాటిలో విస్తారమైన మార్పులు ఏర్పడినవి. రెండు సంస్కృతుల అంశములూ మేళవించిన నూతన విన్యాసాలు, భంగిమలు, కళలలో ఉదయించినవి. పదమూడో శతాబ్దంలో ప్రారంభమైన ఈ సాంస్కృతిక మేళన ప్రక్రియ ఐదువందల సంవత్సరాల కాలం సాగింది.

లోడీ కుటుంబానికి చెందిన ఆఫ్గన్ రాజవంశాన్ని, పదహారో శతాబ్దంలో బాబరు పడద్రోసినాడు. బాబరు వంశీయులు భారతదేశ ప్రయోజనాలతో గాఢంగా ఐక్యాన్నిపొంది, రాజకీయైక్యానికీ, సాంస్కృతిక సామరస్యానికీ దోహదం కలిగించే పరిపాలన విధానాలను చాలవరకు పాటించిరి. భారతదేశంలో విశాలభాగంపై మొగలు సామ్రాజ్యం వ్యాపించడం కారణంగా బహుళగాఢమైన పరిణామాలు సిద్ధించినవి. ప్రాచీనములైన జన-జాతి రాజ్యాలనూ, సర్వతంత్ర స్వతంత్రములైన ఇతర రాజ్యాలనూ, మొఘలు సామ్రాజ్యం తుడిచి వేసింది. ప్రాచీనకాలం నుంచీ దేశంలో నెలకొని యుండిన అనేక రాజ్యాల స్వాతంత్ర్యం, ఇదివరకే మౌర్య, కుషాన్, గుప్త, సామ్రాజ్యాల అధికార ప్రాబల్యంవల్ల పరిమితమై ఉండినది. ఆ రాజ్యాల బహుళ సంఖ్యను పరిమితమొనర్చి, కేంద్రప్రభుత్వాధికారానికి లోబడిన భాగాలుగా చేసి, ఏకమైన ఒక సామ్రాజ్యాన్ని కల్పించుకొన్నారు మొగలులు. దేశపు సరిహద్దు ప్రాంతా

లలో మాత్రము, అర్ధస్వతంత్రములైన స్వల్పరాజ్యాలు, కొన్ని సామంతరాజ్యాలు, అధీన రాజ్యాలు, నిలిచిపోయినవి.

మొగలు సార్వభౌములూ, వారి కార్యకర్తలూ, కూడా, కళాసారస్వతాలను పోషించిన వివేకవంతులు. ఆధునిక సంస్కృతికి లోనైన హిందూమత ప్రచారానికి సాధనములూ, భక్తి మతానికి ప్రసారసాధనములూ ఐన బ్రజ్, అవధి, బెంగాలి, మరాఠీ మొదలైన ఆధునిక భాషల అభివృద్ధికి రాజాదరణ లభించింది. సార్వభౌముని ఆస్థానమూ, అతని ప్రాంతీయ గవర్నరుల ఆస్థానాలుకూడా, కళాసంస్కృతులకు కేంద్రములైనవి. పర్వతసీమలు, రాజస్థాన్, మధ్యభారతము, దక్కన్ - మొదలైన ప్రాంతాలలోని హిందూ పరిపాలకులు, మొగలుల ఆదరణపోషణలక్రింద వికాసానికి వచ్చిన ప్రక్రియా విన్యాసాలను అనుకరిస్తూ వచ్చిరి.

మొగల్ రాజకీయ విధానమూ భారతదేశపు సాంస్కృతిక ఆదర్శాలూ - రెండూ ఒకే సాంఘిక - ఆర్థిక ఆధార పీఠముపై ఏర్పడినవి. కొన్ని సూక్ష్మాంశముల మార్పులవిషయంలో తప్ప, ఈ ఆధారంయొక్క సమగ్ర వ్యక్తిత్వానికి, ప్రాచీన మధ్యయుగాల చరిత్రకాలమంతటా ఏవిధమైన భంగమూ కలుగలేదు. ఆర్యులు భారతదేశంలో స్థిరనివాసాలను ఏర్పరచుకొన్న నాటినుండి ఈ ఆధారం ఏర్పడుతూ వచ్చింది.

ఈ సాంఘిక - ఆర్థిక వ్యవస్థయొక్క క్రమపరిణామం, భారతదేశ చరిత్రయొక్క వ్యక్తిత్వ లక్షణం. భారతదేశ జాతుల బహుముఖ సంస్కృతిలో ఏర్పడిన సామరస్యానికి, ఈ సాంఘిక - ఆర్థిక ఆధారమే మూలము. ఈవిధంగా, భారతదేశం అనేక మతాలకు, భాషలకు, జాతులకు ఆకరమైయుండినా, జీవితవిషయంపట్ల భారతదేశీయుల ప్రధాన భావాలు, శతసహస్రాబ్దాలుగా స్థిరంగా నిలిచిఉన్నవి. బహుముఖములైయున్న ఈ సంస్కృతులందంతటా యుగాల తరబడిగా ఒకానొక భారతీయ విశిష్టగుణం వ్యాప్తమై ఉన్నది. ఆర్యుల నివాస స్థానాలలో ఉత్పన్నమైన ఈ భారతీయ సాంఘిక-ఆర్థిక వ్యవస్థా, దేశములోని ఆదిమ వాసులు ఆర్యజాతిలో మేళవించి పోవడమూ, ఈ రెండూ, ఎక్కువ పరివర్తనం చెందక, పందొమ్మిదో శతాబ్దంవరకూ నిరంతరంగా సాగుతూరావడం అనేది, మిక్కిలి గమనించవగిన విషయం. జాతికి ఆకారాన్ని ఇచ్చే అచ్చు, యూరోపులోవలెగాక, భారతదేశంలో ఒక్కసారిగా, శాశ్వతంగా ఆదిలోనే ఏర్పడిందనీ, తరువాతికాలంలో ఏ విధమైన చలనమూ దానికి కలుగలేదనీ, దీని అర్థము. తండోపతండాలుగా వలసవచ్చిన ఆర్యులు,- బహుశా తరంగముల విధంగా కావచ్చు,- దేశం ప్రవేశించి, వివిధప్రాంతాలలో నివాసాలు ఏర్పరచుకొన్న తొలిరోజులలోనే, ఈ జాతి సంయోజనప్రక్రియ ప్రారంభమయింది. ఆయా ప్రాంతాలలోని ఆదిమనివాసులు వివిధమార్గాలలో, భిన్నసంఖ్య వర్గాలుగా ఈ ఆర్యులతో కలిసిపోయినారు. ఈ విధంగా భిన్నప్రాంతాలలో భిన్నసామాజిక వ్యవస్థలు స్థిరపడినవి. కాని, అట్టి వ్యవస్థలన్నిటిలోనూ, తరతమ భేదాలతో ఆర్యలక్షణాలు నిలిచేఉన్నవి. ఒకసారి స్థిరపడిన ఈ సంప్రదాయాలు తరువాతికాలమున జరిగిన ఆయా జాతుల స్థానచలనములవల్లకాని, అలజడులవల్ల కాని మార్పుపొందలేదు. ఆర్య, ద్రావిడ, ఆదిమజాతుల సంపర్కసంయోజనములవల్ల ఏర్పడినవి ఈ సంప్రదాయాలు. తాత్కాలికంగా జరిగిన విదేశీయుల దాడులుకాని, శాశ్వతంగా నిలిచిపోయిన ఆక్రమణలుకాని, అఖండమైన ప్రజానీకాన్ని స్పృశించకపోవడం కారణంగా, సంప్రదాయలకు ఆధారములైన మూలతత్త్వాలు, తద్వికసితభాగాలు, ఏమాత్రమూ మార్పును

అందలేదు. తరువాతికాలంలో భారతదేశానికి వలసవచ్చిన జాట్, గుజార్, శక, హూణజాతులన్నీ మహాసముద్రములోనికి ప్రవహించిపోయిన పిల్లకాలువలవలె, విస్తృత భారతజాతిలో లీనమైపోయినవి.

మొగల్ విజేతలు తమ సామ్రాజ్యాన్ని పదమూడో శతాబ్దంలో స్థాపించడంతో, ఒక నూతన సంస్కృతి భారతదేశంలో ప్రవేశించింది. ప్రాచీన నూతన సంస్కృతులకు సాహచర్య సంపర్కాలు కలగడమూ, ఒకదానినుండి మరియొకటి గ్రహించడమూ జరిగింది. ఆ ప్రక్రియలో, సంమిశ్రితమైన ఒక సన్నివేశము ఉత్పన్నమయింది.

సమాజానికి ఆధారములైన జాతి, ఆర్థిక వ్యవస్థలు ఎంతమాత్రమునూ మారలేదు. గ్రామీణవర్గానికి స్వయంసమర్థమైన ఏకకంగా (Unit) గ్రామజీవనం సాగుతూనే ఉంది. వ్యవస్థా విషయంలోకాని, పద్ధతులలోకాని ముఖ్య పరివర్తనం కలుగక, పరిశ్రమయూ, వర్తకమూ ఎప్పటివలె జరుగుతూనే ఉన్నాయి. హిందూ ముస్లిము సంఘాలు రెండు వర్గాలుగా స్తరీకృతములైనాయి. అట్లే, విశేషాధికారాలతో పరిపాలకులైయున్న భూస్వాముల కులీన వర్గమూ, పరిపాలన కార్యక్రమాలకు దూరమైన అధికారరహిత ప్రజానీకమూకూడా, రెండు వేరువర్గాలుగా నిలిచేఉన్నవి. రాజకీయవిధానంలో ఎట్టి మార్పు రాలేదు. దేశరక్షణకూ, అరాజకత్వ నిర్మూలనకూ అవశ్యకమైన సైన్యాన్ని సిద్ధపరచుకోవడము, దాని పోషణకై ప్రజలనుండి పన్నులను వసూలుచేయడము అనేవి మాత్రమే ప్రధానములైన ప్రభుత్వ కార్యక్రమాలు. కనుక ప్రభుత్వాన్నీ ప్రజలనూ దగ్గరగా తెచ్చే సంబంధానుబంధాలు అత్యల్పములు, బలహీనములు. శాసన నిర్మాణ కార్యక్రమంకాని, న్యాయపరిపాలనకాని, ప్రజల అవధిలో లేదు. న్యాయ నిర్మాణ సంఘాలు లేవు. వ్యక్తుల వ్యవహారాలకూ, సివిల్ వ్యవహారాలకూ సంబంధించిన వ్యాజ్యాల నిర్ణయం, చాలవరకు అనధికార అధికరణాల (ఏజెన్సీల) చేతుల్లో ఉండింది.

మతవిషయంలో, కిందివర్గాల ప్రజలు పూర్తిగా అంధవిశ్వాసంలోనే మునిగిఉన్నా, విద్యావంతులైనవారిలో ఏమాత్రం మార్పు లేకపోయినా, సాధారణంగా ఒక మతం మరియొక మతం నుండి కొన్ని అంశాలను గ్రహించడమూ, ఇవ్వడమూ జరుగుతూ వచ్చింది. ఇస్లాము ప్రభావంవల్ల హిందువులలో నూతన మతాభిప్రాయాలూ, మతశాఖలూ బయలుదేరినవి. ముస్లిములలో విశాలభావాలుగల సూఫీవర్గాలవారూ, విద్వాంసులూ, హిందూ తత్త్వశాస్త్ర సిద్ధాంతాలను, ఆంతరంగిక శిక్షణకు సంబంధించిన పద్ధతులను అవలంబిస్తూ వచ్చిరి. ప్రతిభా సృష్టికి సంబంధించిన కళాసారస్వత రంగాలలో, హిందూ ముస్లిము విన్యాసాలకు విస్తృత సంయోజనం సిద్ధించింది. కాని, న్యాయశాఖ విషయములో పరస్పర సంయోజనం కలుగలేదు.

సాంస్కృతిక సంబంధమైన పరస్పర సంబంధాలు మాత్రం తప్పక ఏర్పడినవి ; కాని అందువల్ల జాతీయ భావోదయం కలుగలేదు. సంప్రదాయవర్గాలూ, మతవర్గాలూ, అతికఠినమైన అచ్చులలో నిలిచి ఉండడంవల్ల, రెండు జాతులనూ సంయోజనపరిచే జాతీయత సిద్ధించలేదు.

ప్రభుత్వం కూడా ఇట్టి భావోదయానికి దోహదం చేయలేదు. ఒకే భూభాగంలో నివసించడం కారణంగా ఏర్పడిన సంపర్కంతప్ప, రెండు వర్గాలకూ ఐక్యభావాన్ని కూర్చే ప్రయత్నమేదీ జరగలేదు. దేశభక్తి భావాన్నికాని, దేశవాసులైన ప్రజలందరితోనూ ప్రతి

వ్యక్తి పాటించవలసిన ఐక్యభావాన్నికాని, ఆర్థిక సాంఘికాభివృద్ధులు కూడా కలిగించలేదు.

పద్ధెనిమిదో శతాబ్దారంభమునాటికే శిథిలావస్థను వచ్చిన మొగలుసామ్రాజ్యసౌధం, శతాబ్దం గడిచేకొద్దీ మరింత శిథిలమౌతూ వచ్చింది. కేంద్రాధికార దౌర్బల్యానికి ప్రతిక్రియగా రాజ్యముయొక్క ఆర్థికజీవితం దెబ్బతిన్నది. రాజ్యముయొక్క ఆదాయము క్షీణించడము, సంచారమార్గ వ్యవస్థకు భంగము కలగడము జరిగినవి. వర్తక వ్యవసాయాలు స్థానికములు కాసాగినవి. అపకేంద్రీకరణ శక్తులు (centrifugal forces) ప్రబలం కాజొచ్చినవి. న్యాయవ్యవస్థ క్రమవ్యవస్థలకు భంగంకలిగింది. ప్రభుత్వపరిపాలనలోనూ, వ్యక్తిజీవితం లోనూ, కూడా నైతికవ్యవస్థ భగ్నమయింది. సామ్రాజ్యం చిన్నచిన్న ముక్కలుగా చీలి పోయింది. కనుక, పరదేశీయుల ఆక్రమణనూ, అంతఃశత్రువులనూ, ఎదుర్కోడానికి తగిన సామర్థ్యం భగ్నమైపోయింది. పరిస్థితు లిట్టివైయున్న ఈ సమయంలోనే యూరోపురాజ్యాల ఏజెంట్లు భారతదేశ వ్యవహారాలలో జోక్యం కలిగించుకోడానికి ఆరంభించినారు.

1498లో వాస్కోడగామా క్యాలికట్ రేవులో అడుగుపెట్టిన నాటినుండి, ఏషియా యూరోపుఖండాల మధ్య, నూతనసంబంధం ప్రారంభమయింది. హిస్పానిక్ ద్వీపకల్పము నుంచి మూరులునూ (Moors), బాల్కన్ ప్రాంతాలకు కొత్తగా చొచ్చుకొనివచ్చిన టర్కు లునూ, పదహైదోశతాబ్దంలో వెనుదిరిగి పోవడంతో, ఈ రెండు ఖండాలకూ మధ్య ప్రాచీన కాలమునుంచి ఉండిన స్పర్ధ, సంఘర్షణ అంతమైనాయి. ముస్లిములను వెన్నాడి తరుముతూ వచ్చిన స్పానియర్డులూ, పోర్చుగీసులూ, సముద్రాలను గాలించినారు. అబిసీనియాలోని 'పెస్టర్‌జాన్' రాజ్యమని వర్ణింపబడే పౌరాణికరాజ్యంతో తమ పాశ్చాత్య క్రిశ్చియన్ సేన లను కలపడానికీ, ఉత్తరాఫ్రికాకూ పశ్చిమఏషియాకూ చెందిన ముస్లిములను ద్విమార్గ సైనిక సంచలనం ద్వారా నశింపచేయడానికీ, వీరు ప్రయత్నించిరి. ఇట్టి యుద్ధనీతిక (Strategic) ఆశయాలను అనుసరించి, వీరు ఆఫ్రికాఖండాన్ని చుట్టుకొనివచ్చి, అరేబియా సముద్రాన్ని దాటి, భారతదేశపు పశ్చిమ సముద్రతీరాన్ని ప్రవేశించిరి.

పోర్చుగీసువారి ఈ సాహసకార్యం, సువ్యాప్తమైన పరిణామాలను కలిగించింది. టర్కీ దేశానికీ, అరబ్బీదేశాలకూ సంబంధించిన పడవలను ఇండియా సముద్రాలనుండి తరిమివేయడం మొదటి పరిణామం. అబ్బాసీద్ క్యాలిఫేట్‌కు, పూర్వంనుంచీ కూడా భారతదేశానికీ పశ్చిమ ఏషియాదేశాలకూ మధ్య, ప్రశాంతంగా జరుగుతూ వచ్చిన వర్తక వ్యవహారాలు ఇంతతో అంతమైనాయి. ఇండియాయొక్క ఎగుమతి దిగుమతి సరకులు ఇంతవరకు, ఇండియా పడవల లోను, ఏషియాదేశాల పడవలలోనూ, రవాణా అయ్యేవి. ఈ పడవలను పోర్చుగీసువారు సముద్రంలో ముంచివేయడం, భారతదేశ నౌకానిర్మాణ పరిశ్రమకు మారణాఘాతమయింది. అంతేకాక, భారతీయుల సముద్రీయ కార్యకలాపాలు ఆగిపోవడంతో ఇండియాకూ ఆగ్నేయ భాగ ఏషియాకూ ఉండిన సాంస్కృతిక సంబంధాలు విచ్ఛిన్నమైనాయి. గంగానదీప్రాంతానికి పైన, బర్మానుంచి ఇండోనేషియావరకూగల దేశాలు భారతదేశ ప్రభావపథమునుండి తొలగి పోయినవి. తాయిలాండ్, ఇండోచైనా, ఇండోనేషియా దేశాలలో వైభవోపేతములైన శాశ్వత మహాకార్య నిర్వహణలకు ఉత్తేజకమై, మలయా, సుమత్రా, జావా, తూర్పుద్వీపమండలాలను వ్యాపించి విలసిల్లిన మహాసామ్రాజ్యాల అభివృద్ధికి తోడ్పడి, ఆయాప్రాంతాల జాతులకు నూతన మతనాగరకతలను అందించిన భారతీయ సాంస్కృతికాభివృద్ధి, ఈ దేశాలలో ఒక్క

సారిగా అంతం గావింపబడింది.

అంతకంటె ఎక్కువగా, ఇండియా తీరాలపై పోర్చుగీసువారి ప్రవేశం అర్థవంతమైన ఒక దుశ్శకునం. నూతన విజ్ఞానశాస్త్ర పరిశోధనలందల్ల కలిగిన వ్యక్తిప్రతిష్ఠ, సామాజిక భద్రతలు అనే నూతన ఆదర్శాలతోనూ, భౌతికాభ్యుదయ జాతీయ సామర్థ్యములు అనే నూతన స్వప్నదర్శనంతోనూ, నూతనోజ్జీవన నూతన ఆత్మవిశ్వాసాన్ని పొందిన యూరోపు, తూర్పు ఖండాలన్నిటిలోనూ సంపన్నమైన భారతదేశాన్ని తలుపు తట్టడం ఆరంభించింది.

ప్రఖ్యాత వైభవోపేతులైన అక్బరు షాజహానులనాడు, కల్పితకథగా చెప్పుకోతగిన సంపదతో, ప్రపంచ విఖ్యాతి కెక్కిన కళలతో, తేజోవంతమైన సంస్కృతితో విరాజిల్లిన భారతదేశము, పద్దెనిమిదో శతాబ్దంనాటికి తన క్రియాత్మక శక్తిని కోల్పోయి ఉండినది. పల్లెలు, కులాలు, వంశాలు, జనజాతులు, చిన్న రాజ్యాలు,- వీటితో మధ్యకాలపు చలన రహితమైన ముద్దగా ఏర్పడియుండిననాటి దేశం, మొగలు సామ్రాజ్యంలో సుబద్ధమై ఉండ లేదు. సామ్రాజ్యం, అధీశతను నామమాత్రంగా వహించి ఉండినది. కేవలం వ్యవసాయముపై ఆధారపడింది, దేశముయొక్క ఆర్థికవ్యవస్థ. వ్యవసాయవిధానము ఆదికాలమునాటిది ; ఆయా ప్రాంతాలకు మాత్రమే పరిమితమైనది దాని వ్యవస్థావిధానము ; ఆహారవస్తువుల ఉత్పాదన మాత్రమే దాని ధ్యేయము. స్వల్పప్రయోజనంతో అల్పప్రమాణంలో మాత్రమే, పరిశ్రమ వ్యవస్థ జరుగుతూ ఉండినది. ధనవంతుల ఉపయోగార్థం భోగవస్తు విలాసవస్తువులను తయారు చేయడము, లేదా, స్థానిక బజారుల సాధారణావసరములకు తగిన వస్తువులను తయారు చేయడము, మాత్రమే నాటి పరిశ్రమలకు ఉద్దిష్టమై ఉండినది. ద్రవ్యరూపమైన చెలామణికి ఈ పరిశ్రమలలో ప్రాధాన్యం లేదు. ఈ పరిస్థితికి విరుద్ధంగా, యూరోపుఖండం. సముద్రాంతర వర్తకాన్ని పెంపొందించుకుంటూ, అమెరికానుంచి వెండి, బంగారు రూపమైన నిధులను దిగుమతి చేసుకొన్నది. తత్కారణంగా, వ్యాపారానికి, పరిశ్రమలకు మంచి దోహదం కలిగింది. వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చిన మూలధన ప్రోద్బలంవల్ల, విశేషజ్ఞత (Specialisation) అభివృద్ధి చెందుతూ వచ్చింది. భూస్వాములైన కులీనవర్గంవారి ప్రాధాన్యం తగ్గింది. వర్తకులకూ, బ్యాంకర్లకూ ప్రాధాన్యం ఏర్పడింది. యూరోపీయుల మనస్సులకు బంధవిముక్తి కలిగించి, నూతన పరిశోధనకూ, ఆవిష్కరణానికీ ప్రేరకమైన పరిశీలనాత్మక విజ్ఞాన శాస్త్రోద్యమ ప్రభావం, భారతీయుల ప్రజ్ఞపై ఇంకను ప్రసారం కాలేదు. యూరోపులోని అరాజక భూస్వామ్య సంస్థలను సంయోజన పరచి, సుసంఘటిత జాతులుగా మార్చిన భావావేశాలు భారతీయ సామాజిక వైయక్తిక ప్రవర్తనలకు ఉత్తేజనం కలిగించలేదు. యూరోపులో మతప్రధానమైన యుగం అంతరించి, హేతువాద ప్రధానమైన యుగం ప్రవేశిస్తూ ఉంది. ఇక భారతదేశంలోనో అత్యుదాత్తులైనవారి దృక్పథమంతా ప్రపంచాతీత విషయంపై నిలిచింది; పరమాత్మతో సంయోగం పొందడమే, వారి ఉన్నతోన్నత ఆశయం.

భారతదేశ ప్రాభవం పదహేడో శతాబ్దంలో అత్యుచ్చశిఖరాన్ని అందుకొంది; మధ్య యుగ సంస్కృతికి అది పరాకాష్ఠదశ. ఐనప్పటికీ శతాబ్దాలు గడిచేకొద్దీ, యూరోపీయ నాగరకత, ఆకాశమధ్యసీమను చేరుకొన్నది. భారత గగనసీమలో చీకటి అలముకోడానికి ప్రారంభించి, శీఘ్రమే దేశంపై అంధకారం నెలకొన్నది. నైతిక అవ్యవస్థను, రాజకీయ అస్తవ్యస్తతకు సంబంధించిన నీడలు, దీర్ఘంగా వ్యాపిస్తూ వచ్చినవి.

అతిదూరంలోని సామ్రాజ్యాన్ని సంరక్షించుకోవడంతో, పోర్చుగల్ మితిమీరిన ప్రయత్నానికి పూనుకొంది. కనుక, అది స్పానిష్‌రాజ్యానికి అనుబంధంగా ఏర్పడడంతో, సామ్రాజ్య నిర్వహణ ప్రయత్నాన్ని విరమించుకొంది. పదహేడోశతాబ్దారంభకాలంలో, స్పెయినుదేశం, ప్రపంచాన్నంతా దాసోహం అనిపించే స్థితిలోఉన్నట్టు కనబడింది. కాని పుచ్చిపోయిన ఆర్థికవ్యవస్థవల్లనూ, సంకుచితమైన మతాంధతవల్లనూ, స్పెయిను, కష్టాలలో చిక్కుకొంది. చిన్నవీ, నవీనములే, ఐనా నెదర్‌లాండ్స్, ఫ్రాన్స్, ఇంగ్లండ్‌వంటి రాజ్యాలు స్పెయిన్ గర్వాన్ని అణచివేసినవి. స్పెయిన్ నౌకాదళాలను సముద్రాలనుంచి పారదోలి, నాయకత్వాన్ని వశంచేసుకొన్నవి. క్రమంగా, సామ్రాజ్య నిర్మాణమనే పోటీనుంచి, నెదర్‌లాండ్ తప్పుకుంది. పద్ధెనిమిదోశతాబ్ద మధ్యకాలానికి, ఫ్రాన్స్, ఇంగ్లండులు మాత్రమే రంగంలో నిలిచిఉన్నవి. తొలిరోజుల్లో ఫ్రాన్స్ ఈ పందెంలో పురోగమిస్తున్నట్టు కనబడింది. సాహసవంతములూ, వినూత్నములూ ఐన పరిపాలన విధానాలను అవలంబించడంవల్ల ఫ్రాన్సుకు, దక్కనులో సార్వభౌమ ప్రభావము ఏర్పడింది. కాని, 1789లో విప్లవరూపంగా ఉప్పతిల్లిన ఆంతరంగిక సంఘర్షణయొక్క ఛాయ, దేశాంతరాలకు ప్రాకింది. ఇండియాలోని ఫ్రాన్సుదేశ కార్యకర్తలకు మాతృదేశం నుంచి లభిస్తూఉండిన ఆలంబనం లోపించినందువల్ల, వారి సామ్రాజ్య నిర్మాణప్రయత్నం, సాధ్యంకానిదయింది. సప్తవార్షిక యుద్ధంవల్ల ఫ్రాన్సు దేశపు సామ్రాజ్యకాంక్ష ఆగిపోయింది. కాగా సామ్రాజ్య నిర్మాణరంగం పూర్తిగా ఆంగ్లేయులకు దక్కింది.

ఫ్రెంచివారు కనిపెట్టిన పద్ధతులను ఆంగ్లేయులు గ్రహించడం మాత్రమేకాక, ఆ పద్ధతులను ప్రయోగించే విషయంలో వారిని మించిపోయిరి. భారతదేశంలోని పరిపాలకుల న్యూనతలను, అవివేకాలను, పూర్తిగా ఉపయోగించుకొని, భారతీయుల సహాయంతోనే సమగ్ర భారతదేశానికి యజమానులైరి. అధినివేశ రాజ్యస్థాపనలో, కొన్ని బాధ్యతలు కూడా ఇమిడియున్నాయి. ఆంగ్లేయులు ఈ దేశానికి వచ్చినది వర్తకంవల్ల లాభం గడించడానికి; రాజ్యానికి ఆదాయంగా వచ్చిన ధనాన్ని ఇండియా సరకుల ఉత్పత్తికీ విక్రయానికీ ఉపయోగించి, సరకులను ఎగుమతిచేస్తూ వచ్చిరి. వ్యాపారావసరాలకూ; భూమిశిస్తువసూలుకూ, పరిపాలన వ్యవస్థను ఏర్పరచవలసిన ఆవశ్యకం ఏర్పడింది. కళా సారస్వత, తత్త్వశాస్త్ర, మతసంబంధమైన సంపన్న పురాతన సంస్కృతిగల భారతజాతి, ఇప్పుడు, మృతప్రాయమైయున్న సాంఘిక విధానమనే శవభారాన్ని మోస్తూ, నైతిక భౌతిక జీవన విషయంలో ఆధునికమై, అభ్యుదయగామియై, విజయవంతమై, గర్విస్తున్న బ్రిటను దేశానికి ముఖాముఖిగా నిలిచి, ఎదుర్కోవలసి వచ్చింది.

ప్రాక్పశ్చిమ ఖండాల ఈవిధమైన సమాగమంవల్ల, విచిత్రంగా, పరస్పరవిరుద్ధములైన ఫలితాలు ఉత్పన్నమైనాయి. వాటిలో మంచిచెడుగులు రెండూ మిశ్రితమై ఉన్నాయి. ఇండియా ఆర్థిక వ్యవస్థ రూపాంతరమంది, బ్రిటనుదేశపు ఆర్థికవ్యవస్థకు ప్రయోజనకరంగా సంయోజింపబడడం, మొదటి ఫలితం. దాని ననుసరించి దారిద్ర్యము, ప్రజాసంఖ్య, వ్యవసాయ భూములపై ఒత్తిడి, దేశములో పెరిగిపోయినవి. భౌతిక ద్రవ్యవిషయంలో విస్తృతమైన విప్లవం ప్రారంభమయింది. ఇక, భారతీయుల మనస్సు గాఢంగా ప్రచలితం కావడం, రెండవ ఫలితం. అధికారాన్ని ప్రశ్నించి విమర్శించే చైతన్యం ఒకవైపు ఉత్పన్నమయింది. మరిన్ని,

పాశ్చాత్యుల హేతుయుక్తమైన శాస్త్రవిజ్ఞాన పద్ధతిని భారతీయులు జీర్ణించుకొన్నారు. మరియొక వైపు, పునరుజ్జీవన ప్రవృత్తులు బలిష్ఠములై, తమ ప్రాచీనుల గొప్పతనాన్ని గూర్చిన అభిమానాన్ని పెంచినవి. తత్పరిణామంగా, నిద్రాణమై ఉండిన జాతీయ భావం మేల్కొన్నది. అంతతో తప్పనిసరిగా, స్వాతంత్ర్యవాంఛ ఉత్పన్న మయింది. స్వతంత్రము, బాధ్యతాయుతము ఐన ప్రజాస్వామ్య ప్రభుత్వ స్థాపనతో కూడినది ఈ స్వాతంత్ర్యవాంఛ. ఈ స్వాతంత్ర్య భావోదయంతోపాటు, కులమతభేదాలకూ, వర్గవిభేదాలకూ సంబంధించిన దుష్టభావనలు కూడా, పైకి వచ్చినవి. పరప్రభుత్వాధిపత్యానికి లోనుకానట్టి స్వాతంత్ర్యం భారతదేశముయొక్క అనుభవంలోనిదే. పూర్వము అట్టి స్వాతంత్ర్యం చాలకాలం నడిచింది. కాని, స్వేచ్ఛ అనేది భారతదేశానికి నూతనమైన భావరూపం. ఐనా, ఇట్టి స్వేచ్ఛాభావరూపం భారతదేశానికి పూర్తిగా క్రొత్తదైనట్టు తోచదు. ఆత్మకు సంబంధించిన అంతరంగిక స్వేచ్ఛానుభూతి అనేది, భారతీయ తత్త్వశాస్త్రముయొక్క ప్రధాన విషయం. ఐనా, సామాజిక రాజకీయరంగాలలో ప్రవృత్తమయ్యే స్వేచ్ఛఅనే భావం, వీరికి నూతనంగా పొడకట్టిన దర్శనం.

ఈ పరివర్తనము యొక్క ప్రక్రియావిధానమే, ఈ గ్రంథంలో వర్ణితమైన వస్తువు. భారతదేశం రూపాంతరాన్ని పొందడము, జాతీయచైతన్యం అభివృద్ధిచెందడము, అనేవి, పాశ్చాత్య సంస్కృతియొక్క సంఘట్టనవల్ల ఏర్పడిన పరిణామాలు.

జాతీయత అనేది పాశ్చాత్యదేశాలకు అధునాతనమైన విషయమే. పద్దెనిమిదో శతాబ్దంలో ఈ ప్రక్రియ, యూరోపులోని పడమటిదేశాలకు మాత్రమే పరిమితమై ఉండింది. అక్కడినుంచి, అది క్రమంగా, పందొమ్మిదో శతాబ్దంలో మధ్య యూరోపుదేశాలకూ, తూర్పు యూరోపు దేశాలకూ ప్రసరించింది. తరువాత, ప్రపంచములోని ఇతర దేశాలన్నిటినీ వ్యాపించింది.

యూరోపులో జాతీయ సంస్థలు ఏర్పడడం, అతి అధునాతనమైన సామాజికాభివృద్ధి. భూస్వామ్య వ్యవస్థతో ఆరంభమైన యూరోపు, పదహారోశతాబ్దంలో వ్యాపారోద్యమ సంస్థగా, పరివర్తనం పొందింది. పద్దెనిమిదోశతాబ్ద మధ్యకాలం తరువాత, పారిశ్రామిక మూలధనీకరణ వ్యవస్థగా, జాతీయ వ్యవస్థగా పురోగమించింది. తద్భిన్నంగా, ఇండియాలో పద్దెనిమిదో శతాబ్దాంతం వరకు కూడా, యూరోపులోని, భూస్వామ్య వ్యవస్థతో పోల్చదగిన ప్రాచీన విధానమే, నిలిచి ఉంది. అంతట, పాశ్చాత్య సంఘట్టన ఫలితంగా, ప్రాచీన వ్యవస్థయొక్క పడికట్టు భగ్నము కావడమూ, తత్ప్రాబల్యంవల్ల పరివర్తన ప్రక్రియ ప్రారంభమై, 'తుది పరిణామం'గా స్వాతంత్ర్యము సిద్ధించడమూ జరిగింది.

చారిత్రిక ప్రక్రియ అనేది, ఆయా ప్రాంతాల అవధులకు మాత్రమే పరిమితమై ఉండదనే సత్యం, ఈ విధమైన ప్రపంచోద్యమంవల్ల ధ్రువమౌతుంది. భూభాగంలోని వివిధప్రాంతాలలో నివసించే జాతులు, ప్రత్యేకంగా ఉన్నారని స్థూలదృష్టికి తోచినప్పటికీ, ఒక ఖండము నుండి మరియొక ఖండానికి వ్యాపించే ప్రభావప్రాబల్యానికి అవి లోనుకాక తప్పదు. కనుక, ఒక దేశంలో జరిగే విషయాలను, తక్కిన భూభాగంలో జరిగే సంఘటనల నుండి వేరుపరచి పరిశీలించడం సాధ్యము కాదు. చరిత్ర అనేది, తాత్త్వికదృష్ట్యా, ప్రపంచ చరిత్రే. భూమిపై మానవజాతి ఏర్పడినప్పటి నుంచీ కూడా, భౌగోళిక ఆవరణం (environment) మాత్రమే కాక, మానవ పర్యావరణం కూడా, మానవజీవిత చరిత్రపై తన ప్రభావాన్ని చూపినది.

ఈ కారణములవల్లనే, పాశ్చాత్య మానవ సంస్థల చరిత్రను పరిశీలించి, జాతీయభావాభివృద్ధిని, ఆదినుండి ఫలసిద్ధివరకు, వివరించవలసిన ఆవశ్యక మేర్పడింది. భారతదేశంలో జాతీయభావం ఉత్పన్నం కావడమూ, కడపట స్వాతంత్ర్యం సిద్ధించడమూ, అనే ప్రక్రియను అర్థంచేసుకోడానికి ఈ పాశ్చాత్య చరిత్ర తోడ్పడుతుంది.

## II. యూరోపులో జాతీయతావికాసం, ప్రాచీన యూరోపుయొక్క నాశం

యూరోపులో జాతీయత ఆలస్యంగా ఉదయించింది. ఐనా, దాని మూలములు చాలలోతున, పురాతన చరిత్రలోనే పాతుకొనిఉన్నవి. యూరోపు జాతీయతా ఉత్పత్తికి, అనేకాంశాల సంయోగం, తోడ్పడింది. కాని, ఆ అంశాల కార్యప్రక్రియ జరిగింది వివిధకాలాలలో. వీటిలో, జాతి, సంస్కృతి, అనే రెండూ అతిప్రాచీనకాలం నాటివి. యూరోపు రాజ్యాలలోని జాతిసంయోజనం, దేశానికీ దేశానికీ భిన్నమైఉన్నా, వాటిలోని ప్రధానమూలాంశం మాత్రం, ఆర్యజాతి సంబంధమైనది. క్రీ.పూ. ద్వితీయ సహస్రాబ్దిలో, ఆర్యులు ఈ ప్రాంతాలలో నెలకొనడానికి ఆరంభించిరి. ఆర్యజన- జాతులలో గ్రీకులు, రోమనులు అతిశయమైన విజయాన్నీ, కీర్తిప్రతిష్ఠలనూ సాధించినారు. వారు స్థాపించి పోషించిన సంస్కృతులు, ఆధారపీఠాలుగా, నేటి యూరోపు జీవితసౌధాలు నిర్మితములైనవి.

నివాసాలు ఏర్పరచుకొన్న ఆర్యజాతులలో గ్రీకులు, రోమనులు ప్రథములు. సంస్థాస్థాపకులు గ్రీకులు. స్కాట్‌లండ్‌నుంచి ఇరానువరకూ వ్యాపించిన సామ్రాజ్యమంతటా, రోమనులు, పురాతన గ్రీసుసంస్కృతిని వ్యాపింపజేసిరి. ఈ సామ్రాజ్యం అనేక శతాబ్దాల కాలం నిలిచినది. ఈ సామ్రాజ్యం తుదకు అనాగరకజాతుల చేతులలో శిథిలమయింది. ఈ అనాగరక వర్గాలుకూడా పూర్వం, ఆర్యశాఖలోనివే. కాని, వీరు రైన్, డాన్యూబ్‌నదులకు అవతలి భూభాగాలలో నివసించినవారు. ఆర్యుల ఈ రెండవ స్థానాంతరణ (Migration) తరంగంవల్ల మిక్కిలి అర్థవంతములైన పరిణామాలు కలిగినవి.

అనాగరకట్యూటానిక్ జనజాతులు, సామ్రాజ్య ప్రాంతములలో ప్రవేశించడం చాల పూర్వమే జరిగింది. పలుశతాబ్దాలవరకు సామ్రాజ్యపు సరిహద్దులు స్థిరంగా, నిలిచి ఉండినవి. సామ్రాజ్యరక్షణకు సమర్థమైన పథకాన్ని, రోమను సార్వభౌములు కూర్చియుండడంవల్ల అనాగరకజాతులవారికి ప్రవేశం లభించలేదు. కాని, ఆంతరంగికములైన ఒత్తిడులవల్లనూ నిర్బంధములవల్లనూ, తరువాతికాలంలో సామ్రాజ్యముయొక్క శక్తిసామర్థ్యములు క్షీణించినవి. క్రీ.శ. 378లో ఆడ్రియనోపాల్‌వద్ద జరిగిన యుద్ధములో, రోమన్ సేనలు పూర్తిగా అపజయాన్ని పొందినవి. సార్వభౌముడైన వ్యాలెన్స్, యుద్ధంలో హతుడైనాడు. ఆపై నూరు సంవత్సరాలలోగా, గాథ్, వ్యాండల్, ఫ్రాంక్‌జాతులూ, ఇతర ట్యూటానిక్ జనజాతులూ, సామ్రాజ్యంపై వ్రాలి, ప్రాంతాలను ఆక్రమించుకొన్నవి.

రోమన్ రక్షణ స్థానాలను ట్యూటానిక్ జనజాతులు పడగొట్టుచుండిన కాలంలోనే, మరియొక ప్రాణాంతకమైన అపాయం ఏర్పడింది. హూణులు ఏషియాటిక్ సమశలాల పైబడి వ్యాపించి, రష్యా దక్షిణ భాగంలో చొచ్చుకొనిపోయి, తూర్పు పడమర ప్రాంతాలలోని, గాథ్‌జాతులను అణచివేసి, రైన్‌నది వరకు తమ ఆక్రమణను సాగించిరి. తర్వాత, తమ

నాయకుడైన ఆటిల్లా సైన్యాధిపత్యంలో, ఒక మహాసైన్యంగా బయలుదేరి, రైన్‌నదిని దాటి, నేటి, ఫ్రాన్స్ అనే గాల్ ప్రాంతాన్ని ప్రవేశించిరి. కాని, మారియేకస్ వద్ద జరిగిన (క్రీ.అ. 451) యుద్ధములో రోమనుల ప్రతిష్ఠ నిలబడింది. హూణుల ప్రవాహం వెనుదిరిగింది. రోమను సైన్యానికి సిద్ధించిన అంతిమ విజయమిది. శీఘ్రకాలంలోనే, క్రీ. అ. 476 లో, రోము, గాథుల హస్తగతమైపోయింది. అంతతో సనాతన నగరమని ప్రఖ్యాతిగాంచిన రోము యొక్క మహోన్నత భవనం, మట్టిలో కలిసిపోయింది.

రోమనులు వ్యవస్థీకరించిన జీవనవిధానం సమూలంగా పెకలింపబడింది. నూతనంగా వచ్చి నెలకొన్న జాతులు తమ స్వంతప్రవర్తనలను, ఆచారాలను, సంస్థలను పాటిస్తూ వచ్చిరి. రోమన్ ప్రాచీన సంస్కృతిలోని అవశేషాలను ఈ జాతులవారు గ్రహించినారు. కాని, యూరోపులో నూతన సంస్కృతి ఉత్పన్నమయింది.

రోము పతనమైన తరువాతి కాలంలో, దాడి వచ్చిన ఈ జాతులు స్థిరపడి, నూతన వ్యవస్థను ఏర్పరచడానికి ప్రయత్నం చేసినారు. ఫ్రాంకులకు పరిపాలకుడైన షార్లిమాన్ (Charlemagne) ఎనిమిదో శతాబ్దంలో, రోమన్ సామ్రాజ్యాన్ని పునరుజ్జీవింప చేసినాడు కూడా. కాని, తొమ్మిదో శతాబ్దంలో కెరోలింజియన్ (Carolingian) విధానంకూడా శిథిలమైపోయింది. అంతట మూడో సంక్షోభ తరంగం బయలుదేరింది. స్కాండినేవియా భూముల లోని ఔత్తరేయులు (Northmen) లేక వైకింగులూ (Vikings), బాల్టిక్ సముద్రతీరము నుంచి స్లావులూ (Slavs), తూర్పు నుంచి మగ్యారులూ (Magyars), దక్షిణం నుంచి స్యారసీనులూ (Saracens), యూరోపులోని ట్యూటానిక్ సంఘాలకు ఒత్తిడి కలిగించ సాగిరి. బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ దేశాలలో ప్రవేశించిన వైకింగులు కత్తినీ, అగ్నినీ, కూడా ఉపయోగించి నాశనం గావించిరి. సామ్రాజ్య భూములపై చిరకాలం పర్యటించిన స్లావులు, తూర్పు యూరోపులో స్థిరనివాసం ఏర్పరచుకొనిరి.

ఈలోగా, ఉత్తరాఫ్రికాను జయించిన అరబ్బులు స్పెయినులో ప్రవేశించినారు. అచ్చటి గాథిక్ రాజ్యాలను కూలద్రోసి; పైరెనీసు (Pyrenees)లను దాటి, ఫ్రాన్సులోనికి చొచ్చుకొని ప్రవేశించిరి. కాని, సరిహద్దులవద్ద ఫ్రాంకులు వారిని అడ్డగించి, పురోగతిని ఆపివేసిరి.

ఈ విధంగా భయంకరమైన సామూహిక సంహారంలో, సంక్షోభలో, హింసాకాండలో, యూరోపుజాతుల పునాదులు ఏర్పడినవి. "క్రీ.అ. 476 మొదలు క్రీ.అ. 1000 వరకు సాగిన యూరోపుచరిత్ర అంతా, అరాజకమూ సంక్షోభాత్మకమూ ఐన ఒక యుగంగా బాహ్యదృష్టికి గోచరిస్తుంది. చరిత్రను నడపిన సూత్రాలనుకాని, స్థిరపడిన సంస్థలనుకాని గమనించడానికి సాధ్యంకాదు" అని, వినోగ్రెడాఫ్ (Vinogradoff) వచించినాడు. వలసవచ్చిన జనజాతులు రోమన్ సామ్రాజ్యాన్ని కూలదోసినవి. మగ్యారులు, మూరులు కావించిన దండయాత్రలవల్లనూ, ఔత్తరేయులు జరిపిన దోపిడులవల్లనూ, రోమన్ సామ్రాజ్యానంతరం ఆ స్థానంలో వృద్ధికివచ్చిన జనజాతి సంఘాలమధ్య, అలజడీ కల్లోలమూ ఏర్పడినవి. ప్రాణానికీ, ధనానికీ, అత్యంతమూ ప్రమాదకరమైన పరిస్థితులు ఏర్పడినవి. మధ్యయుగాలలో ఒక రూపాన్ని గైకొన్న యూరోపు సమాజముయొక్క ఆకారాన్ని, ఈ పరిస్థితులే నిర్ణయించినవి. కేంద్రాధికారం అన్నిచోట్లా లోపించడంతో, పన్నులవిధానం కూడా నశించింది.

ఆర్థికవ్యవస్థ అస్తవ్యస్తమైనందువల్ల విస్తారమైన సంఘవర్గాలకు జీవనాధారం కరవయింది. ఉత్పత్తి వెనుకబడి, వ్యాపారం క్షీణించింది. కనుక వినిమయ హీన ఆర్థికవ్యవస్థతో (Natural economy) యూరోపు మరల జీవితాన్ని ప్రారంభించవలసి వచ్చింది. హింసాకాండనుంచి ఆత్మరక్షణ, జీవనానికి ఆధారములైన ప్రాథమిక పదార్థముల సంపాదన, అనే రెండూ మానవుని ముఖ్యసమస్యలైనవి. ఈ సమస్యల పరిష్కారం, నూతన సామాజిక వ్యవస్థ స్థాపనపై ఆధారపడింది. అట్టి వ్యవస్థను ఏర్పరచడానికై రోమన్, ట్యూటానిక్ సంప్రదాయాలూ, సంస్థలూ సహకరించినవి. తత్ఫలితంగా, భూస్వామ్యరూపమైన సామాజిక వ్యవస్థ ఉదయించింది.

భూస్వామ్య వ్యవస్థయొక్క సృష్టి : భూస్వామ్య విధానంతోకూడిన సమాజమే, మూడో యూరోపు. నగర రాజ్యాలతో ఏర్పడిన గ్రీకు - రోమన్ యూరోపు మొదటిది. క్రీ.పూ. ఎనిమిదోశతాబ్దము నుంచి, క్రీ.శ. నాలుగోశతాబ్దం కడపటివరకూ జరిగిన పన్నెండు వందల సంవత్సరాలు ఈ మొదటి యూరోపుయొక్క జీవితకాలం. జనజాతి సంఘాలతో ఏర్పడి, ట్యూటానిక్ యూరోప్ అని వ్యవహరింపబడిన రెండవ యూరోపు, మొదటి యూరోపుయొక్క వినాశం తర్వాత దాని బుగ్గిలోనుంచి ఏర్పడింది. కాని, తొమ్మిదో శతాబ్దం కడపటినాటికి ఇది కూడా శిథిలమైపోయింది. ఈ విధంగా, యూరోపు నాగరకత యొక్క క్రమాభివృద్ధి రెండుసార్లు భగ్నమయింది. భూస్వామ్య వ్యవస్థ అనే మూడో యూరోపుయొక్క జీవనగతి తొమ్మిదోశతాబ్దంలో ప్రారంభమయింది. అది, క్రమక్రమంగా ఒక విలక్షణమైన నాగరకతను పెంపొందించుకొన్నది. ఈ నాగరకత, పదమూడోశతాబ్దం నాటికి అత్యుచ్ఛదశకు వచ్చింది.

పదమూడో శతాబ్దంనుంచి, పశ్చిమ యూరోపుజాతులు భూస్వామ్యవిధానం నుంచి బైటపడి, జాతీయరాజ్యాలుగా అభివృద్ధిచెందడానికి ప్రారంభించినవి. ఈ రూపాంతరీకరణం అనేక విప్లవాలఫలితం. మధ్యయుగాలలో యూరోపుయొక్క ఆకారాన్ని ఏర్పరచిన అచ్చును బద్దలుకొట్టడానికై ఉత్పన్నమైనవి ఈ విప్లవాలు. ఇట్లు జరిగిన రూపాంతరీకరణము పద్దెనిమిదోశతాబ్ద మధ్యకాలానికి పూర్తిఅయింది.

మానవుని ఉనికికి ఆధారాలైన మూడు ప్రాథమికావసరాలను అనుసరించి భూస్వామ్య వ్యవస్థ సృష్టికివచ్చింది. అవి,- (1) ప్రాణరక్షణ, (2) దేహపోషణానికి అవసరములైన పదార్థాల ఉత్పాదన, (3) నైతిక మతవిధానముల ద్వారా ఆంతరంగిక సంఘర్షణం పరిష్కారం,- అనేవి.

మానవుని ఉనికికి ఆహారం ఆవశ్యకము. కాని, ఆహారంతో మాత్రమే అతని జీవితం పరిపూర్తికాదు. ఆత్మసంతృప్తికి సంబంధించిన అవసరాల ఒత్తిడికూడా అతనిపై ఉంది. దేహావసరముల కంటె కూడా, ఆత్మతృప్తిని కూర్చే ఆవశ్యకాలు ఎక్కువ ప్రబలములైనవి. ఆశలూ, భయాలూ, మానవుని జీవితాన్ని సంశయగ్రస్తుని చేస్తాయి. ఆశలను పూర్తికావించు కోడానికీ, భయాలను తొలగించుకోడానికీ అతడు సదా ప్రయత్నిస్తాడు. మధ్యయుగకాలపు యూరోపులోని భయంకర పరిస్థితుల్లో, జీవితాన్ని చుట్టుముట్టిఉన్న పీడలనుంచి తప్పించు కోవలెనని మానవుని కోరిక. సౌమ్యమూ, నీతియుక్తమూ ఐన ప్రవర్తన విధానాలను ఆత్మ అపేక్షిస్తుంది. సామాజిక దౌర్జన్యముపట్ల విముఖతా, అవినీతి, క్రౌర్యము, హింస, అనువాని

పట్ల అసహ్యమూ, మానవునికి కలిగింది. మానసికములైన ఉన్నతాశయాలను పరిపూర్తి పొందించుకోడానికి, తన ప్రతిష్ఠను సమర్థించుకోడానికి, తన అంతరంగిక స్వేచ్ఛాభావాన్ని నలిమివేస్తున్న సాంఘిక రాజకీయ శృంఖలాలను సడలించుకోడానికి, అతనిలో ఒక ప్రబలమైన ప్రేరణకలిగింది.

ఈ విధంగా సైనిక, ఆర్థిక, మతవిషయికములు అనే మూడు అంశాలు, మధ్యయుగాల యూరోపు యొక్క సాంఘికార్థిక వ్యవస్థను రూపొందించినాయి.

ఈ విధానం అభివృద్ధిచెంది, పదమూడోశతాబ్దంలో పరిణతస్థితికి రావడానికి మూడు వందల సంవత్సరాలకాలం పట్టింది. తర్వాత క్రమంగా క్షీణదశ ఆరంభమై, భూస్వామ్య-ఆర్థికవ్యవస్థ నశించి, పర్యవసానంలో వ్యాపారోద్యమ ధనీకరణవిధానం ఏర్పడింది. భూస్వామ్య విధానాన్ని అనుసరించిన ఉత్పాదనవిధానాలు, విస్తృతిచెందుతున్న సమాజము యొక్క అవసరాలను తీర్చలేకపోయినవి. అందువల్ల, ఉత్పాదన సాధనములకు యజమానులైన వారితో, కార్మికులకు గల సంబంధాలు తెగిపోయినవి. ఈ సంబంధ విచ్ఛేదనం యూరోపులోని వివిధదేశాలలో వివిధకాలాల్లో జరిగింది. భూస్వామ్యవ్యవస్థ ఇంగ్లాండులో పదహేడో శతాబ్దంలో అంతరించింది; ఫ్రాన్సులో పద్దెనిమిదోశతాబ్దాంతంలోనూ, జర్మనీ రష్షియాలలో తరువాతికాలంలోనూ, అంతరించింది.

సైనికసేవతో వ్యవసాయభూముల కట్టుబడి జతపడి యుండడమే భూస్వామ్యవిధానం యొక్క సారాంశం. వ్యక్తికీ వ్యక్తికీగల విలక్షణమైన ఆధారసంబంధముపై ఈ విధానము సిద్ధించింది. ఆశ్రితుడైన వ్యక్తిని పోషించడానికీ రక్షించడానికీ, ఉన్నతస్థితిలో ఉన్న వ్యక్తి, బాధ్యతవహించినాడు. తన సేవనూ, తాను కష్టించినఫలంలో భాగాన్నీ, తన సహకారాన్నీ, ఉపకారభారాన్నీ, స్వామినిష్ఠనూ పాటిస్తానని ఆశ్రితుడైనవాడు వాగ్దానం గావించినాడు. ఆశ్రితుడైన వాని అవసరం ముఖ్యమైనది కనుక, కరారులో నిబంధనలు అతనికి భారమైనవి. స్వామి భృత్యసంబంధం పరస్పరము వ్యక్తిగతమైనది. ఈ సంబంధము, పరస్పర కర్తవ్య భారాలను ఇద్దరికైనా విధించి, అధికార క్రమబద్ధమైన సంఘాన్ని నిర్మించింది.

ఈ క్రమబద్ధమైన శ్రేణిలో రెండువర్గాలు చేరియున్నవి. భూమికి స్వంతదారులైన కులీనులు, లేక, అల్పసంఖ్యాకులైన ఉన్నతవర్గంవారూ; శ్రమించి, వ్యవసాయంచేసి, ఆశ్రితులైయున్న ప్రజానీకమూ,- ఈ రెండువర్గాలు. ఈ ప్రజానీకానికి స్వతంత్ర కార్యనిర్వాహకులు, కృషకదాసులు (కమతగాండ్లు) అని వ్యవహారం. భూస్వాములైన కులీనులలో కూడా యుద్ధవీరులు, పురోహితులు అని రెండువర్గాలు ఏర్పడినవి. ఈ విధంగా శ్రమించేవారు, యుద్ధంచేసేవారు, భగవత్ప్రార్థన గావించేవారు అని మూడువర్గాలు, భూస్వామ్యవిధానంలో మూడు అంశాలుగా ఏర్పడినవి.

**భూస్వామ్య విధానంలో గ్రామం :** భూస్వామ్య సమాజంలో ప్రతిగ్రామమూ ప్రమాణసంస్థ (Unit) గా ఉండేది. దీనికి వివిధదేశాలలో వివిధవ్యవహారం ఉండేది. ఇంగ్లాండులో మేనర్ (Manor) అని, ఫ్రాన్సులో సేన్యర్ (Seigniurie) అనీ, జర్మనీలో గ్రంధర్‌షాఫ్ట్ (Grundher schaft) అనీ, ఇట్టి ప్రమాణగ్రామాన్ని వ్యవహరించేవారు. గ్రామములోనూ దాని అధికారక్షేత్రములోనూ కట్టడాలు, వ్యవసాయభూములు, పచ్చికబయళ్ళు, కర్రను, కలపను ఒదిగించే అడవులు ఉండేవి. గుంపులుగా ఏర్పడిన రైతుల

ఇండ్లు, సువిసెలు, భూస్వామి భవనము, భవనానికిచేరిన ఉపబంధాలు, వృషవాటికలు, కొన్ని గ్రామాలలో చర్చి,- మొదలైనవాటితో గ్రామం ఏర్పడి ఉండేది. గ్రామానికి బైట పొలాలుండేవి. ఈ వ్యవసాయక్షేత్రం రెండు అసమానములైన భాగాలుగా విభక్తమై ఉండినది. చిన్నభాగం, గ్రామయజమానియొక్క ప్రత్యేకస్వత్వం. పెద్దభాగాన్ని రైతుకుటుంబాలు పంచుకొని ఉపయోగించుకొనేవారు. రైతు అనుభవంలో ఉండే, జమీనును వైగ్రేట్ అనీ, యార్డ్‌ల్యాండ్ (Yard land) అనీ, వ్యవహరించేవారు. ఈ జమీనుయొక్క ప్రమాణ విస్తీర్ణం ముప్పై ఎకరాలు. భాగస్థులలో ప్రతి కుటుంబానికీ, నియమితమూ స్థిరమూ ఐన భాగం ఉండినది. నాలుగు వైగ్రేట్లు మొదలు అర్ధ వైగ్రేటువరకు వైశాల్యంతో ఇట్టి భాగాలు ఏర్పడినవి. కాని, ఈ క్షేత్రభాగం సంక్షిప్తంగా ఒక్క చోటనే ఏర్పడింది కాదు; ఒక్క గుంపులోనిది కూడా కాదు. సాధారణంగా ఒక్క రోజులో దున్నడానికి అనువైన ఎకరా వైశాల్యంగల చిన్న చిన్న పొడుగాటి ముక్కలు, వ్యవసాయ క్షేత్రంలో, అక్కడక్కడ చెదరి ఉండేవి. కర్ర దూలాలుకాని, లేక, దున్నక విడిచి పెట్టిన గడ్డినేలలు కాని, ఈ పొలం చీలికలను వేరుపరచేవి. క్షేత్ర విభాగం, ఈ విధంగా ఉండడంవల్ల, సహకార విధానాన్ని అనుసరించిన వ్యవసాయం ఆవశ్యకమయింది. కాబట్టి, ఎనిమిది గుర్రాలు కట్టిన పెద్ద చక్రాలుగల నాగళ్లను జతపరచి, వ్యవసాయాన్ని సాగించేవారు. ఒంటరి వారైన రైతులు, చక్రాలు లేని నాగళ్లను ఉపయోగించేవారు.

జీవితానికి ఆవశ్యకములైన పంటలన్నీ గ్రామం పండించేది. గోధుమ, రై (Rye), మొదలైన ఆహార ధాన్యపు పంటలూ, బార్లీ, ద్రాక్ష మొదలైన పానీయాలు తయారుచేసే పంటలూ, పశువుల ఆహారపు పంటలైన ఓట్స్ (Oats), చిక్కుడు (Beans), బటాణీ (Peas), మొదలైనవీ, వస్త్రముల నేతకు ఉపయోగించే అవిసెనార (Flax) ఇత్యాదులు పండించేవారు. ఒకటి, రెండు, లేక, మూడు పొలాల ఆధారంగా, పంటల విధానం ఏర్పడింది. పురాతనమైన వ్యవసాయ పద్ధతి కావడంవల్ల, లాభకి స్వల్పము. ఉత్తమ పద్ధతులను ప్రయోగించడానికి తగిన ప్రోత్సాహం రైతుకు కలుగలేదు. కాబట్టి, తూమెడు విత్తనపు గింజలను నాటగా పంటనుంచి లభించేది నాలు గైదు తూములు మాత్రమే.

గ్రామంలో నివసించే వారి విభాగం, ఈ క్రింది విధమై ఉండేది. (1) స్వతంత్రులైన రైతులు, కార్మికులు. మరిన్నీ, సెర్ఫ్, లేక, విలెన్ అని వ్యవహరింపబడే కృషకదాసులు, (2) వడ్రంగులు, చమార్లు, కమ్మరులు, సాలెవాండ్లు, వడికేవాళ్ల, రొట్టెలు కాల్చేవాళ్ల-మొదలైన చేతి పనివాండ్లు: (3) భూస్వామి సిబ్బంది ఐన,-కార్య నిర్వాహకుడు, ఉగ్రాణపు వారు, పంటల తనఖీదారు, భూమియొక్క స్తోమతను అనుసరించి ఇతర గుమాస్తాలు. (4) భూస్వామియొక్క కుటుంబమూ, అతని పరిచారకులు. (5) క్రైస్తవ పురోహిత వర్గము. మొదటి మూడు వర్గాలలోని వారు, కులీన సంస్థకు చెందినవారు కారు. కడపటి రెండు వర్గాలలోని వారు, కులీనులు. ఈ విధంగా కులీనులు, కులీనేతరులు అని సమాజంలో, రెండు వర్గాలు ఏర్పడినవి. ఈ రెండు వర్గాలవారి మధ్య ఏర్పడిన విచిత్ర సంబంధాలు, తమ విలక్షణ స్వభావాన్ని, భూస్వామ్య సమాజానికి సిద్ధింపచేసినవి. వారి జీవితాలకు సంబంధించిన ఆర్థిక, సాంఘిక, రాజకీయ భాగాలన్నీ, ఈ సంబంధాల ప్రాబల్యానికి లోనైనాయి. వీరు అవలంబిస్తూ వచ్చిన విచిత్రములైన ఉత్పాదన విధానాలు, ఈ సంబంధాలను

నిర్ణయించినవి. ధనీకరణ విధానం వృద్ధిచెంది వీటిని తొలగించేవరకూ, ఈ పద్ధతులే సాగుతూ వచ్చినవి. పది, పదకొండో శతాబ్దాలలో గ్రామీణ జనాంగమంతా కృషకదాస వర్గం వారే. తరువాతి కాలంలో, స్వతంత్ర వ్యక్తుల సంఖ్య వృద్ధిచెంది, కడపటికి కృషకదాస వర్గం రద్దుచేయబడింది. ప్రతి దాస కుటుంబానికీ, గ్రామంయొక్క భూస్వామి ఒక ఇంటినీ, వ్యవసాయ క్షేత్రంలో విభాగములైన చిన్న పొలాలనూ ఇచ్చేవాడు. అదికాక, గ్రామానికి చెందిన పసరిక బయళ్ళను, పశువుల మేతకు ఉపయోగించే పచ్చిక పొలాలను, అడవులను, చేపలు పట్టడానికై, నదిని, వీరు ఇతర గ్రామస్థులతో సహా, ఉపయోగించుకోవచ్చు. రైతు అనుభవిస్తూన్న జమీను అతని జీవిత కాలావధికి మాత్రమే, పూర్వము కరారై ఉండినది, కాని, తర్వాత, అది, వంశపరంపరమైన హక్కుగా సిద్ధించింది. కాని, జమీను అనుభవానికి సంబంధించిన నిబంధనలు చాల పీడాకరములై నట్టివి. సంఘంలో కృషక దాసునికిగల స్థానం, రమారమి దాస్యంతో సమానమైనదే. ఇది మొదటి చిక్కు.

దాస్యవర్గానికి చెందిన వ్యక్తులను కొని అమ్మినట్లుగా, వీరిని చేయడానికి వీలులేదు, కాని, జమీనుకు కట్టుబడి ఉండడంవల్ల, వీరు భూస్వామిని వదిలిపెట్టి పోవడానికి సాధ్యం కాదు. తప్పించుకొని పోవడానికి ప్రయత్నిస్తే వానిని వెంట తరిమి పట్టుకొని, జుల్మానా విధించే హక్కు భూస్వామ్యవిధాన సంప్రదాయ ప్రకారం, భూస్వామికి కలదు. తన అనుభవంలో ఉండే పొలాన్ని భూస్వామి అనుమతి లేనిదే అమ్మడానికిగాని, పరాక్రాంతం చేయడానికిగాని, హక్కులేదు. న్యాయ విధానానికి, సాంప్రదాయానికి ఏర్పడియుండిన ప్రాబల్యంపై, రైతుకూ, భూస్వామికీ మధ్యగల సంబంధం ఆధారపడింది.

రైతుయొక్క బాధ్యతలను, మూడు వర్గాలుగా ఏర్పరచవచ్చు. జమీనును అనుభవించినందుకై, జమీనును అంటిపెట్టుకొని యుండే సేవ, అదనపుసేవ, వస్తు రూపంగానూ ధన రూపంగానూ చెల్లించే సేవ,-అని మూడు విధములైన సేవా బాధ్యతలు జీతగానిపై ఉన్నవి. 'వారపు పని' (Week work) అనేది మొదటి సేవకు సంబంధించిన విలక్షణమైన సేవ. భూస్వామియొక్క స్వంతపొలంపై పనిచేయడానికై సాధారణంగా, వారానికి మూడు రోజులు ఒక వ్యక్తిని సరఫరా చేయడం కృషకదాసుని కర్తవ్యం. అంతేకాక, స్వామి పొలంలో సేద్యానికై తన నాగలినీ ఎద్దులనూ ఇవ్వడము, స్వామి ప్రయాణాలకై తన బండినీ గుర్రాన్నీ పంపడము,-ఈ బాధ్యత లోనివే.

కోతలకాలంలో పంటను కోయడము, ధాన్యాన్ని కూడవేయడము, స్వామి భవనానికి దానిని చేర్చడము అనే బాధ్యతలు, 'ప్రసాద సేవ' అని వ్యవహరింపబడిన అదనపు సేవలో చేరినవి. ప్రభువుకు చెందిన కంచెలను, గట్లను, కాలువలను, కందకాలను, రోడ్లను, వంతెనలను, కట్టడములను, చెరువులను, బాగుచేయడం కూడా ఇతని కర్తవ్యమే. ప్రభువుయొక్క గొర్రెలను పెంచి, ఉన్ని తీయడంకూడా, ఇతడే చేయవలసి ఉంది.

వస్తురూపంగా ప్రభువుకు చెల్లించవలసినవి, పొలంలో ఉత్పన్నమైన సరకులు. ధాన్యము, ఓట్స్, ఎండు గడ్డి, కోళ్ళు, గ్రుడ్లు, చేపలు, బీరు సారాయి, తేనె, మైనము,- మొదలైనవాటిలో భాగం, ప్రతిసంవత్సరమూ రైతు, ప్రభువుకు చెల్లించవలెను. తాను పెంచు కొంటున్న ఎద్దులు, గొర్రెలు, పందులు, మేకలు, ఇత్యాదులపై సుంకమును ధనరూపంలో కాని, వస్తురూపంలోకాని, ప్రభువుకు చెల్లించేవాడు.

ధనరూపంలో చెల్లించవలసిన బాధ్యతలు, రుణాలు అనేకములు ఉండినవి. వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అరికట్టే పన్నులు మొదటివర్గానికి చెందిన బాధ్యతలలో చేరినవి. కుటుంబంలోని ప్రతివ్యక్తిపైనా విధింపబడిన 'ప్రతివ్యక్తికరం' (Capitation tax) ప్రతి సంవత్సరమూ ప్రభువుకు చెల్లించవలసిందే. బిడ్డను పెళ్ళిచేయడానికి 'పెళ్ళిపన్ను' (Merchet), కొడుకును బడికి పంపడానికి 'విద్యాశుల్కం',- రైతు చెల్లించుకొనేవాడు. జమీనును అనుభవిస్తున్న రైతు సంతానం లేనివాడై చనిపోతే, ఆ జమీనును గ్రహించివేసే హక్కు భూస్వామికి ఉన్నది. ఆస్తికి వారసులుండినట్లయితే 'హెరియట్' (Heriot) అని పిలువబడిన ఉత్తరాధికారాన్ని ఇచ్చుకోవలసి ఉండేది. రైతువద్ద ఉన్న పశువులలో ఉత్తమోత్తమమైన దానిని ఈ విధమైన పన్నుగా ప్రభువుగ్రహించేవాడు. కృషకదాసుని కుటుంబములోని వ్యక్తుల సంఖ్యనుబట్టి, విధించేపన్నుకు, ట్యాలేజ్, లేక, టైల్ (Tallage or taille) అని వ్యవహారం. ఈ పన్ను కూడా రైతు చెల్లించవలసిందే. జమీనుకట్టుబడికి సంబంధించిన చెల్లింపులు రెండోవర్గంలోనివి. సంప్రదాయాన్నిబట్టి నిర్ణయమై చెల్లించవలసిన ధనం, శెన్స్ (Cens) ఒకటి. దానిని చెల్లించకపోయిన పక్షంలో జమీనును, లాక్కొంటారు. పరిహారము (Relief) అనే చెల్లింపు మరియొకటి. రైతు మరణానంతరం, అతని జమీనును విడుగడ కావించుకోడానికై ఒక సంవత్సరపు గుత్తను ఉత్తరాధికారి చెల్లించవలసి ఉంటుంది. అదే ఈ పరిహారం. దశాంశము (Tithe) అనేది మూడవది. జమీనుపై వచ్చే ఉత్పత్తిలో పదవ భాగానికి విలువకట్టి, దానిని, చర్చికు చెల్లించవలసియుండేది. ఈ మూడేకాక, చెల్లించవలసిన రుణాలు ఇంకను పెక్కులు ఉండినవి. జమీనును అమ్మే అనుమతి పొందడానికై చెల్లించవలసిన రుసుము (Fee), రోడ్లు, వంతెనలు, రేవులు, పర్వత మార్గాలు, ధాన్యము, ఉప్పు, ఆహారము, ఇతర సరకులు, మొదలైన వాటి అమ్మకంపై శుల్కాలు, అంగళ్లు, బజార్లు, సంతలు ఇత్యాదులకై అనుమతి రుసుములు,- మొదలైనవెన్నో ఉండేవి.

ధన రూపంగానూ, వస్తురూపంగానూ చెల్లించవలసినవే కాక, భూస్వామి అవశ్య కర్తవ్యాలుగా విధించిన సామాన్య విషయాలుకూడా, ఉన్నాయి. భూస్వామియొక్క మరలో పిండి ఆడించుకోవడం, అతని పొయ్యిలో రొట్టెలు కాల్చుకోవడం, అతని గానుగలోనే ద్రాక్షనుంచి రసాన్ని, ఆలివ్ గింజలనుంచి నూనెను తీసుకోవడం. అతని చర్మశాలలోనే చర్మాలను పదును చేసుకోవడం,- ఇత్యాదులన్నీ నిర్బంధాలే. వంటకుగాని, ఇంగ్లు కట్టడానికిగాని అడవినుంచి కర్రను తీసుకోడానికి, పచ్చిక ప్రదేశాలలో పశులు మేపుకోడానికి, నదులలో చేపలు పట్టడానికి శుల్కాలు ఉండినవి.

ఇన్ని విధములైన భారాలను ఓపికతో మోస్తూ ఉన్నా, జమీను అనుభవకాలం విషయంలో రైతుకు భద్రత లేకపోవడం భూస్వామ్య విధానముయొక్క ప్రధాన లక్షణం. భూస్వామి ఇష్టప్రకారం జరిగే తీర్మానానికి అడ్డము లేదు. తన చుట్టు పక్కల వారితో ఏర్పడిన వివాదాలను, భూస్వామి అధ్యక్షతలో నడిచే న్యాయసభకు తెచ్చే అవకాశం ఉన్నది. కాని, భూస్వామితో వచ్చే తగాదల విషయంలో రాజ్య సంబంధమైన న్యాయ సభలు జోక్యం కలిగించుకోవు. కనుక, జాగీరుదారుకు విరుద్ధంగా రైతుక న్యాయం లభించే అవకాశమే లేదు. న్యాయ శాసనానికిగల ప్రతిష్ఠ, భూస్వామ్య సంప్రదాయానికి సిద్ధించి ఉండడంవల్ల, రైతు రక్షణ భద్రతలకు సంప్రదాయ మొక్కటే గతి. జాగీరు

దారు యొక్క కార్యరూపమైన అవసరాలూ, అతని పొలం వ్యవసాయమూ, లాభాలూ, అన్నీ-కృషకదాసుడు మనఃపూర్వకంగా చేసే సేవపై ఆధారపడినవి. ఇది భూస్వామ్య సంప్రదాయం.

ఐనా, ఈ రైతు దుఃఖమయ చరిత్ర ఇంతతో పూర్తికాలేదు. సాధారణంగా, జాగీరుదారు గ్రామంలో నివసించడు. అప్పుడప్పుడు వచ్చిపోయే వాడు. అతడు వచ్చిన సందర్భాలలో అతనిని తగిన విధంగా సత్కరించడం రైతుయొక్క బాధ్యత. జాగీరుదారు వెంట అతని సిబ్బందీ, సేవకులూ, గుర్రాలు, కుక్కలు, డేగలు మొదలైనవన్నీ రావలసిందే. ఈ సమూహాని కంతటికీ మృష్టాన్న భోజనంతో, రైతు విందు చేయవలసి ఉండేది. ఇక, భూస్వామి గృహ నిర్మాణము,-మొదలైన అసాధారణ సందర్భాలలో, రాళ్ళను సరఫరా చేయడమేకాక, బండ్లను, భారవాహక పశువులను కూడా రైతు సమకూర్చవలసి యుండేది. యుద్ధ సమయంలో, జాగీరుదారు భవనానికి రక్షణగా కాపలా కాయడం, దుర్గానికి సంబంధించిన రక్షక నిర్మాణాలను చేయడం, కందకాలు తవ్వడం, కర్రలతో కంచెలు నిర్మించడం,-మొదలైన కార్యాలన్నీ చేయడమూ, ప్రభువు దాటి వెడలినప్పుడు అతనిని అనుసరించి వెంటపోవడమూ, రైతువర్గముయొక్క కర్తవ్యాలు.

కృషకదాసులు శ్రమిక వర్గంగానూ, స్వతంత్ర రైతులు ఉత్పాదక వర్గంగానూ, గ్రామ వ్యవస్థ ఏర్పడింది. స్వతంత్ర రైతుల స్థితి కృషకదాసుల స్థితికంటె ఉత్తమమైనది. వారు నివసించే ఇండ్లు మంచివి. ప్రాంగణము చుట్టూ పెక్కు గదులు, చుట్టూతోట, ఉండేటట్టుగా, ఈ ఇండ్లు నిర్మితములై ఉండినవి. గ్రామంలోని వ్యవసాయ క్షేత్రంలో వీరికిగల భాగంకూడా, కృషకదాసుల విషయంలో వలెనే, చిన్న చిన్న చీలికలుగా అక్కడక్కడ చెదిరి ఉండేది. వాటి వ్యవసాయం కూడా సంప్రదాయ మార్గాలోనే నడిచేది. కాని, అనుభవకాలము కట్టుబడులు వేరై ఉండినవి. స్వతంత్ర కర్షకులు, కౌలు, లేక, గుత్తదారులుగా, జమీనును శాశ్వతమైన కట్టుబడిపై అనుభవించేవారు. ఈ జమీనుపై, నియమింపబడిన గుత్తకూడా శాశ్వతమైనదే. దానిని పెంచడానికి వీలులేదు. అనుభవంనుంచి వీరిని తొలగించడానికి కూడా వీలులేదు. జమీనును స్వేచ్ఛగా అమ్మడానికీ, తమ ఇష్ట ప్రకారం మరణ శాసన పత్రం ద్వారా ఇవ్వడానికి, లేక పరాక్రాంతం చేయడానికి, విభాగించడానికీ కూడా వీరికి హక్కు ఉన్నది. కాని, జాగీరుదారుకు ముట్టవలసిన బాకీ మాత్రము,-అనగా, నియతమైన గుత్త, ఒప్పందమైన సేవ,-ఎడతెగక చెల్లించవలసిన షరతు మాత్రం, రైతు పాటించవలసిందే.

కృషకదాసులపై ఉన్నంత సేవాభారం స్వతంత్ర కర్షకులపై లేదు. గ్రామాన్ని వదలిపోయే స్వాతంత్ర్యం కూడా వారికి ఉన్నది. తమపిల్లలకు వివాహం జరిపించడానికి జాగీరుదారు యొక్క అనుమతిని పొందవలసిన అవసరంలేదు. మరణానంతరం ఉత్తరాధికారి చెల్లించవలసిన రుసుము, గ్రామానికి బైట నివసించడానికి ఇవ్వవలసిన రుసుము, ప్రతివ్యక్తి కరము,- మొదలైనవి స్వతంత్ర రైతులను బాధించవు. జాగీరుదారుకు చెల్లించవలసిన గుత్తలను, చేయవలసిన సేవలను లిఖితబద్ధంచేసిన కరారుల ఆధారంగా, వీరు, జమీనులను అనుభవిస్తూ ఉండిరి. జాగీరుదారు తీర్పులు తృప్తికరంగా లేకపోతే, రాజు న్యాయసభకు మనవి చేసుకొనే అవకాశం కూడా వీరికి ఉండినది. కృషకదాసుల వర్గానికి ఇట్టి అవకాశం లేదు.

కాని, వ్యవసాయ కార్యకలాపాలన్నిటిలోనూ, వీరిస్థితి, కృషకదాసులతో సమానమైనదే. గ్రామసమాజానికి చెందిన వ్యక్తులు కావడంవల్ల, వీరు కూడా గ్రామసంస్థ యొక్క నిర్ణయాలకు బద్ధులే. జమీనులను నిర్వహించుకోవడంలో వీరికి స్వేచ్ఛలేదు. ఏపేటా పంటలను మార్చే విషయంలోను, సార్వజనికములైన అవకాశాలను ఉపయోగించుకోవడంలోను, పొలాలచుట్టూ కంచెలను వేసుకోవడంలోను, వీరు గ్రామ సమాజము యొక్క పద్ధతులను పాటించవలసిందే. కోతల సమయంలో కొంతకు కొంత సహాయం చేయవలసిన బాధ్యతకూడా వీరిపై ఉన్నది.

జాగీరుదారుకు ప్రత్యేకించబడిన భూములలో పూర్తిగా, అతని ప్రయోజనార్థమే వ్యవసాయం సాగుచుండేది. కృషకదాసుల పొలాలు, స్వతంత్ర కర్షకుల పొలాలు, చెదరియుండినట్లే ఈ పొలాలు కూడా చెదరియుండేవి. సంక్షిప్తమైన ఒక పెద్ద పొలంగా కాక, వ్యవసాయ క్షేత్రమంతా చీలికలుగా అక్కడక్కడ వెదచల్లినట్లు ఏర్పడినవి. ఈ పొలాల వ్యవసాయపు పనిని, కొంతభాగం శ్రామికజనమూ, కొంతభాగం కృషకదాసులూ చేసేవారు. శ్రామిక జనానికి వస్తురూపమైన కూలి లభించేది. ఇక కృషకదాసులన్ననో, వారపు పనిని క్రమంగా చేయడానికీ, కోతల సమయంలో 'ప్రసాదసేవ' చేయడానికీ, న్యాయరీత్యాబద్ధులైనవారు. ఈ పద్ధతిలో, దున్నడము, విత్తడము, పాయడము, కోతలు కోయడము, కణజము చేర్చడము,- మొదలైనపనులు నిర్వహింపబడేవి. జాగీరుదారునికి చెందిన సరకులు బజారుకు తీసుకొనిపోవడము, అతని భూములను ఇండ్లను, సరియైనస్థితిలో ఉంచడము, అనే పనులు కూడా ఈ విధముగానే జరిగి, అతని ప్రయోజనాలన్నీ సవ్యంగా సాగిపోయేవి.

జాగీరుదార్లందరూ, తమ క్షేత్రంలో నివసించేవారు కారు. అట్లు నివసించేవారు గ్రామ కార్యక్రమాల్లో పాల్గొనేవారు కారు. తన అధికారాన్ని జాగీరుదారు కొందరి అధికారుల వర్గానికి అప్పగించేవాడు. ప్రభుక్షేత్రంలో, నివసించే వ్యక్తుల సంఘంలో వీరిదే ప్రాధాన్యం. కార్యనిర్వాహకుడు, లేక, భాండాగారాధికారి, క్షేత్రవ్యవహారాధికారి (మణియగాడు), గ్రామ సభాధ్యక్షుడు, ఇతర నౌకర్లు,- ఈ వర్గంలోనివారు. కార్యనిర్వాహకునికి పెక్కు జాగీరుల కార్యక్రమాలపై సాధారణ విచారణాధికారం ఉండినది. ఆచారవ్యవహారాలు, న్యాయవిచారణ, కూడా, ఇతని అధీనములోనివే. జాగీరులోని క్షేత్రాలను చూడడము, ప్రభువు యొక్క స్వంతభూములను తనిఖీచేయడము, ఇత్యాది కార్యములను నిర్వహిస్తూ, తన యజమాని యొక్క హక్కులకు భంగం కలుగకుండా చూచేవాడు. రైతులు చెల్లించవలసిన పన్నుల లెక్కలను, రైతులు చేయవలసిన సేవలను, ప్రభువు యొక్క సాధారణ ప్రయోజనాలను గమనిస్తూ ఉండేవాడు. పంట తనిఖీదారులు, ఇతర నౌకర్లు గుమాస్తాలు, ఇతని ఆజ్ఞలోనివారు.

జాగీరు క్షేత్ర నిర్వహణయొక్క ప్రత్యక్ష బాధ్యత కార్య నిర్వాహకునిది. పంట పొలాలను, పచ్చిక భూములను ప్రతి దినమూ చుట్టివస్తూ, వ్యవసాయంలో ఏ లోపమూ కలుగనట్లూ, అప్పగించబడిన పనిని ప్రతి వ్యక్తీ చేసేటట్లూ, చూచేవాడు. యజమాని స్వంత పొలాలలో పచ్చిన అదనపు సరకును బజారులో అమ్మించేవాడు.

గ్రామ సమాజముచే ఎన్నుకోబడిన గ్రామ సభాధ్యక్షుడు జాగీరుదారునకూ, రైతులకూ, మధ్యవర్తి. ఇతడు కృషకదాస వర్గంలోనివాడు. ఇతని ముఖ్యవ్యవహారం రైతులతో సంబం

ధించినట్టిది. స్థాన విషయంలోను, కార్య నిర్వహణల విషయంలోను, ఇతడు పంటల తనిఖీ దారునికి క్రిందివాడు. గుత్తలను వసూలు చేయడము, ఆదాయవ్యయముల లెక్కలను వ్రాసిపెట్టడము ఇతని బాధ్యతలు. గ్రామ సభాధ్యక్షుని ప్రయోజనానికై కొన్ని పొలాలను ఇచ్చినారు. ఈ పొలాలపై పన్నును పూర్తిగా కాని, లేక కొంత భాగం కాని, రద్దు చేసేవారు.

వీరు మాత్రమేకాక, వివిధములైన కార్యాలను నిర్వహించడానికి పెక్కుమంది నౌకర్లు ఉండేవారు. వీరందరూ గ్రామనివాసులే. వీరి సేవకు వివిధ మార్గాలలో బహుమతి లభించేది.

ఆజ్ఞా పత్రాలను, ఆదేశ పత్రాలను కొనిపోయే చారులు (Beadles), హర్కారులు (Radman?), లెక్కలను తనఖీ చేయడానికి ఫిర్యాదులను వినడానికీ ఆడిటర్లు, అడవుల రక్షకులు, నాగలి పట్టేవాళ్ళు, సరకు బండి తోలేవాళ్ళు, గోపాలకులు, పందులను కాచేవారు, గొర్రె కాపరులు, క్షీరశాలను (Diary) నడిపే స్త్రీలు - మొదలైన వారందరూ నౌకర్ల వర్గంలోని వారు. భోజనాలను చూచుకొనే కారబారి (Table Steward), పానీయ గృహపు కారబారి (Cellar man), అశ్వశాలా రక్షకుడు, వస్త్రాలనూ ఆహార పదార్థాలనూ చూచుకొనే అధికారి (Chamberlain), వంటశాలపై అధికారి, వేట కుక్కలను తరిఫీదు చేసేవాడు (Huntsman), వనాధికారి (Forester), మొదలైన వారు కూడా ఉండేవారు. దర్జీవాళ్ళు, శస్త్రకారులు (Armourer) రొట్టెలు కాల్చే వాళ్ళు మొదలైన చేతిపనివాళ్ళ సేవకూడా జాగీరుదారుని కుటుంబము లోనివారికి అవసరమై ఉండేవి. ప్రతి పనినీ తనిఖీ చేయడానికి ఒక గుమాస్తా ఉండేవాడు.

ఈ గుమాస్తాలు, చాలవరకు, స్వతంత్ర రక్షకులకూ కృషకదాసులకూ మధ్యస్థమైన వర్గంగా ఏర్పడి ఉండినారు. కృషకదాసులు అనుభవించే కష్టాలలో కొన్నిటికి వీరుకూడా లోనైనారు. కాని, సాగుబడికై వీరికి నిర్దేశించిన పొలాలను అనుభవిస్తూ, జాగీరుదారుని ప్రత్యక్ష ప్రరిచారకులై ఉండిరి.

గ్రామవాసుల జీవనోపాధికి అవసరమైన పదార్థసామగ్రిని సమకూర్చడము, జాగీరు దారుకు లాభాలను సంపాదించడము,- అనేవి రెండూ జాగీరు ఆర్థికవిధానము యొక్క ఉద్దేశాలు. గ్రామసమాజము, జాగీరుదారుని స్వంతభూముల అధికారులు, అనే యంత్రాంగము ద్వారా ఈ ఉద్దేశాలు సాధింపబడినవి. వ్యవసాయభూమి, గ్రామవ్యవహారములలో పలుకుబడి ఉన్న, స్వతంత్రులూ అస్వతంత్రులూ ఐన గుత్తదార్లు, రైతువర్గము, గ్రామసమాజంగా ఏర్పడింది.

ప్రతి గుత్తదారునికీ, కొంతపొలం నిర్దేశింపబడింది. ఈ పొలం పెక్కు చీలికలుగా వ్యాపించి యుండేది. ఈ పొలం తండ్రినుంచి కొడుకుకు సంక్రమిస్తూ వచ్చేది. కాని, దుక్కి ప్రారంభమైనప్పుడు మాత్రమే పొలాన్ని సేద్యంచేసుకొనే హక్కు ప్రవృత్తిలోకి వచ్చి, కోతలు ముగియడంతోనే ఆ హక్కు అంతమయ్యేది. ఈ మధ్యకాలంలో పొలము గ్రామ సమాజము యొక్క వశంలో ఉండేది. సేద్యపు పద్ధతులనూ, వ్యవసాయ ప్రక్రియలనూ మొత్తం గ్రామం నిర్ణయించేది. బంజరుభూములు, పచ్చికపొలాలు, పచ్చికబయళ్ళు, న్యాయ రీత్యా, జాగీరుదారుని స్వత్వం. కాని, కార్యరూపంగా గ్రామసమాజం వాటిని వశంలోకి తీసు

కొని, గ్రామస్థులు వాటిని ఉపయోగించడానికి తగిన నియమాలను కల్పించేవి. ప్రతి రైతునూ గల పొలంయొక్క పరిమాణాన్ని ఆధారంగా చేసుకొని ఈ నియమాలు ఏర్పడేవి. అడవుల నుంచి కలపను తెచ్చుకోవడము, కంచెలను వంట చెరకుగా వాడుకోవడము, గరికపట్టు (Turf) ఉపయోగించుకోవడము, మొదలైన వాటినికూడా నియమాలద్వారా క్రమబద్ధం కావించినారు.

జాగీరుదారుని స్వంత పొలానికి గ్రామంతో సన్నిహిత సంబంధము ఉండేనది. రెండు విధాలుగా ఈ స్వంత పొలంపై లాభం సిద్ధించేది. (1) రైతులకు గుత్తకిచ్చిన భాగంనుంచి వచ్చే లాభం ఒకటి. (2) బలాత్కారంగా కృషకదాసుల సేవను తీసుకొని, తక్కిన పొలాన్ని సేద్యం చేయించడంవల్ల వచ్చే లాభం రెండవది. జాగీరుదారుని సిబ్బంది జీతాలలో కొంతభాగానికి రైతులు చెల్లించే గుత్త సరిపోయేది.

గ్రామ ఆర్థిక వ్యవస్థయొక్క ద్వైవిధ్యం, ఆస్తిపైగల అధికారానికి సంబంధించిన అభిప్రాయములో ప్రతిబింబించింది. రోమను అభిప్రాయాలను అనుసరించిన ఖండితమైన అఖండత్వం ఆస్తియొక్క లక్షణం. ఆస్తి స్వాధీనమంటున్నది అనడంతో దానిపై ఇతరులకు హక్కులేదని భావం. కాని, మధ్యయుగపు యూరోపులోని భూస్వామ్య సమాజంలో, ఈ రోమను అభిప్రాయం అర్థాంతరీకరణాన్ని పొందింది. ఆస్తిపై అధికారము, లేక, డొమినియమ్ అనేది రెండు శాఖలుగా విభక్తమయింది. ఒకే ప్రదేశ భాగంపై పలువురకు స్వామ్యపు హక్కులు ఉండే పరిస్థితి అంగీకరింపబడింది. ఉత్కృష్టాధికార క్షేత్రము (Eminent Domain) అని వ్యవహరింపబడే ఉన్నతమూ ప్రత్యక్షమూ ఐన స్వామ్యపు హక్కు మొదటిది. స్వప్రయోజనార్థమై ఇతరులను పీడించడము, ఉత్పాదనను అనుభవించడము అనే తగ్గు రకపు హక్కు రెండవది. దీనికే, ప్రయోజక అధికార క్షేత్రము (Useful domain) అని వ్యవహారము. కనుక, పొలంపై సంపూర్ణమూ, ఖండితమూ ఐన స్వామ్యాధికారం కలదని జాగీరుదారుకాని, గుత్తదారుకాని, వాదించలేదు. భూస్వామ్య సిద్ధాంతాన్ని అనుసరించి, భూమి రాజుది. దానిని అతడు ప్రముఖ గుత్తదార్లకు నిర్దిష్టపరచి ఇస్తాడు. వీరు మరల ఆ భూమినే విభాగించి, రాజమాన్యులకు (Barons), జమీందారులకు, పంచి ఇస్తారు. వీరినుంచి స్వతంత్ర కర్షకులూ, కృషకదాసులూ పొలాలను గుత్తకు తీసుకొంటారు.

ఆస్తి హక్కుకు సంబంధించిన న్యాయ శాస్త్ర విషయము ఎట్లున్నప్పటికీ, గ్రామ సంబంధమైన ఆర్థిక జీవితంలో జాగీరుదారొక పరోపజీవి (Parasite). ఆర్థిక సంబంధమైన ఏ పనిని అతడు చేయలేదు; ఐనప్పటికీ సత్ఫలాల నన్నిటినీ గ్రహించి అనుభవించినాడు. తమ జీవనాన్ని గడుపుకోడానికై కర్షకులు తమ పొలాలలో శ్రమించినారు. కాని, వారి శక్తిలోనూ, కాలంలోనూ అధికభాగం జాగీర్దారు పొలాల్లో శ్రమించడానికే బలత్కార సంగ్రహణమై పోయింది.

*కులీనవర్గము - సైనిక వ్యవస్థ :* ఆర్థిక విషయంలో, ఉత్పాదన కొరకు ఏర్పడిన వ్యవస్థ భూస్వామ్య వ్యవస్థ. వ్యవసాయ భూమిపై స్వామ్యాధికారం శాసిస్తున్న జాగీరుదారులకు దాస్యరూపమైన సేవచేస్తూ, పొలాలకు గుత్త ఇచ్చి, సేద్యము సాగించుకొంటూ బ్రతికే శ్రామిక వర్గంతో ఏర్పడింది ఈ వ్యవస్థ. సైనిక వ్యవస్థకూడా భూస్వామ్య వ్యవస్థలో ఒక భాగం. భూస్వాములైన ప్రభువులనుంచి పొందిన వ్యవసాయ క్షేత్రాలను అనుభవిస్తూ,

వారికి సైనిక రూపమైన సేవచేస్తున్న సామంతులతో క్రమబద్ధ శ్రేణీ రూపంగా ఏర్పడినది, ఈ సైనిక వ్యవస్థ.

వ్యవసాయ భూములపై శ్రమించే రైతులు, గ్రామాన్ని రక్షించే సామంతులు,- ఈ రెండు వర్గాలూ జాగీరులో చేరియున్నవి. రెండు వర్గాలవారి కర్తవ్యాలూ, వాటి కాలావధికి సంబంధించిన కట్టుబళ్లూ, కరారు పత్రంద్వారా విహితమై, వారు ఆ పనులలో ప్రవేశిస్తారు. ప్రభు నిష్ఠా ప్రతిజ్ఞకు సంబంధించిన సాంప్రదాయిక ఆచారాన్ని (సేవను అంగీకరించడం) ఇరువురూ పాటించవలసినదే. ప్రభుభక్తిని, విధేయతను పాలిస్తామనే ప్రతిజ్ఞను, ఇరువురూ చేయవలసిందే. వీరికి భూమిని అనుదానం చేయడం, పవిత్ర గంభీరమైన విధంగా జరిగేది. వీరికి భూమిని బదిలీచేసిన దానికి చిహ్నంగా, ఒక జెండానో, కర్ర దండాన్నో, లేక ఒప్పందపు పత్రాన్నో ఇచ్చేవారు. రైతుల విషయానికి సంబంధించిన ఈ వ్యవహారంలో, ఉన్నత భాగస్థుడైన ప్రభువు పరంగా, అతని భాండాగారాధిపతి పాల్గొనేవాడు. రైతుకు అనుదానం గావించిన ఈ కట్టుబడికి ఊడిగమాన్యపు కట్టుబడి (Socage or Villeinage) అని వ్యవహారం: యుద్ధవీరులుగా చేరేవారు కట్టుబడి ఇనాము (Fief or feudum) అని వ్యవహరింపబడిన జమీనును, ఖుద్దుగా ప్రభువునుంచి గ్రహించేవారు. సామాన్యుడైన రైతు విషయంలో జరిగే ప్రధాన సాంప్రదాయ కార్యక్రమం సాధారణమైనది. కులీనులైన రైతుల విషయంలో అది విస్తృతమైన విధంగా జరిగేది.

రైతుయొక్క అనుభవంలోవలెనే, కట్టుబడి ఇనాముల విషయంలో కూడా ప్రభువుకు చెందవలసిన చెల్లింపులకు, చేయవలసిన కర్తవ్యాలకు, సామంతులు కూడాబద్ధులే. ప్రభునిష్ఠా ప్రభుభక్తి ప్రతిజ్ఞలు జరిపిన తరువాతనే ఇద్దరూ సేవను ప్రారంభిస్తారు. కనుక, పొలాన్ని గాని, ఇనామునుగాని, వారసుడు గ్రహించే సమయంలో ఇరువురూ పరిహార ద్రవ్యాన్ని చెల్లించవలసిందే.

రైతుకూ సామంతునికీగల సామ్యం ఇంతవరకే. సామంతుని విషయంలోగల స్పష్టము, ప్రతిషేధ రూపము, ఐన కర్తవ్యాలు, రైతు విషయంలో కంటె భిన్నమైనవి. ప్రభువుకు అపచారం కావించననీ, అతని వ్యక్తినీ, ఆస్తినీ, గౌరవాన్నీ, కుటుంబాన్నీ, ఎదిరించననీ, స్వామిభక్తి ప్రతిజ్ఞా సమయంలో సామంతుడు ప్రమాణం గావించినాడు. ఐనా, ఈ వాగ్దానాలు పరస్పరం వర్తించేవి. ప్రభువూ, అతని సామంతులూ,-రక్షక వీరులూ, జమీందారులూ - కలిసి నివసిస్తూ, కలిసి భుజిస్తూ, యుద్ధాలకు కలిసిపోయేవారు. కనుక, పరస్పర గౌరవ ప్రేమాను బంధాలు, వీరికి ఐక్యం కలిగించినవి. భూస్వామ్య విధానంలో, సామంతుని కర్తవ్యాలను సహకారము, ఉపదేశము (సలహా) అనే పేర్లతో వ్యవహరించినారు. సహకారము అనే దానిలో సైనిక సేవ అనేదికూడా చేరినది. ప్రభువు పాల్గొనే యుద్ధాల్లోను, పరిసర ప్రాంతాలపై జరిపే దాడులలోను, సంవత్సరానికి నలభై రోజులైనా ప్రభువువెంట పోవడం అనే బాధ్యత, సామంతునిపై ఉంది. యుద్ధాల్లో ప్రభువు దేహానికి రక్షకుడుగా నిలుస్తూ, కోటకు రక్షక సైన్యాన్ని సమకూర్చేవాడు. ప్రభువును అనుసరించి యుండి, సేవ చేయడం కూడా అతని బాధ్యత. ధనరూపంగానూ, వస్తురూపంగానూ ప్రభువుకు సహాయం కూడా చేయవలసి ఉండేది. పదవీ స్వీకరణ సమయంలో బహుమతులు, ప్రభువు మారిన సందర్భాలలో పరిహార ద్రవ్యాలు, ఇనామును అమ్మే సందర్భంలో అనుమతి రుసుము,-

మొదలైనవి ఇందులో చేరినవి. అసాధారణములైన సందర్భాల్లో అధిక సహాయం అవసరమయ్యేది. ధార్మిక యుద్ధముల (Crusades) ఖర్చులను భరించడానికీ, ప్రభువును శత్రువుల బంధనము నుండి విడిపించుకోడానికీ, ప్రభువు కుమార్తె వివాహపు ఖర్చులకూ, ప్రభు కుమారుడు యుద్ధ వీర ప్రతిజ్ఞ తీసుకొనే సందర్భములో అయ్యే ఖర్చులకూ, సామంతుడు సహాయం చేయవలసి ఉండింది. ప్రభువుకు ఉచితమైన సలహా నివ్వడం, సామంతుని సేవా క్రమంలోని ఇతర భాగం. ప్రభువుయొక్క ఆస్థాన సభలకు హాజరు కావడము, యుద్ధానికీ, శాంతికీ సంబంధించిన విషయాలను చర్చించడానికీ, ఆచారంగా వస్తూ ఉన్న నియమాలను మార్చడానికీ జరిగే సామంతుల విశేష సమావేశాలలో పాల్గొనడము,-ఈ ఉపదేశసేవ అనే దానిలో చేరినవి. అంతేకాక, సామంతులమధ్య ఏర్పడిన వివాదాల పరిష్కారానికై ఏర్పడిన న్యాయాధికార వర్గంలో పనిచేయడం కూడా, ఇందులో చేరింది.

క్రమశ్రేణీ బద్ధమైన ఈ భూస్వామ్య కులీన సంస్థ, పలువర్గాలుగా, విభజింపబడింది. అత్యున్నతదశకు చెందిన కులీనులు, ప్రతిష్ఠా సూచకములైన బిరుదులు వహించినారు. రాజు, సంస్థానాధీశుడు (Duke or Earl), మార్క్వెస్, శ్రీమంతుడు (Count), మొదలైనవి, వ్యక్తుల ప్రతిష్ఠకు సూచకములు. పెక్కు జాగీర్లకు వీరు స్వాములు. అధిక సంఖ్యాకమైన అశ్వికదళాన్ని వీరు యుద్ధంలో ప్రవేశ పెట్టేవారు. రెండవ వర్గంలోని కులీనులు అధికృతమైన బిరుదులు లేనివారు. అనేక గ్రామాలు వీరి స్వామ్యాధికారంలో ఉండేవి. వీరిలో ప్రతివాడూ ఒక అశ్విక దళానికి, నాయకత్వం వహించేవాడు. వీరిని సాధారణంగా, బ్యారన్ సీన్యర్స్, (జాగీరుదారు), లార్డ్, (ప్రభు-స్వామి, ఇత్యాది), పేర్లతో వ్యవహరించేవారు. వీరి తరువాతి వారు రక్షకవీరులు (Knights). ఒక గ్రామమో, లేక, గ్రామ భాగమో ఐన జమీను, ప్రతి రక్షక వీరునికీ స్వామ్యమై ఉండినది. ఇతడు, జమీను అప్పగించిన ప్రభువు సేవలో ఉండేవాడు. అన్నిటిలోను చిన్న పదవిలో ఉన్న వారు, రక్షక వీరుని అనుచరులు (Squires). వీరులకు అంగ సేవకులుగా (Valet) మొదట ప్రారంభించిన, ఈ అనుచరులు, తరువాతి కాలంలో జమీను స్వామ్యాన్ని సంపాదించుకొని, కులీన వర్గములోని వ్యక్తులుగా ఏర్పడిరి. వ్యక్తికి గల జాగీరుయొక్క విస్తృతినిబట్టీ, అతడు పోషించగల సైనికుల సంఖ్యనుబట్టీ, ఈ వర్గశ్రేణిలో అతని స్థానం నిర్ణయింపబడేది.

*క్రైస్తవ పురోహిత సంస్థ - చర్చి :* యుద్ధవీరులు, శ్రామికులు మాత్రమే కాక, భూస్వామ్య సమాజంలో, పురోహిత సంస్థ అనే మూడో వర్గముకూడా కలదు. (మత సంస్థకు చెందిన) సాంప్రదాయకులూ, (సంస్థలో లేని) లౌకికులు, అని వీరిలో రెండు వర్గాలు.

మధ్యయుగాలలో జీవిత పరిస్థితులు అతి కఠినములై ఉండినవి. సాధారణ జీవన ప్రమాణాలు, అత్యంతము తగ్గుదశలో ఉండినవి. వ్యవసాయ ప్రక్రియలు పురాతనకాలము నాటివి కావడంవల్ల, వస్తూత్పత్తి కనిష్ఠ ప్రమాణంలోనే నిలిచింది. "రైతు భూమిపై నడుస్తూ ఉంటే, చిరిగిపోయిన బూట్లనుంచి కాలివ్రేళ్ళు బైటికి వచ్చేవి. అతడు ధరించిన మేజోళ్ళు కీలు మండలకు అన్నివైపులా ముక్కలుగా వ్రేలాడు తుండేవి. జోళ్ళులేని పాదాలతో అతని భార్య మంచులో అడుగువేస్తూ ఉంటే, రక్తము అన్నివైపులా ప్రవహించేది." అని బెనెట్ అనే చరిత్రకారుడు వర్ణించినాడు. "దయాదాక్షిణ్య రహితంగా, స్వప్రయోజనార్థం వారిసేవను

గ్రహించినారు. జామీను పత్రాలకు బద్ధులైన నౌకర్లను, పశువుల రీతిగా కొనడమూ, అమ్మడమూ, జరిగేది. ఇనుప కమ్మీలతో బాధిస్తూ, ఊపిరి సలుపుకోనివ్వకుండా, విశ్రాంతి నివ్వకుండా వారిచే పనిచేయించేవారు." గ్రామీణుల చర్మాలను ఒలిచేవాడు, (Excoriator rusticorum) అనే, చెడ్డ బిరుదు, ప్రభువుల పంట తణిఖీదారులకు తరచు సిద్ధించింది. అంతులేని యుద్ధము, హింసాకాండ, రక్తపాతము, స్త్రీ మానభంగము, ఆనాటి ప్రామాణిక పరిస్థితులు. యుద్ధము, వేట, క్రీడా ప్రదర్శనాలు అనేవి ప్రభువులయొక్క ప్రధాన వృత్తిగా ఏర్పడినవి.

జీవితానికి సంబంధించిన నాజూకు తనాన్ని, మర్యాదలను, నేర్చుకోడానికి తగిన సంకల్పంకాని, అవకాశాలుకాని, సమాజంలోని మూడు వర్గాల వారిలోనూ, రైతులకూ సైనికులకూ మాత్రమే లేదు. కనుక, నైతిక మత సంబంధములైన ప్రజల ఆవశ్యకాలను తీర్చే కార్యభారం, పురోహిత సంస్థపై పడింది. మతానికీ, జ్ఞానానికీ సంబంధించిన ప్రజల అవసరాలకు ఉపచరిస్తూ, ఈ పురోహితులు, తమ విశుద్ధ జీవితంవల్లనూ, పాండిత్యము వల్లనూ, ప్రజలలో ప్రతిష్ఠను సంపాదించుకొనిరి. పోప్ అధ్యక్షుడుగాగల క్రైస్తవ మతవ్యవస్థలోని పురోహిత సంస్థ (లేక చర్చి) యొక్క విధానం, ఒక క్రమ బద్ధ శ్రేణిగా ఏర్పడింది. పై తరగతి పురోహితులతో నిర్మితమైన ఈ విధానంలో, బిషప్పులు, ప్రెస్బిటర్స్, లేక, పూజారులు, డీకన్సు (Deacons) అనేవారు చేరియున్నారు. పూర్వపురోజులలో ప్రాంతీయ గవర్నరుయొక్క పరిపాలనకు లోనై ఉన్నంత భూప్రాంతం,-'డయోసీస్' (Diocese) అనే పేరుతో బిషప్ అధికారంలో ఉండేది. తన ప్రాంతంలో పరిపాలన విధానాన్ని, క్రమ శిక్షణను, మత సిద్ధాంతాన్ని సరిచూచే బాధ్యత ఇతనిది. ధర్మాదాయముల నుంచి (Endowments) వచ్చిన ఆదాయాన్ని గ్రహించి ఇతడు, దానిని యుక్తవిధంగా వినియోగ పరచేవాడు. పూజారులకు శిక్షణను కలిగించడానికీ, వారి పోషణకూ, తగిన ఏర్పాట్లను గావించేవాడు.

తొలి రోజుల్లో బిషప్పులకు ప్రభుత్వము నుండి సహాయక ద్రవ్యం లభించేది. వారిని మత కార్యాల విషయంలో మంత్రులుగా, ప్రభుత్వం పరిగణించేది. భూస్వామ్య పరిపాలన అభివృద్ధి అవుతూ రాగా, బిషప్పులు, రాజాధికారులలో కలిసిపోయిరి. పరిపాలన కర్తవ్యాలతో సహా, భూములను వారికి అనుదానంగా ఇవ్వడం జరిగింది. ఈ విధంగా అనుదానం గావించిన మాన్యాలు, కొంత మత ప్రయోజనాలకు, కొంత రాజసేనా ప్రయోజనాలకు, ఉపయుక్తమయ్యేవి. కులీనులకు అనుదానం గావించిన భూముల విషయంలో వలెనే, తత్సదృశములైన షరతులు ఈ ధర్మ దాయాలకు కూడా వర్తించేవి. తత్పరిణామాన్ని అనుసరించి, తాత్త్వికంగా వీరు, ఎన్నికల ద్వారా వచ్చినవారే ఐనా, కార్యతః రాజసభలోని కులీన వర్గం నుంచి ఏరుకొనబడినవారే.

ప్రెస్బిటీర్లు, డీకనులు, బిషప్పుకు సహవర్తులు. మతసంబంధమైన పూజావిధానాలను నిర్వహించడంలో ప్రెస్బిటీర్లూ, పరిపాలన నిర్వహణంలో డీకన్లూ, బిషప్పుకు సహకరించేవారు.

స్థానిక ప్రాంతాలు, పట్టణాలు, పట్టణాల వెలుపల ఉండే భవనాలు, మొదలైనచోట్ల ఉండే చర్చిలలో, క్రిందితరగతి పురోహితులు, ఫాదరీలుగా, మతకార్యాలను నిర్వహించేవారు.

భూములను అనుదానం గావించి, ఈ చర్చిలను స్థాపించినవారు జాగీరు ప్రభువులు. కాబట్టి, ఫాదిరీలూ పురోహితులూ కూడా, తమకు ఉపకారకులైన ఈ ప్రభువులకు ఆశ్రితులై ఉండిరి. ఈవిధంగా, ధర్మదాయానికి చెందిన జమీను, భూస్వామ్యవిధానములోని బంధనాలతోసహా, చర్చి సహాయకులను జాగీరుదారులతో బంధించి వేసింది.

లౌకిక వ్యక్తుల ఔదార్యమువల్లనూ, వారి కార్యక్రమాలవల్లనూ, సన్యాసిమఠములు, సంస్థలు, మళ్ళీ ఏర్పడినవి. ప్రాపంచిక పరిసరములతో విసుగుచెందిన వ్యక్తులు ఈ సంస్థలలో ఆశ్రమాన్ని పొంది, తపశ్చర్యలను అభ్యసిస్తూ తమ జీవితాలను మతసాధనలకు అంకితం గావించి, జీవితం గడపుతూవచ్చిరి. ఈ మఠాలు సమాజానికి విస్తారమైన సేవచేసినవి. భగవద్విశ్వాసమనే, దివ్యజ్యోతిని గ్రామసీమలలో వ్యాపింపచేసినవి. సార్వజనిక పూజావిధానాలను, భక్తిసాధనలను, పవిత్ర జీవనమార్గాలను, ప్రజలకు బోధించినవి. సాంఘిక మతాదర్శాలను, దేశముయొక్క అవసరాలను, ఈ మఠాలు ప్రజలకు విశదం గావించినవి. ఈ మత సంస్థలలోని సభ్యులు సాధారణంగా, కులీనవర్గానికి చెందిన వ్యక్తులు.

ఈ మూడు వర్గాలూ, ఆదిలో చాలవరకు, స్వతంత్ర సంస్థలుగా ఉండినా, క్రమంగా అవి ఒక సార్వత్రిక ఐక్యవ్యవస్థగా ఏర్పడినవి. ఈ వ్యవస్థకు రోము కేంద్రస్థానమయింది. ఇది భూస్వామ్య వ్యవస్థలోని భాగంకాదు; కాని, దానితో ఆంతరంగిక సంబంధం కలిగించుకొన్నది.

మధ్యయుగాల జీవితంలో చర్చి ప్రముఖ కార్యక్రమాన్ని నిర్వహించింది. వ్యక్తికి సంబంధించిన నైతిక ప్రమాణాలను ఏర్పరచి, మతవాతావరణంలో అతని జీవితం, లగ్నమై ఉండడానికి అత డనుసరించవలసిన మతాభిప్రాయాలను నిర్దేశించింది. జననంనుండి మరణం దాకా, ఏర్పడే మానవ జీవితంలోని ప్రధాన ఘట్టాలు, పురోహితులు నడిపే పవిత్ర సంస్కారాలకు సందర్భములైనవి. పాపవిమోచన ప్రాయశ్చిత్త కర్మలతో కూడిన విధానమూలంగా, దైనిక మతకార్యక్రమం, పురోహితుల సమక్ష పరిశీలనతో జరిగేది.

మతసంస్థకు చెందిన ఉన్నతాధికారాలను ప్రసాదించే హక్కులు, చర్చివి. సాంప్రదాయకులు, లౌకికులు అని వ్యక్తుల వర్గీకరణం, ఈ హక్కులను బట్టి ఉత్పన్నమయింది. ఆత్మసంయమన నిగ్రహాలను, ఆచరణలో పెట్టించి, ప్రశాంతములైన వృత్తులలో జీవితాన్ని నడపుకొనే అవకాశాలను, చర్చి కలిగించింది. ఆదివారాలు, పర్వదినాలు, వారాంతదినాలు, భగవంతుని ప్రశాంతి దినములని, ధార్మిక విశ్రాంతి దినములని, ప్రకటించి, తన్మూలంగా, నిరంతరమైన జీవన సంఘర్షణనుంచి ప్రజలకు విశ్రాంతి కలిగించింది. భగవంతుని ఆగ్రహానికి, అంతిమ మహావిచారణకు (Last Judgement) తప్పక తప్పని దేనికీ భయపడని, మొరటు యుద్ధవీరులకు, ఈ పురోహితులు గురువులై, వారి ఆత్మసాక్షికి ప్రేరణకావిస్తూ ఉండేవారు. ఉత్తమ జీవితపథాన్ని అనుసరించవలసిందని ప్రజలను ప్రబోధిస్తూ, తమ ఉపదేశానికి అవిధేయులైనవారికి నిత్యానందము (Eternal Felicity) సిద్ధించే మార్గాలను బంధించివేస్తామని బెదరిస్తూ, మతపురోహితులు సమాజములోని న్యాయప్రవృత్తిని, క్రమవ్యవస్థను దృఢంగా బలపరచినారు. ఈవిధంగా, రాజకీయాల్లోనూ, ఆర్థికవ్యవహారాల్లోనూ వీరు ఎక్కువ పలుకుబడిని సంపాదించుకొనిరి. ప్రధాన గురువులైన బిషప్పులకు, అత్యున్నత కులీనవర్గంవారితో సమానమైన స్థానం ఏర్పడింది. బిషప్పుల అధికారంలోనూ, మఠాధిపతుల అధికారంలోనూ,

ప్రత్యేకమైన సామంతవర్గాలూ, ఆశ్రితదళాలూ ఉండినవి. ఈ సామంతులూ, ఆశ్రితులూ భూస్వామ్య సంబంధాలతో, వారికి బద్ధులై ఉండిరి. ఈ మతాధికారులు రాజ్యవ్యవహారాలలో జోక్యం కలిగించుకొన్నారు. కొందరు యుద్ధాలలో కూడా పాల్గొన్నారు. పెక్కుమంది సలహాదారులుగాను, పరిపాలకులుగాను పనిచేసిరి. ఆర్థిక వ్యవహారాల వినియమానికి కూడా చర్చి ప్రయత్నించింది. వస్తువులకు న్యాయమైన ధరలను విధించింది; కుసీద పద్ధతిని (Usury) రద్దుచేసింది.

భూస్వామ్యపద్ధతియొక్క ఉత్పత్తిక్రమము ప్రకృతిస్వభావము అనే విషయాలలోనే, అధికార కేంద్రీకరణము, సార్వభౌమత్వ విఘటనా, అనేవి అధ్యాహార్యములై ఉన్నవి. భూస్వామ్య విధానముయొక్క న్యాయశాస్త్ర, సంప్రదాయాల విషయంలో పాండిత్యాధికారం వహించిన, మధ్యయుగపు న్యాయశాస్త్రవేత్త, బ్యూమనోయిర్ (Beaumanoir) "ప్రతి జాగీరుదారూ (Baron) తన ప్రాంతానికి సార్వభౌముడు." — అని వచించినాడు. ప్రతి సామంతుడూ స్వంతయుద్ధం గావించే హక్కును ఆచరణలో పెట్టినాడు. సామంతుని అనుమతి లేనిదే, అతని ప్రాంతంలో రాజశాసనాలను ప్రకటించడానికి రాజుకుకూడా అధికారం లేదు. పన్నుల విధింపుతోసహా సమస్తమైన శాసన నిర్మాణమూ, సామంతుల అంగీకారంతో, ఉన్నత ప్రభువు యొక్క న్యాయసభలో, ఒక న్యాయదర్శి సంస్థద్వారా, జరుగవలసిందే.

న్యాయనిర్ణయ వినియోగం కూడా వికేంద్రీకరణానికి లోబడిపోయింది. శిరచ్ఛేద, బాహుచ్ఛేదములకు అర్హములైన దండనీతి విషయాలు మాత్రమే రాజసభలో విచారణకు వచ్చేవి. చిన్నవిషయాలన్నీ స్థానిక ప్రభువుల సభలలోనే తీర్మానాన్ని పొందేవి. జాగీరూ, గ్రామసమాజమూ, స్థానిక న్యాయసభలుగా పనిచేసేవి. జాగీరు సభలు రైతులందరితోనూ,- స్వతంత్రులూ కృషకదాసులూ కూడా,- ఏర్పడినవి. దండనీతికి సంబంధించిన చిన్న కేసుల విషయంలో మాత్రమేకాక, భూముల అనుభవానికీ, సామంతుని వ్యక్తిగత విషయానికీ సంబంధించిన (అతడు స్వతంత్రుడైనాకూడా)- శివిల్ వివాదాల విషయంలో కూడా, న్యాయ నిర్ణయాధికారం, ఈ సభలకు ఉండినది. జాగీరు న్యాయసభల నిర్ణయాలు కృషకదాసుల విషయంలో మాత్రమే, అంతిమ తీర్మానాలు. స్వతంత్ర రైతుల విషయంలో, భూముల కట్టుబడికి సంబంధించిన నిర్ణయాన్ని జాగీరుదారు తోసివేయవచ్చు; దండనీతికి సంబంధించిన తీర్పులను పునర్విచారణకై, రాజు సభకు పంపవచ్చు.

భూస్వామ్య ఆర్థిక పద్ధతి సంవృతమైనట్టిది. అతిపురాతనకాలపు వ్యవసాయవిధానము దాని ఆధారము. వ్యవసాయంవల్ల కలిగే ఉత్పత్తి స్వల్పమైనది కనుక, మిగిలేది అత్యల్పం. ఉత్పత్తి జీవనాధారానికి మాత్రమే చాలినది. గ్రామవాసులు ఉపయోగించగా మిగిలినది, జాగీరుదారుకూ అతని ఇంటి సిబ్బందికీ అందచేస్తూ ఉండిరి. ఆహారపు పంటలేకాక, జనుము, ఉన్ని, తోళ్ళు, మొదలైనవి, గ్రామంలో ఉత్పత్తి గావించేవారు. ఈ సరకులను ఇచ్చి, వీటికి బదులుగా ఉప్పు, ఇనుము, సంబారపు దినుసులు, గుడ్డలు, దిగుమతి చేసుకొనేవారు. బజారు విస్తీర్ణం పరిమితమైనది; దానిలో లభించే సరకులు కూడా కొద్దిమాత్రమే.

గ్రామముయొక్క ఆర్థికవిధానం వినిమయమైనది కాబట్టి, డబ్బుకూ మూలధనానికి ఉపయోగం లేదు. శ్రమవిభాజనకు, ప్రత్యేకీకరణానికి (Division of labour and specialisation) అవకాశం తక్కువ. శ్రామిక గమనశీలతను (Labour mobility)

సమస్తరంగానూ, ఊర్ధ్వవృత్తంగానూ కూడా (Horizontal and vertical) భూస్వామ్య విధానం బహిష్కరించింది. కులీనులు, రైతులు, అనే రెండు వర్గాలనూ మధ్య చేర్పడానికి వీలుకాని అఖాతం ఏర్పడింది. శ్రమించి ఉత్పాదనచేసే ఆర్థిక వ్యక్తికీ, యుద్ధంచేసి రాజ్యాన్ని పాలించే రాజకీయ వ్యక్తికీగల సంబంధం, సేవక స్వాములకుగల సంబంధం. కాబట్టి, సహస్వామ్య జీవితానికీ (Community life) సామరస్యానికీ అవకాశమే లేకపోయింది.

రాజకీయంగా, భూస్వామ్యవ్యవస్థా శ్రేణిలోని అంశాలకుగల పరస్పరసంబంధం, ధృఢమైనది కాదు. ఏకాత్మకమైన ప్రతిఅంశమూ ఆర్థికంగా స్వయంపోషకమై, రక్షకశాఖ న్యాయశాఖల పరిపాలన విషయంలో స్వతంత్రమై ఉండినది. కేంద్రప్రభుత్వానికీ ప్రజలకూ మధ్యగల జాగీరుదార్లు, ప్రభుత్వాంతర్గతమైన ప్రభుత్వంగా ఏర్పడినారు. కనుక, సామంతుల పైనా, గ్రామాలపైనా రాజుకూ, కేంద్ర ప్రభుత్వానికీ గల అధికారం అల్పమూ దుర్బలమూ, ఐనట్టిది. ఐనా, ఇంగ్లాండు దేశానికి ఇది వర్తించదు. ఈ దేశంలో, నార్మన్ పరిపాలకులు భూస్వాముల అధీనంలోని రైతులపై ప్రత్యక్షమైన అధికారాన్ని నెరపుతుండేవారు. తక్కిన యూరోపుభాగంలోని పరిపాలకులు ఈవిధంగా, ప్రభువుల జాగీర్లలోని ప్రజలకు ప్రత్యక్షమైన ఆదేశాలను, ఆజ్ఞలను ఇవ్వలేకుండిరి.

సార్వభౌమాధికారం కలిగిన గ్రామరాజత్వాల (Village monarchies) సంపుటీకరణమే, మధ్యయుగాలనాటి యూరోపు దేశాలు అని వర్ణించడం, అతిశయోక్తి కాదు. మరిన్నీ, భూస్వామియొక్క రాజకీయ సైనిక ప్రయోజనాలకు, గ్రామముయొక్క కార్యకలాపమంతా అనుషంగికంగా ఏర్పడినదనడం కూడా, వాస్తవమే. ప్రతిచిన్నగ్రామముయొక్క రాజత్వమూ చక్కని వ్యవస్థగా ఏర్పడి, నిలిచియున్నంత కాలమూ, సమర్థమైన యంత్రంవలె నడిచింది. దాని ఆచార వ్యవహారాలూ, వినియమాలూ నిష్కృష్టమైనవి; సర్వగ్రాహకములైనవి. ఎట్టి దురాక్షేపణాలేక, ప్రజలు వాటిని గౌరవించి, పాటించినారు. వాటిని అతిక్రమించినవారు సక్రమంగా ఏర్పడిన న్యాయసభల శిక్షకు గురిఐనారు. సామంతులతోనూ, స్వతంత్ర కర్షకుల తోనూ, ఏర్పడిన గ్రామసమాజము, లేక, ప్రభుసభ, అనే శాసన నిర్మాణ సంఘాలు, ఆటంకాలకు గురికాకుండా తమ కర్తవ్యాన్ని నిర్వహించినవి. ఈ శాసనాలను కార్యరూపంలో ప్రవర్తింపచేసే కార్యనిర్వాహకుడు, తనిఖీదార్లు, మొదలైనవారు తమ కర్తవ్యాలను విశ్వాస పాత్రంగా నెరవేర్చేవారు. ఆనాడు, ప్రమాణములని అంగీకరింపబడిన ఆచారాలను, న్యాయాలను అనుసరించి, వ్యక్తిగతములైన దాక్షిణ్యాలకు, ద్వేషాలకు, లోబడక, న్యాయాధీశుల వర్గము, దండనీతికి (చిన్నకేసుల విషయంలో) శివిల్ వ్యవహారాలకు సంబంధించిన విషయాలను పరిశీలించి, న్యాయనిర్ణయాన్ని గావించేవారు.

మతవిషయంలో, సంఘమూ, వ్యక్తులూ కూడా, చర్చి ప్రభావానికి గాఢంగా లోబడి ఉండినారు. కాని, చర్చియొక్క ప్రభావం, ప్రధానములైన అవధుల పరిమితిలోనే ప్రవృత్తమయ్యేది. చర్చి మతతత్త్వ సిద్ధాంతాలకు ఆధారాలైన క్రిశ్చియన్ శాస్త్రాలు, చాలవరకు, ఆత్మసాధన దర్శకములైన గ్రంథాలు. వ్యక్తి యొక్క బాహ్యప్రవర్తనకంటె, అతని ఆంతర జీవితంపై వీటికి సంబంధ మెక్కువ. అట్లే, మానసిక ప్రవృత్తులను, ఆత్మసౌందర్యాన్ని, ఈ శాస్త్రాలు ప్రధానంగా గ్రహించినవేకాని, వ్యక్తి ప్రవర్తనలోని అంశాలను కాదు. కనుక, వివాహము, వారసత్వము, ఆస్తి వర్గీకరణము, వ్యక్తి యొక్క స్థానప్రతిష్ఠలు,- మొదలైన

విషయాల్లో చర్చి, ఏవిధమైన నియమాలనూ గావించలేదు. ధర్మశాస్త్రోక్తమైన న్యాయం విధించిన నియమాలూ, విధినిషేధాలూ, చర్చియొక్క అధికారంపై ఆధారపడినట్టివి. కాని, వీటిని ఆక్షేపించవచ్చు; ధర్మశాస్త్రంలో నిహితమైయున్న భగవదాదేశాలనుబట్టి, పునర్విమర్శ చేయవలెనని, విన్నవించుకోవచ్చు.

భూస్వామ్య పరిపాలనయొక్క ప్రబల లక్షణం, దాని పృథగాత్మకత (ప్రత్యేకతా వాదం) కాని, సర్వార్థవాదాన్ని (Universalism) అంగీకరించడంవల్ల, దాని తీవ్రత తగ్గింది; కొంత మార్దవాన్ని పొందింది. ఈ సర్వార్థవాదానికి మూలాధారాలు, మధ్యయుగాల సంస్కృతిలో ఉన్నవి. సర్వవ్యాప్తమైన రోమన్ సామ్రాజ్యమనే భావం సాహసోద్యములైన రాజుల హృదయాలలో మెదులుతూ, ప్రాచీన సంప్రదాయాలను పునరుజ్జీవింపచేయవలెనని వారిని ప్రేరేపిస్తూ ఉండింది. యూరోపులోనివా రందరికీ సమానమైయున్న మతవిశ్వాసము, సాంఘిక రాజకీయమైన క్రిశ్చియన్ సమాజ నిర్మాణంపైపు, వారి దృష్టిని ఆకర్షించింది. రోము చర్చి అధికారంలో ఏర్పడిన పాశ్చాత్య క్రైస్తవ ప్రపంచం (Christendom) వారికి ఈ విష యంలో ఉదాహరణము. అందరికీ సమానములైయున్న మతతత్త్వము, సిద్ధాంతాలు, పూజా విధానాలు, కర్మలు, క్రమశిక్షణ, వ్యవస్థావిధానము,- అనేవి, ఐక్యసాధనకు ప్రోద్బలం కలిగించే తీవ్రప్రచోదక శక్తులు. ల్యాటిన్ అనే ఒక్క భాషతో, ఒక్క పాఠ్యప్రణాళికతో, అంతర్జాతీయములైన పాఠశాలలతో, విశ్వవిద్యాలయాలతో, యూరోపుజాతు లన్నిటికీ, సమానమై ఏర్పడిన విద్యాప్రణాళిక, వీటిని బలపరిచింది. అంతేకాక, ఆర్థికపరిస్థితులు యూరోపు అంతటా. సదృశములైనవి. జాతీయపృథగాత్మకత అనే భావం కూడా లేదు.

వివిధదశలలో స్వయంపరిపాలనకు భద్రతను కలిగించిన భూస్వామ్యవిధానముయొక్క క్రమబద్ధశ్రేణీ వ్యవస్థ, సర్వార్థవాదమనే భావానికి, శ్లాఘ్యమైన రీతిగా అనుకూలించింది. స్వయంపరిపాలకులైన జాగీరుదార్లు, తమకు కట్టుబడి ఇనాములను ఇచ్చిన శ్రీమంతులు, సంస్థానాధీశులు అనే ఉన్నతవర్గంవారికి, భక్తివిశ్వాసయుక్తులై ఉన్నారు. ఈ ప్రభువుల విషయం కూడా అట్టిదే. వీరు రాజులకు ప్రముఖ గుత్తదార్లూ, విశ్వాసపాత్రులైన భృత్యులూ ఐనవారు. ఇక, రాజ్యాలన్ననో,- అవి పవిత్ర రోమన్ సామ్రాజ్యానికి, సామంతరాజ్యాలుగా పరిగణింపబడేవి. క్రీ. శ. 800 లో, షార్లిమాన్ పునరుజ్జీవింపచేసియుండిన ఈ సామ్రా జ్యాన్ని, జర్మన్ రాజులు పునర్నిర్మాణము గావించి ఉండిరి. సార్వత్రిక సార్వభౌమత్వం, ఈ సామ్రాజ్యానికి కలదని ఊహించుకునేవారు; కాని దాని ఆజ్ఞలు జర్మనీ ఇటలీల సరిహద్దు లను దాటి, వ్యాపించలేదు. ఇది, భూస్వామ్య వ్యవస్థలోని లౌకికభాగ విషయం.

ఇక, క్రైస్తవ సంస్థల విషయం. క్రైస్తవమతానికి చెందిన క్రమబద్ధశ్రేణి, పోపును తమ ప్రధానాధికారిగా అంగీకరించింది. కార్డినల్, బిషప్, ఉన్నతవర్గ పురోహితులు అనేవారితో కూడిన వ్యవస్థ, దానికి క్రిందిది. తరువాతిది, కింది పురోహితుల వర్గం. ఈ వర్గాల పరస్పర సంబంధాలు, లౌకిక వ్యవస్థయొక్క క్రమశ్రేణిని అనుసరించినవి.

అత్యుచ్చాధికారం ఇరువురికి మాత్రమే ఉన్నదనే ఆధారసిద్ధాంతంపై, భూస్వామ్య వ్యవస్థ ఏర్పడింది. లౌకిక ప్రభుత్వానికి ఒక అధికారి, మతవ్యవస్థకు ఒక అధికారి అని దీని

భావం. ఈ ఇద్దరిలో ఎవరు ముఖ్యులు అనే విషయాన్ని గురించి చాలకాలం, వివాదం జరిగింది. అత్యున్నతాధికారి పోప్ అనే భావం, పదమూడో శతాబ్దంలో ఉండినది. కాని, శీఘ్రకాలంలోనే పరిస్థితులు మారినవి. పోపును అత్యున్నతాధికారిగా గుర్తించడానికి రాజులు నిరాకరించిరి.

*పట్టణ జీవితం :* భూస్వామ్య సంఘం, ప్రధానంగా, గ్రామీణమైనట్టిది. కాని, సంఘంలో ఒక భాగంగా, ప్రయోజనకరమైన ఒక పరిణామం జరుగుతూ వచ్చింది. నాగరీకరణమనేదే (Urbanization) ఈ పరిణామం. తుదకు భూస్వామ్య వ్యవస్థను నశింపచేయడానికీ, భూస్వామ్య సమాజానికి రూపాంతరం కలిగించడానికీ, జాతీయ సంస్థల ఉదయానికి అనుకూలమైన మార్గాన్ని కల్పించడానికీ, ఈ నాగరీకరణమే హేతువు. ఇట్టి పరిణామాలు భారత దేశంలో, పందొమ్మిదో శతాబ్దాదికాలంపరకు జరుగలేదు. కాబట్టి, దీని అభివృద్ధికి మూలములైన హేతువులను, యూరోపు సంఘాల్లో గొప్ప మార్పును తెచ్చిన ప్రక్రియలను అర్థం చేసుకోవడం ప్రయోజనకరమైనది.

రోము సామ్రాజ్యాన్ని అంతమొందించిన అనాగరక జాతుల దండయాత్రలు, రోము సామ్రాజ్యములోని నగరాలను నాశం గావించినవి. ఆదికాలపు జాతుల గ్రామీణ వ్యవస్థను, యూరోపు దిగజారిపోవడానికి కూడా, వారే కారకులు. కాని, వలస వచ్చే జాతుల ప్రవాహమూ, దోపిడులూ, ఆగిపోయి, వలస వచ్చినవారు దేశంలో నెలకొని స్థిరపడడంతో, నూతన శక్తులు, క్రొత్తపునాదులపై, నగర జీవితాన్ని మరల నిర్మించడానికి ప్రారంభించినవి. ప్రథమంలో జాగీరుకూ పట్టణానికీ ఎక్కువ భేదం ఉండేదికాదు. వ్యాపారము, పరిశ్రమలు, వ్యవసాయానికి అధీనములై ఉండేవి. గ్రామం స్వయంపోషణ సమర్థమై ఉండేది. గ్రామంలోని చేతిపనివాండ్లు, అవసరములైన సామాన్య వస్తువులను తయారు చేసేవారు.

కాని, గ్రామంయొక్క స్వయంపోషకత్వానికి విరుద్ధములైన నూతనావసరాలు పొడచూపినవి. ఇంగ్లండుపై జరిగిన డేనుల (Danish) దండయాత్రలవల్లను, ఉత్తరఖండాల జాతులు యూరోపు ఉత్తరదేశాలలోకి చొచ్చుకొని రావడంవల్లను, ప్రజలు గాఢములైన నీటి కందకాలతో ఆవరింపబడిన కోటలలోనూ, దుర్గాలలోనూ, తలదాచుకోవలసి వచ్చింది. ఈవిధంగా, ప్రజలు ఒకచోట అసంఖ్యాకంగా చేరడానికీ, నగరాలు ఏర్పడడానికీ, యుద్ధములూ, హింసాకాండలూ హేతువులైనాయి. క్రైస్తవమఠాలు స్థాపింపబడడం రెండవ కారణం. ఈ మఠాలలో లభించిన శాంతి స్థైర్యములు కారణాలుగా, అవి కళలకు, చేతిపనులకు కేంద్రములైనవి. మరిన్ని, లౌకిక పురోహిత వర్గాలలోని పెద్దపొలాలు కట్టుబడిదార్లకు స్థానములు కావడంవల్ల, కొన్ని ప్రదేశాలు ప్రాముఖ్యం వహించి, ప్రజలను ఆకర్షించినాయి. అంతేకాక, నదుల రేవులు, బాటల కలయిక, నదీతీరము, సముద్రతీరము, మొదలైన భౌగోళికస్థానాలు, వర్తక వ్యాపారాలకు అనుకూలములైన సౌకర్యాలను సిద్ధంచేసినవి.

పట్టణాలయొక్క జీవితం పరిశ్రమలలోను, వర్తకంలోనూ నిహితమైఉంది. వాటి పునరుజ్జీవనము, అభివృద్ధి, అనేవి మధ్యయుగ చరిత్రలోని వ్యవస్థను భగ్నం కావించిన స్ఫోటక శక్తులు. పదకొండో శతాబ్దంలో, వర్తకంతో ఈ పరిజ్ఞానం కలిగింది. ఇంగ్లండును, సిసిలీని, నార్మనులు జయించడము, పోర్చుగలులో క్రిస్టియన్ అధికారము ఉదయించడము,

స్పెయినులోని మూరులను క్రిశ్చియనులు జయించడము,- అనే సంఘటనలు ప్రపంచయాత్ర, సాహసోద్యమము అనే చైతన్య శక్తిని బహిర్గత మొనర్చినవి. ఇది వర్తకములో ప్రయోజన కరములైన ఫలితాలను తెచ్చింది. ఇంగ్లాండు, ఫ్రాన్సు, స్పెయిను, మధ్యధరా సముద్ర రాజ్యాలు, ఒకటిగా బంధింపబడినవి. వస్త్రములు, పట్టు, ఉన్ని, లోహపు సరకులు, ఆయుధాలు, బార్బరీప్రాంతపు గుర్రాలు, నారింజపండ్లు, దబ్బకాయలు (Citron), ద్రాక్షసారా,- మొదలైన సరకులతో ఈ ప్రాంతాలలో పర్యటనము ఆరంభించిరి.

ఆ తర్వాత క్రైస్తవుల ధార్మిక యుద్ధములు ఆరంభమైనవి. ఈ యుద్ధాలు, మొరటువారు, వెనుకబడినవారూఐన, యూరోపుజాతివారికి, ఉన్నత నాగరికతగల ప్రాగ్దేశాలవారితో సంపర్కం ఏర్పరచింది. మతసంబంధమైన ఈ యుద్ధాలు వర్తకానికి ప్రోద్బలం కావించినవి. వేనిస్, జినోవా, పీసా, బార్సిలోనా, మార్సేల్స్, దేశీయులైన వర్తకులు, ప్రాగ్దేశాల భోగ వస్తువులను కొని, యూరోపుదేశాలలో అంతటా పంచిపెట్టినారు. డ్యామస్కస్, బాగ్దాద్, ఈజిప్టు, ఇరాన్, ఇండియా, చైనాదేశాలనుంచి లెవాంట్ రేవులకు, సార్థవాహులు తెచ్చిన సరకు లివి. వర్తకమార్గాలలోను, బుద్ధిమంతులైన భూస్వాములు తమ యుద్ధవీరులతో శాంతి భద్రతలను నెలకొల్పిన ప్రదేశాలలోను, భగవన్మందిరముయొక్క పవిత్రస్థానములలోను, ఈ వస్తువుల అమ్మకానికి సంతలు ఏర్పాటైనవి.

వర్తకముయొక్క ప్రేరకశక్తివల్ల గ్రామాలకూ పట్టణాలకూ మధ్య రాకపోకలకు చైతన్యం కలిగింది. తొలిరోజులలో గ్రామపరిశ్రమలు వ్యవసాయానికి, కేవలం అధీన కార్యక్రమాలుగా ఉండేవి. జాగీరులోని వ్యక్తి, తన ఇంటిని తాను కట్టుకొని, తనకు అవసరమైన నూలును వడికి, వస్త్రాన్ని నేసుకొని, కాలిజోళ్ళను కుట్టుకొని, తన సాధనాలను తాను తయారు చేసుకొని, పొలాన్ని సేద్యం చేసుకొని, కాలం వెళ్ళబుచ్చేవాడు. రాజులకు చెందిన పెద్ద జాగీరులలో ప్రధాన సామంతులు, చర్చి అధికారులు, నిర్వహించిన వస్తూత్పత్తి విధానం విస్తృతమై, శ్రమవిభాజనంతోనూ, శ్రమ ప్రత్యేకీకరణంతోనూ కూడి ఉండినది. ఉత్పాదనలో సిద్ధించిన అదనపు సరకు రైతులకు సంతోషాన్ని కలిగించింది. వర్తకం, పునరుజ్జీవనం పొందడంవల్ల, నగరాలలోనికి డబ్బు చేరింది. మరిన్ని, గ్రామీణమైన అదనపు సరకులూ, నగరంలోని చేతిపనివాండ్లు తయారు చేసిన వస్తువులూ, పరస్పరం మార్చుకోవడం పెరిగింది.

వర్తకము, పరిశ్రమలు అభివృద్ధి కావడంతో, పట్టణ ప్రదేశాలలో సుదూర వ్యాపకములైన పరివర్తనములు కలిగినవి. మధ్యయుగాల తొలిరోజుల్లో అనేక పట్టణాలు, కందక పరివృతములైన కూడలి ప్రదేశాలుగానో, భద్రపరుపబడిన ఆవరణములుగానో, ఉండినవి. ఉత్తర యూరోపునుంచి వచ్చిన, రాత్రి దొంగల దాహక దాడులనుంచి రైతువర్గాన్ని రక్షించడానికై, ఆంగ్లదేశంలోనూ యూరోపులోనూ, కోటలతో కూడిన గ్రామాలు నిర్మింపబడినవి. కొంతకాలానికి గ్రామస్థానాలు, వర్తకులనూ, శిల్పులనూ, ఆకర్షించినవి. వీరు వచ్చి, కోట గోడల వెలుపల నెలవులను ఏర్పరచుకొని, వ్యాపార కేంద్రాలనూ, నివాసగృహాలనూ స్థాపించుకొనిరి. వర్తకులు ఈ ప్రదేశాలలో గుమిగూడిరి. వీరు సంఖ్యలో క్రమంగా అభివృద్ధిచెందడమే కాక, ఆర్థికంగా అభివృద్ధి చెందిరి. ఆత్మరక్షణార్థం గోడలను కట్టుకొని, పూజానిమిత్తం చర్చిలను నిర్మించుకోవడమేకాక, తమకు ఆవశ్యకములైన సంస్థలను కూడా ఏర్పచుకొనిరి.

పదకొండో శతాబ్దంలో వర్తకము పునరుజ్జీవం కావడంతో, రెండు ప్రవాహాలు

యూరోపుమీదుగా నడచినవి. ఉత్తరంలోని స్కాండినేవియన్ దేశాలనుంచి కాంస్టాంటినోపుల్ వైపునకు ఒకటి, మధ్యధరాసముద్ర ప్రాంతాలనుంచి, పశ్చిమ యూరోపుకు మరియొకటి, రెండు వర్తక ప్రవాహాలు బయలుదేరినవి. కాంస్టాంటినోపుల్ నగరానికి ఉద్దీగా (ఉజ్జీగా), నూరువేల జనసంఖ్యగల నగరాలు ఏర్పడినవి. ఈ నగరాలలో మూలధనం పెరిగింది; కళలూ శిల్పాలూ ఇతోధికంగా పెరిగినవి; ప్రత్యేకీకరణం వేగంగా ముందుకు సాగింది. వ్యాపార వ్యవస్థకు సంబంధించిన పద్ధతులలోను, వర్తకసంబంధమైన కౌశలంలోను, వారు పురోభివృద్ధిని పొందిరి. ఇటలీ వర్తకులు ఇచ్చటి సంతలకు తరచు వచ్చేవారు; ఇటలీ బ్యాంకర్లు యూరోపు రాజులకు ధనసహాయం కావించేవారు.

ఈవిధంగా, ఇటలీనగర ఆర్థిక వ్యవస్థయొక్క ప్రభావం ఉత్తరంగా వ్యాపించింది. అస్తిపట్టణపు చిన్నకుసీదులు మొదలుకొని, లొంబార్డీలోని గొప్ప బ్యాంకులవరకూగల ఇటలీ విత్తసహాయకులందరూ (Financier), యూరోపుఖండమందంతటా, తమ వడ్డీవ్యాపారాన్ని సాగిస్తూ వచ్చిరి. ఉత్తరభాగంలో జరుగుతున్న నాగరీకరణ ఉద్యమానికి, ఈ ఇటాలియన్ మూలధనము నూతనచైతన్యశక్తిని ఆపాదించింది. 1870 లో, పదహైదు లక్షలకు మించని జనసంఖ్యగల ఇంగ్లాండులో, రాజసన్నదు పడసిన పట్టణాలు, వంద ఏర్పడి ఉండినవి. వస్తువిషయక విశేషజ్ఞత కూడా చాల అభివృద్ధి చెందినది. ఒక్క ప్యారిస్‌నగరములోనే నూటయాభైకి పైగా వివిధములైన వృత్తివిద్య లుండినవి.

ఉత్తరభాగములోని పట్టణాలు, మొదట దక్షిణములోని పట్టణాలకంటె, తక్కువ జనాభాతో ఉండినమాట వాస్తవమే. పదమూడోశతాబ్దపు లండనునగరంలోని జనాభా 25000 కంటె తక్కువై ఉండడం, ఇందుకు ఉదాహరణం. గ్రామానికీ పట్టణానికీగల భేదం కూడా అంత ఎక్కువగా లేదు. రెండూ భూస్వామ్య వ్యవస్థావిధానంలోనివే కావడంవల్ల, సదృశము లైన ప్రభారాలకు, ప్రతిబంధాలకు లోనై ఉండినవి. ద్రవ్యము ఎక్కువ చెలామణిలో ఉండడము వల్లను, అభివృద్ధి కలగడంవల్లను పట్టణాలకూ గ్రామాలకూ కూడా భూస్వామ్యవ్యవస్థా బంధనాల నుంచి విమోచనం కలిగింది. గ్రామాలు స్వతంత్ర కర్షకులకు నిలయాలైనాయి. వీరి భూముల అనుభవానికి సంబంధించిన కట్టుబళ్ళు నిర్బంధ సేవను విధించలేదు. వీరు పొలాలకు బంధితులై ఉండడం కూడా అవసరంలేదు. భూస్వాముల ప్రతిష్ఠా ప్రాబల్యం బలహీనమయి, కరారులకు ప్రాధాన్యం ఏర్పడింది.

పట్టణాలలోని వర్తకుల మూలధనం అభివృద్ధి చెందడంతో, వారికి లాభాలపై తీవ్రాసక్తి కూడా ఎక్కువయింది. వడ్డీవ్యాపారము, బ్యాంకింగు, ఇతర విత్తసంబంధమైన కార్యక్రమాలు (ముఖ్యంగా), ఎగుమతి వ్యాపార విస్తరణము, భూములు, పరిశ్రమలు,- మొదలైనవాటిలో తమ మూలధనాన్ని పెట్టుబడిచేస్తూ వచ్చిరి.

పట్టణాలలో ఉదయించిన స్వాతంత్ర్యోద్యమం వర్తకాభివృద్ధివల్ల సిద్ధించిన ఫలితా లన్నిటిలోను ప్రధానమైనది. పౌరసంస్థలు ఏర్పడిన ఇంగ్లాండు పట్టణాలూ (Boroughs), యూరోపుఖండంలోని కమ్యూనులూ (Communes), లౌకిక మతసంబంధములైన భూస్వాముల అధికారభారం నుంచి, స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్నవి. కొన్ని సందర్భాల్లో, సంఘర్షణల మూలంగానూ, విప్లవం ద్వారానూ, తమ స్వేచ్ఛను వీరు సంపాదించుకొనిరి. ఈ పరిస్థితులు చాలవరకు చర్చికి చెందిన జాగీరులలో జరిగింది. ఇతర సందర్భాల్లో, తమ

రాజులయొక్క, లేక, జాగీరు ప్రభువులయొక్క అభిమాన సహాయాల తోడ్పాటుతో, స్వాతంత్ర్య లాభం పొందినారు. ఒక్కొక్కప్పుడు, తమ ప్రభువులకు కలిగిన చిక్కులను స్వప్రయోజనార్థం ఉపయోగించుకొని స్వేచ్ఛను పొందినారు.

ఆదిలో, వర్తకులు నివసించిన పట్టణాలలో భూస్వామ్యవ్యవస్థా విధానము ఏర్పడి ఉండేది. ఆ పట్టణాల ఆశయాలు సైనికసంబంధమైనవి. పట్టణాలలో అనుసరించబడుతున్న న్యాయాలూ, ఆచారాలూ అధికారతావాదముపై ఏర్పడినట్టివి. జాగీరుదారీ పరిపాలనవిధానమే, ఈ పట్టణాలలో కూడా ప్రవృత్తమై ఉండినది. వ్యక్తిస్వాతంత్ర్య ఆస్తిస్వాతంత్ర్యాలపై, నిర్బంధాలను విధించినాడు. భూస్వామ్య వ్యవస్థకు చెందిన పన్నుల పద్ధతి, బాధాకరమై వర్తకవ్యాపారాలకు ప్రతిబంధకమయింది. న్యాయపరిపాలన విధానము కూడా వర్తకసమాజముయొక్క అవశ్యకాలకు అనువైనది కాదు. యూరోపుఖండములోని వర్తకులు, తమ వ్యాపారపు అత్యవసరాలనుబట్టి భూస్వామ్యపు అమితభారాలను తొలగించుకోడానికై శ్రేణులను (గిల్డులను-Guild), భ్రాతృత్వ సంఘాలను ఏర్పరచుకొనిరి. సంఘంగా ఏర్పడి, అన్నివిధములైన కష్టాలను ప్రతిబంధకాలను ఎదుర్కొని, తమ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోడానికై గంభీరమైన ప్రమాణం గావించిరి. ఈవిధంగా కమ్యూనులు సృష్టికి వచ్చినవి.

విశేషాధికారయుక్తములు, దేశపు సామాన్య న్యాయములకు భిన్నములు ఐన, నిగమ సంస్థను ఏర్పరచడము, ఈ న్యాయాల పరిపాలనకై స్వంత న్యాయస్థానాలను స్థాపించడము, ప్రభుత్వానికీ అధికారానికీ సంబంధించిన స్వంతన్యాయపత్రాలను, స్వంతరాజ్యాంగాన్ని నిర్మించుకోవడము,- అనేవి కమ్యూనుకు సంబంధించిన స్వయంపరిపాలనలో ఇమిడియున్నవి. ప్రతి కమ్యూనూ, తాత్త్వికంగా, ఒక నగరపరిపాలక గణరాజ్యంగా (Republic) సిద్ధమయింది.

యూరోపుదేశాల నగరపరిపాలనను ఏర్పడడంలో జరిగినంత గలభా ఆంగ్లదేశనగర చరిత్రలో జరగలేదు. ఐనప్పటికీ, ఫలితాలు రెండింటనూ సదృశములైనవే. నార్మనువిజయము నాటినుంచీ, ఇంగ్లాండు రాజులు, భూస్వామ్య జాగీరుదారుల అధికారాలను పరిమితంచేసి, వారిని హద్దుమీరకుండా నిలపడానికి ప్రయత్నించినారు. తమ జమీనులలో నెలకొనియున్న పౌరసంస్థ గ్రామాల కోరికలను ఇష్టపూర్వకంగా ఒప్పుకొని, వాటికి స్వాతంత్ర్యదానాన్ని శాసనపత్రమూలంగా ఇచ్చిరి. జాగీరుదారుల సంస్థానాలలోని పట్టణాలవిషయంలో ఇట్టి విశేషాధికారాలను సంపాదించుకోవడంలో ఎట్టి కష్టాలూ కలుగలేదు. బిషప్పులకూ, మతసంస్థలకూ చెందిన ప్రాంతాలలోని పట్టణాల విషయంలో మాత్రమే, కష్టములు కలిగినవి. మతాధికారులు పట్టుదలతో, హఠముతో, మార్పును నిరోధించినారు. స్వాతంత్ర్య సంబంధమైన హక్కులను వారినుంచి లాక్కోడానికి. దీర్ఘకాలికమైన నిష్ఠురసంఘర్షణ సాగించవలసి వచ్చింది.

తమ పైఅధికారులైన జాగీరుప్రభువులనుంచీ, రాజుయొక్క ప్రతినిధులుగా ప్రవర్తిస్తూ ఉండిన 'షెరిఫ్' అనే స్థానిక ప్రభుత్వోద్యోగులనుంచీ కూడా, కష్టంలేకుండా స్వాతంత్ర్యాన్ని ఆంగ్లదేశ పట్టణాలు, చాలవరకు, సాధించుకొన్నాయి. శాసనపత్రాలవల్ల పెక్కు విశేషాధికారాలు వీటికి సిద్ధించినాయి. జాగీరుదార్లూ రాజాధికారులూ, మధ్య రాకుండా, పట్టణపు రాజస్వాన్ని వసూలు చేసుకొనే హక్కు సిద్ధించడం, ఇందుకొక ఉదాహరణ. వసూలైన మొత్తంలో ఒక నియతభాగాన్ని మాత్రం రాజకోశానికి చెల్లించవలసి ఉంటుంది. న్యాయపాలన విషయంలో బాహ్య న్యాయస్థానాల ఆక్రమం నుంచి రక్షణ లభించింది. నగర దండాధికారు

లను ఎన్నుకొనే హక్కు, నగర పరిపాలన విధానాన్ని తామే నిర్వహించుకొనే హక్కు, వర్తకులూ శిల్పులూ, తమతమ గిల్డులను స్థాపించుకొనే హక్కు, మొదలైనవాటిని, శాసన పత్రం, నగరాలకు ప్రసాదించింది.

పట్టణాల విషయమైన అతివేగాభివృద్ధి, సమాజ విషయంలో గాఢమైన పరిణామకారిగా ప్రవర్తించింది. యూరోపు తొలిరోజుల ఆర్థికవ్యవస్థ, గ్రామంపై ఆధారపడినట్టిది. తరువాతి మధ్యయుగాలలో నగర ఆర్థికవ్యవస్థకు సామాజిక జీవితంపై ప్రాబల్యము ఏర్పడింది. ఆ కాలంలో, రాజకీయ వ్యవస్థలో గ్రామమొక స్వతంత్రమైన ఏకాత్మకభాగం. ఈనాడు,- నగరము, తనకుగల రక్షణలను సమర్థించుకొంటూ, జాతీయ రాజ్యతంత్రానికిగల అంగాలను కలిగి, ఇతర నగరాలతోగల పరస్పర సంబంధాల్లో తన ప్రయోజనాలను జాగరూకతతో రక్షించుకొంటూ, చాలవరకు, ఒక సార్వభౌమ గణరాజ్యంగా సిద్ధించింది. గ్రామసీమల నుంచి భూస్వామ్యవిధానపు అరాజకత్వం వెనుకకు తగ్గుతుండగా, నగరాలు భూస్వామ్యవిధానపు కట్టుబడి ఇనాముల స్థానాన్ని ఆక్రమించుకొన్నవి. యూరోపులోని కొన్ని భాగాల్లో,- ఇటలీ ఇందుకు నిదర్శనం - ఈ నగర పరిపాలన సంస్థలు, దేశముయొక్క ఐక్యాన్ని భగ్నపరచడానికి తగినంత శక్తివంతములైనాయి. ఇతరదేశాలలోని కేంద్రప్రభుత్వాలు, ఈ నగర సంస్థలను, కొంతకుకొంత, తన అధికారాజ్ఞలకు లోబరచింది. ఈ ప్రభుత్వాధికార ప్రవృత్తి కొన్నిచోట్ల ఎక్కువగను, కొన్నిచోట్ల తక్కువగను, ఉండింది.

నగరాలలోని ఆంతరంగిక సామాజిక వ్యవస్థ, భూస్వామ్య జాగీరులలోని సామాజిక వ్యవస్థకు భిన్నమైనది. వర్తక గిల్డులు అని వ్యవహరింపబడే వర్తకసంఘాలపై పట్టణాల ఆర్థికవ్యవస్థ ఆధారపడింది. పట్టణవ్యాపారమునకు సంబంధించిన ఏకస్వామ్యం, గిల్డులలో, నిహితమై ఉంది. గిల్డుయొక్క హక్కులు శాసనపత్రం ద్వారా రక్షితమై యున్నవి. సహకారాన్ని, జట్టు బేరాన్ని (Collective bargaining), ఉత్తేజనపరిచి, శ్రేయోసంఘము యొక్క ధర్మాలను నిర్వహించింది. కేవలము ఆర్థిక కర్తవ్యాలకు సంబంధించినవాటిలో, పరిశ్రమలపైనా వర్తకంపైనా, అధికారం వహించి, వాటిని వినియుయపరచడం ముఖ్యమైనది. వస్తువుల ధరలను నిర్ణయించడానికై, అత్యవసర శాసనాలను, లేక, న్యాయదర్శి వర్గాన్ని ఏర్పరచింది.

కాని, వర్తక గిల్డుల కార్యకలాపాలు ఆర్థికవ్యవహారాలకు మాత్రమే పరిమితం కాలేదు. తమ రాజకీయపు హక్కులను నెరపడంలో, సమగ్ర నగరవాసుల సంఘంలో సభ్యులుగా, మొదటి రోజుల్లో, వీరు పాల్గొంటూ వచ్చిరి. కాని, తుదిపరిణామంగా, సమస్తమైన రాజకీయ శక్తినీ ఏకస్వామ్యంగా చేసుకొన్న విశిష్ట సంఘంగా ఇది సిద్ధించింది. సామాన్యులకు, క్రింది వర్గాలవారికి, శ్రామికులకు, పరిపాలన విధానంలో భాగం లేకుండా చేసిరి. ఇట్టి విశేషాధికారాలుగల మధ్యమ తరగతి వర్గమే కులీనులకు రైతులకు మధ్యలో ఉండే ప్రజావర్గం,- 'బూర్ష్వా' అనేది. గిల్డుయొక్క సాధారణసభ, లేక, 'బూర్ష్వాసీ' అని వ్యవహరింపబడే మధ్యమ తరగతి, ప్రజావర్గముయొక్క సభద్వారా, తమ అధికారాన్ని నెరపేవారు. ప్రభుత్వోద్యోగులను, దండనాధికారులను, ఎన్నుకోవడం ఈ సభలయొక్క ప్రధాన కర్తవ్యం. ఈ అధికారులతో ఏర్పడినదే, ప్రామాణికమైన ప్రభుత్వం. ఆంగ్లదేశ నగరాలలో వీరిని 'మేయర్లు' (Mayors), 'ఆల్డర్‌మేన్' (Alderman), లేక 'బేయ్లిఫ్స్' (Bailiffs) అని

పిలిచేవారు. ఫ్రాన్సులో వీరిని 'కౌన్సెలర్స్' (Counsellors), 'జూరర్స్' (Jurors), లేక, 'సిండిక్స్' (Syndics), అని వ్యవహరించేవారు. పరిశ్రమలను వినిమయపరచడానికై అత్యవసర శాసనాలనుచేయడము, మునిసిపల్ విత్తాన్ని పరిపాలించడము, సైన్యంపై అధికారం వహించి నడపడము, రక్షణకు ఆవశ్యకములైన కట్టుదిట్టాలను కావించడము,- వీరి కర్తవ్యాలు. శివిల్ వ్యవహారాలకూ, క్రిమినల్ ఫిర్యాదులకూ సంబంధించిన వ్యవహారాలను విచారణచేసి, ప్రజలకు న్యాయాన్ని కలిగించడం, అన్నిటికంటె ముఖ్యమైన వీరి ఉద్యోగ ధర్మం.

ఆహార పదార్థాలను సేకరించి పెట్టడము, నగరరక్షణ, అనే రెండూ, నగరపాలకుల ప్రధాన సమస్యలు. రెండూ ధనవ్యయముతో కూడినవే. కనుక అధికమైన ఈ ప్రభారాలను ఒదిగించగల విత్తీయవిధానాన్ని అభివృద్ధిపరచడం అవసరమయింది. ఈ సమస్యాపరిష్కారం మునిసిపల్ పన్నులను విధించడంతో సాధ్యమయింది. ఇవి నగరవాసుల ఆస్తిపై విధించబడిన ప్రత్యక్షపు పన్నులు లేక, నగరాలను ప్రవేశించే వర్తకసరకులపై విధించే అప్రత్యక్షమైన పన్నులు కావచ్చు. ఆహార పదార్థాల దిగుమతిని, వాటి అమ్మకపు ధరలను, బజారుల వినియమంతో, అదుపులో పెట్టినారు. కోటగోడల నిర్మాణము, కందక నిర్మాణము, ఆయుధాలను కొనడము, మొదలైనవాటి ద్వారా నగరరక్షణకు శ్రద్ధవహించిరి.

వర్తక గిల్డులు అభివృద్ధి చెందడానికి వ్యాపారాభివృద్ధి హేతువయింది. వృత్తివిద్యలలో నిపుణులైనవారి 'వృత్తిగిల్డుల' పునాదులు ఏర్పడడానికి, పరిశ్రమాభివృద్ధి ఉత్తేజకమయింది. "మధ్యయుగాల 'బూర్షువా' నాగరకత అంతటిలోను, అత్యంతము అర్థవంతమైనది, నవీనమైనది, ఈ కార్మికుల గిల్డుల స్థాపన." మధ్యయుగ ఆర్థికవ్యవస్థకు వీటి ప్రభావం, గాఢంగా తాకింది.

యజమానులు, కూలివాళ్ళు (Journey men), అభ్యాసకులు (Apprentice) అనే మూడువర్గాల సభ్యులతో వృత్తిగిల్డులు ఏర్పడినవి. ప్రతి వృత్తివిద్యకూ ప్రత్యేకమైన గిల్డు ఏర్పడింది. ఆ విద్యను నేర్వదలచుకొన్నవా డెవ్వడూ ఆ గిల్డులో సభ్యుడుగా చేరక, విద్యను నేర్చుకోలేడు. వృత్తివిద్యను కాంక్షించేవాడు, గిల్డులో అభ్యాసకుడుగా చేరుతాడు. ఉమేద్వారుగా పనిచేయక, ఎవ్వడూ ఆ విద్యలో నిపుణుడు కాలేడు. ఒక వ్యక్తిని వృత్తివిద్యలో శిక్షణకు అంగీకరించడం, శ్రద్ధాభక్తులతో కూడిన, బహిరంగమైన ఒక కరారు. రెండుపక్షాలపైనా, పరస్పర కర్తవ్యాలను ఈ కరారు విధిస్తుంది. వృత్తివిద్యా శిక్షణ అనేది, భావికాలంలో అవసరమైన నిపుణుల సంఖ్యనుబట్టి, నిష్కర్షగా పరిమితమౌతుంది. అంతేకాక, ఆ వృత్తిని నిర్వహించేవారి ఏకస్వామ్యము ఈ వృత్తి అనే ఉద్దేశంపై ఆధారపడింది. ఐనప్పటికీ, ఈ నిర్బంధాలు కులవర్గాలవలె అచ్చులలో నిలిచిపోలేదు. వృత్తివిద్యకు ప్రవీణుడైన యజమానుని కుమారుల విషయంలో తప్ప, ఆనువంశీయత (Heredity), మరెవ్వరి విషయంలోనూ గుర్తించబడలేదు. వృత్తివిద్యలకు ప్రవేశం అన్నివర్గాలవారికీ విస్తరించిఉండినది.

వృత్తివిద్య అభ్యాసకాలం, సాధారణంగా దీర్ఘమైనది. ఆయా విద్యనుబట్టి, మూడు మొదలు పన్రెండు సంవత్సరాల కాలం పట్టేది. అభ్యాసకునికి ఆహారాన్నీ, వసతినీ, విద్యకు సంబంధించిన విజ్ఞాన ప్రక్రియలలో శిక్షణనూ, అభ్యాసకుల తరిఫీదుకు అవసరములైన ఇతర సౌకర్యాలనూ, ఏర్పాటుచేయడం, గురువుయొక్క కర్తవ్యం. అభ్యాసకుని సక్రమప్రవర్తనకు, విద్యలో మంచి సామర్థ్యాన్ని పొందడానికి గురువు బాధ్యుడు. అభ్యాసకుడు అక్రమంగా

ప్రవర్తించినట్టయితే, అతనిని శిక్షించే అధికారం గురువుకు ఉండేనది. గురువుపట్ల వినయ విధేయతలతో నడచుకొంటూ, అతనికి విశ్వాసపాత్రుడై ఉండడం, అభ్యాసకుని కర్తవ్యము. గురువు ఇంటిలో పనులుచేయడం కూడా అభ్యాసకుని కర్తవ్యమే. కొన్ని సందర్భాల్లో అభ్యాసకులు శిక్షణ శుల్కం (Premium) కూడా, చెల్లించవలసి ఉండేది.

తరిఫీదుకాలం పూర్తికావడంతో అభ్యాసకుడు కూలివాడౌతాడు. అనగా కూలికి పని చేసేవాడు, లేక, గురువుకు అనుచరుడు అని తాత్పర్యం. దేశంలో తిరిగి పనిచేసుకోడానికీ, ఇతర గురువుల కర్మాగారాలలోనూ, ఇతర పట్టణాలలోనూ చేరడానికీ, ఇతనికి స్వేచ్ఛ ఉండేది. సంవత్సరం మొదలు మూడుసంవత్సరాలదాకా జరిగే పరివీక్షాకాలంలో (Probation period), ఇతడు చేసేపనికిగాను, గురువు వేతనం ఇచ్చేవాడు. కాని, ఇతని పరిశ్రమకాలం దీర్ఘమైనది. సూర్యోదయం నుంచి, సూర్యాస్తమయం వరకు శ్రమించవలసిందే.

అభ్యాసకుడు, లేక, కూలివాడు పరీక్షాఫలితంగా కాని, లేక, తనకు వృత్తివిద్యలోగల జ్ఞానాన్నీ, నైపుణ్యాన్నీ కార్యరూపంలో ప్రదర్శించే ఉత్తమ వస్తునిర్మాణాన్ని కావించికాని, వృత్తివిద్యా గురువుల సంఘంలోనికి ప్రవేశం సంపాదించుకొనేవాడు. పరివీక్షాకాలంలో అతనికి కూలి లభించడంవల్ల తగినంత పెట్టుబడి ద్రవ్యాన్ని సమకూర్చుకొని, స్వతంత్రంగా వృత్తి కార్యాలయాన్ని స్థాపించుకొనే అవకాశం ఏర్పడింది. వృత్తివిద్యలో యాజమాన్యాన్ని ఉత్కాంక్షించే వ్యక్తికి, పవిత్ర కర్మాచరణంతో పదవీప్రతిష్ఠ కావించేవారు. వృత్తివిద్యా సంఘముయొక్క నియతశాసనాలను, వినియమాలను అతనికి చదివి, వినిపించేవారు. వాటిని పాటిస్తానని అతడు ప్రమాణపూర్వకంగా, శపథం చేసేవాడు.

గిల్డులోని ఈ మూడువర్గాల శిల్పులమధ్య నిజమైన సహవాసి భావం నెలకొని ఉండింది. యజమానులు, కూలివాండ్లూ కూడా, అభ్యాసకులుగా ఉన్నకాలంలో, ఒకేవిధమైన తరిఫీదుకు, క్రమశిక్షణకు, లోబడినవారే. తమ చిన్నకర్మాగారంలో కలిసి పనిచేసేవారు. లభించిన జీవిత సౌకర్యాలను పంచుకొని కలిసి అనుభవించినవారు. కనుక, అదృష్ట దురదృష్టాలను కూడా, ఏకంగా ఎదుర్కోక తప్పదు. సభ్యుల ఆర్థికప్రయోజనాలకు గిల్డు రక్షణను కల్పిస్తుంది. శ్రమకాలావధిని వినియమ పరచడము, శ్రమకు విలువకట్టి కూలి నిర్ణయించడము, తయారైన వస్తువులకు ధరలను నిశ్చయించడము,- మొదలైనవన్నీ గిల్డు చేసే పనులు. మతప్రయోజనాలకు కూడా గిల్డు అవకాశాన్ని కలిగించింది ; పూజకు తగిన ఏర్పాట్లు కావించింది ; మత సంబంధములైన ప్రదర్శనలను జరిపింది ; దారిద్ర్యానికీ, చిక్కులకూ లోనైన సభ్యులకు సహాయం చేసేది. సభ్యుల మధ్య ఏర్పడిన వివాదాల విషయంలో, గిల్డు, న్యాయనిర్ణయ రాజీసంస్థగా ప్రవర్తించి, వివాదాలు న్యాయసభలకు ఎక్కకుండా ఆపినవి.

గిల్డుయొక్క పరిపాలనమంతా సభ్యుల చేతుల్లో నడిచేది. క్రమంగా, ఆయా కాలాంతరాలలో, గిల్డు సభలు సమావేశమై, తన కార్యక్రమాలను వినియమపరచడానికి అవసరములైన శాసనాలను గావించేది. వ్యతిక్రమాలను (Defaults), నిర్ణయించడానికి, వినియమాలను కల్పించడానికీ, మండలివర్గాలు కూడా కొన్ని గిల్డులలో ఏర్పడిఉండినవి. కార్యనిర్వహణాధికారం సాధారణసభచే ఎన్నుకోబడిన సంరక్షకుల (Wardens) హస్తగతమై ఉండినది. సభ్యులు చేసే పనిని వీరు పర్యవేక్షిస్తూ, తయారయ్యే వస్తువులు ప్రమాణయోగ్యంగా ఉండేటట్లు శ్రద్ధ వహించేవారు. శాసనాలనూ, వినియమాలనూ, సభ్యులు పాటించేటట్లు చేసేవారు.

నగరపాలక అధికారంగా ఏర్పడియున్న వర్తకులు ఆదిలో ఈ వృత్తి గిల్డులకు విరుద్ధులై ఉండినారు. కనుక, గిల్డులు తమ స్థానాన్ని నెమ్మదిగా నిర్మించుకోవలసి వచ్చింది. కాని, తరువాతి కాలంలో, ఈ గిల్డులను ప్రజాసంస్థలుగా గుర్తించి, పరిమితమైన అధికారాన్ని వాటికి కలిగించినారు. నగరపరిపాలన విధానానికి లోబడిన ఒక సంస్థగా గిల్డులు పరిగణింపబడినవి. నగరపాలక అధికారంతో గిల్డులకుగల సంబంధాలు సన్నిహితమౌతూరాగా, గిల్డుల ప్రాధాన్యం పెరిగింది. కనుక, నగరపాలకోద్యోగాలూ, పౌరత్వప్రాప్తీ, కలగడానికి వృత్తిగిల్డుల సభ్యత్వం ప్రధాన ప్రవేశమార్గంగా సిద్ధించింది. మేయర్ పదవి గిల్డుల అధీనోద్యోగంగా ఏర్పడడం ఇందుకు ఉదాహరణం. తుదకు, వృత్తిగిల్డులు, వర్తకగిల్డుల స్థానాన్ని ఆక్రమించినవి.

ఏకదేశమైన ప్రత్యేకతను సార్వత్రికమైనదానితో, సమన్వయపరచడానికి భూస్వామ్య విధానం ప్రయత్నించింది. కాని, అది అవలంబించిన సామాజిక-ఆర్థిక ఆధారం ప్రబలంగా ఏకదేశమై, స్థానికంగా స్థిరపడిపోయింది. సాంఘిక రాజకీయసంబంధాలలో సార్వత్రికభావానికి అవకాశం కలిగించలేదు. దాని ప్రత్యేక భాగాలకు ఆంతరంగిక సంయోగము, స్థైర్యము కలిగినవి. కాని, విస్తృతమైన ప్రజాభాగాలతో దీనికిగల సంబంధాలు అతిదుర్బలములైనవి; మిక్కిలి సడలములైనవి.

ప్రత్యేకంగా వేర్పడియున్న, అణుప్రాయమైన స్వయంపరిపాలకమైన, గ్రామాన్ని మాత్రమే మధ్యయుగాల సామూహిక జీవితము ఆశ్రయించియున్నప్పటికీ, దాని ఉత్కాంక్షలు మాత్రము, సమగ్రమైన క్రైస్తప్రపంచము యొక్క ఐక్యనిర్మాణసాధనకై ప్రసరించినవి. ఈ ఉత్కాంక్షల ప్రభావం సమాజ జీవితంలోని అన్నివిషయాల్లోనూ ప్రవృత్తమయింది. వాతావరణ, జాతి, భౌగోళిక విభేదాలను అతిక్రమించిన సార్వజనిక సమాజము, రాజకీయ వ్యవస్థకు శిఖరంగా పరిగణించబడే రాజత్వము, దివ్యసంకల్పమనే తన భావాలకు అనుగుణంగా సమస్త జనుల ప్రవృత్తిని నడిపే సార్వజనికమైన చర్చి, రోమన్ న్యాయశాస్త్రంపై ఆధారపడిన సార్వజనిక న్యాయము, ఆదర్శవీరత్వమునకు చెందిన సార్వజనిక నియమసంహిత, సార్వజనికంగా ల్యాటిన్ (Latin) భాష,- ఇత్యాది భావనలను, మధ్యయుగాల జీవితము యొక్క ఉత్కాంక్షలు వ్యక్తపరచినవి. కళాసారస్వతాలలోను, తత్త్వశాస్త్రంలోను, మతంలోనూ కూడా ఈ ఉత్కాంక్షలు ప్రత్యక్షంగా గోచరించినవి.

**భూస్వామ్యవ్యవస్థ క్షీణించడము:** బలవత్తరమైనదే ఐనా, ప్రత్యేకతకు సంబంధించిన సంకుచితాభిప్రాయాలకూ, విశాలమే ఐనా బాహ్యానికిమాత్రమే చెందిన సార్వజనిక తత్త్వానికీ, మధ్య, జాతీయసమాజము, జాతీయరాజ్యము అనేభావానికి అవకాశం లేకపోయింది. ప్రత్యేకత, సార్వజనికత అనే అంశాలతో కూడిన భూస్వామ్య వ్యవస్థ పూర్తిగా విచ్ఛేదమైపోయేవరకూ, అట్టి జాతీయతాభావోదయం ఉత్పన్నం కాలేదు.

భూస్వామ్యవ్యవస్థకు అత్యున్నతస్థితి పదమూడో శతాబ్దంలో సిద్ధించింది. అంతట దాని విచ్ఛేద ప్రక్రియ ప్రారంభమయింది. మధ్యయుగాల భూస్వామ్యవ్యవస్థ రూపాంతరీకరణం పొందడానికి, పెక్కు అంశాలు హేతువులైనాయి. ప్రజానీకంలోనూ, ద్రవ్యవిషయంలోనూ కలిగిన వ్యత్యయాలు వీటిలో ప్రధానములు.

పదకొండోశతాబ్దం నుంచి పదమూడోశతాబ్దం దాకా, యూరోపులోని జనాభా పెరుగుతూ వచ్చింది. అంతట దాని వృద్ధి ఆగిపోయింది. అంతేకాక పధ్నాలుగోశతాబ్దంలో పదేపదే జరిగిన యుద్ధములవల్ల కలిగిన విధ్వంసములు, ప్లేగు, అంటు రోగాలు,- ఇత్యాదులకారణంగా జనాభా తగ్గుతూ వచ్చింది. వ్యవసాయ శ్రామికులకూ, వ్యవసాయావసరాలకూ మధ్యగల సంతులనం (Balance) ప్రచలితమయింది. భూస్వాముల జమీనులోని వ్యవసాయక్షేత్రంలో చాలభాగం బీడుపడింది. కూలీలు పెరిగినవి. కృషకదాసుల సేవను బలవంతంగా తీసికోవడం క్లిష్టము కావడమేకాక, వారిచే చేయించిన పనికూడా, ఫలకారికాలేదు. జాగీరుదార్లకూ రైతులకూ గల సంబంధాలు చెడిపోయినవి.

ద్రవ్యము ప్రజలలో ప్రవహించడం, ఈ ప్రవృత్తులకు ప్రోద్బలాన్ని ఇచ్చింది. భూస్వామ్యవిధాన సేవలోనుంచి రైతులను తొలగించి, తమ భూములను పట్టాదారులకు గుత్తకు అప్పగించడమూ, లేక, ద్రవ్యరూపమైన కూలి ఇచ్చి, శ్రామికులతో భూములను సాగు చేయించుకోవడమూ, లాభకరమని జాగీరుదార్లు గ్రహించినారు. తమ యజమానుల భూములనుండి ఈవిధంగా విడిపడిన కృషకదాసులకు, కాలాన్నీ శక్తినీ తమ పొలాలపై వినియోగించుకొనే అవకాశం లభించింది. ఉత్పత్తిని అధికంగావించి, అదనపు సరకును బజారులో విక్రయించి, వచ్చిన డబ్బుతో తమకు ఆవశ్యకములైన వస్తువులను పట్టణంలో కొనుక్కోడానికి, తగిన పరిస్థితి ఏర్పడింది.

పదమూడోశతాబ్దం తర్వాత, రైతులకు కలిగిన తాత్కాలిక వ్యత్యయాలు, బంగారు నాణెములు చెలామణిలోకి రావడముతో తొలగిపోయి, వారి పరిస్థితి బాగుపడింది. తమ గుత్తలను ద్రవ్యరూపంలోకి మార్చుకొని యుండిన జమీందారులు, ధరలు పెరగడంతో పెద్ద దెబ్బతిన్నారు. కాని, రైతులకు లాభం కలిగింది. ఆదాయము తగ్గి వ్యయం అధికం కావడంవల్ల, భూస్వాముల ఋణభారం పెరిగింది. కనుక, భూములను అమ్మవలసిన నిర్బంధమేర్పడింది. ఈ భూములను కొన్నవారు, చాలవరకు, పట్టణాలలోని వర్తకులు.

తత్పరిణామాలు విప్లవాత్మకములైనవి. గ్రామాలలో కృషకదాసుల వ్యవస్థ నశించిపోయి, స్వతంత్ర రైతుసంఘం ఏర్పడింది. శ్రామికవర్గం అభివృద్ధి చెందింది. పట్టణాలలోని, నిపుణులైన శిల్పులు, చేతిపనివాండ్లూ, తయారుచేసే పరికరాలు, ఉత్తమమైనవి కావడంవల్ల, గ్రామాలలోనివారు పట్టణాలపై ఆధారపడసాగిరి. అంతతో, గ్రామంలోని చేతిపనివాండ్లు తమ వృత్తులను మానుకోవలసి వచ్చింది. సేవకు సంబంధించిన కట్టుబడిపైనా, సంఘంలోని స్థిరస్థానంపైనా ఆధారపడియుండిన గ్రామసమాజం తొలగిపోయి, స్వేచ్ఛా కరారుకు సంబంధించిన సమాజానికి తావిచ్చింది. అసమగ్ర స్వతంత్రులై ఉండిన వర్గంవారికి, స్వతంత్ర వ్యక్తిత్వం సిద్ధించింది. ఆచారాన్ని అనుసరించి ఏర్పడిన హక్కులూ, కర్తవ్యాలూ, తొలగిపోయి, ద్రవ్య సంబంధం ఏర్పడింది. భూస్వామ్య వర్గమువారు, ద్రవ్య సంపాదనకై ఇతర మార్గాలను ఆశ్రయింప సాగిరి. రాజ్యానికి చెందిన, శివిల్ మిలిటరీ సంస్థలలో ఉద్యోగావకాశాలు ఎక్కువ కావడంవల్ల, ధనసంపాదనకు మరియొక మార్గం ఏర్పడింది. భూములను అంటిపెట్టుకొని ఉన్నవారు, తమ పొలాలను సంయోజనపరచి, వాటికి కంచెలను ఏర్పరచి, బజారులో అమ్ముడుబోయే సరకులను ఉత్పాదన గావించడానికీ, గొర్రెలమందలను పెంచడానికీ పూనుకొనిరి. ఈవిధంగా, మధ్యయుగపు భూస్వామ్య గ్రామపద్ధతికి సంబంధించిన

యూరోపుఖండంలో మధ్యమ తరగతిలోని ఒకభాగం, రోమన్ న్యాయశాస్త్రాన్ని అభ్యసించి, భద్రతా రక్షణలకు సంబంధించిన రోమన్ అభిప్రాయాలనూ, అత్యుచ్చ కేంద్రాధికారానికి సంబంధించిన భావాలనూ, మధ్యయుగపు రాజకీయాలలోకి ప్రవేశపెట్టింది.

యుద్ధకౌశలానికి సంబంధించిన మార్పులు,- [మందుగుండు సామగ్రిని ఉపయోగించడం ఒక నిదర్శనం.]- రాజులయొక్క అధికారాన్ని ఇతోధికం కావించినవి. అంతతో, ముట్టడికి సంబంధించిన ఉపాయాలు వెనుకబడినవి. రాజులయొక్క అధికారం అభివృద్ధి చెందుతూ ఉండగా, జాగీరుపద్ధతిపై దెబ్బతీస్తూ ఉండిన ఆర్థిక పరివర్తనాలవల్ల, కులీనవర్గం దుర్బలమౌతూ వచ్చింది. రాజుల నిరంకుశ ప్రభుత్వం జయించి, భూస్వామ్య వ్యవస్థయొక్క స్వయం పరిపాలనాధికారం నశించడం, ఈప్రక్రియ యొక్క పరిణామం.

రాజ్య విధానంలో, గొప్ప పరిపాలన సంస్థలు ఏర్పడినవి. వాటిపై ఉన్నతాధికారులు ఆధిపత్యం వహించిరి. మంత్రుల సంఖ్యా, శివిల్ ఉద్యోగుల సంఖ్యా, గుమస్తాలసంఖ్యా పెరిగింది. ఈ ఉద్యోగాలకు, తగిన వ్యక్తులను సరఫరా చేసిన మధ్యమతరగతి యొక్క పలుకుబడి, పెరిగింది.

ఇంగ్లాండులో, పరిపాలన సంస్థకు, రాజు ఉన్నతాధికారిగా ఉండేవాడు. స్వయంగా కాని, లేక, తన ప్రతినిధుల ద్వారాకాని, శాసననిర్మాణ, న్యాయ, విత్త, కార్యనిర్వహణ వ్యవహారాలలో, పాల్గొనేవాడు. రాజుకు తరువాతివాడు, న్యాయవిచార ప్రధానాధికారి (Justiciar) లేక, న్యాయవిత్త శాఖలకు అధ్యక్షుడైన ముఖ్యమంత్రి. ఈ పదవి రద్దయిపోయిన అనంతర కాలంలో, ప్రధాన న్యాయాధీశుడు (Chancellor), కోశాధ్యక్షుడు (Treasurer), పోలీసు దళాధిపతి (Constable), సైన్యాధిపతి (Marshall), అనేవారు, ప్రముఖ అధికారులుగా ఉండిరి.

పదమూడో శతాబ్దంలో, శాసననిర్మాణము, పన్నుల నియామకము, పార్లమెంటు హక్కులుగా ఏర్పడినవి. కులీనులు, క్రైస్తవమత పురోహితులు, మధ్యమతరగతులు ఎన్నుకొన్న ప్రతినిధులతో ఏర్పడింది పార్లమెంటు. కొన్ని ప్రత్యేక విషయాల క్షేత్రాధికారాన్ని, శ్రీమంత సభకు (House of Lords), అప్పగించినారు. శాసన నిర్మాణానికీ, రాజ్యానికి కావలసిన రాజస్వాన్ని సేకరించడానికీ, పార్లమెంటు, కేంద్రసంస్థ అయింది. పార్లమెంటు సంయోజింపబడిన విధానాన్ని బట్టి, వివిధ వర్గాలవారు ఒక సహకార సంఘంగా ఏర్పడిరి. ఈసంఘముయొక్క కార్యాచరణం, రాజ్యంలోని ప్రజలందరికీ ప్రత్యక్షంగా సంబంధించినట్టిది. కనుక, పార్లమెంటు కార్యక్రమాలు సామాజిక ఐక్యాన్ని గాఢంగా బలపరచినవి. ఈవిధంగా అభివృద్ధిపొందుతున్న రాజ్యకార్యకలాపం భూస్వామ్య సంస్థల ప్రత్యేక తత్త్వాన్నీ, స్వయం పోషకత్వాన్నీ, అంతమొందించడానికి సహకరించింది.

భూస్వాముల సొంతవిషయంగానూ, కులమతసంబంధమైన న్యాయస్థానముయొక్క విషయంగానూ, ప్రవృత్తమౌతూ ఉండిన న్యాయపాలనవిధానం కూడా, ఇదేవిధంగా అంతరించింది. రాజన్యాయసభ (Kings Bench), సామాన్య వివాదాల న్యాయసభ (Court of common pleas), ప్రత్యేక న్యాయసభ (Court of Exchequer) అనే వాటిద్వారా, రాజుయొక్క కేంద్ర న్యాయసభయొక్క క్షేత్రాధికారం, వ్యాప్తమయింది. క్రిమినలు కేసులు, శాంతికి భగ్నం కలిగించినందువల్ల ఏర్పడిన కేసులు, న్యాయవిరుద్ధంగా బలప్రయోగం జరిగిన

కేసులు,- ఇత్యాదులపై రాజన్యాయసభ అధికారాన్ని వహించింది. ప్రజల మధ్య ఏర్పడిన సివిల్ వ్యాజ్యాలను విచారించే అధికారం, సామాన్యవివాదాల న్యాయసభది. రాజస్వసంబంధమైన వ్యాజ్యాలను విచారించి నిర్ణయించడము, రాజస్వాన్ని సేకరించి వినియోగపరచడము, ప్రత్యేక న్యాయసభయొక్క అధికార కర్తవ్యము. రాజుయొక్క మండలి, పార్లమెంటు కూడా, న్యాయపాలనవిధానంలోని భాగాలే.

న్యాయ పాలనాధికారాన్ని రాజూ, అతని న్యాయసభలు వహించడమువల్ల భూస్వామ్య వ్యవస్థకు చెందిన న్యాయసభల అధికారం, నిర్మూలమైపోయింది. జాగీరు న్యాయస్థానాలకూ పట్టణన్యాయస్థానాలకూ, ఇదివరకు వస్తూఉండిన కేసులన్నీ కార్యతః, రాజ్యాధికారులు అధ్యక్షత వహించిన న్యాయసభల క్షేత్రాధికారంలోకి రావడమే ఇందుకు కారణం.

ఏకీకరణముయొక్క అభివృద్ధిక్రమంతో సహా, భూస్వామ్య రాజస్వ ఆశ్రయంనుంచి, రాజుకు స్వతంత్రం సిద్ధించడం గమనింపదగిన సంఘటన. బాకీలు (Dues), పరిహారాలు, ట్యాలియేజ్ అనే పన్నులు, ఇత్యాదులు మాత్రమేకాక, ఆదాయానికి నూతనమార్గాలు ఏర్పడినాయి. భూములుకల వారందరిపైనా (కట్టుబడులు ఎట్టివైనా) విధింపబడిన పన్నులు, ఆదాయంపై పన్నులు, వ్యక్తుల ఆస్తులపైగల పన్నులు, ఎగుమతి దిగుమతులపై శుల్కాలు, న్యాయసభలకు చెల్లించవలసిన రుసుములు (కోర్టుఫీజు), జరిమానాలు, విశేషాధికారాలను పదవులను అమ్మడంవల్లవచ్చిన ద్రవ్యము,-ఇత్యాదులన్నీ నూతనఆదాయాలకు ఉదాహరణలు. అధికవ్యయశీలురు, అతికాంక్షాపరులు, యుద్ధశీలురు, ఐన, రాజుల అవసరాలకు ఈ ఆదాయం చాలకపోయిన సందర్భాలలో, మధ్యమ తరగతికి చెందిన విత్తదక్షులనుంచి, బ్యాంకర్లనుంచి రుణం తీసుకోవడం జరిగేది.

ఈవిధమైన పరిణామమే సైన్యసంస్థలో కూడా జరిగింది. భూస్వామ్య వ్యవస్థలో, వీర సేవతో కొలిచే రైతులతో రాజుసేన ఏర్పడింది. సంవత్సరానికి నలభై రోజులు ఈ విధంగా సేవించవలసిన కరారుకు, వారు కట్టుబడినారు కాని, సముద్రాలనుదాటి, యుద్ధాలకు పోవడం వారికి గిట్టలేదు. ఈపద్ధతిలోని లోపాలు పండ్రెండో శతాబ్దంలో నిగ్రహింపబడినవి. అంతట, ద్రవ్యాన్ని ఇచ్చి సైనికసేవను తీసుకొనే ప్రయత్నం ఆరంభమయింది. తర్వాత, స్వతంత్ర కర్షకుల నందరినీ,- వారి ఆదాయానికి అనుగుణంగా,- ఆయుధ సైనికులుగా తయారుచేయడానికి తగిన శాసనాలు కల్పింపబడినవి. దేశంలో శాంతిని నెలకొల్పడము, విద్రోహులైనవారిని పట్టుకోవడము, ఈసైన్యముయొక్క ధర్మాలు. ఆపిమ్మట, రాజుయొక్క నియుక్తాధికారులు (Commissioned officers) సైనిక దళాలను ఒదగించగా, వారికి అవసరమైన ఆయుధాది సామగ్రినీ, జీతాలనూ, రాజు స్వయంగా ఇచ్చేవాడు. రాజుయొక్క ఆదాయం అభివృద్ధి ఐ యుండడంవల్ల, అతనికి ఈకార్యం సాధ్యమయింది. కూలి సైనిక వ్యవస్థ, తుపాకిమందు,- ఇవిరెండూ భూస్వామ్య వ్యవస్థ అనేదుర్గాన్ని, శిథిలం కావించినవి.

పధ్నాలుగు, పదహారో శతాబ్దాల మధ్యకాలంలో, భూస్వామ్య యుగానికి చెందిన సాంఘిక, ఆర్థిక, రాజకీయ సంబంధాలు విచ్ఛిన్నమైనాయి. భూస్వామ్య సమాజానికి ఆధారమైనది వ్యక్తి సంబంధము. రైతులకూ, జమీందార్లకూ- కృషకదాసులకూ, స్వతంత్ర కర్షకులకూ- శ్రీమంత రక్షక వీరులకూ, ప్రభువులకూ- ప్రభువులకూ రాజులకూ- వృత్తి విద్యా యజమానులకూ కూలీలకూ, మధ్య ఏర్పడియుండిన కరారు బంధనాలూ, నిర్బంధ బంధ

నాలూ కూడా, ఈవ్యక్తి సంబంధముయొక్క ప్రభావానికి లోనైయుండినవి. ఇప్పుడు, ఈ భూస్వామ్య ప్రభావమూ, చర్చి క్రమబద్ధశ్రేణియొక్క ప్రభావమూ, కూడా శిథిలమై పోయి నవి. వ్యక్తిగత బంధాలు సడలిపోయి, కరారు సంబంధాలు, అనివార్య సంబంధాలు బలపడి నవి. ఈనూతన వ్యవస్థ పద్దెనిమిదో శతాబ్దందాకా సాగింది.

## III. వాణిజ్య వాదపద్ధతి

భూస్వామ్య వ్యవస్థ విచ్ఛిన్నమైన అనంతరం, మధ్యయుగాల వ్యవస్థ ఆధునిక వ్యవస్థగా మారడానికి రెండు శతాబ్దాలకాలం పట్టింది. పదహారునుండి పద్దెనిమిదో శతాబ్దం దాకా జరిగిన ఈకాలాన్ని, యూరోపు చరిత్రలో పరివర్తనకాలము-లేక-సంక్రమణకాలము, అని వ్యవహరిస్తారు. చేతిపనులు ఆధారంగా ఏర్పడియుండిన మధ్యయుగ వర్తకస్థానంలో వాణిజ్యవాద పద్ధతి ఏర్పడింది. ఆర్థికరంగంలో జరిగిన పరివర్తనం ఇది. భూస్వాముల అర్ధ స్వతంత్ర సంస్థానాలలో ఏర్పడియుండిన, సడలమైన రాజ్య సంఘముయొక్క స్థానంలో, కేంద్రీకృతములూ, శక్తివంతములూ ఐన, నిరంకుశ రాజ ప్రభుత్వాలు సిద్ధించినవి. రాజకీయ రంగంలో జరిగిన పరివర్తన ఇది. ఇక బుద్ధివిషయానికీ ఆత్మవిషయానికీ, సంబంధించిన రంగాల్లో, అతి విస్తృతమైన విప్లవం జరిగింది. తత్ప్రభావంవల్ల, మానవుని మానసిక భావాలు, ప్రవృత్తులు, ప్రక్రియలు, పరివర్తనం పొందినవి. మానవుని పూర్వపు విశ్వాసాలన్నీ కూకటి వేళ్ళతో పెకలింపబడినవి. ఈవిధంగా, మూడు విధాలుగా ప్రవృత్తమైన ఉద్యమం, సమాజాన్ని రూపాంతరం పొందించి, నూతనయుగాన్ని ప్రవేశపెట్టింది. ప్రాదేశికములు, కులమత తత్త్వాలకు అతీతములు, జాతీయములు, ఆత్మ ప్రత్యయయుతములు, ఐన యూరోపు సంఘాల ఆధారంపై నిలిచియున్న, స్వతంత్ర, సార్వభౌమ రాజ్యాలతో ఆధునిక యుగం ఉదయించింది. జాతీయభావము, ప్రాదేశిక భక్తి విశ్వాసాలు అనే అనుబంధాలతో, ఈ సంఘాలన్నీ- వ్యక్తులు, వర్గాలు, కూడా-ఐక్య సంస్థగా ఏర్పడినవి.

ఆర్థికరంగంలో, భూస్వామ్య పద్ధతియొక్క స్థానాన్ని వ్యాపారవాద పద్ధతి ఆక్ర మించింది. వ్యాపారవాదము నూతన పరిశ్రమల స్థాపనకు ప్రోత్సాహం కలిగించింది. అను పూర్తి ద్రవ్యాలను (Subsidies) ఇచ్చి, ఏకస్వామ్యాధికారాలను కలిగించి, పన్నులనుంచి మినహాయించి, విదేశపుపోటీ తగ్గించి, ముడిసరకుల దిగుమతులకు తయారు వస్తువుల ఎగు మతులకు, ఆలంబనంగా ఉండేవిధంగా శుల్కపద్ధతిని (Tariffs) సంధానపరచి, ఉత్పత్తి వస్తువులు ప్రామాణికములై ఉండడానికి తగిన అధికారాన్ని నెరపుతూ, వ్యాపారవాదసంస్థ, పరిశ్రమలను అభివృద్ధిపరిచింది. పరిశ్రమాభివృద్ధికి పెక్కు ఇతర విషయాలుకూడా, దోహదం కావించినవి. మధ్యయుగ విధానం తొలగిపోయిన ఫలితంగా అభివృద్ధికి వచ్చిన వ్యక్తివాదము, గ్రామ సంఘాలయొక్కా, గిల్డులయొక్కా, ప్రాబల్యం నశించడము, ఆర్థిక జీవితంపై జాగీరుదార్లూ యజమానులూ నెరపుతుండిన నిర్బంధాలనుంచి, వ్యక్తి విడుగడ పొందడము, బుద్ధి విషయంలోను ఆత్మ విషయంలోను కల్పింపబడియుండిన బంధనాలు తెగిపోవడము,- ఇత్యాది పరివర్తనలుకూడా పరిశ్రమల వికాసానికి సహకరించినవి.

వ్యాపారవాదానికి సంబంధించిన ఆర్థికవ్యవస్థను సృష్టికి తెచ్చిన విషయాలన్నిటిలోను, మూలధనాభివృద్ధి, అతిముఖ్యమైనది. ఈ మూలధనముయొక్క ప్రభావానికి, వ్యవసాయము,

వర్తకము, పరిశ్రమలూ కూడా లోనైనాయి. పొలాలను సంయోజన పరచడము, గొర్రెల పెంపకానికై ఆవరణాలతో కూడిన క్షేత్రాలను ఏర్పరచడము,- ఇత్యాదులు వ్యావసాయికోత్పత్తిని అధికం కావించి, పరిశ్రమలకు శ్రామికులను ఒదగించినాయి. చేతి పనులను వర్తక వ్యవస్థాపకుల అధీన మొనర్చిన ఆశ్రిత కంపెనీలు అభివృద్ధికి రావడము, నూతన ప్రయాణ మార్గాలనూ నూతన దేశాలనూ కనిపెట్టడంవల్ల [అమెరికా, ఇండియా] బజారులు విస్తరించడము, మధ్యధరా సముద్ర భూముల నుంచి, అట్లాంటిక్ సముద్రతీరదేశాలకు యూరోపు ఖండముయొక్క ఆర్థిక గురుత్వ కేంద్రం (Centre of gravity) మారడము, మొదలైనవి, వర్తక విషయంలో కలిగిన ముఖ్య సంఘటనలు.

ఇండియా, అమెరికా, దేశాలను కనుక్కోవడంవల్ల బహు ముఖ్యములైన పరిణామాలు కలిగినవి. వర్తకము, పరిశ్రమ, వేగంగా అభివృద్ధిచెందినవి. పదహేడో శతాబ్దాంతానికి సముద్రాంతర వ్యాపారంవల్ల, ఇంగ్లాండుకు సిద్ధించిన జాతీయ సంపద, యూరోపు వర్తకంవల్ల లభించిన దానికంటే, మూడురెట్లు అధికమైనది. సముద్రయానానికీ, నౌకా నిర్మాణానికీ, వర్తకము ప్రోద్బలం కలిగించింది. వెండి బంగారాలు, అమెరికా నుంచి ప్రవాహ రూపంగా యూరోపులో ప్రవేశించినవి. ఇది, చెలామణీ ద్రవ్యాన్ని ఒక్కసారిగా అధికం గావించి, వ్యవస్థాపక సాహసోద్యమాలకు ఉత్తేజనం కలిగించింది. వ్యాపార పరిశ్రమరంగాలలో కలిగిన నూతన ప్రయోగ కౌశలాలు, వర్తకులకూ పారిశ్రామికులకూ, లాభాన్ని చేకూర్చినవి.

వ్యాపారవాదపద్ధతి ఏర్పడడంకూడా, ఆర్థిక ఐక్యాభివృద్ధికి దోహదకారి అయింది చెలామణీ నాణ్యాలలోనూ, తూకాల్లోనూ, కొలతలలోనూ, ఉండిన విభేదాలను, ఇది తొలగించింది. శుల్క ప్రతిబంధాలను, నగర సుంకాలను తీసివేసి, ప్రాదేశిక సంప్రదాయాల స్థానంలో, సర్వసాధారణ విధానాలను ఏర్పరచి, సుసంబద్ధమైన ఆర్థిక వ్యవస్థను స్థాపించింది. రాజ్యాధికారాన్ని కూడా ఇది పెంపొందించింది. ప్రతిస్పర్ధ వహించిన చర్చి, నగరము, భూస్వామ్య సంస్థానము, అన్నీ విస్తృతి చెందుతున్న వ్యాపారవాద పద్ధతియొక్క అధికారానికి, వశమైపోయినవి. అంతేకాక, ఈ వ్యాపారవాదవిధానాలమూలంగా, రాజ్యానికి శక్తి సంపదలు సిద్ధించినవి. వలసరాజ్యాల సంపాదనకు, సైన్యాలను పోషించుకోడానికి, తనతో పోటీపడుతున్న ఇతరరాజ్యాలతో యుద్ధాలునడపడానికీ, ఈ సంపదా, శక్తీ, ఉపయుక్తమైనవి.

'దేశీయ పద్ధతి' అని వ్యవహరింపబడిన వస్తూత్పత్తి విధానము ఆధారంగా, వ్యాపారవాద ఆర్థికవ్యవస్థ ఏర్పడింది. ఈ విధానాన్ని అనసరించి, కార్మికులు తమ ఇంటివద్దనే ఉండి, తమ స్వంత పరికరాలనే ఉపయోగించి, వస్తువులను తయారుచేసేవారు. వ్యవస్థాపకుడైన మధ్యవర్తి,కార్మికునికి ముడిసరకులను సరఫరాచేసి, తయారైన వస్తువులను గ్రహించి. వాటిని బజారులో అమ్మేవాడు. ఈమార్గంగా, వర్తకుడు వస్తువులను కొనేవ్యక్తితో, ప్రత్యక్ష సంపర్కం ఏర్పరచుకొన్నాడు; ఉత్పత్తివారుని కార్యకలాపాన్ని కూడా తన అధీనంలో నిలుపుకొన్నాడు. మధ్యమ తరగతి వారి విజయంపైనా బూర్జువా మూలధన సిద్ధాంతంపైనా, వ్యాపారవాదము తన ముద్రవేసింది.

రాజ్యముయొక్క సమస్తమైన ప్రాబల్యాన్నీ, అధికారాన్నీ, హస్తగతం చేసుకోడానికి సాధనంగా ఉపయోగించుకొంటున్న రాజకీయ ప్రక్రియను, సమగ్రం కావించేసంస్థ, వ్యాపార

వాదము.

రాజ్యముయొక్క అధికారాధిపత్యాలతో పోటీపడడము, రాజ్యముయొక్క అధికారాన్ని పరిమితం కావించడము, అనే ప్రయత్నాలనుంచి, భూస్వామ్య శ్రీమంతులు, పదహారో శతాబ్దంలోనే విరమించుకొన్నారు. కాని, ప్రజల బుద్ధిపైనా, వారి విశ్వాసాలపైనా, చర్చి ఇంకా తన ప్రభావ ప్రాబల్యాలను ప్రవర్తింపచేస్తూనే ఉంది. మానవుని మనస్సుకు స్వేచ్ఛను కలిగించి, రోమన్ క్యాథొలిక్ చర్చియొక్క క్రమశిక్షణను, వ్యవస్థావిధానాన్ని పదత్రోసిన ఉద్యమాలు, పునరుజ్జీవనము, మతసుధారణ అనేవి.

ఇటలీలో ప్రారంభమైన పునరుజ్జీవనమనే ఉద్యమం, సంక్లిష్టమైన ఒక సంఘటన. ఆది దశలో అది, ప్రాచీన గ్రీకు సంస్కృతిని పునః సంపాదించుకొనే ఉద్యమమై ఉండినది. ఐతే, హేతువాద బద్ధము, విమర్శాత్మకము ఐన విజ్ఞాన చైతన్యం, గ్రీకు సంస్కృతి, మానవత్వ ప్రధానమై యుండిన ఈ సంస్కృతి ప్రకృతి జీవితంతో ఆనందించేది. ప్రకృతికి అతీతము లైన విషయాలకు ఇందులో ప్రసక్తి అల్పం.

ఇక రెండవవైపున, భూస్వామ్యపు యూరోపులో, మతానికి సమస్త వ్యాపకమైన ప్రాబల్యం ఏర్పడి యుండినది. రాజకీయ ఆర్థిక జీవితాలు కూడా, మతాధికార మత నిర్దేశాలకు లోబడినవి. జీవితంలో హేతువాద ప్రవృత్తికి కూడా, పరిమితులను విధించింది చర్చి. క్రిశ్చియనుల జీవితాన్నీ, ప్రవర్తననూ జీవిత వ్యవహారము లన్నిటిలోనూ, వినిమయ పరచి, నడుపుతూ వచ్చింది. వ్యక్తుల నడవడి విషయంలో ప్రమాణాలను కూడా శాసించింది.

మధ్య యుగాల మతాచార్య వ్యవస్థపై ప్రాణాంతకమైన దెబ్బతీసింది పునరుజ్జీవనోద్యమం. తమ ప్రవర్తనలను సమర్థించుకోవడంలో, జనులు, తమకు గల హేతువులపై ఆధారపడజొచ్చిరి. తమ జీవితంపై మతానికీ, సంప్రదాయానికీగల అధికారం ఎట్టిదో అని, పరీక్షింపసాగిరి. ప్రకృతి, - విజ్ఞానశాస్త్రము, మానవుడు - అతని సుఖదుఃఖాలు, సాహసోద్యమం, సౌందర్యం,—మొదలైన విషయాలపట్ల ఆసక్తి వహించిరి. తన్ను ఇంతవరకు బంధించి ఉంచిన, సంకుచిత కులమత జీవిత ఆవరణాన్ని భేదించుకొని, మానవుడు బైట పడినాడు.

ఈ విధంగా సంపాదించుకొన్న స్వేచ్ఛా ప్రభావం, మత సంస్థకు కూడా వ్యాపించింది. లూథర్ వంటి వ్యక్తులు, రోమన్‌క్యాథలిక్ చర్చి మత తత్త్వాన్నీ, సిద్ధాంతాన్నీ పరీక్షింపసాగిరి. పీటర్ సిద్ధాంతాన్ని తమ ఆత్మసాక్షికి ఆధారంగాచేయక, తమ జీవిత సమర్థనం వ్యక్తి జీవితంలో ఉన్నదని గ్రహించిరి. చర్చి సంస్థలో చీలిక ఏర్పడింది. పార్లమెంటు అను మతితో ఇంగ్లాండు రాజులు, రోమన్‌చర్చిపై తమకు ఉండిన స్వామి నిష్ఠను త్యజించి, ఇంగ్లాండుదేశపు చర్చిపై, పరమాధికారాన్ని వహించిరి. పోపుయొక్క అత్యుచ్ఛాధికారాన్నీ, రోమన్ క్యాథొలిక్ మతాన్నీ నిరాకరించడంలో, జర్మనీలోని రాజులనేకులు, లూథర్‌ను అనుసరించిరి. ఇదే విధమైన ఉద్యమాన్ని, స్విట్జర్‌లాండులో, కాల్విన్ నడిపినాడు. ప్రొటెస్టెంట్ మతము, యూరోపులోని తక్కిన దేశాలకు కూడా వ్యాపించింది.

మత విషయకమైన ఈ సుధారణయొక్క వ్యాప్తివల్ల, ప్రతి యూరోపు దేశమూ స్పర్థతో కూడిన రెండు కక్షలుగా,- రోమన్ క్యాథొలిక్, ప్రొటెస్టెంట్- చీలిపోయింది. సంకుచితమైన మతజీవితాన్ని మాత్రమేకాక, మానవునికి సంబంధించిన రాజకీయ, ఆర్థిక, పౌరవర్తనలనుకూడా, తమ అధీనాధికారాల్లో, నిలుపుకోడానికి ఈ రెండు మతవర్గాలూ

యత్నించినవి. ఇట్టి పరిస్థితుల్లో, యుద్ధము అనివార్యమయింది. విభేదాలు, రాజీ కుదరని స్థితికి వచ్చినప్పుడు, వ్యవహారాన్ని పరిష్కరించేది ఆయుధము మాత్రమే. కనుకనే, మత యుద్ధం సిద్ధించింది.

పదహారో శతాబ్దపు మధ్యకాలంనుంచి, పదిహేడో శతాబ్ద మధ్యకాలంవరకూ,- నూరు సంవత్సరాలకాలం, యూరోపుఖండం మతయుద్ధాల్లో మునిగిపోయింది. భయానకములైన సామూహిక సంహారాల తర్వాత, సర్వ వినాశకరములైన యుద్ధయాత్రల అనంతరం, కట్ట కడపటికి, యూరోపు వాసులకు జ్ఞానోదయమయింది. ఉత్తమమార్గంలో, క్యాథొలిక్ మత స్థులుగాను, ప్రోటెస్టెంట్ మతస్థులుగాను జీవిస్తూకూడా, తమ రాజ్యాలపట్ల భక్తి విశ్వాసాలు గల ప్రజలుగా ఉండడం సాధ్యము, అనే గుణపాఠాన్ని వీరు నేర్చుకొన్నారు.

ఈ విధంగా రాజకీయాలు కులమత సంబంధాలను తొలగించుకొన్నవి. తుచ్ఛ ప్రాపంచిక జీవిత ప్రయోజనములనుంచి ఏర్పడే మానవ వ్యవహారముల సంపర్క సంయో గాలనుంచీ, మతముకూడా షాశితమైనది. "సీజర్ వస్తువులను సీజర్‌కు ఇచ్చి, దేవుని వస్తువు లను దేవునికి అర్పించండి." అనే జీసస్ ఉపదేశం కట్టకడపటికి పాలింపబడింది. వివిధ మతాలవారూ తమవిభేదాలను విస్మరించి, అందరికీ సమానములైన ఆశయాలను సాధించుకో డానికై, సార్వజనికమైన జాతీయ సంస్థయొక్క సభ్యులుగా ఏకమైరి.

రాష్ట్ర రాజ్యాలతోకూడిన యూరోపును ఏర్పరచడానికి, ఈమూడు విప్లవాలూ ఒక్కటిగా కలిసి ప్రవృత్తమైనవి. జాతీయ ఐక్యానికి, జాతీయ శక్తికి, అవసరమైన ఆర్థి కాధారలను, వ్యాపారవాదం సిద్ధపరచింది. జాతీయభాషలు, సంస్కృతులు రూపొందడానికి పునరుజ్జీవనోద్యమం తోడ్పడింది. జాతీయములైన చర్చి సంస్థల స్థాపనకు, మతసుధార ణోద్యమం కారకమయింది. మధ్యయుగాల సార్వజనిక వాదము తొలగి, దానిస్థానంలో, కుల మతాతీతము, ప్రాదేశికము. ఐన, ప్రత్యేకతావాదం ఏర్పడింది.

## IV. పారిశ్రామిక విప్లవము-జాతీయత

రాజుల అధికారానికి లోబడిన, కేంద్రీకృత రాజకీయ వ్యవస్థలో, యూరోపు జాతులు జాతీయ ఐక్యమనే చైతన్యాన్ని అభివృద్ధి పొందించుకొన్నవి. ఈ చైతన్యం రెండు విధములై నట్టిది. ఒక ప్రత్యేక దేశంలో నివసించే ప్రజలతో, ఏకీభావ చైతన్య మనేది ఒకటి. ఇతర దేశాల్లో నివసించే ప్రజలతో తమకుగల భేదాన్ని గుర్తించేది రెండవది.

ఈ జాతీయ భావన మొదటిసారిగా ఉదయమయింది ఇంగ్లాండు దేశంలో. 1680లో, జరిగిన విప్లవం, రాజుయొక్క అధికారాన్ని ప్రజలకు బదిలీచేయడం ఇందుకు కారణం. రాజుకు అర్పిస్తూ ఉండిన స్వామిభక్తి విశ్వాసాలు ఇప్పుడు ప్రజలకు చెందినవి. వ్యక్తులూ సంఘమూ కూడా, తమ ఐక్యాన్ని పార్లమెంటులో సాధించుకొన్నారు. సర్వజనామోదాన్ని పొందిన మొదటి జాతీయగీతం — 'రూల్ బ్రిటానియా' అనేది, 1740 లో రచితమయింది.

1789 నాటి రక్తపాత యుతమైన విప్లవాగ్నిలో ఫ్రెంచిదేశపు పాత పరిపాలన నశించిపోయింది. రాజుల దివ్యహక్కు అనే సిద్ధాంతం, ఆ దావాగ్నిలో బుగ్గియై పోయింది. "రాజ్య మనగా, నేనే రాజ్యము" అనే పధ్నాలుగో లూయీ (Lowis XIV) యొక్క

దంబమూ, "నా వ్యక్తియందే అత్యుచ్చాధికారం నెలకొన్నది", "నాతో ఏకమై ఉండడం వల్లనే నా ప్రజలకు మనుగడ ఉన్నది," అనే అతని మునిమనుమని బడాయి మాటలూ, — ఎన్నడో విస్మృతి చెందినవి. విప్లవంనుంచి ఫ్రాన్సు ఒక జాతిగా బైటపడింది; అంత, నెపోలియన్ విజయాలు, ఫ్రాన్సుకు కీర్తి ప్రతిష్ఠలను చేకూర్చినవి.

నెపోలియన్ విజయాల కారణంగా, యూరోపులో జాతీయభావమనే జ్యోతివెలిగింది. పందొమ్మిదో శతాబ్దంలో, దేశం తర్వాత దేశం, ఈ జ్యోతిని దర్శించింది. గ్రీస్, బెల్జియమ్, జర్మనీ, ఇటలీ, పోలండ్, హంగేరీదేశాలు జాతీయసంపాదనకై తహతహలాడినవి; స్వేచ్ఛను ఐక్యాన్నీ ఆశించినవి. అంత, ఏషియా ఖండముకూడా దీని ప్రభావానికి లోనయింది. ఈ విషయంలో ముందంజవేసింది జపాన్. టర్కీ, ఇరాన్, చైనా, ఇండియా, అన్నిదేశాలూ ప్రచలితములైనాయి. ఈరోజు, జాతీయత అనేది ప్రపంచ మంతటా వ్యాపించిన పరమాద్భుత విషయం. ప్రపంచజాతుల నన్నిటినీ అది కదిలించి, ఉజ్జీవింపచేస్తూ ఉంది.

భూస్వామ్యపు అరాజకత్వంనుంచి, జాతీయ స్థైర్యాన్ని సాధించుకోడానికి, యూరోపుకుఏడుశతాబ్దాల కాలం పట్టింది. ఐనా, జాతీయత అనే భావం స్థిరపడిన వెంటనే, దాని అభివృద్ధి వేగవంతమయింది.

జాతీయతా ఉదయానికి సూచకమైనది మధ్యమ తరగతి ప్రజ కావడంవల్ల, దాని లాభాలను పొందినదికూడా స్వాభావికంగా ఆ వర్గమే. రాజకీయాధికారం దాని హస్తగతమయింది; రాజ్యాల ఆర్థికవ్యవస్థపై మధ్యమతరగతియొక్క ప్రయోజనాలు ప్రాబల్యం వహించినాయి. రాజకీయాధికారము రాజునుండి ప్రజలకూ, సంకుచితమైన స్వల్పజనాధిపత్యము మధ్యమ తరగతి వర్గానికీ బదలీకావడంవల్ల, స్వతంత్ర సంస్థలు ఉత్పన్నమైనాయి. ఈ సంస్థలు బాహ్యాధికారానికీ, బాహ్యమధ్యస్థానానికీ లోబడని స్వతంత్రసంస్థలు. తమఅధికారాన్నిప్రవృత్తమొనర్చడంలో సర్వస్వతంత్రములైనట్టివి. కాని, ప్రజల సంకల్పమే తమ సంకల్పమైయున్న అధికారానికి అవి, విధేయములై ఉండడంవల్ల వాటికి స్వేచ్ఛకలదు. ఓట్ల హక్కు మూలంగా ప్రజలు ఎన్నుకొన్న ప్రతినిధుల ద్వారా, ఈ సంఘాల రాజకీయాధికారం, ప్రవృత్తమయ్యేది. కరారులను కావించుకోవడంలో వ్యక్తికి స్వేచ్ఛ, పరిశ్రమలో పోటీ నుంచి స్వేచ్ఛ, అనే పద్ధతివల్ల, ఆర్థిక స్వేచ్ఛ సాధ్యమయింది. భావము. భావ ప్రకటనము, మతము, వృత్తి, ఇత్యాది రంగాల్లో నిర్బంధాలను తొలగించడంవల్ల, సాంస్కృతిక స్వాతంత్ర్యం సిద్ధించింది. మధ్యమ వర్గంయొక్క ఆశ్రయంలో మూలధన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందడంతో, వస్తూత్పత్తి అత్యధికంగా పెరిగింది. ఇదివరకు ఎన్నడూ లేని పరిమాణంలో సంపద వృద్ధి చెందింది. అత్యధికంగా వృద్ధి చెందే ప్రజలకు అధికారంలోనూ సంపదలోనూ భాగం సిద్ధించింది. కనుక, సమగ్ర సమాజంతో రాజ్యం ఐక్యం పొందే ప్రక్రియ, సంపూర్ణమైన సమానత్వానికీ, స్వేచ్ఛకూ, ప్రజా పరిపాలనకూ సన్నిహితంగా నడిచింది. ఈ పరిణామంలో వ్యక్తికి, సంఘానికి రాజ్యానికిగల విలువ, స్థానము, విప్లవాత్మకమైన మార్పులకు లోనైనవి. మరిన్నీ, మానవుని విలువకూ,—ధ్యేయాలకూ, సంబంధించిన భావాలు పూర్తిగా రూపాంతరం పొందినవి.

**యూరోపు యొక్క విస్తృతి :** యూరోపులోని పెట్టుబడిదారీ సమాజం, తన

ప్రాబల్యాన్ని ప్రపంచంలో విస్తరింప చేయడానికి పూనుకొంది. దీనికి కారణం, ఆ సమాజము యొక్క ప్రకృతిలోనే, నిహితమై యున్నది. తన పరిశ్రమలకు అవసరములైన ముడి పదార్థాలను సేకరించుకోవడము, తనదేశంలో తయారైన వస్తువులకు బజార్లను వెదుక్కోవడము, పెట్టుబడిదారీ వ్యవస్థకు అనుబంధాలు. కనుక, అట్టి విస్తరణ ప్రయత్నంలో ఈ వ్యవస్థ ఇండియాను ప్రవేశించింది. పెట్టుబడిదారీ వ్యవస్థ నెలకొన్న, యూరోపు అంతటిలోనూ ఇంగ్లాండు ఎక్కువ పురోగమించిన రాజ్యము. ఇండియా దేశంపై, ఇంగ్లాండు తన ఆధిపత్యాన్ని నెలకొల్పి , దేశాన్ని రూపాంతరం పొందించగల ప్రబలశక్తులను ప్రవృత్తిలో పెట్టింది. ఈవిధంగా ప్రచోదింపబడి భారతదేశం, జాతీయతవైపు పయనించింది. జాతీయ ఐక్యము అనే చైతన్యోదయమువల్ల ఉద్బోధను పొంది, శక్తివంతులై భారతీయ ప్రజలు స్వాతంత్ర్య సంపాదనకై పోరాటం సాగించినారు.

యూరోపు సమాజ పరిణామ చరిత్రనుంచి సిద్ధించే జ్ఞానము, ప్రాచీన భారతదేశ వ్యవస్థను అర్థంచేసుకోడానికి ఉపకరిస్తుంది. యూరోపియనులు ఈ దేశంలో ప్రవేశించక పూర్వము, దేశ చరిత్రలో కలిగిన మార్పుయొక్క వేగము, సామరస్యము, భారతదేశానికి విశిష్టమైన పద్ధతిని అనుసరించినవి. జీవితపరిస్థితులు జడప్రాయమైనవి కావడంవల్ల, ఈ మార్పు మందగతిలో నడిచింది. ఒక్కభాగంలోనే జనాభా ఎక్కువ దట్టంగా నివసించడమో, లేక, నివాసాలు ఏర్పడని విశాల ప్రాంతాలలో విరళంగా చెదరి ఉండడమో, ఆనాటి నివాస పరిస్థితులు. ఉత్పాదన పద్ధతులు,- ఏ కాలమునాటివో,- మార్పులేక స్థిరపడిపోయినవి. ప్రజల స్వల్పావసరాలను తీర్చడానికి అవి చాలు. తెరలు తెరలుగా, ఏర్పడియున్న, సమాజ వర్గాలు బిగుసుకొని పోయినవి. సమాజంలో చలనశక్తి లోపించింది. అంతట పద్ధెనిమిదో శతాబ్ద మధ్యకాలంలో, అన్నివిధాలా భిన్నమైన నాగరకతగల, క్రియాశక్తమైన, పాశ్చాత్య సంఘంతో, భారత ప్రజకు ప్రగాఢమైన సంఘాతం కలిగింది. తత్పరిణామంగా, పాశ్చాత్య ప్రభావాలు ప్రబలశక్తితో కార్యకారి కాజొచ్చినవి. సమాజముయొక్క పరివర్తన ప్రక్రియలను వేగవంతములుగా చేసి, యూరోపులోని పరివర్తనలవంటి ఫలితాలను, ఇక్కడ కూడా కలిగించినవి.

ఔరంగజేబు మరణానంతరం ఇండియాలో క్షీణదశ వేగంగా ప్రారంభమయింది. పద్ధెనిమిదో శతాబ్ద మధ్యకాలానికి, కేంద్రాధిపత్యం పూర్తిగా నాశం కావింపబడింది. దేశం అస్తవ్యస్తతకూ, అరాజకానికీ ఆకరమయింది. మొగలు సామ్రాజ్య స్థానాన్ని వహించి, దేశముయొక్క ఐక్యాన్ని రక్షించడానికి సమర్థుడైన వ్యక్తికాని, వర్గము కాని, సృష్టికిరాలేదు. ఈ విధంగా ఏర్పడిన రాజకీయ శూన్యస్థితిని, అవకాశంగా తీసుకొని విదేశరాజ్యాలు, దేశం ప్రవేశించినవి. ఇట్టిశూన్య పరిస్థితులు ఏర్పడిన పూర్వపు రోజులలో, మధ్య ఏషియా నుండి దాడి వచ్చిన రాజులు, దేశాన్ని ఆక్రమించియుండిరి. పద్ధెనిమిదోశతాబ్దంలో, భారత పశ్చిమోత్తర దేశాలవారు, అంతః కలహాలలో మునిగి యుండిరి. 1739 లో నాదిర్‌షా, 1748-1773 మధ్యకాలంలో అహమద్‌షా అబ్దాలీ అనేవారు, ఇండియాపై దండయాత్రలు జరిపి, అప్పటికే, శిథిలావస్థలో ఉండిన ఢిల్లీ సామ్రాజ్యంపై పెద్ద దెబ్బతీసినమాట వాస్తవమే. కాని, ఇరాన్, ఆఫ్ఘనిస్తాన్, మధ్య ఏషియాలోని పరిస్థితులు అనుకూలమైనవి కానందువల్ల, మహమద్ గజనీ, షహాబ్‌ఉద్దీన్, బేబర్‌వంటి వీరులు పూర్వము సాధించినట్టి విజయా

లను ఇప్పుడు ఇండియాలో సాధించడానికి వీలులేకపోయింది.

సముద్రాల అవతలనుండి, వచ్చిన విదేశీయులు, ఇండియాలో తమ ఆధిపత్యాన్ని, నెలకొల్పుకోడానికి, పరిస్థితులు ఈ విధంగా సహకరించినవి. విదేశాలనేకములు ఈ రాజ్య స్థాపనకై పోటీపడినవి. కట్టకడపటికి, తనతో స్పర్థవహించిన, యూరోపుదేశాల నన్నిటినీ ఓడించి, ఇంగ్లాండు, భారత ప్రజలను తన పరిపాలనలోకి తెచ్చుకొంది.

1757 నాటి ప్లాసీయుద్ధం, మనోవేధకమైన నాటక ప్రవర్తనకు నాందిగా ఏర్పడింది. అంతట, ఆసక్తికరమైన, మానవజాతి జీవితనాటకం ప్రారంభమై, 15 ఆగస్టు 1947 నాటి భరతవాక్యంతో ముగిసింది. ఈ నాటకముయొక్క ఇతివృత్తం నిజంగా, మహావీరగాథ. ఈ గాథానిర్వహణను, రెండు శతాబ్దాలకాలం పట్టింది. అన్ని నాటకాలలోవలెనే, ఇందునూ, నైతిక భౌతికశక్తుల మధ్య ఏర్పడిన అతిమానుష సంఘర్షణమే నాటక ఇతివృత్తమైనది. దీని పూర్వరంగము ప్రాచీనకాల వ్యవస్థను సంబంధించినది. కాని, ఈ నాటకరూప వీరగాథలోని ఘటనావళియొక్క చరిత్ర పద్దెనిమిదో శతాబ్దపు తొలిరోజుల్లో ప్రారంభమౌతుంది. ప్రాచీన భారత వ్యవస్థ, మరుగుపడడానికీ, నూతనశక్తుల ప్రభావం ప్రవృత్తం కావడానికీ, ఆరంభమైనది ఆ సమయంలోనే.

ఇతివృత్తపోషణ మూడు అంకాలలో నిర్వహింపబడింది. తన సహజశీలానికి విరుద్ధంగా ప్రవర్తించిన భారతదేశం, స్వాతంత్ర్య వినాశమనే పతనానికి ఉన్ముఖంగా నడవడం, ప్రథమాంకములోని వస్తువు. తన ప్రకృతికి పూర్తిగా భిన్నమైన విదేశీయ నాగరకతయొక్క ఆఘాతంవల్ల, ఒక నూతనశక్తి ఉదయించడమూ, అది, శేషభాగాలుగా నిలిచియున్న ప్రాచీనశక్తికి నూతన రూపకల్పన కావించడమూ, అనేది రెండవ అంకములో నిర్వహింపబడిన ఇతివృత్తము. ఈవిధంగా, పునరుజ్జీవించిన భారతదేశము, ఆత్మసిద్ధిని స్వాతంత్ర్యాన్ని, సంపాదించుకోడానికి నూటిగా, స్థైర్యంతో, పురోగమించడం, మూడవ అంకములోని ఇతివృత్తం.

# 1
# మొఘల్ సామ్రాజ్య క్షీణపతనాలు

## I ఔరంగజేబూ, అతని ఉత్తరాధికారులు

ఆ కాలపు ప్రపంచదేశాలలో, విస్తృతిలోను, జనాభాలోను, సంపదలోను, అద్వితీయమైన సామ్రాజ్యాధికారాన్ని, యాభై సంవత్సరాలకాలం ఔరంగజేబు నిర్వహించినాడు. అత్యంతమూ కష్టసాధ్యమైన రాజ్యకర్తవ్యాలను నిర్వహించడంలో, అనురక్తినీ, కర్తవ్య నిష్ఠను, ధైర్యాన్ని, శాంతాన్ని ప్రదర్శించి, విశిష్ట ప్రజాపాలకుడుగా గుర్తింపబడినాడు. స్వంత జీవిత విషయంలో, ఆదర్శపురుషుడుగా ప్రవర్తించినాడు. ఏషియా ప్రభువులకూ రాజులకూ సాధారణాలైయున్న దుర్వ్యసనాలకు అతడు దూరుడు. సామాన్యమైన జీవితం మాత్రమేకాదు; వ్రతశీలమైన జీవితం అతనిది. ఆహారము, పానీయము, వస్త్రధారణము అనే వాటిలో మాత్రమేకాక, తక్కిన అన్ని జీవిత సౌకర్యాల విషయంలోనూ, అతడు మితం పాటించినాడు. సామ్రాజ్య పరిపాలనకు సంబంధించిన దుర్భరకార్యక్రమాన్ని నిర్వహించే కాలంలో కూడా, అతడు తన జీవితావసరాలకు కావలసినవాటిని సంపాదించడానికై, కురానుకు ప్రతులు వ్రాయడము, టోపీలు కుట్టడము అనే పనులు నిరంతరంగా చేసేవాడు. అతని కడపటి వీలునామాలో, తన అంత్యక్రియల ఖర్చులను గురించి ఈ విధంగా వ్రాసిపెట్టి యున్నాడు. "టోపీలు కుట్టగా వచ్చినవెల, నాలుగు రూపాయలు రెండణాలు, మహల్‌దార్ అయియాబేగ్ స్వాధీనంలో ఉంది. ఆడబ్బును తీసుకొని, ఈ నిస్సహాయుడైన ప్రాణియొక్క శవ వస్త్రానికై ఖర్చుపెట్టండి. కురాను ప్రతులు వ్రాయగా వచ్చిన కూలీ, మూడునందలా ఐదు రూపాయలు, నాడబ్బు సంచిలో ఉంది. అవి నావ్యక్తిగత ఖర్చులకై నిలువచేయబడినట్టిది. నామరణం రోజున ఆ డబ్బును ఫకీరులకు పంచిపెట్టండి." ఇది అతని కడపటి వీలునామా. బహు కష్టతరమైనది అతనిదైనిక చర్య. మూడు గంటలు మాత్రమే అతడు నిద్రకు వినియోగించేవాడు. పనిచేయించడంలో, దాక్షిణ్యం లేనివాడు. ఈ నిష్ఠురత ఇతరుల విషయంలోనేకాక, తన విషయంలో కూడా వర్తించింది. అతని విస్తృతమైన పరిపాలన విధానానికి సంబంధించిన ప్రతి అంశాన్ని అతడు గమనించేవాడు; ప్రతియుద్ధ యాత్రనూ తానుస్వయంగా నడిపేవాడు. అక్షయమైన శక్తీ, అణపడానికి సాధ్యముకాని సంకల్పమూ, అతని స్వత్వాలు.

విస్తృతమైన పరిశ్రమ, నిద్రారహితమైన జాగ్రత్త, ధర్మశుద్ధమైన నిష్ఠ, పరిపాలకుడుగా, రాజనీతిదక్షుడుగా, సైన్యాధిపతిగా విశిష్టసామర్థ్యము,- అతనికి ఉండినా, అతని పరిపాలనమాత్రం విఫలమయింది. ఈ విషయం అతనికి కూడా తెలుసు. అతని రెండవ కుమారుడైన అజాంకువ్రాసిన కడపటిజాబులో, "నిజమైన రాజ్యపరిపాలన, నేను ఏ

మాత్రమూ కావించలేదు; రైతులను ఏమాత్రమూ ఆదరించలేదు. ఎంతో విలువైన జీవితం నిష్ప్రయోజనమైపోయింది." అని తన అపజయాన్ని ఒప్పుకొన్నాడు.

మరణించక పూర్వమే, ముఅజామ్, ఆజామ్, కామ్‌బక్ష్, అనే తన ముగ్గురు కొడుకులకూ, ఔరంగజేబు తన సామ్రాజ్యాన్ని పంచియుండినాడు. కాని, అతని మరణం వెను వెంటనే సామ్రాజ్య ఉత్తరాధికారానికై, వారిలో, కలతలు బయలుదేరినవి. ఈ అన్నదమ్ముల సంఘర్షణలో, ముఅజామ్ విజయాన్ని సంపాదించుకొని, బహదూర్‌షా అనే బిరుదుతో సింహాసనమారోహించెను. కాని, అతని పరిపాలనకాలం అల్పమైనది. నాలుగుసంవత్సరాలు మాత్రమే రాజ్యపరిపాలనకావించి, 1712లో అతడు మరణించెను. అంత, ఉత్తరాధికార యుద్ధం ఎప్పటిరీతిగా మరల ప్రారంభమయింది.

సింహాసనానికై ఇతని నలుగురుకొడుకులూ చూపిన అసభ్యమైన ఆతురతవల్ల, బహదూర్‌షా శవానికి, నెలరోజులదాకా అంత్యక్రియలుకూడా జరుగలేదు. ఈ యుద్ధం, కడపటికి ఇరువురుకొడుకుల పోటీగా ఏర్పడింది. అధికసమర్థుడైన అజీమ్-ఉష్-షాన్, అనే రెండవకొడుకు ఒకపక్షంగానూ, ఇంద్రియలోలుడైన జహన్‌దర్‌షా మరియొక పక్షంగానూ, ఈ సంఘర్షణ నడిచింది. కాని, యుద్ధనిర్వహణ విషయంలో, అజీమ్-ఉష్-షాన్ అవివేకంతో ప్రవర్తించెను. ఇరానీవర్గ ప్రముఖనాయకుడైన జుల్ఫికర్‌ఖాన్, సామ్రాజ్యసేనకు ప్రధానవేతనదాతయైన మీర్‌బక్షీ అనేవారు అతికౌశలంతో యుద్ధాన్నినడిపి, జహాందార్‌షాకు సింహాసనాన్ని సంపాదించి ఇచ్చినారు.

జహాందార్‌షా సామ్రాజ్యాధికారాన్ని వహించడంతో, సామ్రాజ్య రాజకీయాలలో దౌర్భాగ్యకరమైన సందర్భము ఏర్పడింది. ఇంతవరకూ, ఉత్తరాధికార సంపాదనకై యుద్ధములో పాల్గొన్నవారు, చక్రవర్తి కుమారులు మాత్రమే. ఇప్పుడు వారు మరుగుపడిపోయిరి. వారికి బదులుగా దురాశాపరులైన కులీనులు, ఉన్నతాధికార పదవులలోని వారు, విభేదకక్షలనాయకులు,- ఇత్యాదులు అధికారానికై పోటీపడసాగిరి. చక్రవర్తి కుమారులను నామమాత్రంగా తమకు ప్రభువులుగాను, నాయకులుగాను ప్రదర్శిస్తూ, వీరు కలహాలకు పూనుకొనిరి. చక్రవర్తి కుమారులపేర్లు, ప్రతిష్ఠతోనూ, రాజాధికార ముద్రతోనూ, కూడినవి కావడంవల్ల, వీరు జారీచేసే ఆజ్ఞలు, నిర్ణయాలు న్యాయబద్ధంగా చెల్లుతాయి. ఈ విధంగా, బలవంతులైన సరదారులు మొదలైన వారు, రాజ ప్రతిష్ఠాపకులుగా ప్రవర్తింపసాగిరి.

ఇట్లు ప్రవర్తిస్తూ అధికారాన్నీ, ఆశ్రయాన్నీ ప్రజలపై నెరపుతూ, సంపదను కూడబెట్టుకొనిరి. ఈ విధంగా, అడ్డులేక దేశంలో ప్రవర్తించిన ఆంతరంగిక సంఘర్షణలవల్ల, మహాసామ్రాజ్యసౌధం కూలిపోయింది.

పర్యాలోచన ఏమాత్రమూ లేక విషయలంపటుడైన స్వేచ్ఛావిహారి జహందర్‌షా, పిచ్చిగా భంగు సేవించేవాడు. రాజాస్థాన జీవితం స్వేచ్ఛా విహారానికీ, విషయలాంపట్యానికీ స్థానంకావడానికి ఇతడే మార్గదర్శిఐనాడు. పరిపాలక వర్గంవారి నైతిక భ్రష్టతకు ఇతడే కారకుడు. ఇతని దుష్ట జీవిత ప్రభావం కారణంగా, ప్రాచీన సామ్రాజ్య వైభవపునరుద్ధరణం సాధ్యముకాని విషయమయింది. అంతేకాక, పరిమితమైన స్వతంత్రరాజ్యంగా నిలిచి ఉండే అవకాశాలుకూడా లోపించిపోయినవి.

చక్రవర్తి ఒక కీలుబొమ్మ ఐపోయినాడు; అధికారమంతా వజీరుచేతుల్లోనూ, మంత్రుల

చేతుల్లోనూ నిలిచిపోయింది. వారు కూడా, ఈ అధికారాలను తమ ప్రతినియుక్తులకు (Deputies) కు అప్పగించినారు. ఈ విధంగా, బాధ్యత విచ్ఛిన్నమైపోయింది. అధికారంలో ఉన్న మంత్రియొక్క విచిత్రభావనలను అనుసరించి, అధికారోద్యోగాలు వ్యక్తి నుంచి వ్యక్తికి, మారుతూపోయినవి. తాత్కాలికంగా ఈ పదవులలో ఉండినవారు, ఈ అవకాశాలను ఉపయోగించుకొని వేగంగా ధన సంపాదన కావించుకొంటూ వచ్చిరి. తత్ఫలితంగా, పరిపాలనను గమనించే వారులేక, అవ్యవస్థ వ్యాపిస్తూ వచ్చింది. రాజసింహాసనానికి అనేకులు పోటీపడుతుండడంవల్లను, చక్రవర్తులు చిత్రదర్శక యంత్రంలోవలె క్షణక్షణం, మారుతుండడంవల్లనూ, ప్రభుభక్తి విశ్వాసాలనే భావాలు మాయమైనవి.

అతని పూర్వులు సేకరించిపెట్టిన కోశాగార సంపదలన్నిటినీ, జహందర్‌షా, తన పదకొండు నెలల పరిపాలన కాలంలో వ్యర్థంగా వెచ్చపెట్టినాడు. బాబరు కాలము నుంచీ సేకరింపబడియుండిన బంగారూ, వెండీ, ఇతర అమూల్యవస్తువులూ,- అన్నీ నష్టమైపోయినవి.

అంతట, బార్హాసైయదులు (Saiyads of Barha) చక్రవర్తికి ప్రతిద్వంద్విగా, ఫరూక్ సియార్‌ను నిలబెట్టిరి. వెన్నెముకలేని చక్రవర్తి సైన్యాన్ని వదలిపెట్టి, లాల్‌కున్వార్ అనే తన ప్రియురాలితో కూడా, యుద్ధరంగము నుంచి పలాయితుడైనాడు.

దురదృష్టంవల్ల, ఫరూక్‌సియార్‌కూడా నికృష్టస్వభావం కలవ్యక్తి అని తేలిపోయింది. వాగ్దానాలను పాటించనివాడు, ఉపకారంచేసిన వారికి కృతఘ్నుడు, వక్రగతిలో కుట్రలు నడిపేవాడు, చంచలస్వభావుడు, భీరుడు, క్రూరుడు,- ఫరూక్‌సియార్,- అని వ్యక్తమైపోయింది. అతనికి అభిమానపాత్రులైన, మీర్‌జుమ్లా, ఖాన్‌దౌరాన్‌ఖాన్, అనే వారిచేతిలో ఇతడు కీలుబొమ్మ ఐనాడు. సైయీదు సోదరులతో కలహాలను లేవదీయడానికి ప్రారంభించి, వాస్తవమైన అధికారాన్ని చెలాయించడానికి ప్రయత్నం కావించినాడు. ఖండితమైన తమ కౌశల సామర్థ్యాలను, విస్తారములైన తమ మూలసాధనాలను, వీరు రాజు ప్రయోజనార్థం నియోగించి ఉండినారు. కనుక, ప్రభుత్వంపై తమకు ప్రాబల్యం ఉండవలెనని కోరడం సహజమైనదే. ముఖ్యంగా, ఉద్యోగాల విషయంలోను, యుద్ధవిజయంలో లభించిన సంపద విషయంలోను, తమకు ప్రాధాన్యం కావలెనని వీరు కోరినారు.

ఈ సంఘర్షణ రోజురోజుకూ నిష్ఠురమౌతూవచ్చింది. సైయీద్‌సోదరుల అధీనంనుంచి విడుగడ పొందడానికై, ఫరూక్‌సియార్ అతిగర్హణీయమైన ద్రోహానికీ, కుట్రకూ పూనుకొన్నాడు. రాజపుటానాలోని విద్రోహాలను అణచడానికై, హుస్సేన్‌ఆలీని సామ్రాజ్య సైన్యంతో పంపినాడు. అదేసమయంలో, హుస్సేన్‌ఆలీని తుదముట్టించినట్టయితే అఖండమైన బహుమతులు ఇస్తానని వాగ్దానంచేస్తూ, విద్రోహియైన జోద్‌పూర్ రాజాఅజిత్‌సింగ్ రథోర్‌కు రహస్యలేఖలను వ్రాసినాడు. ఈ ప్రయత్నం విఫలమయింది. అజిత్‌సింగ్ లొంగిపోవడమేకాక, చక్రవర్తి జాబులను హుస్సేన్‌ఆలీకి అందచేసినాడు. అంతట మరియొక పన్నాగాన్ని పన్నినాడు చక్రవర్తి. దక్కనుకు రాజప్రతినిధిగా ఉండిన నిజామ్-ఉల్-ముల్కను వెనుకకు పిలిపించుకొని, ఆ రాజ్యాన్ని హుస్సేన్‌ఆలీ అధీనంలో ఉంచెను. హుస్సేన్‌ఆలీ దక్షిణానికి తరలిపోతూ ఉన్న సమయంలో, అతనిని అడ్డగించవలసిందిగా, దక్కను డిప్యూటీగవర్నరుగా ఉండిన దావూద్‌ఖాన్‌ను రహస్యంగా పురికొల్పెను. ఈ

ప్రయత్నంకూడా ఫలించలేదు. దావూద్‌ను ఓడించి, హతమార్చినాడు హుస్సేన్‌అలీ.

ఈ విధంగా, మోసపుపన్నాగాలూ, వాటికి ప్రతిపన్నాగాలూ మూడేండ్లకాలం జరిగినాయి. హుస్సేన్‌అలీ దక్కనులో ఉన్న సమయంలో, అతని సోదరుడైన అబ్దుల్లాను బంధించవలసిందని, తనకు విశ్వాసపాత్రుడైన సరదారులను, ఒకరితర్వాత ఒకరిగా పురికొల్పుతూవచ్చినాడు చక్రవర్తి. కాని, ఈ పాతకకార్యాలను నెరవేర్చే ధైర్యసాహసాలు ఎవరికీ లేకపోయినవి. ఆపై చక్రవర్తి, తన మామఐన రాజాఅజిత్‌సింగును తన సహాయార్థం రప్పించుకొన్నాడు. కాని, సూక్ష్మగ్రాహియైన జోథ్‌పూర్‌రాజాకు అతని అల్లుని శీలస్వభావాలెట్టివో తెలుసు. అతడు ఢిల్లీకివచ్చి, సైయీద్ అబ్దుల్లాపక్షంలో కలిసిపోయినాడు. మొఘల్ కులీనవంశజులు, టురానీవర్గనాయకులైన నిజాముల్‌ముల్క్, మహమ్మద్ అమీన్‌ఖాన్‌వంటి గొప్ప ధీరులు కూడా, చంచలస్వభావుడూ, అవిశ్వాసపాత్రుడూఐన రాజుకు ఎదురు తిరిగిరి.

చక్రవర్తి పన్నాగాల సమాచారం అందినవెంటనే, హుస్సేన్‌అలీ ఢిల్లీ రావడానికి తొందరగా ఉద్యుక్తుడైనాడు. 1719లో అతడు ఢిల్లీచేరుకొన్నాడు. రాజ్యానికి సంబంధించిన ఈ దురవస్థలను మరల తలయెత్తకుండా అంతము చేయదలచుకొన్నాడు. పీష్వా బాలాజీ విశ్వనాథ్, సేనాపతి ఖండేరావ్‌దభాడే, సంతాజీభోంస్లే మొదలైన నాయకులు నడుపుతుండిన పదకొండువేల మరాఠాసైన్యం, ఇతని సేనలో భాగమైఉండింది. ఢిల్లీకోటలోను, రాజనగరులోను ఉండిన ఫరూక్‌సియార్‌పక్షం వారందరినీ మొదట పారద్రోలినారు. పేడితనంతో, జెనానాలో దాగుకొనియుండిన రాజును బైటికిలాగి, గుడ్డివానినికావించి "ఆసనాదు లేవీలేక ఖాళీగాఉండిన చీకటిగదిలో బంధించినారు". అన్ని విధములైన అవమానాలకూ అతనిని గురిచేసి, వస్తుంచి, నెమ్మదిగా పనిచేసే విషాన్నిచ్చి, కడపట, కొన్నాళ్ళకు అపకీర్తికరమైన విధంగా చంపివేసినారు.

ఫరూక్‌సియార్ రాజ్యపాలన జరిగినకొద్ది సంవత్సరాల్లోనే, సామ్రాజ్య విచ్ఛేదం చాలావరకు జరిగిపోయింది. అసహ్యమైన అవ్యవస్థ అన్నిచోట్లా తలఎత్తింది. సరదారులు, భూస్వాములు, జనజాతి వర్గాల నాయకులు, ప్రభుత్వాధికారాన్ని ధిక్కరించడం ప్రారంభించిరి. ఉత్తమ శ్రీమంతుల అనుయాయుల మధ్య పోరాటాలు, ఢిల్లీ నగర వీధులలో జరిగినవి. దొంగలు, దోపిడిగాండ్లూ, రోడ్లను ఆక్రమించినారు. సామ్రాజ్య కోశానికి వస్తూ ఉండిన ప్రాంతీయ రాజస్వధనాన్ని, మార్గంలోనే పట్టుకొని, స్వప్రయోజనార్థం ఉపయోగించుకొనే పద్ధతికి దారి చూపినవాడు ఫరూక్‌సియారే. ఇతని ఆదర్శం వృథాపోలేదు. స్వతంత్ర రాజ్యాలను ఏర్పరచుకోదలచిన అతి సాహసికులు, ఈ పద్ధతినే అవలంబించిరి. చక్రవర్తి ఆజ్ఞలు బాహాటంగా ధిక్కరింపబడినవి. అధికారులు అనుమతిలేకనే, తమ పదవులను విడుస్తూ వచ్చిరి. ఔరంగజేబు కాలంలో నిష్కర్షగా పాలింపబడుతుండిన నియమాలు, వినియమాలూ, పాటింపబడలేదు. లంచగొండి తనము, అలసత, దేశంలో నెలకొన్నవి. ఆదాయము సన్నగిల్లి, పూర్వము సేకరించి ఉంచిన ధనం ఖాళీ ఐపోవడంతో, చెల్లించవలసిన వేతనాలు, వెనుకపడినవి. జీతాలు ముట్టని సైనిక దళాలు ఎదురు తిరగడానికి సిద్ధమైనవి.

వివిధ కక్షలకు చెందిన కులీన నాయకుల మధ్య పరస్పర వైషమ్యాలూ, ఈర్ష్యలూ, పోటీలూ, ఏర్పడడం అన్నిటికంటే దౌర్భాగ్య సూచకమైన పరిణామం. టురానీలు, ఇరానీలు, ఆఫ్గనులు, హిందూస్తానీలూ, అనే నాలుగు కులీన వర్గాలు వీటిలో ప్రధానములైనవి. మొదటి

మూడు వర్గాలవారూ, మధ్యఏషియా, ఇరాన్, ఆఫ్గనిస్తాన్ దేశాల నుంచి వచ్చిన విదేశీయుల సంతతివారు. ఇండియాకు వచ్చిన వీరి పూర్వులు సామ్రాజ్యంలోని సివిల్, మిలిటరీ సంస్థలలో ఉద్యోగాలు సంపాదించుకొని, ఇచ్చటనే నిలిచిపోయిరి. ఈ కుటుంబాలలో అనేకములు ఔరంగజేబు కాలంలో ఇండియాకు వలసవచ్చినట్టివి. ఔరంగజేబు, వీరికి ఉన్నతోద్యోగాలను ఇచ్చి ఆదరించినాడు. ఆక్సియానా (Oxiana) ప్రాంతపు అవతలిభాగం నుంచి ఇండియాకు వలసవచ్చిన టురానీలు, సున్నీ సిద్ధాంతాన్ని అవలంబించినవారు. ఇరానుయొక్క తూర్పు, పడమర, ప్రాంతాల నుంచి వలసవచ్చిన ఇరానీలూ, ఖురాసాన్, ఫార్స్, ప్రాంతాల నుంచి వచ్చినవారూ, షియాలు. సింధునదికి అవతలి సరిహద్దు పర్వత ప్రాంతాల నుంచి వచ్చిన వారు ఆఫ్గనులు. వీరిలో, అధిక సంఖ్యాకంవారు రోహిల్లా జనజాతులవారు. వీరిలో పెక్కుమంది సున్నీలు. ఉత్తర భారతంలోని పెక్కు ప్రదేశాలలో,- ముఖ్యంగా బరైలీ, ఫరూకాబాద్ ప్రాంతంలో, వీరు స్థిరనివాసాలు ఏర్పరచుకొన్నారు. హిందూస్తానీ వర్గంలోని వారు, అనేక తరాలుగా దేశంలో నెలకొనియున్న ముస్లిం కుటుంబాలవారు. కనుక, వీరికి సహజంగా, నూతనంగా వచ్చినవారిపై ఈర్ష్యాభావం ఉండింది.

కేంద్రాధిపత్యం ప్రబలంగా ఉన్నంతకాలమూ, ఈ కక్షలు అణగిఉండినవి. కాని బహదూర్‌షా మరణానంతరం సామ్రాజ్యసింహాసనానికి పోటీపడినవారు, వీరి సహాయాన్ని అర్థించినందువల్ల, వీరి ప్రాముఖ్యప్రాబల్యాలు వృద్ధిఐనవి. వీరి కుట్రలతోను, అమృతావహంగా మారుతూవచ్చిన వీరి ప్రభుభక్తి విశ్వాసాల ఉదంతంతోనూ, పద్దెనిమిదోశతాబ్దపు చరిత్ర నిండిఉంది.

ప్రతిరాజకీయకక్ష, చక్రవర్తిని తన అధీనంలో పెట్టుకొని, తన ప్రయోజనాన్ని సాధించుకోదలచుకొంది. ఈ ప్రయత్నంలో, ఎట్టి సాధనాన్ని ఉపయోగించుకోడానికి గానీ, ఏ వెలకైనా, ఎక్కడనుంచిఐనా సహాయాన్ని పొందడానికిగానీ, వెనుదీయలేదు. కనుక, ఫరూక్‌సియార్‌ను సింహాసనభ్రష్టునిచేయడానికై, హుస్సేన్‌అలీ మరాఠీలను కొనివచ్చినప్పుడు, మహారాష్ట్రప్రాంతానికి, శివాజీ విజయాల ఆధారంపై, స్వరాజ్యాన్ని స్థిరపరచడానికిమాత్రమే కాక, వారికి, దక్కనుపై చౌత్, సర్దేశ్‌ముఖీ హక్కులను ఆమోదించడానికికూడా, చక్రవర్తిని బలవంతంతో ఒప్పించినాడు. ఈ హక్కులవల్ల, దక్కనుప్రాంతపు రాజస్వంలో ౩౫శాతం, అనగా 18కోట్ల రూపాయలు మహారాష్ట్రప్రాంతానికి చెందుతుంది. ఈ వ్యవహారం వల్ల, మహారాష్ట్రపరిపాలకుడు చక్రవర్తికి విధేయుడైన సామంతుగా ఏర్పడినప్పటికీ, సామ్రాజ్యరాజస్వంలో భాగానికీ, సామ్రాజ్యవ్యవహారాలలో జోక్యంకలిగించుకోడానికీ, అతనికి అవకాశం లభించింది.

తాము సాధించిన విజయాన్ని సైయీద్‌సోదరులు, ఎక్కువకాలం అనుభవించలేదు. వారు సింహాసనంపై నిలిపిన మహమ్మద్‌షా, వీరి పోషణలో ఉండడానికి ఇష్టపడలేదు. టురానీకక్ష నాయకులు, దక్కన్ గవర్నర్ నిజామ్-ఉల్-ముల్క్ మొగల్‌సైన్యాధ్యక్షుడైన మీర్ మహమ్మద్ అమీన్‌ఖాన్, అతనిబంధువూ లాహోర్ గవర్నరూఐన అబ్దుల్‌సమద్‌ఖాన్, ఇరానీ కక్షకు చెందిన సర్దారులుకూడా, సైయీద్‌సోదరుల ఆధిపత్య ప్రాబల్యాన్ని సహించలేక, విసుగుచెందియుండిరి. కనుక, ఈ సోదరులను నశింపచేయడానికి నిశ్చయించుకొనిరి.

ఈ వార్తలను గ్రహించినవెంటనే, సైయీదులు వీరిని పదవీభ్రష్టులను చేయడానికి

చర్యలనుకైకొనిరి. కాని, నిజామ్-ఉల్-ముల్క్‌పై, వీరు పంపించిన సైన్యాలు ఓడిపోయినవి. ఈ సైన్యాధ్యక్షుడుకూడా హతుడైనాడు. అంతట, మహమ్మద్‌షాను తనతో తీసుకొని, నిజామ్-ఉల్-ముల్క్‌ను అణచదానికై, స్వయంగా, పోయినాడు. హుస్సేన్‌అలీకి రెండవ దక్షుడుగా వెంటపోయిన మహమ్మద్‌అమీన్‌ఖాన్, అతని హత్యకై కుట్రపన్నినాడు. సైన్యం, ఫతేపూర్ సిక్రీని దాటిపోయినతర్వాత, ఈ కుట్రప్రయత్నం సఫలమై, హుస్సేన్‌అలీ హత్య జరిగింది. (క్రీ. శ. 1720). దీనితో అబ్దుల్లా ఉగ్రుడై, మహమ్మద్‌షాను పదవీభ్రష్టుని కావించదానికి కృతనిశ్చయుడై, యుద్ధానికి అతనిని ఆహ్వానించెను. కాని, అతడు ఓడిపోవడమేకాక, బంధితుడైనాడు. రెండు సంవత్సరాల తర్వాత, అతనికి విషంపెట్టి చంపినారు. ఈవిధంగా, ఫరూక్‌సియార్‌ను రాజ్యభ్రష్టుని కావించిన తర్వాత, ఇరవైరెండు నెలల్లో, రాజప్రతిష్ఠాపకులైన సైయిద్‌సోదరులు, తమ అంతాన్ని చూచిరి.

యువకుడైన మహమ్మద్‌షాకు ప్రభుత్వ పరిపాలనలో ఆసక్తిలేదు. తనకు అభిమానులైన, అధముల సహవాసంలో అవివేకంగా కాలంవెళ్ళబుచ్చేవాడు. మీర్ మహమ్మద్ అమీన్ ఖాన్ కుమారుడైన, వజీర్, కమార్-ఉద్-దీన్‌ఖాన్‌కు సర్వకార్యాలనూ వదలి వేసినాడు. కాని, వజీర్‌కూడా, సోమరిగా, కాలవిలంబం కావించే వ్యక్తి. కనుక, ఢిల్లీలో ప్రభుత్వమనేదే లేకుండాపోయింది. కష్టములు ప్రాప్తించిన సందర్భాల్లో ప్రాంతీయ గవర్నర్‌లకు కేంద్ర సహాయము లభించేదికాదు. ఈ విధంగా, నాదిర్‌షా ఆఫ్గనిస్తాన్‌పై పడినప్పుడు, కాబూల్ గవర్నర్ సహాయక సైన్యాన్నీ, బాకీ ఉండిన వేతనాలకై ధనాన్నీ కోరినాడు. కాని, అతని ప్రార్థనను వినిపించుకొన్నవారులేరు.

కమార్-ఉద్-దీన్‌కుగల అధికారంపట్ల, ఈర్ష్యాపరులైన కులీనులు, సామ్రాజ్యానికి విరుద్ధంగా, శత్రువులతో కుట్రలు జరుపుతుండిరి. అపాయకరమైన ఏసైనిక కార్యాచరణానికీ వారు పూనుకోరు. అంతటి వెన్నెముక లేనివారై ఉండిరి. ఎదురు తిరిగిన మరాఠాలపై పోవడానికి వారిలో ఎవ్వరూ ఇష్టపడలేదు. అవిధేయుడైన జోధ్‌పూర్ రాజాపై పోవడానికి, చక్రవర్తిఆజ్ఞ ఇచ్చినప్పుడు, ఏవోసాకులు చెప్పి తప్పించుకొనిరి. చక్రవర్తీ, కులీనులూ ప్రదర్శించిన ఆదర్శం ఈ విధంగా అవినీతిని అన్నివైపులా వ్యాపింపచేస్తూవచ్చింది.

తత్ఫలితాలు వినాశకరమైనవి. సామ్రాజ్యం విచ్ఛిన్నం కాజొచ్చింది. ప్రాంతాలనేకములు కార్యతః స్వతంత్రమైనవి. బీహార్, బెంగాల్, ఒరిస్సాలలో, ముర్షిద్‌కూలీఖానూ, ఔధ్‌లో సాదత్‌ఖానూ, కేవలం నామమాత్రమైన స్వామి భక్తిని మాత్రమే ఢిల్లీ చక్రవర్తికి ప్రదర్శించిరి. కాబూల్, లాహోర్ గవర్నర్లు వారికి వారే రక్షించుకోవలసివచ్చింది. గుజరాతును, మాల్వాను, బుందేల్‌ఖండులో ఒకభాగాన్నీ, మహరాష్ట్రులు ఆక్రమించుకొనిరి. రోహిల్లాలు, దోఆబ్‌లో స్వయం పరిపాలక సంస్థలను ఏర్పరచుకొంటూ వచ్చిరి.

రాజస్థాన్‌లో, మూడు ప్రముఖవంశాలు ఉండినవి. వారిలో, మేవారు రాజ్యపు సిసోదియాలు, మొగలురాజకీయాలలో ఆసక్తివహించినవారు కారు. ఐనప్పటికీ, వీరు మొగలు సార్వభౌముని ఆధీశతను, అంగీకరించినవారే. జస్వంత్‌సింగ్ మరణించినప్పటినుంచి, జోధ్‌పూర్ రథోరులు ఔరంగజేబుకు విరోధులుగా ఉండినవారు. కాని, ఔరంగజేబు మరణానంతరం, వీరు మొగలు సామ్రాజ్యాన్ని అంగీకరించినారు. సామ్రాజ్యంలో ఉన్నతపదవులను వీరు వహించియుండినా, వీరి రాజభక్తిమాత్రం అనిశ్చితమై ఉండినది. ప్రభుభక్తి విషయంలో,

ఇంతదాకా, ఎక్కువనిష్ఠాపరులై ఉండిన జయపూరు కచ్వాలుకూడా, సర్వసాధారణమై వ్యాపించిన నైతికభ్రంశ ప్రభావానికి లోనైనారు.

చురామన్ లేవదీసిన జాటుల విద్రోహాన్ని, ఇదివరలో అణచివేసిన రాజాజై సింగ్, మాల్వాప్రాంతానికి సుబేదారుగా నియమితుడైనాడు. ప్రతిసంవత్సరం, మరాఠీలు కావిస్తూ వచ్చిన దాడులను, ఇతడు అడ్డగించగలడనే అభిప్రాయంతో ఈ ఏర్పాటు జరిగింది. కాని, సామ్రాజ్యప్రయోజనాలను రక్షించడానికి మారుగా, జైసింగు, మహారాష్ట్రులతో ఏకమైనాడు. తత్ఫలితంగా, ఆ ప్రాంతం సామ్రాజ్యంలోనుంచి నష్టమైపోయింది.

ఢిల్లీనగర పరిసరప్రదేశాలుకూడా అపాయానికి లోనైనాయి. సిక్కులు, జాట్లు, రోహిల్లాలు, మరాఠీలు, అన్నివైపులా చుట్టుతూఉండిరి. 1737లో బాజీరావ్ అశ్వసైన్యంతో, రాజధానివరకూ వచ్చినాడు. ఎంతటి నిస్సహాయస్థితిలో సామ్రాజ్యం ఉండినదన్న పరిస్థితిని, ఈ విషయం బైటపెట్టింది. సామ్రాజ్యనగరం లోపలా, వెలుపలా, కూడా, అల్లకల్లోలం బయలుదేరి, అవ్యవస్థ ఏర్పడింది.

## II నాదిర్‌షా దండయాత్ర

కాని, ఇంతకంటె గొప్ప విపత్తు సామ్రాజ్యానికి దాపరించింది. ఢిల్లీపై బాజీరావు దండయాత్ర జరిపిన ఒకసంవత్సరం తర్వాత, ఇరాన్‌రాజైన నాదిర్‌షా, అఫ్గనిస్తాన్ ఉత్తర భాగంలోకి చొచ్చుకొని వచ్చినాడు. ఇట్టి పరాక్రమణలను అడ్డుకోడానికి పంజాబు, సంసిద్ధంగా లేకపోవడము, కేంద్రప్రభుత్వం ఈదాడిపట్ల నిర్లక్ష్యం వహించడము, జరిగింది. కనుక, నాదిర్‌షాకు కాబూలు ప్రవేశం సులువయింది. అంతట, ఖైబర్ లోయనుదాటి, మార్గంలో ఎదుర్కొనేవాళ్ళు లేకపోవడంతో, వేగంగా, లాహోరును చేరినాడు. ఢిల్లీకి రానున్న ప్రమాదాన్ని, ఇప్పుడు గుర్తించిన మొగలులు, కార్యాచరణకు పూనుకొన్నారు. తన సైన్యంతో మహమ్మద్‌షా, కర్నాల్‌ప్రదేశాన్ని చేరి, అక్కడ యుద్ధానికి తగినఏర్పాట్లు చేసుకొని నిలబడినాడు. కాని, సేనానాయకుల అప్రయోజకత్వంవల్లను, వారిలో వారికి అభిప్రాయ సామరస్యం లేకపోవడంవల్లను, మొగలు సైన్యం అపజయంతో నలిగిపోయింది. అపజయంతో ధర్మభ్రష్టత ఉత్పన్నమయింది. సంశయము, భయము, వ్యాకులము, అనేదుష్టభావనల ప్రాబల్యానికి లోనై, ఆత్మసంరక్షణార్థం సేనానాయకులు, ఒకరికొకరు విరుద్ధంగా ప్రవర్తించసాగిరి. దాన్ని అనుసరించి, ద్రోహం తలఎత్తింది. యుద్ధంలో శత్రువులకు చిక్కిన ఔధ్‌గవర్నర్ సాదత్‌ఖాన్, ఇరానీవర్గంలోనివాడు. టురానీలపట్ల ఇతడు ఈర్ష్యాపరుడు. అందులో ముఖ్యంగా, చక్రవర్తికి ముఖ్యసలహాదారుగా నియమితుడైన నిజామ్-ఉల్-ముల్క్‌పై, ఇతనికి ద్వేషము. కసితీర్చుకోవడమనే దుష్టభావంతో బుద్ధిహీనుడై, ఢిల్లీపై దాడిచేసినట్లయితే, అతడు ఊహించనంతటి సంపద లభిస్తుందని నాదిర్‌షాను ప్రలోభపెట్టి, అందుకు ఒప్పించినాడు.

నాదిర్‌షా అత్యాశ, ఉద్రిక్తమయింది. మొఘలు చక్రవర్తిని బందీగాచేసుకొని, ఢిల్లీపై తరలినాడు నాదిర్‌షా. భారతదేశ సార్వభౌముడు నాదిర్‌షాఅని, ఢిల్లీ జుమ్మామసీద్ గురుపీఠం, ప్రకటించింది. అతని పేరిట నాణ్యాలు ముద్రింపబడినవి. ఈ ఆక్రమణకు, ఢిల్లీ దద్దరిల్లిపోయింది. నగంలో ప్రముఖులైనవారినీ, శ్రీమంతులైనవారినీ, నాదిర్‌షా, అతని సైన్యాధికారులూ దోచుకోవడం ఆరంభించినారు. ప్రజలను అవమానానికీ, హింసకూగురిచేసినారు.

అంతతో, ప్రజలలో కోపాగ్ని ప్రజ్వరిల్లింది. ఇట్టి పరిస్థితుల్లో జరిగిన ఒక చిన్న సంఘటన, ఒక తుములంగా ఏర్పడింది. అంతట, నాదిర్‌షా సామూహిక సంహారానికి ఆజ్ఞకావించినాడు. రక్తపు కాలువలు వీధులలో ప్రవహించినవి. వర్తక స్థానాలూ, బజార్లూ, మంటలలో బుగ్గియై పోయినవి. నష్టపరిహారంగా, నాదిర్‌షా అనంతమైన ధనాన్ని లాక్కొన్నాడు. బంగారు, వెండిసామాన్లు, రత్నాలు, ఆభరణాలు, నెమలి సింహాసనం, అనేక తరాలుగా చక్రవర్తులు సేకరించియుండిన అమూల్యవస్తువులు,- ఇత్యాదులన్నిటినీ సంగ్రహించుకొన్నాడు. అంతేకాక, అనేకములైన ఏనుగులు, గుర్రాలు, ఒంటెలు, పదహైదుకోట్ల రూపాయల ద్రవ్యము-, వీటినంతటినీ తనతో తీసుకొని పోయినాడు.

ఈ విజేతకు, ఇండియాలో స్థిరపడే అభిప్రాయంలేదు. మహమ్మద్‌షాను సింహాసనంపై నిలిపి, తనకు చేజిక్కిన సంపదనంతా వెంటతీసుకొని దేశంనుండి వెళ్ళిపోయినాడు.

ఈ దెబ్బనుంచి, సామ్రాజ్యం మళ్ళీ కోలుకోలేదు. కాబూల్‌ప్రాంతం నష్టమైపోయింది. ఇండియా సరిహద్దులను సింధునదివరకు, వెనుకకు నెట్టినారు. అవతలి ప్రాంతమంతా శత్రువులదైపోయింది. ఖైబర్‌లోయ, పెషావర్‌కూడా శత్రుహస్తగతమైనాయి.

అరాజకానికీ, దండయాత్రలకూ, పంజాబు బలిఅయింది. నాదిర్‌షా పంజాబును జయించినప్పుడు, ఆప్రాంతపు గవర్నర్, జకారియాఖాన్. అతడు 1745 లో మరణించెను. అంతతో, గవర్నర్ పదవికై అతని కుమారులమధ్య, యుద్ధం ప్రారంభమయింది. నాదిర్‌షాకు ఉత్తరాధికారిగా కాబూల్‌సింహాసనాన్ని అధిష్ఠించియుండిన అహమద్‌షా అబ్దాలీని, రాకుమారులలో ఒకడు పంజాబుకు ఆహ్వానించెను. అప్పటినుంచి, 1773 లో అతడు మరణించేదాకా, అబ్దాలీ పంజాబును పీడించి, దోచుకొంటూ వచ్చినాడు.

పద్దెనిమిదో శతాబ్ద ఉత్తరభాగంలోని ఇండియా పరిస్థితి, హాబ్స్ వర్ణించిన ప్రకృతి వ్యవస్థకు, చక్కని దృష్టాంతమౌతుంది. అధికారతృష్ణ అనే ఉద్రేకానికిలోనై, అత్యంతమైన స్వార్థంతో, అసాధారణమైన హ్రస్వదృష్టితో ప్రాకులాడే మానవరూప భయంకరమృగాలు, పొంచి తిరుగాడే భీకరఅరణ్యాన్ని పోలింది, నాటిదేశం.

నైతికప్రయోజనాలుకాని, దూరదృష్టిగల ఆశయాలుకాని, వీరి ప్రయత్నాలకు అడ్డురాలేదు. తమ కోరికలను సాధించుకోవడంలో వారు చేసిన కుట్రలూ, తంత్రాలూ, శీఘ్రావశ్యకములైన ప్రయోజనాలను పొందడానికై వారు కావించిన మోసాలూ, బలవచ్చర్యలూ,- మొదలైనవి, మాకియవెల్లీకి (Machiavelli) కూడా, తలవంపులు తెచ్చేటటువంటివి. అధికారానికి పోటీచేసేవ్యక్తులూ, కక్షలూ జరిపిన, బుద్ధిహీనములైన ఘోరసంఘర్షణల కారణంగా సోలిపోయి, నాశనమైపోయియున్న ఇండియాను అరాజకంలోనుంచి ఉద్ధరించి, క్రమవ్యవస్థను ఏర్పరచడానికి, తగిన గాంభీర్యసామర్థ్యములుగల వ్యక్తి, పైకిరావడానికి అవకాశమే లేకపోయింది.

ఈవిధంగా, రాజకీయ నైతికపరిస్థితులు క్షీణించిపోయినప్పటికీ, అఖండమైనశక్తి, సాధనదక్షతా గల ధీరసాహసవ్యక్తులకు, పద్దెనిమిదోశతాబ్దంలో కొరతలేదు. అత్యాశాపరులు, ఉత్సాహవంతులుఐన, సాహసికులు అనేకులు, తమ జీవితాలను లీలగాఒడ్డి, సాహసకార్యాలకు పూనినారు. వీరి సాహసం నిజంగా ప్రశంసార్హమైనదే. కాని, వారి కార్యాచరణాన్ని ప్రయోజనకరములైన మార్గాలలోనడిపి, వారి జీవితాలను సఫలంగాచేసే ఉత్తమధ్యేయం,

వారికి లేకపోయింది. తుపానురేగిన సముద్రంలోని చుక్కానిలేని పడవలవంటివి, వీరి జీవితాలు.

అడ్డు అంకెలులేని, వీరి అత్యాశలు సామ్రాజ్యాన్ని అరాజకస్థితికి తెచ్చినవి. రోహిల్లాలు, రోహిల్ ఖండులోని సామ్రాజ్యాధికారులను పారద్రోలి, వారి జాగీర్లను కైవసం చేసుకొని, స్వయం పరిపాలకములైన చిన్న రాజ్యాలను, స్థాపించుకొనిరి. రోహిల్‌ఖండ్ అవతల, ఔధ్, బీహార్, బెంగాల్, ఒరిస్సా, ప్రాంతాలు అప్పటికే కార్యరూపమైన స్వాతంత్రం వహించినవి.

యమునానదికి దక్షిణపు భూభాగంలో, పడమట రాజపుటానావరకూ, దక్షిణాన చంబాల్‌నదివరకూ, జాటులు తమ అధికారాన్ని నెలకొల్పుకొనిరి. దానికి అవతల, రాజపుటానా, నదీమధ్యప్రదేశం (దోఆబ్) తూర్పు ప్రాంతాలు అనే ప్రదేశాలపై, మహారాష్ట్రులు తమ సంకల్పాధికారాలను, స్వేచ్ఛగా ప్రవర్తింపచేస్తూ వచ్చిరి. గుజరాత్, మాల్వాప్రాంతాలు మహారాష్ట్రుల అధీనములో ఉండినవి; రాజపుత్ర సంస్థానాలు వీరి దయాదాక్షిణ్యాలకు లోనైనవి; దక్కను ప్రాంతం, వీరికి కప్పము చెల్లిస్తూ ఉండింది.

భారతదేశంలో అధికభాగంపై తనకు ఇంకా ఆధిపత్యం ఉన్నదని మొగలు చక్రవర్తి చెప్పుకొంటూ, బిరుదులను అనుగ్రహిస్తూ, పదవీ ఉద్యోగాలను స్థిరపరుస్తూవచ్చినా, ఇతని అధికారాధిపత్యాలు ఢిల్లీ, ఆగ్రా పరిసర ప్రదేశానికి మాత్రమే వర్తించేవి. ఇతని చక్రవర్తిత్వం, ఈ విధంగా కుంచితమైపోయింది.

పరిపాలన విధానం బిగువుతప్పి, సడలిపోయి నందువల్ల, సామ్రాజ్యము యొక్క అంతరశక్తి సన్నగిల్లిపోయింది. ముందుయోచనలేక, నిర్లక్ష్యంగా జాగీర్లు ఇస్తూరావడంవల్ల, చక్రవర్తి స్వంత కోశానికై (Privy purse), ప్రత్యేకించియుండిన రాజభూభాగ (Crown Lands), విస్తీర్ణం తగ్గిపోయింది. సామ్రాజ్య కోశాగారం, ఖాళీ అయిపోయింది. రాజస్వ ఆదాయం క్షీణించడంవల్ల, నియమిత సైన్యాన్ని పోషించు కోవడమూ, దానికి తగిన సాధన సామాగ్రిని సమకూర్చడమూ, సాధ్యముకాని పని అయింది. ఆంతరంగిక యుద్ధాలలో, ఉన్నతవర్గ సామాన్య వర్గాలలోని వ్యక్తులు అధికసంఖ్యలో మరణించడంవల్ల, సివిల్ మిలిటరి పదవులకు తగినవారు లభించడం కష్టమయింది. చాలినంత సైన్య సంపద లేకపోవడంతో, చక్రవర్తి పూర్తిగా నిస్సహాయుడైనాడు.

1739 కర్నాల్ యుద్ధంలో, మహమ్మద్‌షాకు అపజయం కలిగిన తర్వాత, ఢిల్లీ, ఐక్యసామ్రాజ్య కేంద్రంగా ఉండే ప్రతిష్ఠ, ఈ విధంగా నశించింది.

## III. అహమద్‌షా అబ్దాలీ దండయాత్రలు

నాదిర్‌షా భారతదేశ సార్వభౌముడని, ఢిల్లీమసీదులు శుక్రవారోపన్యాసాలలో ప్రకటించడంతో, ఏ విధంగా చరిత్రసంఘటనలు పునరావృత్తమౌతాయన్న విషయం వ్యక్తమయింది. ఇదేవిధమైన పరిస్థితులు ఏర్పడియుండిన, పంద్రెండోశతాబ్దపు కడపటి భాగంలోను, మళ్ళీ, పదహారోశతాబ్ద ప్రథమభాగంలోను, రెండుమార్లు, ఒక విదేశీయరాజ్యం, ఇండియాను తన అధికారానికి వశం కావించుకొంది. భూభాగాలపై ఆధిపత్యంకల ఈ విజేతలు, భూమార్గాలను అనుసరించి, ఇండియాను ప్రవేశించినవారు.

కాని, వీరికి భిన్నమైన ఒకజాతి, సముద్రాంతర భూములనుంచి, సముద్రమార్గాలను అనుసరించి, పదహారోశతాబ్దంలో ఇండియాప్రవేశించి, భారతదేశ సముద్రతీరప్రాంతాలలో, తన ప్రభావప్రాబల్యాలను ప్రసరింపసాగింది. మొగల్‌సామ్రాజ్యవిచ్ఛిత్తితో ఏర్పడిన రాజకీయ శూన్యస్థానాన్ని, దేశీయులు ఆక్రమిస్తారా, లేక, పశ్చిమోత్తర భూభాగంలోని ఒక భూరాజ్యం (Land powers) ఆక్రమిస్తుందా, లేక, అసంభావ్యమైన దిగ్భాగంనుంచి వచ్చిన ఒకరాజ్యశక్తి, నూతనమార్గంలో ఈ స్థానాన్ని ఆక్రమిస్తుందా,- అని ఊహించడం, ఆ సమయంలో సాధ్యముకాలేదు. ఐనా, దేశముయొక్క నియతికి, ఒక రూపం ఏర్పడింది. దేశముయొక్క భవిష్యత్తు ఎటువంటిదనే విషయం, పద్దెనిమిదోశతాబ్దం కడపటికి నిశ్చితమై పోయింది.

1739లో, కర్నాల్‌వద్ద, నాదిర్‌షాకు కలిగిన విజయం మొదలు, 1803లో, లేక్ (Lake) ఢిల్లీని ఆక్రమించేవరకూ జరిగిన మధ్యకాలంలో, భారతదేశం, దుస్సహమైన అవమానానికి గురిఅయింది. దేశచరిత్రలో ఇది మిక్కిలి విషాదకరమైనఘట్టం. ఢిల్లీ సామ్రాజ్యము యొక్క చారిత్రికవై భవమూ, అధికారమూ నశించినవి. ఐనా, మొగల్‌సామ్రాజ్యమనే పేరు, ఇంకా ప్రజలను మంత్రముగ్ధులుగాచేస్తూనే ఉంది. అధికారానికై సంఘర్షణలు అన్నిమూలలా, అంటువ్యాధివలె వ్యాపించి, దేశానికి అరిష్టంకలిగిస్తూఉన్నా, ప్రజల ఉత్కాంక్షలన్నీ ఇంకా, ఢిల్లీపైననే కేంద్రీకరించి ఉన్నవి. కాని, చక్రవర్తి బిరుదువహించిన వ్యక్తి మాత్రం, కేవలం ఉత్సవవిగ్రహంలా ఉండిపోయినాడు. రాజ్యవ్యవహారాలలో ఏ మాత్రమూ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించక, ఇతరుల చెప్పుచేతల్లో నడిచి, అప్రతిష్ఠపాలై నాడు.

ఈ పద్ధతిలో ఢిల్లీసింహాసనాన్ని అధిష్ఠించిన చక్రవర్తుల చరిత్రను, చాల సంగ్రహంగా వివరించవచ్చు. నాదిర్‌షా ఇండియా వచ్చి మరలిపోయినాడు. కాని, అతని దండయాత్ర తమకు కలిగించిన దౌర్భాగ్యాన్ని గమనించి, ఎట్టి గుణపాఠాన్నీ, కులీన వర్గం వారు నేర్చుకోలేదు. టురానీలకు, ఇరానీలకు మధ్యగల ఈర్ష్యాద్వేషాలు ఎంతమాత్రమూ తగ్గిపోలేదు. వారు పరస్పరం కలహిస్తూనే వచ్చిరి.

కమార్-ఉద్-దీన్‌ఖానూ, అతని సోదర తుల్యుడు నిజామ్-ఉల్-ముల్కూ, క్రమంగా, వజీరు (ప్రధాన మంత్రి) పదవిలోనూ, మీర్‌బక్షీ (వేతనదాత) పదవిలోనూ, ఉండినారు. ఔధ్‌గవర్నర్ సఫ్దర్‌జంగ్ నాయకత్వంలో, ఇరానీలు వీరికి విరుద్ధంగా ప్రవర్తించిరి. హిందూస్తానీ కక్షవారు కూడా, వీరికి సహకరించిరి. టురానీల ఉన్నతవర్గంలో కూడా ఐక్యం లేకపోయింది. మహమ్మద్‌షాకు అభిమాన పాత్రులైనవారు టురానీలను తొలగించడానికి నిశ్చయించిరి. అంతతో, రాజసభ అనుసరించే విధానాలతోను, వజీరుయొక్క ప్రవర్తనతోను, విసుగుచెందినవాడై, నిజామ్-ఉల్-ముల్క్, 1740 లో, ఢిల్లీ వదలిపెట్టి, దక్కనుకు వెళ్ళిపోయెను. కమార్-ఉద్-దీన్, ఇంకా ఢిల్లీలోనే నిలిచి, తన పదవిని సాగిస్తూనే వచ్చినాడు. కాని, అధికారం మాత్రం, సఫ్దర్‌జంగు చేతుల్లోకి, అతని అనుయాయులచేతుల్లోకి పోయింది.

నాదిర్‌షా హత్య జరిగిన తర్వాత, హెరాట్, కాంధహార్, కాబూల్, ప్రాంతాల ఉత్తరాధికారం, అహమద్‌షా అబ్దాలీకి, సంక్రమించింది. వాటిపై ఆధిపత్యం వహించిన అబ్దాలీ 1748 లో, మొదటిసారి ఇండియాపై దండయాత్ర సాగించినాడు. లాహోర్,

ముల్టాన్‌లకు గవర్నరుగా ఉండిన, జకారియాఖాన్ కుమారుల మధ్యజరిగిన ఆంతరంగిక యుద్ధమును, అతని తమ్ముడైన షానవాజ్‌ఖాన్ కావించిన, కృత్రిమ సంధానమును, సాకుగా తీసుకొని, అహమద్‌షా అబ్దాలీ ఇండియాపైదాడి సాగించి, లాహోర్‌ను ఆక్రమించినాడు. సామ్రాజ్య సైన్యానికి నాయకత్వం వహించిన, మొగల్ యువరాజు, అహమద్, సార్‌హింద్ పట్టణపరిసర గ్రామంవద్ద, వేచియుండెను. అహమద్‌షా అబ్దాలీ, ఈ సైన్యాన్ని ముట్టడించినాడు. అక్కడ ఇరుపక్షాలవారికీ జరిగినయుద్ధంలో, వజీర్ కమార్-ఉద్-దీన్, హతుడైనప్పటికీ, మొగల్ సైన్యం, అబ్దాలీ సైన్యాన్ని యుద్ధరంగం నుంచి పారదోలి, దేశంవిడిచిపోయేటట్లుచేసింది.

అసంభావ్యమైన ఈ విజయం యొక్క ఫలితంగా, అహమద్‌షా, అతనితండ్రి మరణానంతరం (ఏప్రిల్ 26, 1748) ప్రశాంతపరిస్థితుల్లో చక్రవర్తిఐనాడు. ఈ నూతన చక్రవర్తి "సత్స్వభావుడేకాని బుద్ధిహీనుడు." యుద్ధనిర్వహణ విషయంలో కాని, పరిపాలన విధానంలోకాని, ఏమాత్రమూ శిక్షణలేనివాడు ఇతడు. "బాల్యదశనుండి 21 వత్సరముల వయస్సుదాకా, జెనానా స్త్రీలమధ్యలో పెరిగినవాడు. ఇతనిపట్ల శ్రద్ధవహించినవారు లేరు. పైగా, తండ్రి ఇతనిని నోరెత్తనిచ్చేవాడు కాడు." కనుక, సహజంగా రాజ్యవ్యవహారాలు, "రాజమిత్రులు" అని వ్యవహరింపబడిన ప్రీతిపాత్రుల హస్తగతమైనవి. "ఈ రాజమిత్రులు" అనే గుప్తసభ (Cabal), రాజకుమారునితల్లి ఐన ఉదంభాయి నాయకురాలుగా, స్త్రీలూ, కొజ్జాలూ, సభ్యులుగా ఏర్పడింది. మహమ్మద్‌షా వివాహంచేసుకోడానికి పూర్వం, ఈ ఉదంభాయి, ఒక సామాన్యనర్తకి. ప్రతి ఉద్యోగానికీ ప్రతిఫలంగా ద్రవ్యరూపమైన బహుమతులను తీసుకొని, ఈమె, పనికిమాలిన వ్యక్తులను ఉత్తమపదవులకు నియమించేది. రాజ్యపరిపాలన కర్తవ్యాన్ని పట్టించుకొన్నవారు లేరు. ప్రాంతీయగవర్నర్లూ, కులీనులూ, సామ్రాజ్య రాజస్వాన్ని స్వప్రయోజనార్థం సంగ్రహించుకొంటూ వచ్చిరి. ఈ ఆదర్శాన్ని చక్కగా ఉపయోగించుకొన్న బలవంతులైన భూస్వాములు, తమపరిసరాల్లోని దుర్బలుల భూములను ఆక్రమించుకొన్నారు.

ఔధ్‌గవర్నర్ సఫ్దర్‌జంగ్, వజీరుపదవిని అధిష్ఠించెను. ఇతని నాయకత్వంలో, ఇరానీకక్ష, ప్రబలమౌతూ వచ్చింది. కాని, ఇతడు కూడా అపరిమితములైన కష్టాలను ఎదుర్కొవలసి వచ్చింది. టురానీకక్ష నాయకులు ఇతనికి ప్రతికూలురు. చక్రవర్తికి ప్రీతిపాత్రులైన వ్యక్తులు, సఫ్దర్‌జంగ్ ప్రవేశపెట్టే విధానాలకు అడ్డుతగిలి, భంగపరుస్తూ వచ్చిరి. స్థైర్యంలేని అహమద్‌షాను, సఫ్దర్‌జంగుకు వ్యతిరేకంగాచేసిరి. అదికాక, వజీరుకూడా, ఢిల్లీవ్యవహారాలను ఏకాగ్రమైన శ్రద్ధతో చూడలేకపోయినాడు. తన ప్రాంతాన్ని బహుశ్రద్ధతో చూడవలసిన ఆవశ్యకం ఎక్కువగా ఉండడం, ఇందుకొక కారణం. రోహిల్లాలు, ఇతనికి బద్ధశత్రువులు. అజాగరూకతవల్ల తన ప్రాంతంలోని పరిపాలన సడలింది.

ఇట్టి సందర్భాలలో, ఉత్తరంవైపునుంచి అహమద్‌షా అబ్దాలీ, తన ఆఫ్ఘను సేనలతో పైబడడానికి సిద్ధుడై ఉన్నాడు. దక్షిణంవైపునుంచి, మహారాష్ట్రులు దాడిచేయడానికి వేచి ఉండిరి. ఇంతనుంచి, భారతదేశ స్వాతంత్ర్యం నష్టమైపోవడానికి కారకములైన విషాదకర పరిణామాలన్నిటిలోనూ, ఈ రెండువర్గాల నాయకులే, ముఖ్యపాత్రలు వహించినారు. ఈ

రాజకీయపు చదరంగంలో, మొగల్‌చక్రవర్తి, అతని కులీనవర్గ అనుయాయులూ, కేవలం బంట్లు (Pawns) మాత్రమే. ఈ వ్యవహారాలలో, తక్కిన సరదారులుచేసిన కార్యం అత్యల్పం; అపకీర్తికరమైనట్టిది కూడా.

1748లో, విఫలుడైన అబ్దాలీ, మరల 1749, శరత్కాలంలో, పంజాబుపై దాడి చేసినాడు. కీర్తిశేషులైన వజీర్ కమూర్-ఉద్-దీన్, కుమారుడు, మొయిన్-ఉల్-ముల్క్, ఆ సమయంలో పంజాబుకు గవర్నరు. కాని, ఢిల్లీలోని అధికారవర్గం ఇతనిపట్ల, విముఖంగా ఉండినందువల్ల, ఏ విధమైన సహాయమూ, ఇతనికి లభించలేదు. కనుక, కొంతభూభాగాన్ని, శత్రువుకు దత్తంచేయడమేకాక, అపారమైన ధనాన్ని పరిక్రయంగా (Ransom) ఇవ్వవలసి వచ్చింది. ఇంతసులభంగా లభించిన విజయసంపద, అబ్దాలీ తృష్ణకు ప్రేరకమయింది. కనుక, 1751 లో ఇండియాపై మూడవసారి దండయాత్ర సాగించినాడు. కేంద్రప్రభుత్వ సాహాయ్యమేమాత్రమూ లేకపోయినా, మొయిన్-ఉల్-ముల్క్ తనశక్తి కొలది శత్రువును అడ్డగించి పోరాడినాడు. కాని, కట్టకడపటికి, లొంగిపోక తప్పలేదు. పంజాబూ, ముల్తాన్ సుభాలూ, ఆఫ్గన్‌రాజు హస్తగతమైనాయి. అంతతో, ఢిల్లీకి అపాయం దాపురించింది.

ఆఫ్గనులు పంజాబును ఆక్రమిస్తున్న సమయంలో, "ఔధ్, ఢిల్లీ మార్గాన్ని ఆకరంగా చేసుకొనియున్న రోహిల్లా సర్పాలను" వజీర్ సఫ్దర్‌జంగ్, నిర్మూలిస్తూ ఉండినాడు. కాని, అతిజాగరూకుడైన రోహిల్లా నాయకుడు అహమద్‌ఖాన్ బంగాష్, సులభంగా లొంగిపోయేవాడుకాడు. త్వరలోనే, చేతరించుకొని భోగలాలసుడైన ఇరానీ శ్రీమంతుని (సఫ్దర్ జంగ్‌ను) ఓడించి, అవమానంపాలు చేసినాడు. కాబట్టి, మహారాష్ట్రులతో సహాయక సంబంధాన్ని ఏర్పరచుకొని, జాటు సైన్యసహాయాన్ని తీసుకొని, రోహిల్లా విపత్తునుండి ఆత్మరక్షణ కావించుకొనే అవసరం సఫ్దర్ జంగుకు కలిగింది. మహారాష్ట్ర సైన్యదళాలను ఇచ్చినందుకై, రోజుకు 25000 రూపాయలు ప్రతి ఫలంగా, మలహర్‌రావు హోల్కారుకూ, జయపా సింధియాకూ ఇచ్చేటట్లూ, 15000 రూపాయలు సురాజ్‌మల్ జాట్‌కూ ఇచ్చేటట్లూ, సఫ్దర్ జంగ్, మాట ఇచ్చినాడు. వీరు నదీ మధ్య ప్రాంతం నుంచి రోహిల్లాలను పారద్రోలి, హిమాలయ పర్వత సీమకు, వారిని నెట్టివేసినారు. అంతట, ఈ మహారాష్ట్రులు, దండయాత్రకు జరిగిన ఖర్చులను సఫ్దర్‌జంగు నుంచి, రోహిల్లాలకు ఇప్పించి, వారితో సంధి షరతు కావించుకొనిరి.

మరాఠా సర్దారులు, ఇదివరకే మాల్వాను వశంచేసుకొని, గుజరాతును ఆక్రమించి, బీహార్, బెంగాల్, ఒరిస్సా, ప్రాంతాలపై దాడిచేసి దోచుకొని, రాజపుటానాను బలాత్కారంగా ప్రవేశించి ఉండినారు. ఇప్పుడు (1752 లో) నదీ మధ్య సీమలో, బాహరీచౌకీలను (Out posts) సంపాదించుకోవడంతో, మొగల్ సామ్రాజ్యానికి గుండెపట్టు వంటి ప్రదేశంలో, వీరికి సమవాయన స్థానాలు (Lodgements) - (తాత్కాలిక రక్షణ స్థానాలు), సిద్ధించినవి. మార్చి 1752 లో, ఏర్పాటైన సహాయక సంధిని అనుసరించి, మహారాష్ట్రులు 'సామ్రాజ్య సంరక్షకులు' అనే పాత్రవహించిరి. దీనితో, ఢిల్లీరాజకీయాలలో జోక్యం కలిగించుకొనే అవకాశాన్ని సంపాదించుకొన్నారు. ఇందువల్ల, ఆధిపత్యాన్ని సాధించుకోడానికై ముందంజ వేస్తున్న రెండువర్గాలకూ,- ఆఫ్గనులూ, మహారాష్ట్రులూ,- ముఖాముఖి శత్రుత్వం సిద్ధించింది.

త్వరలోనే ఈ ఇరువర్గాలూ, ఢీకొనకతప్పదు. కాని, ఈ సంఘాతంజరిగే లోపుననే, ఢిల్లీసామ్రాజ్యమూ, చక్రవర్తి ఆస్థానమూ, చెప్పరాని దురవస్థకూ, అవమానానికీ పాల్పడినవి. సఫ్దర్‌జంగ్‌యొక్క అత్యాశా, దురహంభావాలూ, కారణంగా, దరిసులు ప్రతిహూలురైరి; చక్రవర్తి మనస్సుకు కూడా కష్టం కలిగింది. కనుక, ఇతనిని పదవినుంచి తొలగించడానికై, రాజమాత పన్నాగం లేవదీసింది. సఫ్దర్‌జంగ్‌యొక్క కార్యకారులను కోటనుంచి బయటికి పంపివేసిరి. పదవీత్యాగం చేస్తానని బెదిరిస్తే, చక్రవర్తి లొంగిపోతాడని భ్రమించిన సఫ్దర్‌జంగ్, మంత్రిపదవికి రాజీనామా ఇస్తానన్నాడు. కాని, రాజీనామా తక్షణం అంగీకరింపబడింది. అంతతో క్రుద్ధుడైన మంత్రి, తన ప్రభువుపై బాహాటంగా యుద్ధాన్ని ప్రకటించినాడు. అతని సహాయకులైన జాటులు, ఢిల్లీని దోచుకొన్నారు.

ఈలోగా, టురానీకులీన వర్గంవారు కూడా, ఇరానీవర్గము యొక్క ఆధిపత్యానికి విరుద్ధంగా, తమ శక్తినంతటినీ వినియోగించిరి. కమార్-ఉద్-దీన్ కుమారుడు ఇతిమద్-ఉద్-దౌలా, వజీరుపదవినీ, నిజామ్-ఉల్-ముల్క్-అసఫ్-జా. I. మనుమడు ఇమాద్-ఉల్-ముల్క్, మీర్‌బక్షీ పదవినీ వహించిరి. నజీబ్-ఉద్-దౌలా అనే బిరుదు వహించిన, నజీబ్‌ఖాన్ నాయకత్వంలోని రోహిల్లాలను, అంతాజీమాన్‌కేశ్వర్ నాయకత్వంలోని మహారాష్ట్రులను, వీరు తమ సహాయార్థం ఆహ్వానించిరి. ఢిల్లీకోటను పట్టుకోడానికి, సఫ్దర్‌జంగ్ కావించిన ప్రయత్నం, విఫలమయింది. కాని, ద్రవ్యము ఖర్చైపోవడము, సైన్యానికి వేతనాలను ఇవ్వలేకపోవడము, వజీరుకు, మీర్‌బక్షీకి, అభిప్రాయభేదాలు ఏర్పడడము, అనే కారణాలవల్ల చక్రవర్తి, సంధికి అంగీకరించవలసి వచ్చింది. సఫ్దర్‌జంగ్, తన ఔధ్‌ప్రాంతానికి మరలిపోయినాడు.

ఈ అంతరంగిక యుద్ధంవల్ల, అపరిమితములైన ఆర్థికకష్టాలకు ప్రభుత్వము లోనయింది. వేతనాలకై సైనికదళాలు గలభాచేసినవి. దినదినసంక్షోభాలకూ, దొమ్మికీ, ఢిల్లీ నగరవీధులు రంగములైనవి. తిరుగుబాటుచేసిన సైనికులూ, స్వేచ్ఛావిహారులైన రోహిల్లా మరాఠాదోపిడిగాండ్లూ కలిగించిన అవ్యవస్థలో, ప్రజలప్రాణ ధనాలకు రక్షణ లేకపోయింది. సఫ్దర్‌జంగ్, రంగమునుంచి నిష్క్రమించడంతో, వజీరుకూ మీర్‌బక్షీకీగల భేదాలు మరింత తీవ్రములైనవి. చక్రవర్తి వజీరును ఆధారంగాచేసుకోవడంతో, మహారాష్ట్రుల సహాయంతో మీర్‌బక్షీ, చక్రవర్తిని తొలగించడానికి నిశ్చయించినాడు. ఇట్లు ప్రతిఘటించి నిలిచిన మీర్‌బక్షీ, అతని సహాయకమిత్రులూ ఏకమై, చక్రవర్తిని ఒత్తిడిచేసి, ఇతిమాద్‌ను వజీరు పదవినుంచి తీసివేయించిరి. ఆ స్థానంలో, ఇమాద్‌ను వజీరుగా నియమింపజేసిరి. నిస్సహాయ స్థితిలో దీనుడై ఉండిన అహమద్‌షాను సింహాసనంనుంచి తొలగించడము, ఇమాద్, వజీరుగా నిర్వహించిన ప్రథమకార్యం. యాభైఐదేండ్ల వయస్సుగల రాజకుమారుడు అజీజ్-ఉద్-దీన్‌ను, రెండవ అలంగర్ అనే బిరుదుతో సింహాసనం ఎక్కించినాడు. ఐదేండ్ల తర్వాత, 1759లో, ఈ బంధనంనుంచి తప్పించుకొని పోవడానికై ప్రయత్నించినందుకై ఈ చక్రవర్తిని, ఉద్దేశపూర్వకంగా హత్యగావించినాడు, వజీరు.

అసమర్థుడే ఐనా, అత్యాశాపరుడు, నీతి నియమాలులేనివాడు, ఐన ఈ వజీరు పరిపాలనకాలం ఐదేండ్లూ అత్యంతమైన అవ్యవస్థతో, దివాలాస్థితి వంటి దారిద్ర్యంతో, దుస్సహ

మైన బాధతో, గడచినవి. చక్రవర్తి, మంత్రులు, ప్రజలు, అందరూ అత్యంతావమానానికి, లజ్జాభారానికి గురిఅయిరి

ఇమాద్, సఫ్దర్ జంగ్, – ఈ ఇరువురూ కూడా తమ తమ సహాయార్థమై, మహారాష్ట్రులను ఆహ్వానించియుండిరి. రఘునాథరావును, పీష్వా ఉత్తర భారతానికి పంపినాడు. కాని, అతడు వచ్చి చేరేలోగా, ఇమాద్ సఫ్దర్ జంగులు రాజీకుదుర్చుకొన్నారు.

దోపిడికి అవకాశంలేక, మహారాష్ట్రులకు ఆశాభంగం కలిగింది. 1752 నాటి సహాయక సంధి ప్రకారం, తమకు చక్రవర్తి ఇచ్చియుండిన ఆగ్రా, అజమీర్ ప్రాంతాలను వశంచేసుకోనివ్వక అడ్డగిస్తున్నారనే నెపంతో, ఈ మహారాష్ట్ర సైన్యం జాటులపైనా రసపుత్రులపైనా, దాడి చేసింది. రసపుత్రులను వెన్నాడుతూ, రఘునాథరావు మల్హార్ రావు హోల్కారులు, నదీమధ్యప్రాంతాన్ని దోచుకొని, ధ్వంసం కావించిరి. జయపాసింధియా, అతని సోదరుడు దత్తాజీలు రాజపుటానాపైబడి కొల్లగొట్టిరి. అంతట, దోచుకొన్న సంపదనంతా సేకరించుకొని, ఈ మహారాష్ట్రనాయికులు పూనాకు మరలిపోయిరి. 1753 నుంచి 1755 వరకు, రెండేండ్ల కాలం జరిగిన ఈ దండయాత్రవల్ల సాధించిన ఘనకార్య మేదీలేదు. రఘునాథరావ్ ప్రవర్తన, ఉత్తరభారత ప్రజలలో భయము, క్రోధము, ద్వేషము, అనే తీవ్రభావాలను ఉత్పన్నంగావించింది. అతడు మిగిల్చిపోయిన ద్వేషభావరూపమైన ఆస్తి ఇట్టిది. వినాశకరములైన పరిణామాలకు ఇది హేతువయింది.

1752లో, పంజాబు ప్రాంతం ఆఫ్గనుల సామంత రాజ్యమైపోయింది. ఆ ప్రాంత ప్రభుత్వాన్ని అహమద్ షా, ముయిన్-ఉల్-ముల్క్ కు అప్పగించి ఉండినాడు. 1753 లో, ముయిన్-మరణించడంతో, పరిస్థితులు మరింత వేగంగా పాడైనవి. దానిపై అరాజకత్వం ఏర్పడింది. సంకటకరమైన ఇట్టి పరిస్థితిలో పంజాబులో క్రమవ్యవస్థను నెలకొల్పవలసిందని కోరుతూ, ముఘలానీబేగం [మరణించిన ముయిన్ భార్య] అహమద్ షాకూ, ఇమాద్-ఉల్-ముల్క్ కూ, విన్నవించుకొంది.

అహమద్ షా ఇంకను కార్యాచరణానికి పూనుకోకపూర్వమే, ఇమాద్, లాహోర్ కు తరలిపోయి, తనఇష్టులైన వారిని గవర్నర్, డిప్యూటీ గవర్నర్, పదవులలో నియమించినాడు. ఇది దురాక్రమణగా తలచిన ఆఫ్ఘనురాజు, దీనిని సహింపలేకపోయెను. అతడు ముందుగా పంపిన సేనానాయకుడు, లాహోరును వశంకావించుకొన్నాడు. అంతట, విస్తారమైన సేనకు తానే స్వయంగా నాయకత్వం వహించి, ఆఫ్గన్ రాజు 1757 లో, ఇండియాపైపడినాడు.

అంతతో, ఉత్తరభారత ప్రజపై, సాక్షాత్తూ నరకమే విరుచుకొని పడింది. సిక్కులు, మొగలులు, ఆఫ్గనులు, ఆధిపత్యానికై పోటీపడిన పంజాబు, హింసాకాండకు, అల్లకల్లోలానికి ఆకరమయింది. శత్రువు, లాహోరును, సార్ హింద్ ను ఆక్రమించి, పిమ్మట ఢిల్లీపై తరలినాడు. అతనిని ఎదిరించడానికి ఏమాత్రమూ సిద్ధంగాలేదు ఢిల్లీ. రోహిల్లానాయకుడైన, నజీబ్-ఉద్-దీన్, తన ప్రభువును విడిచిపెట్టి, ఆఫ్గనులతో చేరిపోయెను. తన సహాయార్థం జాటులను, మహారాష్ట్రులను, రసపుత్రులను తెచ్చుకోడానికి తుది ప్రయత్నం కావించెను. కాని, ఇతని ప్రయత్నం ఫలించలేదు. శత్రువును ఎదిరించే ప్రయత్న మేమాత్రమూచేయక, గుండెలేని వజీరు, రాజధానిని శత్రువుకు అప్పగించినాడు. వెంటనే బలాత్కార ధన సంచయము, నిరంకుశమైన ప్రజోపద్రవము, ఢిల్లీలో రాజ్యంచేసినవి. ఢిల్లీనగరముయొక్క

అస్థిపంజరం మాత్రమే మిగిలింది. ధనవంతులు-దరిద్రులు, కులీనులు- సామాన్యులు, పురుషులు-స్త్రీలు, అనే వివక్షతలేక, అందరూ హింసకూ, అవమానానికీ గురిఅయిరి.

ఈ పరిస్థితి ఇంత దుస్సహమైనప్పటికీ, పుణ్యస్థలాలైన మధుర,గోకుల్ బృందావను లలో జరిగిన ఘోరచర్యలతో పోల్చిచూస్తే, ఢిల్లీప్రజలు పడినబాధలు అత్యల్పములు,లెక్కకు రానివి, అని చెప్పవలసి ఉంటుంది.

ఢిల్లీని ఊచమట్టుగా దోచుకొని, ఆఫ్గన్‌సైన్యము బైటికి తరలిపోయింది. కాలిపోతున్న పల్లెలు, కుళ్ళిపోతున్నశవాలు, నిర్మానుష్యమైన ప్రదేశాలు,- ఈ సేన నడిచిన మార్గాన్ని, ప్రదర్శిస్తున్నవి. మార్గమధ్యంలో ఎదుర్కొన్న జాటుసేనలను నలిపివేసి, ఆఫ్గన్‌సైన్యము మధుర, బృందావన్, గోకులాలవైపు నడిచింది. పవిత్రములైన ఈ పట్టణాలలో జరిగిన రక్తహేతాన్ని, వినాశాన్ని వర్ణించడం సాధ్యముకాని ప్రయత్నం. అడ్డులేక జరిగిన సార్వ జనిక సంహారం తర్వాత, ఏడురోజులవరకు, "యమునానదీజలం, రక్తసదృశమైన వర్ణంతో ప్రవహించింది," అని మధురానగరంలోని, నగలుచేసే ముస్లిము, తన ప్రత్యక్ష సాక్ష్యాన్ని ఇచ్చినాడు. తన సర్వస్వాన్నీ దోపిడిలో కోల్పోయిన ఈ కర్మకారుడు, పెక్కునాళ్ళు పస్తు పడవలసి వచ్చినది. దేవాలయాలను అశుద్ధమొనర్చిరి. అర్చకులు, సాధువులు, సైనికుల కత్తులకు బలిఅయిరి. స్త్రీలు పాషండుల అత్యాచారాలకు గురిఅయిరి. పిల్లలను ముక్కలుగా కోసివేసిరి. అక్కడ జరపని ఘోరకృత్యంకాని, నీచకృత్యంకాని మరొకటి ఉండదు.

కాని, ఈ పుణ్యస్థలాలకు పోషకరక్షకులమని చెప్పుకొంటూ ఉండినవారు, ఈ విషాం దాంత సంఘటనలోచూపిన ఉపేక్ష, అత్యంతమూ లజ్జాకరమైనది. 'హైందవీస్వరాజ్య' పతా కాన్ని నిలిపి, కన్యాకుమారి మొదలు అట్టోక్‌దాకా, దాని ప్రభావం ప్రసరిస్తుందని బీరాలు పల్కిన మహారాష్ట్రులు, మొగల్‌సామ్రాజ్యాన్ని విదేశీయులదాడినుంచి రక్షిస్తామని పూను కొన్నవారు, ఇంతకు ముందుగనే ఆగ్రాప్రాంతపుగవర్నర్ ఆధిపత్యాన్నివహించి, మతము అనే పేరుతో, హిందూపుణ్యక్షేత్రాలపై తమకు ఆధిపత్యం కలదని ప్రకటించినవారు, 'ప్రజ మండలాన్ని' రక్షించే బాధ్యతను తప్పక నిర్వహించవలసినవారై ఉండికూడా, హిందూ మతం, మరణబాధకులోనై ఉన్నప్పుడు తమ ధర్మాన్ని నిర్వహించక, తుచ్ఛంగా, వెను కకు తగ్గినారు మహారాష్ట్రులు. తమ నివాసప్రాంతాన్ని ఆఫ్గనులు నాశంచేస్తూ వచ్చినందు వల్ల , జాటులు మొదట ఎదుర్కొని నిలిచిరి. కాని, ప్రథమసంఘాతంలో దెబ్బతినడంతోనే, వెనుదిరిగిపోయి, తమకు కరిగిన నష్టాన్ని దిద్దుకొంటూ నిలిచిపోయిరి. ఈ విధంగా, వీరు కూడా ప్రజలను దుష్టగతికి వదలివేసిన వారైరి. క్షుద్రకలహాలలో మునిగిఉండిన రస పుత్రులు, భారతదేశపు ఇతరప్రాంతాల్లో జరిగే సంఘటనలపట్ల, ఏ మాత్రమూ ధ్యాసలేని వారై ఉండిరి. న్యాయరీత్యా భారతదేశ సార్వభౌముడు, ప్రజారక్షకుడు, ఐన ఢిల్లీచక్రవర్తి, పరదేశవిజేత చేతిలో బందీయై, దుమ్ములో దొర్లుతూ ఉండినాడు.

ఈ విధంగా, ఢిల్లీ, మధుర, ఆగ్రాల నుంచి మాత్రమేకాక, ఉత్తరభారతంలోని సహస్రాధిక పట్టణాలనుంచి, పల్లెలనుంచి, వెలువడుతుండిన ప్రజల ఆక్రందన ధ్వనులను విన్నవారు లేకపోయిరి. కాని, మానవుడు చేయలేనిదానిని, ప్రకృతి నిర్వహించింది. ఆఫ్గను సేనావాహినియొక్క భీకరయాత్ర, కలరా ఉత్పన్నం కావడంతో, ఆగిపోయింది. స్వదేశానికి మరలి పోవలెనని సైనికులు క్షోభపెట్టసాగిరి. కనుక, అబ్దాలీ వెనుదిరిగి పోవలసివచ్చింది.

ంనా, మూడుకోట్ల నుండి పంద్రెండుకోట్లదాకా అంచనావేయబడిన సంపదను సేకరించుకొని, తైమూరు వంశం వారికి అవాచ్యమైన విధంగా అవమానంచేసిగాని, అతడు దేశం విడిచిపెట్టి పోలేదు. మహమ్మద్‌షా కుమార్తెను, పదహారేండ్ల కన్యను, అబ్దాలీకి వివాహంచేసి ఇవ్వ వలసిన గతిపట్టింది, చక్రవర్తికి.

"కత్తిరింపబడిన చెవులతో, కుష్ఠరోగపు పుండుతో కుళ్ళిపోతున్న ముక్కుతో, భీకరాకారంతో, 'తాత' వయస్సుకు తగిన వృద్ధాప్యంలో ఉండిన ఈ ఆఫ్ఘనుకు, పదహారేండ్ల సుకుమారిని, రాజపుత్రిని, అంటకట్టినారు. అత్యంతమూ దుస్సహమైన పరిహార ద్రవ్యమిది. కాని, దయాదాక్షిణ్యాలు రాజకీయాల ప్రకృతిలోనివి కావు. పరిపాలకుల మూఢత్వానికీ, అవివేకానికీ, అపరాధాలకూ శిక్షను అనుభవించవలసినవారు, నిర్దోషులైన ప్రజలు.

నజీబ్-ఉద్-దౌలాను తన కార్యవర్తిగా ఢిల్లీలో నిలిపి, అహమద్‌షా, ఖాందహార్‌కు మరలిపోయినాడు. మీర్‌బక్షి పదవిలో అతనిని నిల్పి, ప్రభుత్వాధికారములన్నీ అతని హస్తగత మొనర్చి, వెళ్ళిపోయినాడు అహమద్‌షా అబ్దాలీ. పూర్వపు వజీరైన ఇమాద్‌ను, అధికారం నుంచి తొలగించినాడు కూడా. ఐనా, ఏ బాధ్యతాలేని, వకీల్-ఇ-ముత్లక్ అనే ప్రతిష్ఠను మాత్రం, అతనికి ప్రదానంచేసి పోయినాడు.

అహమద్‌షా దేశం విడిచి వెళ్ళిన వెంటనే, పూర్వపు రాజకీయ పన్నాగాలు ప్రారంభమైనాయి. నజీబ్‌ను, అధికారం నుంచి పదభ్రష్టుడు చేయడానికి, ఇమాద్ ఎత్తులువేయసాగినాడు. అబ్దాలీ తుపాను శాంతించడంతో, మహారాష్ట్రులు కూడా ఉత్తరంలో, తలఎత్తసాగిరి. తమ జాగీర్లను, కోటలను, స్థానాలను శీఘ్రమే స్వాధీనంచేసుకొని, దురాక్రమణ కావించి యుండిన వారిని పారదోలి, నదీమధ్యప్రాంతంపై తమ ఆధిపత్యాన్ని నెలకొల్పి, మహారాష్ట్రులు పన్నులు వసూలుచేయడం ప్రారంభించిరి.

నజీబ్‌ను పారదోలడానికై చక్రవర్తీ, ఇమాదూ, చేరి, మహారాష్ట్రులతో మైత్రికలుపుకొనిరి. వీరితో పోరాడడానికి నజీబ్‌ప్రయత్నించెను; కాని, తన ప్రయత్నాన్ని వీరు సాగనీయకపోగా, ఇమాద్‌కుటుంబములోని స్త్రీలపై తన కసితీర్చుకొన్నాడు. కడపట, ప్రతిఘటించడంవల్ల, ప్రయోజనంలేదని గ్రహించి, బేషరతుగా లొంగిపోయెను. ఈ విధంగా ఢిల్లీకీ, సామ్రాజ్యానికీ, యాజమాన్యం వహించడానికి మహారాష్ట్రులకు అవకాశం ఏర్పడింది.

రఘునాథరావ్, మల్హార్‌రావ్ హోల్కార్ నాయకత్వంలో, మహారాష్ట్ర సేనలు, ఢిల్లీనుంచి బయలుదేరి, పంజాబుప్రవేశించి, ఏప్రిల్ 1758లో లాహోరును ఆక్రమించినవి. అహమద్‌షా కార్యకర్తలను అచ్చటినుంచి పారదోలి, అదీనాబేగ్‌ను తమ గవర్నరుగా నియమించిరి.

ఢిల్లీ నుంచి బహిష్కరించబడినప్పటి నుంచి, తగిన సమయానికై వేచియుండిన నజీబ్, అబ్దాలీతో ఉత్తరప్రత్యుత్తరాలు జరపడం ఆరంభించినాడు. తన రాజ్యాన్ని రాబట్టుకోడానికై ఇండియాకు మళ్ళీరావలసిందని, అతనిని ప్రోత్సహింపసాగెను. దత్తాజీసింధియా సేనాధిపత్యంలో మహారాష్ట్రులు, నజీబ్‌ను శిక్షించడానికై బయలుదేరిరి. కాని, ముజఫర్ నగర్ సమీపంలో దుర్గంగా ఏర్పడియున్న ఒక రక్షక స్థానం వెనుక నిలిచి, నజీబ్, వీరి మార్గాన్ని నిరోధించెను. ఇక్కడ ముట్టడింపబడిన ఈ రోహిల్లా నాయకుడు మహారాష్ట్రులను నెలల పర్యంతం, ఎదిరించి నిలిచినాడు. అంతట, ఔధ్‌నవాబు, గోసాయీల నాయకత్వంలో

పంపిన సహాయక హిందూ సేనాదళాలు, ఇతనితో వచ్చి కలిసినవి. అతడు కావించిన రెండవ ప్రయత్నం కూడా ఫలించింది. కాబూల్ నుంచి బయలుదేరి, అబ్దాలీ, సింధునదిని దాటినాడు. మహారాష్ట్ర సేనాదళాలను తరుముతూ, వేగంగా పంజాబుదాటి, ఢిల్లీవైపు నడిచినాడు. థానేశ్వర్‌వద్ద, అతనిని ఆపడానికి దత్తాజీ కావించిన ప్రయత్నం విఫలమయింది. అక్కడ విఫలుడై, యమునానదిరేవులను రక్షించడానికై ప్రయత్నించినాడు దత్తాజీ. కాని, అతని సేనలు మళ్ళీ ఓడింపబడినాయి; దత్తాజీకూడా ఆ యుద్ధంలో హతుడైనాడు. అబ్దాలీని పీడించ డానికి ప్రయత్నించిన మల్హార్‌రావు కూడా, వెనుకంజ వేయవలసి వచ్చింది. అంతతో అతడు రాజపుటానాలోకి వెనుదిరిగిపోయినాడు.

ఉత్తరంలో జరిగిన ఈ అపజయాలవార్తలు, పూనాలో కలవరాన్ని కలిగించినవి. ఈ పరిస్థితిని స్వాధీనపరచుకోడానికై, పీష్వాకుటుంబములోనివారి నాయకత్వంలో, ఒక ప్రబలమైన సైన్యాన్ని పంపడానికి నిశ్చయించినారు. బాలాజీబాజీరావుకు సోదరసంబంధం కల సదాశివరావ్ భావూను, సైన్యాధిపతిగా నియమించి, పీష్వాకుమారుడైన విశ్వాసరావును నామమాత్రంగా, సైన్యాధ్యక్షుడుగా నిశ్చయించిరి. 22వేల మరాఠాసైన్యంతోనూ, ఫ్రెంచ్ సేనాధిపతి బుస్సీవద్ద తుపాకి శిక్షణపొందిన, ఇబ్రహింఖాన్‌గర్దీ నాయకత్వంలో శిక్షితులైన 8వేల మంది సిపాయీలతోనూ, వీరుఉత్తరభారతంవైపు తరలినారు. హోల్కార్, సింధియా, మరి ఇతర సేనానాయకుల ఆధిపత్యంలో, ఢిల్లీచుట్టూగల రక్షకస్థానాలలో నిలిచియున్న సేనలు కూడా, భావూసైన్యంతో చేరినవి.

తమ పూర్వపుమిత్రుడైన ఔధ్‌నవాబు తమ ప్రయోజనంతో, ఏకీభవిస్తాడని మహా రాష్ట్రులు ఆశించియుండిరి. అట్లే, రసపుత్రులూ, జాటులుకూడా ఉత్సాహంతో తమకు సహ కరిస్తారని తలచిరి. కాని, రోహిల్లాలకు నవాబుకుగల, దీర్ఘకాలిక తీవ్రశత్రుత్వం ఎట్లున్నా, రోహిల్లాలు అబ్దాలీకి సహకరించడానికి పూనుకొన్నారు. ఐనా, ఈ సహకారం హృదయ పూర్వకమైనదికాదు. నజీబూ, అబ్దాలీలు తమ సైన్యాలతో అప్పటికే, నదీమధ్యప్రాంతంలో నిలిచిఉన్నారు. కనుక, వారు తమ ప్రాంతాన్ని సులభంగా ఆక్రమించగలరు. ఇక, మహా రాష్ట్రులో, తమ సరిహద్దులకు చాలదూరంలో, యమునకు అవతలిఒడ్డున ఉన్నవారు. అఫ్గన్ రోహిల్లాసైన్యాల కూటమిని ఓడించిన తర్వాతనే, మహారాష్ట్రులు తమ ప్రాంతాన్ని సమీపించగలరు. అంతేకాక, మహారాష్ట్రులు విజయాన్నిసాధిస్తే, తనకు శాశ్వతమైన అధీన త్వం తప్పదు. ఇక, అబ్దాలీవిషయమో, అతనికి ఇండియాలో ఉండే అభిప్రాయమేలేదు. అంతేకాక, మహారాష్ట్రులు తన తండ్రికి ద్రోహం కావించినవారు. వారి మాటను విశ్వసించ డానికే వీలులేదు. ఈ కారణాలన్నిటినీ తర్కించుకొని, ఔధ్‌నవాబు ఈ నిర్ణయాన్ని తీసు కొన్నాడు.

మహారాష్ట్రులు తమ భూములపై ఇంతకుపూర్వమే జరిపిన నాశనాన్ని, రసపుత్రులు ఇంకనూ మరచిపోలేదు. కనుక, వారు ఏ పక్షంతోనూ చేరడానికి ఇష్టపడలేదు. ఐనా, కడ పటికి ఎవరుజయిస్తే వారితో తమ భవిష్యత్తును కలపడానికి, నిశ్చయించుకొనిరి. జాట్‌పరి పాలకుడైన సురాజ్‌మల్ మరాఠాలపట్ల, సంశయగ్రస్తుడై ఉండినాడు. వారు చేసేవాగ్దానాల పై అతనికి విశ్వాసము ఏమాత్రములేదు. జాటులు ఆలిఘర్‌లో నిర్మించుకొన్న కోటపై, ప్రాంతీయగవర్నరు గోవిందబల్లాల్‌బుందేలా, అన్యాయంగా కన్నువేసి ఉండడం, ఇతని సంశ

యాన్ని బలపరచింది.

ఉత్తరభారతంలో ఒక స్నేహితుడుకాని, సహకరించేవాడుకాని, మహరాష్ట్రులకు లేరన్న విషయం స్పష్టమయింది. అబ్దాలీని ఎదిరించడంలో ఎట్టి వ్యూహాలను అనుసరించవలె ననే విషయంలో, తమ సైన్యంలో భేదాభిప్రాయాలు కలిగినవి. ఢిల్లీని ప్రవేశించడం మాత్రమే, వారి సైన్యం సాధించగలిగేది. అందుకు కారణాలుకూడా, లేకపోలేదు. అహమద్‌షా, నదీమధ్యప్రాంతంలో దాడిసాగిస్తూ ఉండినాడు. ఢిల్లీలోనిలిచియున్న సైనికదళం స్వల్పమైనది కనుక, బలవత్తరమైన మహారాష్ట్రసైన్యము యొక్క ముట్టడిని భరించలేదు.

కాని, మహరాష్ట్ర సైన్యానికి ఢిల్లీ, ప్రలోభన కారిమైన పాశంగా పరిణమించింది. పిష్యో, ద్రవ్యాన్ని ఇచ్చే స్థితిలోలేడు. అప్పటికల్లోల పరిస్థితుల్లో, జాగీరులనుంచీ, సంస్థానాల నుంచీ, రాజస్వాన్ని వసూలుచేయడం దుష్కరమయింది. దోపిడులవల్ల ఏమీలభించేదికాదు. సైనికులకూ, గుర్రాలకూ ఆహారం కరవయింది. తమ వశంలో ఉండే ఆహారపదార్థాలు క్షీణిస్తూవచ్చినవి. శత్రువులు చుట్టుముట్టిఉన్నారు. కనుక, పరిస్థితుల క్లిష్టతవల్ల, భావూ ఢిల్లీని వదలిపోవలసివచ్చింది. అబ్దాలీ పరిస్థితి కూడా, భావూపరిస్థితికంటె కొంచెము మెరుగుగా ఉండింది. ద్రవ్యం క్షీణిస్తూ ఉండడం అతనిని కూడా ఇరుకులో పెట్టింది. కనుక, స్వదేశం వెళ్ళడానికి అతడు కూడా ఉన్ముఖుడై యున్నాడు. కాని నజీబుచేసిన ద్రవ్యసహాయమూ, భావూ రాజీకిరాకపోవడమూ, బలవత్కారణాలై, అతడు విషమపరిస్థితివరకూ నిలిచిఉండేటట్లు చేసినవి.

శత్రు వర్గాలు రెండూ పానిపట్ వద్ద ఎదుర్కొన్నవి. అక్కడజరిగిన కదనపరం పరలో, మహరాష్ట్ర సేనాధిపతి ప్రాణాంతకములైన రెండు తప్పులు చేసినాడు. తన సైన్యముయొక్క రాకపోకల మార్గాన్ని శత్రువులు అరికట్టడానికి అవకాశమివ్వడము, మరాఠాయుద్ధ సంబంధమైన సాంప్రదాయిక పద్ధతులను విడిచిపెట్టడము,- అనే రెండు తప్పులవల్లా, విషమ పరిస్థితి ఏర్పడింది. సుశిక్షితమైన ఫిరంగి దళముపై ఆధారపడి, విస్తారమైన తన సైన్యాన్నంతటినీ, వెనుకభాగంలోని రక్షక కందకాలలో (Trenches) నిలిపి ఉంచడంవల్ల, స్థలాంతరచలనానికి అవకాశంలేక, సైన్యం ఒకచోటనే బంధితమై నిలిచి పోయింది. అఫ్గన్ సైన్యము దక్షిణానికిపోయే మార్గాన్ని ఆక్రమించగా, అబ్దాలీ, తన రక్షక శ్రేణిని మహరాష్ట్ర సైన్యంచుట్టూ నిలిపి, మహరాష్ట్రుల రాకపోకలను, సామగ్రి సరఫరాలను ఆపివేసినాడు. "చుట్టుప్రక్కల ప్రాంతాలన్నీ మహరాష్ట్రులపై ద్వేషభావాన్ని వహించినవై, పూర్వము తమకు జరిగిన భయంకర వినాశానికి ప్రతిక్రియ చేయడానికి ఉద్రేక పూరితమై ఉన్నవి." కనుక,భావూ సేనాశిబిరానికి ఏవిధమైన సహాయమూ అందలేదు. కూడులేక చావ వలసిన పరిస్థితి దాపరించింది. ఆకలిమంటలవల్ల తెగించిన వాడై, భావూ, సాహసయుద్ధానికి నిశ్చయించినాడు. 1761 జనవరి 14వనాడు, శిబిరాన్ని వదలి, యుద్ధోన్ముఖుడైనాడు. ఇరు పక్షాలసైన్యాలూ మరణాంతకమైన యుద్ధంలో చిక్కుకొన్నవి.

ఇండియా యుద్ధాలలో, జయాపజయాలు సాధారణంగా నాయకునిశక్తి సామర్థ్యాలను బట్టి నిశ్చిత మౌతాయి. మధ్య ఏషియాలోనూ, ఇండియాలోనూ అనేకయుద్ధాల అనుభవంకల వాడూ, ఉపాయకౌశలము, సాధన సంపత్తి కలవాడూ, అఫ్గన్‌సేనాధిపతి అబ్దాలీ. వయస్సులో చిన్నవాడు, కర్ణాటక ప్రాంతంలో దక్షిణదేశములను మాత్రమే ఎదుర్కొని యుద్ధాలు నడిపిన

వాడు, మహరాష్ట్ర సేనాధిపతి. ఇట్టి, ఈ ఇరువురికీ, పానిపట్ వద్ద యుద్ధం సంఘటిల్లింది. మహరాష్ట్రులకంటెను అబ్దాలీకి సాధన సౌకర్యాలు ఎక్కువ. సైనిక సంఖ్యాబలము, తుపాకి దళము, దేహశిరస్త్రాణాది రక్షణ పరికరాలు, అశ్వముల ఉత్కృష్టత,- మొదలైన సౌకర్యాలు ఆఫ్గనులకు ఎక్కువ. యుద్ధనిర్వహణంలో ఆఫ్గన్ సేనాధిపతియొక్క ఉత్కృష్టత, అతని దళవాయీల కౌశలము, ఆఫ్గన్ సేనల ఉత్తమ క్రమశిక్షణ స్థైర్యాలు, ప్రయోజనకారులై, వారికి విజయాన్ని చేకూర్చినవి. మహరాష్ట్రులు, రోషావేశంతో శత్రు సైన్యంపైపడి, ఉన్నతజాతికి అనుగుణమైన పట్టుదలతో, పరాక్రమంతో, పోరాడినారు. కాని, వస్తులవల్ల బలహీనులైయున్న మహరాష్ట్రులు, మధ్యాహ్న సమయానికే అలసటచెంది పోయిరి. మహరాష్ట్ర సైన్యపు మధ్యశ్రేణిని, అబ్దాలీయొక్క తుపాకిదళం ఆవరించి, ఒత్తిడి చేసింది. అంతతో అస్తవ్యస్తత ఏర్పడి దళమంతా క్రమస్థితిలేని మూకగా ఏర్పడిపోయింది. మహరాష్ట్ర సైన్యపు దక్షిణశ్రేణికి నాయకుడైన ఇబ్రహింఖాన్‌గర్డీ, అబ్దుల్లా సైన్యపు కుడి భాగంలోని రోహిల్లాలపైపడి, మొండి పట్టుదలతో, అతిసాహసంతో పోరినాడు. కాని, రక్త పాత బహుళమైన ఈయుద్ధంలో, ఎనభై వంతుల తుపాకి దళము బలి ఐపోగా, అతడు తక్కిన వారితో యుద్ధరంగాన్ని వదలిపోవలసివచ్చింది. సిందియా హోల్కారులు నడపు తుండిన మహరాష్ట్రసైన్యపు కుడిభాగం, నజీబ్‌ను, షుజా-ఉద్-దౌలాను ఎదిరించి నిలిచినవి. కాని, యుద్ధంలో పాల్గొనలేదు. సైన్యమధ్య భాగమూ, దక్షిణభాగమూ చీలిపోయినవని గ్రహించిన వెంటనే, హోల్కారు పలాయితుడైనాడు. సింధియా దళాలు అతనిని అనుసరించి నవి. అపజయం పలాయనంగా పరిణమించింది. అంతతో, అతిఘోరమైన సంహారము జరిగింది. 25000 మంది సైనికుల శవాలతో యుద్ధరంగం కప్పబడిపోయింది. సేనాధికారు లలో ఎక్కువభాగం యుద్ధంలో హతులైరి. విశ్వాసరావూ, భావూకూడా, వీరోదాత్తంగా పోరాడుతూ తమ ప్రాణాలను బలికావించినారు.

పానిపట్‌వద్ద కలిగిన పరాజయం అత్యంతమైన విపత్తు. కాని, దేశరాజకీయ వ్యవస్థ దీనితో నిశ్చితంకాలేదు. ఈ విజయంవల్ల అబ్దాలీకి ఎట్టి ప్రయోజనమూ సిద్ధించలేదు. అతడు దేశమునుంచి వెనుకకు మరలడంతోనే, అతని విజయాలు పటాపంచలైనవి. ఇతడూ, ఇతని తర్వాత రాజ్యానికివచ్చిన వాడూ తమస్వదేశంలో చెలరేగిన విద్రోహాల ఇక్కట్టులలో చిక్కు కొనిరి. ఉత్తరదిక్కునుంచి (ఉజ్‌బెగ్సు), పడమరనుంచి, పర్షియనులూ, వీరిని పీడించ సాగిరి. కనుక, ఇండియాలోని తమ కార్యకారులకు తగినంత ఆలంబనాన్ని కలిగించలేక పోయిరి. సిక్కులు తమ అరణ్యప్రదేశాలనుంచి బయలువెడలి దేశముపై వ్యాపించి, ఆఫ్గన్ అధికారులను పారదోలి, అన్నివైపులా దాడిచేసి దోచుకోసాగిరి. కొన్ని ఏండ్లలోపుననే, సింధునదికి ఇవతలి భూభాగంలో, అబ్దాలీ విజయచిహ్నలేమీ మిగులలేదు. మహరాష్ట్రులు గాఢమైన దెబ్బతిన్నవారే. కాని, పదేండ్లలో కోలుకొని, ఉత్తరభారతదేశంలో మరల తల ఎత్తిరి. ముగల్‌చక్రవర్తి ఐన షా ఆలాంకు, రక్షకులనేపేరుతో వర్తిస్తూ అతనిని అలహాబాదు నుంచి ఢిల్లీకి, 1771లో, తీసుకొనివచ్చిరి.

పానిపట్‌యుద్ధంలో మహరాష్ట్రులకు విజయం లభించిఉంటే, తరువాతి భారతదేశ చరిత్ర భిన్నంగా నడిచిఉండేదని కూడా చెప్పజాలము. వాస్తవానికి మహరాష్ట్ర రాజ్యవ్యవస్థ

ఛిద్రమైపోతుందని, నిస్సందేహములైన సూచనలు 1761కి పూర్వమే, పొడచూపినవి. వారి స్వదేశప్రభుత్వపు ఆధారం, బలహీనమైనట్టిది. 'మరాఠాస్వరాజ్య' ప్రాంతం నిస్సారమైనది. ఒక సామ్రాజ్యాన్ని పోషించడానికి తగిన రాజస్వసంపాదనకు అవకాశాలు తక్కువ. కనుకనే, బలవద్గ్రహణంవల్లను, దోపిడివల్లను వచ్చే ధనంతో తమ సైన్యాన్ని పోషించుకొనే విధానాన్ని, పీష్వాప్రభుత్వాలు, అవలంబించినవి. స్వరాజ్, లేక,- మరాఠా నివాసభూమికి బాహ్యంలోఉండే ఇండియాభాగాలను- సర్దారులకు అప్పగించియుండిరి. ఈ సర్దారులు, తమ పోషణకూ, కేంద్రప్రభుత్వ పోషణకూ అవసరమైనధనాన్ని అంశదానాల ద్వారా(Contributions) సేకరించవలసి యుండిరి. కాని, హఠవాదులై, కేంద్రప్రభుత్వాన్ని లక్ష్యపెట్టని సర్దారులను లొంగదీయడానికి తగినంత సైన్యసంపద, కేంద్రప్రభుత్వానికిలేదు. ఈసర్దారులందరికీ ఐక్యాన్నికూర్చగల ఆధారసూత్రాన్ని కేంద్రప్రభుత్వంకూడా, పెంపొందించి యుంచలేదు. రాజ్యాధికారం పీష్వాలకు బదిలీ ఐపోవడంవల్ల, రాజభక్తి- శివాజీవంశానికి చెందవలసిన స్వామినిష్ఠ- అడగిపోయింది. పరిపాలనరంగంలో, ఆలస్యంగా ప్రవేశించినవారు పీష్వాలు. ఇంతవరకూ వీరితో సమానమైన ప్రతిపత్తిలోఉండిన మంత్రులూ, సేనానాయకులూ వీరి ఆధిపత్యంపట్ల ఈర్ష్యాపరులై ఉండిరి. ఇట్టి సందర్భాలలో, అనైక్యము, ఆంతరంగిక ఘర్షణలు తప్పవు. ఇంతకెప్పుడో పూర్వం, (1738లో) మొగల్‌సామ్రాజ్యపు పూర్వభాగాల్లో రఘోజీభోంస్లే, చౌత్‌అనే పన్నును విధిస్తూవచ్చినప్పుడు, పీష్వా ప్రథమబాజీరావుతో, ఇతనికి ఘర్షణ ఏర్పడింది. వ్యవహారం బెడిసి విషమించడంతో, తరువాతి పీష్వా, బాలాజీరావ్, మొఘల్‌చక్రవర్తి కోరికపై, భోంస్లేను దండించడానికి 1743లో, అంగీకరించినాడు. బెంగాల్ నవాబు అల్లావర్దీఖాన్‌కూడా ఈ విషయంలో పీష్వాతోచేరేటట్లు ఏర్పాటయింది. హోల్కారు సింధియాలమధ్యగల స్పర్ధలు, రాజీకివచ్చేటట్లు కనబడలేదు. దామాజీగయక్‌వాడ్, పీష్వాను ధిక్కరించినాడు. బాహాటంగా కాకపోయినా, హోల్కారు పీష్వాపట్ల విరోధభావంకలవాడే. పానిపట్ యుద్ధానంతరం, పీష్వాగాదీకై, ఉత్తరాధికారులమధ్య, యుద్ధాలుజరిగే సందర్భాలు కూడా ఏర్పడినవి.

గొప్పజాగీర్‌దార్లకుటుంబాలూ, సర్దార్లకుటుంబాలూ కొన్ని, స్వతంత్రములైన చిన్న రాజ్యాలను ఏర్పరచు కోడానికి ప్రయత్నిస్తూ వచ్చినవి. మరాఠా ప్రజానీకానికిగాని, వివిధ వర్గాలకుగాని రాజకీయ వ్యవహారాల్లో భాగమూలేదు, అధికారమూలేదు. ఉన్నతరాజ్యాంగవేత్తల లక్షణాలు కూడా మరాఠా నాయకులలో కానరాలేదు. వీరు, దురాశాపరులు, బలాత్కారంగా సంగ్రహించుకొనే స్వభావంకలవారు. రైతులను నేలమట్టం కావించినారు. ప్రజల అభిమానాన్నికాని, తమ ఆశ్రితుల అభిమానాన్ని కాని, సంపాదించుకోడానికి ఏమాత్రమూ ప్రయత్నించిన వారుకారు. తమ ప్రజల విషయంలో తామే ఆసక్తి చూపలేదు. వారిశ్రేయస్సును గూర్చిగాని, వారి సాంస్కృతికాభ్యుదయాన్ని గురించికాని, ఎట్టి ఆసక్తినీ వహించలేదు.

పానిపట్ పరాజయం నిర్ధారకమైనట్టిదికాదు. భారతదేశ భవిష్యత్తును వాస్తవంగా నిశ్చితిమొనర్చి, విప్లవాత్మకములైన పరిణామాలను కలిగించిన యుద్ధం, పానిపట్టు యుద్ధానికి నాలుగు సంవత్సరాల పూర్వమే, ప్లాసీసమీపంలోని మామిడి తోపులో, జరిగింది.

అహమద్‌షాఅబ్దాలీ, ఇండియాను వదలి పోయేముందు, రెండవ షాఆలమ్ అనే

బిరుదులతో, ఆలీగౌహర్‌ను భారతదేశ చక్రవర్తిగా ప్రకటించి ఉండినాడు. కాని, ఆ సమయంలో, షాఆలం, రాజధానిలో లేడు. అందువల్ల, షహజాదాజవాన్ బఖ్త్‌ను, యువరాజుగా చేసుకొని, నజీబ్-ఉద్-దౌలా, ముఖ్య పరిపాలనాధికారిగను, రాజప్రతినిధిగాను, రాజకార్యాలను నిర్వహిస్తూవచ్చినాడు. ఈ విధంగా, ఇతడు రాజకార్యభారాన్ని 1761 నుంచి, 1770 దాకా, వహించినాడు. ఇతడు చక్రవర్తికి ప్రతినిధిగా మాత్రమేకాక, అహమద్‌షా అబ్దాలీకి కార్యకర్తగా కూడా, బాధ్యతవహించినాడు. ఢిల్లీ పరిసర ప్రాంతంలోని మొఘలు రాజ్యంలో క్రమవ్యవస్థను నెలకొల్పడము, జాటులు, సిక్కులు, దురాక్రమణ చేయకుండా రాజ్యాన్ని రక్షించడము,-అనే రెండు బాధ్యతలను, ఇతడు నిర్వహించవలసి ఉండేది. జాటుల విషయంలో ఇతడు విజయాన్ని సాధించినాడు. సురాజ్‌మల్‌ను యుద్ధంలో హతమొనర్చి, అతని కుమారుడు మరల తల ఎత్తకుండునట్లు చర్యతీసుకొన్నాడు. కాని సిక్కులను ఇతడు సాధించలేకపోయెను. సులభంగా లొంగిపోయేవారు కారు సిక్కులు. ఐనప్పటికీ, ఫుల్కియాన్ సిక్కులను, సట్లజ్‌నది అవతలి సిక్కు సర్దారుల నుంచి విడదీసి, కొంత ప్రయోజనాన్ని సాధించినాడు.

## IV. మరాఠా కలహాలు - ఢిల్లీపతనము

1770 నాటికి, మహరాష్ట్రులు పానిపట్ యుద్ధపు ఆఘాతం నుంచి, చాలవరకు కోలుకొని, ఉత్తర భారతదేశంలో తమ ఆధిపత్యాన్ని మరల నెలకొల్పుకొన్నారు. ఈ సమయానికి సరిగా, నజీబ్ మరణించెను. అందువల్ల షాఆలామ్, అలహాబాద్‌లో నివాసమేర్పరచుకొని, ఆంగ్లేయుల రక్షణలో ఉండడమో లేక మహరాష్ట్రుల సహాయంతో ఢిల్లీ సింహాసనానికి ప్రయత్నించడమో, చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. చక్రవర్తియొక్క ఈ ఆందోళనను పూర్తిగా ఉపయోగించుకొని, మహరాష్ట్ర సరదారులు, ఢిల్లీని మరల ప్రవేశించిరి. తమ రక్షణలో అతనిని ఢిల్లీ తీసుకొనిపోయి, సింహాసనంపై నిలపడానికి వాగ్దానం కావించి, అతనితో ఒప్పందం కావించుకొనిరి. ఇట్లు, పండ్రెండేండ్లకాలం ప్రవాసంలో గడపిన షాఅలామ్, సామ్రాజ్యాధికారానికి కేంద్రమూ, చిహ్నమూ ఐన రాజధానికి మరలి వచ్చినాడు.

ప్రవాసంలో ఉండికూడా, బీహార్ బెంగాల్‌లపై తన ఆధిపత్యాన్ని పునఃస్థాపించుకోడానికి, షాఅలామ్, పలుమార్లు ప్రయత్నించెను; కాని, బెంగాలు నవాబు ఈ ప్రయత్నాలను విఫలం కావించినాడు. పానిపట్ యుద్ధం జరిగిన మరునాడే, షాఆలామ్, సామ్రాజ్యముయొక్కగతి ఏమౌతుందో, అనే విషయాన్నే గమనించక, బీహర్ పట్టణంవద్ద ఆంగ్లేయులతో ఘోరయుద్ధము జరిపి ఉండడం, చాలవిచిత్రమైన సంఘటన. ఆయుద్ధంలో ఓడిపోయి, రాజీకి ఆంగ్లేయులను ప్రార్థించవలసివచ్చింది. మళ్ళీ, మూడు సంవత్సరాల తర్వాత (1764), చక్రవర్తి, ఔధ్‌నవాబూ, ఏకమై, రాజ్యభ్రష్టుడైన నవాబ్‌కాసిం ఆలీఖాన్ (మీర్‌ఖాసీం) పక్షము వహించి, బక్సారువద్ద, యుద్ధమొనర్చిరి. కాని, అక్కడ కూడా, వీరి సైన్యాలు పూర్తిగా ఓడిపోయినవి. ఈ విధంగా, షాఅలామ్ బ్రిటిష్ వారి నుంచి నివృత్తి వేతనం గ్రహించే వ్యక్తిఐనాడు. షుజా-ఉద్-దౌలా బ్రిటిషు వారికి సామంతుడైనాడు. పరదేశీయుల ఆశ్రయంలో జీవించే అవమానాన్ని భరించలేకనే, షాఅలాం, మహరాష్ట్రుల రక్షణను అంగీక

రించి, అలహాబాద్ విడిచి, వారితో ఢిల్లీ ప్రయాణమైనాడు.

ఢిల్లీరాజ్య వ్యవహారాలపై అధికారం నడిపే స్థానం మహారాష్ట్రులకు ఇప్పుడు సిద్ధించింది. కాని, నాలుగవ పీష్వా ఐన మాధవరావ్ 1772లో మరణించడంతో, తప్పని సరిగా ఉత్తరాధికారానికి సంబంధించిన వివాదాలలో, పూనా, మునిగిపోయింది. పీష్వా పిన తండ్రి ఐన రఘునాథరావ్, నారాయణరావును పదవినుండి తొలగించడానికి కుట్రలు పన్న సాగినాడు. అసంతృప్తితో కుములుచుండిన వారి సహాయం, ఇతనికి సులభంగా లభించింది. తమ ప్రభువుయొక్క గతిపట్ల, పీష్వాయొక్క రాజ్యమండలి సభ్యులు, చాలవరకు, ఉదాసీనులై ఉండిరి. రాజభవనాన్ని రక్షిస్తున్న గర్దీలు, కుట్రకులోబడి, తప్పుసాక్ష్యం ఇవ్వడానికి సిద్ధపడిరి. తన రక్షణ విషయమై పీష్వానారాయణరావు ముందుగా జాగ్రతపడ లేదు. అతడు సింహాసనం ఆరోహించిన తొమ్మిదినెలలలోపుగనే, అతనిని మోసంతో హత్యగావించిరి.

దానితో, అంతర్యుద్ధము ఆరంభమయింది. బ్రిటీషువారి సేనాసహాయార్థం, వారి షరతులను తెలుసుకోడానికై రఘునాథరావ్ (రఘోబా) సంప్రతింపులు జరిపినాడు. ఇప్పుడు రాజకీయాలు పక్వమయ్యేస్థితి ఏర్పడింది. మరాఠా సర్దారులందరూ, ఈ కలహంలో సంబంధం కల్పించుకొన్నారు. దక్కనులో వీరి ఇరుగుపొరుగువారైన, హైదరాబాద్ నైజామూ, మైసూర్‌నవాబైన హైదరాలీ, తమ ప్రయోజనాలకు అనుకూలమైన పక్షంలో చేరిరి. ఫ్రెంచి వారు కూడా ఈ సంఘర్షణలో ప్రవేశించిరి. కట్టకడపట, 1782లో సాల్‌బాయిసంధితో, ఈ దీర్ఘకాలయుద్ధం ముగిసింది.

సంక్షోభముతోనూ, తుములంతోనూ గడచిన ఈ యుద్ధకాలంలో, మరాఠాసర్దారులకు ఉత్తరభారత వ్యవహారాలను గమనించే అవకాశం కలుగలేదు. కనుక, ఢిల్లీ వ్యవహారాలలో జోక్యం కలిగించుకోలేదు. బెంగాలులోఉండి, ఆంగ్లేయుల సాహచర్యంలో యుద్ధవిద్యలు నేర్చిన నజఫ్‌ఖాన్, కార్యతః ఢిల్లీపరిపాలకుడైనాడు. ఇతనికి ఆంగ్లేయుల అభిమానమూ సహాయమూ కలవు. పౌరపరిపాలనను సక్రమంగా సాగించడానికి తగిన సామర్థ్యంలేకపోయినా, సామ్రాజ్యశేషభాగాలను కూడగట్టుకొని, చుట్టూమూగియున్న శత్రువులదాడులనుంచి రక్షించుకోగలిగినాడు.

1782లో, నజఫ్‌ఖాన్ మరణించెను. రాజప్రతినిధి పదవికై, ఇతని సేనానాయకుల మధ్య సంకులయుద్ధం ఆరంభమయింది. ఈ యుద్ధంలో, వీరు, తుదకు బడలిపోయి, మహారాష్ట్రులు రంగంలో ప్రవేశించడానికి మార్గం కల్పించినవారైరి. మహారాష్ట్రులకు నాయకుడైన మహాద్‌జీ సింధియాకు, ఇప్పుడు దక్కనుయుద్ధాలనుంచి విడుగడలభించి ఉండినది. కనుక, ఉత్తరభారత వ్యవహారాలను చూచుకోడానికి తగిన సమయం లభించింది. మహారాష్ట్ర వ్యవస్థను, ఉత్తరాధికారయుద్ధం, కూకటివేళ్ళదాకా కదలించివేసింది. సమ్మిళితరాజ్యవర్గాలకు ఐక్యం కలిగించే సంబంధసాధనమై ఉండిన పీష్వా ఆధిపత్యాన్ని, బలహీనంకావించినారు. సింధియా, హోల్కార్, గయక్‌వాడ్, భోంస్లేవంటి సర్దారులు, దక్కన్, బెంగాల్, ఔధ్, ప్రాంతాల మొఘల్ సుబేదార్లవలె, స్వయంపరిపాలకులైన ప్రాంతీయపరిపాలకులైనారు. ఢిల్లీలోని అత్యుత్తమ మొగల్‌శ్రీమంతుని పాత్రను నిర్వహించవలెనని, మహాద్‌జీ ఉత్కాంక్ష. నజఫ్‌ఖాన్‌సేనానాయకుల కుట్రలనుంచి, కలహాలనుంచి, విరామం కలిగించ

కోడానికై, మొగల్‌చక్రవర్తి వేచియున్నాడు. కనుక, ఢిల్లీపరిపాలన నిర్వహించడానికై, మహాద్‌జీని, ఢిల్లీకి ఆహ్వానించెను. ఢిల్లీలో ఉంది, వ్యవహారాలను జాగ్రత్తగా గమనిస్తూ వచ్చినారు బ్రిటిషువారు. వీరి ఉద్దేశాలూ, లక్ష్యాలూ గూఢంగాఉన్నాయి. తుపానువలె చెలరేగుతున్న రాజకీయాలలో, అప్పుడే, వారు ప్రవేశించతలచుకోలేదు. కాని, చక్రవర్తిని తమ అధికారంలో పెట్టుకొనే విషయంలో, మహారాష్ట్రులకూ, బ్రిటిషువారికీ సంఘర్షణ ఏర్పడటం తప్పదు. మహారాష్ట్రులకంటెను ఎక్కువజాగ్రత్త, ఉపాయకౌశలము కలవారు బ్రిటిషువారు. తామువేసుకొన్న ప్రణాళికకు సంబంధించిన విత్త, సైనిక, రాజనీతి పరిణామాల విషయంలో భరవసాఉన్తే కానీ, ముందుకు పోదలచుకోలేదు. ఇక మహారాష్ట్రులో ; ధనవ్యయాన్నీ, తమ అధీనంలోని సైన్యపుపరిమితినీ, మిత్రుల విశ్వాసాన్నీ, ఏమాత్రమూ గమనింపక, ఢిల్లీక్లిష్ట వ్యవహారాలలో దూకిరి. సామ్రాజ్యాధికారమనే బహుమతి యొక్క బాహ్యకాంతికి, వీరు శలభములై పోయిరి.

చక్రవర్తి ఆహ్వానాన్ని మహాద్‌జీ అంగీకరించినాడు. ఫతేపూర్ సిక్రీవద్ద, శిబిరంలో చక్రవర్తిని దర్శించి అతని పాదాలపై శిరస్సు మోపినమస్కరించి, 101 బంగారు మొహరులను కానుకగా సమర్పించినాడు. (నజర్). చక్రవర్తి అతనిని రాజప్రతినిధి (వజీర్-ఇ-ముత్లక్) అనే పదవిలో నియమించినాడు. ప్రధానమంత్రి (వజీర్) అధికారాలూ, సేనాధిపతి అధికారాలూ (మీర్‌బక్షీ) కూడా, ఈ పదవిలో నిహితమై ఉన్నవి. పీష్వాపగల ఉన్నతాధిపత్యం పరిగణింపబడలేదు. మహాద్‌జీయొక్క అత్యాశ, సఫలమయింది. మొగల్ సామ్రాజ్యంలోని అత్యున్నత పదవిని అతడు వశపరచుకొన్నాడు. ప్రాంతీయ గవర్నర్లను, అత్యున్నతాధికారులను, నియమించడానికీ, జాగీర్లను అనుదానంచేయడానికీ, కప్పములను విధించడానికీ,- అతనికి అధికారం సిద్ధించింది. చక్రవర్తియొక్క కార్యకర్త, తాను. సామ్రాజ్యంలో, చక్రవర్తికి తర్వాత, తానే, అత్యుచ్చ ప్రతిష్ఠ కలవాడు.

కాని, వాస్తవంగా చూస్తే తపసు చెపసులు గల ఆటవస్తువును, అత్యధికమైన వెలను మహాద్‌జీకొన్నాడు. నెలకు పదిలక్షల రూపాయల ఖర్చుతో, విస్తారమైన సైన్యాన్ని పోషించవలసివచ్చింది.అనేక పర్యాయాలు ఆక్రమణలకూ, దోపిడీలకూ లోనై, సంకుచితమైపోయిన సామ్రాజ్యం నుంచి, ఇంత ధనాన్ని సేకరించుకోవలసి వచ్చింది. సామ్రాజ్యాధికారం, ఢిల్లీ ఆగ్రా జిల్లాలకు పైగా ప్రవృత్తం కాజాలదు. ఈ జిల్లాలలో కూడా, అధిక భూభాగం దానంచేయబడింది, లేదా, దురాక్రమణకు లోనయింది. దురాక్రమణ కావించిన వారినుంచి న్యాయమైన రాజస్వాన్ని వసూలు చేయడానికి కూడా, బలం ఉపయోగించవలసి వచ్చింది. పైగా, బాహ్యశత్రువులు, దేశంలోని శత్రువులు కూడా, అన్నిపైపుల నుంచీ ఒత్తిడి చేయసాగిరి. మొగల్ కులీనులు కుట్రపన్ని, ఇతనికి ఎదురుతిరిగిరి. చంచల స్వభావుడూ, విశ్వాస రహితుడూ ఐక చక్రవర్తి, ఇతనికి ఎల్లకాలమూ ఒకే విధంగా సహకరించలేదు. పీష్వా ఆస్థానంలో, నానాఫర్నవీస్ యొక్క పలుకుబడి, ఇతనికి విరుద్ధమయింది. తన సేనాధిపతిని సమర్థించవలసిన మహారాష్ట్ర ప్రభుత్వానికి "మహాద్‌జీని కష్టసమయంలో ఆదుకోడానికి తగినడబ్బు కానీ, సంకల్పంకానీలేదు." ఒప్పందం ప్రకారం ఇవ్వవలసిన కప్పాన్ని చెల్లించడానికి, జయపూర్ రాజా తిరస్కరించి, ఆంగ్లేయుల సహాయార్థం తన కార్యభారిని, లక్నోకు పంపించెను. ఇతనిపై తగిన చర్యతీసుకోవడం, మహాద్‌జీకి తప్పని సరిఅయింది.

కాని, చాలకాలంగా వేతనాలు బాకీ ఉండడంతో వస్తువడవలసిన పరిస్థితి ఏర్పడడంవల్ల, మొగల్ సేనలు తమ ధర్మాన్ని పాటించలేదు. కనుక, మహాద్‌జీ, క్లిష్టపరిస్థితికిలోనైనాడు. జయపూర్ రాజాను లొంగదీయలేకపోయినాడు.

గులామ్‌కాదిర్, రోహిల్లానాయకత్వంలో మొగల్‌అమీర్‌లు, మహాద్ క్లిష్టపరిస్థితిని స్వప్రయోజనార్థం ఉపయోగించుకొనిరి. చంచలుడైన, షాఅలామ్‌ను పదవీభ్రష్టునిచేసి, హింసించి, గ్రుడ్డివానిని కావించిరి. కాని, ఇంతలో మహాద్‌జీ, లాల్‌సాట్‌లో కలిగిన అపజయంనుంచి కోల్కొని, ఢిల్లీని మరల ఆక్రమించెను. గుడ్డిచక్రవర్తిని మరల సింహాసనంపై నిలిపి, పరిపాలన యంత్రాంగాన్ని మళ్ళీసంయోజనపరచడానికి యత్నించినాడు. అంతేకాక, స్వచ్ఛందులైన సామంతులనూ భూస్వాములనూ లొంగదీయడానికీ, రాజస్వాన్ని సేకరించే వ్యవస్థను ఏర్పరచడానికీ, నిరంతరమైన సైన్యపుఖర్చులనూ పీష్వాప్రభుత్వపు ఖర్చులనూ, చెల్లించడానికి కావలసినధనాన్ని చేకూర్చుకోడానికీ, కృతనిశ్చయుడైనాడు.

కాని, ఇతని విరోధులనేకులు ఈ ప్రయత్నానికి అడ్డుపడిరి. ఆఫ్గనులు, రోహిల్లాలు, మొగలుకులీనులు, రాజస్థాన్‌రాజులు, దేశములోని క్లిష్టపరిస్థితులను స్వలాభానికై ఉపయోగించుకొనే కూలిసైనికుల నాయకులు, మొదలైనవారంతా ఇతనికి శత్రువులే. మహరాష్ట్ర నాయకులలోకూడా హోల్కార్ ఇతనికి ప్రతిద్వంద్వి. మహద్‌జీ ప్రతిష్ఠాప్రాబల్యాలు వృద్ధి కావడంచూచి, నానాఫర్నవీస్‌కూడా, ఈర్ష్యాపరుడైనాడు. మహాద్‌జీని హద్దులో నిలపడానికి, నానాఫర్నవీసు, మాకియవెల్లీ (Machiavelli) పన్నాగంవంటి దానిని పన్నినాడు. పీష్వా ప్రతినిధులైన సింధియా, హోల్కార్, అలీబహదూర్‌లకు, మహరాష్ట్రరాజ్యపు ఉత్తరభాగాలనుపంచి, వాటినుంచి కప్పములను వసూలుచేసే కార్యభారాన్ని, వారిపైఉంచెను. వీరు ఒకరొకరూ చెల్లించవలసిన కప్పపు మొత్తాన్ని ఉద్దేశపూర్వకంగా అధికంకావించెను. ఇంతటి మొత్తాన్ని వీరిలో ఎవ్వరూకూడా వసూలు చేయలేకపోవడంతో, వీరిలో వీరు నిరంతరంగా కలహిస్తూ వచ్చిరి.

తన శత్రువుల పన్నాగాలకు ప్రతి క్రియగా, మహాద్‌జీ, శాంతిభద్రతలను నెలకొల్పడానికీ, కప్పములను రాజస్వాన్నీ వసూలుచేయడానికీ సమర్థమైన అపారసేనను సమగూర్చుకొన్నాడు. 1784లో, మహాద్‌జీసేవలో ప్రవేశించిన బోయిన్ (de Boigne), ఈ సేనను జతపరచినాడు. కట్టకడపటికి, 39000 సైనికులతో కూడిన మహాసైన్యం సిద్ధమయింది. ఇది ప్రధానంగా, ఫ్రెంచి యుద్ధపద్ధతిలో శిక్షణపొందిన పదాతిదళం. యూరోపియనుల పర్యవేక్షణలో, లోహకర్మాగారాలలో తయారైన ఫిరంగులతోను, తుపాకులతోను, తోపుఖానాదళంతోను (Artillery Unit), ఈ సైన్యం బలపరచబడింది.

ఈ కొత్తసైన్యంతో మహాద్‌జీ ఎదురు లేనివాడై తన శత్రువులందరినీ, హోల్కారుతో సహా, చిత్తుగా ఓడించినాడు. విజయం నిశ్చితమయింది. 1793 నాటికి, ఇతని ఆధిపత్యాధికారాలు మిన్నుముట్టినవి. మహారాష్ట్రులకు ఎవ్వరికీలేని కీర్తిప్రతిష్ఠలు ఇతనికిలభించినవి. కాని ఇతని విజయం, ఎంతోకాలం నిలువలేదు. రెండు సంవత్సరాల లోపుగనే ఇతని జీవితయాత్ర అంతమయింది. ఇతని మరణంతో మహారాష్ట్రులు తమ కడపటి గొప్పసైనిక-రాజ్యాంగవేత్తనుకోల్పోయిరి.

తరువాతికాలం, అత్యంతమూ అవ్యవస్థాత్మకమైనట్టిది. అన్నివైపులా కలహాలు

చెలరేగినవి. మహాద్‌జీకి దత్తపుత్రుడైన దౌలతరావూ, అతనిసవతితల్లులూ, కలహించసాగిరి. సింధియా యొక్క సివిల్ మిలిటరీ అధికారులు, దేశస్థ, శ్వేన్వి, మొదలైన విభిన్న బ్రాహ్మణ శాఖలకు చెందినవారు. వీరు తమలో తామే, ఒకరిపై ఒకరు కుట్రలు నడపడం ప్రారంభించిరి.

తుకాజీ హోల్కారు కుమారులు, తండ్రి ఆస్తికై ఘర్షణ ప్రారంభించిరి. యువకుడైన పీష్వా మాధవరావ్ II, మరణించడంతో వారసత్వానికి సంబంధించిన కలహాలు బయలుదేరినవి. ఈ కలహంలో మరాఠాసర్దారులు కొందరు ఒక పక్షాన్నీ, మరికొందరు ప్రతిపక్షాన్నీ చేరిరి.

ఈ విధంగా, బయలుదేరిన అంతర్యుద్ధంలో, యశ్వంతరావ్ హోల్కార్, దౌలత్ రావ్ సింధియాలు ముఖ్యపాత్రలు. తనకు బద్ధశత్రువైన రఘోబాయొక్క కుమారునికి సింహాసనం దక్కకుండా చేయవలెనని ఏన్నో విఫలప్రయత్నాలు కావించిన, నానాఫర్నవీస్, కొంతకాలం ఏ నిర్ధారణకూరాక, కడపట అతని పక్షాన్నే బలపరచెను. కొల్హాపుర రాజైన ఛత్రపతి శివాజీకి, పట్‌వర్ధన్ సర్దారైన పరశురాంబాహూకు జరిగిన భీషణయుద్ధము, కొత్త చిక్కులను తెచ్చిపెట్టింది. పరస్పరం యుద్ధానికి పూనిన ఈ ఇరువురి సైన్యాలూ దేశాన్ని ఊడ్చిపెట్టినవి. అశ్వదళాల కాళ్ళకిందపడి పల్లెలు నలిగిపోయినవి. పట్టణాలను కొల్లగొట్టి, కాల్చివేసినవి ఈ సైన్యాలు. ధనవంతులను వేదనయంత్రాలపై పెట్టి చిత్రహింస కావించినవి. బీదలు చెప్పరాని దుఃఖాలు అనుభవించిరి. మహారాష్ట్ర స్వరాజ్యంలో అరాజకం విశృంఖలంగా వ్యాపించింది.

సర్వవ్యాపకమైన ఈ పరస్పరయుద్ధం, బ్రిటిషువారికి దేవదత్తమైన వరముగా సిద్ధించింది. బ్రిటిషువారు నెపోలియన్‌తో ప్రాణాంతకమైన యుద్ధంలో మునిగి ఉండిరి. మధ్యధరాసముద్రాన్ని వేగంగాదాటి, నెపోలియన్, పిరమిడ్సవద్ద టర్కులను ఓడించి, సిరియాలో ప్రవేశించినాడు. బ్రిటిషువారికి ఎదురుగా రష్షియాను, తూర్పుదేశాలను లేవదీసే ప్రయత్నంలో, ఇతని కార్యకారులు నిమగ్నులై ఉండిరి. టిప్పుసుల్తాన్ వీరితో, ఉత్తర ప్రత్యుత్తరాలు నలుపుతూ ఉండెనని తెలియవచ్చింది. ఇట్టి సమయంలో తమ ప్రయోజనాలను రక్షించే నిమిత్తం, బ్రిటిషుప్రభుత్వం, వెల్లెస్లీ సోదరులను ఇండియాకు పంపింది.

కలకత్తాలో పదవీస్వీకారం కావించినవెంటనే, వెల్లెస్లీ, మహారాష్ట్రులతో రాయబారాలు ప్రారంభించినాడు. తాను పన్నిన సహాయకమైత్రి, అనే ఉచ్చులోకి వీరిని లాగడం ఇతని ఉద్దేశం. పీష్వా మొదటిలో, ఈ సంధానాలను పట్టించుకోలేదు. కాని, యశ్వంతరావ్ హోల్కార్ ఇతనిని ఓడించి, (1802) పూనానుంచి పారదోలినపుడు బ్రిటిషువారి రక్షణను అంగీకరించవలసి వచ్చింది. పీష్వా, బస్సేయిన్‌కు పలాయితుడై, సంధిషరతుపై చేవ్రాలు వేసినాడు. ఇంతటితో, పీష్వా బ్రిటిషువారి ఆశ్రితుడైనాడు.

మధ్యమహారాష్ట్రరాజ్యం ఈవిధంగా, లుప్తమైపోయింది. ఐనా మరాఠా సర్దారులు ఇంకా బలవంతులుగనే నిలిచి ఉన్నారు. అపాయకరమైన ఇట్టి క్లిష్టపరిస్థితులలోకూడా, శేషించిన తమ రాజ్యాధికారాన్ని రక్షించుకోడానికై, మహారాష్ట్రులందరూ ఏకముకాకపోవడమువల్ల బ్రిటిషువారి అదృష్టం ఫలించింది. ఇంతటి అవివేకాన్ని, విధి సహించలేకపోయింది; నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించింది. సింధియా హోల్కారులు ప్రత్యేకంగా బ్రిటిషువారితో పోరి,

పూర్తిగా పరాజితుడైనాడు.

దక్కనుకు తరలిపోవడానికి పూర్వమే, మహాద్జీ సింధియా, మహారాష్ట్ర రాజ్యపతి పాలనకు తగిన ఏర్పాట్లను కావించియుండినాడు. ఢిల్లీలోని షిష్టీలు (Chishtis) అనే వ్యవస్థను ప్రముఖుడైన, షానిజామ్ - ఉద్ - దీనును, రాజప్రతినిధిగా నియమించి, రాజ స్వవిషయమై ఢిల్లీ రాజ్యభాగాలను ఆరుజిల్లాలుగా, విభజించి ఉండినాడు. కాని దురదృష్ట వశాత్తు దీర్ఘకాలం, సింధియా, ఢిల్లీలో లేకపోవడము, మహారాష్ట్ర అధికారుల పరస్పర ఈర్ష్యా ద్వేషాలు, యూరోపియను సేనానాయకుల అవిశ్వాసద్రోహాలు, రాజప్రతినిధియొక్క అత్యాశా క్రౌర్యాలు, అతి సాహసికుల దోపిడిచర్యలు,- మొదలైనవి, చక్రవర్తి జీవితాన్ని, ప్రజల జీవితాన్ని వర్ణింపరాని దుస్థితికి, పాల్పరచినవి.

దౌలత్‌రావ్‌పై వెల్లస్లీయుద్ధం ప్రకటించడంతోనే, బ్రిటీషుసేనలు, ఉత్తరంలోను, దక్కనులోను ఉన్న మహారాష్ట్రసేనలను, చుట్టుముట్టినవి. ఉత్తరసేనాభాగానికి నాయకుడైన, లేక్, అలిఘర్‌పై నడిచి, పెరాన్ (Perron) సేనాధిపత్యంలో ఉండిన సింధియా సైన్యాన్ని, పటాపంచలు కావించినాడు. అంత, ఢిల్లీమార్గంగా నడిచి, 1803, సెప్టెంబర్ 16 వ నాడు, రాజధానిని ప్రవేశించెను. షాఆలాం చక్రవర్తి, బ్రిటీషు రక్షణక్రిందికి రావలసి వచ్చింది. అంతతో, మొగల్ సామ్రాజ్యం, కార్యతః, అంతమయింది.

దక్కనులో, ఆర్థర్ వెల్లస్లీ [తరువాతికాలంలో, డ్యూక్ ఆఫ్ విల్లింగ్టన్] అస్సాయే వద్ద సింధియా సైన్యాన్ని, ఆర్‌గోన్‌వద్ద భోంస్లే సేనలనూ నాశంకావించి, గవేల్‌ఘర్ దుర్గాన్ని వశపరచుకొన్నాడు. దేవగోన్, సర్జీ - అంజాన్‌గోన్, సంధిపత్రాలమూలంగా భోంస్లే సింధియాలు తమ స్వాతంత్ర్యాన్ని, పరదత్తం కావించిరి. శివాజీ భావించుకుంటూ ఉండిన 'హిందూపద్‌పాద్‌షాహీ' స్వప్నం ఈ విధంగా పటాపంచలై పోయింది.

# 2
# పద్ధెనిమిదో శతాబ్దంలోని సామాజిక వ్యవస్థ

## I. భారతదేశ చరిత్ర లక్షణాలు

పదహారోశతాబ్ద ప్రథమభాగంలో, బాబర్, మొగల్ సామ్రాజ్యాన్ని స్థాపించెను. మేధా సంపన్నులూ, బలవంతులూ ఐన, ఇతని ఉత్తరాధికారులు దీనిని విశాలంగా విస్తృతి కావించిరి. ఔరంగజేబు మరణంనాటికి, ఈ సామ్రాజ్యపు ఎల్లలు ఉత్తరంలో కారకోరం పర్వతాల నుంచి, ఆక్సస్‌నది వరకు వ్యాపించి, దక్షిణంలో కావేరినదిని తాకినవి. పశ్చిమంలో, ఈ సామ్రాజ్యం, పర్షియా బర్మారాజ్యాల మధ్యభాగాన్ని ఆక్రమించింది. మొగలులకు పూర్వము కాని, వారి తర్వాతకాని, ఏ సామ్రాజ్యానికీ లేనట్టి విస్తృతరాజ్యాన్ని, మొగలులు పరిపాలించినారు.

ఆడంబరవైభవాలకు, సంపద సంస్కృతులకు, ఆ కాలంలో దీనికి సాటివచ్చేదేశమే లేదనే ప్రఖ్యాతి, ఈ విస్తార సామ్రాజ్యానికి సిద్ధించింది. ఈ సామ్రాజ్యము అనుసరించిన పరిపాలన విధానము, విశాలమైన రాజ్యభాగంలో శాంతిని, క్రమవ్యవస్థను నెలకొల్పి, వాటికి భంగం కలుగకుండా రక్షించింది. అంతేకాక, విద్యలు, కళలు, అభివృద్ధిచెందడానికి, తగిన విశేషావకాశాలను కల్పించింది. ఈ సామ్రాజ్యకాలంలో సాధింపబడిన కార్యాలు, ప్రపంచ సంస్కృతి చరిత్రలో ఒక ఉజ్జ్వల ప్రకరణంగా, ఏర్పడతాయి. కాని, ఈ అద్భుతసౌధం, దీర్ఘకాలం నిలిచిఉండలేదు. 1526లో ఈ సామ్రాజ్యస్థాపనకు పునాదులు ఏర్పడినవి. అంత నుంచి, వినాశకరమైన నాదిర్‌షా దండయాత్ర 1739లో జరిగేవరకూ మధ్యకల 213 సంవత్సరాలు, ఈ సామ్రాజ్యం నిలిచిఉన్నది. దీనినిబట్టి చూస్తే, మొగల్ సామ్రాజ్యకాలం దీర్ఘమైనది కాదని తెలుస్తుంది. కాని, సాధారణంగా ఇండియాలో ఏర్పడిన సామ్రాజ్యాలన్నీ అల్పకాలికములైనవే. మౌర్యులు పూర్తిగా ఒకటిన్నర శతాబ్దకాలం కూడా రాజ్యం చేయలేదు.

శాతవాహనులు తమ సామ్రాజ్యాన్ని క్రీ. పూ. మొదటి శతాబ్ద మధ్యభాగంలో స్థాపించుకొనిరి. వీరి ఆధిపత్యం దక్కనులో "సముద్రమునుంచి సముద్రంవరకు" వ్యాపించింది. కాని, ఈ సామ్రాజ్యం నిలిచియున్న మొత్తంకాలం, మూడు శతాబ్దాలకంటె తక్కువే. గుప్తులు, సుమారు రెండువందల సంవత్సరాలు పరిపాలించిరి. దక్షిణములోని చోళులు, బెంగాలులోని పాలాలు, మొదలైన ప్రాంతీయరాజ్యాలు కొన్ని, ఎక్కువకాలం నిలిచి ఉండినవి. వరుల దండయాత్రలకు దూరమైన సురక్షిత స్థానాలలో ఈ రాజ్యాలు ఏర్పడడం, ఇందుకు కారణంకావచ్చు. ఇవి తప్పితే, ప్రాచీనకాలంలోనూ, మధ్యయుగాలలోనూ కూడా, రాజ్యాలు, సామ్రాజ్యాలు, అల్పకాలికములైనట్టివే.

వేదకాలంనుంచి పద్దెనిమిదో శతాబ్దాంతంవరకూ జరిగిన చరిత్రనుబట్టిచూస్తే, అవిచ్ఛిన్నమైన రాజకీయ ఐక్యం, ఒక్కొకసారి రెండు శతాబ్దాలకంటె ఎక్కువకాలం నిలువ లేదని వ్యక్తమౌతుంది. అశోకుని అఖిలభారతసామ్రాజ్యం, అతని మరణానంతరమే భగ్నమయింది. నాలుగోశతాబ్దంలో, సముద్రగుప్తుడు సంయోజితం చేసుకొన్న ప్రాంతాలు, ఐదో శతాబ్దంకడపటికి పరహస్తగతమై పోయినవి. పశ్చిమోత్తర దిగ్భాగంనుంచి దాడివచ్చిన హూణులు, గుప్తుల అధికారాన్ని విచ్ఛిన్నం కావించిరి. ఖిల్జీల సామ్రాజ్యం పూర్తి ముప్ఫై ఏండ్లుకూడా సాగలేదు (క్రీ. అ. 1290-1302). తుగ్లక్ మరణించడానికిముందే, (1351) అతని ఆధిపత్యం బెంగాలులోను, దక్కనులోను నిరాకరింపబడింది. మొగలుల సామ్రాజ్య సౌధం, ఔరంగజేబు మరణించిన అర్ధశతాబ్దంలోగానే, శిథిలమైపోయింది. భారతదేశచరిత్ర ఈవిధంగా, సామ్రాజ్యాలఉత్పత్తి పతనాలతోను, ఒకటి పడిపోయిన తర్వాత మరియొకటి ఏర్పడేవరకూగల మధ్యకాలంలోని అరాజకత్వంతోనుకూడిన గాథగా ఏర్పడింది.

భారతదేశచరిత్ర విషయంలో గుర్తింపవలసిన ముఖ్యాంశం మరియొకటి ఉన్నది. సామ్రాజ్యాల ప్రవృత్తిస్థానము, రాజకీయవిధానాల గురుత్వకేంద్రము, ఒకచోట స్థిరపడినట్టివి కావు. మౌర్యులకు, గుప్తులకు, తూర్పు ఇండియాభాగంలో అధికారస్థానం ఏర్పడింది. శాతవాహనుల పరిపాలన దక్కనునుంచి సాగింది. చోళులు దక్షిణభారతప్రాంతంవారు. మధ్యయుగాల సుల్తానులు, మొగలులు, తమ ఆధిపత్యాన్ని ఢిల్లీనుంచి, లేక, ఆగ్రానుంచి నెరపినారు. కేంద్రస్థానం ఒకటి లేకపోవడమనే ఈ విషయం, యూరోపు పరిస్థితులకు భిన్నమూ, వ్యతిరేకమూ, ఐనట్టిది. ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీదేశాలలో, నిర్దిష్టమూ నిశ్చితమూ ఐన కేంద్రాలచుట్టూ రాజ్యాలు రూపొందినవి. లండన్, ప్యారిస్, రోమ్ నగరాలు, ఆ రాజ్యాలకు కేంద్రస్థానాలు.

ఇండియాయొక్క ఏ ప్రదేశంకానీ, ప్రబలమైన కేంద్రీకరణ అధికారశక్తిగా, నిరంతరంగా, ఎక్కువకాలం నిలువనిమాట వాస్తవమే. ఐనా, 'ధ్రువమధ్యదేశము' అని వ్యవహరింపబడే మధ్యభారతప్రాంతానికి, రాజకీయసంస్కృతి విషయాల్లో చిరకాలమునుంచి విశిష్టమైన ప్రతిష్ఠ సిద్ధించింది, అనడం నిజం. సరస్వతీ, సదానీరా, నదుల మధ్యను, హిమాలయ వింధ్య పర్వతాలకు మధ్యను, వ్యాపించిన ఈ ప్రాంతానికే, 'ధ్రువమధ్యదేశ' మని పేరు వచ్చింది. ప్రాచీనకాలంలో ఈ ప్రాంతం, సూర్యవంశచంద్రవంశరాజులైన రామ, భరత, జనక చక్రవర్తులకూ, మధ్యయుగాలలో టర్కు, మొగల్ సామ్రాజ్యాలకూ స్వరాజ్యస్థానములుగా ఉండినవి. పవిత్రనదులైన గంగా, యమునా, సరస్వతులకూ, హరిద్వార్, మధురా, అయోధ్యా, ప్రయాగ్, కాశీ మొదలైన పుణ్యక్షేత్రాలకూ, ఈ ప్రాంతమే నిలయమైనది. ఈ ప్రదేశంలోనే సంస్కృతము, పాలీ, బ్రిజ్, ఉర్దూ మొదలైన గొప్ప భాషలు అభివృద్ధిచెంది, వికాసాన్ని పొందినవి. బుద్ధుడు, మహావీరుడు, బోధించినమతాలూ, భక్తి, సూఫీ ఉద్యమాలూ ఈ ప్రదేశంలోనే వర్ధిల్లినవి.

ఈ భారత మధ్యప్రాంతాలు కేంద్రంగా, సాంస్కృతికప్రభావాలు, భారతదేశ ప్రదేశాలన్నిటికీ ప్రసరించినవి. కాని, ఈ సాంస్కృతికసంగమం, (focus), భారతప్రజలను ఆకర్షించి, ఒక సుసంయోజితమైన సాంఘిక, రాజకీయ, సంస్థగా నిలుపలేకపోయింది.

ఏకైకమైన సామాజిక వ్యవస్థగా భారతదేశం ఎందుకు ఏర్పడలేదు, దాని రాజకీయ

రచనావిధానం ఎందుకు అస్థిరంగా నిలిచిపోయింది, అనే సమస్యలను పరిశీలించడం అవసరం. ఈ విషయాన్ని చక్కగా అర్థం చేసుకోకపోతే, పద్ధెనిమిదోశతాబ్దంలో ఇండియాను బ్రిటీషు వారు జయించడము, తరువాత రెండు శతాబ్దాలకాలంలో భారతీయులు మరల స్వాతంత్ర్యాన్ని సాధించుకోవడము అనే విషయాలను, చక్కగా వివరించలేము. కాబట్టి, బ్రిటీషువారి విజయానికీ వారి రాజ్యస్థాపనకూ కారణములైన, విలక్షణ పరిస్థితులను వ్యాకరించడం. అవశ్యకం.

ఒక జాతి నాగరకత అభివృద్ధిచెందడంలోను, అది శిథిలమైపోవడంలోనుకూడా, మానవునికీ ప్రకృతికీకూడా, బాధ్యత ఉంది. ఈ రెండింటిలోనూ ప్రకృతినిర్వహించేకార్యం, మానవుడు నిర్వహించే కార్యంకంటె, అప్రధానమైనది. ప్రకృతి అవకాశాలను కలిగిస్తుంది. వాటిని ఉపయోగించుకొనే భాగ్యం మానవునిది. ప్రకృతి, మానవునికి సమస్యలను కల్పిస్తుంది. వీటికి ప్రతిక్రియచేసి ఆత్మరక్షణ కావించుకోవడం మానవుని విధి. ప్రకృతి ప్రసాదించిన సౌకర్యాలను మానవుడు చక్కగా ఉపయోగించుకొంటే, అతడుముందుకుపోయి, క్రమంగా అభ్యుదయాన్ని పొందుతాడు. దానికి విరుద్ధంగా ప్రవర్తించినట్లయితే, జడప్రాయంగా నిలిచిపోతాడు. లేదా, ప్రకృతి విరుద్ధంగా అతిశ్రమతో తాను నిర్మించిన విధానం భగ్నమై, తుదకు ప్రకృతిలో కలిసిపోతుంది. ఐనా, సమాజాలు, నాగరకతలు, ఉత్పన్నంకావడము, కూలి పోవడము అనే సంఘటనలు, మానవాపసరము అనే కఠిన న్యాయానికి బద్ధములుకావు. ప్రకృతి పరిస్థితులు మానవుని శక్తులను ఎంతపరిమిత మొనర్చినప్పటికీ, మానవుని అభ్యుదయ పతనాలకు అతడేకర్త అని తెలుస్తుంది. ప్రకృతి ప్రసాదించిన సాధన సంపదను, సృజనాత్మకంగా ఉపయోగించడంవల్ల ఏర్పడినవి, సాంఘిక, ఆర్థిక, రాజకీయ విధానాలు.

బహు విధకారణాలతో చిక్కుపడియున్న కార్యకారణజాలాన్ని శాస్త్రీయంగా విడదీయడం, ప్రస్తుత జ్ఞానాన్నిబట్టి, సాధ్యంకాకపోయినప్పటికీ. కేవలం, పూర్వసంఘటనలను మాత్రమే వర్ణించి, వాటి ప్రవృత్తికి మూలమైన కారణమూలనూ, వాటికి పరస్పరం గల కార్యకారణ సంబంధాన్ని గుర్తించకపోవడం సాధ్యంకాదు. చరిత్రను అర్థంచేసుకోవడానికి పూనుకోవడంలో ఈ అంశాలకుగల ప్రభావం ఎట్టిదో గ్రహించడం అవసరం.

మానవుని మనస్సుకూ, ప్రకృతికీ సంబంధించిన పరస్పర ప్రవృత్తియొక్క అభిలేఖనమే, చరిత్ర. భారతదేశచరిత్ర కూడా అట్టిదే ఐతే, పద్ధెనిమిదో శతాబ్దంలోని సంఘటనలకు రూపము కల్పించిన వివిధాంశాలు, ఎంతవరకు కారకములైనవో పరీక్షించడం అవసరం. కనుక, మానవుని ఉద్యమానికి ఉత్తేజనాన్నీ, ప్రతిబంధకాలనూ, కూడా కలిగించిన భౌతిక పరిసరము లెట్టివో, పరిశీలించడం అవసరం. అట్టి పరిశీలనతో, చరిత్ర ప్రారంభించవలసి ఉన్నది.

## II. ఇండియా భూభాగముయొక్క స్థితి

దేశము అనే భౌగోళిక పదానికి పందొమ్మిదో శతాబ్దంలో సిద్ధించిన అర్థం, ఇండియాకు వర్తించదు. విస్తృతినిబట్టి, సోవియట్‌రష్యా, చైనా, ఆస్ట్రేలియా, కెనడా, యునైటెడ్‌స్టేట్స్ వర్గంలో ఇండియాను చేర్చవలసి ఉన్నది. జనాభావిషయంలో, చైనాకు తర్వాత ఇండియా, ప్రపంచ దేశాలన్నిటిలోనూ పెద్దది.

భౌగోళిక లక్షణాలనుబట్టి, ప్రపంచానికి సంగ్రహరూపమే ఇండియా. అన్నివిధములైన శీతోష్ణపరిస్థితులు, చాలవరకు, సకలవిధములైన భూములు, నీరు, ప్రాణిజాతులు, చెట్ల జాతులు, పలురకములైన ఖనిజద్రవ్యాలు, అనేకములైన మానవజాతులు,- అన్నీ, ఇండియా భూభాగంలో ఉన్నవి.

ప్రకృతి సహజములైన నాలుగు భాగాలుగా దేశం ఏర్పడుతుంది. హిమాలయప్రాంత ప్రదేశము, ఉత్తర సమతలప్రదేశము, మధ్యమ ఉచ్చతర భూభాగము, పూర్వ, పశ్చిమ, దక్షిణ తటవర్తి భూములతో (Littorals) కూడిన దక్కను,- అనేవి ఈ నాలుగుభాగాలు.

హిమాలయ ప్రాంతదేశము నిరంతరమైన మంచుకు నిలయమైనట్టిది. "భూమిపై ఉన్న స్వర్గము" అని మొగలులు వర్ణించిన, మనోహరమైన కాశ్మీరులోయ, ఈ హిమాలయ ప్రాంతపు మంచుకవిసిన కొండల ఆశ్రయంలో ఒదిగిఉంది. అసంఖ్యాకములైన పర్వతరాజ్యాలలో కొన్ని చిన్నవైనా, ప్రకృతి రమణీయములైనవి. సిక్కిం, భూటాన్, నేపాల్‌వంటి, ఇతర పర్వతరాజ్యాలు, దృఢగాత్రులైన యుద్ధజాతుల వారికి నిలయాలు. పర్వతనివాసులకు ప్రకృతిసిద్ధమైన స్వాతంత్ర్య ప్రీతి, వీరి విశిష్టలక్షణం.

అరేబియా సముద్రమునుంచీ, బంగాళాఖాతమువరకూ వ్యాపించియున్న ఉత్తర సమతల ప్రాంతము, హిమాలయాలలో ఉద్భవించి ప్రవహించివచ్చే గొప్పనదులు, మనకు ప్రకృతి ప్రసాదించిన అమూల్యములైన బహుమతి విశేషాలు. సారవంతమైన పంజాబు ప్రాంతానికి సింధునదీ విధానమునుంచి, సమృద్ధిగా నీరు లభిస్తుంది. శీతకాలంలో చల్లగాను, వేసవిలో వేడిగానుఉండి, ఈ ప్రాంతపు శీతోష్ణస్థితి ఆరోగ్యప్రదమైనట్టిది. స్వల్పమూ, మధ్యస్థమూ, అయిన వర్షపాతంవల్ల, రైతులు అతిశ్రమకు ఓర్చుకొనే దృఢగాత్రులుగా ఏర్పడినారు. సమృద్ధమైన పంటలకు ఈ ప్రాంతం, ఆకరమయింది. రాజస్థాన్‌లోని అధికభూభాగం, మరుభూమి. అలలు అలలుగా ఏర్పడియున్న పసుపురంగు సముద్రంవంటి ఈ ఎడారిభూములలో నీరు దొరకడం కష్టం. జీవనోపాధిని సంపాదించుకోవడం కష్టతరమైన ప్రయత్నం. అయినా, ఆత్మాభిమానం ప్రధానలక్షణమైన రాజపుత్రజాతి, ఈ ప్రాంతంలో వర్ధిల్లింది. తమ కుల గౌరవంపట్ల, అత్యభిమానవంతులు, ఇతరులకు ఆశ్రయమిచ్చి ఆదరించే ఉదారస్వభావులు వీరు. తాము నష్టపడి కూడా క్షమాదాతృత్వాలను పాటించే ఉదాత్తులు, ప్రాణాలకు లెక్కపెట్టని శౌర్యవంతులు రాజపుత్రులు. కాని, సహజంగా సోమరులైన వీరు, సుసంఘటితమైన ఐక్య కార్యాచరణానికి పూనని అసమర్థులు.

ఆరావళీ పర్వతాలకు రాజమహల్ కొండలకూ మధ్యనున్న భూభాగం నదీతీర ప్రాంత దేశం. ఉత్తరం నుంచి ప్రవహించే హిమాలయ నీరములోని అతిరిక్త భాగమూ, దక్షిణం నుంచి ప్రవహించి వచ్చే వింధ్య పర్వతాల నీటిలోని అతిరిక్త భాగమూ, ఈ ప్రాంతంలోకి ప్రవహిస్తాయి. ఈ విధంగా, ఈ ప్రాంతం, నదీ పల్లపు ప్రదేశంగా (River Basin) సిద్ధించింది. ఈ నదీ ప్రవాహాలతో కొట్టుకొని వచ్చిన సారవంతమైన వొండుమట్టి (Alluvial) ఈ మధ్య ప్రాంతాల పల్లాన్ని నింపినందువల్ల, కొన్నివేల అడుగులలోతుగల సారవంతమైన పంటభూమి ఏర్పడింది. శీఘ్రగామియైన గంగానది, హిమాలయ పర్వత నదీకందరాలను ఛేదించుకొని వైటపడి, పుష్టిచెంది సారవంతమైన నేలపై గంభీరంగా నడుస్తూ, కుడి ఎడమల నుంచి ఉపనదులను చేర్చుకొంటూ ప్రవహించి, కడపట దక్షిణంవైపు మరలి విస్తారమైన

బంగాళాఖాతంలో లీనమౌతుంది. వెచ్చని ప్రదేశం ఈ ప్రాంతం. శీతకాలంపు చలి, మృదువైనదే ఐనా, వేసవినెలల సూర్యుని తీక్ష్ణ కిరణాలు ఆరిపోయిన నేలను దహించివేస్తాయి. జూన్ నెలలో, ఆగ్నేయ నైరుతి మూలల నుంచి నల్లని మేఘాలు గుమిగూడడం ప్రారంభిస్తాయి. అంతట వర్షపాతమారంభమై, కుమ్మరించి, నీటికి ఎదురుచూస్తున్న నేలను పదునుచేసి, వసంతమైన పచ్చని పైరులతో కప్పివేస్తాయి.

ప్రాచీనకాలంలోను మధ్యయుగకాలంలోనుకూడా, ఈ మధ్యభూమి ప్రాంతం, భారతీయ సంస్కృతికి స్థానమైనది. అక్కడ వృద్ధికివచ్చిన భాషలు విస్తారంగా అన్ని ప్రాంతాలలోనూ వ్యాప్తికి వచ్చినవి. కళా సారస్వతాలను ఈ ప్రాంతం ప్రఖ్యాతిచెందించి. అక్కడి రాజుల వీరోచిత కృత్యాలు, పవిత్ర పురుషుల పుణ్యకార్యాలు, ఐతిహ్యాలుగా, కథలుగా, వీరగాథలుగా నిలిచిపోయినవి. ఇవి, సమగ్ర భారతదేశానికే చెందిన ప్రశస్త భారతీయ స్వత్వమైనవి. ఇందలి నదీ తీరాలలో వృద్ధికి వచ్చిన నగరాలు, రాజ్యాధికార కేంద్రములైనవి. అందు ఏర్పడిన వివిక్తస్థానాలు, జ్ఞానాన్వేషకులకూ, సత్యాన్వేషకులకూ ఆశ్రయ మిచ్చినవి.

రాజమహల్ కొండలనుచుట్టి ప్రవహిస్తూ వచ్చిన గంగానది, బెంగాలు డెల్టా మైదానాన్ని ప్రవేశిస్తుంది. మందంగా ప్రవహించి వచ్చే గంగా, బ్రహ్మపుత్రా, మేఘ్నానదులు తమతో కూడా, విస్తారమైన కుళ్ళు పదార్థాన్ని (Detritus - మురవా) లాగుకొనివచ్చి, ఈ ప్రాంతంలో నిలుపుతాయి. ఈ కుళ్ళు పదార్థం విస్తారమైన మట్టి తీరాలలో నిలిచిపోతుంది. నది, ఆరవ్వాత చీలికలుగా ఏర్పడి వీవెనవలె విస్తరిస్తుంది. ఈ చీలికలు వీవెనలోని కాండములలాగా ఏర్పడతాయి. వేడిచెమ్మతో నిండిన బెంగాలు మైదానం వేడిగాను, ఉక్కగాను ఉంటుంది. సమృద్ధమైన వర్షపాతము, అసంఖ్యాకములైన ఏరులు, తటాకాలూ, ఈ ప్రాంతాన్ని సుభిక్షంగా చేసినవి. అపారమైన సస్యసంపదతో కూడిన ఈ ప్రాంతంలో, జీవనం సులువుగా గడుస్తుంది. ఇండియా ఇతర ప్రాంతాలలో, సంపత్సమృద్ధి అధికం.

గంగానదీ పల్లపు భూమియొక్క దక్షిణపు అంచువద్ద నుంచి, నేల, ఎత్తుగా పెరుగుతూ వచ్చి, కైమూర్-వింధ్యపర్వతశ్రేణియొక్క దిగువ గట్టును చేరుతుంది. ఈ ఎత్తైన ప్రదేశమే, మధ్యభారత దేశముయొక్క ఉన్నత భూప్రాంతమని, వ్యవహరింపబడుతూఉంది. ఈ ప్రాంతంలో మాల్వా, బుందేల్‌ఖండ్, బాగేల్‌ఖండ్ రాజ్యాలుచేరి ఉన్నవి. తూర్పులో, కైమూర్-మెయికాల్ పర్వతపంక్తి, ఈ ప్రాంతాన్ని ఛోటానాగ్‌పూర్, ఒరిస్సాలనుంచి విభాగిస్తుంది. పడమరలో, చంబాల్‌నదిన్నీ, ఆరావళీ పర్వతాలున్నూ, ఈ ప్రాంతాన్ని రాజపుటానా నుంచి, గుజరాతునుంచి, విభాగిస్తాయి.

గంగామైదానంనుంచి, జారుగా పైకిలేస్తూ, తమ శిఖరంవైపు ప్రసరిస్తున్న వింధ్యపర్వతాలు, దక్షిణముఖంలో అవక్షేపంగా దిగిపోతాయి. ఈ కొండ నెత్రటముయొక్క (Scarp), అడుగుభాగంలో, నర్మదానది యొక్క నదీతలం ఉన్నది. అమరకంటక్‌లోనుంచి, ఉద్గమించే జలస్రావాలు, ఈ నదిని పోషిస్తాయి. జబ్బల్‌పూర్ సమీపంలోని పాలరాతికొండల కందరాలలోనుంచి వేగంగా బైటపడి, నర్మదానది, ప్రశాంతగమనంతో ప్రవహిస్తూ, అరణ్యాలను, కొండలను తరించి, సముద్రాన్ని చేరుకొంటుంది. నర్మదానదీ మార్గమంతా అతి మనోహరమైన ప్రకృతి దృశ్యములతో నిండిఉన్నది. ప్రాచీనకాలంలో, అసంఖ్యాకములైన

ప్రాంతాలు. సముద్రముచుట్టూ వ్యాపించియున్న ద్వీపము, కచ్. ముఖ్యభూమితో కలిపే సన్నని భూభాగంతో ఏర్పడిన ద్వీపకల్పము, కాఠియవాఢ్. మాల్వా సమతల ప్రాంతంయొక్క విస్తరణమే గుజరాత్. కనుక, సింధు గంగాప్రాంతాల పరిస్థితులు, ఈ ద్వీపకల్పంలోకి ప్రవేశించినవి. సముద్రతీరస్థమైన తగ్గుభూమి, కొంకణ్. ఖాందేశ్ నుంచి, గోవావరకూ వ్యాపించిన దీనివెడల్పు యాభైమైళ్ళు మాత్రమే. ఈ ప్రాంతము కొండలచే విభజింపబడింది పశ్చిమ కనుమలలోని ప్రపాతములైన శిఖరాలు, ఈ ప్రాంతములో ఎక్కువగా ఉన్నవి. అతిలోతైన కనములచే ఛేదింపబడి, సమతల ఉపరిభాగములుకల వరుసగోడలవంటి కొండలతో ఏర్పడిన, కర్కశ పర్వతశ్రేణి, పడమటికనములు, అని వ్యవహరింపబడుతూ ఉంది. ఈ గోడలు ప్రకృతిసిద్ధములైన కోటలవలె ఏర్పడియున్నవి. కనుకనే, మొగలులతోఏర్పడిన సంఘర్షణలో, మహరాష్ట్రులు వీటిని చక్కగా ఉపయోగించుకొన్నారు.

కొంకణ్, కేరళాలమధ్యగల చిన్నసముద్రతీరభాగం, కెనరా. పడమటి కనములనుంచి దుముకుతూ ప్రవహించే ప్రవాహాలు, ఈ ప్రాంతాన్ని ముక్కలుగాచీల్చినవి. పడమటి కనములలోని లోయలు వ్యవసాయానికి చక్కని అవకాశాలను కలిగించినవి. సమృద్ధమైన వర్షాలతో పోషింపబడిన అడవులు, మలేరియాకు ఆకరములై, కొండలను కప్పివేస్తున్నవి. ఐనా, ఈ అడవులలో టేకు వృక్షాలూ, గంధపుచెట్లూ, విస్తారమై ఈ ప్రాంతానికి సంపదను చేకూరుస్తున్నవి.

పశ్చిమ తీరంలో, అత్యంతమూ దక్షిణంలో ఉన్నది కేరళప్రాంతం. ఉత్తరదిశలో నీలగిరులునూ, ఆనైమలే, కార్డమంకొండలు దక్షిణంలోనూ, ఒక అడ్డకట్టుగా ఏర్పడి, కేరళ ప్రాంతాన్ని తక్కిన భారత భూభాగంనుండి వేరుచేస్తున్నవి. నీలగిరులకు, ఆనైమలైకు మధ్య ఉన్న పాల్ఘాట్లోయ, అడ్డకట్టును ఛేదిస్తుంది. కొండలోనుంచి సెలయేర్లు సముద్రం వైపు ప్రవహిస్తూ, ముఖభాగంలో చిన్నచిన్నడెల్టాలను కల్పిస్తాయి. ఈ డెల్టాలు, సముద్రముపై పోయేపడవలకు మార్గాలుగా ఏర్పడినవి. ఇవి కాక, ఉప్పు నీటిమడుగులూ (Lagoons), కయ్యలూ (Back waters), సముద్రతీరం పొడుగునా మచ్చలవలె ఏర్పడియుండి, రాకపోకలకు సౌకర్యం కలిగిస్తున్నవి.

పడమటి సముద్రతీరం, అందునూ ముఖ్యంగా పడమటి కనములు, అస్సాం తర్వాత అత్యంతమూ చెమ్మతో కూడినప్రాంతాలు. తీరంపొడుగునా, అనేకములైన లంగరుస్థానాలూ, రేవులూ, ఉన్నవి. పశ్చిమంలోని పర్షియన్ అఖాతంలోను (Persian gulf), ఎర్రసముద్రంలోను కల పురాతన నాగరికతలకు ఈ తీరం, అభిముఖంగా ఉంది. అధునాతన కాలంలో, ఆఫ్రికా దక్షిణాగ్రం మీదుగా యూరోపు ఖండానికి, అభిముఖమైఉన్నది.

తూర్పు, పడమర కనమలకు మధ్యస్థంగాను, సాత్పురా, మైకాస్, హజారీబాగ్ పర్వత పంక్తికి దక్షిణంగాను, ఉన్న ఇండియా ద్వీపకల్పం, దక్కన్ అని వ్యవహరింపబడుతూ ఉంది. భూవైజ్ఞానిక శాస్త్రాన్నిబట్టి ఈ ప్రాంతం, అతిపురాతనమైన స్థలఖండమని (Land mass), నిశ్చితమయింది. ఈ ద్వీపకల్పము త్రికోణాకృతిలో ఉన్నది. విశాలమైన ఉత్తరసమతలం దీని పీఠం. పశ్చిమంలో ఉన్న మహారాష్ట్రులనూ మధ్యలోని హిందీ ప్రజలనూ, తూర్పులోని తెలుగువాళ్లనూ ఈ సమతలప్రదేశంనుంచి ఒక శీర్షరేఖ (Vertical line), విభాగిస్తుంది. క్రిందవున్నది, మధ్యమసమతలం. కన్నడము, తెలుగు, తమిళభాషలను మాట్లా-

ద్ప్రజలు ఈ సమతలప్రదేశాన్ని ఆక్రమించి యున్నారు. దక్షిణభాగంలో మరి రెండుశాఖలు గలవు. పశ్చిమభాగనివాసుల భాష, మలయాళం;తూర్పుభాగంలోని నివాసుల భాషతమిళం.

మహారాష్ట్రప్రాంతంలో, దక్కను ఉన్నత భూములలోని భాగాలూ, పడమటికనమలూ, కొంకణ్ సముద్రతీరమూ, చేరి ఉన్నవి. నేల స్వభావము, శీతోష్ణస్థితి, ఉత్పత్తులు, అనే విషయాల్లో, ఈ ప్రతిభాగమూ విలక్షణమై ఉంది. ఉన్నత భూములనేల, ప్రధానంగా, ఒండ్రుమట్టితో ఏర్పడినట్టిది. వర్షాకాలపు మేఘాలు, చాలవరకూ పడమటికనమల్లో కురిసి, ఇరవై ముప్పై అంగుళాలవర్షాన్ని మాత్రమే, దక్కనుకు ప్రసాదిస్తాయి. పంటలలో ప్రధానమైనది, చిట్టిజొన్నలు. ధృఢగాత్రులూ, పొదుపుగా జీవనం గడిపేవారూ ఐన మహారాష్ట్రరైతుల ముఖ్య ఆహారం జొన్నలు, సజ్జలు.

ఈ సమతలంలోని ఆంధ్రా, లేక, తెలంగాణా భాగముయొక్క విషయం వేరు. ఒరుసుకొనిపోయిన మైదానాలూ, విశాలములు ప్రత్యక్షములు ఐన లోయలు, కుప్పలుగా ఏర్పడిన రాతిశిలలు, గండశిలలు, నిస్సారమైన ఇసుకనేలలు, మధ్యస్థమైన వర్షపాతము,- అనే ప్రకృతి లక్షణాలతో కూడినది ఈ ప్రాంతం. మరాఠ్వాడాతో పోల్చిచూస్తే, తెలంగాణా సస్యసంపద అల్పమైనట్టిది. వృక్షాలసంఖ్య అల్పమైనది. పచ్చిక మొరటైనది; దట్టంగాకూడా పెరగదు.

హిందీ మాతృభాషగాగల ఉత్తరదక్కనులో, పురాతన దక్షిణ కోసలప్రాంతముచేరి ఉన్నది. గోండ్వానా అని వ్యవహరింపబడే ఈ ప్రాంతం, సస్యసంపదలేని కొండలతోను, నిర్మానుష్యములైన అడవులతోను ఏర్పడి, ఒరిస్సా ప్రాంతానికి సరిహద్దుగా ఉన్నది.

దక్కను పీఠభూమియొక్క మధ్యవలయంలో, మైసూరు సమభూమి, దక్షిణాంధ్ర ప్రాంతము, ఉత్తరతమిళనాడూ, చేరి ఉన్నవి. మైసూరు సమభూమి సముద్రమట్టానికి 1500 మొదలు 4000 అడుగుల ఎత్తువరకు ఏర్పడింది. తుంగభద్రా కావేరీనదుల శీర్షజలస్థానాలూ, వాటి సహాయకనదులూ ఈ భాగంలో ఉన్నవి. వర్షపాతం మధ్యస్థమై ఉంటుంది. సంవత్సరానికి 25 మొదలు 35 అంగుళాల వర్షము మాత్రమే కురుస్తుంది. వ్యవసాయం చాలవరకు చెరువులనీటి సరఫరాపై ఆధారపడి ఉన్నది.

త్రిభుజ ఆకారంలో ఉండే ఈ ద్వీపకల్పముయొక్క శిఖాగ్రం, మైసూరుప్రాంతానికి క్రిందిభాగంలో సన్నగిల్లుతూ పోతుంది. కేరళ, తమిళనాడుల ఒండ్రుమట్టి మైదానాలు దీనికి రెండు చాలులుగా ఏర్పడినవి. నీలగిరి, ఆనైమలై, కార్డమం, పలనీ కొండలతో ఏర్పడిన ఉన్నతభూములు వీటి మధ్యభాగాన్ని ఆక్రమించి యున్నవి. ఈ కొండలపై వృష్టిపాతం సమృద్ధమైనట్టిది. కనుక, స్వాభావికంగా ఉష్ణవలయిక అరణ్యాలు వీటిని కప్పివేసేటట్లుగా వృద్ధికి వచ్చినవి. వాటిలో నీలగిరిలోని నీలపు యూకలిప్టస్ [నీలగిరి తైలపుచెట్లు] ప్రధానమైనది. దీనినిబట్టే, ఈ కొండలకు నీలగిరి అనేపేరు సిద్ధించింది.

ఉత్తరంలోని సారవంతములైన పల్లపు భూములును, తూర్పుపడమరల తీరభూములును, ఎత్తైన దక్కను పీఠభూములకంటె చాల భిన్నమైనట్టివి. దక్కనులోని, భూప్రదేశం పర్వత స్వభావం కలది. సారవంతము కాని క్షేత్రము, చాలీచాలని వర్షపాతము, కొన్ని భాగాల్లో సమృద్ధమైన అరణ్యాలు, ఇతరభాగాల్లో కరవైన సస్యసంపద,-ఇత్యాది కఠినములైన పరిస్థితులు దీని లక్షణాలు. పదార్థసంపదహా, సులభజీవనానికి ఇవి అనుకూలమైనవికావు. కనుకనే,

దక్కనుకు చుట్టూఉన్న పల్లపు భూభాగాలలోను, సింధు గంగానదుల మైదానాల్లోను, బంగాళాఖాతంలో చేరిపోయే నదుల డెల్టా ప్రాంతాలలోను, క్యాంబే అఖాత డెల్టా ప్రదేశాల్లోను, మలబార్, కోరోమాండల్ తీరప్రాంతాలలోను భారతీయ నాగరకతలు వర్ధిల్లినవి. ఈ సాంస్కృతిక నివాస స్థానాలనుంచి, ప్రజలు దక్కను పీఠభూములలోనికి చొచ్చుకొని పోయి, అందలి కొన్ని భాగాలను తమ విశిష్ట సంస్కృతులకు లోబరచుకున్నారు. అక్కడి ఆదిమ నివాసులను అరణ్యక్షేత్రాలకూ, నిబిడారణ్యాలలోకీ పారద్రోలినారు. ఆజాతులవారు ఇప్పటికీ ఆ అరణ్య సీమల్లోనే నివసిస్తున్నారు.

భారతదేశ భౌగోళిక లక్షణాలవైవిధ్యం, ఆశ్చర్యకరమూ, గమనార్హమూ ఐనట్టిది. విభిన్నములైన వాతావరణ పరిస్థితులు, క్షేత్రస్వభావాలు, వర్షపాతాలు, శీతోష్ణపరిస్థితులు, క్షేత్రలక్షణాలు, నీటిలక్షణాలు,-అనే వైవిధ్యంవల్ల దేశము వివిధప్రాంతాలుగా ఏర్పడుతుంది. భూభాగము విస్తారమైయుండడము, సంచార సాధనాలూ ప్రయాణసౌకర్యాలూ అతి ప్రాచీన స్థితిలోనే నిలిచిఉండడము, జనాభా పలచగా వ్యాప్తమై ఉండడము,— అనే పరిస్థితులవల్ల పూర్వము, ఈ ప్రాంతాలకు పరస్పర సంపర్కం లేక, వేటికవి ప్రత్యేకమై నిలిచిపోయినవి. పరిస్థితులు ఈ విధంగానే నిలిచిఉన్నంతకాలమూ, సంఘీభావంతోకూడిన ఏకజాతి అనే పరిజ్ఞానం కలగడం కష్టం.

ఐనప్పటికీ, ఈ విభేదాలను మరుగుపరచడానికి ఆధారాలైన సాదృశ్యాలుకూడా కలవు. దేశాన్ని నలువైపులాచుట్టియున్న పర్వతశ్రేణులూ, సముద్రాలూ, ఈ సాదృశ్యాలను ప్రసాదించినవి. ఉపఉష్ణవలయ (Sub Tropical) వర్షపాతంతోకూడిన వాతావరణాన్ని సమగ్ర భారతదేశానికీ కలిగించడానికి, హిమాలయాలు ప్రబలమైన కారణములైనవి. శీతకాలము, వేసవి, వర్షకాలము అనే ఋతువులు విస్పష్టమైన విధంగా, సకాలంలో ఏర్పడుతూ ఉండడానికికూడా, హిమాలయపర్వతపంక్తి ఆధారకారణం. సముద్రాలూ, ఉత్తరంలో పెట్టని గోడలవలె అర్ధవలయాకారంగా నిలిచియున్న పర్వతశ్రేణులూ, దేశానికి ఒక చౌకట్టుగా ఏర్పడినవి. బైటినుంచి వరదలు ప్రవేశించడం జరగని కారణంగా, దేశజీవితం అలజడిలేక సాగిపోయింది. రాజ్యవిషయంలోనూ, సమాజ విషయంలోనూ, సుసంయోజితమైన ఐక్యాన్ని దేశము సాధించలేకపోయినా, సంస్కృతి విషయంలో సర్వసాధారణములైన ప్రవృత్తులు, భావాలు, ఏర్పడినవి. దేశానికంతకూ సాధారణములైన జాతిలక్షణాలు సిద్ధించినవి.

విజ్ఞానశాస్త్రయంత్ర నిర్మాణాలు ప్రకృతిపై సాధించిన విజయాలవల్ల, భౌగోళిక పరిస్థితులు కలిగించిన నిరోధాలను, మానవుడు నేడు ఎదుర్కొనగలిగి ఉన్నాడు. ఆకాశాంతరస్థలంతోకూడా, ప్రకృతిసిద్ధములైన అడ్డంకులను నేడు, మానవుడు జయింపగలిగినాడు. ప్రకృతివిషయకమైన జ్ఞానం సంపాదించిన మానవుడు, ప్రకృతిశక్తులను లొంగదీసుకొని, తన ప్రయోజనార్థం ఉపయోగించుకోగలుగుతున్నాడు. పర్వతాలు, నదులు, అరణ్యాలు, వాతావరణము, కలిగించిన నిరోధాలు నిర్జింపబడినవి. భౌగోళికములైన వైవిధ్యాలు మానవుని ఐక్యసాధన సంకల్పానికి లొంగిపోయినవి.

కాని, ఈ వైజ్ఞానిక అభివృద్ధులన్నీ, చాల అధునాతనములైనవి. వీటివలని ప్రయోజనం, ఇంతవరకు, పందొమ్మిదో శతాబ్దంలోమాత్రమే సిద్ధించింది. అంతకుపూర్వము, భౌగోళిక వైవిధ్యాలు విఘటించియుండిన పరిస్థితులకారణంగా, భారతదేశంలోని వివిధప్రాంతాల ప్రజలు,

ఒక్కజాతిగా సమ్మేళనం చెందడం కష్టమయింది. అపకేంద్రికశక్తులు (Centrifugal forces) నిర్నిరోధకమైన ప్రాబల్యం వహించిఉండినవి.

నేటి విజ్ఞానశాస్త్రం, మానవజాతి ప్రయోజనార్థం మహత్తరమైన శక్తిని, మానవుని హస్తగతంచేసింది. కాని, పద్దెనిమిదో శతాబ్దాంతంవరకు, మానవుడు, లేక, జంతువు, చేయగల కృషివల్ల సిద్ధించగలశక్తిమాత్రమే, మనకు లభ్యమయ్యేది. కనుక, వ్యవసాయంలోను, పరిశ్రమల్లోను, మానవుని ఉత్పాదనశక్తి వాటిపైమాత్రమే ఆధారపడవలసిఉండేది. దేశంలోని భిన్నభాగాలకు పరస్పరసంపర్క సంబంధాలూ, కేంద్రప్రభుత్వ పరిపాలనాధికారమూ, చాలా పరిమితములై ఉండినవి.

ప్రత్యేకతావాదము, ప్రాదేశికవాదము, ప్రాంతీయవాదము,-అనే భావాలు ప్రబలములై ఉండినందువల్ల, సార్వజనిక భావానికిగాని, లేక జాతీయ భావానికిగాని ప్రాధాన్యం ఏర్పడలేదు. సమగ్ర భారతదేశమూ, ఏకైకమైన సామాజిక వ్యవస్థగా ఏర్పడడానికి అనుకూలించే భౌతిక సరిహద్దుల చౌకట్టును, ప్రకృతి, భారతదేశానికి ప్రసాదించింది. అంతేకాక, దేశానికంతటికీ వర్తించే, విశిష్టమైన సంస్కృతినికూడా, సూచించింది. ఐనప్పటికీ, విచ్ఛేదకములైన భౌగోళికశక్తులను అధిగమించడానికి తగిన సాంకేతిక పరిజ్ఞానం లేనందువల్ల, సామాజిక, రాజకీయ, ఐక్యాల పరిణామము జరుగలేదు.

అపారములైన ప్రకృతిప్రతిబంధకాలు, తక్కిన పరిసరదేశాల ప్రభావప్రాబల్యాల నుంచి, ఇండియాను దూరంగా ఉంచినవి. కనుక, ఇండియా వ్యక్తిత్వం, ప్రత్యేకమైన పద్ధతిలో అభివృద్ధి చెందడానికీ, ఇండియాలోని సంస్కృతులను ఇతరదేశపు సంస్కృతులను విభిన్నంగా ఉంచడానికీ, ఈ ప్రకృతిసిద్ధములైన ప్రతిబంధకాలు, ప్రబల హేతువులైనవి. కాని, ప్రాంతీయములైన వైవిధ్యాలు, సంయోజక ప్రక్రియలను అడ్డుకొన్నవి. ఈ కారణంవల్ల సాంస్కృతిక ఐక్యమూ, సుసంఘటితమైన సామాజికవ్యవస్థా, సాధ్యములు కాలేదు.

## III. ప్రజానీకం

ఏ జాతియొక్క చరిత్రలో ఐనా, అచ్చటి భౌగోళిక పరిస్థితుల ప్రభావానికి ప్రాధాన్యం ఉంటుంది. కాని, మానవప్రభావం అంతకంటె, బలవత్తరమైనది. చిత్తప్రవృత్తులు, భావాలు, మనోభావనలు, గుణశీలాలు, పద్ధతులు, ప్రవర్తనలు - మొదలైనవి మానవసంస్థలకు రూపము ఏర్పరచి, కాలాంతరంలో, మానవుడు సాధించే అభ్యుదయాన్ని నిర్దేశిస్తాయి. భారతీయులు నేడు వ్యవహరిస్తున్న భాషలు, వారి మతవిశ్వాసాలు, పూజా విధానాలు, వారి సాంఘికవ్యవస్థ, కళాసౌందర్యాభివ్యక్తి,- ఈ అన్నిటిపైనా, భారతీయ సాంప్రదాయముద్ర ఉన్నది. క్రీ. పూ. ఏడవశతాబ్దంనాటి ఉపనిషద్వాక్యాలు మొదలు, క్రీ. అ. ఇరవైయో శతాబ్దంలోని గాంధీజీ ఉపదేశాలవరకూ, భారతీయచిత్తవృత్తులూ, నైతికశక్తులూ, అవిచ్ఛిన్నమైన సరణిలో ప్రవహిస్తూ వచ్చిఉన్నవి. ఐనా ఈ ఐక్యంలోనూ, సమగ్రసమీకరణలోనూ, ప్రభేదాలుకూడా ఉన్నవి. బహుసంఖ్యాకములైన భాషలకు, మానవజాతులకు, మతాలకు, ఆచారాలకు, నివాసస్థానమైన దేశానికి ఇది సహజమైనదే.

సంస్కృతికి సంబంధించిన లక్షణాలకుగల సాదృశ్యం స్పష్టంగా గోచరిస్తున్నట్లే, వైవిధ్యంకూడా, సుస్పష్టంగా వ్యక్తమౌతుంది. భారతదేశపు జనాభాయొక్క సంయోజనమే,

ఈ వైవిధ్యాన్ని కలిగించిన మూలహేతువులలో ప్రధానమైనది.

ఇండియా నివాసులు, పెక్కు జాతుల కలయికతో ఏర్పడినవారు. వారిలో కొందరు అతిప్రాచీనకాలమునుంచి దేశంలో, నివసించినవారు కావడంవల్ల, వారిని, దేశీయులుగా పరిగణించవలసి ఉంది. తక్కినవారు చారిత్రిక వివిధకాలాల్లో బాహ్యభూములనుంచి, వలస వచ్చినవారు. వీరి పరస్పరకలయికవల్ల, ఉపలక్షకజాతులనేకములు, ఉత్పన్నములైనవి. ఇండియాలో విభిన్నజాతులు వలసవచ్చిన పద్ధతినీ, యూరోపులోని వలసవచ్చిన విధానాన్నీ, పోల్చిచూడడంవల్ల పెక్కు విషయాలు తెలుస్తాయి. ఆర్యభాషను వ్యవహరించే జాతులు వలసరావడం, ఈ రెండింటికీ సమానమైన అంశం. వలసరావడం, యూరోపులో, మూడు తరంగాలలో జరిగింది. మొదటిసారి వచ్చినవారు, బాల్కను, ఇటలీలలోను, యూరోపు యొక్క పశ్చిమ, మధ్యమ, పూర్వభాగాలలోను, నెలకొనిరి. అంతకుపూర్వము ఆ ప్రదేశాలలో ఉన్నవారిని పారద్రోలి, లేక, తమతో ఐక్యమొనర్చుకొని, అక్కడ నిలిచిపోయిరి. రోమన్ సామ్రాజ్యపు సరిహద్దుల అవతలినుంచి వచ్చిన రెండోతరంగం, యూరోపును ప్రవేశించడానికి, ఒత్తిడి చేయసాగింది. విసీ-గాతులు, ట్యూటానులు, వ్యాండలులు, ఫ్రాంకులు, ఇంకా ఇతరయుద్ధ జనజాతులు, సురక్షితములైన రోమన్ సరిహద్దులపైబడి, వాటిని పడగొట్టినవి. అంతతో, ఈ అసంస్కారజాతుల ప్రవాహం ఆ మహాసామ్రాజ్యాన్ని ముంచివేసింది.

యూరోపు వివిధప్రాంతాలలో ఈ జనజాతులు నెలకొనడంతో, నూతన సంస్థలు ఉత్పన్నములైనవి. అంతకు పూర్వపు ఆర్యులు ఆక్రమించి నివసిస్తూఉండిన ప్రాంతాలలో, ఈ నూతన సంస్థలు స్థాపింపబడినవి. ఈ జనజాతులు, నాయక అధికార స్థానాలను స్థాపించి, తమ ఉత్తమజాతి సహచరుల సహాయంతో, ఆ ప్రదేశాలను పరిపాలింపసాగినవి. వ్యక్తిగతమైన భక్తి విశ్వాసాలతో ఈ సహచరులు అధికారవర్గం వారికి బద్ధులైఉండిరి. వారి సాంఘిక వ్యవస్థయొక్క స్వభావమే, వారిని యుద్ధాలకు పురికొల్పింది. జయించి,రాజ్యాన్ని విస్తరించుకోవడం వారికి తప్పనిసరి అయింది.

ఈ ఉద్యమంవల్ల ప్రతి ప్రాంతమూ దెబ్బతినింది. ఇంగ్లాండుకు, ఆంగల్స్, సాక్సన్స్, (Angles and Saxons) వచ్చిరి. ఫ్రాన్సుకు ఫ్రాంకులూ; విసీగాతులు (Visi-goths) స్పెయిన్‌కూ; లొంబార్డులు (Lombards) ఉత్తర ఇటలీకి: బెల్‌గేలు (Belgaes) నెదర్‌ల్యాండ్స్‌కూ; ఆస్ట్రోగాతులు (Ostrogoths) బాల్కన్ భూములకూ; పోయిరి. వారి నెలవులనుంచి ఒక నూతన యూరోప్, ఉదయించింది. ఈ కొత్త యూరోపులో, నిరంతరమైన జనజాతియుద్ధాలు అంతరించి, ఆ స్థానంలో రోము స్థాపించిన, శాంతి అనే విశ్వప్రభుత్వం (Pax Romana), ఏర్పడింది.

కాని, ఆరోశతాబ్దంనుంచి, శాంతిప్రదేశాలు విస్తరిస్తూ వచ్చినవి. జనజాతులు స్థిరపడి బలాన్ని చేకూర్చుకొన్నవి. క్రైస్తవ మతమూ, ల్యాటిన్ భాషా వ్యాపిస్తూవచ్చినవి. రోమన్ సామ్రాజ్యాన్ని జ్ఞప్తికి తెచ్చేటటువంటి సామ్రాజ్యాన్ని, మహాశక్తి అని పిలువబడిన, ఛార్లెస్ (Charles the great), ఎనిమిదో శతాబ్దంలో స్థాపించెను. తూర్పులో, (Constantinople) కాన్‌స్టాంటినోపల్ రాజధానిగా, మరొక సామ్రాజ్యం ఏర్పడింది. ఏషియా మైనర్‌లో అధికభాగంపై ఈ సామ్రాజ్యానికి, అధీశత సిద్ధించింది.

ఆ పైన, ఈ రెండవ యూరోపు ప్రళయోత్పాతకమైన విప్లవానికి లోనయింది.

స్కాండినేవియన్ దేశాలనుంచి క్రూరులు, భయంకరులు, ఐన, క్రైస్తవేతర ఔత్తరేయులూ (Northmen), తూర్పునుంచి యుద్ధకాంక్షులైన మెగ్యారులు అనే దేశ ద్రిమ్మరులూ, ఉత్తర ఆఫ్రికానుంచి నాగరకులైన ముస్లిములూ, యూరోపురంగంలో పొడచూపిరి.

నార్వీజియన్లు, స్వీడులు, డేనులు,-అనే ఔత్తరేయులు, బ్రిటనులోనికి, ఫ్రాంకుల సామ్రాజ్యంలోనికి, విజయ దండయాత్రలు సాగించిరి. వీరు. సాహసులు; నిపుణులైన నావికులు. అరుద్ధములైన నదీముఖాలద్వారా ప్రవేశించి, కాలువలనుదాటి, రాజ్యాలమధ్య సీమలలోనికి చొచ్చుకొనిపోయేవారు. మెగ్యారుల వేగవంతములగు గుర్రాలకూ, వారి అప్రతిహతమైన కార్ముక విద్యకూ, ఎదురులేదు. తమ ఎదుటపడిన దానినంతటినీ ఊడ్చివేస్తూ, కార్పేనియన్ పర్వతాలనుదాటి, జర్మనీ మధ్య ప్రాంతాన్నీ, ఉత్తర ఇటలీనీ, పూర్తిగా నాశం కావించిరి. ఉత్తర స్లావులకూ దక్షిణస్లావులకూ మధ్యగా చొచ్చుకొనిపోయి, కట్టకడపటికి, హంగేరీలో, నివాసస్థానము ఏర్పరచుకొనిరి.

ఉత్తర ఆఫ్రికాను అంతటినీ, క్యాలిఫ్ ఆధిపత్యంలోనికి తెచ్చిన ముస్లిములు, ఎనిమిదో శతాబ్దారంభంలో స్పెయినులో ప్రవేశించి, ద్వీపకల్పంమీదుగా దాడిసాగించి, ఫ్రాన్సు దక్షిణ భాగాన్ని ప్రవేశించిరి. బైజాన్‌టైన్ సామ్రాజ్య భూములపైకూడా ఒత్తిడి చేసినారు.

తొమ్మిది, పదో శతాబ్దాలలో జరిగిన దాడులూ, వలసలూ, యూరోపులో గొప్ప పరిణామాన్ని తెచ్చిపెట్టినవి, బ్రిటనులోని ఆంగ్లో-సాక్సన్ ప్రభుత్వము భంగము కావడమూ, యూరోపులోని కార్లోవింజియన్ (Carlovingian) ప్రభుత్వము విచ్ఛిన్నమైపోవడము,- మొదలైన సంఘటనలవల్ల, ప్రజల ప్రాణధనాల భద్రతా సమస్యలు తీవ్రరూపాన్ని దాల్చినవి. సైనిక సేవాసంబంధమైన భూమి కట్టుబడితో పరస్పరము బంధింపబడిన-ఆశ్రయదాతలు-అశ్రితులు, ప్రభువులు-కృషకదాసులు, భూస్వామ్యపుకరారులు-కర్తవ్యాలు, - మొదలైనవాటితో ఏర్పడిన ద్విధ్రువీ సమాజం (Bipolar society) రెండవ యూరోపుయొక్క బుగ్గిలోనుంచి ఉత్పత్తిల్లింది. పదకొండో శతాబ్దంనాటికి, మూడో యూరోపు ఉద్భవించింది. అంతరాయములులేని, అవిచ్ఛిన్నమైన పరిణామ ప్రక్రియకులోనై, ఆధునిక యూరోపు రాజ్యమండలి, వికాసాన్ని పొందింది.

భారతదేశ చరిత్ర దీనికి భిన్నమైన మార్గంలో నడిచింది. ఆర్యుల రాకకు పూర్వం, ఇండియాలోని, జనాభా వ్యాప్తి విరళమై ఉండింది. ఉత్తర భారతపు మైదానాలనూ, సమతల ప్రదేశాలనూ నిబిడమైన అరణ్యాలు కప్పి ఉంచినవి. ఈ ప్రాంతాలలో నివసించే జనులు భిన్నభాషలను వ్యవహరించేవారు. వీరి భౌతిక రూపురేఖల లక్షణాలుకూడా విభిన్నమైనవి. మంగోల్, ఆస్ట్రలాయిడ్, ద్రావిడ కుటుంబాలకు చెందిన భాషలు వీరు మాట్లాడేవి.

క్రీ. పూ. రెండో సహస్రాబ్దిలో ఆర్యజాతుల వలస ప్రారంభమయింది. వీరి పూర్వ నివాసస్థానమేదో నిశ్చితంగా చెప్పలేము. క్రింది డాన్యూబుకూ, ఆక్సస్‌యొక్క ఉన్నత ప్రాసాదభాగాలకూ మధ్యగల విశాల భూభాగాలు, వీరి ఆదిమ నివాసస్థలమని ఊహింపబడుచున్నవి. వీరి ప్రపంచ పర్యటనలలో ఏ మార్గాలను అనుసరించినారని చెప్పడంకూడా, సాధ్యం కాదు.

పడమరనుంచి సింధునదిని చేరే, నదీలోయలద్వారా, వీరు ఇండియాను ప్రవేశించిరి. వీరి పవిత్ర సారస్వతంలో విశిష్టపుణ్యనదిగా వర్ణింపబడిన సరస్వతీనదీ తీరాలలో, వీరు చాల

కాలం నివాసము ఏర్పరచుకొన్నారు. పశ్చిమోత్తర, పశ్చిమప్రాంతాలనుంచి, వీరు ఇండియా లోనికి ప్రసరిస్తూరాగా, వీరి జనజాతులూ, కులాలూ, సింధు గంగామైదానాలలో చిన్నచిన్న రాజ్యాలను స్థాపించుకొనిరి. కాని, వారి పూర్వపు నివాసస్థానమైన సరస్వతీ ప్రాంతంనుంచి వీరు ఇండియాలో వ్యాపిస్తూరాగా, వీరిసంఖ్య తగ్గుతూ వచ్చింది. కనుక, గొప్ప సంఘముగా వలసరావడం తగ్గిపోయింది. కాని, చిన్నచిన్న వర్గాల నాయకత్వంలో విజయ దండ యాత్రలు ప్రారంభమైనవి. కట్టకడపటికి, ఆర్యసంస్కృతియొక్క పరమాధిపత్యం, భారత దేశమంతటా స్థాపితమయింది.

ప్రతి ప్రాంతంలోనూ, ఆర్యసంస్కృతులనూ, దేశీయసంస్కృతులనూ జరిగిన కల యికవల్ల, విశేషలక్షణాలతోకూడిన జాతులు ఉత్పన్నమునైనవి. సమానమునైన రూపురేఖలు కలిగి, పంజాబీ, రాజస్థానీ, మాండలికభాషలను వ్యవహరిస్తూ, సింధు గంగామైదాన ప్రాంతా లలో నివసిస్తున్నజాతివారు, పంజాబు, రాజస్థాన్, ప్రాంతాలవారి వస్త్రధారణ విధానాన్ని అవ లంబించిరి. మధ్యమభూములలోను, బీహారులోను నివసించేవారిలో, ఉన్నతకులాలవారందరికీ రూపురేఖావిశేషాలు సమానమునైనవి. కాని, తక్కువకులాలు భిన్నజాతికి చెందినవి. ఈ ప్రాంతంలో వ్యవహరించే భాషలు, హిందీభాషయొక్క వివిధ మాండలికభేదాలు. [పశ్చిమ పడమర మాండలికాలు.]

బెంగాలులోని ప్రజానీకంయొక్క రూపురేఖలు, మంగోలియా జాతులతో కలిగిన మిశ్రణాన్ని ప్రదర్శిస్తాయి. కాని, వారు వ్యవహరించే బెంగాలీభాష ఆర్యకుటుంబానికిచెందినది.

గుజరాత్, మాల్వా, బుందేల్‌ఖండ్, బాగేల్‌ఖండ్‌లతో ఏర్పడిన మధ్యమోన్నత భూములలో నివసించే జనులు, మధ్యపరిమాణపు తలలు కలవారు; పొట్టివారు. గుజరాతులోని భాష, రాజస్థానీభాషకు సన్నిహితమైనది. కాని, మధ్యమ ప్రదేశాలలో హిందీ మాండలిక భేదమునైన, మాల్వీ, బుందేల్, బాఘేలీ భాషలు వ్యవహారములో ఉన్నవి. చెల్లాచెదరుగా వ్యాపించిఉన్న అడవులలోను, భూభాగాన్ని విభజిస్తున్న అగాధమునైన లోయలతోను కూడిన ఛోటానాగపూర్, చీలికలుగా ఏర్పడిన కొండప్రదేశము.అసంఖ్యాకమునైన అనార్యజనజాతులతో ఏర్పడింది ఇచ్చటి జనాభా. వీరు, తమకు ప్రత్యేకమునైన భాషలను వ్యవహరిస్తూ ప్రత్యేకము లైన జనజాతి సంస్థలను ఏర్పరచుకొన్నారు. సంతాలు, ముండాలు, ఒరానులు, హోలు, గోండాలు, అనేవారు ఈ జనజాతులలోని ముఖ్యవర్గాలు. వీరు వ్యవహరించే భాషలలో, కొన్ని ద్రావిడభాషా కుటుంబానికీ, తక్కినవి ఆస్ట్రిలాయిడ్, లేక, ముండామాండలికాలనూ చెంది నట్టివి. మధ్యమపరిమాణమునైన తలలు, వెడల్పైన ముక్కులు, వీరి భౌతికదేహలక్షణాలు.

దక్కను తూర్పు భూభాగం, ఒరిస్సా, ఆంధ్ర, తమిళనాడ్, అనే మూడు ప్రాంతాలుగా విభజింపబడింది. ఒరిస్సా,ప్రజలభాష బెంగాలీకి సన్నిహితమైనది. ద్రావిడభాషలలో ఒకటైన తెలుగు, ఆంధ్రులభాష. ఈ ద్వీపకల్పముయొక్క దక్షిణ భాగాలలో నివసించే తమిళులు, రెండు విస్పష్టమైన జాతివర్గాలుగా ఏర్పడినారు. శిరస్సుయొక్క ఆకార పరిణామాలు, ముఖ రేఖాలక్షణాలు, ఈ రెండు వర్గాలనూ భిన్నమునైనవి. కాని, ఇరువర్గాలవారూ వ్యవహరించే భాష మాత్రం తమిళమే.

దక్కనుయొక్క పడమటి భాగంలో, మహారాష్ట్ర, కర్ణాటక, [కూర్గ్, మైసూరు, కెనరా], మలబారు తీరములు చేరిఉన్నవి. మహారాష్ట్రుల భాష ఆర్యభాషా కుటుంబము

లోనిది. కాని, భౌతిక రూపురేఖాదిలక్షణాలలో వీరు, పంజాబు, రాజస్థాను, ప్రజలకు విభిన్నులు.

కన్నడిగులు మహరాష్ట్రులను పోలిఉంటారు. వీరిలోకూడా ఉన్నత కులాలవారికీ, నిమ్న కులాలవారికీ విభేదము కలదు. కన్నడ భాష ద్రావిడ కుటుంబంలోనిదే ఐనా, విస్తారమైన ఆర్యశబ్దజాలం దీనిలో కలిసిపోయినది.

మలబారు నివాసులు పొడవైన తలలు కలవారు. భౌతిక లక్షణాలలో వీరు తమిళులను పోలిఉన్నారు. నంబూదరీ బ్రాహ్మణులు, నాయర్లు, అనే ఉత్తమ కులాలవారు నిమ్న కులాలవారికంటె, ఎత్తైనవారు. గౌరవర్ణ దేహచ్ఛాయ కలవారు.

తెలుగు, తమిళము, కన్నడము, మలయాళము, ద్రావిడభాషా కుటుంబశాఖలు. ఆర్య భాషలు వ్యవహరించే ప్రజల మొత్తం సంఖ్యకుతర్వాత, ద్రావిడభాషా ప్రజలసంఖ్య గొప్పది.

భారతదేశంలో, ప్రజానీకం వ్యాప్తిచెందియున్న పద్ధతినిబట్టి, రెండు విషయాలు వ్యక్తమౌతున్నాయి. భౌగోళిక విభజన మానవజాతి వైలక్ష్యంతో అన్వయిస్తూ ఉండడం మొదటిది. చాలావరకు ప్రత్యేకములై నిలిచియున్న ప్రాదేశిక పరిస్థితులలోని పూర్వపు నివాసులకూ, తరువాతవచ్చి నిలిచినవారికీ, కలిగిన మిశ్రణంవల్ల, విలక్షణములైన నూతన వర్గములు ఉత్పన్నములై, ఆయా కొత్తవర్గాలు తమతమ భాషలను విశేషమార్గంలో వృద్ధి కావించుకొన్నట్లు, గ్రహించవచ్చును. తన ప్రత్యేకభాషతోసహా, ప్రతిప్రాంతమూ, ఒక విధమైన వ్యక్తిత్వాన్ని, ఇంతవరకూ నిలుపుకొంటూ వచ్చింది.

పదమూడో శతాబ్దంనాటికే ఈ భాషా విభాగాలను గుర్తించి యున్నట్లు, అమీర్ ఖుస్రో, వ్రాతలవల్ల తెలుస్తుంది. అతడు పదకొండు భాషలను పేర్కొనినాడు. ధూర్‌సముద్రీ [కన్నడం], తిలాంగీ [తెలుగు], మబారీ [తమిళం], అని అతడు తెలిపిన మూడూ ద్రావిడ భాషలు. సింధీ, కాశ్మీరీ. గుజరాతీ, గౌరీ [పశ్చిమబెంగాలీ], బంగలా [తూర్పుబెంగాలీ], అవధీ [తూర్పుహిందీ], దెహలావీ [పశ్చిమహిందీ]. కుబ్రీ [గుర్తింపబడనిది.] అనే ఏడూ ఉత్తర ఆర్యభాషలు.

అబుల్ ఫజల్, పది భారతీయభాషలను గుర్తించి, ఉన్నాడు. కాశ్మీరీ, సింధీ, ముల్తానీ [పశ్చిమపంజాబీ], దెహలావీ [హిందీ], బెంగాలీ, మార్వారీ [రాజస్థానీ]. గుజరాతీ, మరాఠీ, తెలుగు, కన్నడము,- అనేవి, ఈ పది.

పదహారో శతాబ్దంలో, అక్బర్, తాను ప్రకృతి విభాగరేఖలుగా గ్రహించిన వాటిని అనుసరించి, సామ్రాజ్యప్రాంతాలను విభజించినాడు. సింధుమైదానం, ముల్తాన్, థాటా, అనే ప్రాంతాలుగా ఏర్పడింది. లాహోర్ ముఖ్యపట్టణంగా, పంజాబ్ ఒక ప్రాంతంగా ఏర్పాటయింది. అజమీర్ రాజస్థాన్ ప్రాంతమయింది. ఢిల్లీ, ఆగ్రా, ఔధ్, అలహాబాద్ ప్రాంతాలు, మధ్యమ భూభాగాలను ఆక్రమించినవి. అత్యంతము తూర్పున ఉండే మైదానం, బెంగాలు ప్రాంతంగా ఏర్పడింది. బీహారుకూడా ఆ ప్రాంతంలో చేరినదే. మధ్యభారతపు ఉన్నత భూభాగాలలో, మాల్వా ఒక్కటే అక్బరు సామ్రాజ్యంలో చేర్చబడింది. బుందేల్ ఖండ్, బాగేల్ ఖండులు స్వతంత్రస్థానాలుగా, నిలిచిపోయినవి. దక్కను పీఠభూమియొక్క పశ్చిమ భాగమూ, దాని సముద్రతీరభాగాలూ కలిసి, అహమ్మదాబాద్ (గుజరాత్) ఖాందేశ్, బీరార్ అనే మూడు ప్రాంతాలుగా విభజింపబడినవి.

ఔరంగజేబు ఈ ప్రాంతాలను, పునర్విభజనగావించి, సామ్రాజ్యాన్ని ఇరవైయొక్క (21) పరిపాలనభాగాలుగా ఏర్పరచెను. ప్రకృతి విభాగాలకూ, భాషావిభాగాలకూ దగ్గరగా ఈ విభజన అన్వయిస్తుంది. పంజాబీభాషాశాఖలు రెండూ వ్యవహారములో ఉండే ముల్తాన్, లాహోర్, విభాగాలు, పంజాబు ప్రాంతంగా ఏర్పడినవి. సింధీభాష వ్యవహరింపబడే థాటా; రాజస్థానీభాషను వ్యవహరించే అజమీర్; హిందీని వ్యవహరించే ఢిల్లీ, ఆగ్రా, అలహాబాద్, ఔధ్‌లా, బీహారీ, బెంగాలీ. ఒరియాభాషలు వ్యవహారములో ఉన్న బీహార్, బెంగాల్, ఒరిస్సాలు; మాలవీ భాషను వ్యవహరించే మాల్వా, మధ్యమఉన్నత భూభాగాలు; గుజరాతీ భాషను మాట్లాడే గుజరాతూ; మరాఠీభాషను వ్యవహరించే ఖాందేష్, బీరార్, బీదర్, బిజాపూర్లూ; అనేవి ఈ విభజనను అనుసరించి ఏర్పడిన నూతనప్రాంతాలు.

ప్రాంతీయప్రజల విస్పష్టములైన స్వభావాలూ వారు వ్యవహరించే భాషలూ, ఈ విధంగా, చరిత్రకాలమంతటా గుర్తింపబడినవి.

ఈ విభజన జరగడంలో, ప్రజలందరికీ ఐక్యం ఉన్నదనేభావం ప్రజ్ఞానిబద్ధం కాక పోయినప్పటికీ, తెలియకుండగానే, దానిని గుర్తించినట్లు కనబడుతుంది. వివిధ ప్రాంతాల లోని ప్రజలు విభిన్న అంశాల కలయికవల్ల ఏర్పడియుండడం వాస్తవమే. కాని, వివిధ వర్గాలన్నిటికీ, తమ తమ భేదాలతోకూడా ఒక అంశం సమానమై ఉన్నది. ఆర్యజాతి యొక్క మూలతత్వమే ఈ సమానాంశం. ఆర్యుల కుటుంబాలు. కులాలు, జనజాతులు, భిన్నభిన్న సంఘావర్గాలుగా భిన్నప్రాంతాలలో నెలకొనిఉండి, దేశీయ ప్రజావర్గాలపై తమ ప్రభావాన్ని నెరపి, ఆర్యతాముద్రను వారిపై అంకితం గావించిరి.

ద్రావిడ భాషలకూ, ముండా భాషవంటి అల్పమాండలికాలకూ తప్ప, తక్కిన అన్ని దేశభాషలకూ, ఆర్యభాషలే ఆధారములైనవి. అనార్య భాషలలోకూడా, ఆర్యభాషాభాగాలు విస్తారంగా మిశ్రితమైపోయినవి. వివిధభాషల సారస్వతాలలోని ఇతివృత్తమంతా, చాలవరకు, సమానమైఉండడం, అన్నిటికంటే, ముఖ్యమైన విషయం. సంస్కృత సారస్వత ప్రేరణపై తక్కిన సారస్వతాలన్నీ వర్ధిల్లడం, ఇందుకు ప్రబలకారణం. అన్ని ప్రాంతాలలోనూ పాటింపబడుతున్న మతవిశ్వాసాలు, పద్ధతులు, ఆచారాలు, సాంఘికవ్యవస్థలు – ఈ అన్నిటి లోనూ, నిస్సందేహమైన ఆర్యమత ప్రభావ లక్షణాలు నిలిచిఉన్నాయి.

ఇందో ఆర్యనులు ఇండియాలో స్థిరపడి, తమ భాషను, మతాన్ని, సాంఘిక పద్ధతు లను దేశమంతటా వ్యాపింపచేయడంతో, ఆయా ప్రాంతాలలోని మిశ్రితజాతుల ప్రభావాలకు లోనై, వివిధ సంస్కృతులు ఉత్పన్నములైనవి. ఈ సంస్కృతులు పరస్పరం భిన్నము లైనా, సమానములైన లక్షణాలు అనేకములు అన్నిటిలోనూ కలవు.

తరవాతి కాలంలో విస్తారములైన జనజాతులేవీ ఇండియాలో ప్రవేశించక పోవడంవల్ల, ఇండియా, ఆర్యుల ప్రాంతీయ వాసస్థానాలను కాని, ప్రజలశీల సంస్కృతులను కాని, భంగ పరిచే తొందరలు ఏవీకలుగలేదు. యూరోపులో జరిగిన సంఘటనలకు, ఇది వ్యతిరేకమై నట్టిది. అప్పుడప్పుడు, పరదేశీయులు ఇండియాకు వలస వచ్చిన మాట వాస్తవమే. కాని ఈ విధంగా తరువాతికాలంలో వచ్చిన వారి సంఖ్యాబలం, స్వల్పమైనది. కనుక, ప్రాంతీయ ప్రజానీకంయొక్క సమ్మిశ్రిత స్వభావాన్ని మార్చడానికి, సమర్థమైనదికాలేదు.

ఆర్యులు ఇండియాలో నెలకొన్న తర్వాత, శకులు (Scythians) యూచీలు

(Yuechis), హూణులు, ఇండియాలో ప్రవేశించిరి. సింధుగంగా మైదాన భూముల పశ్చిమోత్తర ప్రాంతమందు అంతటా, దట్టంగా, చెదరియున్న జాటులు, గుజారులు, వీరి సంతతి వారని, కొందరు చరిత్రకారులు నమ్ముతున్నారు. రసపుత్ర జాతికూడా, ఈవిదేశీయ జన జాతులనుంచి ఉద్భవమైనదని, పలువురు రచయితలు అభిప్రాయపడుతున్నారు. ఆరో శతాబ్దానికి పూర్వము, రసపుత్రుల జనజాతి వంశనామాలు, భారతదేశ చరిత్రలో కానరావు. అనగా, హూణసామ్రాజ్యం ఇండియాలో ఏర్పడడానికి పూర్వం ఈ వంశాలపేర్లు దేశంలో లేవు. అంతేకాక, వీరు, ఆరోశతాబ్దంలో, హఠాత్తుగా ప్రాముఖ్యానికి రావడం, ఈ అభిప్రాయానికి బలకరమై ఉన్నది.

ఈ జనజాతులకు సంబంధించిన విదేశ జన్య వాదముయొక్క సత్యము ఏదైనప్పటికీ, నిస్సంశయమైన ఒక అంశాన్ని, గుర్తించవలసి ఉన్నది. వీరి పూర్వపు నివాసులకు ఎంత మాత్రమూ స్థాన భ్రంశం కలుగక పోవడము, ముఖ్యంగా, గుర్తించవలసిన విషయం. ఈ జనజాతులసంఖ్య, అట్టి పరివర్తనాన్ని ఏమాత్రమూ సూచించడంలేదు.

పందొమ్మిదోశతాబ్దాంతపు లెక్కలు [1901 జనాభాలెక్కల వివరణ పత్రికప్రకారం] వీరి సంఖ్యను మనకు తెలియచేస్తాయి.

రాజపుటానాలోని మొత్తంజనాభాలో, రసపుత్రులు 6.4 శాతం; జాటులు 8.7 శాతం; గుజార్లు 4.8 శాతం. పంజాబులో రసపుత్రులు 7.4 శాతం, జాటులు 19.5 శాతం, [దీనిలో, ముస్లిము, హిందూ, సిక్కుజాటులు కలిసియున్నారు.] గుజార్లు 1.5 శాతం. జనజాతులకు మరొక ముఖ్యకేంద్రమైన ఉత్తరప్రదేశ్‌లో, వీరివ్యాప్తి ఈ క్రిందివిధంగా ఉంది. రసపుత్రులు 3.3 శాతం, జాటులు 1.9 శాతం, గుజార్లు 0.69 శాతం.

ఇదే వివరణపత్రాన్నిబట్టి, రసపుత్రులు, జాటులు, గుజారులు, అనే జనజాతుల నిరపేక్ష సంఖ్యలు (Absolute numbers) ఈ క్రిందివి;— రాజపుటానాలోని 97 లక్షల మొత్తం జనాభాలో రసపుత్రులు 6.1 లక్షలు, జాటులు 8.5 లక్షలు, గుజారులు 4.6 లక్షలు. పంజాబులోని 248 లక్షల మొత్తం జనాభాలో, 19 లక్షలు రసపుత్రులు, 50 లక్షలు జాటులు, 74 లక్షలు గుజార్లు. ఉత్తరప్రదేశ్‌లోని మొత్తం 466.7 లక్షల జనాభాలో, 34 లక్షలు రసపుత్రులు, 7.8 లక్షలు గుజార్లు.

జాతి లక్షణాలనుబట్టి ఈ మూడు జనజాతివర్గాలూ ఒకే ఆర్యవంశానికి చెందినవని, విద్వాంసులు అంగీకరించినారు. పంజాబ్, ఉత్తరప్రదేశ్, పశ్చిమభారతప్రాంతాలలోని అనేక ప్రాంతాలకు, గుజారులు తమ వంశనామాన్ని అంకితం చేసిఉన్నప్పటికీ, వారి ప్రాచీనరాజ్యం, జోధ్‌పూర్‌ప్రాంతంలో స్థాపింపబడి ఉండినది. ఇక్కడనుంచి ఉత్తరప్రదేశ్‌కు వ్యాపించి, వీరు, గూర్జర-ప్రతీహార సామ్రాజ్యాన్ని స్థాపించిరి. గుజారులూ, ప్రతీహారరాజపుత్రులూ ఒక్క వంశమువారే అని, ఈ సంయోగము సూచిస్తుంది. గుజారుల కొన్ని కులనామాలూ, కూడా ఒక్కటే. వీరిరువురి భౌతికరూపరేఖా విశేషాలు కూడా ఒక్కటే.

ఇక జాటులవిషయం పరిశీలించగా, ముప్పైయారు ప్రాచీన రాజపుత్ర కులాలలో, జాటులు కూడా చేరిఉన్నారు. తాము యదువుల (ఒక రాజపుత్రకులము) వంశమువారి మని, జాటులే చెప్పుకొంటున్నారు. "భౌతిక రూపురేఖల విషయంలోను, ముఖలక్షణములలోనూ, వీరికిగల, సర్వసమ సాదృశ్యాన్నిబట్టి, ప్రాచీనకాలమునుంచీ వీరికి పరస్పరంగల సన్నిహిత

సంబంధాన్నిబట్టీ, వీరు ఒకే వంశమువారు అనడం, అత్యంత సంభవనీయమైనది." అని ఇబ్బెట్ సన్(Ibbetson) అభిప్రాయపడినాడు.

ఈ మూడుశాఖలుకూడా, పూర్వము ఒకేజాతికి చెందియుండిరనడం, భావ్యం. రాజపుత్రులు కొన్ని సమయాల్లో, తగ్గుస్థాయిలోని జాటులుగా అవనతి పొందినట్లూ, జాటులు ఒకొకప్పుడు రాజపుత్రుల ఉన్నత స్థాయిని పొందినట్లూ, చారిత్రిక అభిలేఖలవల్ల తెలుస్తుంది. దీనినిబట్టి, ఈ రెండువర్గాలకూ సన్నిహిత సంబంధం ఉన్నదనే విషయం స్పష్టమౌతుంది. ప్రాచీనకాలంలోని, కులవ్యవస్థ ఇప్పటివలె, మార్పులకు అవకాశమియ్యనంతటి కట్టు దిట్టంగా ఉండలేదనడం కూడా తెలిసిన విషయమే. కనుక, ఇతరజాతుల వారి సమ్మిశ్రణంవల్ల ఈ మూడు వర్గాలవారి జన సంఖ్యా అమితంగా పెరిగి ఉండడం కూడా సంభావ్యమైనదే.

కాబట్టి రాజపుత్రులు, గుజారులు, జాటులు, ఒకేజాతివారనీ, వారిలో వారికిగల భేదాలు సాంఘిక సంబంధమైనవేకాని, జాతి సంబంధమైనవి కావనీ, వ్యక్తమౌతుంది. వీరు చిన్న చిన్న సంఘాలుగా, ఆయాకాలాల్లో ఇండియాలో ప్రవేశించిరనీ, అల్ప సంఖ్యాకులు కావడంవల్ల తమ ప్రత్యేక భౌతిక లక్షణాలను [అట్టివి ఉండి ఉంటే] తమ సంతతివారికి సంక్రమింపచేయలేదనీ, వారి స్వల్ప సంఖ్యలనుబట్టీ, మొత్తందేశపు జనాభాలోని వారి శాతాన్నిబట్టీ, ఊహించవచ్చును.

క్రీ. శ. మొదటి రెండో శతాబ్దాలలో, ఇండియాలో, సామ్రాజ్యాన్ని స్థాపించినవారు కుషానులు, సిథియనులు. వీరిని అనుసరించీ, లేక, ఐదోశతాబ్దంలో ఇండియాపై దండయాత్ర జరిపిన హూణులను అనుసరించీ, ఇండియాకు వలస వచ్చిన విదేశీయుల వంశీయులు, ఈ రజపుత్రవర్గాలు, అనే వాదాన్ని పర్యాస్తం చేయడానికి సమర్థమైన చారిత్రిక సాక్ష్యం, ఎక్కువగా ఉన్నది.

కుషానుల విషయం పరిశీలించగా, కాబూల్‌లోయకు ఆక్సస్‌లోయకూ మధ్యస్థమై, సింధునదికి పశ్చిమంలోఉన్న ప్రాంతం, వీరి నివాసస్థలంగా ఉండింది. కాశ్మీర్, పశ్చిమోత్తర భారతప్రాంతాలపై, కుషానురాజులు తమ ఆధిపత్యాన్ని నెలకొల్పుకొనిరి. ఇండియాలోని, ఏ ఇతర ప్రాంతంలో కాని, వీరు అధికసంఖ్యలో నెలకొన్నట్లు, చరిత్ర తెలుపడంలేదు. వాస్తవానికి, సిథియనుల ప్రధానభాగం పడమరకు,- ఇరానుకు, దానికిపైగా కూడా,- వలస పోయింది. వారిలో ఒక వర్గమైన కుషానులుమాత్రమే ఆఫ్గనిస్తానులో నిలిచిపోయిరి. గుప్త చక్రవర్తులు కుషానులను ఇండియానుంచి, వెడలగొట్టిన తర్వాతకూడా, కుషానునాయకులు, ఆఫ్గనిస్తానులో తమ పరిపాలనను సాగిస్తూవచ్చినారు.

ఇండియాలో, హూణులరాజ్యం - లేక శ్వేత ఎఫ్థలైట్ల (White epthalites) రాజ్యం, అత్యల్పకాలం మాత్రమే నిలిచింది. తోరమాణుడు, మిహిరగులుడు అనే ఇద్దరు హూణరాజులు, ఇండియాపై దాడులు సాగించిరి. కాని, మాళ్వారాజైన యశోధర్ముడు, గుప్తవంశపు బాలాదిత్యుడూ, వీరిని కట్టకడపటికి, దేశమునుంచి తరిమివేసిరి. పర్షియనులూ, టర్కులూ, వీరిని ఆక్సస్‌పై ఘణ్ణంగా ఓడించడంతో, వీరి అధికారం నిశ్శేషంగా కూలిపోయింది. వారి వంశానికిచెందిన అధికసంఖ్యాకులు, పంజాబు, రాజస్థాన్, ప్రాంతాలను ఆక్రమించిఉండి ఉంటే, వీరి పరిపాలన ఇంత శీఘ్రంగా అంతరించడం, సందేహాస్పద మౌతుంది.

పంజాబ్, రాజస్థాన్ ప్రాంతాలలోని ప్రజల సంయోజన విధానాన్ని బట్టి కూడా, విదే

కీయ జాతి వారిక్కడ స్థిరపడినారు, అనే వాదానికి బలంలేదు. పంజాబ్, రాజస్థాన్ ప్రాంతాల ప్రజల భౌతికలక్షణాలూ, ఉత్తరప్రదేశ్ పడమటిభాగంలోని ఉన్నతకులాల భౌతికలక్షణాలు, కూడా, ఏకరీతిగా ఉన్నవి. కనుక విస్తారమైన జాతి మిశ్రణం సంభవించడం కూడా సాధ్యంకాదు. రసపుత్రులు దీర్ఘ శిరస్కులు (Dolichocephalic), హూణులు లఘుశిరస్కులు (Brachy cephalic) ఐ, ఉండడంవల్ల, రసపుత్రులు శ్వేత, హూణుల జాతి వారనే ఊహ నిలువజాలదని, ఘూర్యే (Ghurye) సూచించి ఉన్నాడు.

హూణులను ఇండియా నుంచి పారదోలిన అనంతరం, ఆరు వందల సంవత్సరాల కాలం, తీవ్రమైన దాడులేవీ ఇండియాపై జరుగలేదు. అయితే, పదకొండో శతాబ్దంలో, మహమ్మద్ గజినీ నాయకత్వంలో ఆఫ్ఘనులూ, టర్కులూ, ఇండియాపై బలాత్కారంగా ప్రవేశించిరి. ముస్లిం పరిపాలన ఇండియాలో స్థాపించబడడం, ఈ ఉద్యమము యొక్క తుది పరిణామం. పన్నెండో శతాబ్దాంతం మొదలుకొని, పద్ధెనిమిదో శతాబ్దాంతంవరకు, ముస్లిం చక్రవర్తులు, ఇండియాలోని అధిక భూభాగంపై పరిపాలన సాగించిరి.

ఇస్లాము మత సంఘటనంవల్ల, ఇండియా ప్రజల సాంస్కృతిక జీవితంలో పరివర్తనం కలిగింది. మతము, భావము, భాష, సారస్వతము, వాస్తుశిల్పము, చిత్రలేఖనము, సంగీతము,- మొదలైన సంస్కృతిశాఖలన్నీ, ఇస్లాము ప్రభావానికిలోనైనాయి. ఇస్లాము ప్రభావం, భారతీయ సంస్కృతిపై గాఢంగా వ్యాప్తమయింది. జాతి, సాంఘిక, ఆర్థిక, వ్యవస్థ విషయంలో మాత్రం, ఏమార్పునూ కలిగించలేదు.

జనజాతులకు, కులాలకు, సంబంధించిన హిందూ విధానంలోనూ, కుటుంబానికీ, కులానికీగల ఆధార సంబంధాల విషయకమైన హిందూధర్మశాస్త్ర విషయంలోనూ, ఎట్టి మార్పూ రాలేదు. ఇవి మారకపోవడం అట్లుండగా, ముస్లిములూ, హిందువులూ, పరస్పర మతాల్లో కలిసిపోవడం జరిగింది. ఇస్లాము మతాన్ని అవలంబించిన తర్వాతకూడా, హిందువులు పాటించే కులభేదాలూ, వివాహ సంబంధమైన ఆచారాలూ, వారసత్వ నియమాలూ, వీరిలో పూర్వంవలెనే, నిలిచి పోయినవి.

ఈ ఆరువందల సంవత్సరాలలోనూ, ఇండియాలో ప్రవేశించిన ముస్లిముల సంఖ్య పెద్దదికాదు. సైన్యాలూ, వారినాయకుల సిబిరపు సిబ్బందీకాక, వారి వెంటవచ్చిన విద్వాంసులు, కవులు, చరిత్రకులు, సాహసవ్యర్తులు, కొద్దిమంది మాత్రమే. ఆదేశాలలో హింస లకు లోనైన అధికారులూ, కులీనులూ కూడా చాలకొద్దిమంది ఇండియా ప్రవేశించిరి. ఏషియా మధ్యమ ప్రాంతంనుంచీ, పశ్చిమ ఏషియానుంచి, ఇండియాకువచ్చిన ముస్లిములు, భారత పశ్చిమోత్తర ప్రాంతంలో నివసించే వారికంటె, జాతివిషయంలో భిన్నమైన వారుకారు. క్రొత్తగావచ్చినవారి సంఖ్య స్వల్పమైనది కావడంవల్ల, ఇండియావాసుల జాతి, సాంఘిక ఆర్థిక వ్యవస్థలలో ఎక్కువ మార్పులను తేజాలకపోయిరి.

ఈవిధంగా, క్రీ.పూ. రెండోశతాబ్దంలో ఆర్యులు వలస వచ్చినప్పటినుంచి, క్రీ. శ. ఎనిమిదో శతాబ్దందాకా, ఇండియా సమాజంయొక్క జాతిసంబంధమైన ఆధారమూలం చలిం చలేదు; ప్రబలమైన మార్పుకూడా గురికాలేదు. భారతదేశ సాంస్కృతిక సంప్రదాయ ప్రవాహంలోనికి బైటినుంచి, అనేక ఉపనదులువచ్చి కలిసినవి; కాని, తన ప్రకృతిసిద్ధమైన వ్యక్తిత్వాన్ని కోల్పోక ఈ సంప్రదాయం ప్రవహిస్తూనే వచ్చింది.

కాలం నిశ్చలంగా నిలిచిపోయిందని దీని భావంకాదు. మార్పు, అనివార్యమైనట్టిది. కాని, ఇండియాలో ఈ మార్పు మందంగా జరుగుతూవచ్చింది; అది విస్తృతమైనది కూడా కాదు. ప్రజాజీవితంలోని మూలభాగాన్ని అది స్పృశించలేదు. పద్దెనిమిదో శతాబ్దాంతంవరకు చరిత్ర సంబంధమైన వ్యత్యయాలెన్ని జరిగినాకూడా, ప్రజాజీవితానికి ఆధారమైన, సాంఘిక ఆర్థిక, వ్యవస్థయొక్క పునాదులు చలించక, స్థిరంగా నిలిచి ఉండినాయి.

భారతీయసంస్కృతి అవిచ్ఛిన్నంగా సాగుతూ ఉన్నదనడానికి అపారమైన సాక్ష్యం సిద్ధంగాఉంది. మధ్యయుగాలలో, భారతదేశమంతటా 'హిందూస్థానీపద్ధతి' జీవితం నెలకొని ఉండినదని, బాబర్ తెలిపియున్నాడు. భౌగోళికప్రాంతాల్లో, ఈ హిందూస్థానీ పద్ధతియొక్క ఉపరూపాలు (Sub-types), వర్ధిల్లినాయి. ఐనా, అవన్నీకూడా, మూలసంస్కృతి యొక్క విభేదాలు, లేక, హిందూస్థానీపద్ధతి యొక్క శాఖలు.

ఐనప్పటికీ, భారతదేశంలో, లోపించిన ముఖ్యవిషయం,- ఐక్యభావ పరిజ్ఞానం. సామాజిక, రాజకీయఐక్యము అనేభావము, ఇండియాలో ఏర్పడలేదు. సమగ్రదేశమంతటా ఒకే రాజకీయవిధానము ఏర్పడిఉండిన చరిత్రకాలభాగాలలో కూడా, సాంఘికసంస్థలో సహభాగిత్వభావముగా సార్వజనికమైన అధికారానికి మనఃపూర్వకమైన విధేయతా, సిద్ధించక పోయినవి. భారతజాతులను, సమాజాలను, వర్గాలను వేర్వేరుగా విభజించి వేసిన ప్రతిబంధకాలను పడగొట్టడానికి సాంస్కృతిక సామరస్యానికికాని, రాజకీయాధిపత్యానికికాని, సాధ్యం కాకపోయింది. రెండుసంస్థలూ, నిరంతరమైన మొండిపట్టుదలతో, ఐక్యసాధన ప్రయత్నానికి అడ్డు తగులుతూ వచ్చినవి. అవి, కులము, గ్రామము,- అనేవి.

## IV. కులము

సాంఘిక విషయంలో ఐకత్వము, సంవిభాగము అనేవి, గ్రామవిషయంలో స్వయం పోషకత్వము అనేవి కులానికి గ్రామానికి గల ముఖ్యలక్షణాలు. వీటిద్వారా ప్రత్యేకత్వము అనే భావం, ప్రజలజీవితంలో ప్రగాఢంగా పాతుకొనిపోయింది. రాజకీయ సంక్షోభాలు, రాజవంశాలు మారిపోవడం, శత్రువుల విజయ దండయాత్రలు, ప్రకృతివల్ల కలిగిన మహంతర వినాశాలు,- ఏవీకూడా ఈ వ్యవస్థపై తమ ప్రభావాన్ని ఏమాత్రమూ చూపలేకపోయినవి.

అత్యంత జటిలమూ, కామరూపీ (Protean) ఐన, సాంఘిక సంఘటనము కుల వ్యవస్థ. దీన్ని గురించి విస్తారంగా వ్రాసియున్నారు. ఐనా, దీనికి సంబంధించిన అనేక విషయాలు ఇంకా మరుగుపడిఉన్నాయి. దీనికి విస్పష్టమైన లక్షణాన్ని నిర్వచించడం కష్టం. క్లేశకరములైన ఖండనవాదాలతో కూడుకొన్న విషయం కాబట్టి, దీన్ని గురించి ఖండితంగా ఏమిచెప్పినా, వెంటనే ప్రతివాదం బయలుదేరుతుంది. ఐనా, నాగరకతా చరిత్రలో ఎక్కడా సాదృశ్యంలేని ఈ సామాజిక సంఘటన మనకు ప్రత్యక్షంగా నిలిచిఉంది. ప్రజల వ్యవహారాలపై దీనికిగల ప్రగాఢ ప్రభావాన్ని గుర్తించి, దీని విచిత్ర స్వభావాన్ని, దిగ్భ్రమగొలిపే దీని శాఖోపశాఖలనూ తెలుసుకోకపోతే, భారతదేశముయొక్క పూర్వచరిత్రను అర్థంచేసుకోవడం సాధ్యంకాదు; దేశభవిష్యత్తును గురించి, ఊహించడం కూడా సాధ్యంకాని పని.

కులవ్యవస్థకు సంబంధించిన వాటిలో విలక్షణమైనది, దాని ద్వంద్వ జీవితం. స్మృతులు, ధర్మశాస్త్రాలు, వాటిపై టీకలు, వ్యాఖ్యానాలు మొదలైన హిందూమత న్యాయ

సారస్వతంలో సూచింపబడినట్టి, తాత్త్విక, లేక-ఆదర్శక మత వ్యవస్థ ఒక పక్షము. వర్గాలూ, ఉపవర్గాలూ, జాల బంధంగా ఏర్పడియున్న వాస్తవస్థితీ, మరొకవైపు. ఈ వర్గ వైవిధ్యముయొక్క వివరణం సారస్వతం నుంచి ఇతర మూలాలనుంచి, మనకు లభిస్తుంది. అతిక్లిష్టంగా చిక్కుపడియున్న, కులవ్యవస్థయొక్క సమగ్ర స్వరూపం ఎట్టిదో, పందొమ్మిదో శతాబ్దపు జనాభా నిర్వహణవల్ల, మనకు గోచరమయింది. దాని వాస్తవ స్వరూపం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

కులవ్యవస్థ, అతి ప్రాచీనమైనది. దీని అవయవ అంశాలు చాలవరకు, వేదాలలో కనబడుతున్నవి. జాతి, జనజాతి వర్గము, వృత్తి, మతము, పూజావిధానము,- ఈ అంశాలు కులవ్యవస్థా నిర్మాణాన్ని కలిగించిన మూలధాతువులు. ఋగ్వేదములో ప్రతి ఫలించియున్న విధానాన్నిబట్టి జాతి పరిజ్ఞానం, ఆర్యసంఘంలో ఉండినట్లు స్పష్టమౌతుంది. సన్నని ఎత్తైన ముక్కు, గౌరవర్ణము కలిగియున్న ఆర్యులకూ, నలుపుదేహము నడ్డిముక్కు కలిగియున్న ఆర్యేతరులకూ గల జాతిభేధం, ఆనాడే గుర్తింపబడింది. ఈ అనార్యులను దాసులు, లేక, దస్యులు, అని వ్యవహరించినారు. [తరువాతి చరిత్రకాలంలో ఏకకులముగా కలిసిపోయిన ఆర్యజాతులను, అనార్య జనజాతులను అనేకములను వేదములు పేర్కొన్నవి.] పౌరోహిత్యాన్ని సూచించే బ్రహ్మన్ అనే శబ్దము, యుద్ధశక్తిని సూచించే క్షేత్రశబ్దము, పదార్థాల ఉత్పత్తినీ, ఆర్థిక కార్యాచరణాన్నీ సూచించే విస్ శబ్దము,- ఇవి మూడూ సమాజకర్తవ్యాల విభజనను తెలుపుతున్నవి. ఇరానులోని ఆర్యులు అనుసరించిన విభజనకు, ఈ విభజన సదృశమై ఉన్నది. అథర్వన్, రథేస్తార, వస్త్రియ, షూయంత్ [పురోహితుడు, యుద్ధ వీరుడు, కర్షకుడు] అనేవి, ఇరాను ఆర్యుల విభాగాలు, ఇండియాలోని నాల్గవ వర్గమైన శూద్ర-అనేది ఇరానులోని హుయిటీ (Huiti) అనే దానికి సదృశమైనది. పూజా విధానంలో, మూడువర్గాలవారికీ భేదమున్నది. యజ్ఞవిధిని నిర్వహించడం ద్వారా, దివ్యతత్త్వంతో ఏకీభావం పొందదలచిన యజ్ఞకర్త, రాజుగాఉన్న క్షత్రియుడు. యజ్ఞవిధిని నిర్వహించే ప్రక్రియలో నిపుణుడు, దోషరహితంగా దానిని నడపగలవాడూ ఐన పురోహితుడు, బ్రాహ్మణుడు. రాజుకు ఆశ్రితుడైనవాడు వైశ్యుడు. రాజ్యకర్మల ఆచరణంలో పాల్గొని, యజ్ఞానికి అవసరమైన ధాన్యాన్నీ, పశువులనూ ఒడిగించడం ఇతని కర్తవ్యం.

ఐనా, ఆ తొలిరోజులలో, ఈ విభాగాలు కులాలుగా బిగుసుకొని ఉండలేదు. ఈ నాలుగు వర్గాలే కాక, వృత్తులకూ, ఉపజీవికలకూ సంబంధించిన పెక్కువర్గాలుకూడా ఋగ్వేదములో పేర్కొనబడిఉన్నవి. మంగళ్ళు, వడ్రంగులు, వైద్యులు, కమ్మరులు, చర్మాలు పదును చేసేవాళ్ళు మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. ఆరాధన పద్ధతులపైన ఆధారపడి ఏర్పడిన విభేదాలు కూడా గుర్తింపబడి ఉన్నవి. ఆర్యుడు బర్హిష్మత్ (యజ్ఞనిర్వాహకుడు); దాసుడు అవ్రతుడు. [విధిదూరుడు]; అక్రతు [సంస్కారహీనుడు]; మృధ్రవచః [దుర్భాషనుమాట్లాడేవాడు.]

కాలంగడిచేకొద్దీ, ఈ విభజనలు బిగిసిపోయినవి. ప్రాథమికయుగాలలో, ఆనువంశీయత (Hereditary) అనే నియమానికి ప్రాధాన్యంలేదు. బ్రాహ్మణులు క్షత్రియులుగా మారడానికి, క్షత్రియులు బ్రాహ్మణులు కావడానికి అవకాశము ఉండింది. క్షత్రియ రాజకుమారుడైన, దేవపుడు, పురోహితవృత్తిని అవలంబించినాడు. ఇట్టి మార్పులకు నిదర్శాలు అనేక

ములు తరువాతికాలపు సారస్వతంలోగలవు. బ్రాహ్మణులు యుద్ధవీరులుగా, రాజులుగా, మారి నారనిడానికి పెక్కు ఉదాహరణలు ఉన్నాయి. ద్రోణ, కృప, అశ్వత్థాములు, అట్టివారు. ఆర్యుల తర్వాత, రాజ్యానికి వచ్చిన సుంగవంశంవారూ, కణ్వవంశంవారూ మొదట బ్రాహ్మణులైనా, రాజులైరి. శాతవాహనులు, తాము "విశిష్టులైన బ్రాహ్మణులని," "క్షత్రియుల, దర్పాన, దురభిమాన నాశకులమనీ" చెప్పుకొన్నారు.

కాని, ఋగ్వేదమే వ్యక్తియొక్క జన్మకు ప్రాధాన్యమిచ్చి జన్మసిద్ధమైన కులాన్ని మార్చుకోడానికి వీలులేదనే భావానికి బీజంవేసింది. నాలుగు వర్ణాలూ పురుషుని నాలుగు భిన్నావయవాలనుంచి ఉద్భవించినవని చెప్పడమే, ఈ భావానికి మూలము. జన్మవల్ల కులం సిద్ధించిందనే సిద్ధాంతం ఏర్పడడంతోనే ఇండియాయొక్క భావనాశాస్త్రంపైనా-(Ideology), సంస్కారంపైనా, క్రమంగా దీనికి అధికారం ఏర్పడింది. చరిత్రలోని ఒక్కొక్క ఆవర్తకాలమూ గడిచేకొద్దీ, ఈ జన్మ సిద్ధాంతముయొక్క ప్రభావం, ఉపద్రవకరమైన ముళ్లతుమ్మచెట్టువలె, సంఘముపై వ్యాపించింది.

కులాల, నానాత్వానికిగల, కారణాన్ని వివరించడానికి ఆసక్తులైన మీమాంసకులు, జన్మఅనే ఒక్క అంశాన్ని మాత్రమే ఆధారంగా చేసుకొని, వాస్తవ పరిస్థితులకు సమాధానం చెప్పడానికి ప్రయత్నిస్తారు. ఏకకుల సంజాతులైన స్త్రీ పురుషుల వివాహంవల్ల జనించిన సంతానం, ఆ కులాన్నే మరల ఉత్పన్నం చేస్తుంది; కులాన్ని పరిశుద్ధంగా నిలుపుతుంది. ఉన్నత కులంలోని పురుషుడు తక్కువకులంలోని స్త్రీని వివాహమాడగా (అనులోమ వివాహం) జనించిన సంతానముయొక్క కులం తండ్రి కులానికంటె తక్కువదికాదు. కాని, తక్కువ కులంలోనివాడు పైకులంలోని స్త్రీని వివాహమాడగా (ప్రతి లోమవివాహం), జనించిన సంతానం తలిదండ్రుల కులాలకంటె తక్కువ కులానికి చెందుతారు.

క్రమచయ, ఏకఘాత సంచయాల ప్రకారం (Permutations and combinations) ఇటువంటి మిశ్రమవివాహాలు అసంఖ్యాకంగా ఏర్పడుతాయి. కనుక, ఇట్టి వివాహాలు లెక్కలేని కులాలనూ, ఉపకులాలనూ సృష్టికి తెచ్చినవి. కులాలసంఖ్య ఈవిధంగా పెరిగినదని ధర్మశాస్త్రకారులు ఊహించిరి. ప్రతికులాన్నీ ఒక కులధర్మానికీ, లేక, వృత్తికిమాత్రమే నిర్బంధించి ఉండడానికి ప్రయత్నించిరి. ఈ విధంగా, మారడానికి వీలులేని విధంగా సమాజాన్ని ఒక చౌకట్టులో బిగించి, దానికి అవసరమైన సంవిధాన అనుభాగాన్ని (Constituent section) కూడా రచించిరి. తాత్త్వికమైన ఈ పద్ధతి ప్రజల మనస్సులలో నిశ్చలంగా స్థిరపడిపోయింది. వాస్తవపరిస్థితులు దీనికి ఎంత విరుద్ధంగా ఉన్నప్పటికీ లెక్కచేయక వాటిని ఈ సిద్ధాంతానికి లోబడి ఉండేటట్లుగా అన్వయిస్తూ వచ్చిరి.

ధర్మశాస్త్ర రచయితలైన మనువూ, ఇతరులూ. ఈ సిద్ధాంతాన్ని విస్తృతిగావించిరి. కనుక, పదహేడోశతాబ్దం వరకూ కూడా, ఈ సిద్ధాంతమే పాటింపబడుతూ వచ్చింది. కుల వ్యవస్థయొక్క ఉత్పత్తి క్రమాన్ని, దాని స్వరూపాన్ని గూర్చి, 'జాతి వివేకము' 'శూద్ర కమలాకరము'అనే గ్రంథాలు సంప్రదాయపద్ధతిలోనే రచింపబడినవి.

కులం జన్మవల్ల ఏర్పడుతుందని ఈ ప్రకరణ గ్రంథాలు సమర్థిస్తాయి. బహుభార్యాత్వం వ్యాప్తిలో ఉండడంవల్ల, ఉపకులాలూ, భ్రష్టకులాలూ ఏర్పడినవనీ, ప్రతికులానికీ నియతమైన ఒకవృత్తి ఉండనీ, కొన్నికష్ట సందర్భాలలో ఇతర వృత్తులను అవలంబించ

దానికి శాస్త్రం అంగీకరిస్తుందనీ, అన్నపానాల విషయంలో, కులం వ్యక్తి స్వాతంత్రంపై నిర్బంధాలను విధించి ఉన్నదనీ, క్రమశ్రేణీ బద్ధమైన సాంఘిక వ్యవస్థలో ప్రతికులానికి, ఉపకులానికి, ఒక నిర్దిష్టమైన స్థిరస్థానం ఏర్పడిఉన్నదనీ,- ఈ ప్రకరణ గ్రంథాలు సంప్రదాయాన్ని సమర్థిస్తాయి.

కాని, తాత్త్విక సిద్ధాంతానికి మారుగా, వాస్తవ పరిస్థితులను పరిశీలించిచూస్తే, ప్రజలను వర్గములుగాను, శాఖలుగాను ఏర్పరుస్తున్న విభజన పద్ధతి, చాల సంక్లిష్టమై ఉన్నదనీ, ప్రకరణ గ్రంథాలలో వర్ణింపబడిన దాని కంటె చాల భిన్నమైనదనీ, తెలుస్తుంది.

పి. వి. కాణేను అనుసరించి. ధర్మశాస్త్రాలలో పేర్కొనబడిన కులాలు 172. కాని జనాభాలెక్కలనుబట్టి, ప్రతిభాషా ప్రాంతంలోనూ 200 కులాలు, 2000 ఉపకులాలు ఉన్నట్టు తెలుస్తుంది. ఇండియా మొత్తంలో, 300 కు పైగా ముఖ్యకులాలు, 5000 పైగా భిన్నకులాల వర్గాలూ ఉన్నవి. ప్రజలు కులవర్గాలుగా ఏర్పడే విధానంలో, ప్రాంతానికి ప్రాంతానికీగల విభేదాలను, ధర్మశాస్త్రగ్రంథాలు గుర్తించకపోవడం గమనించతగిన విషయం. ఇండియాలోని అన్ని ప్రాంతాలకూ సమానంగా వర్తించేది బ్రాహ్మణకుల మొక్కటే. ధర్మశాస్త్రాలలో పేర్కొనబడిన క్షత్రియవర్గానికి ప్రతినిధులుగా చెప్పదగిన రసపుత్రులు, ముఖ్యంగా, పంజాబ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యమోన్నత భూములకు మాత్రమే పరిమితమై ఉన్నారు. తూర్పు భారతంలోను, దక్కనులోను చెదరియున్న రసపుత్రుల సంఖ్య అత్యల్పం. మరిన్ని, పరిశ్రమలు, సేద్యము, వర్తకము, మొదలైన వృత్తులను అనుసరించేవారి కులముపేర్లూ, ఆ కులాలకు సమాజములో కలస్థానము, ప్రాంతానికీ ప్రాంతానికీ భిన్నములై ఉన్నవి. మిక్కలి తగ్గుదశలకు చెందిన కులాలు కొన్ని మాత్రం అంతటా సమానమై ఉన్నవి. ఆ వర్గాలలో కూడా భిన్నమైనవి చాలాకలవు.

ఉన్నత నిమ్నకులాల వారి విభజన ఇంతకంటె ముఖ్యమైనది. విశుద్ధకులాలు [బ్రాహ్మణులు, రసపుత్రులు] లేక, విశిష్టకులాలు [విశుద్ధకులాలు జలం పుచ్చుకోదగిన కులాలు] అనే కులాలకు, అశుద్ధకులాలకు [అస్పృశ్యులు, లేక, బాహ్యకులాలు] అనే వాటికి గల అనుపాతం, ప్రాంత ప్రాంతానికీ భిన్నమైఉంది, అని ఈ క్రింది పట్టిక తెలుపుతున్నది.

| | హిందువులు లక్షలు | బ్రాహ్మణులు శాతం | రసపుత్రులు శాతం | ఇతరులు శాతం |
|---|---|---|---|---|
| అస్సాం | 30.6 | 3.9 | .3 | 95.8 |
| బెంగాల్ | 454.5 | 6.0 | 3.0 | 91.0 |
| బొంబాయి | 178.3 | 5.6 | 2.5 | 92 |
| సి. పి. | 87.0 | 4.1 | 2.6 | 93.3 |
| మదరాస్ | 285.0 | 4.0 | .05 | 95.95 |
| పంజాబ్ | 92.5 | 3.0 | 4.0 | 93 |
| పశ్చిమోత్తర ప్రాంతం | 335.5 | 12 | 8 | 80 |
| మధ్యభారతం | 78.0 | 12 | 10.4 | 77.6 |
| రాజపుటానా | 92.0 | 9.3 | 5.2 | 85 |
| ఇండియా | 1880.0 | 7 | 3.8 | 89.2 |

గణాంక సంఖ్యలనుబట్టి, 1931లో, ఇండియా మొత్తం జనసంఖ్యలో అస్పృశ్యులు 14 శాతం. హిందూజన సంఖ్యలో వీరి శాతం 21. బొంబాయిలో వీరిశాతం 11 మాత్రమే. అస్సాములో అత్యధిక సంఖ్యలో ఉండి వీరి శాతం 37. ఇంతేకాక, ప్రతి ప్రాంతంలోనూ, భిన్న భిన్నమైన అస్పృశ్యకులాలు ఉండినవి. చమారులు ఇండియా అంతటా వ్యాపించి యుండినారు.

ఈ గణాంక సంఖ్యలు తరువాతివాలయినా. పద్దెనిమిదో శతాబ్దపు సంఖ్యలు లభించవు. ఐనా, ఆ శతాబ్దంలోని సాంఘిక సమాజమునకున్న పరిస్థితిని, ఈ సంఖ్యలు, స్థూలంగా ప్రదర్శిస్తాయి. ఇందులో సాధారణంగా ఎంత పెరిగినవనీ, తగ్గినవనీ, నిరపేక్ష సంఖ్యలు (Absolute numbers) మారుతూ ఉంటాయి. కాని, ప్రత్యేకమైన విస్పష్ట కారణాలు ఉంటే తప్ప, పరస్పర శాత సంఖ్యలో పెద్దమార్పు కలుగదు.

ప్రాంతీయములైన ఇతర విలక్షణ భేదాలు కూడా ఉండినవి. సంఘంలో కులానికీ కులానికీగల అగ్రస్థాన విషయానికి సంబంధించిన విధానం, అన్ని ప్రాంతాలకూ సమానమైనది కాదు. దక్షిణదేశంలో, బ్రాహ్మణుల పరమాధిక్యాన్ని కమ్మలవారు (Kam nalan) ఒప్పుకో లేదు. బెంగాలులోని కాయస్థులు శూద్రులుగా పరిగణింపబడినారు. కాని, బీహారులోను, ఉత్తర ప్రదేశ్‌లోను వీరిని ద్విజులుగా పరిగణించినారు. మహారాష్ట్రలోని కాయస్థులు, (Prabhus) తాము, క్షత్రియ వంశము వారమని చెప్పుకొంటూరు.

ఈ విధమైన విభేదాలు, ఇతర కులాలలో కూడా వచ్చినాయి. ఇంక, నిషిద్ధ వివాహాల తారతమ్యాలకు సంబంధించిన ఆచార వ్యవహారాలు కూడా విభిన్నంగా ఉండేవి. విజ్ఞానేశ్వరుని మితాక్షరిలో విధించబడిన నియమాలను కొన్ని ప్రాంతాలు పాటించేవి. మరికొన్ని ప్రాంతాలలో, దాయభాగ, లేక, జీమూతవాహను, అంగీకరించబడింది. సాంఘిక నిర్బంధాలూ, నిషేధాలూ, దేశభాగాలన్నిటా సమానమైనవికావు.

నిమ్నకులాలను స్పృశించవద్దనే కఠినమైన నిషేధం, దక్షిణదేశంలో ఉన్నంత తీవ్రంగా, ఉత్తరదేశంలో లేదు. అస్పృశ్యులు ఇతరులను అపవిత్రం చేస్తారనే భావం దక్షిణ దేశంలో తీవ్రమై ఉండినందువల్ల, వారి నీడను కూడా, ఉన్నత కులాలవారు దూరంగా ఉండేవారు. ఉన్నత కులాలవారికీ అస్పృశ్యులకూ మధ్య ఉండవలసిన దూరంకూడా, తమిళనాడు మలబారు ప్రాంతాలలో, నిర్ణయితమై ఉండేది. బావులను, చెరువులను మాత్రమేకాక, నదులను ఉపయోగించే విషయంలో కూడా అస్పృశ్యుల స్పర్శవల్ల, మలిన మౌతాయనే భావం పాటింప బడింది. దేవాలయ ప్రవేశం, అస్పృశ్యులకు నిషిద్ధం. ఊరిలోని అత్యధిక భాగాన్కి, అస్పృశ్య కులాల నివాసస్థానాలు, గ్రామాలకు దూరంలో ఉండేవి. కొన్ని ప్రాంతాలలోని గ్రామాలలోను, పట్టణాలలోను, ప్రతికులానికి ఒక ప్రత్యేకమైన భాగం నిర్దిష్టమై ఉండేది.

వండిన ఆహారాన్ని ఒక కులం వారినుంచి, మరియొక కులంవారు గ్రహించే విషయం, ప్రాంతీయమైనది. బెంగాల్, గుజరాత్, దక్షిణభారత ప్రాంతాలలో, అపక్వాహారానికి [కచ్చా = నేయి లేక వండినది] పక్వాహారానికీ [పక్కా = నేతితో వండింది] భేదం పరిగణింపబడలేదు. కాని, ఇతర ప్రాంతాలలో, తక్కువకులాల వారినుంచి, పక్వమైన ఆహారాన్ని, ఉన్నతకులాల వారు గ్రహించడం నిషిద్ధంకాదు.

మదరాసునుంచి కొన్ని ప్రాంతాలలో, బ్రాహ్మణేతరులను 'కుడిచేతివారు', ఎడమచేతి వారు', అని రెండువర్గాలుగా, విభజించియుండిరి. ఉత్సవాలలో అశ్వారోహణం చేయడము,

కొన్ని విధములైన జెండాలను ధరించడము, పెండ్లిమంటపాలను పండ్రెండు స్తంభాలపై కట్టడము, అనేవి, రెండవవర్గంవారు చేయకూడదు.

ఈ విధమైన ప్రాంతీయభేదాలు ఉన్నప్పటికీ, కులవ్యవస్థకు సంబంధించిన సార్వత్రిక లక్షణాలు కొన్ని ఉన్నవి. స్వవంశవివాహం, అనేది, వీటిలో ప్రధానమైనది. వివాహసంబంధాలకు యోగ్యమైన, సమాజమండలానికి, కులము, అవధులను ఏర్పరచింది. ఈ మండలాన్ని దాటి సంబంధం ఏర్పరచుకోవడం నిషిద్ధం. కాని, కులాలు, అసంఖ్యాకములైన ఉపకులాలుగా విభక్తములైనవి. హిందువుల అసాధారణమైన ప్రతిభ, సమాజాన్ని పరమాణుస్థితికి విభజించి వేయడంలో ప్రత్యేకమైన సంతోషాన్ని అనుభవించినట్లు తోస్తుంది. ఎంతటి చిన్న విషయమైనా సాకుగా తీసుకొని, ప్రతివర్గాన్ని, చిన్నచిన్న ముక్కలుగా చీల్చివేసినారు.

జాతులను, జనజాతులను, ఆర్థికరాజకీయ వ్యవస్థలను, మతశాఖలను, ప్రాంతాలను సంబంధించిన కారణాలను ఆధారంగా చేసుకొని, ఉపకులాలను ఏర్పరచిరి. శిల్పకర్మ ప్రక్రియలోకాని, వృత్తిలో, లేక, నివాసస్థలంలో కాని, మార్పుకలిగిన సందర్భాలను పురస్కరించుకొని కూడా, నూతన ఉపకులాలను ఏర్పరుస్తూవచ్చిరి. జాతిసంకరం (Miscegenation) వల్ల జనించిన సంతానం కూడా ఈ ఉపకులాల సంఖ్యను పెంచుతూ వచ్చింది. విలక్షణ ఆచారాలూ, విచిత్రములైన ప్రవర్తనలూ కూడా సంఘఛిద్రానికి కారణములైనాయి,

పెక్కుమంది విదేశీయులకు కూడా, కులవ్యవస్థలో, ప్రవేశం లభించింది. శకద్వీపీ బ్రాహ్మణులు, సిథియను జాతికి చెందినవారని ఊహింపబడినది.

మాఘ్, నాగర్, కర్హదా, హవిక్ బ్రాహ్మణులు కూడా, విదేశజాతులనుంచి వచ్చిచేరిన వారై ఉందురు. ద్రవిడబ్రాహ్మణుల ఉత్పత్తిలో కూడా ఒక జాత్యంశం ఉండవచ్చు. శిరస్సు యొక్క ఆకారము, దేహవర్ణము, కన్నులతీరు, మొదలైన లక్షణాలలో, మహారాష్ట్ర ప్రాంతపు చిత్పావన్ బ్రాహ్మణులు, పంజాబ్, ఉత్తరప్రదేశాల బ్రాహ్మణులకు భిన్నులైనవారు. పూర్వము అనార్యజాతులుగా పరిగణింపబడిన ముండా, సంథాల్, ఓరాన్, జనజాతులవారు, కాలాంతరంలో, కులవ్యవస్థలో కలిసిపోయిరి.

జనజాతిపేర్లపై ఏర్పడిన కులాలూ, ఉపకులాలూ అసంఖ్యాకాలు. అహీర్, గుజార్, జాట్, మరాఠా, భిల్‌దోమ్, గోండ్, కులాలు దీనికి ఉదాహరణలు. కరన్, కాయస్థ, రాజపుత్ర, అనేవి ప్రధానంగా రాజకీయకులాలు. రాజపుత్రులు పరిపాలనాధికారం వహిస్తుండగా. తక్కిన రెండు కులాలవారూ చిన్న ఉద్యోగాలను నిర్వహించేవారు. ఋగ్వేదీ, అధర్వవేదీ, యజుర్వేదీ, సామవేదీ, ఏక్‌నాథీ, స్మార్త, వైష్ణవ, ఇత్యాది బ్రాహ్మణవర్గాలూ,-లింగాయతులు, వైష్ణవీలు, కబీర్ పంథీలు, షట్‌నామీలు, శాక్తులు, మొదలైన కులాలూ, శాఖా భేదాలనుబట్టి ఏర్పడినవి. భూభాగ విభజన ఆధారంగా, పెక్కు ఉపకులాలు ఉత్పన్నమైనవి. కనౌజియా, శార్వరీయ, సారస్వత, కొంకణస్థ, దేశస్థ, నాగర్, ఓస్వాల్, శ్రీమాలి, సోర్థియా, రార్హి, బరేంద్ర వలనాడ్, వంగినాడు, కనక, కమ్మ, వైదిక, ఇత్యాదులు బ్రాహ్మణ వర్గంలో ఏర్పడిన ఉప కులాలకు ఉదాహరణలు. నగర, గ్రామ, పట్టణ, జిల్లాల పేర్లను వహించిన ఉపకులాలు అనేకములు, వైశ్యులలోను, శూద్రులలోను, కలవు.

విలక్షణ ఆచారాలు, విచిత్రప్రవర్తనలు, లేదా వృత్తి, అనేవి కారణాలుగా ఏర్పడిన ఉప కులాలకు, పురాణియాలు, లేక, జూతియాలు, ఉదాహరణ. బాసార్లకు, అహీర్ ఆయాల

యందు జనించిన సంతానం వీరు. ఆవు చుట్టలను కాల్చేచంగియా చమార్లు, పందులను అమ్మే సువర్ణాలు, [ఏరు, ధీమార్ కులమునకు చెందిన ఉపకులము], గుజరాత్ కంభారులు, జారజులైన (Bastards) వాటాలియాలు,- మరికొన్ని ఉదాహరణలు.

ముషార్లు [ఎలుకలు తినేవారు] నిమ్నజాతికి చెందిన ఆదిమవాసులు. ధూలియాలు [జ్ఞాపకశక్తిలేనివారు] సాతెపులంలోని ఉపకులానికి చెందినవారు. దుబ్లాలు, [దుర్బలులు] గుజరాతు ఆదిమవాసులలో ఒక భాగం. కళ్ళన్‌లు [దొంగలు] తియాన్‌లు [దక్షిణదేశీయులు], పరయాలు [డప్పులు వాయించేవారు], విచిత్రకర్మలకు చెందిన ఉపవర్గాలు.

కులాలకు, ఉపకులాలకు సంబంధించిన రెండవ ముఖ్య లక్షణం, ఉపజీవిక. భారతదేశ కులవ్యవస్థ, ఉపజీవికపై ఏర్పడిందని, కొందరు మానవ విజ్ఞానశాస్త్రజ్ఞుల అభిప్రాయం. వేదములో సూచింపబడిన నాలుగు వర్ణాలూ, కర్తవ్య నిర్వహణానికి సంబంధించినవి. దైవ ప్రార్థనకు సంబంధించిన కార్యనిర్వహణం, బ్రాహ్మణుల కర్తవ్యం. రాజ్య పాలన నిర్వహణం క్షత్రియుని కర్తవ్యం సమాజానికి అవసరమైన పదార్థఉత్పాదన వైశ్యుని కర్తవ్యం. శూద్రునిది సేవాధర్మం.

ఈ చతుర్వర్ణాలు మాత్రమేకాక, ఉపజీవికలకు సంబంధించిన వర్గాలు కూడా, ప్రాచీన కాలము నుంచీ వచ్చినవే. ఇవి, రాను రాను, సజాతీయ వివాహసంబంధాలు గల కులాలుగాను, ఉపకులాలుగాను, ఏర్పడుతూ, వచ్చినవి. జన్మనుబట్టి, వృత్తి నిశ్చయం కావడానికి, ఈ పద్ధతి కారణముయింది. వృత్తి ఆధారంగా ఏర్పడిన కులాలూ, ఉపకులాలూ, అనంతములు. వృత్తుల ప్రక్రియలోనూ, కౌశలంలోనూగల అల్పభేదాలను పురస్కరించుకొనికూడా, ఈ వృత్తివర్గాలను చిన్న చిన్న ముక్కలుగా విభజిస్తూ రావడమూ, ఇట్లు విభజింపబడిన వివిధవర్గాల మధ్య వివాహ సంబంధాన్ని నిషేధించడమూ,-అనే విషయం అత్యాశ్చర్యకరమైనది.

చర్మవృత్తిని చేసే చమారులు ఇందుకొక నిదర్శనం. అనేక ఉపకులాలతో ఏర్పడింది ఈ వర్గం. నివాసభూములకు, ప్రాంతాలకు సంబంధించిన విభాగాలు అనేకములున్నాయి. కాని, చర్మకారకర్మకు సంబంధించిన ప్రత్యేక ప్రక్రియలనుబట్టి కూడా అనేక ఉపకులాలు ఏర్పడినవి తోలుతో నూనెసంచులను చేసేవారు బుదల్‌గీరులు. గుర్రపుజీనులు తయారుచేసేవారు జింగార్లు. చర్మాన్ని ముక్కలుగాకోసేవారు కట్వాలు.ఇదేవిధంగా, వెదురుకర్రలతో చేపలనుపట్టే బిన్నియాలు, గ్రాళ్ళసాధనాలతో చేపలుపట్టే బంధాయియాలు, ధీమార్లు అనే బేస్త కులంలోనివారు. తోటమాలీలు కూడా మూడు ఉపకులాలుగా ఏర్పడినారు. పువ్వులను పెంచే ఫూల్‌మాలీలు, జిలకరను పండించే జీరామాలీలు, పసుపు పండించే హల్దామాలీలు, వేర్వేరు వర్గాలవారు. వేయించిన పప్పుదినుసులను అమ్మే ధూరియాలు, కాచు తయారుచేసే ఖైరాలు, ఉప్పు శుభ్రపరిచే లోణ్‌హరాలు, గొర్రెలుపెంచే మెంధేలు, ఎనుములు కాచేఘ్షస్కాలు, పాటగాండ్రైన వజంతరీలు, పాములుపట్టే మాంగ్-గారుడీలు,- మొదలైన వారంతా ఉపకులాలుగా ఏర్పడిరి.

కాని, కేవల ఉపజీవికపై ఆధారపడిన వర్గాలవల్లనే, కులవ్యవస్థ ఏర్పడిందనడం తప్పు. ఇతర కులాలు అనేకములు ఒకే ఉపజీవికను అవలంబించినవి. అట్లే, ఒకే కులంవారుకూడా పెక్కు ఉపజీవికలను అనుసరిస్తున్నారు. ఐనా, ఉపజీవికలు, సాధారణంగా, వంశానుగతంగా

ఏర్పడతాయి అనడం, వాస్తవం.

వర్గాలకూ, ఉపవర్గాలకూ సంఘంలోగల స్థానాన్ని, శ్రేణీ బద్ధమైన క్రమంలో, కుల వ్యవస్థ స్థిరపరచింది. ఇది ఈ వ్యవస్థయొక్క మూలలక్షణం. సంఘంలో వ్యక్తికిగల స్థానము, అతని హక్కులు, ధర్మాలు, ఈ విధంగా నిశ్చయింపబడినవి. వ్యక్తులను, వర్గాలను, వింగడించి, యోగ్యతను అనుసరించి, వాటి స్థానాలను నిశ్చయించడానికి జరిగిన ప్రయత్నమే, శాస్త్రాలలో ఉద్దిష్టమైన, చతుర్వర్ణ విభాగం. కాని, ఆదర్శప్రాయమైన ఈ విధానం, వాస్తవపరిస్థితులతో అన్వయించడంలేదు. బ్రాహ్మణులు ఉన్నతోన్నతమైన వర్గంగానూ, అస్పృశ్యులు నిమ్నోన్నత వర్గంగానూ, సార్వత్రికంగా అంగీకరింపబడినారేతప్ప, ఇతర వర్గాల విషయంలో ఈ విధానం అన్వయించడంలేదు. కాని ఈ రెండుకులాలకూ మధ్యస్థమైయున్న కులాలకూ, ఉపకులాలకూగల పరస్పర స్థానవిషయంలో, ఏకప్రకారత భిన్న ప్రాంతాలలో లేదు.

సంఘంలో, వ్యక్తికిగల స్థానాన్ని మాత్రమేకాక, మత విశ్వాసాలనూ, పద్ధతులనూ కూడా, కులం నిశ్చయించింది. స్మార్తులు, శైవులు, శాక్తేయులు, దక్షిణ మార్గానుగాములు, వామభాగానుగాములు, అని బ్రాహ్మణులు విభజింపబడిరి. క్షత్రియులలో కూడా ఇట్టి విభాగము లుండినవి. కాని, అట్టి విషయాలలో, కుటుంబ సంప్రదాయము, లేక, వ్యక్తి ప్రవృత్తి పరిగణింపబడింది. ఐనా, ద్విజేతర వర్గాలలో, దేవుళ్ళు, దేవతలు, (గ్రామ దేవతలు), పూజా విధానాలు, కర్మలు, మొదలైనవి చాలవరకు, ఆ వర్గానికి ప్రత్యేకంగా సంబంధించినవి పూజా విధానంలో గల ఈ వైవిధ్యం కులాలకూ, ఉపకులాలకూ గల భేదాలను, మరింత తీవ్రంగా చేసింది. కులము-ఉపకులము, పౌరస్థానము-మతస్థానము, ఉపజీవిక, సాంఘిక సంబంధము, వివాహము, అన్నపానీయాలు,-ఇత్యాదులన్నీ, కుల-ఉపకులాలనే కట్టులో, బంధింపబడినవి. ఈ విషయంలో నియమాలు, వినియమాలు, కొంతవరకు మత సంబంధమైన స్మృతి గ్రంథాల నుంచీ, కొంతవరకు ఆచారసంప్రదాయాల నుంచీ, గ్రహింపబడినవి.

నియమాలను వర్తింప చేయడానికీ, కులనిర్బంధాలను ఆచరింపచేయడానికీ, నిమ్న జాతులు ఒక సమితినీ, ఒక ఉపసంఘాన్నీ, ఒక ముఖ్యస్థుని (Headman), నియమించుకొని ఉండిరి. శాశ్వత సమితి, ప్రజాప్రతినిధి సంఘం. దీనిలోని ప్రతినిధులందరూ, కుటుంబయజమానులు కాని, లేక, అనుభవమూ, వయస్సూ కలవ్యక్తులుకాని, ఐ, ఉండిరి. సభావ్యవహారాలను, పర్యాలోచనలను నిర్దేశించడానికి, ఒక సమితి ఏర్పడియుండేది. ఇది, ఐదుగురు సభ్యులతో కూడిన చిన్న సంఘం. దీనిని పంచాయత్ అని వ్యవహరించేవారు. ఇది, కార్యాచరణకు ఎప్పుడూ సిద్ధంగా ఉండి, అవసరమైన సందర్భాలలో, పెద్ద సభను వెంటనే సమావేశపరిచేది.

వంశానుక్రమంగా కాని, లేక, ప్రత్యక్ష ఎన్నికల ద్వారా కాని ఏర్పడిన ముఖ్యస్థుడు ఈ సమితికి అధ్యక్షుడు. ఈ పదవికి, చౌదరీ, ప్రధాన్, లేక, సర్‌పంచ్, అని బిరుదు ఉండినది. నయీబ్, దివాన్, ముఖ్తార్, అనే అధికారులలో ఒకరిద్దరు ఇతనితోచేరి వ్యవహారాలను చూచేవారు. సమితిలోని ఇతర సభ్యులు కూడా, వంశానుగతంగా వచ్చినవారో, లేక, ఎన్నికలద్వారా వచ్చినవారో, ఐ, ఉండిరి. ఇట్లు, ఎన్నికలద్వారా వచ్చినవారి సభ్యత్వం, వారి జీవితకాలానికి పరిమితమైనది. ఐనా, అప్పుడప్పుడు, అవసరాన్నిబట్టి కూడా, సభ్యు

లను ఏరుకునేవారు. ముఖ్యస్థుని అధికారచిహ్నం, తలపాగా; సంప్రదాయానుసారంగా దీనిని అతని తలకు చుట్టేవారు.

ఒక ప్రదేశానికీ, గ్రామానికీ, పట్టణానికీ, లేక, జుహార్, తాల్, ఖాతే, అని వ్యవహరింపబడే నగరభాగానికీ, చెందినట్టి సజాతీయ వివాహవిధానాన్ని పాటించే ఉపకులము యొక్క, శాశ్వతవ్యవస్థ పంచాయత్. ఉపకులాల పరస్పర వ్యవహారాలను విచారించడానికై, కొన్ని సందర్భాలలో, రెండుమూడు పంచాయతులు ఒకచోట సమావేశమయ్యేవి.కాని, కులాని కంతటికీ వర్తించే, సమితికాని, పంచాయత్‌కాని ఏర్పడి ఉండలేదు.

పంచాయత్ యొక్క అధికారపరిధి విస్తృతమైనట్టిది. "కులసంబంధమైన సాంఘిక ఆచారాన్ని అతిక్రమించడం, నైతిక విషయమైన అతిక్రమణము, కులనియమాలను పాటించక పోవడము, మతసంబంధమైన అపరాధాలు, కుటుంబవివాదాలు, దాంపత్యఅధికారానికి (Conjugal rights) సంబంధించిన వ్యాజ్యాలు, వివాహసంబంధమైన వచనభంగము, ఈడువచ్చిన పిల్లను కాపురానికి పంపకంలో తాత్సారముచేయడము,- ఇటువంటి వ్యవహారాలన్నీ, పంచాయత్ విచారించేది. అంతేకాక, దేశపు ప్రభుత్వ న్యాయపరిపాలన కిందికి వచ్చే విషయాలను కూడా, అప్పుడప్పుడు పంచాయతి విచారించేది. వ్యక్తిగతమైన దౌర్జన్యము, అప్పులు, వ్యాపారసంబంధమైన వివాదాలు,- మొదలైన సివిల్, క్రిమినల్ వ్యాజ్యాలు ఈ వర్గానికి చెందినవి".

తన నిర్ణయాలను అమలుజరపడానికై, కొన్ని ఆంక్షలు విధించే అధికారం, పంచాయతికి కలదు. జరిమానాలు విధించడము, సంఘమువారికిగాని, బ్రాహ్మణులకుగాని, విందు చేసిన ఆ ఖర్చును దోషిపై మోపడము, తాత్కాలికంగాకాని, లేక, శాశ్వతంగాకాని కులము నుంచి బహిష్కరించడము,- మొదలైనవి పంచాయతి అధికారంలోఉన్న ఆంక్షలు. (Sanctions). కొన్ని సందర్భాల్లో, పుణ్యస్థలాలయాత్ర, భిక్షాటనము, లేక, ఏదో విధమైన అవమానము,- అనే శిక్షలు కూడా విధింపబడేవి.

ఉన్నత కులాలవారికి, ముఖ్యంగా బ్రాహ్మణ క్షత్రియులకు, శాశ్వతమైన కులప్రభుత్వ సాధనం ఏర్పడలేదు. ప్రాచీన కాలంలో చక్రవర్తి, వర్ణాశ్రమధర్మానికి రక్షకుడు. మధ్య యుగకాలాల్లో, హిందూ రాజులు పరిపాలించిన ప్రాంతాలలో, వర్ణాశ్రమ ధర్మరక్షణ, ప్రభుత్వకర్తవ్యమై ఉండింది. మహారాష్ట్ర ప్రభుత్వం ఇతర రాజ్యాల వ్యవహారాలలో, కలుగ జేసుకొని, కులవ్యవస్థకు సంబంధించిన న్యాయాన్ని నిలబెట్టిన సందర్భాలు, అనేకములు. కాని, ఈ విషయంలో, ప్రభుత్వముయొక్క అధికారపరిధి, ఉన్నత కులాలకు మాత్రమే వర్తించింది. తక్కువ కులాల వారి నియమాలను, సంప్రదాయాలను పాటింపచేయడానికీ, అవి అతిక్రమింపబడినప్పుడు జోక్యం కలుగ చేసుకోడానికీ, ప్రభుత్వం పూనుకొన్న సందర్భాలు అత్యల్పం. ఈ కులాల విషయంలో ప్రభుత్వం ఆసక్తి వహించలేదు.

సమాజాన్ని రెండు వర్గాలుగా విభజించిన కుల వ్యవస్థకు ఆకాలపు రాజకీయ విధానము, వాస్తవంగా, ఔపచారికమై ఉండింది. అల్పసంఖ్యాకమైన, ఉన్నత కులాల అధికారము, లేక అల్పజన పరిపాలన (Oligarchy) ఒక వర్గము. ప్రజానీకము, లేక, తక్కువ కులాలతో కూడిన అధిక సంఖ్యాకమైన పాలిత వర్గము, రెండవది. ఈ రెండవ వర్గాన్నే, చరిత్రకారుడైన, టాయిన్‌బీ (Toynbee) శ్రామిక వర్గము (Proletariat), అని

వ్యవహరించినాడు. ఏకస్వామ్యమైన పరిపాలనాధికారం, మొదటి వర్గంయొక్క చేతుల్లో ఉండేది. విజ్ఞానం కూడా వారి ఏకైక స్వామ్యమే. బ్రాహ్మణులది, విద్వాంసులవర్గం. న్యాయ శాస్త్రంలోని నియమాల అర్థజ్ఞానము, ఆయా అపరాధాలకూ, నేరాలకూ, విధింపబడిన దండనల పరిజ్ఞానముగల వ్యక్తులే, సమస్యల విషయంలో నిర్ణయాన్ని ఇవ్వడానికి సమర్థులు. కనుక, న్యాయశాస్త్ర న్యాయ నిర్ణయాలు విద్వాంసుల అధీనంలో, నిలిచిపోయినవి. శాస్త్రికి, లేక, పండితునికిగల ప్రతిష్ఠ, అతని నిర్ణయాలను, అమలు జరపడానికి ఆధారమైనది. అతని నిర్ణయాన్ని ప్రజాభిప్రాయం తప్పకుండా బలపరచేది.

శివిల్ న్యాయపరిపాలన సర్వస్వమూ, దండనాధికార పరిపాలనలో కొంతభాగము, బ్రాహ్మణునికి సంబంధించిన వ్యవహారాలు. ఇండియాలో బ్రిటిష్‌రాజ్యము ఏర్పడేవరకూ, ఈ పరిస్థితులే హిందూసంఘము యొక్క విషయంలో వర్తిస్తూ వచ్చినవి. మతము ఆధారంగా రచింపబడిన ధర్మశాస్త్రసంహిత ఉండడంవల్ల, కులానికీ, వ్యక్తిగత అపరాధాలకూ, సంబంధించిన విషయాలను చర్చించే ప్రజాప్రతినిధి సభలనుగాని, సలహా సభలనుగాని, అవసరం లేకపోయింది. ఐనా, కులసమావేశాలకు అవకాశం మరొకమార్గంలో ఏర్పడింది. మత సంబంధమైన ఉత్సవాలూ, హరిద్వార్, ప్రయాగ్ మొదలైన పుణ్యక్షేత్రాలలో జరిగే స్నాన సందర్భాలూ, ఇట్టి సమావేశాలను అనుకూలించినాయి. కాశీవంటి ప్రసిద్ధ మతకేంద్రాలలోని ప్రఖ్యాత పండితుల సలహా తీసికోవడం కూడా సాధ్యమయింది.

బ్రాహ్మణులపై పడిన బాధ్యత అపారమైనట్టిది. కేవలం, సంఘముయొక్క ఆధ్యాత్మిక, నైతికశ్రేయస్సు మాత్రమేకాక, సామాజికవ్యవస్థను అవిచ్ఛిన్నంగా, సుసంబద్ధంగా నడిపే బాధ్యత కూడా వీరిపై ఉండింది. దురదృష్టవశాత్తూ వీరు ఈ కర్తవ్యాలను చక్కగా నిర్వహించలేకపోయిరి. ఐనప్పటికీ, తప్పును వీరిపైమాత్రమే మోపలేము. కులవ్యవస్థలోనే నిహితమైఉంది, ఈ దోషం.

ప్రత్యేకత, అనేది కులవ్యవస్థయొక్క ప్రధానలక్షణం. హిందూసమాజ వ్యవస్థను సమర్థించేవారూ, తాత్త్వికులూ ఏమి చెప్పినప్పటికీ, ఈ వ్యవస్థ సమాజాన్ని ఛిద్రంచేయడానికి ప్రాధాన్యమిచ్చిందేకాని, సంయోజనపరచడానికి కాదు. సామాజిక ఐక్యాన్ని నిరోధించే వర్గాలుగా, అది ప్రజానీకాన్ని ఛిద్రంచేసింది. సమాజములోని ప్రతిభాగమూ, తన పరమాణు ప్రత్యేకతలో బ్రతుకుతూ వచ్చింది. ఈ భాగాలను చేర్చి, విడదీయరాని ఒక అఖండ వ్యక్తిగా చేయగల తంతువులు అత్యల్పములు, భంగురములు.

వేదమతానికి ఆశ్రయమైన వారు బ్రాహ్మణులు. కాని, ఇతరమతాల వలెకాక, బ్రాహ్మణులు తాము మాత్రమే మతానికి పీఠాధికారులమనీ, అనుష్ఠాతలమనీ, విర్రవీగసాగిరి. మతముయొక్క హేతవాదాలను, సిద్ధాంతాలను, ధర్మశాస్త్రాలను, అధ్యయనంచేసి పరిశీలించడమూ, దాని సంస్కారాలను, కర్మలను, నిర్వహించడమూ తమకర్తవ్యమని తలచిరేకాని, వీటికి ఇతర కులాలు అనుగుణంగా ఉన్నారా, లేదా, అని పట్టించుకోలేదు. సంస్కారాలకు, కర్మలకు, సంబంధించిన నిర్వహణము, మత సిద్ధాంతాలకు సంబంధించిన శిక్షణమూ,- అనే బాధ్యతలను, బ్రాహ్మణులు ఆయాకులాలకే, వదలిపెట్టిరి. ఆరాధనలోను, సంస్కార ఆచరణలలోనూ, పురోహిత కార్యాలను మాత్రమే వీరు నిర్వర్తించిరి. సాంఘిక నియమాల విషయంలో కాని, పూజా విధానానికి చెందిన సూక్ష్మాంశాల విషయంలో కాని, ఏమాత్రము

వ్యత్యాసాన్ని సహించనంతటి సంప్రదాయ రక్షకులుగా, బ్రాహ్మణులు ప్రవర్తించిరి. ఆధ్యాత్మిక పరిణామములోని వివిధ దశల ఛాయలను గుర్తులుగా చూపి, భిన్న కులాలను వర్తించదగిన వివిధ ప్రమాణాలను సూత్రీకరించి, ప్రజానీకము చేసిన ఒత్తిడిని అడ్డుకొనిరి. వైదిక సంస్కారాలూ, యజ్ఞ నిర్వహణమూ, బ్రాహ్మణులకు ప్రత్యేకించబడినవి. పురాణాలలో వివరించబడిన మతము, ఇతర కులాలకు చాలునని నిర్ణయించిరి. మొదట బౌద్ధమతము, తర్వాత ఇస్లాము, ఈ బ్రాహ్మణ వ్యవస్థను ఎదుర్కొనడంతో, ప్రఖ్యాతులైన ఆచార్యులు ప్రేమ సిద్ధాంతాన్ని, భక్తి సిద్ధాంతాన్ని అభివృద్ధికి తెచ్చిరి. కాని ఈశ్వరునియందు పరాను రక్తి, అనే భక్తి మార్గం, ఉన్నత వర్గాలవారికే, శరణాగతులనే ప్రపత్తి మార్గం తక్కువ వర్గాలవారికీ ప్రత్యేకించబడెను. వ్యక్తియొక్క ఇష్ట దైవమునకు-(రామ, కృష్ణ, ఇత్యాది), సంబంధించిన భక్తికి బ్రాహ్మణ మతబోధకులు ప్రాధాన్యమిచ్చిరి. నిర్గుణుడు, నిరాకారుడు, అను పరమ పురుషుని దయను సంపాదించడంవల్లనే, వ్యక్తికి విమోచన లభిస్తుందని, కబీర్, నానక్, దాదూ, వంటి ఇతర మత సంస్కర్తలు, సాధువులు, బోధిస్తూ వచ్చిరి. పూజా విధాన సాంఘిక వ్యవస్థ విషయాల్లో బ్రాహ్మణ మతస్థులు ప్రాచీన సంస్కార వాదులు; కుల వ్యవస్థలోని ప్రతిమారాధన విగ్రహారాధనలను, బాహాటంగా నిరసించి ఖండించేవారు, సంస్కర్తల వర్గంవారు.

ఉత్తమ మతతత్త్వమూ, జ్ఞాన మార్గమూ, ఉన్నత కులాలవారు తమకై సురక్షితం చేసుకొన్న స్వత్వం. అధ్యయనం చేయడము, ఇతరులకు బోధించడము వారి ఉపజీవిక. కాని అజ్ఞాన, అంధవిశ్వాసములు అనే బురదలో ఇతరులు ప్రాకులాడుతూ ఉండగా, వారి విషయాన్ని పట్టించుకొన్నవారులేరు. నైతిక మత విషయాల్లో సర్వులకూ సమానములైన ప్రమాణాలను ఏర్పరచడానికిగాని, నడపడానికిగాని, ఎట్టి ప్రయత్నమూ జరగలేదు.

ప్రజలు హిందూమతాన్ని వదలి, ఇతరమతాల్లో చేరుతున్న సందర్భాలలో, బ్రాహ్మణ మతం ఏమీచేయలేక, తన నిస్సారతను ప్రదర్శించడం అత్యంతమైన దౌర్భాగ్యం. ఈ మత పరివర్తనలకు మూలకారణము లెట్టివో గమనించడానికి కూడా ప్రయత్నించలేదు. అధోగతిలో ఉన్న వారి విషయంలోనూ, నలిగిపోయిన వారి విషయంలోనూ, వీరికి సానుభూతి లేక పోయింది. నిజమైన జ్ఞానజ్యోతిని ప్రసరింపచేసి, భ్రాతృత్వభావాన్ని బలపరిచే ఉద్యమానికి, పూనుకోలేదు. ప్రాచీన జీవనపద్ధతులను విస్మరించినవారికి, వాటిని బోధించే ప్రయత్నం కూడా జరగలేదు. పరిస్థితుల ప్రాబల్యానికిలోనై, గత్యంతరంలేక, తమ ఇష్టానికి విరుద్ధమైనా కూడా, ఇతర మతాలలో కలిసిపోయి, మళ్ళీ హిందూమతంలో చేరడానికి ఇష్టపడుతున్నవారిని, చేర్చుకోడానికి కూడా, బ్రాహ్మణమతస్థులు నిరాకరించిరి.

ఐతే, ఇక క్షత్రియులస్థితి ఎట్టిది? బ్రాహ్మణ వీరుడైన పరశురాముడు ఇరవైయొక్క సార్లు (21) క్షత్రియ సంఖ్యలో పదోవంతును సంహరించినాడని, ఐతిహ్యమున్నది. ఈ కథ యొక్క నిజానిజాలను నిశ్చయించడానికి తగిన చారిత్రక సాక్ష్యం, లభ్యంకాలేదు. కాని, మౌర్యుల పతనానంతరం, ప్రాచీన క్షత్రియ వంశాలకు చరిత్రలోగల పాత్ర, క్రమంగా, తగ్గుతూ వచ్చింది. ఆపై, ఆరోశతాబ్దంలో రసపుత్రులు ఒక్కసారిగా రంగంలో ప్రవేశించి, అల్పకాలంలోనే, సింధుగంగా ప్రాంతాన్ని (బెంగాలు తప్ప), మధ్యమోన్నత భూములనూ, సమగ్రంగా వ్యాపించిరి. ఈ ఉద్యమ విషయమై, తృప్తికరమైన సమాధానం, ఇంతవరకు

రాదు. ఈ జాతియొక్క ఉత్పత్తి క్రమం ఎంతవరకు విదేశీయమైనది, లేక, ఎంతవరకు దేశీయాంశాలతో జరిగింది, అనే విషయాన్ని నిర్ణయించడం సాధ్యంకాదు. జాట్లతోను, గుజార్లతోను వీరికిగల సన్నిహిత సంబంధమూ, జాతిలక్షణాల విషయంలో వీరికిగల పరస్పర సర్వసామ్యమూ,- అనే వాస్తవ విషయాలు, ఈ సమస్యను మరింత జటిలంగా, చేస్తున్నాయి.

రాజపుత్రులు, కులవ్యవస్థలో చక్కగా ఇముడుతుంటారు. సంప్రదాయాన్ని అనుసరించి, వీరు ముప్పైఆరు వంశాలుగా, లేక, కుటుంబాలుగా విభజింపబడినారు. ఇవన్నీ కూడా, సూర్య వంశ, చంద్రవంశ, అగ్నికుల, అనే మూడు శాఖలకు చెందినట్టివి. రాజపుత్ర జాతులన్నీ సజాతీయ వివాహ విధానానికి బద్ధములైన ఒక వర్గంగా ఏర్పడుతున్నవి; కాని, ఇతర హిందూ ఉపకులాలకు వ్యతిరేకంగా, వీరి విభాగాలు భిన్నగోత్ర వివాహ పద్ధతిని అనుసరిస్తాయి. అంతే కాక, వీరిలో అంతర వివాహ విధానం (Hypergamy) వ్యాప్తిలో ఉంది. ఈ విధానాన్ని అనుసరించి, కన్యను తలితండ్రులకు సమానమూ, లేక ఉన్నతమూ ఐన ప్రతిష్ఠ గల కులంలోని వరునికిచ్చి వివాహం చేయవలసి ఉంటుంది.

స్మృతి గ్రంథాలలోని నిబంధనలను అనుసరించి, సామాజిక వ్యవస్థను నడపడం క్షత్రియ పరిపాలకుని కర్తవ్యమని హిందూన్యాయశాస్త్రం విధించింది. హిందూ చక్రవర్తులు, రాజులు ఇండియాను పరిపాలిస్తూ ఉన్న ప్రాచీన కాలంలో, ప్రభుత్వాధికారాన్ని ప్రయోగించి, కులనియమాలను సక్రమంగా నడపడం, సాధ్యమయింది. ముస్లిములు ఇండియాను జయించిన తర్వాత కూడా, స్వతంత్రములై నిలిచిన హిందూరాజ్యాలూ, సంస్థానాలూ, కులవ్యవస్థను రక్షించడంలో సమర్థములై ఉండినవి. కాని, ముస్లిమ్ ఆధిపత్యం దేశంలో అధికభాగంపై ఏర్పడడంతో, కులవ్యవస్థకు ఇంతకుపూర్వం ఉండిన రాజకీయ మూలాధారం, లోపించి పోయింది. రాజపుత్రనాయకులు ముస్లిముల సామంతస్థితికీ, లేక, జమీందారీస్థితికీ, దిగిపోయిరి. ముస్లిమ్ పరిపాలకులు హిందూ సమాజ వ్యవస్థలో ఆసక్తి చూపినవారు కారు. ఈ విధంగా. రక్షక శక్తి, నిర్దేశక శక్తులు లోపించడంతో కుల వ్యవస్థ సంక్షోభమూ, ఒత్తిడికీ లోనయింది. కనుక ఆత్మరక్షణ అనే సహజ ప్రవృత్తియొక్క ప్రాబల్యానికిలోనై, కులవ్యవస్థలోని వర్గాలు, నడలని అచ్చులవలె, బిగిసిపోయినవి.

స్వయం పోషకములైన అణువువంటి చిన్న భాగాలుగా సమాజము ఛిద్రమైపోవడము, ఇవ స్వభావాన్ని పొందడము, అనే పరివర్తనం ముస్లిములు దేశాన్ని జయించక పూర్వమే జరిగిపోయింది. వీటిని ఒకటిగా కూర్చగల, సనంజక శక్తులు (Cohesive forces) చాల వరకు లోపించినవి. ప్రాంతీయత, స్థానికత, భాషాసంబంధమైన ప్రత్యేకత, కార్యాత్మక వివిక్తత, (functional isolationism), శాఖీయత, మొదలైన అపసరణ, విక్షేపణ శక్తులన్నీ (Divergent and dispersive forces) ప్రజలభావాలపై, ఆధిపత్యం వహించినవి. అరాజకతా ప్రాబల్యంవల్ల ఉపకులముయొక్క స్వాయత్తాధికారం, పరిమితమైపోయింది. వేలకొలది చిన్న చిన్న వర్గాలు స్వయంపోషక భాగములై పోయినవి. సమాజ సర్వస్వముయొక్క శ్రేయస్సు విషయంలోకాని, దాని దురవస్థల విషయంలోకాని, ఈ భాగాలు, ఏ మాత్రమూ ఆసక్తివహించలేదు. కులవ్యవస్థ, ఈ విధంగా సమాజశ్రేయస్సుయొక్క దిగంత వ్యాప్తిని అత్యంతమూ సంకుచితపరచి, వర్గానికీ, ప్రదేశానికీ బాహ్యములైన వ్యవహారాలపట్ల

ఉదాసీనభావాన్ని, ఔదాసీన్యాన్ని కలిగించడానికె ప్రేరకమయింది. శత్రువుల దండయాత్రల నుంచి సమాజాన్ని రక్షించడము, దేశంలో క్రమవ్యవస్థను రక్షించడము, అల్పసంఖ్యాకులైన యుద్ధకులాలవారి బాధ్యతగా నిర్ధించినవి. కాని, జీవన-మరణ పరిణామానికి సంబంధించిన ఈ విషయంలో అతివిస్తృతమైన సమాజభాగం ఏ విధంగానూ పాల్గొనలేదు; ఆసక్తి కూడా వహించలేదు.

## V. జనజాతులు

కులవ్యవస్థలో, నిహితమైఉన్న, సామాజిక అస్తవ్యస్తతను మరింత తీవ్రమొనర్చినవి, జనజాతులు.

అంతర్వివాహాలు, కలిసి భుజించడం, [కొంతవరకు] వృత్తి, సాంఘికస్థానము,- మొదలైనవాటిని, వినిమయపరచడానికి ప్రాధాన్యమిచ్చిన సమాజవర్గీకరణమే, కులము. జనజాతుల విషయంవేరు. పరస్పర బాంధవ్యము, సమానమైన వంశము, అనేవాటిపై ఏర్పడి ఉన్నప్పటికీ, రాజకీయ కార్యకలాపాలతో ఎక్కువ సంబంధం కలిగినట్టిది, జనజాతివిధానం. కలహాలు, యుద్ధాలు, భూమిని ఆక్రమించుకోవడం, రాజ్యసంపాదన, రాజ్యరక్షణలు, ఆస్తి సంపాదన, మొదలైనవి, జనజాతి కార్యక్రమాలు. కులాలకంటె, జనజాతులు భూభాగాన్ని ఎక్కువగా, అంటిపెట్టుకొని ఉంటారు.

ఆదిలో, ప్రతి ఆర్యజనజాతి, చతుర్వర్ణాలతో ఏర్పడి ఉండిందా, అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం. కాని, తరువాతికాలంలో, అనేకకులాలతో ఏర్పడిన జనజాతులు ఉండినవని తెలుస్తుంది. పంజాబులోని జాటువర్గంలో, మాలీలు, భాటియారాలు, జూలహాలు, తేలీలు, చమ్రాలు, దర్జీలు, ధోబీలు, తర్ఖానులు, దోమ్‌లు, రాజపుత్రులు, కహార్లు, కుమ్హార్లు, కలాల్‌లు, గుజార్లు, లోహార్‌లు, మల్లాహలు, మోచీలు, మచ్ఛీలు, సయీలు, మొదలైన ఉపకులాలు ఉండడం ఇందుకు నిదర్శనం. బొంబాయిలోని గుజార్ జనజాతిలో, దర్జీలు, సోనీలు, సుతార్లు, చమార్లు, ధేడ్‌లు, కుంభార్‌లు, వనియాలు, చేరిఉన్నారు. ఖాందేష్‌లోని అహీరులలో, అహీర్‌బ్రాహ్మణులు, అచ్ఛవులఅహీర్లు, అహీర్‌సోనార్లు, అహీర్‌సుతార్లు, అహీర్‌లోహార్లు, అహీర్‌షింపీలు, అహీర్‌సాలీలు, అహీర్‌గురవలు, అహీర్‌కోలీలు,- అనే ఉపవిభాగాలు ఉండినవి.

ఈ విధంగా, జనజాతులవర్గం ఒక విచిత్రప్రపంచంగా, ఏర్పడింది. ఆయాకాలాల్లో, వీరు భారతచరిత్ర రంగంలో కొంతకాలం ప్రాముఖ్యానికిరావడమూ, తరువాత మరుగుపడిపోవడమూ, జరుగుతూవచ్చింది. భరతులు, పూరులు, అణులు, యదువులు, తూర్వసులు, ద్రుహ్యులు, అలీనులు, పక్థాలు, భలనాలు, విషానీలు,- మొదలైనజాతులు వేదములలో పేర్కొనబడియున్నవి. కాని, నేడు వీటిగుర్తులే కానరావడంలేదు.

తరువాతికాలంలో, వీరిసంఖ్య అభివృద్ధిచెందింది. పదహారు మహాజనపదాలు, లెక్కజనజాతిరాజ్యాలు, ఉత్తరభారతంలో ఉండినట్లు, బౌద్ధజాతకకథలు తెలుపుతున్నవి. కాని, తరువాతికాలంలో, వీరి గురుతు తెలియడంలేదు. విదేశీయములు, దేశీయములు, ఐన, జనజాతుల పేర్లు అనేకములు పురాణాలలో కలవు. వాటిలో కొన్నిపేర్లు మాత్రమే దేశంలో నిలిచి ఉన్నవి; తక్కినవి లోపించిపోయినవి. వీటిలో అనేకములు కులవ్యవస్థలో మిళితమై పోయి

నవి. జనజాతులను, కులాలుగా రూపాంతరం పొందించే ప్రవృత్తి, చరిత్రలో స్పష్టంగా గోచరిస్తుంది. రాజకీయ పరిస్థితులు దేశంలో స్థిరపడి, జనజాతుల ఉత్కాంక్షలు ఫలించే అవకాశాలు క్షీణించిన సందర్భాలన్నిటా, జనజాతులు కులధర్మాలకు, లోనౌతూవచ్చినవి. ఈ ప్రక్రియావస్థలో, ఒకవర్గాన్ని కులంగా పరిగణించవలెనా లేక జనజాతిగా, పరిగణించవలెనా అని చెప్పడం, సులభంకాదు.

జనజాతులలో కూడా, స్థానప్రతిష్ఠలకు సంబంధించిన, విభేదాలున్నవి. రసపుత్రులు, మహరాష్ట్రులు మొదలైన కొన్ని జనజాతులకు ఉన్నతప్రతిష్ఠ ఏర్పడింది. జాటులు, గుజార్లు పెక్కు ఇతరజాతులు, స్థానంలో తరువాతివి. హిందువుల బాహ్యకులాలనుంచి వేరుపరచి, గుర్తించడానికి వీలుకాని ఉపకులాలు, ఇంకను, అనేకములు వీరిలో ఉన్నవి. కొన్ని జనజాతులు, అసంఖ్యాకములై దేశమంతటా చెదరి ఉండడంవల్ల, నామసామ్యము ఉన్నప్పటికీ కూడా, వంశములు, శాఖలు, ఇత్యాదులతో కూడిన ఈ వర్గాలు, వేరికవి, స్వతంత్రములై ఉన్నవి.

జన జాతులకూ, వంశాలకూ, భారతదేశ చరిత్రలో ఎక్కువ ప్రాముఖ్యము ఉన్నది. వీరు భిన్నప్రదేశాలలో స్థిరపడి, ప్రత్యేకములైన జాగీర్లను ఏర్పరచుకొన్నారు. వాటిలో కొన్ని, రాజ్యాలుగా, సామ్రాజ్యాలుగా, అభివృద్ధిచెందినవి. కాని, ఈ రాజకీయ నిర్మాణాలు, కేవలం, వర్గనాయకుల [పెద్ద, చిన్న] కూటమిచే ఏర్పడిన సముదాయాలు మాత్రమే. వీటి నిర్మాణంకూడా, సడలమైనది; నిరంతరమైన అంతఃకలహాల విపత్తుకు లోనైనట్టిది. వీటిలోని ప్రబలమైన వర్గానికీ, ఆశ్రితవర్గాలకూ, పరస్పరమైన సాముదాయక జీవనం ఉండేది కాదు. ప్రతి వర్గమూ తన ప్రయోజనాలను మాత్రమే చూచుకొంటూ, తమ ప్రత్యేక జీవితాలను సార్వజనీనమైన శ్రేయస్సుకై, ఐక్యపరచడానికి, ఏప్రయత్నమూ చేయలేదు.

పద్దెనిమిదో శతాబ్దంలోని మూడు ప్రముఖ రాజపుత్రవంశాలూ, ఈ విషయంలో విస్పష్టమైన నిదర్శనాలు. జయపూర్ కచ్వాలు, జోధ్‌పూర్ రాథోర్లు, ఉదయపూర్ సిసోదియాలు ఈ మూడువంశాలు. వారి పరస్పర ఈర్ష్యాభావాలూ, అత్యంతమైన హ్రస్వదృష్టితో ఏర్పడినవారి స్పర్ధలూ, అతితీవ్రములైనవి కావడంవల్ల, మొఘలులకు అధీన స్థితిలో ఉండడానికీ, మహరాష్ట్రులకు కప్పం చెల్లించడానికైనా అంగీకరించినారేకాని, తాము ముగ్గురూ ఒకటిగా నిలిచి, తమ మాతృస్థానమైన రాజస్థాన్‌లో, శాంతి గౌరవాలతో కూడిన పరిస్థితులను నెలకొల్పడానికి, ఇష్టపడలేదు. హైందవ భారత శ్రీమంత వీరులని, ప్రఖ్యాతిగాంచి నప్పటికీ కూడా, రాజపుత్రులు, తమ సార్వభౌముడైన ఢిల్లీ చక్రవర్తిని సంతోషపరచడానికై, జాటులనూ, మహరాష్ట్రులనూ, హతమార్చడానికి వెనుదీయలేదు.

ఔరంగజేబుకాలంలో, జాటువర్గాలవారు, నదీ మధ్యప్రాంతఉన్నత భూభాగాలలో, ప్రబలులైరి. ఔరంగజేబు మరణానంతరం, బలహీనమౌతున్న సామ్రాజ్యస్థితిని ఉపయోగించుకొని, భరతపూర్ రాజధానిగా, తమ సామ్రాజ్యాన్ని స్థాపించుకొనిరి. వీరివల్ల కలిగే ఆపదను గుర్తించి ఔరంగజేబు, వీరి తిరుగుబాటును అణచడానికై కచ్వా ప్రభువైన రాజా బిషన్‌సింగును, నియమించి ఉండినాడు. ఫరూక్‌సియార్ పరిపాలనలో, జైసింగ్‌సావే, నాయకత్వంవహించి, చూరామన్ జాటును, ఎదిరించి, జాటులను ఒకవిధంగా లొంగదీసినాడు. అహమద్‌షాఅబ్దాలీ, ఇండియాను జయించడానికి పూనుకోవడంతో, ఆఫ్గనుల ప్రవా

హాన్ని అడ్డుకోడానికై, ఒక సైన్యాన్ని పంపియుండిరి. రాష్ట్రిసైన్యాలు జాట్ రాజ్యపరిసరాల్లో ఉన్నంతవరకు, భరత్‌పూర్‌రాజైన సురాజ్‌మల్ జాట్, స్నేహాన్ని ప్రదర్శించినాడు. కాని, మహరాష్ట్రిలు జమునానదిని దాటినవెంటనే, అతడు మారిపోయి, అహమద్‌షాఅబ్దాలీతో మైత్రిచేసుకొని, గర్వితులైన మహరాష్ట్రిలను నిరసించినాడు. నదీమధ్యప్రాంతంలోని జాటుల క్లిష్టపరిస్థితుల్లోగాని, వాటి విజయోత్సవాల్లోకాని, పంజాబులో దట్టంగా వ్యాపించియుండిన, జాటుబంధువులు, ఏమాత్రమైన ఆసక్తినీ ప్రదర్శించలేదు.

మహరాష్ట్రిలకు ఉండిన సదవకాశాలు మరెవ్వరికీ లేవు. ఒక్కట్టుగా ఏర్పడిన జాతి అది. బహమనీ రాజ్యాలనుంచీ, మొఘల్ పరిపాలకులనుంచీ, వారిని భౌగోళిక పరిస్థితులు రక్షించినవి. సార్వజనికమైన భాష, సామరస్యంతో కూడిన ప్రజానీకము వారికి సహజ సిద్ధమైనట్టివి. రాజపుటానాలోని రసపుత్రులు మొత్తం జనసంఖ్యలో ఆరోశాతం మాత్రమే. నదీ మధ్యప్రదేశంలోని జాటులసంఖ్య, అందలి నివాసులలో ఎనిమిదిన్నరశాతం మాత్రమే. ఇక, మహరాష్ట్రిలో. ఆ ప్రాంతంలోని జనాభాలో, మూడవభాగం వీరే. అంతేకాక, ప్రాంతమంతటా వీరు చెదరి వ్యాపించిఉన్నారు. ప్రాచీనకాలంలో కూడా వీరి జనాభా ఇంతటిదే, ఐ, ఉండినదనడం భావ్యం.

మత సంస్కర్తలు నైతికాభిమానాన్ని, వారిలో ఉత్తేజన పరచినారు. శివాజీయొక్క సర్వోచ్చమైన, సైనికరాజకీయ ప్రతిభ, వారిని ఒక రాజ్యంగా సంఘటితం చేసింది. కాని, మహరాష్ట్రిల ఆశయాలన్నీ సంకుచితములైనవి కావడంవల్ల, ఈ ఉత్తమ అనుకూలాలన్నీ వ్యర్థమైపోయినవి. సమైక్యమైన భారతదేశ దర్శనం, వారు భావించుకొన్న 'స్వరాజ్య' పరిధి లోకి రాలేదు. వారి స్వరాజ్యానికి బాహ్యమైన భాగమంతా, వారి దృష్టికి పరదేశంగా కనబడింది. కనుక అది, వారి ముల్కగిరి దాడులకు ఆహుతికావడం, తప్పుగాతోచలేదు. ఒక వైపు, సర్వాధికార సంపాదనకై, వీరు మొగలులతో పోటీపడుతూ కూడా, ఉత్తరభారతం లోని జాటులు, రాజపుత్రులు, బుందేలులు, బెంగాలీలు, ఒరియాలు మొదలైన ఇతర హిందూ వర్గాలను, విరోధులుగా చేసుకొన్నారు.

కుల, జనజాతి వ్యవస్థ, వర్గానికీ వర్గానికీ, సమగ్ర భారతదేశానికీ మధ్య, దాటడానికి వీలులేని, గోడలను నిర్మించింది. పరస్పరసహకారానికీ, సంయోజనానికీ, అవకాశమియ్యకుండా, ఇవి అడ్డుకొన్నవి.

మధ్యయుగాల ఇంగ్లాండు దేశంలోకూడా, సమాజ వ్యవస్థ, నాలుగువర్గాలతో ఏర్పడి ఉండింది. కులీనవర్గము, పురోహితవర్గము, స్వతంత్ర కర్షకవర్గము, కృషకదాసవర్గము,- అనేవి ఈ సమాజ భాగాలు. ఐనప్పటికీ, వీరిని ప్రత్యేకంగా నిలిపివేసే అఖాతాలు, ఈవర్గాల మధ్యలేవు. కులీనులూ, ఉన్నతశ్రేణి పురోహితులూ, ఒక వర్గమై ఉండిరి. ఏక కుటుంబము లోనివారే, కొందరు కులీనులుగా, మరికొందరు పురోహితులుగా ఉండేవారు. సంపద సిద్ధించడంతో, స్వతంత్ర కర్షకుడు, కులీన వర్గంలోని వాడుగా పరిగణింపబడేవాడు. దుస్థితికిలోనై, దరిద్రుడైన కులీనుడు కూడా, కృషకదాస స్థితికి దిగజారిపోయేవాడు. ఫ్రాన్సులోని సమాజ వ్యవస్థ, ఇంత మృదువైనదీ, పొందికఐనదీ, కాకపోయినా, ఇండియా కులవ్యవస్థ వంటిది మాత్రంకాదు.

ఇంగ్లాండులో కూడా పెక్కు జనజాతులు నెలకొని ఉండినవి. ఆంగ్లులు, సాక్సనులు,

జాట్లు, డేనులు, నార్మనులు, అనే విదేశీయ జనజాతులు, ఇంగ్లాండులోని ప్రాచీన బ్రిటను లతో సహా, నివసించినారు. క్రీ. శ. 1066 లో నార్మన్ విజయం జరిగిన తర్వాత, ఈజన జాతి వర్గాలన్నీ ఒక్క సమాజంగా సమ్మేళనం పొందినవి. రెండు శతాబ్దాల తర్వాత, ప్రత్యేక జనజాతుల గుర్తులుకూడా మరుగుపడి పోయినవి. ఫ్రాన్స్, ఇటలీ, స్పెయిన్, దేశాలలోను, తర్వాతికాలంలో జర్మనీ, మరి ఇతర యూరోపుదేశాలలో కూడా, ఈ విధం గానే, జనజాతుల సంయోజనం జరిగిపోయింది.

కాని, ఇండియాలోని విషయంవేరు. ప్రజలను చిన్నచిన్నవర్గాలుగా బంధించివేసిన కులములు అనే ఈ గూళ్ళు, పద్దెనిమిదోశతాబ్దాంతందాకాను, ఆపైన కూడా, శిథిలంకాకుండా నిలిచిఉండినాయి. ఈ కులవర్గాలు అతినిష్ఠతో బిగుసుకొని పోవడానికి, కారణాలు అనేక ములు. చైతన్యంలేని ఇండియా ఆర్థికపరిస్థితి అన్నిటికంటే ముఖ్యమైనకారణం. జీవనమాత్ర పోషకమైన పెట్టుబడిలేని వ్యవసాయము, యంత్రాంగ పరికరాలులేని గృహపరిశ్రమలు, గ్రామ స్వయంపోషకత్వము, స్వల్పమైన వ్యాపారకార్యకలాపము,- అనేవి ఈ ఆర్థికవ్యవస్థ లోని ప్రముఖలక్షణాలు. ఈ లక్షణాలు నిలిచి ఉన్నంతవరకూ, సాంఘికపరివర్తనకు ఆవశ్యక మైన ఆవేగం, దుర్బలమై ఉంటుంది. ప్రాచీన సాంఘిక-ఆర్థిక వ్యవస్థ మారకుండా ఉన్నంత దాకా, సామాజిక ఏకీకరణ ప్రయత్నం ముందుకుసాగడం సాధ్యంకాదు.

కులవ్యవస్థ జనజాతివ్యవస్థలవల్ల చీలికలై పోయిన సమాజం, హిందూసమాజమొక్కటే కాదు. ఇండియా ముస్లిముల సమాజవిషయంలో కూడా, ఈ కులభేదాలు ప్రబలములై, ఇదేవిధమైన ఫలితాన్నే తెచ్చిపెట్టినవి. "అగ్నిపర్వత సదృశమైనది ఇస్లాముమతం. జాజ్వల్య మానమైన ఈ సంయోజకశక్తి అనుకూలపరిస్థితులలో, ఒక సమగ్రజాతిని ఉత్పన్నం చేయ గలిగినట్టిది. శ్రేణీబద్ధములై ఉన్న జనజాతులన్నిటినీ కరగించి, వాటిని ఒకటిగా సంయోజన పరచి, వాటి అంతరరచనకు, ఏకప్రకారమైన ఆదర్శరూపాన్ని, సిద్ధింపకలిగినట్టిది. ఈ పరి ణతరూపంలో, పూర్వపుపద్ధతుల అవశేషాలేవీ గోచరించవు." అని, రిస్లే (Risley), ఇస్లామును గురించి అభిప్రాయాన్ని ఇచ్చినాడు. కాని, గ్రంథాలలో చిత్రింపబడియున్న ఇస్లామువేరు. మహమ్మద్ ప్రవక్తబోధనలకూ, మధ్యయుగాల ఇండియాలోని ముస్లిముల సంస్థలకూ, ఆచారవ్యవహారాలకూగల అంతరం, విస్తృతమైనది. హిందూధర్మశాస్త్రాలకూ, ప్రవృత్తిలోనున్న కులవ్యవస్థకూకూడా, ఇంతటి అంతరమేఉన్నది. ప్రజలను (ముస్లిములను) ఏకస్థంగా కూర్చడంలో, మతనియమాలకంటె, సాంఘిక జనజాతి ఆచారవ్యవహారాలు, ప్రబలకారణములైనవి." అని ఇబ్బెట్‌సన్ (Ibbetson) సూచించినాడు.

పంజాబులోని జనాభాలో ముస్లిముల సంఖ్య అధికం. చాలవరకు, వీరు హిందూ మతము నుంచి విడిపోయి, ఇస్లామును స్వీకరించినవారు. "హిందూ మతము నుంచి, ఇస్లా ముకు పరివర్తనం పొందినందువల్ల, కులవ్యవస్థలో తప్పని సరిగా రావలసిన పరివర్తన, ఎంత మాత్రమూరాలేదు," అని కూడా ఇబ్బెట్ సన్ వ్రాసిఉన్నాడు. "సాంఘిక, జనజాతీయ, రాజకీయ, పరిపాలన ప్రయోజనాల విషయంలో, ఇస్లామును స్వీకరించిన రజపుత్ర, జాట్, గుజార్ వ్యక్తులకూ, హిందూసంఘంలో నిలిచిపోయిన వీరి భ్రాతృ వర్గానికీ, భేదము ఏ మాత్రమూ, పాటించడంలేదు." అని కూడా ఇతడే వ్రాసియున్నాడు. మతాంతరం చెందినా కూడా, వ్యక్తియొక్క సాంఘిక ఆధారాల్లు మార్పులేదు; అతనిపై ఉండిన జనజాతి

నిర్బంధాలు సడలిపోలేదు; వివాహ నియమాలూ, వారసత్వ నియమాలూ పరివర్తనం చెంద లేదు.

ఆగ్రా-ఔధ్ సంయుక్త ప్రాంతాల జనాభా అధిలేఖ పత్రంలో, బ్లంట్ (Blunt) ఈ క్రింది విధంగా వ్రాసి ఉన్నారు. "సైయీద్, షేక్, ముఘల్, పఠాన్, వర్గాలు మినహా,- తక్కిన ముస్లిములందరూ హిందూమతం నుంచి వచ్చి ఇస్లాములో చేరినవారే. వివాహ విషయంలోను, పంచాయతుల విషయంలోను, వీరు పాటించే ఆచారాలన్నీ, వీరి పూర్వపు కులాలకు సంబంధించిన ఆచారాలకు, ప్రతిరూపాలే. ముస్లిమ్ రసపుత్రులందరూ, సజాతీయ వివాహ విధానాన్నే నిష్కర్షగా అనుసరిస్తారు. కొన్ని సందర్భాల్లో, రాజపుత్రుల విజాతీయ వివాహ (Exogamous) నియమాలను కూడా, రక్షిస్తూ వచ్చినారు. ఉపజీవిక వర్గాల వారు ఏర్పరచుకొన్న పంచాయతీవ్యవస్థలు కూడా, వారి హిందూ భ్రాతృవర్గంవారి పంచాయతులవలెనే, దృఢమైనవి, బలవత్తరములైనవి. బంజారాలు, క్షుమ్రాలు, జూల్హాలు, బెహ్నాలు, కుజ్‌గార్లు-లేక-కస్సార్లు [మహమ్మదీయ కుమ్మార్లు] ముకేరీలు, తాయిఫలు, షేకులు, మెహ్తారులు (భంగీలు), హల్వాయీలు, కుంజ్రాలు, మణిహార్లు, చూరీహార్లు, సంబాయీలు, కాలందర్లు, పోగారులు, కన్‌మైలులు, మరి ఇతరులు,- మొదలైన వారి అందరి విషయంలోనూ, ఈపద్ధతే వ్యాప్తిలోఉంది.

బీహార్, ఒరిస్సాలలోని ముస్లిము కులాలపట్టికను పి. సి. ట్యాలెంట్స్ (P. C. Tallents) ఇచ్చినాడు. ధూనియా, జోలహా, కుంజ్రా, పఠాన్, సైయిద్, షేక్, అనేవి దానిలో ఉన్నవి. ఎన్‌థోవెన్ (Enthoven) అనే చరిత్రకారుడు, గుజరాతును గురించి వ్రాస్తూ, మోమ్నాకుంబీలు, మోలేసలాములు అనేకులాలవారు, మత విషయంలో ఇస్లామునూ సాంఘిక వ్యవస్థా విషయంలో హిందువులనూ అనుసరిస్తారని తెలిపినాడు. సింధు ప్రాంతాన్ని గురించి ఆయన "తాత్త్విక దృష్ట్యా ముసల్‌మానులై ఉన్న ఉపజాతులు అన్నీ సమానములే; వారిలో వారు స్వేచ్ఛగా వివాహసంబంధాలు జరుపుకోవచ్చు. కాని, కార్యాచరణంలో వివిధవర్గాలకుగల సాంఘిక స్థానానికి ప్రాధాన్యముంది. వివాహసంబంధాలు ఒక వర్గంలో వారికి మాత్రమేగాని, లేక, సంఘంలో సమానస్థాయిగల ఇతర వర్గాలకుగాని, పరిమితమై ఉన్నవి". అని వివరించినాడు.

హిందూకుల వ్యవస్థయొక్క లక్షణాన్నీ ముస్లిములలో ఉన్నవని, రిచర్డ్‌బర్న్ (Richard burn) తెలిపియున్నాడు. సజాతీయ వివాహము, వృత్తికౌశలము, సంఘంలో అగ్రస్థానానికి సంబంధించిన నియమాలు, సాంఘిక నిర్బంధాలు,- మొదలైనవి ఈ లక్షణాలు. జనాభాపరిగణన సందర్భాల్లో, వ్యక్తులు తమంతటతాము కులాన్ని చెప్పితేనే గుర్తించవలసిందని ఇండియాప్రభుత్వం ఉత్తర్వు జారీచేసింది. ఇది సరికాదని, జె. హెచ్. హట్టన్ (J. H. Hutton) అభిప్రాయపడినాడు. "మూల, కులవ్యవస్థ నుంచి సిద్ధించినట్టి కార్యాత్మకములు, సాంఘికములు ఐన, లక్షణాలను సుస్పష్టంగా ప్రదర్శిస్తున్న ముస్లిమువర్గాల విషయంలో మాత్రమే కులాన్ని లెక్కలపట్టీలో గుర్తించినారు. హిందూకులాలనుంచి ఏర్పడిన ముస్లిమువర్గాల విషయంలో, అంతర్వర్గీయ వివాహాలను పరిమితంచేసే ప్రవృత్తి కూడా ఉన్నది." అనికూడా అతడు వ్రాసిఉన్నాడు.

1881 నుంచి, జనాభాలెక్కలన్నిటిలోనూ, ముస్లిముకులాల పట్టికలు అనేకములు

చేరిఉన్నవి. పద్దెనిమిదోశతాబ్దంలో, ఇండియానివాసులైన ముస్లిములు, హిందూసమాజము వంటి వ్యవస్థను, అనుసరిస్తూ ఉండిరని, నిస్సందేహంగా చెప్పవచ్చు. కాని, ఆధారభూతమైన విషయాల్లోమాత్రము ఒక్క భేదముఉన్నది. హిందువుల కులవ్యవస్థయొక్క ఆచరణ విధానం, పవిత్రస్మృతి గ్రంథాలలోని నిబంధనలనుంచి ఎంతగా అపసరణ మార్గంలోపోయి ఉన్నప్పటికీ, సారాంశంలో వాటి ఆలంబనాన్ని మాత్రం కోల్పోలేదు. పవిత్రములైన ఆజ్ఞలకూ, కార్యరూప ఆచరణలకూ ఆధారవిషయాల్లో వ్యత్యాసములేదు.

ముస్లిముల విషయము దీనికి వ్యతిరేకమైనది. ఇస్లాము మతసిద్ధాంతాలకు ప్రత్యక్షంగా విరుద్ధమైనది కులవ్యవస్థ. మతదృష్ట్యా కులం అనేది ఇస్లామేతరమైనది.ఆత్మ సాక్షికి ఉద్బోధ కలిగినప్పుడు, నిష్ఠావిశ్వాసములుగల వ్యక్తి, కులవ్యవస్థను ఖండించకతప్పదు. కాని, పద్దెనిమిదో శతాబ్దంలో, ఈ పరిజ్ఞానం స్వప్నంలో కూడా కలుగలేదు.

ముస్లిము జనజాతి వ్యవస్థ, హిందువులకంటె ముస్లిములకే ఎక్కువ క్లేశకరంగా సిద్ధించింది. పఠాన్, బెలూచ్ జనజాతులూ, అసంఖ్యాకములైన వారి శాఖలూ వంశాలూ, సింధునదికి ఇరువైపులాగల పశ్చిమ ప్రాంతంలో గుమిగూడి ఉండిరి. హిందూ జనజాతుల వారు ఇస్లాము మతంలో చేరిన తర్వాత కూడా, తమ సామాజిక వ్యవస్థనూ, . ప్రత్యేకతనూ నిలుపుకొని ఉండిరి. ముస్లిము మతంలోని రసపుత్రులు, జాటులు, గుజార్లు ఇట్టివారు. సైయీదులు అరబ్బీవంశము వారమని చెప్పుకొంటారు. తాము మధ్య ఏషియా జన జాతి వంశము వారని మొఘలుల విశ్వాసము. పదహైదోశతాబ్దపు లోడీవంశము వారి పరిపాలన కాలంలో, ఆఫ్గనులనేకులు ఇండియాలో స్థిరపడిపోయిరి. మొఘలులను పదత్రోయడానికి పూనుకొని, చాలవరకు సఫలులైన 'సూర్'లూ, పద్దెనిమిదోశతాబ్దంలో ఎక్కువ ప్రాముఖ్యానికి వచ్చిన, రోహిల్లాలూ, ఆఫ్గనులలో ప్రసిద్ధులు. ఢిల్లీకి నైరుతి దిక్కులో నివసించే 'మియోలు' (Meos) ప్రాచీనమూ, దుర్దమ్యమూ ఐన, జనజాతికి చెందినవారు.

ముస్లిములలో సైయీదులు విశిష్ట గౌరవార్హులని, మాననీయులని, వారికి ప్రత్యేకత ఏర్పడింది. సైయిదుకు నొప్పి కలిగించడము, తిట్టడము కూడా పాపంగా పరిగణింపబడేది. "ఉన్నత స్థానీయులైనవారు సైయిదులు. వారిని హృదయ పూర్వకంగా ఆభిమానించడం, మన మత ధర్మం. అంతేకాదు. ఆత్మవిజ్ఞానముయొక్క సారాంశమే వారిని ప్రేమించడం. వీరిని ద్వేషించడం, నరకాగ్నిలో పడిపోవడానికి హేతువౌతుంది; భగవంతుని కోపానికి కూడా పాత్రులమౌతాము." అని ఔరంగజేబు యొక్క నిశ్చిత విశ్వాసం.

మొగలులు, పఠానులు సైనిక వర్గాలకు చెందినవారు. పరిపాలకులకు మొగలులు అభిమాన పాత్రులు. సైన్యానికీ, శివిల్ వ్యవహారాలకూ సంబంధించిన బాధ్యతలను పరిపాలకులు, వారికి అప్పగించిరి. సామ్రాజ్యంపట్ల భక్తివిశ్వాసాలులేనివారు పఠానులని. వారిని సందేహిస్తూ ఉండిరి. పఠానులు సాధారణంగా, క్షోభ కలిగిస్తూ అధికారాన్ని ధిక్కరిస్తూ ఉండినారు.

ఇస్లాములో ప్రవేశించిన పైవర్గాల హిందువులను, నౌ-ముస్లిములని వ్యవహరించేవారు. అట్టివర్గానికి షేక్ అనేపేరు సిద్ధించింది. వీరు, తమ పూర్వపువర్గ విభాగాన్ని, కులనామాన్ని, ఉపజీవికను, ఆచారాన్ని విడువక అంటిపెట్టుకొని ఉండిరి. నౌ-ముస్లిములైనా, లేక, పూర్వం వలస వచ్చిన ముస్లిముల సంతతివారైనా కూడా, ఇండియాలో జనించిన ముస్లిములకు గొప్ప

గౌరవంలేదు. తాము ఉన్నతులమని గర్విస్తున్న విదేశ ముస్లిములను, చక్రవర్తులు ఆదరించి, బహుమతులను, గౌరవలాంఛనాలను ప్రసాదించేవారు. మొగలులు ప్రదర్శిస్తున్న ఈ శ్రేష్ఠత్వ భావాన్ని గమనించిన రో, ఫ్రైయర్‌లు (Roe and Fryer) ఆశ్చర్యచకితులై, దానిని గుర్తించిపెట్టినారు. "తాము శ్వేతజాతివారమని మొగలులు గర్వించి, నలుపువారైన ఇండియనులను తిరస్కారభావంతో చూచినారు." ఇది, వారు వ్రాసిఉంచినది.

హిందువులవలెనే, ముస్లిములు కూడా రెండు సమాజవర్గాలను గుర్తించినారు. ఉన్నత వర్గాలకుచెంది, రాజ్యవ్యవహారాలలో పాల్గొనడానికి ఉత్కంఠ చూపుతున్న వారిని కులీసులని-షెరిఫ్ - వ్యవహరించిరి. సాధారణంగా, హిందువుల తక్కువకులాలనుంచి మతాంతరీకరణం పొందిన ఇతరులను రాథిల్-హీనులు, అని వ్యవహరించేవారు.

ఈ విధంగా ప్రాంతీయ, జనజాతీయ, జాతీయ శాఖీయములైన కులభేదాలతో, ముస్లిము సమాజం, జల్లెడపంటి రూపాన్ని పొందింది. టురానీలు, ఇరానీలకు ప్రతికక్షులు. మొగలులు ఆఫ్గనులను తొలగించి, ఢిల్లీ సామ్రాజ్యాన్ని ఆక్రమించినందువల్ల, ఆఫ్గనులకు వీరిపైద్వేషము. ఇరాన్‌నుంచి ఆక్సస్ అవతలిదేశాలనుంచి వచ్చిన విలాయితీలు (విదేశీయులు) ప్రదర్శించే అహంభావాన్నీ, దుర్గర్వాన్నీ, హిందూస్థానీ ముస్లిములు సహించేవారుకారు. "మొదటి ముగ్గురు ఖలీఫాలు ముస్లిములకు న్యాయబద్ధమైన నాయకులని" ఖుల్ఫా-ఇ-రషిదీన్ విశ్వసించే సున్నీశాఖవారిని, షియాశాఖవారు, దూషించేవారు. షియాలు సంప్రదాయ బాహిరులు (రఫీజీలు) అని సున్నీలు భావించేవారు.

ఉపజీవికలకు సంబంధించిన కులాలుకూడా, అనేకములు ముస్లిములలో ఉండినవి. సాలెవాండ్లు (జూలహాలు), కసాయివాండ్లు (కసాబ్‌లు), నీళ్ళుతెచ్చేవారు (భిస్తీలు), వీధులూడ్చేవాళ్ళు (లాల్‌బేగీలు) మొదలైనవి ఈ కులాలు.

సమాజాన్ని చీలికలుగా చేసివేసే ప్రవృత్తులు, రాజకీయవ్యవహారాల్లో, అల్పజన ఏకస్వామ్య ప్రయోజనాలు. హిందువులలోవలెనే ముస్లిములలో కూడా వ్యాప్తిచెంది ఉండినవి. కులము, జాతి, అనేవి ఇండియా సాంఘిక జీవితానికి మూలాధారాలుగా ఏర్పడినవి. మానవుల వర్గజీవితానికి బాంధవ్యమొక్కటేకాక, ఇతర అంశాలు కూడా ఆధారములైనవి. వీటిలో, ప్రధానమైనది భూభాగం. ప్రాదేశిక సంసర్గము, అనగా పరిసరప్రదేశము,- దీని మూలతత్త్వం. మానవుని ప్రాథమిక అవసరాలు కొన్ని క్షేత్రంనుంచి లభిస్తాయి. క్షేత్రాన్ని స్వప్రయోజనం కొరకు ఉపయోగించుకోవడంలో మానవులకు పరస్పర సంబంధాలు ఏర్పడతాయి. ఈ సంబంధాలే, వర్గజీవితానికి ఉపాధులు.

కులము, జాతి, అనేవి నైసర్గిక స్వభావాన్నిబట్టి, ఏర్పడినవేకాని, ప్రదేశానికి సంబంధించినట్టివికావు. కాని, ఇండియాలో వాటి నానాత్వము, నికటమైన స్వయం పరిపాలన, ఆంతరసుసంబద్ధత, అనే అంశాలు సమైక్యసమాజ రచనను అడ్డుతగిలినవి. కాబట్టి, సుసంయోజితమైన హిందూ సమాజము అనే భావ చైతన్యం, దేశంలో ఉత్పత్తికాలేదు. ఒకే ప్రాంతంలో నివసిస్తూ ఒకే భాషను వ్యవహరిస్తున్నవారు కూడా, భావబద్ధమైన ప్రాదేశిక సంఘముగా ఏర్పడలేదు. బెంగాలీ, పంజాబీ, ఆంధ్ర, తమిళ, గుజరాతీ, జాతీయత అనేది ఎప్పుడూ సృష్టికిరాలేదు. మహారాష్ట్రుల భావోద్రేకం దీనికి అపవాదంగా కన్పడవచ్చు. కాని, వాస్తవికంగా అది అట్టిదికాదు. బ్రాహ్మణ పీష్వాల పరిపాలనలో, సంప్రదాయ బద్ధతకు

(Orthodoxy) మళ్లీ ప్రాధాన్యం ఏర్పడింది. విప్లవాత్మకములైన సాంఘిక శక్తులు సాధించియుండిన స్వల్పమాత్ర ఐకమత్యాన్ని కూడా, ఈ సాంప్రదాయం నశింపజేసింది.

జాతీయతలో ధనాత్మక, ఋణాత్మక అంశాలు రెండూ ఉన్నాయి. కొన్ని సమాన లక్షణాలుకల ప్రజలను, అది తనలో చేర్చుకొంటుంది; తక్కిన వారి నందరినీ బహిష్కరిస్తుంది. జాతీయములూ, నైతికములూ, ఐన సంబంధాలతో ఐక్యంపొంది, మహరాష్ట్రుల వ్యక్తిత్వాన్నీ, శ్రేయస్సునూ, స్వాతంత్ర్యాన్నీ రక్షించేవారు ప్రత్యేకంగా మహరాష్ట్ర ప్రజలు అనేభావం, శివాజీ స్థాపించినాడు. కాని అతని ఉత్తరాధికారులకు సంక్రమించిన రాజకీయ వ్యవస్థలో, ఈ భావానికి ప్రాధాన్యం కలుగలేదు.

ఉపజీవికల ఆధారంపైకాని, కులశాఖల ఆధారంపైకాని, విశాలములైన సాంఘిక వర్గాలూ, బాంధవ్యాలూ అభివృద్ధి చెందడానికి కూడా. కులవ్యవస్థ ఒప్పుకోలేదు. బ్రాహ్మణులుకాని, క్షత్రియులుకాని, ఇతర కులాలుకాని, సమగ్రభారతము ఆధారంగాకాని, లేక ప్రాంతాలు ఆధారంగాకాని, ఒక సమైక్యరాజ్యాన్ని ఏర్పరచడానికి సహకరించలేదు. వ్యవసాయము, వర్తకము పరిశ్రమలు, అనేవికూడా, సదృశములైన ఉపజీవికల సమాఖ్య విషయంలో కూడా సహకరించలేదు. వివిధప్రదేశాలలో నివసించే వైష్ణవులకు, శైవులకు, శాక్తులకు, ఇట్టిశాఖలే ఇతరప్రదేశాలలో కూడా ఉన్నవనే పరిజ్ఞానం లేకపోయింది. నానక్ కబీర్, చైతన్య, రామ్‌దాస్, మరిఇతరులు, ప్రారంభించిన ఉద్యమాలు సమైక్య సామాజిక దృక్పథంతో ఏర్పడినప్పటికీ, ప్రత్యేకమైనవిగా నిలిచిపోయినవి.

ఏకంగా కలిసి ప్రయత్నించడానికి, జనజాతులు కూడా, ఆసక్తి చూపలేదు. సింధ్, పంజాబ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, ప్రాంతాల జాటువర్గాలు, తమ వ్యవహారాలను తామే ప్రత్యేకంగా చూచుకొంటూవచ్చిరి. పంజాబ్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యభారతంలోని రసపుత్రులు కూడా ఈ పద్ధతినే అనుసరించిరి. అభివృద్ధిచెందిన జనజాతులకు సంయోజనం కలుగలేదు. ఆఫ్ఘనులు, పఠానులు, బెలూచీలు, రోహిల్లాలు, ఇతరులు, ఒకే మతానుయాయులైనప్పటికీ, సర్వసమానములైన రాజకీయలక్ష్యాలుకాని సమానమైన వ్యవస్థకాని, వారికి లేకపోయింది.

ఈ విధంగా హిందువులుకాని, ముస్లిములుకాని సమగ్రమైన ఏకైక సమాజంగా ఏర్పడలేదు. తమ మతవిభేదాలకు అతీతులై, ఏకైకమైన ప్రాదేశిక సమాజాన్ని నిర్మించుకోడానికి, అప్పటి పరిస్థితులలో, సాధ్యంకాలేదు. బహువిషయాలకు వర్తించే కులనామాలు, నానాత్వాన్ని సూచిస్తూవచ్చినవి. అత్యావశ్యకమైన, ఆంగిక ఐక్యం వీటికిలేదు.

## VI. గ్రామము

కులము అనేది, సాంఘిక-మత సంస్థ. కాని, తీవ్రములైన ఆర్థిక పరిణామాలు దీనితో చేరి ఉన్నవి. సాంఘిక-మత సంబంధమైన విషయంలో, పరస్పరము సదలంగావేరియున్న భిన్నకులాల మొత్తము, సమాజము. రాజకీయ-ఆర్థిక సంబంధమైన విషయంలో అది, ఆర్థిక, ప్రాదేశిక భాగములైన గ్రామాల సముదాయము. ఆంగ్లదేశపు జాగీరులకు ఫ్రెన్సు దేశపు జాగీర్లకు, మధ్యయుగాల యూరోపులో ఏవిధమైన స్థానము ఉండిందో, అదే విధమైన స్థానం ఇండియాలోని గ్రామాలకు ఏర్పడి ఉండింది. పద్దెనిమిదో శతాబ్దాంతంవరకూ

ఇండియాలో ఇట్టి గ్రామ పరిస్థితే సాగుతూ వచ్చింది. కాని, దాని ఉత్పత్తిక్రమము, నియమిత కార్యాలు, నిర్మాణము, అనే విషయాలలో ఇండియాలోని గ్రామం, యూరోపులోని జాగీర్లకు భిన్నమైనట్టిది. సార్వత్రికంగా సిద్ధించియుండిన యుద్ధాలు దౌర్జన్యము, అనే సంఘటనలను ఎదుర్కొనే ప్రయత్నంలో, యూరోపులోని గ్రామ సంస్థలు ఏర్పడినవి. వర్ణాశ్రమ ధర్మము అనే జీవిత నియమాన్ని ఒక వ్యవస్థగా ఏర్పరిచే ప్రయత్నంలో, సృష్టికివచ్చినవి ఇండియాలోని గ్రామసంస్థలు. కార్యరూపంలో ఉన్న ప్రవృత్తి, మూలభావానికి, అత్యంతమూ దూరమై ఉండినదనడం వాస్తవమే. అంతమాత్రాన, మూలాధారమైన ఉత్తమభావమేలేదని వాదించడం, సహేతుకమైనదికాదు. పద్దెనిమిదో శతాబ్దపు అరాజకపు పరిస్థితుల్లో, ఇండియా గ్రామాలు గోడలతో, బురుజులతో, పారాగుమ్మటీలతో ఆవరింపబడి, భద్రపరుపబడిన రక్షకస్థానాలుగా ఏర్పడియుండడం కూడా, వాస్తవ విషయమే. వర్ణాశ్రమ ధర్మవ్యవస్థ, గ్రామ సంస్థకు ఆధారమూలము అనే వాదానికి, ఈ విషయం కూడా విరుద్ధమైనదికాదు. యూరోపులోని గ్రామాలుకూడా, ద్వంద్వాత్మక వ్యవస్థలే. యజమాని-దాసుడు, ప్రభువు-సామంతుడు, అనే సంబంధంతో ఏర్పడింది, యూరోపు గ్రామ వ్యవస్థ. దాని ఆర్థిక ఆధారమూ, భౌతిక నిర్మాణమూ కూడా, ఆవ్యవస్థయొక్క యుద్ధాత్మక ప్రయోజనాన్ని స్పష్టంకావించినవి.

పొలానికీ, యజమానికీ, జీవితాంతం బద్ధమైయున్నట్టి కృషకదాసుడు, లేక, దాసుడు, అనే వ్యక్తి, ఇండియాలోని గ్రామవ్యవస్థలో ఎప్పుడూలేడు. అట్టిపరిస్థితికి ఈ వ్యవస్థలో అవకాశమేలేదు. ఇండియాలోని గ్రామాలు ఎప్పుడూ ప్రత్యక్షంగా యుద్ధంలో పాల్గొనలేదు. యుద్ధవ్యాపారము కులధర్మంగా గల వర్గాలవారూ, రాజులూ, నిర్వహించవలసింది యుద్ధకార్యం. "బ్రిటీషు ప్రభుత్వం, ఇండియాలో శాంతి స్థాపనచేయడానికి పూర్వం, నిరంతర యుద్ధాలవల్ల ఇండియాలో జరిగినంత వినాశం, మరేదేశంలోనూ జరగనిమాట కూడా వాస్తవికమైనదే. ఐనా, భారతదేశ ప్రజలు ఏకాలంలోనూ యుద్ధజాతిగా ఉండిన వారుకాదు." అని హెన్రీమేయిన్ (Henry Maine) తెలిపి ఉన్నాడు. మానవజాతిని పోషించడానికి తగినంత పంటను ప్రసాదించుమని, భూమాతను ప్రార్థించడమే ఇండియాగ్రామానికి ప్రధానమైన ఆసక్తి విషయం. ఈ పవిత్రకార్యాన్ని నిర్వహించడంలో, అన్ని కులాలవారూ సహకరించవలసిందే. దైవప్రార్థనలతో ప్రకృతి విషయక భావిదృష్టితో, సంస్కార నిర్వహణ కర్మ నిర్వహణలతో, బ్రాహ్మణులు; ప్రజలకు రక్షణనూ, ఆశ్రయాన్ని ఇచ్చి క్షత్రియులూ; శ్రమదానంతో కర్షకుడూ; సేవతో కర్మకారులు,-ఈవిధంగా గ్రామంలోని వారంతా ఈవ్యవసాయ కర్మనిర్వహణలో పాల్గొన్నారు. పంటలోని భాగమే, ప్రతివానికీచెందే బహుమతి. గ్రామసర్వస్వానికీ సాధారణమైన ఈ ప్రయత్నంలో, ప్రతివాడూ తన కులధర్మాన్నీ, వృత్తిధర్మాన్నీ నిర్వర్తించి, తన సేవకు తగినట్లుగా పంటలోనిభాగాన్ని, ప్రతిఫలంగా గ్రహించవలసిందే.

గ్రామంలో నివసించే ముస్లిములు కూడా ఈపద్ధతిలోనే చేరిపోయి హిందూ వ్యవస్థలోని ప్రతిభకు వారిమనస్సులు కూడా లోబడిపోయినవి. మతము, పూజ విధానము, ఉపవాసవ్రతాలు, పండుగలు మొదలైన మత విషయాల్లో మాత్రమే, ముస్లిములు వేరై ఉండిరి. ఐనా, వాటిని నిర్వహించే విధానంలో పెక్కు హిందూ పద్ధతులను గ్రహించిరి.

సార్వజనీనములైన ఉత్సవాలలోను, పండుగలలోను, రెండుమతాలవారూ చేరిపోయేవారు. ఒక మతస్థులకు మాత్రమే ప్రత్యేకములైన పండుగలలో కూడా, రెండు మతాలవారూ పాల్గొనేవారు.

ఆకాలపు పరిస్థితులలో, గ్రామజీవిత వ్యవస్థలో ఒక ఆంతరసమన్వయం సిద్ధించి, అందరికీ స్థిరతను, భద్రతను, చేకూర్చడమేకాక, ఆయావ్యక్తుల స్థానానికి తగిన కర్తవ్యాలను ఏర్పరచింది. కాని, సామాజిక పరిస్థితులను పూర్తిగా స్తంభీభూతమొనర్చిందికూడా, సమాజాన్ని స్తరీకారణంచేసే విధానాన్ని చిరస్థాయిగాచేస్తూ వచ్చింది. వ్యక్తి జన్మించిన వర్గముయొక్క స్థాన ప్రతిష్ఠలకు, అతనిజీవితాన్ని బంధించి వేసినారు. తన పరిస్థితిని మార్చుకొని బాగుపడే అవకాశం అతనికి లేకుండాపోయింది. గ్రామ సమాజమంతా, అన్యోన్య సంబంధం లేనట్టి వేర్వేరు అరలుగా విభక్తమైపోయింది. అల్పసంఖ్యాకమైన ఒక చిన్న వర్గానికి మాత్రమే విశేషాధికారము, గౌరవము, సుఖజీవితము స్థిరమయింది. రక్తాన్ని పీల్చి వేసే నిరంతర శ్రమతో, దయాదాక్షిణ్యహీనమైన దారిద్ర్యంతో, అన్యాయమైన అవమానంతో కూడిన దుర్భర జీవితం, అధిక జనానీకము యొక్క గతిగా ఏర్పడింది.

## VII. గ్రామవ్యవస్థ - పట్టణవ్యవస్థ

ఆర్థికయంత్రానికి, గ్రామం, నాభివంటిది. సేద్యము, పరిశ్రమ, వర్తకము,- అన్నీ దానిచుట్టూ తిరుగుతుండేవి. ఈ విషయంలో, ఇండియాకూ మధ్యయుగాల యూరోపుకూ భేదమున్నది. యూరోపులోని ఆర్థికజీవితం, రెండుగా విభక్తమయింది. వ్యవసాయము గ్రామానికీ, వర్తకపరిశ్రమలు పట్టణానికీ సంబంధించే విధంగా, వర్గీకరణం జరిగింది. ఇండియాలో గొప్పనగరాలు ఉండినవి. కాని, అవి కేవలం పరులపై ఆధారపడిన పరోపజీవులు. (Parasites). రాజకీయాధికారానికి కొన్ని పట్టణాలు రాజధానులు; కొన్ని మతకేంద్రాలు; కొన్ని నదీసంగమస్థానాలు, లేక, రహదారుల సంగమస్థానాలు. స్వతంత్రములైన పరిశ్రమల పైనా, వర్తకంపైనా- ఆధారపడి, జనాభానూ సంపదనూ, అభివృద్ధిచేసుకొన్న పట్టణాలు అత్యల్పం. పరిపాలకుల తాత్సారంవల్ల, పట్టణాలు నశించిపోతున్నవని బెర్నియర్ (Bernier) గుర్తించినాడు. పరిపాలకులు ఎల్లకాలమూ, ఢిల్లీలోనో ఆగ్రాలోనో ఉంటూ ఉండడంవల్ల, లాహోర్‌పట్టణము శిథిలావస్థకు రావడం ఇందుకు ఉదాహరణం. ఢిల్లీ ఆగ్రాలు సైన్యస్థానాలు కావడంవల్ల, వాటిపై ఆధారపడి, అధికజనం, ఆ పట్టణాల జనాభాను పెంచిందని, అతడు గుర్తించినాడు. వాస్తవానికి ఢిల్లీనివాసులు, చక్రవర్తి సైన్యలోని ఒకభాగం. అత్యల్పమైన అచ్చటిపరిశ్రమలు, ఆధిపత్యంలో ఉన్న రాజకీయనాయకులు, సంపన్నకులీనులు, వారి ఆశ్రితజనము, అనే అల్పసంఖ్యాకుల ఆవశ్యకవస్తువులను తయారుచేయడానికి మాత్రమే ఏర్పడినవి. గృహపరికరాల నిర్మాణానికి సంబంధించిన నిరంతర శబ్దంతోకాని, ఉత్తేజితమైన వార్తాపత్రికలతోకాని, బజార్లలో వ్యాపారనిమగ్నులై ఉన్న వర్తకుల సందడితోకాని, ఆనాటి నగరాలు సజీవములై ఉండలేదు. తమ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో జోక్యం కలుగజేసుకోడానికి సాహసించిన ప్రభువును, లేక, బిషప్పును, ముఖాముఖిగా ఎదిరించి, ధిక్కరించగల పౌరసంఘాలు, ఇండియానగరాలలో లేవు. పద్దెనిమిదోశతాబ్దపు ఇండియాలోని గ్రామానికీ,

అనేకాలపు ఇంగ్లాండులోని గ్రామానికీ సామ్యంలేదు. "ఇంగ్లండులో పట్టణాలకు బైట నివసించే జనాభాలోని అధికభాగం కేవలం వ్యవసాయంపై ఆధారపడినవారు కారు; పూర్తిగాకాని, లేక, కొంతభాగంకాని, పారిశ్రామిక వ్యాసంగముపై ఆధారపడినవారు".

ఇండియా గ్రామంలో, వ్యవసాయమే అన్నిటికీ ప్రధానమైనది. ప్రాథమికంగా తమ తమ ఉపజీవికలను అంటిపెట్టుకొనిఉన్న ఇతర కులాలవారు కూడా వ్యవసాయాన్ని సహాయక వ్యాసంగంగా అవలంబిస్తూ ఉండిరి.

## VIII. సమాజ జీవిత కేంద్రంగా, గ్రామం

సమాజ కార్యకలాపానికి అంతటికీ, ఇండియా గ్రామం, కూదలిస్థానం. ప్రతి వ్యక్తికీ ఒక గృహం ఏర్పడిఉండేది. అతని నివాసానికీ, వివాహానికీ, సంతానానికీ, అన్నిటికీ అదే అతని స్థానం. అతడు పూజించే గ్రామదేవతలు, కులదేవతలు, వాటి ఆలయాలు, అన్నీ గ్రామంలోనే ఏర్పడినవి. ఉపజీవికకు సంబంధించిన కార్యకలాపాలన్నిటికీ గ్రామమే రంగస్థలం. తన జీవనానికి అవసరములైన ఆహారధాన్యాలు పండించుకోడానికీ, వస్త్రాలను తయారుచేసుకోడానికీ, ఇల్లు కట్టుకోడానికీ, ఆవశ్యకమైన భూమిని, గ్రామం అతనికి సిద్ధింపచేసింది. అతని సాంస్కృతిక, సాంఘిక జీవితానికి కూడా గ్రామమే కేంద్రం.

రక్షణను ఇవ్వడమే ప్రధానోద్దేశంగా, గ్రామంలోని ఇండ్లు నిర్మింపబడినవి. ప్రాంతానికీ ప్రాంతానికీ, విభిన్నమై ఉన్న వాతావరణ పరిస్థితులనుబట్టి, ఇండ్ల నిర్మాణం నిశ్చితమయ్యేది, ఈభేదం, చాలవరకు ఇంటికప్పుడు సంబంధించినట్టిది. పూరిగడ్డితోనో, పెంకులతోనో, ఏటవాలుగా ఏర్పడిన పైకప్పు; లేక కర్ర స్తంభాలపై కర్రదూలాలతో శిల్పతోవేసిన చప్పటము, అనేవి సాధారణమైనవి. మట్టిగోడలు, ధమ్మసుచేసిన మట్టినేలలూ సార్వత్రికమైనవి. నివసించే వారిహోదానుబట్టి గ్రామంలోని ఇండ్లు పలువిధాలుగా నిర్మితములైనవి. ధనవంతులైన కామందులు, ఉన్నత వర్గాలవారు, కర్షకులు, చేతి పరిశ్రమకారులు, అస్పృశ్య ఉపజీవికలను అనుసరించేవారు,-అనే విధంగా గ్రామవాసులు వర్గములై ఉండిరి. జమీందారు ఇల్లుతప్ప, తక్కినవారి ఇండ్లన్నీ, వంకరగా పోయే సన్నని సందుల్లో, దిక్కూ కొక్కులేగా, చెల్లాచెదురుగా ఏర్పడిఉండినవి. మనుష్యులూ పశువులూ కూడా, సన్నిహితంగా నివసించడం, సర్వసాధారణమైన విషయం. ఆరోగ్య పరిస్థితులకు ఏమాత్రమూ లక్ష్యము ఇవ్వలేదు.

శ్రమికవర్గము, లేక, కార్మికకులాలు, ఉన్నత కులాలు, అధికారులు, అనే వర్గాలతో సాధారణంగా గ్రామ జనాభా ఏర్పడింది. కర్షకులు, శ్రమిక వర్గంలోని వారు. విశుద్ధములైన ఉపజీవికలను అవలంబించినవారు, కులబాహ్యులు అని, శ్రమికవర్గంలో రెండు భాగాలు ఏర్పడినవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు, ఉన్నత కులాలవారు. భూమి కామందులు క్షత్రియులై ఉండిరి. వర్తకము, వడ్డీవ్యాపారము, మొదలైనవి వైశ్యుల వృత్తులు. ఇదే విధంగా, గ్రామంలోని ముస్లిములు కూడా, షరీఫ్ అనే ఉన్నత వర్గానికిగాని, లేక, రాధిల్ అనే తక్కువ కులవర్గానికి కాని చెందిఉండిరి. షరీఫులు, హిందువుల ఉన్నత వర్గాల వారితో సామ్యం కలవారు. హీనములైన ఉపజీవికలను అవలంబించిన ముస్లిములు రాధిలులు.

కులాల సంఖ్య నిశ్చితమై ఉండలేదు; కాని, సాధారణ పరిమాణంలో ఉన్న గ్రామా

లలో, పదహైదు, ఇరవై కులాలవరకు ఉండినవి. గ్రామసమాజ వ్యవస్థకు వీరు అంగములు వంటివారు; కనుక గ్రామజీవితం సక్రమంగా నడవడానికి, వీరి సహకారం అత్యవసరం.

## IX. గ్రామము యొక్క కృత్యాలు

గ్రామముయొక్క సహకారవ్యవస్థ, ప్రధానంగా, మూడువిధములైన కృత్యములకు సంబంధించినట్టిది. (1) సాంఘిక-మత, సాంస్కృతిక సంబంధమైనవి, (2) ఆర్థికసంబంధ మైనవి, (3) పరిపాలనకు, రాజకీయాలకూ సంబంధించినవి.

### 1. సంస్కృతి సంబంధమైనవి :

సాంఘిక మతవిషయానికీ, సంస్కృతి విషయానికీ సంబంధించిన కృత్యంలో, కుల వ్యవస్థయొక్క ఆంతరవ్యవహారాల నిర్వహణంకూడా నిహితమైఉంది. సహభోజనము, వివాహము, కులస్థుల పరస్పరసంబంధము, మొదలైన సమస్యలన్నీ ఈ ఆంతరవ్యవహారాలలో చేరినవే. కులాంతరవివాహాలు, వినోదప్రదర్శనలు, వ్యాయామప్రదర్శనలు, సార్వజనికములైన ఉత్సవాల నిర్వహణము, సంస్కారనిర్వహణము, విద్య, అనే విషయాలన్నీ దీని వ్యాప్తి లోనివే. ఈ కృత్యాలను సక్రమంగా నిర్వహించడానికై ఏర్పడినసంస్థ, కులపంచాయితీ.

### 2. ఆర్థికవిషయాలు :

(a) వ్యవసాయం : ఆర్థిక నిర్వహణానికి సంబంధించినంతవరకూ, స్వయంపోషక సమర్థమైన ఏకాంశం (Unit), గ్రామం. ముఖ్యమైన ఉత్పాదక కార్యకలాపం, వ్యవసాయం. కళలూ, చేతిపనులూ వ్యవసాయానికి అధీనములైన సహాయక కార్యాలు. వివిధములైన పంటలను పండించడానికి, పండిన పదార్థాల వినియోగానికీ, బట్వాడాకూ తగిన ఏర్పాట్లు గావించడానికీ, వ్యాపారము, బ్యాంకింగు విధానము, మొదలైనవి, తోడ్పడినవి. గ్రామీణ జీవనప్రమాణాలు చాల తగ్గు స్థితిలో ఉండినవి. గ్రామ ఆర్థికవ్యవస్థ, జీవన నిర్వహణతలాన్ని (Subsitance level) దాటి, పైకిపోలేదు. గ్రామముయొక్క అవసరాలకుమించి ఏమైనా మిగిలినట్టయితే, భూస్వాములూ, మధ్యవర్తులూ, ప్రభుత్వమూ, మొదలైనవారు రైతుల గొంతునులిమి, లాక్కొనిపోయేవారు. కనుక వ్యవసాయవిధానాన్ని బాగుపరచడానికి, అవసరమైన ద్రవ్యం కరవయింది.

పెట్టుబడి విధానానికీ యాంత్రికపద్ధతికీ, పూర్వముఉన్న గ్రామవ్యవస్థ శతాబ్దాలుగా సహస్రాబ్దాలుగా, మార్పుచెందక, అట్లే నడుస్తూవచ్చింది. గుంపుగా ఏర్పడియున్న ఇండ్లతోకూడిన, జమీనులమొత్తమే గ్రామముయొక్క నైసర్గికస్వరూపము. దానిలో నివాస మున్న వర్గాల వారందరికీ ఏదోవిధంగా పరస్పరసంబంధమూ, సామాన్య ప్రవృత్తికి సంబంధించిన సాధనమూ ఏర్పడి ఉండినది.

గ్రామానికి చెందిన క్షేత్రంలో కొంత భాగము వ్యవసాయ యోగ్యమైనది; కొంత భాగం బంజరు భూమి. వ్యవసాయక్షేత్రం జమీనులుగా విభక్తమై, భిన్న వ్యక్తుల సాగుబడిలో ఉండేది. ఆ రోజులలోని గ్రామాలలోని జమీనులకు ఉండినట్టి కంచెలు, లేక, గట్టులు, ఇక్కడి జమీనులకులేవు. నీటి కాలువలు, విస్పష్టంగా లేని ఇతర గుర్తులు, పొలాలను వేరు పరచేవి. ప్రతికర్షకుని పొలాలూ వేరువడి ఉండినవి; వీటి వైశాల్యం కూడా సమానమైనదికాదు. పంజాబు ప్రాంతంలోని బాద్‌షాపూర్ పరగణాకు సంబంధించిన 1680-81 నాటి,

జిజియా లెక్కలు, ఈ విషయాన్ని వ్యక్తంచేస్తున్నవి. పరగణాలోని జనసంఖ్య 855. వీరిలో 320 మంది దరిద్రులూ, అశక్తులు కావడంవల్ల, జిజియా పన్ను వీరిపై వేయలేదు. తక్కిన 535 మంది కట్టిన మొత్తం సంవత్సరానికి 2950 రూపాయలు. వీరిలో, మొదటి తరగతికి చెందిన, 58 మందికట్టిన మొత్తం 1100 రూపాయలు. మధ్యతరగతికి చెందిన 145 మంది చేరికట్టిన మొత్తం, రూ. 904-4-0. సంఘంలోని అధమ వర్గానికి చెందిన తక్కిన 302 మంది కలిసికట్టిన మొత్తం, రూ 943-12-0.

గ్రామంలోని వారందరూ ఉపయోగించతగిన బంజరుభూమి, పశువులను మేపుకోడానికీ, కట్టెలు కొట్టుకోడానికీ, పనికివచ్చేది. ఈ రెండు విధములైన భూములేకాక, ఇండ్లు కట్టుకోడానికీ, చెరువులకూ, బావులకూ, స్మశానాలకూ, తోటలకూ, పశువుల దొడ్డికీ, సమాజ కార్యక్రమాలకూ, కొంత భూమి ఉపయోగించేది.

భూమిని వ్యవసాయంచేసిపండించే ప్రధాన కార్యభారం, కర్షకులపైపడింది. ప్రతి వ్యవసాయదారూ తన కుటుంబంతోనూ, ఆశ్రితులతోనూ, సహా, తన అధీనంలో ఉన్న పొలంలో పనిచేసేవాడు. అతి ప్రాచీనమైన నాగలితో పొలాన్ని దున్ని, తనకు లభ్యమైన నది, కాలువ, చెరువు, కుంట, మొదలైన వనరులనుంచి నీటిని పొలంపై పారించి, పొలంలోని కలుపుతీసి, పక్షులు, మృగాలు, చీడ, మొదలైన వాటినుంచి పైరును రక్షించి, నూర్పిడి కళ్ళంలో ధాన్యంతీసి, పాతర్లలో నిలువచేసేవాడు. ఈ వ్యవసాయకార్యాచరణంలో, రైతుకు ఇబ్బందులు ఎక్కువ. అతని పరికరాలు అతిప్రాచీన కాలపువి; పైరుకు అవసరమైనంత ఎరువు లభ్యమయ్యేదికాదు; సారవంతమైన విత్తనాన్ని ఏరుకోవడంలేదు; మందంగా నడిచే ఎద్దులవల్ల లభించే జీవనశక్తి, అతి దుర్బలమైనది; నీటి పారుదల సౌకర్యాలు పరిమితమైనవి. ఇన్ని ఇబ్బందులు ఉన్నప్పటికీ కూడా, కర్షకుడు సాధిస్తున్న వ్యవసాయ కార్యం, ఇండియాను చూడడానికై వచ్చిన విదేశీయులకు, ఆశ్చర్యకరంగా కనబడింది. ఇట్టి పరిస్థితుల్లోకూడా, సాలుకు రెండు పంటలు, ఒకొకప్పుడు మూడు పంటలు రైతు పండిస్తూ ఉండడం ఒక అద్భుత కార్యంగా వీరికి తోచింది. పద్దెనిమిదోశతాబ్దపు వ్యావసాయిక విప్లవానికి పూర్వం, యూరోపులో అనుసరిస్తూ ఉండిన పద్ధతులతో పోల్చిచూస్తే, ఇండియా రైతు వెనుకబడిన వాడని చెప్పజాలము.

గ్రామసమాజము యొక్క పరిమిత అవసరాలకు కావలసిన పదార్థాలన్నిటినీ, తగినంతగా, రైతుపండించేవాడు. పప్పుధాన్యాలు, కూరగాయలు, ఆహారాన్ని రుచికరంగాచేసే మసాలావస్తువులు; గుడ్డలు తయారుచేయడానికి పనికివచ్చే ప్రత్తి, నార (గోగు, జనుము మొదలైనవి), గుడ్డలకు రంగువేయడానికి ఉపయోగించే నీలిమందు, మంజిష్ఠ (చాయవేరు) మొదలైన వనస్పతి వర్ణద్రవ్యాలు. తాంబూలానికి తమలపాకులు; ఉత్తేజనద్రవ్యాను ఆశించే వారి తృప్తికై, కల్లు, అపీము గాంజా (భంగ్)— మొదలైనవన్నీ, గ్రామంలో ఉత్పన్నం కావించేవారు. ద్రవ్యరూపమైన అవసరాలను తీర్చుకోడానికై నీలిమందు చెరకు, నూనె గింజలు, పత్తి, అవిశగింజలు, పండించేవారు.

విస్తారంగాఉన్న బంజరుభూములు, అడవులు, పశువులు మేపుకోడానికి పరిమితిలేని అనుకూలాన్ని కలిగించినాయి. రైతుయొక్క వ్యవసాయ కార్యక్రమానికి ఉపకరించేవి, పశువులు. అంతేకాక, పాలూ వెన్నా, తోళ్లూ, సమృద్ధంగా వీటివల్ల లభిస్తుంది. రైతు తినడానికి

కావలసినంత ఆహారం లభించేది. ఇప్పటి పాశ్చాత్యప్రమాణాలనుబట్టి, ఆనాటి రైతుల జీవన ప్రమాణం తక్కువైనదే. కాని, తరువాతికాలపు బ్రిటిషుపరిపాలనలోని రైతుల పరిస్థితికంటె, ఆనాటి రైతుయొక్క జీవితం సులువుగాను, ఉత్తమస్థితిలోను గడచిపోయింది, అనడం, నిస్సందేహమైనది. పద్దెనిమిదోశతాబ్దంలో, వ్యవసాయక్షేత్రం కావలసినంత విస్తారమై ఉండింది. కాబట్టి, తగ్గురకపు భూమిని సాగుచేయవలసిన అవసరం లేకపోయింది. అప్పటి ఇండియా జనాభాకూడా, పోల్చిచూడగా, స్వల్పమైనదే. జనసంఖ్య 10 లేక 14 కోట్లకు మధ్యగా ఉండింది. అందువల్ల, నాటి మానవుని వాస్తవిక మూల్యం (Intrinsic value), ఉచ్చతరమైనట్టిది. ఉత్తమజీవనం నడవడానికి అవకాశాలు కూడా సులభమై ఉండినవి.

మధ్యయుగాల కాలంనాటి భారతీయ వ్యవసాయవిధానంలో, అపూర్వములైన కొన్ని లక్షణాలు ఉండినవి. ఉత్పాదనకు సంబంధించిన అంశాలలో, పొలము, శ్రామికవర్గము, అనే రెండూ, ముఖ్యంగా ప్రధానమైనవి. వ్యవసాయ యోగ్యమైన క్షేత్రం విస్తారంగా ఉండడంవల్ల దాని విషయంలో పోటీలకు, స్పర్థలకు అవకాశంలేదు. ఇప్పటికాలంతో పోల్చి చూడగా, ఆ కాలపు కొన్నిప్రాంతాల వ్యవసాయక్షేత్రంలో, అర్ధభాగాన్ని మాత్రమే ప్రజలు ఆక్రమించిఉండిరి,- అని లెక్కలవల్ల నిశ్చయమౌతుంది. మరికొన్ని ప్రాంతాలలో, మూడింట రెండుపంతులు మొదలు ముప్పాతిక భాగంవరకు ఆక్రమణలోనికి వచ్చింది. ఎక్కువ ప్రజాబాహుళ్యముతోనిండి, వారిని పోషించడానికి తగినంత పంటపండని భూములు, ఏ ప్రాంతంలోనూ, ఆనాడులేవు. వ్యవసాయ భూమికావలసినవారు, యథేచ్ఛగా, అడవులను కొట్టివేసి, ఆ భూములను సాగుబడిచేసుకోవచ్చు.

యమునా, గంగానదీ తీరాలను అనుసరించి, ఢిల్లీ నుంచి ఆగ్రావరకూ వ్యాపించిఉన్న ప్రాంతం, మొగలు సామ్రాజ్యంలో అత్యంతమూ మధ్యస్థమైనభాగం. కాని, విస్తృతమైన ఈనదీ లోయల ప్రాంతమంతటా అడవులు బాగావృద్ధికి వచ్చినవి. అప్పటికింకా, మధురా పట్టణం, ప్రసిద్ధమైన బర్సానా అరణ్య మధ్యసీమలో, ఉండినది. అక్బర్ ఈ అరణ్యంలో పులులను వేటాడేవాడు. పందొమ్మిదోశతాబ్దపు ఆదిభాగంలో, అనేకములైన అరణ్యాలు, ఔధ్‌నుచుట్టిఉండినవి. అలహాబాద్ నుంచి, బనారస్, జాన్‌పూర్‌ల వరకూగల ప్రాంతంలోని సాగుబడి భూమియొక్క విస్తీర్ణం నేటిభూమిలో నాలుగోవంతు మాత్రమే. ఘోగ్రాతీరంలోని సాగుబడిభూమి నేడుఉన్నదానిలో ఏడు, లేక, ఎనిమిదో వంతు మాత్రమే. కార, ప్రాంతంలో అడవి ఏనుగులు స్వేచ్ఛగా తిరుగుతుండేవి. అజంఘర్, ఘాజీపూర్, గోరఖ్‌పూర్, బస్తీ, ప్రాంతాల భూములు చాలవరకు సాగుబడిలోకి వచ్చియుండలేదు. అడవి ఏనుగులు, ఖడ్గమృగాలు మొదలైన అరణ్యమృగాలు, ఆ జిల్లాలకు తొందర కలిగించేవి. బీహారు ప్రాంతంలోని మూడింట రెండుభాగాల ప్రదేశం నేడు సాగుబడిలోకి వచ్చింది; కాని, పద్దెనిమిదో శతాబ్దంలో ఐదోభాగం కంటె ఎక్కువ ప్రదేశం, సాగుబడిలో ఉండలేదు. ఉత్తర బీహారులోని, తిర్‌హూత్, చంపరాన్, ముజఫర్‌పూర్. దర్భాంగా ప్రాంతాలన్నీ, అరణ్యమయములై ఉండినవి. పశ్చిమబెంగాలులో జనాభా దట్టంగా వ్యాప్తమై ఉన్నా, తూర్పు బెంగాలంతా దట్టమైన అడవులతోనూ కర్దమ భూములతోనూ (Swamps) నిండి ఉండింది.

మొగలుల పరిపాలన కాలంలో, సాగుబడిభూమి కొంత విస్తరించింది. ముఖ్యంగా గంగానదీ లోయలో, ఎక్కువ అభివృద్ధికివచ్చింది. ఢిల్లీ, ఆగ్రా, అయోధ్యా, ప్రయాగ్,

జాన్‌పూర్, బనారస్ పాట్నా, రాజ్‌మహల్, బర్ద్వాన్, విక్రమ్‌పూర్, టిప్పేరా, వంటి ముఖ్యప్రదేశాలలో వ్యవసాయమూ, జనసంఖ్యా కూడా విస్తృతి చెందింది. కాని పంతొమ్మిదో శతాబ్దంలోని స్థితిగతులతో పోల్చిచూస్తే, పూర్వము జనాభా విరళంగా మాత్రమే వ్యాపించి ఉండింది. బంజరుభూములూ, సాగుబడిలో రాని భూములూ కూడా, ఎక్కువ విస్తారమై ఉండినవి.

లభ్యంగా ఉండే సాగుబడిభూమి సమృద్ధంగా ఉండడం, భూమికి ఇంకా "సరియైన విలువ సాధారణంగా ఏర్పడక పోవడము" అనేవి ఈ పరిస్థితుల స్వాభావిక పరిణామం. భూమికిగల విలువలు కేవలం, నామమాత్రమైనట్టివి. "మలబార్ తీరప్రాంతంలో తప్ప, ఇండియాలో మరెక్కడా కూడా సాగుబడి భూమికి సంబంధించిన ఆస్తి ఎప్పుడూలేదు, అనేది విస్పష్టమైన విషయం" అని సర్ థామస్‌మన్రో 1307లో, తెలిపినాడు. "పంజాబులో బ్రిటీషువారి ఆక్రమణకు పూర్వం, భూమిని విక్రయించడం అనే విషయమే ఎవ్వరూ ఎరుగరు." భూసంబంధమైన స్వంత ఆస్తియొక్క అభివృద్ధిని ప్రోత్సహించడం మన పరిపాలన విధానమై ఉండగా, అట్టి ఆస్తి ఒకటి ఉన్నదని కూడా పూర్వపు ప్రభుత్వాలు గుర్తించలేదు." అని సర్‌జాన్ స్ట్రాచీ (Sir John Strachy) వ్రాసి ఉంచినాడు. భూమికి సంబంధించిన ఆస్తి ఎవరిది, అనే ప్రశ్న, కార్యతః కలగడమేలేదు; కాని, భూమి నుంచి వచ్చిన పంటలో ఎవరిభాగం ఎంత, అనేదే కార్యరూపంలో ఉన్న ప్రశ్న" అని ఎల్ఫిన్‌స్టన్ (Elphinston) సూచించినాడు. "వ్యక్తికిగాని, సమాజానికిగాని, చెందిన స్వంత ఆస్తి అనేది, గుర్తుకు కూడా ఇంకా ఏర్పడలేదు". అని గోండాసర్వేరిపోర్టులో, బెనెట్. తెలిపిఉన్నాడు. "కేవలం స్వంతమైన చరాస్తి ఒకరి నుంచి ఒకరికి బదిలీ ఔతున్నరీతిగా, బదిలీచేయడానికీ అమ్మడానికీ వీలైనట్టి, భూసంబంధమైన స్థిరాస్తి, ప్రాచీన వ్యవస్థకు చెందినదికాదనీ, అది కేవలం అధునాతనంగా ఏర్పడిన విషయమనీ, మనం జ్ఞాపకం ఉంచుకోవడం లేదు." అని, సర్‌జార్జ్ క్యాంప్ బెల్‌కూడా వ్రాసిఉన్నాడు. ఈ విషయాన్ని దీర్ఘంగా చర్చించిన పిమ్మట, బేడన్-పొవెల్ (Baden-powell) "స్వామ్యము అనేది పొలాలపైలేదు; పంటలను పంచుకోవడంలోను, వ్యవసాయకార్యాచరణంలోను, రాజస్వాన్ని చెల్లించడంలోను మాత్రమే, అది నిహితమై ఉన్నది." అని విషయాన్ని తేల్చివేస్తాడు.

పంటభూమి అతివిస్తారంగా ఉండడమే, అది ఇతర ఆస్తులవంటిది కాకపోవడానికి కారణం. భూమి అమ్ముడుబోయేవస్తువుకాదు కాబట్టే భూమితనఖాలు, విక్రయాలు, బదిలీలు అనే వాటిని గురించి మనకేమీ తెలియడంలేదు. పద్దెనిమిదోశతాబ్దపు దక్కనులో రచింపబడిన విక్రయపత్రాలలో "తన భూమిని తీసుకోవలసిందని, స్వంతదారు విక్రయదారునిని, ప్రార్థిస్తున్నాడు."— అనే విధంగా వ్రాసియున్నది. తత్పరిణామంగా, భూమిస్వామ్యానికి సంబంధించిన ప్రశ్నను నిర్ణయించడం చాల కష్టమయింది. భూసంబంధమైన ఆస్తివిషయంలో, అధీనము, అనుభవము అనేవి మాత్రమే, రైతులు వాస్తవంగా పట్టించుకొన్న విషయాలు. హిందూధర్మశాస్త్రాలను అనుసరించిన వంశానుగతమైన హక్కులు, వారసత్వపుహక్కులు, పైరెండు అంశాలనుంచి ఏర్పడినవి. కాని, ఈ హక్కులకు కొన్ని షరతులుకూడా చేర్చబడినవి. ప్రభుత్వానికి చెల్లించవలసిన రాజస్వాన్ని, పంటలోనుంచి ఇవ్వడం అనే షరతును పాటిస్తూ ఉన్నంతకాలమూ, రైతూ, అతని వారసులూ, పొలాన్ని, లేక, పొలాలను తమ

ఆధీనంలో నిలుపుకొని, దాని అనుభోగం (Usufruct) కలవారై ఉంటారు. వారిని పొలాం నుంచి తొలగించే ప్రశ్నే ఉదయించదు. కాని, భూమిని సాగుచేయకుండా నిర్లక్ష్యం చేసినట్లైతే, బలాత్కారంగా వారిని తొలగించవచ్చు.

భూమికి సంబంధించిన స్థిరాస్తివిషయంలో, భారతీయుంభావం, ఈ విధంగా అపూర్వమై ఉండింది. ఆ కాలపు యూరోపులోని వ్యవస్థకు పూర్తిగా వ్యతిరేకమైనది ఇది. పద్ధెనిమిదో శతాబ్దంలో, యూరోపులోని వ్యవస్థ, భూస్వామ్య విధానముయొక్క లక్షణాలను విసర్జించి, నిరపేక్షతావాదము, అనన్యస్వామ్యము, వ్యష్టివాదము, అనేవాటితో కూడిన స్వభావాన్ని సాధించుకొన్నది.

సహజసిద్ధములు, తొలగించడానికి వీలులేనివి, అనన్యాక్రాంతములు, మార్పుచేయకూడనివి, ఐన హక్కులు,- చాలవరకు పవిత్రములని పరిగణింపబడిన హక్కులు,- యూరోపులైతువ్యవస్థకు సిద్ధించినవి. స్వాతంత్ర్యము, వ్యక్తిత్వము, సంపద, సంస్కృతి, అనేవాటికి ఈ హక్కులు పునాదిగా ఏర్పడిందని విశ్వసించినారు. "అనిశ్చితస్వామ్య విషయాలను న్యాయతంత్రము (Judiciary) నిర్దిష్టములైన హక్కులుగా, విశేషాధికారాలుగా, శక్తులుగా, ప్రతిరక్షలుగా, ఏర్పరచి, అవి ఒక వ్యక్తిలో నిహితమైఉన్నట్లూ. లేక, విస్పష్టములైన మార్గాల్లో క్రమబద్ధమైనట్లూ, స్థిరీకరించింది".

భూమివిషయంలో, కేవలం, అపేక్షారహితమైన స్వామ్యము అనేభావం బ్రిటిషువారు రాకపూర్వం, ఇండియాలో లేదు, అనేది, సారాంశం.

ఇక, శ్రామికవర్గము అనే రెండవ అంశం, దుర్లభమై ఉండింది. కనుక దానికి విలువ, ప్రాముఖ్యము హెచ్చింది. సాగుబడి భూమిని విస్తరింపచేయవలెననే కుతూహలం రాజులకు కలిగింది. రైతుల శ్రేయస్సును పెంపొందించడం ముఖ్యకర్తవ్యమని, గవర్నర్లకూ, ఇతర అధికారులకూ, రాజులు అప్పుడప్పుడు ఆదేశాలను పంపుతూవచ్చిరి. సహించరానట్టి అధికార పీడనను, అన్యాయప్రవృత్తిని ఎదుర్కోడానికి, సహాయ నిరాకరణమొక్కటే రైతులకుగల సమర్థమైన ఆయుధం. విపరీతపరిస్థితుల్లో పల్లెలను వదలిపెట్టి, పరిసరారణ్యాలలో దాగుకోవడము, అవసరమైతే, అరణ్యాన్ని కొట్టివేసి కొత్తపొలాలను, నివాసాలను, ఏర్పరచుకొని, అక్కడనే నిలిచిపోవడము జరుగుతూవచ్చింది. ఇట్టిపరిస్థితులలో, పాశ్చాత్యదేశాలలో ఉండినట్టి దాస్యపద్ధతికాని, కృషకదాసవిధానంకాని, ఏర్పడడం సాధ్యంకానిది. కాని, గ్రామాలను వదలిపెట్టి పోవడము అనే, అగలికమైన విధానాన్ని, పదేపదే అవలంబించడం సాధ్యంకాదు. ఇండియారైతులు శాంతస్వభావులు; సహజమైన తాల్మిగలవారు. కాబట్టి, తొలగించుకోడానికి సాధ్యమైన దుస్థితినీ, అన్యాయాన్నీకూడా, అత్యంతమూ సహిస్తూ కాలం వెళ్ళబుచ్చేవారు.

(b) గ్రామపరిశ్రమలు : గ్రామనివాసుల ప్రధానవృత్తి వ్యవసాయం. వారి ప్రాథమిక అవసరాలను అది తీర్చగలిగింది. గాని, వృత్తి కార్మికుల సేవలేకాకుండా, వ్యవసాయ ప్రక్రియలు జరగడం సాధ్యంకాదు. అంతేకాక, ఇతరములైన అగత్య ఆవశ్యకాలను కూడా సమకూర్చుకోవలసి ఉంటుంది. కాబట్టి, ప్రతిగ్రామమూ, అనేకములైన కళలకూ, వృత్తికర్మలకూ నిలయమయింది. కాని, ఆనాటి గ్రామపరిశ్రమలకు సంబంధించిన ఆధారసూత్రాలు, ఇప్పుడున్నటువంటివికావు. చాలవరకు గ్రామంలోనివారి వినియోగానికి అవసరములైన వస్తువులనే, అక్కడ తయారుచేసేవారు. గ్రామానికి కావలసిన నూలు, వస్త్రాలు, చాలభాగం

అక్కడనే తయారయ్యేవి. అదేవిధంగా, గ్రామస్థులకు అవసరమైన నూనెను, అక్కడే గానుగ ఆడించి తీసేవారు; చక్కెరనుకూడా తయారుచేసుకొనేవారు. సాలెవాడు, కమ్మరి, వడ్లవాడు, కుమ్మరివాడు, చమ్మారుడు, మరిఇతరులు,- అందరూ గ్రామముయొక్క అవసరాలను తీర్చడానికే పనిచేసేవారు. వారు తయారుచేసి ఇచ్చిన వస్తువులకు ప్రతిఫలం, ద్రవ్యరూపమైనదికాదు. ప్రతి వస్తువుకూ, ధర అనే నిర్ణయంకూడా లేదు. సంప్రదాయాన్ని అనుసరించి, వారికి ప్రతిఫలం లభించేది. కోతల కాలంలో, పంటలో నిర్దిష్టమైన భాగం ప్రతి వృత్తి కార్మికునికీ, సంప్రదాయసిద్ధంగా ఇవ్వవలసి ఉండేది. వృత్తి కార్మికులలో చాలమందికి స్వంత పొలాలుకూడా ఉండేవి. వాటినుండివచ్చే పంట, రైతులనుంచి లభించేదాన్ని, భర్తీ చేసేవి. ఈ విధమైన ఆర్థిక వ్యవస్థకు ప్రదాయము-అభియాచన (Supply and deman), లాభము-నష్టము, ఉత్పాదన వ్యయానికి అనుగుణంగా ధరలను అధికీలనం చేయడము (Pegging),- మొదలైనవి, ఏ మాత్రమూ వర్తించవు.

(C). వ్యాపారము;- గ్రామంలోనూ, బైటకూడా కొంత వ్యాపారం జరిగేది. ధాన్య వర్తకుని అంగడి ఉండేది. ఈ వర్తకుడే ఒక విధమైన, బ్యాంకరుగాకూడా వర్తించేవాడు. వారంలో నిర్దిష్టమైన ఒక రోజు, పెద్ద గ్రామంలో సంత ఏర్పాటు చేసేవారు. గ్రామాల్లో లభ్యంకాని వస్తువులను కొనుక్కోడానికి ఇది ఉపకరించేది. దగ్గరలోను, దూర ప్రదేశాలలోను ఉన్న వర్తకులు ఈ సంతకు వచ్చి, ప్రధానమైన వీధికి రెండువైపులా, తమ వస్తువులను ఏర్పరచి, ప్రదర్శించేవారు. సంవత్సరానికి ఒకసారి ఏర్పడే పశువుల సంత, ఎద్దులను, ఆవులను, కోడెలను, కొనడానికీ అమ్మడానికీ, అవకాశం కల్పించేది.

భూమిశిస్తును ద్రవ్యరూపంలో చెల్లించవలసిన రైతులు, తమ అధిశేష ఉత్పత్తిని (Surplus) ధాన్యవర్తకుని వద్దకుగాని, లేక, పరిసరాల్లోని బజారుకుగాని, కొనిపోవలసివచ్చేది. ఈ వ్యవహారం రైతుకు అత్యగత్యమైన అవసరం కావడంవల్ల, వర్తకునికి లాభదాయకంగా నడిచేది. ఈ విధంగా గ్రామంలో ఉత్పత్తిఐన దానిలోని కొంతభాగం, పదార్థాలు ఆవశ్యకమై ఉన్న పట్టణప్రదేశాలకు, చేరేది. కాని, ఇది చాలవరకు, కేవలం ఒక వైపుగా మాత్రమే జరిగిన వ్యాపారం. శిస్తురూపంలో బైటికి ప్రవహించిపోయిన ద్రవ్యానికి బదులుగా, గ్రామానికి లభించింది ఏమీలేదు. కనుక, ప్రతిఫలశూన్యమైన ఎగుమతి, అనే ప్రతికూల పరిస్థితికి, గ్రామసీమలు లోనైనవి. గ్రామాల స్వయంపోషక సమర్థత ఒకవైపూ, పట్టణాల పారిశ్రామిక మాంద్యము మరొకవైపూ వ్యాపారాభివృద్ధిని నిరోధించిన అంశాలు.

బాహ్యప్రదేశాలనుంచి గ్రామాలు దిగుమతి చేసుకోవలసింది ఏమీలేదు. గ్రామాలు ఎగుమతిచేసేవి, స్వల్పధరలు వచ్చే బరువైన పదార్థాలు. ఈ కారణంవల్ల దూరప్రదేశాల అంతర వ్యాపారం ఎప్పుడూ విస్తృతి చెందలేదు. ఐనా, ప్రాంతంనుంచి ప్రాంతానికి సరకులు రవాణాకావడం కొంతవరకు జరిగేది. నూలు, గోధుమలు, చక్కెర, అపీము, ఉప్పు,- ఇత్యాది సరకులను బెంగాలు దిగుమతి చేసుకొని, తన ప్రాంతంలోని పట్టునూ, బియ్యాన్నీ ఇతర ప్రాంతాలకు పంపుతూ ఉండడం ఇందుకు ఒక ఉదాహరణ. ఆహారపదార్థాలను దిగుమతి చేసుకొని, గుజరాతు, నగదు పంటలను (Cash crops) ఎగుమతి చేసేది. తూర్పు పడమర తీరప్రాంతాలు, ధాన్యము, చక్కెర, వెన్న, దిగుమతిచేసుకొని, ఉప్పును, మిరియాలను ఎగుమతిచేసేవి. నదీ మధ్యసీమనుంచి, బయానానుంచి, సార్ఖేజ్‌నుంచి నీలి

మందును సేకరించి, రేవు పట్టణాలకు, రవాణా చేసేవారు.

దేశముయొక్క పరిమాణాన్ని జనాభాను పట్టిచూస్తే, సరకులరవాణా ఎక్కువైనది కాదు. దీనికి, కారణాలు అనేకాలు. సంచారమార్గాల హీనస్థితి, భూమార్గరవాణాలోగల కష్టవ్యయాలు, ఉద్రేకకారకములైన అంతర్దేశీయ ఆచారాలు, పద్దెనిమిదో శతాబ్దపుకల్లోల రాజకీయ పరిస్థితులు, వర్తకానికి సంబంధించిన ఆపదలు, గ్రామీణప్రజల హీనజీవనప్రమాణాలు, -ఇవన్నీ కూడా వర్తకం విస్తృతి చెందడానికి అడ్డంకులైనాయి. ఆకాలంలో పక్కారోడ్లు లేవుకనుక, సరకులరవాణా భారపశువుల ద్వారా (Pack Animals.) జరిగేది.

### (3) గ్రామపరిపాలన విధానము :

గ్రామవ్యవస్థకు సంబంధించిన మూడోముఖ్యాంశం, గ్రామపరిపాలన. అంతరము, బాహ్యము, అనేవి పరిపాలనకు సంబంధించిన రెండుభాగాలు. శాంతి భద్రతలను రక్షించడమూ, పోలీసుదళానికి, సంబంధించిన కర్తవ్యాలను నిర్వహించడమూ, దానికర్తవ్యం. ఈ విషయంలో అది స్వయం పరిపాలన సమర్థమైన ఏకాంశం; గ్రామపంచాయతి దానిసాధనం.

మధ్యయుగాలలో, ఉత్తరభారతంలోని గ్రామపంచాయతి సంప్రదాయాలు,-కులపంచాయతికి భిన్నమైనవి;-మరుగుపడినవి కాకపోయినా, అస్పష్టమైనవి. దక్కనులోను, దక్షిణ భారతంలోను, ఆకాలానికే, తమ విశుద్ధసత్వాన్ని గోల్పోయియున్నా, గ్రామపంచాయతీలు, పద్దెనిమిదోశతాబ్దాంతంవరకూ నిలిచిఉన్నవి. వాటిప్రధానధర్మం న్యాయపరిపాలనకు సంబంధించినది. అధికభాగమైన శివిల్‌వ్యాజ్యాలూ, అల్పవిషయాలకు సంబంధించిన దండనీతి వ్యవహారాలూ, పంచాయతీతీర్మానాలకు లోబడిఉండినవి. ఖాతాలెక్కల ప్రసంవిదాలు(Covenannts), లేక రుణాలు, అనే కరారులు; స్వంతము, లేక, వాస్తవమైన ఆస్తికి సంబంధించిన వివాదాలు; అధీనంవల్లకాని, లేక,భోగాధికారంవల్లకాని, భూమివిషయంలో ఏర్పడినదావాలు; కులాల మధ్యఏర్పడినకలహాలు; సంస్థాపితములైన ఆచారాల అతిలంఘనములు (Infringements), వివాహవిషయమైన వాగ్దానభంగములు;దత్తతకు సంబంధించిన నియమాల ఉపేక్ష; దానానికీ, అనుదానానికీ, వారసత్వానికీ సంబంధించిన వివాదాలు;- ఇత్యాదులన్నీ, మహారాష్ట్రప్రాంతంలో పంచాయతుల నిర్ణయానికి వచ్చేవి.

కొన్ని ప్రదేశాలలో శ్వాశతమైన పంచాయతులు ఏర్పడిఉండినవి. గ్రామప్రజలు, నిర్దిష్టకాలావధులను అనుసరించి, వీటిని ఎన్నుకొనేవారు. ఇతరచోట్ల, సందర్భాలనుబట్టీ, తదర్థమైన (Ad-hoc) పంచాయతులను ఏర్పాటుచేసేవారు. వివాదానికి సంబంధించిన పక్షాలవారు కొంతమంది వ్యక్తులపేర్లను [ఇద్దరు మొదలు ఇరవై మందిదాకా] సూచించగా, స్థానిక ప్రభుత్వం, పంచాయతి కార్యక్రమాలను పర్యవేక్షణ చేయడానికై ఒక ఆప్తజనుని (Umpire) నియమించేది. ద్రవ్యసంబంధమైన వ్యవహారాలకు సంబంధించిన వివాదాలను విచారణకావించడంలో, ప్రసిద్ధులైన వర్తకులను (బనియాలు) సహాయార్థం, ఆహ్వానించేవారు. మతసంబంధమైన తగాదాలవిషయంలో,శాస్త్రిలు పంచాయతిలోసభ్యులుగా వ్యవహరించేవారు. న్యాయశాస్త్రానికి సంబంధించిన జటిలసమస్యలతోకూడిన వ్యాజ్యాలవిషయంలో సమగ్ర పంచాయతి, విద్వాంసులైన పండితులతో(శాస్త్రిలు) ఏర్పడేది.

పంచాయతి సభను ఆహ్వానించే కార్యక్రమం, గ్రామపటేలు, లేక, ముకద్దమ్‌పై ఉండినది. "ఏదైనా వివాదం సంఘటించినప్పుడు, మధ్యస్థనిర్ణయం ద్వారా, దానిని రాజీగా

పరిష్కారం చేయడానికి ప్రయత్నించేవాడు. ఈ పద్ధతి ఫలించక, కక్షలవారు పంచాయతి నిర్ణయాన్ని కోరిన సందర్భాలలో, దానిఏర్పాటుకు పటేలు సమ్మతించేవాడు. ఇతర విషయాలలోకూడా, ప్రముఖవ్యక్తిగా ఉండేతప్ప, పంచాయతి సభ్యులను నిర్ణయించేఅధికారం, పటేలుకులేదు. కాని, వివాదవిషయంలో సాక్షులను, పంచాయతిసభకు హాజరుకావలసిందని ఆదేశించే అధికారం అతనికి ఉండింది." పటేలు అధికారాలు పంచాయతిని సమావేశపరచడానికి మాత్రమే పరిమితమైనవి. నిర్ణయంలో జోక్యంకలుగచేసుకోడానికి వీలులేదు. వివాదపక్షాలవారు, మధ్యస్థనిర్ణయాన్నిగాని, లేక, స్నేహితుల నిశ్చయాన్నిగాని, ఒప్పుకోడానికి ఇష్టపడినట్లయితే, పటేలు జోక్యంకలిగించుకోడు.

పంచాయతిసభ్యులుగా, రైతులతోసహా, ఎవరినైనా, ఎన్నుకోవచ్చు. కాని, చాలినంత ప్రపంచజ్ఞానము, మానవస్వభావ, లోకానుభవముంపై ఆధారపడిన మంచిజ్ఞానము గల వ్యక్తులను మాత్రమే సభ్యులుగా ఎన్నుకోడానికి, ప్రజలు ఇష్టపడేవారు.

సభ్యులయోగ్యతను అర్హతలను ప్రశ్నించడానికీ, వారినితొలగించి వేరేసభ్యులను నియమించవలసిందని కోరడానికీకూడా, వివాదపక్షాలవారికి హక్కుకలదు. సభకుహాజరుకావడం సాక్షులబాధ్యత; రానిపట్ల, వారిపై జరిమానా విధింపబడేది. పంచాయతి సభ్యుల విషయంలో నిశ్చితమైన రుసుమును నియమించిఉండలేదు. కాని, వివాదపక్షాలవారు, ఖర్చులను భరించవలసి వచ్చేది. పంచాయతును సమావేశపరచడానికై, కొంతడబ్బును, వాదిపక్షంవారు, స్థానికఅధికారికి చెల్లించవలసి ఉండేనది, కాని, దీనికి ప్రమాణశ్రేణినిశ్చితమై ఉండలేదు.

పంచాయతిసభ అనుసరించే కార్యక్రమవిధానం సరళమైనట్టిది. వాదిప్రతివాదులు తమతమ వివాదవిషయాలను వాఙ్మూలంగా విన్నవించుకొనేవారు. ఆపై సాక్షులుప్రమాణ స్వీకారంచేసి [వివాదపక్షాలవారు కోరినట్లయితే] తమసాక్ష్యాన్ని ఇచ్చేవారు. వివాదాంశ విషయంలో వివరణ అవసరమైతే, పట్వారీవివరించేవాడు. పర్యాలోచనానంతరం, పంచాయతి సభ తన నిర్ణయాన్ని అమలుజరిపే బాధ్యతను సామాన్యంగా, గెలిచినపక్షంవారికి అప్పగించేవారు. అమలుజరపడం, అతనికి సాధ్యంగాకపోతే, స్థానికకార్యకారుని సహాయాన్ని పొందవచ్చు. పంచాయతివిచారణలో వకీళ్లు పాల్గొనడంలేదు. విచారణవిషయాల, లిఖిత అభిలేఖలు (Written records) కూడాలేవు. కాని, వాదిప్రతివాదుల ఒప్పందము, పంచాయితీ నిర్ణయముమాత్రం, లిఖితపూర్వకంగా ఉంచేవారు.

పంచాయితినిర్ణయం, తనకు అన్యాయం చేసిందని తలచినపక్షంవారు, పైఅధికారస్థానానికి అప్పీల్‌చేసుకోవచ్చు. తరఫ్ (Sub division) యొక్క శిక్దార్, లేక, పరగణాయొక్క (జిల్లా) మమ్లత్‌దారు, ఉన్నతన్యాయస్థానాలు. అప్పీలుచేయడానికి అవసరము ఉన్నదని ఈ ఉన్నతాధికారులు తృప్తిపడితే, పునర్విచారణకై, వ్యాజ్యాన్ని, మరొకపంచాయతికి పంపేవారు. కేసువిషయమైనతీర్పు, లేక,దండనము, అధికారదుర్వినియోగానికి లోనైనదని, కాని, పంచాయతిసభ్యుల దుష్ప్రవర్తనలవల్ల జరిగిందనికాని, లేకా, న్యాయానికి సంప్రదాయానికి విరుద్ధమై ఉన్నదనికాని, అధికారులు నిశ్చయించిన సందర్భాల్లో, పునర్విచారణకై క్రొత్తపంచాయతును ఏర్పరిచేవారు.

ప్రతిగ్రామము, స్వయంపరిపాలకమైన ఏకాంశంగా ఏర్పడిఉండినది. క్రమశ్రేణీబద్ధమైన ఏకకేంద్రీయ అధికార అంగములద్వారా, దీనికి సర్వోచ్చకేంద్రాధికారంతో సంబంధం

ఏర్పడినది. ప్రభుత్వముయొక్క సమగ్రమైన నిర్మాణానికి గ్రామవ్యవస్థ, మూలాధారం. ప్రభుత్వకార్యాచరణ ప్రవృత్తికి కావలసిన ధనం, గ్రామాలవల్లనే లభించేది. రాజస్వ ఆవశ్యకాన్ని పూర్తిచేసేది గ్రామం కావడంవల్ల, ప్రభుత్వానికీ గ్రామానికీ సంబంధం సిద్ధించింది.

మధ్యయుగాల రాజకీయవ్యవస్థలో, అత్యంతప్రాముఖ్యం, భూమిశిస్తు విధానానికి సిద్ధించడం, సహజమే. ప్రభుత్వముయొక్క జీవితము, శక్తిసామర్థ్యాలు, శిస్తువిధానము యొక్క సమర్థతపైనా, స్వస్థతపైనా, ఆధారపడి ఉంటాయి.

భూరాజస్వవిధానం, భిన్నప్రాంతాలలో భిన్నపద్ధతులలో ఏర్పడింది. కాని, ఈ వైవిధ్యంవల్ల, రాజస్వమునకు సంబంధించిన ఆధారపథకానికి, భంగంకలుగలేదు. రైతులకూ ప్రభుత్వానికీ మధ్యస్థమై ఉన్న అంశాల విషయానికిమాత్రమే సంబంధించినది, ఈ భిన్నత్వం.

ఉత్తరదేశగ్రామాలు, దక్షిణదేశగ్రామాలు, అని స్థూలంగా రెండువిధములైనవి గ్రామాలు. సింధుగంగా మైదానానికి చెందిన ఉత్తరదేశ గ్రామంయొక్క ఉత్పత్తికి ముగ్గురు ముఖ్యభాగస్థులుఉండిరి; ఉత్పాదకుడైనరైతు, మధ్యస్థుడు [జమీందారు, లేక, జాగీర్దారు], ప్రభుత్వము. దక్కన్‌మధ్యమ సమతలప్రదేశము, సముద్రతీరభూములు,- అనేప్రాంతాలలో దక్షిణదేశగ్రామాలలో, ఉత్పత్తిని పంచుకొనేవారు ఇద్దరే;-రైతు,ప్రభుత్వము. ఈ విధమైన విభజన, ముస్లిము ఆక్రమణయొక్క ఫలితమైఉండవచ్చు.

కాని ఈ రెండువిధములైన గ్రామాల్లోనూ కూడా, రాజస్వంచెల్లించేవారు, చెల్లించని వారు, అనిప్రజలు రెండువర్గాలైఉండిరి: (I) పురోహితులు, పండితులు, జ్యోతిష్కులు, మసీదులకు, దేవాలయాలకు, స్మశానాలకు పరిచారకులైనవారు; (ii) భర్తృహీనలు, నివృత్తి వేతనభోగులు- (Pensioners); (iii) సందేశహారులు, రాత్రికావలివాళ్ళు, పైరులరక్షకులు, నీటినిపొలాలకుపారించేవాండ్లు, సరిహద్దు-కాపలివాండ్లు అనేగ్రామసిబ్బంది; (iv) కుమ్మరులు కంచరవాండ్లు, చర్మారులు, చాకలులు, మంగలులు, అంగడివాళ్ళు, దేవదాసీలు, తోటివాళ్ళు, మొదలైనగ్రామంయొక్క వృత్తికార్మికులు. సేవాజనము; (v) పొలంలేనిశ్రామికులు, దరిద్రులు, [వకీర్లు భిక్షుకులు] - అనే వీరు పన్నులు చెల్లించనివర్గంలోనివారు. దక్షిణదేశ గ్రామాలలో, గ్రామసేవకులను, వృత్తికార్మికులను, 'బారాబలూటా' [పంటలోభాగంగల పన్నెండువర్గాలు] అనివ్యవహరించేవారు.

రాజస్వంచెల్లించేవారిలో, వివిధకులాలకుచెందిన,-బ్రాహ్మణులుమొదలు, కులబాహ్యుల వరకూగల - వ్యవసాయదారులందరూ చేరిఉండిరి. ఒకగ్రామంలో నివసిస్తూ, మరొకగ్రామ భూములను గుత్తకుతీసుకొన్నవ్యక్తులుకూడా, పన్నులుచెల్లించేవారే. తమభూములను స్వయంగా సాగించుకొంటూఉన్న చిన్నజమీందారులూ, కౌలు లేక, గుత్తవిధానంపై ఇతరులచే భూములను సాగుచేయించుకొంటున్న పెద్దజమీందారులూ కూడా, రాజస్వంచెల్లించేవారు. ఇట్టిపెద్దజమీందారీ పద్ధతి, ఉత్తరదేశ గ్రామాలలో సాధారణమైనది; దక్షిణదేశంలో చాల తరచు. వీరిని, ఉత్తరభారతంలో జమీందారులని, గుజరాతులో జిరాసియాలని, కొంకణ్‌లో ఖోట్స్అని, బీహారులో మాల్‌గుజారులని, వ్యవహరించేవారు.

ఈ రెండువర్గాలప్రజలే కాక, గ్రామంలో కొంతమంది గ్రామోద్యోగులు, ప్రభుత్వాధి కారులుఉండేవారు.

చెమటోడ్చిశ్రమించి,విస్తృతసామాజిక యంత్రాన్ని నడపుతున్నరైతు, వీరందరిలోను

ప్రాముఖ్యమైనవాడు. అణగద్రొక్కుతున్న ప్రభుత్వభారాన్నంతా, 'అట్లాసుపేరునివలె' తన వీపుపైవహించిఉండినాడు. [ప్రపంచానికి ఆధారములైన స్తంభాలనుమోస్తూ ఉండినదేవత, అని గ్రీకుపురాణాలు] దినదినమూపెరుగుతున్న ఈ భారాన్ని, రైతుమోసేటట్లుచేయడం, ఎట్లు? అనేది సమస్యగాఏర్పడింది.

శాంతిభద్రతలను నెలకొల్పేవిషయంలో, అధికారశక్తిని ఉపయోగించడం, కట్టడపటి సాధనంగా ప్రభుత్వం మంజూరుచేస్తుంది; ఇది ప్రస్తుతకాలపు పద్ధతి. కాని, ఆయుగాలపరిస్థితులలో, ప్రభుత్వశక్తిని ఉపయోగించడం, సర్వసాధారణమైనవిషయం.తనఅధికారాధిపత్యాన్ని నిలుపుకోవానికి, పరిపాలకుడైనవాడు సర్వదాజాగరూకుడై ఉండకతప్పదు. దేశంలోనిశాంతికి భంగంకలిగించేవారిని, ప్రభుత్వంపట్ల అవిధేయులైనవారిని, ఎప్పుడూ, ఒకకంటకనిపెట్టి ఉండవలసిందే.

అంతేకాక, తనకష్టాలను, లోపాలను, స్వప్రయోజనార్థం ఉపయోగించుకోవానికై కాచుకొనిఉన్న, దురాశాపరులైన పరదేశాలరాజులనుకూడా, మెలకువతో చూస్తూఉండడం పరిపాలకునికర్తవ్యము. అధికారశక్తిలో, ఆధిపత్యంయొక్క సారాంశంనిహితమై ఉన్నది. మెరుస్తూఉండే కవచాలతోను, భయావహమైన ఆయుధపరికరాలతోను, కూడిన సైన్యము యొక్క కార్యాచరణమే, అధికారశక్తి. పౌరనిర్మాణ కార్యాలవైభవం, దేశముయొక్క సమృద్ధిని, సంపదను, బలాన్ని, సూచిస్తూ, పరిపాలకుని ప్రతిష్ఠను ప్రసరింపచేస్తుంది.

ఈ యుద్ధస్తంభ, శాంతిస్తంభాలను నిలుపుతున్న, దృఢమైన ఆధారమూలము, గ్రామంలోని రైతు.

దాతయైన రైతుకూ, గ్రహీతయైన ప్రభుత్వానికీ కూడా, దిక్కుతోచనట్టి జటిల పరిస్థితి ఏర్పడింది. ప్రభుత్వపుచిక్కులు రెండువిధములైనవి. (1) అధికతమమైన ద్రవ్యాన్ని రైతులనుంచి ఏవిధంగా రాబట్టుకోవడం, (2) దేశమంతటా శతసహస్రాలుగా వ్యాపించియున్న పల్లెలలోనూ గ్రామాలలోనూ నివసించే రైతులు, ఒక్కరొక్కరూ జంటించు రూపంలో, చెల్లిస్తున్న పన్నులను, ఏ విధంగా సేకరించడం,- అనేవి, ఈ రెండుచిక్కులు.

అతిప్రాచీనకాలపు వ్యవసాయ పద్ధతులను అనుసరిస్తున్న రైతుల నిరంతర కఠిన శ్రమకు ఫలితం, అత్యల్పమైనట్టిది. వ్యవసాయపుఖర్చులు, వృత్తికార్మికులకు సాంప్రదాయికమైన భాగము, గ్రామసేవకులకు, ఉద్యోగులకు చెల్లించవలసిన భాగము, ప్రభుత్వము ఆదేశిస్తున్న రాజస్వము,- అన్నీ కూడా తాను పండించిన దానిలో నుంచే ఇవ్వవలసి ఉన్నది. క్లేశప్రయాసలు మాత్రమే అతడుపడిన కష్టానికి బహుమానంగా మిగిలినవి.

మొత్తంపంటలో 25 శాతం వ్యవసాయపు ఖర్చులకు పోతుందని, 5 నుండి 15 శాతం వరకు ఇనాములకిందా, మామూళ్ళకిందా ఖర్చుఅవుతుందని, సంవత్సరాంతంవరకు రైతుకుటుంబపోషణకు, ప్రభుత్వపు పన్నులకుచేరి, 60 శాతంఖర్చు ఔతుందని, అంచనావేసినారు. రైతుపండించే పరిమిత ధాన్యపరిమాణాన్నిబట్టి. దీనిలో ఎంతభాగం ప్రభుత్వానికి వశం కావించినాడు,- అనే విషయాన్ని పరిశీలించడం అత్యంత ప్రధానమైనది.

తాను ప్రభుత్వానికి చెల్లిస్తున్న పన్నులు, ఏ విధంగా వినియోగమౌతున్నాయి అనే విషయమే రైతుకు ఏమాత్రమూ తెలియకపోవడం, ఈ పరిస్థితిని అంతటినీ కల్లోలపరిచే దుస్థితి. పూర్వకాలమునుంచి వస్తున్న ఆచారాన్ని, సంప్రదాయాన్ని, తన ప్రాణాన్ని ఆస్తిని

రక్షించే ప్రభుత్వాన్ని గౌరవించి, రైతుపన్నులు చెల్లించడం, న్యాయమైనది, అని, సమర్థించ వలసియున్నది. తరతరాలనుంచి. పంటలోని భాగాన్ని రాజుకు చెల్లించడానికి, తన పూర్వులు అలవాటుపడి ఉండినారు. రైతులపంటలోని అంశాన్ని ప్రజలశ్రేయస్సుకొరకే రాజు గ్రహిస్తాడనీ, సూర్యుడు నీటిని ఆవిరిరూపంగా గ్రహించి మళ్ళీ భూమికే వర్షరూపంలో ఇస్తున్నట్లు, రాజుకూడా, రాజస్వాన్ని ప్రజల యోగక్షేమంకొరకే వినియోగిస్తాడనీ, ఋషులు విశ్వాసం కలిగించి ఉండిరి. సమాజము యొక్క నాలుగుభాగాలలో, రైతు ఒకభాగమని పరిగణించిన అబుల్‌ఫజల్, "రైతుశ్రమవల్ల ప్రజల జీవనాధారమైన ఉత్తమపదార్థం సిద్ధిస్తుంది. బలమూ, సౌఖ్యమూ, వారికృషివల్ల సమాజంలో ప్రవహిస్తాయి." అని వ్రాసి ఉంచినాడు. "రైతుకు రక్షణను కల్పించి, ప్రజల బాగోగులను గమనిస్తూ, దేశాన్ని అభివృద్ధిపరచి, రాజస్వాన్ని వృద్ధికావించుకొన్నవాడే, ఋజువర్తనుడైన ప్రభుత్వపరిపాలకుడు." అని అతని అభిప్రాయం. ఈ భావాలు చాల ఉదారమైనవే, కాని, పద్దెనిమిదోశతాబ్దంలోని రైతు జీవితం మాత్రం దరిద్రమైనది, అసహ్యకరమైనట్టిది, దుఃఖార్తమైనది, అనిశ్చితమైనట్టిది.

ప్రభుత్వానికీ, గ్రామానికీ మధ్య, దాగుడుమూతల ఆటవంటివ్యవహారం, నిరంతరం సాగుతూ ఉండింది. ఎడతెగక ఎక్కువ ఔతూఉండే పన్నులు వసూలుచేసే ప్రయత్నం ఒక వైపూ, వాటినుంచి తప్పించుకోడానికి చేసే నిరంతరప్రయత్నం మరొకవైపూ, జరుగుతూ వచ్చింది. ఆర్థికభాటకాన్ని (Economic rent) లాగుకోవడం ప్రభుత్వముయొక్కకోరిక. అందువల్ల, కేవలం జీవనాధారానికి తగినంతమాత్రమే రైతుకుమిగిలేది. వ్యవసాయంచేసే ప్రతివ్యక్తికీ, అతనికుటుంబానికీ, విత్తనానికీ, మళ్ళీ పంటవచ్చేవరకూ అవసరమైన భాగాన్ని రైతుకు వదలివేయవలసిందనీ, తక్కినభాగం పన్నుగా ప్రభుత్వకోశంలో చేరవలసింది" అని ఔరంగజేబు ఇచ్చిన అనుదేశాలు (Instructions). బంగారుగుడ్డును పెట్టేబాతునుకోసిన విధంగా, ఈ విధానము ఆత్మవినాశకరమయింది. ఉత్పత్తిని ఎక్కువ చేయడానికిగాని, వ్యవసాయపద్ధతులను బాగుపరచుకోడానికి ప్రోత్సాహంకాని, లేకపోయింది.

సంవత్సరవ్యయాన్ని ముందుగా అంచనావేసుకొని, దానికి తగిన ద్రవ్యాన్ని రాజస్వంగా సేకరించడం, ప్రభుత్వమునకు ఉన్న సమస్య. చాలవరకు మార్పు చెందక, ఒక నిశ్చితమైన మొత్తం, ప్రతిసంవత్సరమూ ఆవశ్యకమై ఉండింది. ఈ మొత్తాన్ని సమకూర్చు కోవడానికి, భూమి పన్నుప్రధానమైన ఆధారం. ప్రభుత్వానికి, పంటలోనిభాగంపై హక్కు కలదు అనే విషయాన్ని ఎవ్వరూ కాదనరు. కాని, ప్రభుత్వానికి చెందవలసిన నికరభాగం అప్పుడప్పుడు మారుతూ వచ్చింది; పరిపాలకుల మారడంవల్ల ఈ మార్పుకూడా కలిగి ఉండ వచ్చు. హిందూధర్మశాస్త్రాలను అనుసరించి ఉత్పత్తిలో పంద్రెండోభాగానికి, ప్రభుత్వానికి హక్కు ఉన్నది. ఒకప్పుడు ఎనిమిదోభాగము ; కష్టసమయాల్లో నాలుగోభాగంకూడా, తీసు కోవడానికి అధికారం ఉన్నది.

కాని, సాధారణంగా, ఆరోభాగం [షడంశం) ప్రామాణికమైన భాగంగా తోస్తుంది.. ఏడో శతాబ్దంలో ఇండియాను పర్యటించిన యువాన్‌ష్వాంగ్, ఈ విషయంలో సాక్ష్య మిచ్చి ఉన్నాడు. పదమూడో శతాబ్దంలో, అల్లావుద్దీన్ ఖిల్జీ, పన్నును పంటలో సగంభాగానికి పెంచినాడు. ఒక్క బిహారులో పండేపంటలో మూడవభాగం సర్కారుపన్నుగా, షేర్‌షా నియమించినాడు. అక్బరుకూడా, షేర్‌షా పద్ధతినే అవలంబించెను. కాని, ఔరంగజేబు పరి

పాలనలో, సగముపంట ప్రామాణికమైన పన్నుగా నిశ్చితమై, మొగల్ సామ్రాజ్యం అంత మయ్యేవరకూ, ఈ పద్ధతే సాగుతూ వచ్చింది.

ఐతే, మొత్తంపంట ఎంత, దానిలోనుంచి సర్కారుకోశానికి చెందవలసిన శాత మెంత, అని తెలుసుకోవడం ఆవశ్యకం అయింది. ఈ సమస్యకు సంబంధించిన హేతుబద్ధ మైన సమాధానంలో ఈ క్రింది విషయాలు ఇమిడిఉన్నాయి (1) ప్రతి రైతుయొక్క పొలాలనూ ప్రత్యేకంగా కొలవడం, (2) క్షేత్రస్వభావాన్ని, పంటల స్వభావాన్ని ఆధారంగా చేసుకొని, బిఘాలో సరాసరిపంట ఎంత అని అంచనావేయడం, (3) ప్రతి బిఘాలోని ప్రతి పంటకూ, కొన్నిసంవత్సరాల ధరలను ఆధారంగా చేసుకొని, మొత్తం ఉత్పత్తికి వెలను నిర్ణయించడం, (4) సాగుబడిచేసిన పొలాల విస్తీర్ణానికి, అననుకూల పరిస్థితులకు, నైసర్గిక ఉపద్రవాలకు, తగినరియాయితీ (Concessions) ఇచ్చి, ఈ వెలలఆధారంపై, ప్రతి రైతు నుంచీ పన్నులను వసూలుచేయడం.

అక్బర్, తన సామ్రాజ్యంలో ప్రవేశపెట్టిన పద్ధతియొక్క సారాంశం ఇట్టిదే. సింధు-గంగామైదానాన్ని, మధ్యమోన్నత భూములలో కొంతభాగాన్ని, అక్బర్ సామ్రాజ్యం ఆక్రమించి ఉండింది. ఇటీవలనే, కలుపుకొన్న బెంగాలుప్రాంతంలో ఈ రాజస్వపద్ధతిని ప్రవేశ పెట్టలేదు. సామ్రాజ్యానికి బైటఉన్న దక్కనుకు కూడా, ఈ పద్ధతి వర్తించలేదు. అక్బర్ అవలంబించిన పద్ధతిప్రకారం, ప్రభుత్వవిషయంలోను, రైతువిషయంలోను, గల అనిశ్చిత పరిస్థితులను తగ్గించి, ఇరువురిభాగాల లెక్కలనూ నిశ్చయించడానికి తగిన ద్రవ్యరూపమైన ఆధారాన్ని ఏర్పరచింది. భూమిపన్నును విధించడంలో, అక్బర్ అనుసరించిన ఉత్కృష్ట మార్గం ఇది. ఆయాకాలాలలో పంటలధరలు మారుతూఉండడము, పన్నుగా చెల్లించిన ధాన్యాదులకు ద్రవ్యరూపంలో వెలకట్టడము, అనే క్లేశకరములైన తొందరలు లేనట్లుగా, ఈ పద్ధతి ఏర్పడింది. పన్నులను నిర్ణయించే పద్ధతి దీనిప్రకారం రచింపబడిన అభియాచన సూచీలు (Demand schedules), అన్ని వ్యవసాయభూములకూ వర్తించినవి. చక్రవర్తికి ప్రత్యేకింపబడి, రాజ్యాధికారుల పరిపాలనలోఉన్న ఖాల్సాభూములను, ఉద్యోగులవేతనాల బటవాడాకు, అనుదానగ్రాహీలకు (Grantees), ఆదాతలకు (Donees), ద్రవ్యరూపంగాకాని, జాగీర్ల రూపంగాకాని, ద్రవ్యాన్ని సమకూర్చే ఇనాము భూములకు, కూడా, ఈ పద్ధతి వర్తించేది. జాగీర్లను, ఆదాతలైన జాగీరుదార్లు తమ స్వంత కార్యకారులద్వారా నిర్వహించుకొనేవారు.

పన్నులను అంచనావేయడానికి, వసూలుచేయడానికి, పర్యాలోచనతో ఏర్పడిన విధానం స్థాపించబడింది. అత్యుచ్చస్థానంలోని, రాజస్వ మంత్రిమండలిలో, ఇద్దరు దివానులు ఉండిరి! చక్రవర్తి భూములను నిర్వహించే దివాన్-ఇ-ఖాల్సా, జాగీరుభూములను చూచుకొనే దివాన్-ఇ-తాన్, అనేవి ఇవి. దివాన్ అధీనంలో, ప్రాదేశిక, లేక, ప్రాంతీయదివానులు, ఉండేవారు. పన్నులను అంచనావేసేశాఖ, వాటిని వసూలుచేసేశాఖ, ప్రభుత్వకోశాన్ని పరిపాలించే శాఖ అని మూడుశాఖలు, ప్రతిదివానుకు అధీనమై ఉండినవి. సర్కారులు అని వ్యవహరించబడే, ప్రాంతవిభాగాల పరిపాలనను అధీన అధికారులు చూచుకొనేవారు. ప్రతి సర్కారులోనూ పెక్కుపరగణాలు ఉండినవి. కానుంగో, చౌదరి, కార్కోన్, అనే అధికారులు ప్రతి పరగణాలోనూ ఉండినారు. పరగణాగా ఏర్పడిన గ్రామాలలో, పన్ను

లను వసూలుచేయడానికై ఒక ముకద్దమ్, అభిలేఖలను వ్రాసిఉంచడానికై ఒక పట్వారీ. ఉండేవారు.

ఉత్తరప్రదేశ గ్రామాల్లో, స్వయంగా వ్యవసాయదారుడై ఉన్న గ్రామముఖ్యస్థుడు, లేక, ముకద్దమ్, ప్రభుత్వానికీ, గ్రామానికీ మధ్యస్థుడుగా వర్తించేవాడు. రైతుల నుంచి పన్నులు వసూలుచేయడానికి, గ్రామానికి సంబంధించిన రాజస్వాన్ని చెల్లించడానికి బాధ్యత వహించేవాడు. అతని ఉద్యోగం వంశానుక్రమమైనది. అతని సేవకు ప్రతిఫలంగా పన్నుం వసూలు మొత్తంలో $2\frac{1}{2}$ శాతం, అతనికి లభించేది.

జాగీరుభూముల విషయంలో, జాగీర్లు విస్తృతమైనవి ఐనపట్ల, కార్యకర్త, పన్నులను వసూలు చేసేవాడు. జాగీర్లు చిన్నవైనచో, జాగీర్దారు, ఒక రైతుకు ఆ పనిని అప్ప గించేవాడు.

జాగీరుదార్లుమాత్రమేకాక, వంశానుగతమైన హక్కులుగల జమీందార్లుకూడా ఉండి నారు. కొన్నిచోట్ల వ్యక్తులుకూడా జమీందార్లుగా ఉండినారు. ఇతర ప్రదేశాలలో, వ్యవస్థాప కుడు (Manager) ఒక జమీందారీవర్గానికి ప్రతినిధిగా వ్యవహరించేవాడు. ఒకప్పుడు స్వతంత్రమైన సార్వభౌమాధిపత్యాన్ని ప్రవర్తింపచేసిన వంశాలసంతతివారు, ఈ జమీందారు లలో ఉండినారు. దేశాన్ని జయించినవాని ఆధిపత్యాన్ని, వీరు అంగీకరించవలసి వచ్చింది. వీరి విషయంలో భూమిపన్ను అనేది, ఒప్పందంప్రకారం నిశ్చితమైన కప్పము మాత్రమే. కాని, గ్రామాలలోని వ్యవసాయదారులవలెనే, పన్నును చెల్లించే జమీందారులుకూడా పెక్కు మంది ఉండిరి.

దక్షిణదేశపు గ్రామాల్లో, జమీందార్లు లేరు. జాగీరుదార్లు అనామధేయులు. కనుక, అక్కడి పరిస్థితులు వేరై ఉండినవి. మహారాష్ట్ర ప్రాంతంలోని, మాలిక్ అంబర్ అనుస రించిన, రాజస్వపరిపాలనవిధానం (1605-26) ఈ క్రింది విధంగా ఏర్పడినది. సాగుచేసిన భూములను కొలవడము, పంటనేలలను వర్గీకరించడము, పంటలో మూడోవంతును ప్రభుత్వ భాగంగా నిశ్చయించడము,- అనేది ఈ పద్ధతి. సంస్థానాలను ఖాల్సా, అని, ఇనామ్, అని, అతను రెండుగా వర్గీకరించెను. ఇనాము భూములనుంచి వచ్చే భాటకాన్ని. దానప్రయోజనా లకు, సేవా ప్రతిఫలాలకు (వతన్) వేరుచేసినాడు. గ్రామరాజస్వాన్ని, పటేలు, కులకర్ణి, నిర్వహించేవారు.

రాజస్వవ్యవస్థలో, అభివృద్ధికరములైన మార్పులను అధికంగా తెచ్చినవాడు, శివాజీ. కాని, పంటలో 40 శాతంవరకూ భాటకాన్ని పెంచుతూ, అనేకములైన రుసుములను తొల గించివేసినాడు. తర్వాతి కార్యక్రమాన్ని ప్రారంభించినవాడు, మూడోపీష్వా, బాలాజీ బాజీరావ్. [1740-61] భూముల సర్వేక్షణను (Survey) క్రొత్తగాజరిపించి, పంటలను, నేలను, వర్గీకరణం కావించి, పన్నులరేటును క్రొత్తగా నియమించెను. అతడు చేసిన భూమి పరిష్కారానికి, కౌమక్, అని పేరు. [ప్రమాణమైనది.]

మరాఠావ్యవస్థలో, మిరాస్‌దార్లు, ఉపరీలు, అని రెండు పక్షములైన వ్యవసాయదార్లు ఉండెడి. భూమిపై వంశానుగతమైన హక్కులు కలవారు మిరాస్‌దార్లు. ఈ హక్కులు హిందూన్యాయశాస్త్రరీత్యా సంక్రమించినవి కాబట్టి, అప్పుల విషయంలోకాని, పన్ను చెల్లించ నందుకుగాని, వీటిని జప్తు చేయడానికి వీలులేదు. ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు, శాశ్వ

తంగా, నియతం కావింపబడింది. కాని, రుసుములను నియమించనందువల్ల, ఈరియాయితి నిష్ప్రయోజకమైపోయింది.

ప్రభుత్వము యొక్క ఇష్టాన్నిబట్టి ఏర్పడిన ఖాటకదార్లు ఉపరీలు. వీరుచేసుకొన్న ఒప్పందాలు సంవత్సరాంతంవరకే, వర్తిస్తాయి. పటేల్, కుల్‌కర్ణి, చౌగుల [పటేలుకు సహాయకుడు]. మహర్- లేక- గ్రామచౌకిదారు,- మొదలైన మహరాష్ట్రి గ్రామోద్యోగుల పదవులు, ఉత్తరదేశ గ్రామోద్యోగుల పదవులతో పోల్చదగినవి. కాని, ఉత్తరదేశపు ముకద్దమ్ వలెకాక, మహరాష్ట్రిదేశపు పటేలుకు ఎక్కువ ప్రతిష్ఠ అధికారము, ఏర్పడి ఉండినవి. ప్రధాన గ్రామాధికారియైన పటేల్, ప్రభుత్వగౌరవాధికారులలో ఒకడు; కాబట్టి, గ్రామంలో సర్వోత్కృష్టస్థానం అతనికి సిద్ధించింది. వ్యవసాయ కార్యక్రమాలను పర్యవేక్షణచేస్తూ, ఉత్పత్తి ప్రమాణాలకు భంగం కలుగకుండా చూచుకోవడం అతని బాధ్యత. బీడు పడిన భూములను సాగుబడికిందికి తెచ్చేటట్లు చేయడం కూడా, అతని ఉద్యోగధర్మాలలో ఒకటి. పోలీసుకర్తవ్యాలు, దండనాధికార కర్తవ్యాలు కూడా ఇతనియందే, నిహితములై ఉండినవి. కాబట్టి, నేరాలను అణచివేసి, శాంతిభద్రతలను కాపాడేవాడు. పరులనుంచి గ్రామాన్ని రక్షించడంలో, ఇతడే నాయకత్వంవహించేవాడు. గ్రామానికివచ్చిన ప్రభుత్వాధికారులకు విందు చేయడము, గ్రామజాతరలను సంతలను, వినోదాలను నడపడము,- ఇతని విధులు.

తూర్పుప్రాంతాల తెలుగు తమిళప్రదేశాలలోని గ్రామవ్యవస్థ సర్వసాధారణమైన పద్ధతులపై ఏర్పడింది. ఎక్కువభాగం గ్రామాలలో మూడువర్గాల రైతులుండినారు. (1) వెల్లన్ వాగై, అని వ్యవహరించబడే రైతులు, తమ పొలాలను ప్రత్యేకంగా అధీనంలో నిలుపుకొని, సాగుచేసి, ప్రభుత్వపన్నులను (మేలవరం) చెల్లించేవారు. (2) గ్రామసేవకులు (బాలుటేదార్లు) లేక సైనికసేవ, మతసేవ, విద్యాసేవ, లేక ఇతరసేవలు చేసేవారు- మొదలైనవారు, సేవాకాల పట్టాభూములను [భోగ, వృత్తి, కని] అనుభవించేవారు, (3) బ్రాహ్మణులూ, మతసంస్థలూ, ఇత్యాదులు ధర్మార్థం నియమితమైన పట్టాభూములను (Eleemosynary) అనుభవించేవారు. బ్రహ్మదేయము, దేవదానము, శాలి భోగము, అని వీటిని వ్యవహరించేవారు.

అక్కడక్కడ జమీందారీ (మిరాసీ) గ్రామాలుకూడా, ఉండినవి. కాని, పద్దెనిమిదో శతాబ్దం కడపటికి పాళెగార్లకు, జమీందార్లకు, చెందిన పెద్ద సంస్థానాలుతప్ప, తక్కినవి క్షీణించిపోయినవి. తమ పొలాలను అమ్మడానికి, లేక, దానంగా ఇవ్వడానికి హక్కూ, భూములపై స్వామ్యమూ, గల రైతులు, ఈ గ్రామాలలోని వ్యవసాయదారులలో ఒక వర్గం. ఉల్‌కుడి, అనే తక్కువతరగతి రైతులు ఒకవర్గం. పరకుడి అనే తాత్కాలిక వ్యవసాయదారులు, భూకామందుల ఆస్తిలో భాగంలేనివారు.

పద్దెనిమిదో శతాబ్దపు దక్షిణదేశగ్రామవ్యవస్థకూ, ఉత్తరదేశగ్రామవ్యవస్థకూ ఎక్కువ భేదం లేదు. వంశానుగతంగా వచ్చే గ్రామనౌకర్లు. సేవకులు, వృత్తికార్మికులు, పటేల్, నట్టుంకార్, మణియకారన్, నాయుడు, రెడ్డి, పెద్దకాపు, అనే పేర్లతో వ్యవహరించే గ్రామముఖ్యుడు, లెక్కలనువ్రాసే గ్రామకరణము,- మొదలైనవారితో కూడినసిబ్బందీ, గ్రామంలో ఏర్పడింది. ఉత్తరదేశగ్రామాలలో ఉన్న సిబ్బందీ కర్తవ్యాలతో సమానమైనవే వీరి కర్తవ్యాలుకూడా. నౌకర్లకు, వృత్తికార్మికులకూ, పంటలో సాంప్రదాయికమైన భాగాలు ఉండినవి. [మేర-లేక-స్వతంత్రం]. ఖాటకంలేనట్టి భూములను, లేక, ఇనాములను గ్రామాధికారులు

అనుభవించేవారు. గ్రామస్థులు వీరికి రుసుములుకూడా చెల్లించేవారు.

ఉత్పత్తి ఐన పంటను, మూడు భాగాలు చేసేవారు. నౌకర్లకు, వృత్తికార్మికులకు చెంద వలసిన భాగం, పంటలో ఐదోశాతం. మిగిలినపంటలో రైతుకు సగముభాగము, ప్రభుత్వానికి సగముభాగము – ఇట్లు సమంగా,– విభజింపబడేది.

పద్దెనిమిదోశతాబ్దంలో, అక్బర్ ప్రవేశపెట్టిన వినిమయపద్ధతి [జబ్తీ], దానికి సమాన మైన, మహారాష్ట్రుల కమాల్‌పద్ధతి,– రెండూ వేగంగా శిథిలమై పోయినవి. ఈ పద్ధతిని అనుసరించి, రైతుకూ ప్రభుత్వాధికారులకూ ప్రత్యక్షసంబంధం ఏర్పడింది. హెచ్చుమారులైన మధ్యస్థుల మందగిడుతనాన్ని అరికట్టి, ప్రభుత్వం ఏర్పరచిన విధానాలను, అనుసూచీలను, వారు పాటించేటట్లు నిర్బంధపరచింది. అంతేకాక, రుసుములను చాలవరకు రద్దుపరచి, పన్నులరేట్లను నిశ్చితంకావించి, రైతులభారాన్ని తగ్గించి, పైరుల విస్తృతికి, అభివృద్ధికి అవ కాశాలను కలిగించింది. ఇవి ఈ పద్ధతిలోగల సుగుణాలు.

కాని, మిక్కిలి వ్యయముతోకూడిన పద్ధతి ఇది. కేంద్రప్రభుత్వం, నిరంతరమైన జాగరూకతవహించి ఉండి, పన్నులు వసూలుచేసే అధికారవర్గము, నిజాయితీతో సమర్థంగా పనిచేస్తేనే ఈ పద్ధతి సక్రమంగా నడుస్తుంది. దురదృష్టంవల్ల, పద్దెనిమిదో శతాబ్దపు మొగల్ చక్రవర్తులు ధనహీనులై ఉండిరి. వారి కోశాగారాలు ఖాళీ ఐపోయినవి; ప్రభుత్వో ద్యోగుల వేతనాలు ఎప్పుడూ బాకీపడి ఉండినవి. సింహాసనంపై ఉన్నవారు అశక్తులు, సోమరులు, పనికిరానివారు. ప్రభుత్వోద్యోగులు విశ్వాసరహితులు, స్వార్థపరులు, అసమర్థులు.

పరిస్థితులు ఇటువంటివైనప్పుడు, పరిపాలనవ్యవస్థ భగ్నమైపోవడంలో ఆశ్చర్యం లేదు. పన్నులవిషయంలో ప్రతిరైతుతోనూ ప్రత్యక్షమైన కరారు చేసుకోవడం, [పట్టా, మరిన్ని – కబూలియత్] అక్బరుయొక్క ఉద్దేశం. రైతుపేరు, తలిదండ్రులపేరు, సాగు బడి భూమియొక్క విస్తీర్ణం, వేసినపైరులు – మొదలైనవన్ని, ప్రతి రైతువిషయంలోనూ [ఆసామి] వ్రాసి ఉంచేవారు. రైతులు చెల్లించిన పన్నులకు రసీదులను వేర్వేరుగా ఇచ్చే వారు. కాని పద్దెనిమిదోశతాబ్దంలో, గ్రామం, ప్రభుత్వసంస్థలోని ఏకాంశంగా, నిలిచిఉన్నప్ప టికీ, గ్రామానికి ప్రభుత్వానికీ ఏర్పడిఉండిన సంబంధం తెగిపోయింది. ప్రభుత్వం, మొత్తం గ్రామాన్ని ఏకాంశంగా గ్రహించి రావలసిన మొత్తం పన్నువిషయమై గ్రామముఖ్యునితో ఒప్పందం కావించుకొని, వేర్వేరురైతులనుంచి వసూలుచేసేపనిని, అతనికి అప్పగించింది. కాబట్టి, గ్రామాలు స్వయంపోషకసంస్థలుగా, ప్రత్యేకంగా నిలిచిపోవడం, స్పష్టమౌతూ వచ్చింది. గ్రామాలను అన్నిటినీ అఖండమైన ఒక రాజకీయవ్యవస్థగా కూర్పగల బంధాలు, ఈవిధంగా దుర్బలములై పోయినవి.

ఖేతీపద్ధతి (Farming system) వ్యాపిస్తూరావడం, దుర్లక్షణంతోకూడిన మరొక సంఘటన. అక్బర్ దీనిని, నిరాదరించి ఉండడం, సబబైనదే. కాని, అతని తరువాతి వారి పరిపాలనలో, ఈ పద్ధతి, పంటను నాశంచేసే కలుపువలె, దేశంపై వ్యాపించి, ఊపిరి ఆడ కుండా చేసింది. అనేక విషయాల దుస్తంత్రంవల్ల, ఈ పద్ధతి సృష్టికివచ్చింది. జాగీర్లసంఖ్య అసాధారణంగా పెరిగిపోవడం, ఇందుకు ముఖ్యకారణం. జాగీర్లసంఖ్య పెరగడంతో వాటి విలువ తగ్గిపోయింది. జాగీర్లను స్వయంగా పర్యవేక్షణ చేసుకోలేక గుత్తవ్యవసాయదార్లు అనే వారిని నియమించుకొనిరి. వీరు, బలాత్కారపద్ధతులను ఉపయోగించి పన్నులు వసూలు

చేసి, నిర్ధారితమైన సొమ్మును జాగీర్దారులకుఇచ్చి, మిగిలిన దానిని తాము సంగ్రహించు కొంటూవచ్చిరి. అపై, ఇతర మధ్యస్థులు. వారి వ్యావసాయదార్లు, ప్రభుత్వోద్యోగులు, కూడా, గ్రామాల స్వామ్యం తమకే వంశానుగతంగా సంక్రమించిందని ప్రవర్తింపసాగిరి. ఈ విధంగా, భూములపై రైతులకు ఉండిన హక్కులను ఆక్రమించిన తాలూకుదార్లవర్గమూ, జమీందార్లవర్గమూ, దేశంలో ఉత్పన్నమైనవి. సార్వభౌమ విశేషాధికారాలుగల వ్యక్తులవలె వీరు ప్రవర్తించిరి. వారసత్వవిషయంలో రాజులకు వర్తించే న్యాయసూత్రాలు, తాలూక్‌దారీ భూముల వారసత్వవిషయంలో వర్తింపచేయడం, ఇందుకు నిదర్శనం. సామాన్య పౌరులకు వర్తించే న్యాయసూత్రాలు వీరికి వర్తించలేదు. ఇందువల్ల, హిందూముస్లిము వారసత్వ న్యాయసూత్రాలను అనుసరించి, వ్యక్తిమరణానంతరం, సంస్థానాన్ని వారసులకు పంచవలసి ఉండగా, వీరి విషయంలో అవి పాటింపబడలేదు. జాగీరుదార్ల ఈ విధమైన ఆడంబర ప్రవృత్తులు, కేంద్రాధిపత్యాన్ని భగ్నంచేసి, అరాజకత్వానికి ప్రేరణ కలిగించినవి.

# 3
# భారతదేశ రాజకీయపద్ధతులు

## I. రాజ్యము

మధ్యయుగకాలమంతటా, ముస్లిము మతస్థులు రాజ్యాధిపతులుగా ఉండినాకూడా, దేశము, ఇస్లాంరాజ్యంగా ఏర్పడలేదు. సంవిధాన సూత్రముల విషయంలోకాని, రాజ్యానికి ఆధారములైన భావములు, ఉద్దేశాలు, ఫలములు, ఇత్యాది విషయాలలోకాని, రాజ్యపరిపాలన ఇస్లామ్ పవిత్ర గ్రంథాలలోని, వ్యాదేశాలను (Injunctions) అనుసరించలేదు. కురాన్, హదీత్, నాలుగు విధములైన సున్నీవిధిశాస్త్రంలోని న్యాయసూత్రాలు, ఇస్లాముకు, ప్రధాన మైనవి. ఇండియా పరిపాలన విషయంలో వీటిని వర్తింపచేయలేదు. మధ్యయుగ రాజ్యాన్ని, మతధర్మ ప్రభుత్వమని చెప్పడం తప్పు. ముస్లింమతాచార్యుల నిర్దేశంలో, రాజ్యపరిపాలన జరకపోవడమే ఇందుకు నిదర్శనం. రాజుయొక్క వ్యక్తిగత మతానికి, రాజనీతితో సంబంధం ఏమాత్రమూ లేదు.

షరియత్‌ను అనుసరించి ప్రభుత్వపరిపాలన సాగించడం అసాధ్యమని, పదమూడో శతాబ్దం మొదలు తుదిదాకా పాలించిన ప్రతి ముస్లిము చక్రవర్తి, ఈ విషయంలో, తన అశక్తతను సూచించినాడు. ముస్లిమ్ న్యాయశాస్త్రాన్ని భారతదేశానికి వర్తింపచేయడం కుదరదు, అని, మొగలులకు పూర్వం ఇండియాను పరిపాలించిన,- ఇల్‌టుట్‌మిష్, బాల్బన్, అల్లావుద్దీన్‌ఖిల్జీ వంటి చక్రవర్తులు కూడా, గుర్తించినారు. చక్రవర్తుల, ఈ అభిప్రాయాన్ని వ్యక్తపరచిన వ్యక్తి, చరిత్రకారుడైన ఉలామా-జియా-ఉద్-దీన్ కావడం, చిత్రం. ఇతడు రచించిన రాజకీయ సూత్రాలను చర్చించే ఫతావా-ఇ-జహన్‌దారీ అనే గ్రంథంలో, ఈ క్రింది విధంగా వ్రాసిఉన్నాడు. "ప్రవక్తయొక్క 'అడుగుజాడలను' అనుసరించినడవడమే, నిజమైన మతము ... ... కాని, ప్రభుత్వపరిపాలన అనేది, మతానికి వ్యతిరేకమైనది. ఖుస్రోపర్వేజ్ చెప్పిన రాజనీతి విధానాలనూ, ఇరాన్ చక్రవర్తుల రాజనీతినీ అనుసరించడం వల్లనే, రాజ్యపరిపాలన సాధ్యమౌతుంది."

"మహమ్మద్ ప్రవక్తయొక్క సంప్రదాయాలు, అతని జీవిత జీవనపద్ధతులు, వేరు. ఇరాన్ చక్రవర్తుల ఆచార వ్యవహారాలు, వారి జీవిత జీవన పద్ధతులు, వేరు. ఈ రెండు వర్గాలకూ, వ్యతిరేకము, సమగ్రమైన విరోధము, కూడా ఉన్నవి," అని అతడు అంగీకరించినాడు. అత్యంతమూ అసాధారణములైన సందర్భములలో మాత్రమే, భగవదాదేశమైన షరియత్‌ను, రాజ్యవ్యవహారాలలో అనుసరించగలం. ప్రత్యక్షంగా, భగవంతునివల్ల, ఉత్తేజితుడైనవాడు కాబట్టి, షరాలోని ఆదేశాలను వ్యాపింపచేయడంలో, మహమ్మద్ సఫలుడైనాడు. ప్రవక్తకు అనుయాయులు కాబట్టి, మొదటి నలుగురు ఖలీఫాలు కూడా ఈ విషయంలో

కృతార్థులైనారు. కాని, వీరి తరువాత వచ్చిన ఖలీఫాలు, సమన్వయంపదరని రెండు పద్ధతులను ఎదుర్కోవలసి వచ్చింది. ప్రవక్తయొక్క సంప్రదాయాలు, ఇరాను చక్రవర్తుల రాజనీతి విధానాలు, అనేవి ఈ రెండు. కాని, ప్రవక్తత అనేది, మతముయొక్క పరాకాష్ఠస్థితి; రాజత్వము అనేది, ప్రాపంచిక సంపదయొక్క సమగ్ర స్వరూపం. ఈ రెండు పరిపూర్ణదశలూ పరస్పరం విరుద్ధమైనట్టివి; వ్యతిరేకమైనట్టివి. ఈ రెండింటి కలయికా, సాధ్య విషయముయొక్క అవధిలోలేనిది".

ఒకానొక ఉలామా, ఇల్‌టుత్‌మిష్ చక్రవర్తి దగ్గరకుపోయి, ఈ క్రింది విధంగా ప్రార్థించినాడు. హిందువులు అహల్-ఇ-కితాబ్ గ్రంథాన్ని అనుసరించేవారు కారు. కాబట్టి. 'ధిమ్మీలు'గా వారికి ముస్లిముల రక్షణ లభించడానికి వీలులేదు. కనుక, ఇస్లాముమతాన్ని అవలంబించవలసిందని వారిని ఆజ్ఞాపించవలసింది. వారు దానికి అంగీకరించకపోతే, వారిని ఖడ్గానికి బలిఇవ్వవలసింది,- అని ఉలామా ప్రార్థన. దీనికి సమాధానం చెప్పవలసిందని, చక్రవర్తి తన వజీరును కోరినాడు. అసలు జరపడానికి సాధ్యముకాని ప్రార్థన ఇది, అని వజీరు సమాధానము. ఇక, బాల్బన్ విషయమై, చరిత్రకారుడైన నిజామ్-ఉద్-దీన్ "మత విషయాలపైకంటే, చక్రవర్తి రాజ్యవ్యవహారాలకే అగ్రస్థానం ఇచ్చినాడు." అని వ్రాసి ఉన్నాడు. "దండనను విధించడంలోను, రాజ్యాధికారాన్ని నిర్వహించడంలోను, చక్రవర్తి దేవునికి భయపడక వర్తించినాడు. తాను అనుసరించే రాజ్యవిధానాలు షరాకు అనుగుణంగా ఉన్నవా, లేవా, అని చూడక, ప్రభుత్వానికి ప్రయోజనకరములైనవని తనకు తోచిన విషయములన్నిటినీ, కార్యరూపంలో ప్రవర్తింపచేసినాడు", అని బార్నీ (Barni)తెలిపియున్నాడు. కాజీముఘీస్-అల్-దీన్‌తో. అల్లాఉద్దీనుకు జరిగినచర్చ సర్వవిదితమైనది. "ప్రభుత్వానికి ప్రయోజనకరములని నాకు తెలిసినవి, ఆ కాలానికి అవశ్యకములైనవి జరగవలెనని నేను ఆజ్ఞాపిస్తాను. అంతిమ మహావిచారణదినం, సర్వోత్కృష్టుడైన భగవంతుడు నన్ను ఏమి చేస్తాడో నాకు తెలియదు." అని కాజీకి అల్లాఉద్దీన్ ఇచ్చిన కట్టకడపటి సమాధానం.

మహమ్మద్ తుగ్లక్‌నుగురించి, షేక్‌అబ్దుల్‌హక్, ఈ విధమైన ఖండితాభిప్రాయాన్ని తెలిపినాడు. "అధికారాన్ని హేతువాదానికి బద్ధంకావించినాడు. హేతుబద్ధమైన విషయానికి శ్రుతమైన విషయం అప్రధానమైనది, అని నిశ్చయించినాడు. కురాన్, హదీత్,లు అధికారంగా సిద్ధించినది, 'శ్రుత'మైనది [ఇతరులు చెప్పినది] ఫిఖ్. ప్రవక్తయొక్క ఆదేశాలూ ప్రభుత్వముయొక్క ఆదేశాలూ కూడా, మహమ్మద్‌తుగ్లక్ రాజధానినుంచి వెలువడుతూ వచ్చినవి. రాజ్యపదవినీ, ప్రవక్తపదవినీ కూడా తానేవహించినాడు." అని బార్నీ, తుగ్లక్‌పై తప్పుమోపినాడు.

ప్రొఫెసర్ హబీబ్, ఈ విధంగా నిశ్చయిస్తాడు. "ముస్లింరాజులు,- చాలవరకు విదేశీయులు,- ఇండియా సింహాసనాన్ని ఆరు, ఏడు శతాబ్దాలకాలం అధిష్ఠించి ఉండినారు, అనడం, వాస్తవమైనదే. సింహాసనాన్ని ఆరోహించింది చక్రవర్తులేకాని, ముస్లిం పరిపాలన కాదు. కాబట్టే, వారు ఇంతకాలం పరిపాలన సాగించగలిగినారు. దీనికి విరుద్ధంగా జరిగిఉంటే ఒక తరం కూడా, నిలిచిఉండేవారు కారు".

మొఘల్ చక్రవర్తులలో, బాబర్ కొద్దికాలం మాత్రమే రాజ్యంచేసినాడు. హుమాయూనును అనేకములైన కష్టాలు చుట్టుముట్టి ఉండినవి. కాబట్టి, రాజ్యవ్యవహారాలకు ఎక్కువ

దృష్టి చూపడానికి, ఈ ఇరువురికీ అవకాశం లేకపోయింది. ఇస్లాము మత శాసనాలకు లోబడ సట్టి రాజనీతిని, అక్బర్ ప్రవేశపెట్టినాడు. అన్ని మతాలనూ సమదృష్టితో చూచినాడు. మతాన్ని ఆధారంగా చేసుకొని ప్రజలను భేదదృష్టితో చూడకపోవడమే, తన విముక్త ధర్మమని నిశ్చయించుకొన్నాడు. అత్యున్నత పదవులు, ముస్లిములు కానివారికి కూడా అందు బాటులో ఉండేటట్లు చేసినాడు. హిందూరాజ కన్యలను వివాహంచేసుకొన్నా కూడా, వారిని మతాంతరులుగా చేయలేదు. రాజభవనంలోనే, వారు తమ పూజా సంస్కారాలు జరుపుకొనే అవకాశాన్ని కలిగించెను. వారియందు జన్మించిన కుమారులు మొగల్ సింహాసనానికి ఉత్తరాధికారులైరి. మత సంబంధమైన ప్రశ్నల విషయంలో, ముర్షిదీల్‌లో [ముస్లిమ్ పుణ్యపురుషులు] పరస్పర విరుద్ధములైన అభిప్రాయాలు కలిగిన సందర్భాలలో, పరమ నిర్ణయాలను ఇచ్చే అధికారాన్ని తానేవహించి, ఉలామాజోక్యాన్ని తొలగించెను. సాంఘిక ములు, ఇతరములు ఐన అనేక విషయాలలో, ముస్లిములు కాని వర్గాలకుచెందిన ప్రజల భావా లను, సంప్రదాయాలను, అక్బర్ గౌరవించినాడు. హిందువులపై విధింపబడి ఉండిన జిజియా పన్నును రద్దుచేయడం, వీటిలో ప్రధానమైనది. "రాజత్వం దేవుని వరప్రసాదం, ... ... ఈ మహోన్నత పదవికి వచ్చిన పిమ్మట, సర్వమత సహనాన్ని ఆధారంగా చేసుకొని, సార్వత్రికమైన శాంతిని నెలకొల్పకపోతే, అన్ని మానవత్వదశలను, అన్ని మతశాఖలను ఏక దృష్టితో ఆదరించకపోతే,-కొందరిని తల్లివలె పోషించి, ఇతరులను సవతితల్లివలె నిరాదరంతో చూస్తే-అట్టిరాజు, ఆ ఉన్నత పదవికి అర్హుడు కాడు." అని అబుల్‌ఫజల్ బోధిస్తాడు. మత విషయకమైన విభేదాలను పురస్కరించుకొని, ఇతర మతస్థుల బాగోగులను చూడకపోవడం, తప్పు. అన్ని వర్గాల ప్రజలూ నిరాటకంగా, స్తిమితంగా జీవించినప్పుడే, భగవంతుని ఆహ్లా దనం సిద్ధించి, కీర్తిసిద్ధిస్తుంది". అని కూడా అతడు వ్రాసిఉన్నాడు. ఈ విధంగా ఇస్లాము న్యాయశాస్త్రము, హదీత్ కూడా, ప్రభుత్వ కార్య నిర్వహణలో, ధర్మశాస్త్రాలుగా ప్రవర్తించ లేదు." అని ఇబన్ హసన్, వ్రాస్తాడు

జహంగీర్, తండ్రివంటి ధీరపురుషుడు కాకపోయినా, తన తండ్రి ప్రవేశపెట్టిన పరి పాలన సూత్రాలను అనుసరించి, రాజ్యాన్ని నడిపినాడు. షాజహాన్ పరిపాలన యొక్క ప్రథమదశలో, ఈ మార్గాన్ని తప్పి నడిచినాడు. మతాంధతయొక్క అతిదుష్టములైన పద్ధ తులకు కూడా, ప్రాణంపోసినాడు. కాని, తరువాతికాలంలో పరిణతి చెందినవాడైనాడు. విగ్రహారాధన విషయకమైన అతని తీవ్రద్వేషం తగ్గిపోయింది.

దురదృష్టవశాత్తూ, అక్బర్ రాజనీతి విధానాలను అన్నిటినీ ఔరంగజేబు తిరుగ గొట్టినాడు. ఐనా, ప్రబలమైన ఉద్దేశం ఉన్నప్పటికీ, 'షరా' న్యాయానికి సార్వభౌమత్వ పదవిని దేశంలో, కలిగింపలేకపోయినాడు. నలభై సంవత్సరాలు తప్పుత్రోవలో నడిచిన అతని ప్రయత్నాలన్నీ, పూర్తిగా వ్యర్థమైనాయి. ఆశాభంగమువల్ల సిద్ధించినవ్యథ, విషణ్ణత, అతని ఆత్మను ఆవరించినవి. సామ్రాజ్యం నశించి పోతుందనే భవిష్య సూచనలు మనస్సులో పరిభ్రమిస్తూ ఉండగా, ప్రాణాలను వదలినాడు. అతని తర్వాతివారు, దుష్టపరిణామకరమైన ఇతని రాజకీయ విధానాన్ని విసర్జించిరి. కాని, ఈ మహాసామ్రాజ్యసౌధం, అప్పటికే, చక్క బరచడానికి సాధ్యంకాని దుస్థితికి వచ్చింది. సామ్రాజ్యానికి అంతటి హాని కలిగించినారు.

రాజ్య విషయములో, ఇస్లామ్ భావాలపట్ల ముస్లిమ్ చక్రవర్తులుకాని సుల్తానులుకాని,

ఏమాత్రమూ శ్రద్ధచూపిన వారుకారు. ఇస్లాముతత్త్వమును అనుసరించి ముస్లిములందరూ ఒక సమాజంగా[మిల్లత్] ఏర్పడుతారు; ఈ సంఘానికి ఏకైకుడైన ప్రభువు అవసరం. దైవ నియమాన్ని అనుసరించి, ఏర్పడిన, సార్వజనికసమాజము(మిల్లత్)సార్వజనిక రాజ్యము, అనే భావాలు, ఇస్లామ్ మతరాజకీయాల సారాంశం. ప్రజలచే ఎన్నుకోబడిన రాజ్యాధికారి, దీనికి ఆవశ్యకం. నిజమైన భక్తులను (Faithful) ఆదేశించేవాడు, అని ఈ అధికారిని వ్యవహరించే వారు. [అమీర్-ఉల్-మోమినిన్]. ఈ ఉన్నత స్థానానికి ఎన్నుకోబడిన వ్యక్తి, కొన్ని షరతులను పాలించవలసి ఉంటుంది. ఎన్నుకోబడిన తర్వాత, కొన్ని విశేషాధికారాలు కూడా అతనికి సిద్ధిస్తాయి. ఇస్లాముమతాన్ని రక్షించడము, పవిత్రన్యాయశాస్త్రాన్ని అనుసరించి, ముస్లిము సామ్రాజ్య వ్యవహారాలను నిర్వహించడము, అతని పదవీధర్మాలు.

కాలంగడచిన కొద్దీ, ఈ భావంపై ఉంచిన ఆసక్తి తగ్గిపోతూ వచ్చింది. ఎన్నికల ద్వారా సిద్ధించే రాజ్యాధికార పదవిని, ఉమయ్యాద్ ఖలీఫాలు, వంశానుక్రమమైన పదవిగా మార్చివేసిరి. అబ్బాసీదుల కాలంలో, ఖలీఫాయొక్క నామమాత్ర అధీశతను ఒప్పుకొన్నప్పటికీ, ప్రాంతీయ పరిపాలకులు, వాస్తవికంగా స్వతంత్రులైన చిన్నరాజ్యాలను ఏర్పరచుకొనిరి. క్రీ. శ. 1258 లో, మంగోలులు, అబ్బాసీదులను పడద్రోయడంతో ఖలీఫాలపట్ల నిష్ఠ కలిగి ఉండడమనే నటన, విసర్జింపబడింది.

సార్వజనిక సమాజము, సార్వజనిక రాజ్యము, సార్వజనిక న్యాయము, అనే సారభూతములైన పరిపాలన సూత్రాలను పాటించే విషయంలో, ఇస్లాముకు ప్రాధాన్యం ఇవ్వలేదు. తమ తమ భూభాగాలకు సార్వభౌములుగా ఏర్పడిన పరిపాలకులు తాము పరిపాలించే ప్రజల ఆచారాలనూ సంప్రదాయాలనూ ఆధారాలుగా చేసుకొని, ప్రత్యేకతావాదాలను సమర్థించినవారైరి.

ప్రథమదశలో, ఇండియాచక్రవర్తులు ఖలీఫాకు నామమాత్రమైన కర్తవ్యమర్యాదను, ప్రదర్శించే వారు. కాని, పదమూడోశతాబ్ది మధ్యకాలంలో ఖ్యాలిఫేట్‌కు స్థానమైన బాగ్దాద్ నగరం మంగోలులు ఆక్రమించడమూ, ఖలీఫా ఈటిప్పుతో చంపాడుకోవడమూ జరిగిపోయిన పిమ్మట, ఇస్లాము సమాజ చక్రముయొక్క ఇరుసు చీల (Linch pin-కడాణి) విరిగిపోయింది. తత్పరిణామంగా, ఇస్లాము రాజ్యతంత్రం నమసిపోయింది.

బాబర్ ఇండియాలో సామ్రాజ్యం స్థాపించేనాటికి, ఖలీఫత్, ఉథ్మనీ వంశానికి హస్తగతమై ఉండింది. ఛాగ్‌తేటర్కుల జాతికి చెందిన బాబరుకు, అనాటోల్ టర్కుల యోగ్యతపట్ల గౌరవంలేదు. అదే సమయానికి సఫావీలు, ఇరానును షియారాజ్యంగా మార్చివేసి, సున్నీఖ్యాలిఫేట్‌యొక్క అధికారాన్ని తిరస్కరించి, దైవసమానమైన ప్రతిష్ఠ కలవారమని ప్రవర్తింపసాగిరి. ఈ ప్రవృత్తి తప్పకుండా, భావోత్పాదకమైనదే: తల్లిమూలంగా, ఛంగిజ్‌ఖాన్ వంశముయొక్క సంతతివాడైన బాబర్, మధ్య ఏషియా ప్రాంతమునుండి, వచ్చినవాడు. కనుక, ఒక వైపు ఇరాను ప్రభావమూ, మరియొకవైపు మంగోలుల సామ్రాజ్య సంప్రదాయాలూ, బాబరుపై ఉండినవి. మొగల్‌సామ్రాజ్యవ్యవస్థ పరిణామం పొందడంలో ఈ రెండు ప్రభావాలూ, ప్రవృత్తమైనవి.

ఇండియారాజ్య స్వభావం, ఇరానుకు అనుగుణమైనదిగా ఉండవలెనని, ఇస్లాము మత ప్రాబల్యానికి లోను కాకూడదని, మొగల్‌చక్రవర్తుల అభిప్రాయం. "ఇండియా చక్రవర్తి

ముస్లిము సమాజము ఎన్నుకొన్న నాయకుడు కాడు; ఇస్లాము మతనిష్ఠాపరుల ఖలీఫాకు ప్రతినిధికాని, అధీనభృత్యుడుకాని, కాడు. భగవంతుని ఛాయారూపమైనవాడు (జిల్లీ-అల్లా) ఇండియా చక్రవర్తి," అని మొగల్‌చక్రవర్తి యొక్క నిశ్చితభావం.

అబుల్‌ఫజల్ ఈ విధంగా వివరిస్తాడు;- "భగవంతునినుంచి ప్రసారమౌతున్న జ్యోతి, రాజత్వం. అది సూర్యునికాంతి; ఈ కాంతిని, ఆధునికభాషలో దివ్యజ్యోతి, ఫార్-ఇ-ఇజేదీ, అని వ్యవహరిస్తారు. ప్రాచీనభాషలో దీనికి, కియాన్‌ఖురా [భవ్యప్రభామండలం] అని వ్యవహారం. మధ్యస్థుల సహకారంతో ప్రసక్తి ఏమాత్రమూ లేక, భగవంతుడు తన తేజస్సును రాజులకు ప్రసరింపచేస్తాడు. దీని సమక్షంలోఉన్న మానవులు, వినతులై, భూమిపై తలమోపి, రాజతేజస్సును కీర్తిస్తారు".

"సార్వభౌముని కర్తవ్యాలు, ప్రపంచపరిపాలన, అనేవి, అల్పబుద్ధులైన కొందరి వ్యక్తుల, నిరర్థక ప్రయత్నాలవల్ల జరిగేవికావు. వైభవోపేతమైన ఈ మహోన్నత కర్తవ్యానికి అర్హుడని భగవంతుడు తలచిన, వ్యక్తికి వీటిని ప్రసాదిస్తాడు." అని జహంగీరు తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసి ఉన్నాడు.

తాను, వాస్తవంగా, భగవంతుని ఛాయయని విశ్వసించినవాడు ఔరంగజేబు. తాను ఆ యుగానికి ఖలీఫా అని, "భూమిపైనిలిచి ఉన్న భగవంతుని వకీల్," అని అతనిభావాలు. ఆలమ్‌గీర్ జిందాపీర్ ఔరంగజేబ్, అనేఖ్యాతి అతనికి సిద్ధించింది. [పవిత్ర జీవి ఐన అలంగీర్].

ఈ బిరుదులు, విశేషణాలు, బైజాంటియమ్‌లోని ప్రాచీనపరిపాలకులనూ, ప్రాచీన హిందూ చక్రవర్తులనూ జ్ఞప్తికితెస్తాయి. కాని కాలిఫేటుకు సుల్తానేటుకు సంబంధించిన ఇస్లాము మతభావనలకు, ఈ బిరుదులు పూర్తిగా అసంగతమైనట్టివి. క్యాలిఫేట్ సుల్తానేట్ పదవులు ముస్లిము సమాజము (మిల్లత్) ఎన్నుకొనగా ఏర్పడినట్టివి; కాబట్టి, ఈ బిరుదులు అసంబద్ధములు. వంశానుగతంగా పాదుషాలు ఏర్పడడానికి ముస్లిము న్యాయతంత్రాన్నిబట్టి, అస్కారమేలేదు.

మధ్యయుగకాలంలోని ఇండియారాజ్యాలను, యూరోపుభూస్వామ్య వ్యవస్థలోని రాజ్యాలతో, పోల్చిఉండిరి. వాస్తవంగాచూస్తే ఈ రెండింటి మధ్యా, సమానలక్షణంలేదు. విలక్షణపద్ధతికి చెందిన సైనిక పట్టేదారీ ఆధారంపై ఏర్పడిన సంపన్నుల సంస్థ, యూరోపులోని రాజ్యం. భూస్వామ్య వ్యవస్థకు చెందిన ప్రభువులు క్రమశ్రేణీ బద్ధంగా ఏర్పడి, వంశపరంపరగా ఇనాముభూములను అనుభవించేవారు. అత్యుచ్చస్థానంలో రాజూ. అతి నిమ్న స్థానంలో రక్షక వీరుడూ,-ఉండేటట్లు ఏర్పడిన శ్రేణీపద్ధతి ఇది. ఇండియా విషయంలో, చక్రవర్తియొక్క అభిమానంపై పూర్తిగా ఆధారపడియున్న అధికారవర్గం, మొగల్‌కులీన సంస్థ. భూమిపై స్థిరపడిన సంస్థకాదిది; భూమిపై వంశానుగతమైన హక్కుగల వ్యక్తులతో ఈ సంస్థ ఏర్పడలేదు. వీరికి అధికార పదవులు సిద్ధించడంలో, వీరి జన్మ, ప్రధానమైనదే కాని, వీరికి దేశంలోగల భూసంబంధమైన ఆస్తికాదు. ఆర్థికంగా కూడా ఈ కులీన సంస్థ, స్వతంత్రమైనదికాదు. సామ్రాజ్యకోశము నుంచి లభించేది వీరి ఆదాయం. ఇది ద్రవ్య రూపంగాకానీ, లేక, భూమి పన్నుల నియామకం ద్వారా కానీ వీరికి లభించేది. ఈ శిస్తు నియామకం కూడా, తరచుగా మార్పుచెందుతూ అనుభోక్త మరణానంతరం, రాజగామియై

(Escheat) పోవడం కూడా కద్దు. పదవులు వంశాను క్రమంగా వారసులకు సిద్ధించేవికావు. తరువాతి కాలంలో వీటిని వంశపారంపర్యంగా చేసే ప్రవృత్తి ప్రారంభించింది. మొగల్ కులీనసంస్థ, అల్పజన పరిపాలక వర్గంవంటిదేకాని, భూస్వామ్య కులీనసంస్థవంటిది కాదు.

మధ్యయుగాలలోని ఇండియారాజ్యం, పరిమితమైన అధికారాలతోను, విస్తృతమైన బాధ్యతలతోను, విచిత్రమైన విధంగా మిశ్రితమైన వ్యవస్థగా, సూక్ష్మపరిశీలనకు గోచరిస్తుంది. దీని అధికారానికిగల అవధులనుబట్టి చూస్తే, ఆధునికమైన అర్థవివరణ ప్రకారం, దీనిని సార్వభౌమాధికారం గల రాజ్యము, అనడానికి వీలులేదు. శాసన నిర్మాణాధికారము, కార్యనిర్వహణాధికారము న్యాయశాఖ, అనే మూడు రాజ్యాంగాలద్వారా, ఆధునిక సార్వభౌమాధికారం వ్యక్తమౌతుంది. శాసననిర్మాణము కావించడము, న్యాయసూత్రాలను పరిపాలనద్వారా ప్రవృత్తిలో ఉంచడము, ప్రజలకు న్యాయాన్ని కలిగించడము, అనేవి సార్వభౌమత్వ ధర్మాలు.

మధ్యయుగాలలో, ఇండియారాజ్యానికి శాసన నిర్మాణాధికారంలేదు. ముస్లిముల విషయంలో, శాసననిర్మాణాధికారం కడపటి ప్రవక్తఐన, మహమ్మదుతో అంతమయింది. ఇతని ద్వారా, భగవంతుడు తన సంకల్పాన్ని, ఆదేశాన్ని, సర్వకాలానికీ ఒక్కసారిగా వ్యక్తం కావించినాడు. దివ్యసంకల్పం మార్చరానిది; అధికంగా చేయడానికి సాధ్యంకానిది. ప్రజల దైనిక వ్యవహారాలకు దీనిని వర్తింపచేయడం, పండితుల కర్తవ్యమేకాని, దేశానికి ప్రభువైన, రాజుదికాదు. జీవిత సన్నివేశాలకు, పరివర్తనానికి, లోనౌతున్న పరిస్థితులకు అనుగుణమైన విధంగా, ఈ న్యాయశాస్త్రాన్ని ప్రతిపాదించి, వ్యాఖ్యానించేవారు, ఈ ముస్లిం పండితులు.

హిందువులకు కూడా, శాసన నిర్మాణ సంస్థతో అవసరం లేకపోయింది. జీవిత విషయములన్నిటినీ నిర్దేశించే ప్రాచీన ధర్మశాస్త్ర సంహితలు, హిందువులకు కూడా సిద్ధమై ఉన్నవి. మిత్రమిశ్ర, రఘునందన్‌వంటి విద్వాంసులు వీటికి సువిస్తరములైన వ్యాఖ్యలను రచించి ఉన్నారు. రాజ్యంతో ప్రసక్తిలేకుండా, స్వతంత్రగా న్యాయసూత్రాలను వర్తింపచేయడంలో, ఈ వ్యాఖ్యలు, హిందూన్యాయాధికారులకు మార్గదర్శకములైనవి.

దివ్యనియమాలకు సంబంధించిన జ్ఞానమే, ఇస్లాము న్యాయతంత్రమైన ఫిఖ్. మానవుడు చేసే కర్మలకు వర్తించేవి, ఈ నియమాలు. తప్పక చేయవలసిన విధులు, పరిహరించ తగిన నిషేధాలు, చేయతగినవి, అసమ్మతమైనవి,- లేక, కేవలం, అనుమతికలవి,- మొదలైన కర్మలను, విధిస్తూన్న ఈ నియమాలు, కురానునుంచి, హదీథ్‌నుంచి గ్రహింపబడినవి. ముస్లిం న్యాయశాస్త్రము సర్వసమగ్రమైనది; వ్యక్తిజీవిత, సంఘజీవిత విషయములన్నిటి పైనా, వ్యాప్తికలిగినట్టిది. వ్యక్తిజీవిత స్వంతజీవిత, పౌరజీవితాలకు మాత్రమేకాక, శివిల్, క్రిమినల్, సంవిధానములకు సంబంధించిన విషయములకు కూడా, ఇది వర్తిస్తుంది. ఇబాదత్ అని వ్యవహరింపబడే వ్యక్తి మతము, భక్తి, పూజావిధానము అనేవి, నిష్కర్షగా, మానవుని వైయక్తిక స్వంతవ్యవహారాలు. వీటి విషయంలో ముస్లిం న్యాయసంహిత, ఖండితమైన, వినియమాలను విధించింది. వ్యవహారాలను రెండు ప్రధానభాగాలుగా శివిల్ న్యాయశాస్త్రం చర్చిస్తుంది,- (1) వివాహము, (2) ఆస్తి, రక్తసంబంధము- పాత్రత, (Consanguinity and eligibility), విధవావివాహము, విడాకులు, అనేవిషయాలు మొదటిభాగంలో చేరినవి. వారసత్వము, క్రయ-విక్రయాలు, వడ్డీ, బాడుగ, అనేవి రెండవభాగం కిందికి వస్తాయి. ముస్లిములు కానట్టి ప్రజలపట్ల ముస్లిము ప్రభుత్వం యొక్క సంబంధాలు, ముస్లి

ముల విషయంలో రాజ్యముయొక్క బాధ్యతలు, అపరాధ దండన విషయంలో రాజ్యము యొక్క బాధ్యత,- మొదలైన రాజకీయ విషయాలను ముస్లిం పౌరన్యాయశాస్త్రం, చర్చిస్తుంది.

ఇబాదత్ విషయంలో మాత్రం, షరాలోని నియమాలను పాటించడం, ప్రతి ముస్లిముకు కూడా, విధిగా ఏర్పడింది. ముస్లిములలో కొందరు,-ముఖ్యంగా రహస్యోపాసకులైన సూఫీలు,-ఈ నియమాలు కేవలం యాంత్రికములు, సాంప్రదాయికములు ఐనవి, మాత్రమే, అని పరిగణించిరి. వీటి ప్రామాణ్యాన్ని అంగీకరించినా కూడా, రహస్యోపాసన మార్గంలో, పరతత్త్వాన్ని అన్వేషించడంలో వీటికి, ప్రాధాన్యాన్ని కలిగించలేదు. ఇండియాలోని ఉలామా సూఫీలలో ఎల్లప్పుడూ, రెండువర్గాలు ఏర్పడి ఉండినవి. షరియతు మార్గాన్ని తప్పినడవడం దూష్యమని భావించి, షరియతుకు ప్రాధాన్యం ఇచ్చిన వారు ఉలామాలు. కేవలం న్యాయవిధులకు బద్ధమై ఉండడానికంటె, రహస్యోపాసనతో కూడిన ఆత్మశిక్షణ ఎక్కువ శ్రద్ధార్హమైనదని, సూఫీలభావం. పరస్పరభిన్నాభిప్రాయాలు గల ఈ రెండు వర్గాల సిద్ధాంతాలను ప్రతిపాదించి సమర్థించిన వారిలో, ఔరంగజేబు, దారాషకోలు, ప్రసిద్ధులు.

వివాహ విషయాలకు, ఆస్తి విషయాలకు, సంబంధించిన న్యాయసూత్రాలను, సాధారణంగా, పాటించేవారు. కాని, తీవ్రములైన అతిక్రమణలు ఈ రెండు రంగాలలోనూ, ఎక్కువగా జరిగినవి. హిందూ వివాహ ఆచారాలను పెక్కింటిని ముస్లిములు అవలంబించిరి. ఇస్లాము న్యాయశాస్త్రానికి అసమంజసములైన పద్ధతులను, అనేకములను అనుసరించిరి. వివాహ పాత్రతకు సంబంధించిన బాంధవ్యశ్రేణిని నిశ్చయించడము జన జాతి విభేదాలపైన ఆధారపడిఉన్న సజాతీయ, విజాతీయ వివాహసంబంధాలకు పరిమితులు ఏర్పరచడము, వివాహము ఒప్పందమైన పిమ్మట, దానిని అనుసరించి జరిగే మత సంప్రదాయాన్ని పాటించడము,- మొదలైనవి దీనికి ఉదాహరణలు. ఇండియాలోని పెక్కు ప్రదేశాలలో వారసత్వానికి సంబంధించిన న్యాయ సూత్రాల స్థానంలో, ఉర్ఫ్ అనే ఆచారం ఏర్పడింది. హిందువులలో వలెనే, విధవా వివాహాలను, విడాకులను, ముస్లిములు గౌరవించలేదు.

ముస్లిం-హిందూ మిశ్రవివాహాలు చాల అరుదు. కాని, రాజులవంశాలలో వీటికి ఆమోదం సిద్ధించింది. ఈ మిశ్రమ వివాహవిధానాన్ని ప్రారంభించిన వారిలో, మొగలులు ప్రథములుకారు. కాశ్మీరులో, హిందూ-ముస్లిము వివాహాలు చాలకాలంగా జరుగుతూవచ్చినవి. జమ్మూరాజైన రాజామానక్‌దేవ్ కుమార్తెలను ఇరువురిని, జాయిన్ - ఉల్ - అబిదీన్ [1420-70] వివాహమాడినాడు. మరొక పుత్రికను, ముస్లిమ్‌గఖ్ఖాన్ నాయకుడైన రాజాజస్‌రథ్, వివాహం చేసుకొన్నాడు.

దక్కనులోని బహమనీరాజులు హిందూకుటుంబాలలో, వివాహసంబంధాలు చేసుకొన్నారు. విజయనగర దేవరాయని పుత్రికలను తాజ్-ఉద్-దీన్ ఫిరోజ్ (1397-1422) వివాహమాడినాడు. ఖేర్లా నరసింగరావ్ కుమార్తెను కూడా, ఇతడు పెళ్ళాడినాడు. తొమ్మిదో బహమనీ పరిపాలకుడైన అహమద్‌షావాలీ, సోన్‌ఖేడ్‌రాజు యొక్క కుమార్తెను వివాహం చేసుకొన్నాడు. బిజాపూర్ సుల్తాన్ యూసుఫ్‌ఆదిల్‌షా [1510లో మరణం] ముకుందరావ్ అనే బ్రాహ్మణుని సోదరిని వివాహమాడి, ఆమెను పట్టపురాణిగా చేసినాడు. బీదర్ సుల్తాను

అమీర్‌బరీద్ యూసుఫ్, ఆదిల్‌షా చూపిన ఆదర్శాన్ని, అనుసరించెను.

అక్బర్, జహంగీర్, ఫరూక్‌సియార్, సులేమాన్‌షుకో, సిఫిర్‌షుకోలు, హిందూరాజ పుత్రికలను వివాహమాడిరి. హిందువులైన కచ్‌రాజవంశమువారు, ముస్లిములతో వివాహ సంబంధాలను కావించుకొనిరి.

కులనిషేధ నిర్బంధాలకు అత్యంతమూలోనైనవారు హిందువులు. కాబట్టి, హిందూ రాజులు ముస్లింస్త్రీలకు, అంతఃపురప్రవేశం కలిగించడానికి ఇష్టపడలేదు. ఐనప్పటికీ ముస్లిముస్త్రీలను హిందువులు వివాహమాడిన సందర్భాలు లేకపోలేదు. రజారీ, లడఖ్, బాల్టిస్థాన్, ప్రాంతాలలో రెండుమతాలవారికీ, పరస్పర వివాహసంబంధాలు జరగడం, జహాంగీరు గమనించినాడు. పీష్వాబాజీరావ్ I కు, మస్తానీతో కలిగిన ప్రణయగాథ సర్వవిదితమైనదే. మొదట, నర్తకిగా ఉండిన ఈమె, పీష్వాయొక్క సంతతసహచారిణి అయింది. "యుద్ధ యాత్రలలో కూడా అతని వెంటఉండి, అతనితో సరిసమానంగా గుర్రముపై స్వారిచేస్తూ, సంతతం అతనిని అనుసరించింది." 1734లో, పీష్వాకు ఈమెయందు కుమారుడు జనించి నాడు. శ్యామ్ షేర్‌బహదూర్ అనే ఈ కుమారుడు, ముస్లింగానే పెరిగి పెద్దవాడైనాడు. బ్రాహ్మణులు, ఈ కుమారుని హిందూసంఘంలో చేర్చుకోడానికి అంగీకరించకపోవడం, ఇందుకుకారణం. 1753లో, శ్యామ్‌షేర్ బహదూర్, రఘోబావెంట, ఉత్తర భారతదేశం పోయి, కుంభేర్, ఢిల్లీలవద్ద జరిగిన యుద్ధాలలో పాల్గొన్నాడు. 1755లో ఒక సైన్యానికి నాయకత్వం వహించి, విద్రోహియైన తులజీ అంగ్రియాపై, దండయాత్ర సాగించినాడు.

1761 లో జరిగిన పానిపట్ యుద్ధంలో ఇతడు హతుడైనాడు. ఇతని కుమారుడైన అలీ బహదూర్‌కు, తండ్రి జాగీరు సిద్ధించింది. 1787 లో, మహాద్‌జీ సింధియాకు అప జయాలు కలిగిన సందర్భంలో, సహాయక సేనలను పంపిస్తూ, పీష్వాకుటుంబానికి ప్రతి నిధిగా ఆలీబహదూర్‌ను సేనాధ్యక్షునిగా నియమించిరి. సింధియాకు తెలియకుండా, రస పుత్రులతో సంధిరాయబారాలను నడపవలసిందిగా ఆలీ బహదూర్‌కు, రహస్య ఉపదేశాలను కూడా ఇచ్చినారు.

పెక్కుకుటుంబాలకు, హిందూముస్లిము కుటుంబశాఖలు కూడా ఏర్పడి ఉండినవి ఇది చాలా కుతూహల జనకమైన విషయం. ఈ కుటుంబ సంబంధాలు తరతరాలుగా నిలిచి ఉండినవి.

రిబాను [వడ్డీ] నిషేధించే న్యాయసూత్ర విషయం చాల అలక్ష్యానికిలోనయింది. కారణతః, దీనిని ప్రవృత్తిలో పెట్టడం అసాధ్యమయింది. నిష్ఠాపరులైన ముస్లిములు, వడ్డీ తీసుకోవడానికి ఒప్పుకోలేదు ; దానిని, నిరాకరించిరి. కాని, ఆత్మసాక్షిని మరుగుపరచగల ముస్లిములు, అతిచాతుర్యంతో యుక్తులుపన్ని, భగవంతునికీ పిశాచానికీ, రాజీకుదిర్చి, తమ ప్రయోజనాన్ని సాధించుకొనిరి.

ముస్లిమ్ దండనీతి న్యాయాన్ని అమలు పరచడం మిక్కిలి కష్టసాధ్యమైనపని. అపరాధం జరిగిందని, నిర్ధరించడానికి విధింపబడిన షరతులను తృప్తిపరచడం, చాలవరకు, అసాధ్యం. ఉదాహరణగా, స్త్రీని బలాత్కరించినాడనే విషయాన్ని నిర్ధరించడానికి నలుగురు సాక్షుల ప్రమాణ పూర్వక వాఙ్మూలం, అవసరం. దండనలు కూడా అత్యంతమూ క్రూర మైనవి. చేతులు, కాళ్లు, నరికివేయడం దొంగతనానికిశిక్ష. స్వధర్మత్యాగానికి మరణదండన.

సంఘానికి విరుద్ధమైన నేరంగా, హత్యను పరిగణించకపోవడం విచిత్రమైన విషయం. హతుడైన వ్యక్తికీ, అతని కుటుంబానికీ, జరిగిన అన్యాయంగా మాత్రమే. దానిని గణించిరి. కాబట్టి, హత్యను వాస్తవంగా అపరాధి చేసినాడని నిర్ణయించేవాడు, న్యాయాధిపతే ఐనా, దానికై విధింపవలసిన దండన, హత్య గావింపబడిన కుటుంబము వారి ఇష్టానికి వదలివేయ బడింది. హంతకునిని ఉరితీయవలసిందని, ఐనా, వారు కోరవచ్చు, లేక, రక్తమూల్యాన్ని (Blood money) ఐనా వారుకోరవచ్చు.

ఇండియాలో, న్యాయశాస్త్ర ప్రక్రియను తృప్తిపరిచే ఆవశ్యకాలను తృప్తిపరచడం, కష్టతరమని గుర్తించబడింది. కాబట్టే, దండనీతి పరిపాలన, కాజీల అధికార పరిధిలోనుంచి, తొలగిపోయి, రాజ్యాధికారుల అధీనంలోకి వచ్చింది.

ప్రభుత్వ సంవిధానానికి సంబంధించిన న్యాయసూత్రాలు, వాటికర్తవ్యనిర్వచనాలు అనే విషయాలు, ఇండియాకు ఏమాత్రమూ వర్తించేవికావు. ఇండియాలోని పరిస్థితులకు, షరియత్ న్యాయసూత్రాలు అనుకూలించవని, న్యాయశాస్త్రజ్ఞులు, కార్యకారులైన రాజనీతిజ్ఞులు కూడా, గుర్తించినారు. ఉద్యోగసంస్థను ఏర్పరచడంలో కాని, సైన్యాన్ని కూర్చడంలోకాని, పన్నులను విధించడంలో కాని, భూమిరాజస్వవిషయంలో కాని, నిష్ఠాపరులైన ఖలీఫాల సంప్రదాయాలను అనుసరించడం, సాధ్యంకాని విషయం.

ప్రథమ దశలో ఖలీఫాలు స్థాపించిన ముస్లిమ్ వ్యవస్థలో, రాజ్యముయొక్క రాజస్వమూలసాధనాలు రెండు వర్గాలుగా విభజింపబడినవి. జకత్ అనే భిక్షాపన్నులను, ఖరజ్ అనే భూమి పన్నును, ముస్లిములు చెల్లించవలసి ఉండింది. ప్రభుత్వ రక్షణలోఉన్న ముస్లిమేతరులు జిజియాపన్నును, ఖరజ్‌ను, చెల్లించేవారు.

ఇండియాలో ప్రభుత్వం, జకత్‌న్ ఎప్పుడూ వసూలుచేయలేదు. రాజవిత్తాన్ని (Public finance) ఉద్దేశించి, ఈ పన్ను, కార్యతః, లేనేలేదు. భూమిపన్ను మాత్రం, రాజ్యంలోని ప్రజలకందరికీ సమానమైనదే. దాని భారంకూడా అందరికీ ఒకే పద్ధతిలో నియమితమయింది. కానీ, పన్నులను నిర్ధారంకావించడము, వసూలుచేయడము, అనేవి, క్యాలిఫేట్ అధీనంలోఉన్న భూములవిషయంలోకంటె, సహజంగా భిన్నమైనట్టివి. అనుభవాన్నిపట్టి, ప్రవేశపెట్టిన, ఇండియాలోని విధానం ప్రధానంగా హిందూవిధానం.

జిజియాపన్ను, స్వల్పకాల విరామాల్లోమాత్రమే విధించబడింది. మొగలుల కాలానికి పూర్వం, ఫిరోజ్‌టుగ్లక్, సికిందర్‌లోడీలు మాత్రమే ఈ పన్నును విధించిఉండిరి. తర్వాత 1569 నుంచి 1673 వరకు, అది, ఆచరణలోలేదు. పధ్నాలుగు పదైదోశతాబ్దాలలోని పాతబడిన పద్ధతులను, ఔరంగజేబు పునరుజ్జీవింప చేసినాడు. కాని, జిజియాపన్ను న్యాయశాస్త్ర ప్రకారంగా ఆర్థికంగా, రాజకీయంగా దుష్టమైనదని, గ్రహించలేక పోయినాడు.

జిజియాపన్నును ఔరంగజేబు విధించడం, ఇండియాలోని ముస్లిముసంప్రదాయాలకు విరుద్ధమైనది. ఈ పన్నును విధించదగిన పరిస్థితులకు కూడా, ఇది విరుద్ధమైనది. ముస్లిం న్యాయతంత్రాన్నిబట్టి, రెండుపక్షాలమధ్యా ఏర్పడిన కరారును అనుసరించి, చెల్లించేది, జిజియా. ఈ కరారుకు సంబంధించిన షరతులను ఇరుపక్షాలవారూ పూర్తిచేసినప్పుడే, ఇది చెల్లుతుంది. ఇందులో ముస్లిమ్అధికారి ఒకపక్షం; రెండవపక్షం ముస్లిమేతరులైన ప్రజలు. "ఏకైకుడైన దేవునిలో విశ్వాసం లేనివారిని, నిజమైన మతాన్ని అవలంబించని వారని,

శ్రుతి ఆధారంగా కలవారని, ఎదిరించి పోరాడవలసినది ముస్లిముల కర్తవ్యమని, కురాన్, ఆదేశిస్తుంది".

ప్రవక్త, అతని తరువాత వచ్చిన అనుయాయులైన నలుగురు ఖలీఫాలు, జ్యూమతస్థులతోను, క్రైస్తుమతస్థులతోను, తరువాతికాలంలో జొరాస్ట్రియన్ మతస్థులతోను, కరారు కావించుకొని, కురానులోని ఆదేశాలను ప్రవృత్తిలో పెట్టిరి. ఈ పూర్వభావులైన సంఘటనలు, ప్రస్తుత విషయమైన ముస్లిము న్యాయశాస్త్రానికి ఆధారములైనవి. ముస్లిము పరిపాలనను అంగీకరించిన ముస్లిమేతరులు 'ధిమ్మీలు', అని ముస్లిము న్యాయశాస్త్రం. 'ధిమ్మీ' అనే పదానికి ముస్లిములు గౌరవించే కరారు, అని అర్థం. దీనిని అతిక్రమించడం అపరాధం, [ధమ్]. ఒడంబడికవల్ల, ముస్లిము రాజ్యము రక్షించవలసిన కొన్ని హక్కులు, ముస్లిము మతేతరులకు సిద్ధిస్తాయి. ప్రాణాలకు, ఆస్తులకు, భద్రత, అపరిమితమైన భరవసా [అమాన్], ఈ కరారువల్ల సిద్ధిస్తాయి. తనకు సిద్ధించిన రక్షణకు బదులుగా, జిజియాను చెల్లించడము, ముస్లిముల ప్రయోజనాలకు హానికరములైన కార్యాచరణాన్ని విసర్జించడము, ధిమ్మీల జవాబ్దారీ. యుద్ధంలో పాల్గొనవలసిన బాధ్యత ధిమ్మీలకులేదని ఈ కరారు నిశ్చయించింది. చెల్లించవలసిన జిజియా మొత్తం వ్యక్తుల విషయంలో భిన్నమైఉండినది. కాని, కట్టవలసిన, చెల్లించగల ధిమ్మీయొక్క యోగ్యతను అనుసరించి, 12, 24, 48, దిర్‌హేమ్‌లుగా నిశ్చితమయింది. యుద్ధంచేయడానికి అశక్తులైనవారు ఈ పన్నును చెల్లించనక్కరలేదు. దీని ననుసరించి, వృద్ధులు, స్త్రీలు, పిల్లలు, అశక్తులు, ఈ పన్నునుంచి, విముక్తిపొందిరి. మహమ్మద్ బీన్‌తుగ్లక్, బ్రాహ్మణులను అశక్తుల వర్గంలోచేర్చి ఉండినాడు. కాని, ఫిరోజ్‌తుగ్లక్, బ్రాహ్మణులను అశక్తులుగా పరిగణించక, ఇతరవర్గంలో చేర్చినారు.

యూదులతో (Jews) మహమ్మద్ చేసుకొన్న ఒడంబడికప్రకారం, యుద్ధపు ఖర్చులను వారు భరించవలసి ఉండిరి. అంతేకాని, సైన్యంలోచేరి యుద్ధంలో పాల్గొనే అవకాశం వాళ్ళకు కలిగించలేదు. బైబిలుపై ఆధారపడియున్న అరేబియాలోని ఇతరజాతులకు కూడా, ఇట్టి ప్రప్రతాలనే, జారీచేసినారు. జిజియా చెల్లించినందుకు ప్రతిఫలంగా రక్షణ భద్రతలు కలిగిస్తానని. నజరాన్‌లోని క్రిశ్చియనులకు మాటఇచ్చినాడు. "వారిప్రాణాలు, ఆస్తులు, భూములు, మతము, దేశంలో అప్పుడు ఉన్నవారిని, హాజరుగా లేనివారిని, వారి కుటుంబాలను, చర్చిలను, వారి సమస్తమైన వస్తుసంపదను" రక్షించి, కాపాడుతానని అతని వాగ్దానం. ఏబిషప్పును కూడా అతని పురోహిత పదవి నుంచి తొలగించను. వారికి ఏ విధమైన కష్టంకాని, అవమానంకాని కలుగదని", హామీ ఇచ్చినాడు.

ఇరాక్, సిరియాదేశాలలోని క్రైస్తుమతస్థులతో, ఆబుబకార్, ఉమార్‌లు, ఈ విధమైన ఒడంబడికలనే కావించుకొనిరి. ధిమ్మీల రక్షణకు హామీ ఇవ్వలేక ఖలీఫా, వారిపై ఉంచిన జిజియాపన్నును రద్దు గావించి, వారు చెల్లించి యుండిన ద్రవ్యాన్ని వాపసుచేసిన సందర్భాలు కూడా, లిఖితమై, చరిత్ర ప్రపత్రాలలో నిలిచిఉన్నవి. ధిమ్మీలను యుద్ధాలలో పాల్గొనేటట్లు చేసినందుకై, వారిపైఉన్న జిజియాను రద్దుచేసిన సందర్భాలు కూడా ఉన్నవి.

జిజియా విధించడానికి ఆధారమైన ఆశయాన్ని వదలి, తరువాతికాలపు మతధార్మిక న్యాయవేత్తలు, అతి విపులమైన నియమాలను, రచించిరి. ఈ నియమాలను పండ్రెండు శీర్షికలుగా విభజించిరి. మొదటి ఆరుశీర్షికలలోని ఉపబంధాలు, తప్పక, పాటింపవలసినవి.

వీటిలో దేనిని అతిక్రమించినా, ఒడంబడికను రద్దుచేస్తారు. అపేక్షణీయములని పరిగణించిన కర్తవ్యాలు, బాధ్యతలు, తక్కిన ఆరు శీర్షికల క్రింద విధింపబడినవి. ధమ్మీలను విస్పష్ట పరిచే దుస్తులను ధరించడం, గుర్రముపై స్వారిచేయడం, చర్చిలోని గంటలను గట్టిగా మోగించడం, ముస్లిముల స్మశానంలో శవాలను పూడ్చడం,-మొదలైన విషయాలకు సంబంధించిన నియమాలన్నీ, ఈ రెండవ వర్గంలోచేరినవి. తరువాతికాలంలో, ఇంకను దుఃఖకరములైన నిబంధనలను, అధికంగాచేర్చినారు. క్రొత్తగా దేవాలయాలను నిర్మించడము, పాతవాటిని చక్కపరచుకోవడం, నిషేధింపబడింది. స్వయంగావచ్చి, తగిన వినయవిధేయ తలతో జిజియా చెల్లించవలసినట్లు, ఉత్తర్వు జారీఅయింది. ఇవి క్రొత్తగా ఏర్పడిన నియమాలకు ఉదాహరణలు. సహింప శక్యముకాని ఈ ఆదేశాలు ప్రామాణికములని సమర్థిస్తూ 'ఉమార్ ప్రసంవిద' (Covenant of Umar) అనే దస్తావేజును, దేశంలో పరిచాలనం (Circulation ) కావించినారు. దీని ప్రామాణికతను గురించి, సందేహములుకలవు.

అక్బరుకాలము నుంచీ, ప్రవృత్తిలోఉన్న నిస్సంశయమైన కరారుకు, ఔరంగజేబు తీసుకొన్నచర్య, భంగం కలిగించింది. హిందువులు జిజియా చెల్లిస్తూఉన్నా కూడా, ఔరంగజేబు తన యుద్ధాలలో వారిని పాల్గొనేటట్లు చేయడం, న్యాయశాస్త్ర రీత్యా చెల్లదు. ఔరంగజేబుకు శత్రువులైన ముస్లిమువర్గాలను, హిందూవర్గాలనూ కూడా, హిందువులు యుద్ధంలో ఎదుర్కోవలసి వచ్చింది. మధ్య ఏషియా, ఆఫ్ఘనిస్తాన్, దక్కనులోని ముస్లిమ్ రాజ్యాలతోను, హిందువులైన మహారాష్ట్రులతోను, హిందువులు యుద్ధం చేసేటట్లు ఔరంగజేబు నిర్బంధించినాడు.

ఏమాత్రమూ భరించలేని ప్రజలపై, జిజియా విధింపబడినందువల్ల, అది ఆర్థికంగా ప్రయోజకమైనది కాలేదు. సంవత్సరానికి 52 రూపాయలకంటె తక్కువ ఆదాయం గల దరిద్ర్యవ్యక్తి కూడా సాలుకు, రూ. 3-2-0 జిజియాగా చెల్లించవలసి వచ్చింది. 52 రూపాయలనుంచి 2500రూపాయలవరకు ఆదాయంగల మధ్యమతరగతివారు చెల్లించవలసిన జిజియా సాలుకు, రూ. 6-4-0. కాని, 2500 రూపాయలకు మించిన ఆదాయం కలవారు చెల్లించేది, సాలుకు రూ. 12-8-0 మాత్రమే. విత్తవిధానానికి సంబంధించిన ధర్మవిధులన్నిటికీ, ఇది విరుద్ధమైనది.

రాజకీయంగా కూడా, జిజియా అప్రయోజకమైనట్టిది. దయాదాక్షిణ్య రహితంగా, దరిద్రులనుంచి డబ్బును లాక్కోవడము, ధనికులను తేలికగా వదలివేయడము, జరిగింది. దరిద్రులు సాధారణంగా, గ్రామసీమలలోని ప్రజలు. వారు తప్పకుండా చెల్లించవలసిన పెక్కు రుసుములలో, జిజియా కూడా ఒకటి. ఇతర బాకీలతో సహా జిజియాను కూడా, వసూలుచేసేవారు. హిందూ ముకద్దములు, జమీందారులు, హిందూభాటక కరారుల నుంచి దీనిని వసూలుచేసి, సామ్రాజ్యాధికారుల వశం కావించేవారు. రైతులకు జిజియా భారంగానే ఉండినది; కాని, వారు అవమానానికి మాత్రం గురికాలేదు. పట్టణాలలోని పరిస్థితివేరు. జిజియా చెల్లించడం నగర నివాసులకు పెద్ద ఆర్థిక అననుకూలంగా తోచకపోయినప్పటికీ, హీనదశను సూచించే కళంకానికి లోనైనాము, అనే, భావం ఏర్పడి, బాధ, కలిగించింది. అంతేకాక, దీనిని వెంబడించి, మత్సరగ్రస్తులైన మతోన్మాదులు చేసే అవమానాలకు కూడా పాల్పడ వచ్చుననేభయం కూడా, వీరిని కలవరపెట్టింది. ఉన్నత కులాలవారికి, ఇది హృదయ

పేరకమై, వారిలో తీవ్రమైన ద్వేషభావాన్ని రేకెత్తించింది.

ఇతర మతస్థులను ముస్లిములకంటె భిన్నభావంతో చూచి, వారిపై విధించిన ఇతరము లైన పన్నులు కూడా, తగనివి; న్యాయరీత్యావిరుద్ధమైనవి. ముస్లిము వర్తకులపైలేని శుల్కాలు, వ్యాపారపుపన్నులు, ఇతరమతవర్తకులపై విధింపబడినవి.

## II. న్యాయ పరిపాలన వ్యవస్థ

ప్రభుత్వంలోని న్యాయపరిపాలన కార్యక్రమం, చాలపరిమితమైనది. ఇతర మతస్థులపై, దీని ప్రవృత్తి చాల పరిమితమైనది. ముస్లిము మతేతరులైన ప్రజలు,-అనగా ధిమ్మీలు,- ఇస్లాము న్యాయసూత్రాలకు బద్ధులు కారనీ, వారి మత సూత్రాల ప్రకారమే వారి వ్యవహారాలను వినియమ పరచవలెననీ, ఔరంగజేబు గుర్తించినాడు. దండనీతికి సంబంధించిన వ్యవహారాలలో మాత్రమే, వారు కాజీ ఎదుట హాజరుకావలసిఉండేది. కాని, అపరాధం విషయంలో నిర్ణయం మాత్రమే న్యాయాధిపతులు నిర్వహించవలసిన కార్యక్రమం. అపరాధికి విధించవలసిన దండన విషయం వారియొక్క ఇష్టంపై ఆధారపడుతుంది. గ్రామసీమల్లో నివసించే,అధిక సంఖ్యాకులైన హిందువులు, ముస్లిములుకూడా, గ్రామాంలో లభించే న్యాయనిర్ణయంతో, తృప్తిపడవలసిందే. గ్రామాంలోని న్యాయాధిపతులైన కాజీలు, ప్రభుత్వం నియమించిన అధికారులుకారు.

ఆనాటి న్యాయపరిపాలన వ్యవస్థ, యూరోపులోని వ్యవస్థవంటిదికాదు. ప్రస్తుతం ఇండి యాలో ఉన్న న్యాయవ్యవస్థకు కూడా భిన్నమైనదే.

వర్గీకృతమైన అధికారపరిధులతో, ఏర్పడిన న్యాయస్థానాల క్రమబద్ధమైన శ్రేణి, ఏర్పడి ఉండలేదు. క్రింది న్యాయస్థానవిచారణ, అప్పీలు న్యాయస్థాన విచారణకూడా, ఒక్క న్యాయాధిపతే (కాజీ) కావించేవాడు. మూలన్యాయాలయంలోకాక, మరొక న్యాయస్థానంలో, పునర్విచారణ జరిగే అవకాశం ఉన్నప్పటికీ, సరియైన అర్థంలో, అప్పీల్ న్యాయస్థాన అధి కారపరిధి అనేదే, ఆ కాలంలో లేదు. విచారణ దర్యాప్తు, దండాదేశము, అనే అధికారాలను అన్నిటినీ, న్యాయాధిపతే జరిపేవాడు. చిన్నవీ, పెద్దవైన, సివిల్ క్రిమినల్ వ్యవహారాలన్ని టినీ విచారించడానికి కాజీసమర్థుడు. ఈ వ్యవహారాలకు సంబంధించిన ఆస్తివిషయంలో కాని, అపరాధవిషయంలోకాని, పరిమితులు, అధికారపరిధులు అనేవాటితో కాని ప్రసక్తిలేక, అన్ని వ్యవహారాలూ, కాజీవిచారణకు, లోబడినవి. ధర్మవిధులకు, సామాన్యవిధులకు సంబంధించిన రెండువిధములైన వ్యవహారాలూ, అతని విచారణకు వచ్చేవి.

సామ్రాజ్యరాజధాని, ప్రాంతీయ ప్రభుత్వాల ముఖ్యపట్టణాలు, జిల్లాలు, (సర్కార్లు), ఉపవిభాగాలు [పరగణాలు]. మొదలైన నగరాలకు, పెద్దపట్టణాలకు మాత్రమే, న్యాయాధి కారుల పరిపాలన పరిమితమై ఉండినది. సామ్రాజ్యానికంతటికీ ఒక ముఖ్యకాజీని [కాజీ-ఉల్-కుజత్] ప్రాంతాలకు వేర్వేరుకాజీలను, చక్రవర్తి నియమించేవాడు. జిల్లాలకాజీలు, పర గణాలకాజీలు, చక్రవర్తి సన్నదుతో, నియమించబడేవారు. వీరి ఉద్యోగపత్రాలను, ముఖ్య కాజీయొక్క అధికారశాఖ జారీచేసేది. ఒకసారి నియమితుడైన కాజీని చాలవరకు, మరొక ప్రదేశానికి బదిలీచేయడం ఉండదు. ఈ పదవి కాజీయొక్క జీవితకాలావధిగా, ఏర్పడడం కూడా కలదు. వీరి సేవకు ప్రతిఫలంగా, శుల్కరహితములైన భూములను, ప్రభుత్వం, వీరి అనుభవానికై ఇచ్చేది.

అధికారులను నియమించడంతప్ప, న్యాయపరిపాలన విషయంలో, ప్రభుత్వం జోక్యం కలిగించుకోకపోవడం, ఈ వ్యవస్థలో ముఖ్యంగా గమనింపతగిన విషయం. న్యాయపరిపాలన అంతటికీ చక్రవర్తే మూలాధారమై ఉన్నప్పటికీ, కార్యనిర్వాహకవర్గమూ, న్యాయపరిపాలనవర్గమూ వేర్వేరుసంస్థలుగా ఏర్పడిఉండినట్లు తోస్తుంది. ప్రజల మొరలనూ, విజ్ఞాపనలనూ ఆలకించి, అక్రమచర్యలను అణచివేయడం తమ కర్తవ్యమని, చక్రవర్తీ, ప్రాంతాలలోని అతని ప్రతినిధులూ, తలచి ఉండిరి.

ఇట్టి పరిస్థితులలో, కార్యనిర్వాహకుల ధర్మ నిర్వహణమూలంగా, సార్వభౌమత్వం, విస్పష్టంగా గోచరమయ్యేది. ఇది సహజమైనదే. కాని, అధికారాధిపత్యం చుట్టూ ఎల్లప్పుడూ, అరాజకత్వము అనే ఉపచ్ఛాయ ఆవరించే ఉంటుంది. ఏషియాఖండంలోని దేశాల్లో, ఈ ఛాయలు ఎప్పుడూ ఆకాశంలో దట్టంగా అలముకొని ఉంటాయి. ఏమాత్రం అనుకూలమైన వాతావరణం ఏర్పడినా, దిక్కుదిక్కులనుంచి పరుగెత్తుకుంటూవచ్చి, దేశాన్ని అంధకారంలో కప్పివేస్తాయి. జాగరూకత, సంసిద్ధత, వినిశ్చయం, దృఢమైన ప్రతిక్రియాచరణం, అనే గుణాలు అట్టిపరిస్థితిలో మిక్కిలి ఆవశ్యకాలు. కార్యనిర్వాహక రాజ్యాంగం, బలకరమై ఉన్నప్పుడే, వీటిని ఎదుర్కోవడం సాధ్యమౌతుంది. ప్రభుత్వముయొక్క స్థిరతకుమాత్రమే కాక, ప్రభుత్వము యొక్క నిలుకడకు కూడా భంగం కలిగించే ఆపద, సంతతమై ఉండినది. పదమూడోశతాబ్దపు ప్రథమదశలో టర్కుల సామ్రాజ్యం ఏర్పడినది మొదలు, లోడీ సుల్తానేట్ను పదహారోసేపరకూ, ఐదురాజ్యవంశాలు ఇండియాను పరిపాలించినవి. ఈ ఒక్కొక్కవంశమూ సరాసరి అరవైఏండ్లుదేశాన్ని పాలించినవి. వీరి పరిపాలనకాలంలో, దీర్ఘకాలావధులలో ఆపద సిద్ధించింది. మంగోలులవల్ల ఏర్పడిన విపత్తి, తైమూరు విద్యుద్వేగంతో సాగించిన దండయాత్ర,- ఇవి.

కాబట్టి, కార్యనిర్వాహకశాఖకు సమస్తాధికారాలనూ, విస్తారమైన మూలాధారాలనూ కలిగించవలసి ఉంటుంది. కాని, కేవలం ఉపయోగాత్మక సమర్థనలతో మానవుల మనస్సులకు తృప్తికలుగదు. కార్యనిర్వాహక వర్గముయొక్క అధికారాన్ని సమర్థించడానికి తగిన నైతిక కారణాలను అన్వేషించవలసిఉన్నది. మరిన్నీ, మహత్తరమైన అధికారశక్తియొక్క వ్యక్తస్వరూపం ఎప్పుడూ, ఆకర్షకమైనదే. భయభక్తులనూ పూజ్యభావననూ, అది ఉత్పాదిస్తుంది. కాబట్టే, దివ్యప్రభతో ఏర్పడినది రాజత్వమనే భావం, తప్పనిసరిగా ఏర్పడింది. ప్రజల మనస్సులలో అంతర్నిహితమైయున్న పాశవిక అంశాన్ని గ్రహించుకోడానికి తగిన ప్రేరకశక్తులను, పరిపాలకుడు సమకూర్చవలసి ఉంటుంది. అప్పుడే, ప్రజలు ప్రభువుపట్ల భక్తివిశ్వాసాలను వహించి ఉంటారు. కాని, పరిపాలకుని జీవితానికి, ఒక దివ్యమైన ధ్యేయము ఉన్నప్పుడే ఈకార్యం సాధ్యమౌతుంది.

అధికార లక్షణాలు, విస్తృతిలోను, పరిమితులలోనూ కూడా, రాజుయొక్క వ్యక్తి విషయంలోనే ప్రాధాన్యం వహించడం జరిగింది. అధికారాన్ని వహించిన వ్యక్తి దివ్యుడు. రాజకీయాధిపత్యానికి ఇది, బాహ్యమైన చిహ్నం. రాజ్యముయొక్క సార్వభౌమాధికారానికి, ఇది వ్యక్తస్వరూపము. ప్రజల భక్తివిశ్వాలకు రాజు కేంద్రస్థానం; సైన్యానికి ఆశ్రయమైన నాభి. సేనానాయకులు, ప్రభుత్వాధికారులు, కులీనవర్గము, పండితవర్గము కళాకారులు, కవులు,-అందరూ ఇతని వ్యక్తికి బద్ధులై, ఆతని ఔదార్యముపై ఆధారపడినవారు.

దేశముయొక్క సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక జీవితంలో, రాజు, లేక చక్రవర్తి అతని ఆస్థానము ప్రముఖపాత్రను నిర్వహించిరి. కాని, చక్రవర్తికి వైయక్తికమైన మహోన్నతస్థానాన్ని కలిగించడంతో, ముఖస్తుతి చేసే పరోపజీవులు వృద్ధిచెందిరి. భావ స్వాతంత్ర్య, కార్యరూప స్వాతంత్ర్యాలు నిరుత్సాహానికి గురిఐనవి. దర్బారులోని ఏర్పాట్లు, ఆస్థాన సంప్రదాయాలు, దేవాలయంలోని పూజావిధానసంస్కారాలను పోలినవి. రత్న ఖచితమైన సింహాసనాన్ని, సభాసదులకు అందరికీ పైనఉండే అరుగుపైనిలిపి, వెండిబంగారు జరీచేసిన పట్టుఛత్రాన్ని సింహాసనానికి ఆచ్ఛాదంగాచేసి, ఆ సింహాసనంపై చక్రవర్తిని అధిష్ఠింప చేసేవారు. ఆస్థానసభ్యులు, విజ్ఞాపన చేసుకోడానికై వచ్చినవారు, ఆదర బహుమానాలను ఆశించివచ్చినవారు, దర్బారులో క్రిక్కిరిసి నిండిఉండేవారు. అతివిధేయత, ముఖస్తుతి, అనేవాటితో ఏర్పడిన వాతావరణం, సభను ఆవరించి ఉండేది. ఆస్థానసభ్యులు తమ చేతులను ఆకాశంవైపుచాపి, మహోన్నత చక్రవర్తి నోటినుంచి వెలువడిన ప్రతిమాటకూ "పరమామృతం, పరమామృతం," అని, ఆశ్చర్యార్థకధ్వనులు చేసేవారని, దర్బారులను ప్రత్యక్షంగా చూచిన, బెర్నియర్, వర్ణిస్తాడు. ఈ అలవాటు సమాజజీవితానికి, స్వభావసిద్ధమైపోయింది. తనకు వైద్యంచేయవలసిందని ప్రార్థించిన ఒక కులీనవంశజుడైన వ్యక్తి, బెర్నియరును, తద్యుగ ఆరిస్టోటల్, హిపోక్రీటస్, అవిశెన్నా, అని సంబోధించినాడని,- పైవిషయానికి నిదర్శనంగా వ్రాసిఉంచినాడు.

ఈ విధంగా, మధ్యయుగాల ఇండియా రాజ్యపాలకుడు అధికారస్వరూపంగా గుర్తింపబడినాడు. అధికారములో, సైన్యము, రాజస్వము, అనేవి రెండూ ఇమిడిఉన్నవి. కార్యనిర్వహణాధికారానికి ఇవి రెండూ, అత్యావశ్యకములు. వీటికి తోడుగా అధికారశక్తి యొక్క వాస్తవస్వరూపాన్ని కప్పిపుచ్చే, అలంకరణాంశాలు కూడా అవసరములే. కళలు, వృత్తికర్మలు, సారస్వతము, విజ్ఞానశాస్త్రము, మొదలైనవాటిని ఆదరించడము, మతము, దానధర్మాలు. ఉత్సవాలు, వినోదాలు, ఇత్యాదులను ప్రోత్సహించడము,- ఇట్టివే అలంకరణాలు.

కాని, వర్తకము, పరిశ్రమలు, ప్రజలసాంఘిక-ఆర్థిక జీవితము, మున్నగువాటిలో, మధ్యయుగాల రాజ్యం ఆసక్తిచూపలేదు. ఐనా, ఇస్లాము మతానికి సంబంధించిన నిషేధాలను, వ్యాదేశాలను, ముస్లిములు పాటించేటట్లు చేయడం, ముస్లిం ప్రభువుయొక్క మత కర్తవ్యంగా ఏర్పడిఉండినది.

ఆడంబరము, ఉజ్జ్వల ప్రదర్శనము, రాజత్వాన్ని ఆవరించి ఉన్నప్పటికీ, రాజత్వ కార్యరంగం, తీవ్రపరిమితికి లోనైనట్టిది. ఆధిపత్యం విభక్తంకాలేదు. కాబట్టి రాజు ప్రత్యేకమైన వ్యక్తిగా నిలిచిపోయినాడు. అతని స్థితిగతులలోను, భవిష్యత్తులోను, ఆసక్తివహించినవారు చాలకొద్దిమంది. అతని అనుయాయులను సంయోజనపరిచే బంధాలు కూడా దుర్బలములైనవే. పరస్పరం ఈర్ష్యాపరులైన వ్యక్తులు, ఎప్పుడూ ఇతనిచుట్టూ ఉండేవారు. వీరు ఇతని సన్నిహిత బంధువర్గంలోనివారు, సహవాసులు. రాజత్వానికి వాస్తవంగా, బంధుత్వమనేది లేదు. ఇటువంటి పరిస్థితులలో అసాధారణమైన ప్రతిభగల వ్యక్తులు మాత్రమే, తల ఎత్తుకొని, నిలబడగలరు. వంశపరంపరాగతంగా సిద్ధించేది రాజత్వం. కాని ఆనువంశికతలో (Heredity) ప్రతిభ నిలిచిఉండేటట్లు చేయడానికి, వీలులేదు. కాబట్టి, సింహాసనాన్ని

అధిష్ఠించిన ప్రతిరాజూ, రాజత్వానికి తనకు హక్కు కలదని, నిరూపించుకోవలసి ఉంటుంది. రాజ్యానికి అస్థిరత్వం కలిగించింది ఈ విషయమే. ఉత్తరాధికార యుద్ధాలకూ, రాజవంశాలు శీఘ్రకాలంలో మారిపోవడానికీ, ఇదే హేతువయింది.

## III. ప్రభుత్వము-పరిపాలన

మూడు నిర్మాణాత్మక ప్రభావాలవలనైనై, మొగల్ పరిపాలనవ్యవస్థ, అభివృద్ధిచెందింది. వీటిలో, రెండు విదేశీయములు, ఒకటిదేశీయము. విదేశీయాంశాలు, మొగల్ పరిపాలకుల పూర్వనివాసస్థలమైన మధ్యఏషియానుంచి సంక్రమించినవి. మంగోలుల అస్థిరవాసనాగరికతకూ, ఇరానుల స్థావరనాగరకతకూ, సంయోగము ఏర్పడింది, మధ్యఏషియాలోనే. మొగలులకు, ఈ రెండు ప్రవృత్తులూ సంక్రమించినవి. రాజ్యవిషయమైన మొగలుల భావాలు, రాజుపగల స్థానము, ఇరాను మూలము నుంచి సిద్ధించినవి. అంతేకాక, భాష, సారస్వతము, తత్త్వ శాస్త్రము, బౌద్ధికదృక్పథము, కళాసౌందర్య దృక్పథము, అనేవి ఇరాను ప్రాబల్యానికి లోనైనవి. కాని, సైన్య వ్యవస్థకు సంబంధించిన విధానంలో, మంగోలుల సంప్రదాయాలను వీరు, అనుసరించిరి. ప్రభుత్వ సేవా సంవర్గాలను రచించడంలో కూడా, మంగోలుల పద్ధతినే అనుసరించిరి.

విత్తసంబంధమైన పరిపాలనకు, భూమిపన్నుల వ్యవస్థకూ, ఆధారాన్ని, వారికి ఇండియా సమకూర్చింది.

మొగల్ ప్రభుత్వానికి మూలాధారమైనది సైన్యం. మొగల్‌చక్రవర్తి సైన్యానికి అధ్యక్షుడు; మంత్రులు సైన్యాధికారులు. సివిల్, మిలిటరీ, అధికారులకు భేదంలేదు. అందువల్ల సేవాశాఖలన్నీ సైనికశాఖలే. అధికారులందరూ ఏకరూపమైన సంవర్గంలోనివారే సామ్రాజ్యము ముఖ్యస్థానం,- రాజధానిలోఉన్నా, లేక, యుద్ధయాత్రలోఉన్నా- మహోన్నత అధికార శిబిరంగా [ఉర్దూ-ఏ-ముఅల్లా] పరిగణింపబడింది.

సమగ్రమైన ఈ విధానానికంతా, మంగోల్‌పద్ధతి ఆదర్శంగా ఏర్పడింది. మంగోల్ సైన్యాలు దశాంశపద్ధతిలో విభక్తమైనవి. మంగోలుసైన్యంలో అన్నిటిలోనూ చిన్నపదవి, పది అశ్వారోహుల అధిపతిది. దీని, పైస్థానంలోనివారు, నూరు, వేయి, పదివేలు, నూరు వేలు, అశ్వారోహుల అధిపతులు. మంగోలులు ఏ దేశంలోనూ స్థిరంగా నివసించేవారు కారు. గొర్రెలమందలు, గుర్రాలమందలు వారిసంపద. పచ్చిక భూములతో వారి అధికారపరిధి ఏర్పడింది. అధికారులకు, వారి ఆశ్రితులకు, అవి జీవనోపాధిగా ఏర్పడినవి. కాని, దీనిని దోపిడులవల్ల లభించినదానితో పూర్తిచేసుకొనేవారు.

ఇండియా పరిస్థితులువేరు. స్థిరనివాస జీవితానికి అలవడని వీరి సైనికవ్యవస్థ, ఇండియాలోఉన్న వ్యవసాయార్థిక పద్ధతికి అనుగుణంగా పొందిక పరచుకోవలసివచ్చింది. మన్సబ్, అని, వ్యవహరించబడే దశాంశదళాలుగా, మంగోలుపద్ధతి ప్రకారం, సైన్యవ్యవస్థ ఏర్పడింది. పదుగురు అశ్వారోహులతో కూడినదళం మొదలు, కులీనుల సేనానాయకత్వంలోని ఐదువేల అశ్వారోహులతో కూడిన దళంవరకు, ముప్పైమూడువర్గాలుగా సైన్యం విభజింపబడింది. ఇంతకంటె పెద్దదళాలు రాజకుమారుల ఆధిపత్యంలో ఉండినవి. మన్సబ్ యొక్క సిబ్బంది ఖర్చుకు, అతని అధీనంలోని సైనికుల వేతనాలకు, ప్రయాణపు ఖర్చులకు సరిపోయే

విధంగా, మన్‌సబుయొక్క వేతనం నియమితమయింది, ద్రవ్యరూపంలో సామ్రాజ్యకోశంలో నుంచికాని, లేదా, రాజస్వసంస్థానాన్ని పంచి ఇచ్చికాని, ఈ వేతనాన్ని సరిపుచ్చేవారు.

సామ్రాజ్యముయొక్క సేనాబలంలో అధికభాగాన్ని మన్‌సబ్‌దార్లు సమకూర్చేవారు. ప్రతిమన్‌సబ్‌దారుకూ నిర్దిష్టమైన సైనిక సంఖ్యను కూర్చుకొని, దానిని పోషించడం అతని బాధ్యత. సైనికులను ఏరుకోవడంలో, సహజంగా, మతప్రభావము,వర్గప్రభావము, ప్రాబల్యం వహించినవి. మొగల్ అధికారులు మొగలులనే, తమ అనుయాయులుగా ఏరుకొనేవారు. అదే విధంగా, పర్షియన్ అధికారులు పర్షియనుల సైన్యదళాలను, పఠానులు పఠాను దళాలను ఏర్పరుస్తూ వచ్చిరి. కొంతవరకు, మిశ్రమదళాలను ఏర్పరచడంకూడా ఆమోదింపబడింది.

మన్‌సబ్ అధీనంలోఉన్న సైనికులందరూ, అతని జాగీరులోని నివాసులై ఉండవలసిన అవసరంలేదు. వీరు చాలవరకు, నగరాలలోని, చలజన సంఖ్యకూ, (floating population), సింధునది అవతలి ప్రదేశాల నుంచి వలసవచ్చిన జనానికీ, చెందినవారు. అభిమానంతో, ఇట్టివారిని సైన్యంలో చేర్చుకొన్నారు. యుద్ధవ్యూహారచనలో ప్రతివర్గమూ తమ తమ జనజాతినాయకుల పతాకాలను ఆశ్రయించి, స్థానాలలో నిలిచేవి.

ఈ విధంగా ఏర్పడిన సైన్యంలో, లోపాలు ఉండడం తప్పదు. సైన్యానికి ఐక్యము సిద్ధించలేదు సుసంఘటితమైన సంస్థగా, ఒక సైన్యాధిపతి సంకల్పాన్ని అనుసరించి, ప్రవర్తించలేకపోయింది. ఈ సైన్యం, ప్రధానంగా కూలి సైనికులతో ఏర్పడినట్టిది. ఉద్యోగావకాశములూ, దోచుకోడానికి అవకాశాలూ ఉన్నవనే ఆశతో, సైనికవంశాలకు, కులాలకు, కుటుంబాలకు, చెందిన వ్యక్తులు సైన్యవృత్తిలో చేరిరి. వీరు సైన్యవృత్తిని అవలంబించడానికి, ఉన్నత ఆశయాలు కారణాలుకావు. సైన్యముయొక్క ధైర్య స్థైర్యాలు సేనానాయకునిపై ఆధారపడినవి.

మొగల్ సైన్యవ్యవస్థ భూస్వామ్యవిధానాన్ని అనుసరించి ఏర్పడిందికాదు. దీని సేనానాయకులు, వంశపారంపర్యంగా వచ్చే భూస్వాములుకారు; యూరోపులోవలె, కట్టుబడి భూములను అనుభవిస్తూ సేవచేసే రక్షక వీరులవంటివారూ, అనుయాయులూ, వీరి అధీనంలో లేరు. వ్యక్తులయోగ్యతనుబట్టి. రాజు ఆదరాన్ని, లేక, గొప్ప అధికారుల ఆదరాన్నిబట్టి, వీరికి ఉద్యోగాలు లభించినవి. వీరిని సేనానాయకులుగా తీసుకోవడంలో కుటుంబ సంప్రదాయాలు, ప్రాధాన్యం వహించినవి. ప్రభుత్వం ద్రవ్యరూపంగా ఇచ్చే వేతనానికి, లేదా, వీరికి నిర్దిష్టమైన జాగీరులనుంచి వచ్చే రాజస్వానికి, మాత్రమే వీరికి హక్కు ఉండినది. ఇట్లు, మొగల్ ప్రభుత్వము శక్తివంతమై ఉన్నంతకాలము, ఆనువంశీయమైన సంపన్న వర్గము వృద్ధికిరాలేదు.

ఆనువంశీయమైన సంపన్న వ్యవస్థలో, అత్యధికభాగం, హిందువులది. ప్రాచీన హిందూ రాజవంశాల సంతతివారిలో ఏర్పడింది జమీందారీవర్గము. ఈ వంశాలవారు, జయించిన వానికి తలఒగ్గి, అతని ఉన్నతాధిపత్యాన్ని అంగీకరించిరి. కప్పం చెల్లించే షరతుపై, తమ సంస్థానాలను నిలుపుకొన్నారు. ప్రభుత్వంతో వీరికిగల సంబంధం కేవలం, ద్రవ్యరూపమైనట్టిది మాత్రమే. ఈ విషయంతప్ప, ప్రభుత్వస్థితిగతులలో వీరికి ఏ మాత్రమూ ఆసక్తిలేదు.

పదహారో శతాబ్దం కడపటి కాలానికీ, పందొమ్మిదో శతాబ్ద మధ్యకాలానికీ, ఉత్తర

ప్రదేశ ప్రాంతంలో వ్యాపించిఉన్న జమీందారీ సంఖ్యనుబట్టి, హిందూ జమీందారుల అధిక ప్రాముఖ్యం వ్యక్తమౌతుంది. సామ్రాజ్యమధ్యస్థమైఉన్న ప్రాంతంలోని అధికభాగం రస పుత్ర జమీందారుల హస్తగతమై ఉండినదని, లెక్కలు ప్రదర్శిస్తున్నవి. పదహారో శతాబ్దంలో, సమగ్రమైన జిల్లాలు వారి అధీనంలో ఉండినవి. కాని పందొమ్మిదో శతాబ్దపు మధ్య కాలానికి అధికప్రాబల్యం వీరిదే ఐనప్పటికీ, జాట్‌లు, గుజార్లు, అహీర్లు, ముస్లిములు, ఇతర కులాలవారు సంస్థానాలను ఏర్పరచుకొనిఉండిరి.

ఆ యుగపు ప్రథమ దశలోను, కడపటి నాటికీకూడా, ముస్లిం జమీందారులు అల్ప సంఖ్యాకులై ఉండడం, ఆశ్చర్యకరమైన విషయం. జమీందారీ భూములను సంపాదించు కొన్న ఈ అల్ప సంఖ్యాకమైన కుటుంబాలవారు, మొగలుల పూర్వపు రాజ్యాలలోని అధి కారుల వంశము వారో, లేదా, బలాత్కారంగా భూములను వశం కావించుకొన్న స్వచ్ఛంద సాహసికులో, ఐ, ఉండిరి. బేబర్ వెంటవచ్చిన దళవాయిలూ ఎవ్వరూ, ఇండియాలో స్థిర పడలేదు. కాని, కాలంగడచి, సామ్రాజ్య పర్యవేక్షణ సడలినకొద్దీ, పదవులు అనువంశీయ తగా సంక్రమించే ప్రవృత్తి ప్రారంభమయింది; జాగీర్లను ఇతరులకు బదిలీచేసేపద్ధతి క్షీణిస్తూ వచ్చింది. పద్దెనిమిదో శతాబ్దంలో, భూమిపై ఆస్తి స్వామ్యాన్ని హక్కురీత్యాకోరే, అసంఖ్యాకమైన భూస్వాముల గుంపు ఏర్పడింది. పూర్వపు జమీందారులు తమ సంస్థానాలను విస్తృతి కావించుకొనిరి. వ్యవసాయ సంస్థవారు-ఇజారేదార్లు - రాజస్వాన్ని వసూలుచేసే హక్కు, తమకు శాశ్వతంగా ఏర్పడిందని, తమకు తామే నిశ్చయించుకొనిరి. జాగీరుదార్లు, తమకు ప్రభుత్వం నిర్దేశించియుండిన జాగీర్లను, శాశ్వత స్వామ్యంగా చేసుకొనిరి.

బెంగాలు ప్రాంతపు దివానీని, ఈస్ట్ఇండియా కంపెనీకి బదిలీచేసిన సమయంలో, ఆ ప్రాంతములో ఉండిన పరిస్థితులుకూడా, హిందూ జమీందారులే అధిక సంఖ్యాకులు అనే విషయాన్ని నిరూపిస్తాయి. పశ్చిమ పంజాబు ప్రాంతం మినహా, ఇండియాలో అంతటా, భూమి సంబంధమైన ఉత్తమ హక్కులన్నీ హిందువుల హస్తగతమై పోయినవని, సహేతు కంగా నిశ్చయించవచ్చు.

ప్రథమంలో వేతనం పుచ్చుకొనే అధికారుల క్రమబద్ధమైన శ్రేణితోమాత్రమే మొగల్ కులీన సంస్థ ఏర్పడింది. ఇంగ్లాండులోని భూస్వామ్య జాగీరుదార్ల సంస్థవంటిదికాదు, మొగల్ కులీనసంస్థ. అనువంశీయమైన కులీనవర్గం లేనందువల్ల, రాజ్యానికి స్థిరత్వాన్ని కలిగించే శాశ్వతమైన ఆధారశక్తి లేకపోయింది. స్థిరబుద్ధిలేని, దురహంకారుడైన రాజుయొక్క అత్యా చారాల నుంచి ప్రజలను కాపాడే పరిరక్షణ దేశంలో ఏర్పడకపోయింది. అన్లే, విపత్తులూ, ఒత్తిడీ రాజుకు కలిగిన సందర్భాలలో, అతనికి బాసటగానిలిచే విశ్వసనీయమైన సంస్థ కూడా లేదు. పీఠ భారం (Ballast) లేని పడవ, గాలికీ అలలకూ, వశమైయున్నట్టి పరిస్థితి, రాజ్యానికి పట్టింది.

## IV. ప్రజలు

సామ్రాజ్యంలోని ప్రజానీకం రెండు వర్గాలుగా ఏర్పడి ఉండినది. హిందూముస్లిముల ఉన్నత కులాలవారితో, పరిపాలక వర్గం ఏర్పడింది. సైయాదులు, షేక్‌లు, మొగలులు, ఇరానీలు, పఠానులు, [అఫ్ఘనులు], ముస్లిములలో ఉన్నత వర్గాలవారు; హిందువులలో,

రసపుత్రులు, బ్రాహ్మణులు, ఖత్రీలు, కాయస్థులు, ఉన్నతులు. సైయీదులు, బ్రాహ్మణులు సైనికశాఖకు చెందని పరిపాలకవర్గంలోనివారు. సైన్యసంస్థ, సేవాసంస్థ అనే రెండు స్తంభాలపై నిలిచిఉన్న, ఉన్నత వర్గాలవారిరాజ్యం, మొగలురాజ్యం. ఈ రెండు సంస్థలూ కూడా మొగలులు, ఇరానీలు, పఠానులు, రసపుత్రులు, అనే ఉన్నత వర్గాలవారి సైన్యశాఖకు ఏక స్వామ్యమై ఉండినవి. సామ్రాజ్యసేవలోని మన్‌సబ్‌దార్ల పట్టికను పరిశీలించడంవల్ల, ఈ విషయం ధ్రువమౌతుంది. అక్బర్ పరిపాలన కాలము నుంచి, షాఅలాంవరకూ, ఉన్నత స్థాన మన్‌సబ్‌దార్లుగా ఉండినవారి పట్టికలు, మాసిర్-ఉల్-ఉమారా, అనే, గ్రంథంలో ఉన్నవి. దానినిబట్టి, 636 మంది ముస్లిము అధికారులు, 87 మంది హిందూ అధికారులు ఉన్నట్టు తెలుస్తుంది. ముస్లిములలో, అత్యధికసంఖ్య (570) మొఘలులది, పఠానులది. 33 మంది సైయీదులు, 25 మంది షేక్‌లు, మాత్రమే ఈ అధికారపదవులలో ఉండినవారు. ఇదే విధంగా, హిందువులలో ఐదార్గురు తప్ప, తక్కిన అధికారులందరూ, రాజపుటానా, మధ్యమభూములు, బుందేల్‌ఖండ్, మహరాష్ట్ర ప్రాంతాలనుంచి వచ్చిన రసపుత్రులు. దీనిని పట్టిచూస్తే, సైనికజాతులవారిని మాత్రమే సైన్యంలో చేర్చుకొనే విధానాన్ని, మొఘలనే గుర్తించి, ఉండినట్లుతోస్తుంది. ఇండియాలో బ్రిటీషువారి సైన్య వ్యవస్థకుకూడా, ఈ విధానమే ప్రాతిపదికగా ఏర్పడింది.

విద్యాబోధనలు ఉపజీవికగాగల వర్గానికి చెందినవారు సైయీదులు. అందువల్ల, వారికి న్యాయశాఖలో ఉద్యోగాలులభించినవి. అదేవిధంగా, న్యాయాన్ని నిర్ణయించడంలో, కాజీలకు సహాయకులుగా బ్రాహ్మణులు నియమింపబడిరి. హిందువులలో విద్యావంతుల వర్గానికి చెందిన కాయస్థులకు, రాజస్వ, విత్తశాఖలలో, ఆదరం లభించింది.

విస్తారంగా అధికసంఖ్యాకమైన, హిందూముస్లిము కులాలవారు, ఉన్నత కులాలవారికి అయోగ్యములుగా పరిగణించబడిన, సేద్యము, పరిశ్రమలు, వ్యాపారము, అనే వృత్తులను అవలంబించిఉండిరి. రాజ్యంలో, ఏవిధమైన అధికారమూ లేని ఈ ప్రజానీకానికి, పరిపాలనలో భాగమూలేదు, లాభము లేదు. కాబట్టి, సహజంగా రాజ్య వ్యవహారాలలో ఎట్టి ఆసక్తి వారు చూపలేదు; రాజ్యసంబంధమైన వ్యత్యయాల విషయంలో, ఉదాసీనులై ఉండిరి.

కులభావం, ముస్లిములలో వేరు పాతుకొనిపోయింది. పరిపాలన వ్యవస్థా నిర్మాణానికి అంతటికీ, ఇదే ఆధారమయింది. హిందువుల పద్ధతిప్రకారం, సాంఘిక వ్యవస్థను కాపాడి, పోషించేవారు క్షత్రియులు. కాబట్టి ఇతర కులాలకు గల స్థానాన్ని, నిశ్చయించడానికి, మార్చడానికి కూడా రాజుకు అధికారం ఉన్నదని భావించేవారు. పంజాబు పర్వత ప్రాంతాల రసపుత్ర పరిపాలకులకు, మహరాష్ట్ర పరిపాలకులకు సమాజం సమాజస్థానంలో కలిగిన వ్యత్యయాలు ఇందుకు నిదర్శనములు. మతానికి సంబంధించిన విషయాలను నిర్వహించే వారు బ్రాహ్మణులు. సాంఘిక వ్యవస్థకు వారు రక్షకులు కారు. పితృపరంపరమైన రసపుత్ర వంశమూలాన్ని కోరే మరాఠా సర్దారులకు, ఇతర ఆశ్రితులకు, సరియైన వంశావళినీ, వ్యుత్పత్తినీ, కల్పించడం, బ్రాహ్మణులు నిర్వహించవలసిన కార్యాలలో ఒకటి.

సామాజిక వ్యవస్థను రక్షించడం విధ్యుక్తధర్మంగా వహించిన క్షత్రియులను పోలినవారు మొగల్ చక్రవర్తులు. అబుల్‌ఫజల్ చెప్పిన ప్రకారం, సమాజం, నాలుగు వర్గాలుగా ఏర్పడిఉండింది. యుద్ధవీరులు, వర్తకులు-కారీగర్లు (Artificers), విద్వాంసులు, కర్ష

కులు, అనేవి ఈ నాలుగు వర్గాలు. కాబట్టి, ఈ వర్గాలను వాటి వాటికి తగిన స్థానాలలో ఉంచి, వాటికి అర్హమైన మర్యాదను ఇస్తూ, తన సామర్థ్యాన్ని వారితో ఐక్యం కావించి, సమాజశ్రేయస్సును సాధించడం, రాజుయొక్క విధియైఉన్నది. మరిన్ని, ఈ గంభీరమైన రాజకీయ సంస్థయొక్క సంతులనస్థితి (Equillibrium) ఈ నాలుగు వర్గాలపై ఆధారపడిఉన్నది. కాబట్టి, రాజత్వముకూడా ఇదే విధమైన కులీనులు, రాజస్వాధికారులు, ప్రజ్ఞావంతులు, లేక, తత్త్వశాస్త్రజ్ఞులు, భృత్యులు, అనే నాలుగువర్గాలతో సమగ్ర స్వరూపాన్ని పొందుతుంది," అని, అబుల్ ఫజల్ వ్యాఖ్యానించినాడు.

అబుల్ ఫజల్ పేర్కొన్న నాలుగువర్గాలలో, రాజ్యానికి వెన్నెముకగా ఏర్పడినది సైనికవర్గం. దీనికి తర్వాత, విద్యావంతుల వర్గం ముఖ్యమైనది. విద్వాంసులు, న్యాయశాస్త్రజ్ఞులు, మతధర్మశాస్త్రజ్ఞులు, అధ్యాపకులు, రచయితలు, కవులు, ఈవర్గంలోని వారు. వీరిని పోషించడం ప్రభుత్వ కర్తవ్యం.

తమ ఆస్థానాలను విద్యాకేంద్రాలుగా ఏర్పరచడం గౌరవప్రదమైనదని పరిపాలకులు తలంచిరి. అంతేకాక, కళలను, విజ్ఞానశాస్త్రాలను, ఆదరించిన పోషకులు వీరు, అనే కీర్తిని సంపాదించదలచినవారు. కాబట్టి, కవిత్వము, మత ధర్మశాస్త్రము, చరిత్ర, సారస్వతము, విజ్ఞానశాస్త్రము, మొదలైనవాటిలో కీర్తిప్రతిష్ఠలను సంపాదించిన వారిని గౌరవించి, బహుమానాలతో ఆదరించిరి. రాజుల ఆదరానికి ఎక్కువగా పాత్రుడైనవాడు, సహజంగా, ముస్లిము ఉలామా. హిందూవిద్వాంసులను గుర్తించకపోలేదు. ప్రసిద్ధులైన సంస్కృత విద్వాంసులు, హిందీకవులు, ప్రతి చక్రవర్తియొక్క ఆస్థానంలోనూ సభ్యులై, రాజాదరణకు పాత్రులై ఉండిరి. హిందూజ్యోతిష్కులకూ, న్యాయశాస్త్రజ్ఞులకూ, ఆకాలంలో ఎక్కువ అవసరం ఉండినది.

విద్యావంతులవర్గం చిన్నదే ఐనప్పటికీ, దానికి విస్తృతమైన పలుకుబడి సిద్ధించింది. మధ్యయుగాల యూరోపులో మత పురోహితులను, సన్యాసులను గౌరవించిన విధంగా ఇండియాలో, ఉలామా, పండితులు, హిందూముస్లిం మత సంస్థలకు చెందిన పురోహితులు, సన్యాసులు, ఎక్కువగౌరవపాత్రులై ఉండిరి. యూరోపులోని పండితులు, మొదలైనవారందరూ, ఆయా విషయాలకు సంబంధించిన సంస్థలను ఏర్పరచుకొని, ఉండిరి. కాని, ఇండియాలో, ఈవర్గాలవారు అట్టి పద్ధతిని అవలంబించలేదు. ఇస్లాము మతంకాని, హిందూ మతంకాని, చర్చివంటి ఒక సుప్రతిష్ఠితమైన మతసంస్థను ఎర్పరచుకోలేదు. మత సంబంధమైన విషయాలలో, తుదినిర్ణయాన్ని ఇచ్చే సర్వోచ్చ మత సంస్థను స్థాపించుకోవలసిన అవసరమున్నదని, ముస్లిములుకాని, హిందువులుకాని, భావించలేదు. మతసిద్ధాంతాలకు, న్యాయసూత్రాలకు, సంబంధించిన లిఖితగ్రంథాలు సిద్ధంగా ఉన్నవి. అరబ్బీభాషలో తగినంత జ్ఞానంగల ఏవ్యక్తిఐనా, ఆగ్రంథాలలోని విషయాన్ని వివరించగలడని, అభిప్రాయపడిరి. వ్యక్తికీ, సమాజానికీ సంబంధించిన సమస్త జీవిత విషయాలకూ మార్గదర్శకములై, ఈ గ్రంథాలు సమగ్రములై ఉండినవి.

హిందువుల పరిస్థితికూడా దీనికి భిన్నమైనదికాదు. ఐతే, ఇస్లాము మత గ్రంథాలను ఎవరైనా పఠించవచ్చు, అధ్యయనం చేయవచ్చు. ఈ విషయంలో ముస్లిములు ఎవరినీ అడ్డు పెట్టలేదు. కాని హిందువులలో, మత గ్రంథాలను

అధ్యయనంచేసి, అర్థవివరణకావించే అధికారం, బ్రాహ్మణులకు మాత్రమే ప్రత్యేకించబడింది. ముస్లిములలో కూడా విద్యావంతుల వర్గంలో అధికసంఖ్యాకులైన సైయీదులే, కార్యతః, మతగ్రంథాలను అర్థవివరణకావించేవారు. బ్రాహ్మణులలో కొద్దిమంది మాత్రమే విద్యాబోధనలను వృత్తిగా అవలంబించిరి; అధికసంఖ్యాకులు, వ్యవసాయము, వ్యాపారము, ప్రభుత్వోద్యోగాలు, మొదలైన ఇతరవృత్తులను అనుసరించిరి.

ఉలామా, లేక, మత-న్యాయశాస్త్రజ్ఞుని ప్రభావం, సంఘముపై రెండు మార్గాలుగా ప్రసృత్తమౌతూ ఉండెనది. కాజీలుగాను, ముఫ్తీలుగాను, న్యాయపరిపాలన విధానాన్ని నిర్వహించడం, వారి బాధ్యత. న్యాయశాస్త్రసంబంధమైన వారి నిర్ణయాలు, తరువాతవచ్చే వ్యవహారాలకు నిదర్శనములైనవి. సమాజంలో కాజీకిలభించే గౌరవం, అతని పాండిత్యాధిక్యంపై ఆధారపడింది. వీరు, ప్రజలకూ, రాజులకూ, సహోదాయులుగాను మార్గదర్శకులుగాను కూడా, సహకరిస్తూ ఉండిరి.

తప్పుచేసినవారిని మందలించడానికీ, శిక్షచెప్పడానికీ, వారికి రెండుమార్గాలు ఉండినవి. మసీదుం గురుపీఠంలో నిలిచి, ఉపన్యాసాలిచ్చి, ఈ కార్యాన్ని సాధించడం ఒక మార్గం. రాజును పరిషత్ సభామందిరంలో రహస్యంగా కలుసుకొని, సంప్రదించి, కార్యాన్ని చక్కపెట్టడం మరొకమార్గం. అంతేకాక, పాఠశాలలలో యువకులకు శిక్షణను ఇచ్చే ఉపాధ్యాయులు, పుస్తకరచయితలు కూడా వీరే. భావాలనూ అభిప్రాయాలనూ ప్రసారం చేయడానికి, ఇవి రెండూ మిక్కిలి శక్తివంతములైన సాధనాలు. మధ్యయుగాలలో, విద్యా, జ్ఞానాలు రెండూ మత ధర్మశాస్త్రంలో మునిగిఉండేవి. మతతత్త్వాన్నీ, సిద్ధాంతాలనూ, పర్యాలోచనగావించి, బోధించేవారని, ప్రజలు వీరిని గౌరవప్రతిష్ఠలతో చూచేవారు.

ఉలామాసంస్థతో సంబంధము కలవారు, రహస్యోపాసకులైన సూఫీలు, దర్వేషులు. ఉలామాసంస్థలోని అనేకులు పారలౌకికమైన విశుద్ధజీవితాన్ని, కఠినదీక్షతో సాగించేవారు. కాని, తక్కినవారందరూ, స్వార్థసాధకులైన బుద్ధిమంతులు, దురభిమానపూరితులైన పండితులు కుతర్కంతో ఖండనకు పూనుకొన్న న్యాయశాస్త్ర పండితులు; తాము జీవితంలో బాగుపడడమే ప్రధానంగా చూచుకొన్నవారు. వీరికి, బాల్బన్, ఉలామా-ఏ-జహీరి, (Externalist schoolmen) = బాహ్య ప్రపంచమగ్నులైన పండితులు అని, పేరుపెట్టినాడు ఆత్మవిజ్ఞాన సాధకులైన వారిని ఉలామా - ఏ - బతీనే అని, వ్యవహరించినాడు. లౌకిక ప్రపంచంలో ఆసక్తివహించక, దైవధ్యానపరులై ఆత్మశిక్షణను సాధించేవారిలో, అనేకులు పండిత ప్రకాండులై ఉండిరి. కాని, అనేకులు పోకిరీలు [దురాచారులు], స్వేచ్ఛాసక్తులైన స్త్రీలోలురు, సూఫీలవర్గంలోచేరి, ఆషాఢభూతులవలె ప్రవర్తిస్తూ ఉండిరి.

ముఖ్యంగా, పద్దెనిమిదో శతాబ్దంలో, నిష్కపటమైన మతాసక్తి కలవారు చాల కొద్దిమంది; వంచకులూ, పండితవేషధారులూ బహుసంఖ్యాకులు. పద్దెనిమిదో శతాబ్దంలో, నైతికనిష్ఠ, సాధారణంగా సడలిపోవడం, అనే సంఘటన, విశుద్ధమైన రహస్యోపాసన క్షీణించిపోయింది, అనడానికి నిదర్శనం.

ఈ సూఫీలలో, అనేకవర్గాలు [సిల్సిలాలు] ఏర్పడిఉండినవి. ఛిస్టియా, సుహ్రావార్దియా, నక్షబందియా, కాదిరియా మొదలైనవి ఇవి. ఈ వర్గాలలో ఏదానికైనా చేరి ఉండడము, తమ ప్రదేశంలోని వర్గముఖ్యునికి కర్తవ్యమర్యాదను చేయడము, మత సమ

స్కుల విషయంలోను, సాధారణ జీవితప్రవృత్తి విషయంలోనూ కూడా, అతని సలహాను గ్రహించడము,- తన విధ్యుక్తధర్మమని, ప్రతి ఉన్నతవర్గీయ ముస్లిమూ భావించేవాడు.

హిందూ సమాజంలోని పరిస్థితులు కూడా ఇటువంటివే. ముస్లిము సమాజంలో ఉలామా సంస్థ, మతాధికారులు నిర్వహించినట్టి పాత్రను, హిందూసమాజంలో బ్రాహ్మణ పండితులు, సన్యాసి మఠాధిపతులు నిర్వహించినారు.

కాని, ఈ రెండుమతవర్గాలు ఎవరికివారుగా, పూర్తిప్రత్యేకంగా నిలిచిపోవడం, దేశము యొక్క దురదృష్టం. మతము, భాష, ఆచారాలు, సాధారణపరిస్థితులు,- ఇవన్నీ రెండువర్గాలకూ పరస్పర సంపర్కసంబంధాలు కలుగకుండా, అడ్డుకొన్నవి. రెండు భిన్నప్రపంచాలుగా ఏర్పడిపోయినవి. ఈ మతవర్గాలు. అభేద్యములైన మానసిక ప్రాకారాలు, ఈ రెండు మత సంస్థలనూ వేరుపరచినవి. జైన్-ఉల్-అబిదీన్, అక్బర్, దారాషుకోవంటి మహనీయులు కొన్ని సమయాల్లో, ఈ గోడలను పడగొట్టడానికి ప్రయత్నించి ఉండవచ్చు. ఒక ముస్లిం దర్వేష్, ఒక హైందవయోగి, కొన్ని సమయాల్లో పరస్పరం కలుసుకొని, తమ భావాలను పంచుకొని ఉండవచ్చు. అంతేకాని, ఈరెండు మతాలకూ చెందిన పురోహితవర్గాల మధ్యగల అఘాతం, ఎల్లప్పుడూ విశాలంగానే నిలిచిపోయింది.

సంస్కృతభాషను, సంస్కృత సారస్వతాన్ని, అందులోని విజ్ఞానశాస్త్ర, తత్త్వ శాస్త్రాలను అధ్యయనంచేసిన ముస్లిములసంఖ్య అత్యంతమూ పరిమితమై ఉండడమే, ఇందుకు నిదర్శనం. పారసీకభాషలోని అనువాదాలద్వారా, ముస్లిములకు సంస్కృతంతో పరిచయం కలిగించడానికి, ఫిరోజ్ తుగ్లక్‌కాలము నుంచీ కూడా, వృథప్రయత్నాలు జరిగినవి. మొగలుచక్రవర్తుల కాలంలో, క్రమవ్యవస్థను అనుసరించిన ప్రయత్నం కూడా జరిగింది. ఐనప్పటికీ కూడా, సంస్కృతంతో ఎక్కువ పరిచయం కలిగినట్లు, ముస్లిము రచయితల గ్రంథాలు సూచించడంలేదు. ఐనా, హిందువులు అనేకులు, పారసీకభాషలో పాండిత్యాన్ని గడించినారు. అరబ్బీ భాషాజ్ఞానాన్ని కూడా సంపాదించుకొన్నారు. కాని పండితులు మాత్రం పూర్తిగా దీనికి దూరంగా నిలిచిపోయిరి. సంస్కృతభాషలో వారు రచించిన గ్రంథాలు, పారసీక, అరబ్బీ సారస్వతాలను పూర్తిగా విస్మరించినట్టివి.

ఈ రెండు మతవర్గాలకూ సంబంధించిన భావప్రపంచాలమధ్య, చేర్చడానికి వీలుకాని అగాధమైన పాతాళం, నోరు తెరచుకొని నిలిచిఉన్నది. ఇతరుల భావాలూ, అభిప్రాయాలూ, ఎట్టివై ఉన్నవని తెలుసుకోడానికి రెండువర్గాలలోని పండితులూ ఏమాత్రమూ కుతూహలం చూపకపోవడానికి, కేవలం, వారి దురభిమానమే కారణమయింది. ఇది నిజంగా విస్మయాన్ని కలిగించే పండిత ప్రవృత్తి. దీనివల్ల కలిగిన దుష్టపరిణామాలు తరువాతి కాలంలో ప్రత్యక్షంగా బహిర్గతమైనవి.

సంకుచిత భావాలతో ఏర్పడిన ఉలామాసంస్థకు, పండితసంస్థకు, బాహ్యమైయున్న, తక్కిన హిందూముస్లిములు పరస్పరభావాలనూ, ఆచారాదులను కూడా గ్రహిస్తూ ఉండిరి. హిందూవర్గంలో భక్తిమతాన్ని ప్రచారం కావించిన నాయకులు, సూఫీలవర్గానికీ, ముస్లిం విద్వాంస వర్గానికీచెందిన కొందరు ఉదారులు, మతతత్త్వసిద్ధాంతాలకు అతీతమూ, రెండు మతాలవారికీ సమానమూఐన, ఆధ్యాత్మిక జీవితమార్గాన్ని అన్వేషించడానికి ప్రయత్నించిరి. మతనిష్ఠ సర్వస్వమూ తమ స్వామ్యమనే అహంభావంతో, ఇతర భావాలపట్ల సహనం లేని

వారై ఉంచిన వ్యక్తులయొక్క సంకుచితత్వానికీ, ప్రత్యేకతాభావానికీ, అతీతమైన ప్రవృత్తి వీరిది. ప్రజలలో పరస్పర ప్రీతిభావాన్ని, పొందికను, సద్భావాన్ని స్థాపించడానికి వీరు ప్రయత్నించినారు.

ఇట్టి పరమత సహనభావాన్ని, శ్రద్ధాళువులై ప్రతిపాదించి, వ్యాపింపచేసిన ఈ శాంతి దూతలు పెక్కుమంది బ్రాహ్మణేతర కులాలవారై యుండడంలో, ఆశ్చర్యం ఏమాత్రమూ లేదు. కబీరు-సాలెవాడు; నానక్-వేదీఖత్రికులస్థుడు; రాయదాస్-చర్మారకులంవాడు; ధన్నా-జాట్ కులజుడు; సేనా-మంగలికులంవాడు; సుందరదాస్-వైశ్యుడు; మలుక్‌దాస్-ఖత్రీ; బీర్‌భాణ, జాదాలాల్, ప్రాణనాథ్‌లు-క్షత్రియులు; ధరణీదాసు-కాయస్థుడు; జగజీవన్‌దాస్-ఠాకూర్ కులస్థుడు; బుల్లాసాహేబ్-కున్బీకులంవాడు; ఇంకను పెక్కురు ఇతర కులాల నుంచి వచ్చిన మహనీయులు. మహారాష్ట్రప్రాంతానికి చెందిన నామదేవ్, దర్జీకులంవాడు; జ్ఞానేశ్వరుడు కులబాహ్యుడైన బ్రాహ్మణుడు; చొకమేళ-మహర్‌జాతివాడు; తుకారాం-శూద్రుడు; ఇక, దక్షిణ దేశంలో, వేమన-కాపుకులజుడు; తిరువళ్ళువర్-పంచమకులజుడు. బెంగాలులో ప్రసిద్ధపురుషుడైన చైతన్యస్వామి బ్రాహ్మణకులంలో పుట్టినవాడైనా, అతని శిష్యులందరూ, అతి నిమ్నకులాల నుంచీ వచ్చినవారు. ముస్లిములు కూడా అనేకులు ఇతని శిష్యవర్గంలో చేరినారు.

హిందూతత్త్వశాస్త్రాన్ని, హిందూమతాన్ని అర్థంచేసుకోవలెనని ఆసక్తి వహించిన వ్యక్తులు, వర్గాలు, ముస్లిములలో కూడా ఉండినారు. వారి హృదయాలు మానవత్వంతో, దయాదాక్షిణ్య భావాలతో నిండిఉండినవి. పవిత్రజీవనము, మానవప్రేమ, నిస్స్వార్థమైన మానవసేవ, పారలౌకిక చింతన,-ఇత్యాదులద్వారా ప్రజలను ఆకర్షించి, వారిని తమ మతంలోనికి ఆహ్వానించడం, వీరి అభికాంక్ష. జన్మనుబట్టి, సంపదనుబట్టి, ఏర్పడిన విభేదాలకు సంబంధించిన దురభిప్రాయాలు లేనట్టి ఈ వ్యక్తులు, దరిద్ర ప్రజలను, దుస్థితిలో ఉన్న వారిని ఎక్కువ సానుభూతితో చూచేవారు. కాబట్టి, అన్ని వ్యవస్థలకూ చెందిన భిన్నప్రజలను వీరు ఆకర్షింపగలిగిరి. వీరిలో, ఛిస్టియా సంస్థకు చెందిన సూఫీలు అత్యంతప్రాముఖ్యం వహించిరి. ఇండియాలో ఛిస్టియా సంస్థను స్థాపించిన ముయిన్-ఉద్-దీన్ ఛిస్టీ, పృథ్వీరాజ్ చౌహాన్, పరిపాలన కాలంలో ఇండియాకు వచ్చి, అజమీర్‌లో స్థిరనివాసం ఏర్పరచుకొన్నాడు. ఉత్తరభారతదేశం టర్కుల పరిపాలనకులోనై ఢిల్లీ నగరం రాజధానిగా ఏర్పడటంతో, ఛిస్టియా సంస్థయొక్క కేంద్రం, ఢిల్లీకి మారింది. ఈ సంస్థలో శిక్షణపొందిన వారిలో, విశిష్టవ్యక్తులుగా, కొందరు, ప్రసిద్ధిచెందిరి. కుతుబ్-ఉద్-దీన్ భక్తియార్‌కాకీ, నిజామ్-ఉద్-దీన్ ఆలియా, బాబాఫరీద్‌షకర్‌గంజ్, షేక్ సలీంఛిస్టీ-అనేవారు, ఈ విషయంలో ఉదాహరణలు.

హిందూయోగులతో మత సంబంధమైన చర్చలు జరిపి హిందువుల దృక్పథాన్ని-అభిప్రాయాన్ని గ్రహించి, మెచ్చుకొన్నారు. ఈ విధమైన సంపర్కంవల్ల, హిందూయోగ లక్షణాలు అనేకములు, ఇస్లాముమత శిక్షణలో [ధిక్‌ర్] భాగంగా చేరిపోయినవి. విగ్రహారాధనచేస్తున్న, కొందరు హిందువులను చూచిన నిజామ్-ఉద్-దీన్, ఈ విషయమై తమ సంస్థ వహించిన భావాన్ని ఈ విధంగా వ్యక్తంచేసినాడు ;-"ప్రతి జాతికీ ప్రత్యేకమైన మార్గము, ప్రత్యేకమైన మతము, ప్రత్యేకమైన మెక్కా ఉన్నవి." తన శిష్యుడైన నజీర్-

ఉద్-దీన్ చిరాఘీ-ఇ-ఢిల్లీకీ-ఈ విధంగా ఉపదేశించినాడు;-"ప్రజలలో ఒక్కడుగా జీవిస్తూ, వారుపెట్టే బాధలను, కొట్టేదెబ్బలను సహిస్తూ, వాటికి ప్రతిక్రియగా నమ్రతను, ఔదార్యాన్ని, దయను, ప్రదర్శించుము". "ఇతర మతాలవారిని ఇస్లాములో చేర్చుకోవడం, ఛిస్టీసిల్‌సిల్లా యొక్క వైపనియమిత కర్తవ్యంకాదు." అని ప్రొఫెసర్‌హబీబ్ వివరించి ఉన్నాడు.

పద్దెనిమిదోశతాబ్దంలో, అఖండ పాండిత్యంగల మతధర్మశాస్త్రజ్ఞులలో ఒకడుగా ప్రఖ్యాతిచెందిన, షావాలీఉల్లా, "సర్వజనుల మతమూ ఒక్కటే; విభేదాలు కేవలం, న్యాయ సూత్రాలకు, వినియమాలకు మాత్రమే సంబంధించినవి." అని తన అభిప్రాయాన్ని వ్యక్తం చేసినాడు.

కదిరియాసంస్థ, ఇట్టి మరొకవర్గం. పన్నెండో శతాబ్దంలో బాగ్దాద్ నివాసియై ఉండిన అబ్దుల్‌కాదర్-అల్-జిలానీ; ఈ వర్గాన్ని స్థాపించినవాడు. ఈ సంస్థపాటించిన మత విశ్వాసాలు, సంస్కారాలు, పద్ధతులు, ఇతర సంస్థల వాటికి విభిన్నములైనవి. కొందరు అనుయాయులు ఇతనిని భగవంతుడని భావించినారు. ఇండియాలోని ఈ సంస్థ, పదహారో శతాబ్దంలో స్థాపితమయింది. రాజకుమారుడైన దారాషుకోను శిష్యుడుగా గ్రహించిన, మియాన్‌మీర్ [మిరాన్ జీ], ఈ సంస్థలో మిక్కిలి ప్రఖ్యాతుడైన అధ్యాపకుడు.

సువ్యవస్థితములైన ఈ సంస్థలు మాత్రమేకాక, ఎట్టి సంస్థలకూ బద్ధులు కాని స్వతంత్రవ్యక్తులు అనేకులు, ఇతర మతాలపట్ల సహనభావాన్ని, స్నేహాన్ని కూడా ప్రదర్శించినవారు, ఉండిరి. షేక్ నూర్-ఉద్-దీన్ రిషి, అబుల్ ఫజల్, ఫైజీ, ముహీబుల్లా అలహాబాదీ, మజహర్ జాన్‌జనాన్, ఇంకా ఇతరులు అట్టి వారిలో ప్రముఖులు.

ముస్లిముల పరిపాలన కాలంలో భక్తిమార్గ, ప్రీతిమార్గాలను ప్రతిపాదించే మతాలు ఉత్పన్నంకావడంవల్ల, సంస్కరణలకు లోనైన, పెక్కుమతశాఖలు, దేశంలో ఏర్పడినవి. ఇంతవరకూ, సమాజంలో అణగిఉండిన మూల శక్తులు, ఒక్కసారిగా బహిర్గతమైనట్లు కనబడుతుంది. మానవుల ఉత్కాంక్షలకు ఉత్తేజనం కలగడంతో. వారి మనస్సులకు ఉత్కర్షసిద్ధించింది. ఈ ఆవేగంయొక్క ఉత్తేజనం, మొదట, రహస్యోపాసకమైన మతాన్ని పూర్తిగా ఆవరించి, తరువాతికాలంలో, రాజకీయ మార్గాల్లోనికి ప్రవహించింది. కాని, ఈ ఉద్యమంలోని నైతిక మత భాగాలు పద్దెనిమిదో శతాబ్దంలో క్షీణించినవి. ఆధ్యాత్మిక జీవితానికి కేవలం భాషణమాత్రమైన సేవచేస్తున్నప్పటికీ, ప్రాపంచిక వైభవాన్ని సాధించడానికి మాత్రమే, ఈ శక్తి సమగ్రంగా వినియుక్తమయింది. దివ్యమైన పవిత్రప్రేమకూ, కాముకమైన ప్రాపంచిక ప్రణయానికీగల భేదం పూర్తిగా నశించిపోవడం, అత్యాశ్చర్యకరమైన ఆకాలపు సంఘటన. యోగాభ్యాసాలూ, ఇంద్రియ భోగాలూ, రెండూ సమంగా ప్రవృత్తిలో ఉండినవి. అత్యుదాత్తమైన తత్త్వశాస్త్రంలో దృఢవిశ్వాసమూ, అసహ్యకరమైన అంధ విశ్వాసమూ, రెండూ వ్యాప్తిలో ఉండినవి.

ఒక అపూర్వమైన గాఢాసక్తితో కూడిన మహోత్కర్షస్థితి, రెండు శతాబ్దాలకాలం, ప్రజలకు భావ పరవశం కలిగించింది. మొగలు సామ్రాజ్యం సాధించిన అద్భుతకార్యాలన్నిటికీ, ఇదే ముఖ్యహేతువు. క్రమంగా ఈ ఉత్తేజనం బలహీన మౌతూ వచ్చింది. సామాజిక జీవన విషయంలో, నూతన భావాల ఉత్పాదనకుగాని, సామాజిక వ్యవస్థకు నూతన ఆకారాన్ని కల్పించడానికిగాని, సమర్థంకాలేదు.

యూరోపులోని సంస్కరణోద్యమం, రాజ్యాధిపత్యము, ప్రజాస్వామ్య ప్రభుత్వము, అనే భావాలను ఉత్పన్నం కావించింది. ఇండియాలోని భక్తి ఉద్యమం, రాజకీయంగా నిష్ఫలమైనట్టిది. ఉత్తమ జీవన సాధనకు కావలసిన ప్రేరణ, వ్యక్తిలో కలిగించింది. కాని, సమగ్రమైన సమాజం, జడ ప్రాయంగా నిలిచిపోయింది. కేంద్రీకరణ శక్తిగా ఉండిన మొగలు సామ్రాజ్యం, దుర్బలమైపోవడంతో, సమాజం భిన్నాభిన్నంగా చెదరిపోయింది. అట్టి సందర్భంలో, అంతరకలహాలతో చీలికలై, అస్తవ్యస్తమై కలవరానికిలోనై ఉండిన ప్రజా సమూహం, పాశ్చాత్యుల ప్రతి ఘటనను ఎదుర్కొనవలసివచ్చింది.

మధ్యయుగాల కాలంలోని ప్రజలు, సాంఘిక వ్యవస్థ విషయంలో ఏమాత్రమూ పురోగమించలేదు. ప్రధానమైన ఏ సాంఘిక విషయంలో కూడా, సమాజ జీవిత వ్యవస్థ అభివృద్ధి చెందలేదు. మత విషయంలో, చిన్నశాఖలు, ధార్మిక సంస్థలు, మాత్రమే వర్గాలుగా ఏర్పడినవి. ఏకమతస్థులైన వారందరికీ, ఐక్యభావాన్ని కలిగించడానికి సమర్థమైన చైతన్యాభివృద్ధి ప్రయత్నం హిందువులూ చేయలేదు, ముస్లిములూ చేయలేదు. దేశానికి మొత్తంగా కాకపోయినా, ప్రాంతీయంగా కూడా ఈ ప్రయత్నం, జరగలేదు. ఈ విషయంలో నిమ్నమతస్థులు మాత్రమే భిన్నమార్గంలో నడిచినవారు. సామాజిక సమక్షేత్రంలో సహభాగిత్వానికి అవధులను ఏర్పరచేవి, వంశము, ఉపకులము, అనేవి మాత్రమే. మొగలులు-పఠానులు, టురానీలు-ఇరానీలు, వేర్వేరు వర్గాలుగా జీవిస్తూవచ్చిరి. పరస్పర సహకారానికై బుద్ధిపూర్వకమైన ప్రయత్నమే చేయలేదు. హిందువుల పరిస్థితి కూడా ఇట్టిదే; వాస్తవంగా ఇంతకంటె అధమమైనది. రెండుమతవర్గాలవారికీ, గ్రామం ఆర్థికంగా స్వయంపోషక సమర్థమైన ఏకాంశంగా ఏర్పడిఉండినది. గ్రామానికి బాహ్యమైయున్న విశాలసమాజంతో, దీనికి గల సంబంధాలు అతి దుర్బలములైనట్టివి.

గ్రామానికి సంబంధించిన రాజకీయ ప్రయోజనాలు అత్యంతమూ సంకుచితములు. తమకు అతిదూరంలో ఉన్న ప్రభుత్వం, తమకు విజాతీయమైనదని, నిస్సందేహంగా క్రూరమైనదని, తప్పించుకోడానికి వీలులేనట్టిదని, వారు అభిప్రాయపడిఉండిరి. దాన్ని అనుభవించక తప్పదు. అంతేకాని, దానితో తమకు ఏమాత్రమైన ఏకీభావమూలేదు. ప్రభుత్వాధికారం, రెండు వైపులా పదునుగల కత్తివంటిది; తమకు సుఖాన్నీ, దుఃఖాన్నీ కూడా కలిగింపగలది. ప్రభుత్వముయొక్క బలహీనత, తమకు నదవకాశం. ప్రభుత్వంఅనేది, వారు అర్థంచేసుకోలేని అమూర్తవిషయం [Abstraction]. రాజు, న్యాయపరుడు, ఉదారుడు, సహానుభూతి కలవాడు అను పక్షంలో, అతని వ్యక్తిపట్ల ప్రజలు, కృతజ్ఞతను ప్రదర్శించేవారు. రాజు, అట్టివాడుకానిపట్ల, తమ పాపఫలాన్ని అనుభవిస్తూన్నామని, ఓర్పుతో, సహించేవారు.

రాజకీయంగా చాలావరకు, స్వయంపరిపాలక సమర్థములైన ఏకాంశ రాజ్యాలతో, ముద్దగా ఏర్పడినట్టివి, ఇండియా సామ్రాజ్యాలు. ప్రజలతో సామ్రాజ్య ప్రభుత్వానికిగల ప్రత్యక్ష సంబంధాలు అతిసూక్ష్మములైనట్టివి. సామ్రాజ్య కర్తవ్యాలు, కార్యకలాపాలు, తీవ్రమైన నిర్బంధాల పరిమితులకు లోనైఉండడం, ఇందుకు హేతువు. సత్త్వసంపన్నుడైన పరిపాలకుడు రాజ్యవ్యవహారాలను స్వయంగా నడుపుచున్నంతకాలమూ, ప్రజానీకానికి ఐక్యభావం కూర్చగలిగేవాడు; దేశంలో రక్షణ భద్రతలతో కూడిన పరిస్థితులను నెలకొల్పగలిగేవాడు. అట్టి సదవకాశాన్ని ప్రయోజనకరంగా ఉపయోగించుకొని, ప్రజలు, ఉజ్జ్వలోపేతమైన

నాగరకత, అనే, సౌధాన్ని, నిర్మించేవారు. కాని రాజ్య పరిపాలనను సక్రమంగా నిర్వహించగల, మహావ్యక్తి లేనప్పుడు, రాజ్యమూ నాగరకతాకూడా, శీఘ్ర వినాశానికి గురి ఐనవి.

## VI. పరిపాలకవర్గంవారి న్యూనత

మొగల్ సామ్రాజ్య క్షీణ పతనానికి సూచకమైనది, పద్దెనిమిదో శతాబ్దం. సామ్రాజ్యాధిపత్యాన్ని వహించడానికి అనేకులు పోటీపడినారు. ముస్లిం ప్రాంతీయ గవర్నర్లు, ఇట్టి వారిలో మొదటివర్గం. దక్కనులో ఆరు సుభాలను పాలిస్తున్న నైజామూ, బెంగాలు, బీహార్, ఒరిస్సా ప్రాంతాలపై అధికారం వహించి ఉండిన బెంగాల్ నవాబూ, నదీ మధ్య ప్రాంతంలోకి క్రింది భాగంపైనా, గంగానదికి ఉత్తరభాగంలోని పర్వతసీమపైన వ్యాపించిన భూభాగాలకు అధిపతిఐన ఔధ్ నావాబూ, పోటీపడిన వారిలో ముఖ్యులు.

రజపుత్ర రాజులు, జాటు నాయకులు, మరాఠాపీష్వాలు, వీరి తరువాతివారు. కడపట సిక్కులకూడా పోటీచేసినారు, కాని, ఢిల్లీలో నెలకొని అఖిల భారతదేశాన్ని పరిపాలించే ఉత్కాంక్ష వీరికి ఉండినదా, అనే విషయం, సందేహాస్పదమైనది. కాని, కార్యతః జరిగిన విషయం, ఎవ్వరూ ఊహించనిది. వీరేకాక, పరిపాలక వంశాలను ఇండియాకు సరఫరా చేసిన పరిసర దేశాల రాజులుకూడా, దీనికి ప్రయత్నించిరి. మొగలు సింహాసనాన్ని అధిష్ఠించడానికి, నాదిర్‌షా, అహమద్‌షా అబ్దాలీలుకూడా పద్దెనిమిదో శతాబ్దంలో ఆశించినారు. కాని ఇండియా దేశాన్ని వేరుపరచే విశాల సముద్రాలకు అవతల, వేలమైళ్ల దూరంలో నివసించే ఒక పరదేశజాతి, ఇండియాలో ప్రత్యక్షమై, సామ్రాజ్య పీఠానికి ఆశిస్తున్న వారితో పోటీచేసి, గెలిచి, మొగలుల సామ్రాజ్యానికి ఉత్తరాధికారులుగా స్థిరపడిరి.

మొగలు సామ్రాజ్యము యొక్క భద్రత ఎందుకు భగ్నమయింది? ఇండియాలోని రాజులు ఎందుకు సామ్రాజ్యానికి ఉత్తరాధికారులు కాలేదు? భూమార్గ సంబంధంకల పరిసర దేశాలరాజులు, తమ పూర్వులవలె ఎందుకు భారతదేశాన్ని ఆక్రమించలేదు? అనే ప్రశ్నలకు సరియైన సమాధానాలు చెప్పకపోతే, బ్రిటిషు వారికి ఎందుకు విజయం లభించింది, ఏవిధంగా లభించింది, అనే విషయాన్ని అర్థంచేసుకోలేము.

సామ్రాజ్యాల ఉత్పత్తి పతనాలు పరిపాలక అంశాల సామర్థ్యానికి ప్రత్యక్షంగా సంబంధించిఉన్నవి, అని చెప్పడం, నిర్వివాదమైన సత్యం. ఈ అంశాలు శీలవంతములై ఉన్నంతవరకూ, ప్రభుత్వవ్యవస్థ, ఆరోగ్యంగా, సత్త్వోపేతంగా ఉంటుంది; కాని, శీల సత్త్వం క్షీణించడంతోనే, దౌర్బల్యము, రోగము, వినాశము, క్రమంగా జరిగే సంఘటనలు. కౌశల్యమే రాజ్యతంత్రజ్ఞత. "ప్రాప్తించిన కష్టాలను ఎదుర్కొని, జయించగల సామర్థ్యమే, రాజ్యతంత్రజ్ఞత యొక్క సారాంశం. తనయుగానికీ, దేశానికీ సంబంధించిన శక్తులను చక్కగా సంధానం కావించుకొని, తన రాజనీతి ఫలించేటట్లు వాటిని, కౌశలంతో ఉపయోగించుకోవడమే రాజ్యతంత్రజ్ఞత." రాజత్వంకానీ. అల్పజన పరిపాలనకానీ, లేదా, ప్రజాపరిపాలనకానీ అనేకముఖాలుగా తమవైపు లాగుతున్న సూక్ష్మ రాజకీయశక్తుల సంతులనంపై అనిశ్చిత స్థితిలో నిలిచి ఉంటుంది. ఈ విషయం, ప్రతి ప్రభుత్వానికీ మూలాధారమైన విషయం. ప్రజాస్వామ్య రాజ్యాలలో, ప్రభుత్వముయొక్క ఆధారమూలం విశాలమైనది.

కాబట్టి, ప్రభుత్వముయొక్క నిశ్చిత స్థితికి భంగం కలుగకుండా రక్షించే ఆధార పరిమితులు తగినంత విశాలమైనవి. ప్రజాస్వామ్య పరిపాలన రాజ్యం అత్యంతమూ సంకీర్ణమైన రాజకీయ వ్యవస్థ. దీనిని సంయోజన పరిచే అంగాంశాలు (Tissues) రాజకీయ నికాయములో అంతా నాటుకొని ఉన్నవి. ఒత్తిడికీ ప్రయాసకూ సంబంధించిన ఆఘాతాన్ని, ఈ అంశాలు విస్తృతమైన క్షేత్రానికి విభాగించి, ప్రభుత్వ స్థైర్యానికి భంగం కలుగకుండా చేస్తాయి. రాజకీయ వ్యత్యయాలను శాంతియుతంగా జయించే సాధనాలను, ప్రజాస్వామ్య పరిపాలన విధానం కనిపెట్టింది. కాబట్టే, ప్రభుత్వం మారిన సందర్భాలలో, హింసాకాండ, రక్తపాతము, విలయనభీతి, మొదలైనవి జరగడంలేదు.

మధ్యయుగాల ఇండియాలోని రాజతంత్ర రాజ్యాలలో ఈ విధమైన స్థిరీకరణ సాధనాలూ, ఆఘాతాలను లీనము కావించుకొనే సాధనాలూ లేవు. అత్యల్పమైన ప్రజల అలంబనముపై మాత్రమే ఆ రాజ్యాలు ఆధారపడి ఉండినవి. తత్ఫలితంగా, వారి పరిపాలన కాలం అస్థిరమై, రక్షణలేనిదై ఉండినవి. అత్యంతమైన విపత్తులలోనై ఉండిన పరిస్థితి అది. పరిపాలకుల అత్యుదాత్తమైన సౌశీల్యంవల్ల మాత్రమే, రాజ్యము నిలకడగా ఉండగలిగేది. అట్టి సౌశీల్యంతోకూడిన ప్రభుత్వం ఏర్పడడం సులభసాధ్యమైనదికాదు. రాజ్యపాలనకు సౌశీల్యం ఆనువంశీయతవల్ల సిద్ధిస్తుంది అనే, మధ్యయుగాలవారి అభిప్రాయం, విశ్వసనీయమైనది కాదని, పదే పదే రుజువయింది. ఐనప్పటికీ రాజ్యపాలనకు అర్హమైన వ్యక్తిని, దేశంలోని వారిలోనుంచి ఎన్నుకోవానికి తగిన శాంతియుతమైన పద్ధతి లభ్యం కాలేదు.

సౌశీల్యం ఆనువంశీయమైనది అనే అభిప్రాయం, ప్రజల మనస్సులలో, గాఢంగా పాతుకొనిపోయింది. కాబట్టి, రాజైనవానికి అర్హమైన ప్రాచీన వంశవృక్షాన్ని అన్వేషించడానికై, పురాణాలను, కాల్పనిక కథలను ఆధారంగా చేసుకోవలసివచ్చింది. ఛెంగిజ్ ఖాన్, తైమూర్, అనే ఇద్దరు ప్రపంచ విజేతల వంశమువారమని, మొగల్ చక్రవర్తులు గర్వించేవారు. సూర్యవంశీయులైన, సిసోదియాలతో, శివాజీకి వంశవృక్షం, కల్పింపబడింది. యదువంశీయుడైన శ్రీకృష్ణుని వంశము వారమని జాటులు ప్రకటించుకొనిరి. బహమన్‌నుంచి, ఇస్ఫందియార్‌వరకూ గల మహాపారసీక వంశంతో సంబంధం కలవారు, బహమనీ సుల్తానులు. ఈ సిద్ధాంతాలన్నీ, నిరాధారములైనవని, నిరూపించే చారిత్రక సాక్ష్యం ఎంత ఉన్నప్పటికీ, వీరి అభిప్రాయాలు మారలేదు.

రాజ్యాధికారం హస్తాంతరం పొందడం తప్పనివాదం, తార్కికంగా నిష్కర్షమై ఉన్నప్పటికీ, ఉత్తరాధికారులను ఎన్నుకొనేపద్ధతి, ఆనువంశీయ ప్రభావానికి లోనయింది. ఉత్తరాధికారవిషయంలో రాజకుమారుల మధ్యగల ఈర్ష్యా భావాలలో ఈ వాదం వ్యక్తమయింది. ఈర్ష్యాకారణంగా, పదేపదే, ఉత్తరాధికారసంబంధమైన యుద్ధాలుసిద్ధించి, రాజ్యము యొక్క మూలాధారాలను కదలించివేసినవి. తుదకు, సామ్రాజ్యమే విచ్ఛిన్నమైపోయింది.

రాజ్యపరిపాలన విషయంలో, రాజైనవానికిగల దక్షతే, అతని సౌశీల్యము. ప్రభుత్వము యొక్క భవిష్యత్తును నిర్ణయించేది ఇదే. రాజకీయాలలో పాల్గొనే ప్రజావర్గాలు రాజుకు ఇచ్చే అలంబన స్వభావము, దీని తర్వాత ప్రధానమైన విషయాలు. మొఘల్ ప్రభుత్వం, ఉన్నత

కుల వర్గాల ప్రభుత్వం అని, ఇదివరలో వివరింపబడింది. యుద్ధవ్యాపారము కులవృత్తిగాగల వారూ, విద్య కులవృత్తిగా గలవారూ మాత్రమే, ఈ ఉన్నత వర్గాలుగా ఏర్పడిఉండిరి. ఐనప్పటికీ, ఈ రెండు వర్గాల సంయోగంతో, ప్రభుత్వసౌధానికి పరిమితమైన ఆధారం ఏర్పడింది. ఆకాలపు వీరి సంఖ్యాబలాన్ని నిశ్చయించడం సాధ్యంకాదు. ఈనాడు, ఈ వర్గాలవారి సంఖ్య, జనాభాలో, పదోభాగమైఉన్నది. కాని, ఈ శాతం కూడా విశ్వసనీయమైనదికాదు. ప్రభుత్వంతో ఏ మాత్రమూ సంబంధములేని, అధిక సంఖ్యాకులు, ఈ వర్గాలలో ఉండడంవల్ల, ఈ శాత పరిగణన సరియైనదికాదు. పద్దెనిమిదో శతాబ్దంలో జాగీరు భూములు అనుభవిస్తూ, ప్రభుత్వానికి సేవచేయవలసిన వారి సంఖ్యలు లభించడంలేదు. కాని, ఎస్. ఆర్. శర్మ చేసిన పరిగణనసుబట్టి, ఔరంగజేబు పరిపాలనకాలంలో, [1690]లో 11556 మంది మన్సబ్‌దారులు ఉండినట్లు తెలుస్తుంది. పరిపాలన సేవాశాఖలలోని ఉన్నత వర్గం, వీరితో ఏర్పడింది. వీరుకాక, మన్సబ్‌దారుల పట్టీలో చేరని అనేకులు, సైన్యేతరములైన అధీన ఉద్యోగాలలో [కాజీలు మొదలైన వారు] పనిచేసేవారు. వీరందరూ, జాగీరు భూములనో, ఇనాము భూములనో అనుభవిస్తూ, ప్రభుత్వానికి కట్టుబడినవారే. వీరేకాక, అనువంశీయంగా వచ్చిన పెక్కురు హిందూ జమీందార్లు కూడా ఉండిరి. ప్రభుత్వంతో సన్నిహిత సంబంధంలేనివారు వీరు. ఈ వాస్తవ విషయాలనుబట్టి, మొగలు సార్వభౌములకు విస్తృతమైన అవలంబనబలం ఏర్పడియుండలేదని, వీరికి ఆశ్రితులై ఉన్నవారిది చిన్న వర్గము మాత్రమే అని నిర్ణయమౌతుంది. రష్యాదేశపు జార్ చక్రవర్తుల అధీనంలో (Czars) కూడా, ఇంతకంటె విస్తృతమైన ఆశ్రితవర్గం ఉండిందని తెలుస్తుంది. స్టాలిన్ (Stalin), చెప్పిన దానినిబట్టి, ఒకలక్ష ముప్పైవేలమంది సంపన్న భూస్వాములు జార్ చక్రవర్తులకు ఆలంబనంగా ఉండిరి. ఢిల్లీలోని జనాభాలో, ప్రతి పదిమందిలోనూ, ఇద్దరు ముగ్గురు మాత్రమే ఉత్తమ వర్గవ్యక్తులని, తక్కినవారు సామాన్యప్రజలని, బెర్నియర్‌చేసిన లెక్కలనుబట్టి తెలుస్తుంది. అదేకాలంలో, పారిస్ నగరంలోని జనాభాలో, ప్రతి పదిమంది లోనూ ఉత్తమ వర్గాల ప్రజలు, ఏడు లేక, ఎనిమిదిమంది; సామాన్య ప్రజానీకం, 2, లేక, 3 శాతం మాత్రమే.

రాజ్య నిర్మాణముయొక్క స్వభావమేకాక, దాని నిర్వహణ విధానం కూడా, ప్రభుత్వ కాలావధిని నిర్ణయిస్తుంది. సక్రమమైన రాజనీతి విధానాలు ప్రభుత్వానికి బలం చేకూరుస్తాయి; తద్విపరీత విధానంవల్ల ప్రభుత్వం బలహీనమౌతుంది.

మొగలులలో, అసాధారణ సామర్థ్యంగల వ్యక్తులు వరుసగా పెక్కు తరాలు రాజ్యాధికారాన్ని నిర్వహించినారు. సైనిక, రాజ్యనీతిజ్ఞ, సాహిత్య సంస్కారుల లక్షణాలు, అసాధారణమైన విధంగా, సామ్రాజ్య స్థాపకుడైన బాబరులో సంయోగం పొందిఉండినవి. హుమాయూన్, బాబర్ కంటె విలక్షణమైనవాడు; కాని, ఇతడు, బుద్ధిశాలి, సమర్థుడు, అనురాగ ప్రవృత్తిగలవాడు. అత్యుత్తమస్థాయికి చెందిన ప్రతిభాశాలి అక్బర్; మేధాసంపన్నుడైన వ్యవస్థాపకుడు, దూరదృష్టిగల రాజనీతిజ్ఞుడు, నైపుణ్యంగల సేనాధిపతి, జంకులేని శ్రద్ధాళువైన సత్యాన్వేషకుడు. స్వస్థమైన సుఖజీవనానికి అలవాటుపడినవాడే ఐనా, జహంగీరు, తనతండ్రి నిర్మించిన వ్యవస్థను నిరంతరాయంగా నిర్వహించడానికి తగిన శక్తి సామర్థ్యాలు

కలవాడే. షాజహాన్ చంచల స్వభావుడు, స్థైర్యం లేనివాడు; కాని, వ్యక్తులయోగ్యతను గుర్తించగల సమర్థుడు. దక్షులైన వారిని పదవులకు ఎన్నుకొని, రాజ్యపరిపాలన విషయంలో మితపద్ధతిని అనుసరించినాడు. సుగుణాల విషయంలోను, దుర్గుణాల విషయంలోను కూడా, ఔరంగజేబు అపూర్వమైన వ్యక్తి. వైయక్తికశీల విషయంలో నిష్ఠాజీవితానికి అంకితమైన వాడు. మద్యపానము, స్త్రీలోలుపత, భోగజీవితము అనే వాటికి దూరంగా నిలిచిన చక్రవర్తి ఇతనొక్కడే. మితాహారంతో జీవనాన్ని గడపినాడు. మతకర్తవ్యాలను, సక్రమంగా, శ్రద్ధతో సకాలాల్లో, అనుష్ఠించేవాడు. ప్రభుత్వకార్య విషయంలో, ఔరంగజేబు, తన ధర్మాలను అసాధారణమైన శ్రద్ధతో నిర్వహించేవాడు. అతినిశితమూ, జాగరూకమూ ఐనది ఇతని బుద్ధి. రాజ్యానికి సంబంధించిన సమస్త వ్యవహారాలపైనా, తీక్ష్ణమైన తన దృష్టిని నిలిపి ఉంచేవాడు. కదలించడానికి వీలులేనివి అతని సంకల్పాలు; ప్రతి బంధకాలవల్ల ఇతని సంకల్పం, మరింత దృఢపడేది.

కాని, ఔరంగజేబు అనుసరించిన రాజనీతి విధానాలు సరియైనవికావు. బాబర్, అక్బర్, షాజహాన్‌లు నిర్మించిన మహాసామ్రాజ్య సౌధాన్ని, దుష్ట విధానాలతో నశింపచేసినవాడు, ఔరంగజేబు, అని నిరూపించినాడు. అతడుచేసిన గొప్ప తప్పులు రెండు.

1. ప్రభుత్వముయొక్క నిలుకడకు ఆధారాలైన రాజ్యాంగాలపట్ల తగిన శ్రద్ధవహించ లేదు. ప్రభుత్వ విత్తవిషయాన్ని, నిర్లక్ష్యంచేయడంవల్ల, ఆదాయమూ వ్యయమూ కూడా దెబ్బతిన్నవి. అప్పుచేసి, సైనికులకు వేతనాలను ఇవ్వవలసి వచ్చింది. ప్రభుత్వకోశం సన్నగిల్లడంవల్ల, పరిపాలన వ్యవస్థకు శాశ్వతమైన హానిసిద్ధించింది.

2. సామ్రాజ్యానికి ఆలంబంగా నిలిచిఉండిన, ఉన్నతవర్గ హిందువుల మనస్సులకు నొప్పికలిగించినాడు.

ఆదాయానికి ముఖ్యమైన మూలాధారం, వ్యవసాయభూమి. అది రెండు ఖండాలుగా విభక్తమయింది. ఒక భాగం ప్రభుత్వముయొక్క ప్రత్యక్ష పరిపాలనకు లోబడినది. దీనిని ఖాల్సాభూమి అని వ్యవహరించేవారు. ఖాల్సాభూముల రాజస్వాన్ని ప్రభుత్వాధికారులు వసూలుచేసేవారు. దీనిని ప్రధానంగా చక్రవర్తి ఖర్చులకూ, ఆస్థానపు ఖర్చులకూ వెచ్చించే వారు. రెండవభాగమైన జాగీరు భూములనుంచి వచ్చే రాజస్వం, మన్‌సబ్‌దారుల వేతనాలకూ, భత్యపుకర్చులకూ, వెచ్చింపబడేది. ప్రభుత్వకోశము నుంచి ద్రవ్యరూపంలో ఇవ్వవలసిన వేతనాలకు బదులుగా, జాగీరు భూముల రాజస్వం, అధికారులకు వినియుక్తం కావింపబడింది

తన పరిపాలన కాలపు పందొమ్మిదో సంవత్సరంలో, అక్బర్ అన్ని భూములనూ ఖాల్సాభూములుగా, మార్చిఉండినాడు. సామ్రాజ్యంలోని అన్ని భూములనూ ప్రభుత్వము యొక్క ప్రత్యక్ష పరిపాలన కిందికి తీసుకొని, రాజస్వశాఖవారు వసూలుచేసిన సంఘటిత నిధినుంచి, మన్‌సబ్‌దారుల వేతనాలతో సహా, సమస్త ప్రభుత్వవ్యయాన్నీ భరించడం, అతని ఉద్దేశమై ఉండినట్లుతోస్తుంది. ఈ నవీన ప్రక్రియను విడువకుండా పాటించి ఉండి నట్లైతే, ఇండియాదేశ చరిత్ర సమస్తమూ మరొక విధంగా జరిగి ఉండేది. దురదృష్టంవల్ల సంప్రదాయానికీ, సందర్భానుకూలమైన అవసరాలకూ ప్రాధాన్యం కలిగి, అక్బర్ పరిపాలన

ముగిసే నాటికి ఖాల్సాభూములు, మొత్తం వ్యవసాయ భూమిలో నాలుగో వంతుగా మాత్రమే, నిలిచినాయి.

మితిమీరి ఖర్చుపెట్టడంలో, ఏ మాత్రమూ జాగరూకతలేనివాడు జహంగీర్. మొత్తం వ్యవసాయభూమిలో ఇరవైయో వంతుకు ఖాల్సాభూమిని తగ్గించి వేసినాడు. వీటిని మళ్లీ ఉద్ధరించుకోడానికి, షాజహాన్ పూనుకొని, క్రమంగా, ఖాల్సాభూభాగాన్ని ఏడోవంతుకు వృద్ధిపరచినాడు. ఔరంగజేబుకు సంక్రమించిన ఉత్తరాధికారం, దుష్టమైనట్టిది. కాని, ఖాల్సా భూమిని మొత్తంలో ఐదోవంతుకు వృద్ధిచేయడంలో, కృతార్థుడైనాడు. ఎనభై కోట్లకు మించిన మొత్తం సామ్రాజ్య ఆదాయంలో, ఖాల్సాభూముల నుంచి నాలుగుకోట్ల రాజస్వం రావలెనని, అతని, గురి. కార్యరూపంగా 3.33 కోట్లు వసూలు చేసుకొన్నాడు.

ఇది అంత బాధాకరమైనదిగా తోచలేదు. కాని, అతడు ప్రవేశపెట్టిన ఇతర చర్యలు పూర్తిగా అర్థరహితములైనట్టివి. మొత్తం ఉత్పత్తిలో మూడో భాగంగా నియమించబడి ఉంటిన భూమిపై పన్నుల బేరీజును, మొత్తంలో అర్ధభాగానికి పెంచి, రైతులపై ఉన్న భారాన్ని ఇంకనూ ఎక్కువగా చేసినాడు. జిజియా పన్నును విధించి బీదల కష్టాలను ఎక్కువచేయడం, ఇతడు ప్రవేశపెట్టిన రెండవచర్య. ఇట్లు విధింపబడిన సుంకాలభారంవల్ల, జీవనానికి చాలీ చాలనంత పంటభాగం మాత్రమే రైతుకు మిగిలింది. కాబట్టి, వ్యవసాయాన్ని బాగుపరచడానికి, లేక, ఎక్కువ పొలాన్ని సాగుచేయడానికి అవసరమైన డబ్బు రైతుకు మిగలలేదు.

జాగీరు భూముల విషయంలో, పన్నులు చాల తక్కువగా నియమించి ఉండడంవల్ల, జాగీర్లవల్లవచ్చే ఆదాయం స్వల్పం. కాబట్టి, జాగీరువార్లు వాటిని రాజస్వ వ్యవసాయదారులకు అప్పగించవలసిన పరిస్థితి ఏర్పడింది. రాజస్వాన్ని వసూలుచేయడానికై, ఈ దుష్టపద్ధతిని అవలంబించడంవల్ల, గ్రామాలూ, ప్రభుత్వమూ కూడా, దుష్టపరిణామాలకు గురి ఐనవి. రాజస్వాన్ని వసూలు చేసేవారు పెట్టే బాధలకు, దౌర్జన్యాలకు ప్రజలు గురి ఐనారు. ప్రభుత్వానికి చెందవలసిన రాజస్వం మధ్యలోనే దుర్వినియోగమై పోయింది.

రాజస్వాన్ని వసూలుచేసే హిందూ అధికారులను తొలగించి, ఆస్థానాల్లో ముస్లిములను నియమించడం, ఔరంగజేబుచేసిన మరొక అవివేకం. రాజస్వ వ్యవహారాలకు సంబంధించిన జ్ఞానము, అనుభవము వీరికిచాలదు. వారికి అధికంగా ఉన్న మతాభినివేశం, ఈ కొరతను తీర్చలేకపోయింది. అంతతో, ఈ విధానం రద్దయినది. కాని, ప్రభుత్వము అన్యాయంగా ప్రవర్తించింది అనే దుష్కీర్తి మాత్రంపోలేదు. అంతేకాక, ఇంతకు ముందు, రాజస్వోద్యోగాల నుంచి తొలగించబడిన హిందువులలో సగం మందిని మాత్రమే, పునః ఉద్యోగాలకు తీసుకోవడంవల్ల, హిందువులలో కలిగిన భయోత్పాతం సమసిపోలేదు.

ఈ పద్ధతులవల్ల, రాజస్వరూపంగా ప్రభుత్వానికి రావలసిన విత్తం దెబ్బతిన్నది. ఇక, పరమతాలపట్ల అసహన భావంగల దక్కనులోని షియాలూ, మహారాష్ట్రులూ, ప్రేరేపించగా, దక్కనులో సామ్రాజ్యవిస్తరణకు పూనుకోవడంవల్ల, సామ్రాజ్యముయొక్క ఆదాయ మూలాధారాలన్నీ వ్యర్థమైన ఖర్చులద్వారా శోషించిపోయినవి. ఇరవైయేడు సంవత్సరాల కాలం పెద్ద సైన్యాన్ని దక్కనులో నిలిపి, నిరంతరమైన, దండయాత్రలను చక్రవర్తి సాగించినాడు. కాని, తుదకు ఈ ప్రయత్నం విఫలమై పోయింది. మహారాష్ట్రియుద్ధంవల్ల

అనేక పరిణామములు కలిగినవి. మొగల్ సామ్రాజ్య ప్రతిష్ఠ మట్టిలో కలిసిపోయింది. అతి భారములై, శీఘ్ర గమనానికి వీలుకాక, భోగవిలాసాలకు ఆకరములై ఉన్న మొగల్ యుద్ధ శిబిరాలు, అతిసాహసికులైన మరాఠా అశ్వారోహకుల పరిహాసానికి గురిఐనవి. ఈ సాహసికులు ఈ శిబిరాలచుట్టూ తిరుగుతూ, సరఫరాలను అరికట్టి, మొగల్ శ్రీమంతుల ధైర్యాన్ని భగ్నం కావించి, మొగల్ రాజ్యభాగంలో కప్పములను వసూలు చేసుకొన్నారు.

సాలుకు, పద్ధెనిమిది కోట్ల రూపాయలుగా అంచనావేసిన దక్కను రాజస్వం మాయమైపోయింది. సామ్రాజ్య కోశానికి తీరని నష్టం కలిగింది. చక్రవర్తియొక్క పూర్వులు సేకరించి, దాచిన సంపద పూర్తిగా వ్యర్థమైపోయింది. ఔరంగజేబు మరణంనాటికి, కేవలం పన్నెండుకోట్ల చిన్న మొత్తం మాత్రమే, కోశంలో మిగిలింది.

మతవిషయంలో, అంధాభిమానంతో ప్రవర్తించినాడని ఔరంగజేబుపై కావించిన దోషారోపణ సరిఐనదే. ఇతడు అనుసరించిన విధానం రాజకీయంగా అవివేకమైనది; మత దృష్ట్యా న్యాయబద్ధమైనది కాదు. దేశానికి ఇది అపారమైన హానిచేసింది. హిందూ ముస్లిము ఉన్నతవర్గాల మధ్యగల విభేదాన్ని, ఈ మతోన్మాదం మరింత ఎక్కువచేసింది. అక్బరు విధానంవల్ల మానిపోయిన గాయాలు మళ్ళీప్రకోపించి, పౌరులుగా తమకు హీనస్థానం ఏర్పడి ఉన్నదనే భావాన్ని, హిందువులస్మరణకుతెచ్చింది. రెండుమతాలవారికీ సౌహార్దసంబంధాలను కలిగించడానికి పూనుకొన్న కబీర్, నానకుల, ప్రజాఉద్యమానికి భంగం కలిగించింది. కాని, మొగల్‌సామ్రాజ్యానికి విరుద్ధమైన ప్రజాఉద్యమం ఉత్పన్నం కావడానికి, ఇది ప్రేరకమయింది, అనే అభిప్రాయం, అతిశయోక్తి. ముస్లిముపరిపాలనకు ఎదురుతిరిగే ఉద్యమానికి ఉత్తేజనం కలిగించిందని, చెప్పడంకూడా వాస్తవంకాదు. మొగల్ సామ్రాజ్యానికి విరోధులైనవారి రాజకీయాశయాల ప్రచారానికి మంచి అవకాశాన్ని కలిగించడమూ, లోపలనే కుములుతున్న అసంతుష్టి అనే అగ్నికి, ఇంధనాన్ని చేర్చడమూ,- అనేవి మాత్రం- తప్పక, ఔరంగజేబు మతవిధానంవల్ల, జరిగినవి

హిందువులందరూ కలిసి ఎదురుతిరగడం, అనేది జరగని విషయం. హిందువులందరూ ఒకకులానికి చెందినవారు కాకపోవడం, ఒకసంస్థగా ఏర్పడి ఉండకపోవడము, ఇందుకు కారణాలు. అదీకాక, ఔరంగజేబు అవలంబించిన విధానం అతనితోనే అంతరించింది అనుభవించిన కష్టపరంపరల స్మరణ, ద్వేషభావము, మాత్రం, దేశంలో నిలిచిపోయినవి

ఆకాలంలో ఉత్పన్నమైన విద్రోహచర్యల వివరణవల్ల, ఈ విషయం విశదమౌతుంది. సతేనామీలు, అనే సంప్రదాయ వ్యతిరేకులైన హిందువులవర్గం, ఏవోవ్యక్తిగత అల్ప విషయాల కారణంపై, సామ్రాజ్యాధికారులకు ఎదురు తిరిగి, నర్‌నౌల్‌వద్ద, పోరాడిరి (1672). స్థానిక పోలీసు సిబ్బందిని, సైన్యాన్ని ఓడించి, పట్టణాన్ని ఆక్రమించి, తమ స్వంత ప్రభుత్వాన్ని నెలకొల్పిరి. కాని వీరికి లభించిన విజయం స్థిరమైనదికాలేదు. రదన్‌దాజ్‌ఖాన్ నాయకత్వంలో, ఒక బలమైన సేనను, ఔరంగజేబు వీరిపై పంపినాడు. విష్ణుసింగ్‌కఛ్‌వాలా అధీనంలో, ఒక రజపుత్ర సైనిక దళాన్ని కూడా వారితో పంపించెను. సతేనామీలు రూపు లేకుండా హతులైపోయిరి. ఈశ్వరదాస్‌నాగర్, ముస్తేద్‌ఖాన్, ఖాఫీఖాన్, వంటి హిందూ ముస్లిము చరిత్రకారులు, ఈ సతేనామీలను హిందూమత ధర్మ రక్షకులుగా పరిగణించలేదు. హిందూ చరిత్రకారుల వ్రాతలనుబట్టి, వీరు "అత్యంతమూ, రోత మనుష్యులు, క్రూరులు-

వారి నియమాల ప్రకారం, హిందుముస్లిములకు భేదమేలేదు. పందులను, ఇతర అసహ్యప్రాణులను కూడా తినేవారు. కుక్కమాంసాన్ని వారి ఎదుటపెట్టినా కూడా, ఏమాత్రమూ విసుగుచెందనివారు. పాపాచరణకు, నైతిక భ్రష్టాచరణకు వెనుదీసేవారుకారు."

దోఆబ్ (Doab) పైభాగంలోని జాటు జమీందారుల తిరుగుబాటును, మతసంబంధమైన ఉపద్రవంగా గణించడానికి వీలులేదు. కేంద్రప్రభుత్వానికి, అనువంశీయులైన జమీందారులకు మధ్యఉండిన సంబంధాలు, ఎడతెగని పరస్పర పోరాటాలతో కూడివుండినవే. ప్రభుత్వానికి చెల్లించవలసిన బాకీలను, ఇవ్వక, మొండిపట్టుదలతో, అవిధేయతను ప్రదర్శిస్తున్న సర్దారులకు సంబంధించిన కథలు, మధ్యయుగాల చారిత్రకేతిహాసములలో అనేకములు ఉన్నవి. సందర్భాలు అనుకూలించే పక్షంలో, వీరు ఆరంభంనుంచి నిరాకరించడము, బాహాటంగా ఎదురుతిరగడము, సామ్రాజ్యసేనలు తరలిపోయి వారిని అణచివేయడము,- అనేవి సాధారణ ప్రక్రియలుగా ఏర్పడిఉండినవి. ప్రతిసర్దారూ,- ఎంత చిన్నవాడైనాసరే, సైన్యబలం తక్కువైనప్పటికీ, తాను చక్రవర్తికి సమానుడైన స్వతంత్రప్రభువు, అని, భావించుకొని, తన సంస్థానాన్ని విస్తరింపచేసుకోడానికీ, అదృష్టం అనుకూలిస్తే, స్వతంత్రుడైన రాజుగా స్థిరపడడానికీ, ఎప్పుడూ సిద్ధంగా ఉండేవాడు.

## VI. జాటువర్గాలు

ఔరంగజేబు రాజధానిలో లేక, దక్కనులో నిలిచియున్న అవకాశాన్ని, స్వప్రయోజనార్థం ఉపయోగించుకోవచ్చునని, అతిసాహసికులు, అత్యాశాపరులు, ఐన, జాటుసర్దారులు యోచించిరి. ఈ విషయమై ఇంతకుపూర్వం వీరుచేసిన ప్రయత్నాలు, విఫలములైనవి. ఇప్పుడు, రెండు రసపుత్రశాఖలమధ్య ఏర్పడిన కలహాన్ని ఉపయోగించుకొని, ఒక పక్షం వారి సహాయాన్నిపొంది, తన ఆశయాలను పూర్తిచేసుకోడానికి రాజారాం పూనుకొన్నాడు. కాని, కక్షలకు సంబంధించిన పోరాటంలో అతడు హతుడైనాడు. అంబర్ సంస్థానానికి రాజైన, బిష్ణుసింగ్‌కచ్‌వాహా ప్రధానపాత్రవహించిన, మొఘల్‌సైన్యం, ఈ విద్రోహాన్ని అణచివేసింది.

ఔరంగజేబు మరణానంతరం జరిగిన ఉత్తరాధికారయుద్ధంలో, విజయంపొందిన పక్షంలోచేరి, రాజారాంతమ్ముడు చురామాన్, మన్‌సబ్‌దార్ ఐనాడు. బహదూర్‌షా కుమారులమధ్య జరిగిన రెండో ఉత్తరాధికారయుద్ధంలోనూ, తరువాతఏర్పడిన అస్తవ్యస్తపరిస్థితులలోనూ, చురామాన్ తనస్థానాన్ని బలపరచుకొని, శుల్కాలను విధించడానికీ, పన్నులు వసూలుచేయడానికీ, ఆరంభించినాడు. ఇతడు అనుసరించిన విధానం, అతికఠినమైనది కావడంవల్ల, ప్రజలు గగ్గోలుపెట్టిరి. చక్రవర్తి ఆస్థానంలో కక్షలుఏర్పడి ఉండడంవల్ల, ఇతనిపై కఠినచర్య తీసుకోడానికి, సాధ్యంకాలేదు. కాని, తన కుమారులమధ్యనే ఏర్పడిన కలహం కారణంగా, జీవితంపైరోసి, చురామాన్ విషంతీసుకొని ఆత్మహత్య కావించుకొన్నాడు.

చురామన్ తర్వాత, అతని అన్నకుమారుడైన బదన్‌సింగ్ ఉత్తరాధికారి ఐనాడు. తన పూర్వుల దోపిడీచర్యలను మాన్పించి, స్థిరమైన చిన్న రాజ్యానికి పునాదులు వేసినాడు. ఈ చిన్న రాజ్య నిర్మాణంలో కూడా, మొగల్ ఆస్థానముయొక్క సరంజామా అంతా సమకూరింది. "తగినంత వైభవంతో ఆస్థానాన్ని ఏర్పరచినాడు. తన సేవలోనికి తీసుకొన్న

పెక్కురు ముస్లిం అధికారులు, ఆస్థానానికి అనుగుణమైన నాజూకును, గాంభీర్యాన్ని కలిగించి, మొరకులైన తన జాతివారికి, రాజాస్థాన జీవిత ఆదర్శాలుగానూ, ఆస్థాన సంప్రదాయ బోధకులుగానూ సేవచేసిరి." "ఉన్నతకులం సంజాతుడైన ముస్లిము శ్రీమంతుని రీతిగా, తన కుమారుని విద్యాశిక్షణకు ఏర్పాట్లుగావించెను." ఇతని మనుమడు "బహదూర్‌సింగ్, అరబ్బీ భాషలో షెర్హా-ఎ-జామీ, అంతస్తు వరకూ అధ్యయనం చేసెను."

పద్దెనిమిదో శతాబ్దంలో **మొగల్** సామ్రాజ్యానికి చెందిన రాజకుమారులూ, కులీనులూ జరిపిన కుట్రలు చిక్కులకు సంబంధించిన తుచ్ఛమైన చరిత్రలో జాట్ రాజ్యముయొక్క తరువాతి చరిత్ర ఎట్టిదో గుర్తించడానికి వీలులేదు. వారికి సమకాలికులైన హిందూ ముస్లిముల వల్లె, వీరు పాటించిన విధానం ఒక్కటే. ధర్మభీతికాని, భావిదృష్టికాని, ఈ విధానాన్ని మార్చలేదు. తమకు సన్నిహితమైన కుటుంబ ప్రయోజనం తప్ప, హిందువుల ప్రయోజనాన్ని సాధించే ఆశయం వారికి ఉండెనని చెప్పడానికి, సాక్ష్యం, లవలేశం కూడా లేదు. కఛ్వాహా లకు, రాథోర్లకు జరిగిన యుద్ధంలో వీరు, మొదటి కక్షవారితో ఏకీభవించిరి. కఛ్వాహా రాజులైన బిష్ణుసింగు, సవైజైసింగులు తమజాతులపై జరిపిన దండయాత్రలను విస్మరించినారు. రోహిల్లాలకు విరుద్ధంగా, సామ్రాజ్య సైన్యాలకు తోడ్పడిరి. ఢిల్లీ చక్రవర్తికి ఎదురుతిరిగిన బాఫ్‌నవాబుకు, సహకరించిరి. మరాఠాల యుద్ధంలో, మొగల్ చక్రవర్తి పక్షం వహించిరి. అబ్దాలీని ఎదుర్కొన్న మహారాష్ట్రులకు సహాయపడిరి. ఈ విధంగా సందర్భానుకూలమైన ఆటలాడుతూ, పుణ్యక్షేత్రాలైన మథురాబృందావనములు ఆఫ్ఘనుల ఖడ్గాలకూ, అగ్నిజ్వాలలకూ లోనౌతుండగా, తమకు పట్టనట్లు ఉండిపోయినారు. సామ్రాజ్య ప్రతిష్ఠను మాత్రమే రక్షించడానికి, తంత్రాలు పన్నిరికాని, దాని అధికారాన్ని నిలపడానికి పూనుకోలేదు. పానిపట్ యుద్ధానికి ముందు, మహారాష్ట్రులతో చేరుతామని, ఇష్టంలేక ఒప్పుకొన్నారు. కాని, ద్రోహం జరుగవచ్చుననే సంశయానికిలోనై, అహమద్‌షా అబ్దాలీని ఎదుర్కోడానికి, మహారాష్ట్రులను మాత్రమే బలిచేసినారు.

జాటులు హిందూమతరక్షకులని, ఔరంగజేబు అవలంబించిన మతవిధాన కారణంగా, ధర్మబద్ధమైన రోషానికి లోనై అతనిని ప్రతిఘటించి నిలిచిరి, అని సూచించే ప్రతిపాదనను, వీరు అనుసరించిన నీతి నిష్ఠాబాహ్యములైన తంత్రాలు సమర్థించవు.

## VII. మహారాష్ట్రులు

సామ్రాజ్యాధిపత్యానికై పోటీపడిన వారందరిలోనూ, మహారాష్ట్రులకు ఎక్కువ అనుకూలపరిస్థితులు ఏర్పడిఉండినవి. పరులు సులభంగా ప్రవేశించడానికి వీలుకాని, దట్టమైన సంక్షిప్త భూభాగం, వారికి ప్రకృతిసిద్ధంగా ఏర్పడి ఉండినది. మైదానానికి సముద్రతీరానికి మధ్యగా, వెన్నెముకవలె ప్రసరించిన పడమటికనుమల నిమ్నతలభాగము, పడమటి దక్కను సమతల ప్రాంతము, కొంకణ్ ప్రాంతములోని తీరప్రదేశము చేరి, మహారాష్ట్రుల నివాస స్థానంగా ఏర్పడినది. విస్తారమైన అరేబియాసముద్రం వీరి రాజ్యానికి తీరరేఖగా సిద్ధించింది. కుంభవృష్టిగా కురిసేవానలు, విదేశీయవర్తకము, ఈ భూభాగానికి పరిమితిలేని లాభాలను, ఉపకారాలను కలిగిస్తాయి. శత్రుసైన్యాల అశ్వారోహకుల దాడులనుంచి, తప్పించుకొని దాగుకోడానికి అనువైన రక్షకస్థానాలు పడమటికనుమలలో ప్రకృతిసిద్ధంగా ఏర్పడి ఉన్నవి-

ప్రత్యేకమై నిలిచియున్న పర్వతశిలాభాగాలు భయోత్పాదకములైన దుర్గాల నిర్మాణానికి, సౌకర్యం కలిగించినాయి. వెంటబడి తరిమే శత్రువుల నుంచి తప్పించుకొని, తలదాచుకో డానికీ, చుట్టూ వ్యాపించియున్న మైదానాలపై అధికారం చెలాయించడానికీ, ఈ పర్వత దుర్గాలు మంచి సౌకర్యాన్ని కలిగించినవి. సమతల ప్రదేశాన్ని విభాగిస్తున్న లోయంలో, నదులు తూర్పుకు ప్రవహిస్తున్నవి. ఈ లోయలలోని భూములు చాల సారవంతములైనవి. తక్కిన మహారాష్ట్ర ప్రాంతంలోని భూములు జొన్నపంటకు, మొరటుధాన్యాల పంటలకు [బజ్రా, జొవార్] మాత్రమే, తగినవి.

సముద్రతీరము, కొండలు, ఉన్నతో పరిభూములు,-వీటితో ఏర్పడిన ఈ ప్రాంతంలో, మహారాష్ట్రులు మిత వ్యయంతో కూడిన కఠిన జీవనానికి అలవడి ఉండిరి. వారు నివసిస్తున్న పరిసరాల స్వభావాన్నిబట్టి, వారిలో స్వాతంత్ర్య భావము, సాహసోద్యమ చైతన్యము, ధృఢ మైన ఆత్మవిశ్వాసము, బాగుగా అభివృద్ధిచెందినవి. సంపద విషయమైన తీవ్రవ్యత్యయాలు, ఉత్తర భారత, దక్షిణభారత ప్రాంతాలలోవలె,- మహారాష్ట్రులలో ఏర్పడి ఉండలేదు. అధిక సంఖ్యాకులైన స్వంత వ్యవసాయదారులు, మహారాష్ట్ర సమాజానికి వెన్నెముకగా ఏర్పడి ఉండిరి. ఇండియాలోని తక్కిన ప్రాంతాలలోవలెనే, ఇక్కడ కూడా కులభేదాలుకలవు. కాని, మూడు బ్రాహ్మణవర్గాలమధ్యగల పరస్పర ఈర్ష్యాభావాలు, మహారాష్ట్రులకుగల బలవత్తరమైన స్థాన బలము, సంస్కరణోద్యమానికి ప్రజానీకంలో కలిగిన ఆదరము,-అనే పరిస్థితులు, కుల వ్యవస్థవల్ల సిద్ధించే కష్టాలను ఉపశమింపచేసినవి. ప్రజలందరికీ సమానంగా వ్యవహారంలో ఉన్న ఏకభాష,- మరాఠీ-ప్రజల ఉత్కాంక్షలకు సాంస్కృతిక సంయోజనాన్ని కూర్చి, ఐక్యభావనను పెంపొందించింది.

అహమద్‌నగర్, బిజాపూర్, సుల్తానుల సౌమ్య పరిపాలనలో, మహారాష్ట్రులు అభివృద్ధి చెంది, పురోగమించడానికీ, ఎక్కువ పలుకుబడి సంపాదించడానికీ అనుకూలించే అవకాశాలు, అఖండంగా సిద్ధించినవి, పెక్కు మహారాష్ట్ర కుటుంబాలు, చిన్న చిన్న సంస్థానాలను నిర్మించు కొన్నవి; అనేకులు సుల్తానుల సేవలో ప్రవేశించిరి; బాధ్యతతోను, ప్రభువుల విశ్వాసంతోను కూడిన అధికార పదవులను, కొందరు సంపాదించుకొనిరి. పదిహేడో శతాబ్దంలో, దక్కను సుల్తాను రాజ్యాలను సంబంధించిన ఉత్తరాధికార స్పర్ధలు ప్రారంభమైనాయి. ఈ పరిస్థితి, మహారాష్ట్ర సర్దారుల ఆకాంక్షలకు ప్రచోదకమయింది.

దేశంలోని పరిస్థితుల ఆవరణం మతసంబంధమైన అత్యుత్సాహంతో విద్యుదుత్తే జితమై ఉండింది. దేశభవిష్యత్తు, నిర్బంధంచేసి తనవైపు పిలుస్తూ ఉన్నట్టు కనబడుతుంది.

రాజనీతిజ్ఞునికి, యుద్ధవీరునికి, ఉండవలసిన అత్యుత్తమ గుణాలతో ఒప్పిన, ఒక మహానాయకుడు, అనుకూల సమయంలో, ప్రజల యెదుట ప్రత్యక్షమైనాడు. అతడే శివాజీ. దేవగిరి యాదవరాజుల కాలము నుంచి, సుసంయోజితమైన రాజకీయవ్యవస్థ ఎట్టిదో ఎరగని, మహారాష్ట్ర ప్రజలను ఒకటిగా చేర్చి, ఏకైకమైన రాజకీయ వ్యవస్థగా ఏర్పరచినాడు. ఇంత వరకు, మూడు వందల యాభై సంవత్సరాలకాలం, ఉత్తర భారతం నుంచి వచ్చిన రాజ వంశాల పరిపాలనకు, వీరు లోబడి ఉండినారు. కాబట్టి, చెల్లాచెదరై పోయి ఉండిన అంశాలను అన్నిటినీ కూర్చుకొని, ఒక రాజ్యాన్ని స్థాపించడం, అద్భుతమైన మహాకార్యం. యుక్తి యుక్తములైన నియమాలపై ఏర్పరచిన పరిపాలన యంత్రాంగాన్ని, నిర్మించుకోవడం, ఇంత

కంటెను ఆశ్చర్యకరమైన కార్యం.

త్రివిధమైన కర్తవ్యాలతో కూడిన ఈ విధ్యుక్త ధర్మాన్ని సాంగంగా నిర్వహించడంలో, శివాజీ ప్రతిభ ఉజ్జ్వలంగా ప్రకాశించింది. దక్కన్ సుల్తానుల పరిపాలనను పడద్రోయడానికి సమర్థమైన సేనాబలాన్ని సిద్ధంచేసుకోవడము, మహారాష్ట్ర వర్గాలను అన్నిటినీ ఒకరాజ్యముయొక్క ఆశ్రయంలోకి తీసుకొని రావడము, సుస్థిరమైన ప్రభుత్వ విధానాన్ని వ్యవస్థీకరించడము,-అనే మూడుకర్తవ్యాలనూ శివాజీ అద్భుతంగా నిర్వహించినాడు. ఇండియా ప్రభుత్వాల ముఖ్యలోపం, విత్తవ్యవస్థకు సంబంధించినట్టిది. కాని, తన ప్రభుత్వాధికారుల వేతనాలను నియమించడంలోను, వేతనాలను ఇచ్చే పద్ధతిలోను, తక్కిన కార్యాచరణాలన్నిటిలోనూ, శివాజీ అమిత వ్యయంకాకుండా మిక్కిలి జాగరూకత వహించినాడు. అతని దండయాత్రల కర్చులు కూడా, లభించిన విజయముల ద్వారా పూర్తిచేసుకొన్నాడు. జాగీరు పద్ధతిని ఇతడు ఏమాత్రమూ ఒప్పుకోలేదు. అతని ప్రభుత్వంలో, ఉద్యోగావకాశాలకు వ్యక్తుల సహజ శక్తి సామర్థ్యాలు మాత్రమే యోగ్యతలుగా గణించబడినవి. బ్రాహ్మణులు, ప్రభులు [కాయస్థులు], మహారాష్ట్రులు,-అందరికీ సమానావకాశాలు కలిగినవి. ముస్లిములకు కూడా, ఉన్నతోద్యోగాలు లభించినవి.

అతడు అనుసరించిన రాజనీతియొక్క తుది ఆశయము ఎట్టిదో, నిశ్చయించడం కష్టం. మొగల్ సామ్రాజ్యముయొక్క స్థానంలో, 'హిందూపాద్‌పాద్‌షాహీ,' అనే హిందూ రాజ్యాన్ని స్థాపించడం, శివాజియొక్క అభిమతము అని, మహారాష్ట్ర చరిత్రకారుల అభిప్రాయం. కాని, మహారాష్ట్ర చరిత్రకాలంలో అంతటా, 'స్వరాజ్' అనేది ముల్క్‌గిరి అనే దానికి పూర్తిగా విభిన్నమై ఉండింది. మహారాష్ట్ర క్రమ పరిపాలనలో స్థిరమైఉండిన ప్రాంతమే 'స్వరాజ్'. దీనికి బాహ్యమై ఉన్న ప్రదేశమంతా ముల్క్‌గిరి. ఈ ముల్క్‌గిరి, "మహారాష్ట్ర అశ్వారోహక సైన్యముయొక్క దోపిడికి అనుకూలమైన ప్రదేశం." మరిన్ని, మహారాష్ట్రులు పల్కాలను విధించి, వసూలుచేసుకోడానికి అనువైన ప్రాంతం. ఈ విధానం న్యాయబద్ధమైనదని వారి నిశ్చితాభిప్రాయం. ఈ విషయమై జదూనాథ్ సర్కార్, ఈ క్రింది విధంగా వ్రాస్తాడు. "శివాజీ అవలంబించిన విదేశ రాజనీతికి, ముస్లిం సార్వభౌముని రాజనీతికిగల సామ్యము సమగ్రమైనట్టిది. పరిసరదేశాలలో మహారాష్ట్రులు జరిపిన దాడులను రాజకీయ ఆదర్శాలుగా వర్ణిస్తూ, శివాజీ ఆస్థాన సభ్యుడైన కృష్ణాజీ అనంతు రచించిన చరిత్రలోను, బిజాపూర్ సంస్థానపు ప్రామాణికమైన చరిత్రలోను కూడా, ముల్క్‌గిరి అనే పదాన్నే వాడియున్నారు. శివాజీ, అతని తర్వాతవచ్చిన పీష్వాలుకూడా, పరిసర రాజ్యాలలో ఈ ముల్క్‌గిరి అనే దాడులను, జరుపుతూవచ్చిరి. హిందువుల రాజ్యాలు, ముస్లిముల రాజ్యాలు, అనే వివక్ష లేకుండా దాడులుసాగించి, ముస్లిము ధనవంతులను దోచుకొన్నంత దయా రహితంగా, హిందూ ధనవంతులను కూడా దోచుకొన్నారు."

మతము అనే తరంగముయొక్క శిఖరాగ్రంపై ఉదయించినవాడు శివాజీ. కాని, అతని ఉద్యమంలో అతిరాష్ట్రీయత (Chaunism) అనే భావంలేదు. తుకారామూ, ఇతర మరాఠాసాధు పురుషులూ, సంకుచిత భావాలుకల మతాంధులుకారు. వారు ప్రతిపాదించిన భక్తిమతం, ప్రత్యేకంగా ఒక వర్గానికి చెందినదికాదు. వాస్తవంగా, హిందూమతస్థులనూ, ఇస్లాము మతస్థులనూ కలపడానికి, వారు ప్రయత్నించినారు. విగ్రహారాధన, అంధవిశ్వాసము,

కులవ్యవస్థ, తీర్థయాత్ర, మొదలైన హిందువుల పద్ధతులను వారు నిరసించినారు. అదే విధంగా, ముస్లిముల ఇతర మత అసహనభావాన్ని కూడా, వీరు నిరసించి, ఖండించినారు. శివాజీ, ఈ సాధు పురుషులను తన గురువులుగా గ్రహించినాడు. ముస్లిం సాధువులపట్లా, ఇస్లాము పవిత్ర గ్రంథమైన కురానుపట్లా, మసీదులపట్లా, గౌరవాన్ని పాటించినాడు. ఇస్లాము సంస్కార క్రియలను జరపడంలో శివాజీ జోక్యం కలిగించుకొన్నట్లుకాని, హిందువుల కంటె ముస్లిములు తక్కువ వారని చూపినట్లుకాని, నిదర్శనాలు ఏమాత్రమూలేవు.

ఐనా, హిందూమత స్వాతంత్ర్యాన్ని రక్షించడానికి పూనుకొన్న మహావీరుడు శివాజీ. జిజియాపన్నును హిందూవులపై విధించడం తగదని, ఔరంగజేబును హెచ్చరించినాడు. రాజ్య పరిపాలన విషయంలో ఇస్లాము మతస్థులు ఉత్తములు, అనే మొగలుల అహంభావాన్ని శివాజీ ఒప్పుకోకపోవడము, హిందువులను నిమ్నస్థానంలో ఉంచడానికి ఔరంగజేబు పూను కొని ఉండడము,-అనే విషయాలు వీరిరువురి మధ్యా జరిగిన యుద్ధాలకు మూలకారణాలు. పరమత సహనము, న్యాయపరిపాలన, సర్వసమానత్వము, అనేవి శివాజీ రాజ్య పరిపాలన విధానంలోని, నియమాలు. మొగల్ సామ్రాజ్యంలో కూడా, ఈ సూత్రాలే వర్తించవలెనని శివాజీ ఆశయం.

శివాజీ మరణించేనాటికి, అతని వయస్సు అంత పెద్దదికాదు; యాభై మూడేండ్లు మాత్రమే నూతన రాజ్యం చక్కగా పాతుకొని, స్థిరపడియుండక పూర్వమే శివాజీ మరణించడం, గొప్ప విపత్తు. రాజ్యాధికారాన్ని శాంతియుతంగా, మరొక్కరికి హస్తాంతరం కావించే విధానము కూడా అభివృద్ధికి వచ్చియుండలేదు. చాలవరకు, రాజుయొక్క ఆధీనంలో ఉన్నదేదో భాగంగా మాత్రమే దానిని గుర్తించి ఉండెరి. ప్రజాప్రభుత్వము, లేక, సార్వజనిక రాజ్యసంస్థ అనే ప్రతిష్ఠ, మహారాష్ట్రరాజ్యానికి ఇంకా సిద్ధించి ఉండలేదు. రాజ్యముయొక్క ఈ అపరిణత స్థితి, శివాజీ, కన్నుమూయక ముందే వ్యక్తమయింది. అతని అనంతరం ఈ రాజ్యం ఎవరికి సంక్రమించవలెననే విషయమై జరిగినవాద, వివాదాల కారణంగా, కడపటి రోజుల్లో శివాజీ, తీవ్ర మనోవేదనకు గురిఐనాడు. ఇతని పెద్దకుమారుడు శంభాజీ, తండ్రికి ఎదురుతిరిగి, మొగలులను, ఆశ్రయించినాడు. మంత్రి మండలిలో ఐక్యంలేదు. బలవంతులైన మంత్రులు ఇద్దరూ,-పీష్వా, సచివ్,-"బాహాటంగా పరస్పరం ఈర్ష్యాపరులై ఘర్షణపడుతూ ఉండిరి."

కట్టకడపట, శంభాజీ, తండ్రితో సమాధానపడి, సింహాసనాన్ని ఆరోహించినాడు. కాని, తనకు ప్రతికూలురై ఉండిరని ఇతడు అనుమానించిన మంత్రులపైనా, అధికారులపైనా, కసితీర్చుకోవడానికి ప్రారంభించెను. తన సవతి తల్లిఐన సోయరాబాయిని, సచివ్‌గా ఉండిన అన్నాజీ దత్తోను, ఇంకను పెక్కుమందిని చంపించినాడు. బ్రాహ్మణ మంత్రులపై దీర్ఘకాల శత్రుత్వాన్ని వహించి, బాధిస్తూ వచ్చినాడు. అతడు వహించిన క్రౌర్యము, జరిపిన హింసా కాండ, వ్యభిచార ప్రవృత్తి, మొదలైన ఇతని పాపాలకురోసి, ప్రముఖులైన బ్రాహ్మణులే, ఇతనిని నశింపచేయడానికి ప్రయత్నంసాగించిరి. తత్ఫలితంగా, ద్రోహానికి గురియై, శంభాజీ మొగల్ సేనా నాయకునిచేతికి చిక్కినాడు. ఔరంగజేబు ఆజ్ఞఇవ్వగా, శంభాజీ శిరచ్ఛేదం, కావించిరి. తండ్రిచనిపోయిన తొమ్మిది సంవత్సరాలకే, శంభాజీకి ఈ విధమైన గతిపట్టింది.

ఆ పిమ్మట, మహారాష్ట్రులు ఔరంగజేబు సైన్యాలతో ఇరవై ఏండ్లకాలం, వీరోచిత

యుద్ధాన్ని సాగించినారు. మరాఠా సర్దారుల అతి సాహసకార్యాలూ, సునిశిత కౌశలంతో నడిపిన యుద్ధతంత్రాలూ, చక్రవర్తిబలాన్ని నిస్సార మొనర్చినవి. నిరాశతో ఖిన్నుడైన ఔరంగజేబు ఔరంగాబాదుకు వెళ్ళిపోయి, అక్కడనే చింతావ్యాకులత్వంతో, మరణించినాడు. మహారాష్ట్రులు విజయాన్ని సాధించినారు; కాని ఎంతటి నష్టంతో!

ఈ దీర్ఘకాల యుద్ధముయొక్క పరిణామంగా, అపసరణశక్తులకు ఉత్తేజనం కలిగింది. ఏకైకమైన రాజ్యస్థాపనతో, మరాఠాసర్దారులపైనా, ప్రజలపైనా శివాజీమోపిన ఐక్యము, దీనితో భగ్నమయింది. మొగల్‌సైన్యాలపై గొరిల్లాపద్ధతి పోరాటాన్ని సాగించవలసివచ్చిన మహారాష్ట్ర సర్దారులు, తమ నిర్ణయాలపైనా, సంకల్పాలపైనా మాత్రమే, ఆధారపడవలసి వచ్చింది. కాబట్టి దీనికి అలవాటుపడిన సర్దారులు, యుద్ధానంతరం కూడా, తమ స్వతంత్ర కార్యాచరణ ప్రవృత్తిని, మానలేకపోయిరి. కాలం గడచేకొద్దీ, కేంద్రప్రభుత్వంవల్ల, భక్తివిశ్వాసాలు క్రమంగా క్షీణిస్తూవచ్చినవి. కడపటికి, తమ భూభాగాలపైన తామే, స్వయంపరిపాలన సమర్థులైన ప్రభువులుగా నెలకొనిరి. పీష్వాతో సమానమైన స్థానగౌరవాలని భావించుకొని, పీష్వా ఆదేశాలను పాలించడానికి విముఖులైరి. పీష్వానిర్ణయాలు తమకు ఇష్టంలేనివల్ల, అతనిని ధిక్కరించి, ఎదిరించడానికి కూడా సిద్ధపడిరి.

శివాజీ వీరిలో ఉత్తేజనం కావించియుండిన "మహారాష్ట్ర ధర్మరక్షణము" అనే, తీవ్రోత్సాహం అదృశ్యమైపోవడము, ఇంతకంటెను దుష్టమైన పరిణామం. మొగల్ సామ్రాజ్యము యొక్క అధికబలాన్ని, ఇరవైసంవత్సరాలు ధిక్కరించి, ఎదిరించి నిలువడానికి మూలాధారమైన ఈ సంక్షోభోత్సాహం, నశించిపోయింది. భూభాగంపైనా, ధనంపైనాగల, ఆత్యాశ, గతించిపోయిన ఉత్సాహస్థానాన్ని ఆక్రమించినవి. న్యాయము, ధర్మనిష్ఠ, స్వాతంత్ర్యము అనే ఆశయాల దర్శనానికై, సుమారు అర్ధశతాబ్దకాలం, మహాప్రయత్నం సాగించిన మహారాష్ట్రులు, మొగలుల జీవనవిధానాలను, సమాజవర్తనలను అనుకరించడానికి పూనుకొని, హాస్యాస్పదులైరి. వీరిని నీతిభ్రష్టులుగాచేసి, వీరి ఉత్తమాదర్శాలను నశింపచేసింది యుద్ధం. ఢిల్లీసామ్రాజ్యపు ఆస్థానంలోఉన్న భోగాలు, ఆడంబరము, పైమెరుగులు, వీరిని ఆకర్షించినవి. వాటికై ప్రాకులాడచొచ్చిరి. మితజీవనము, సరళత, కర్తవ్యశ్రద్ధ, మొదలైన వీరి సహజగుణాలు, క్రమంగా క్షీణించిపోయినవి. ఒక గొప్ప ఆశయ సాధనార్థం జీవించడంలోను, దానికై ప్రాణాలను అర్పించడంలోను, గల ఆనందం విస్మృతమైపోయింది. దాని స్థానంలో, ఆత్మమరభిమానము, స్వప్రతిష్ఠ అనే దుర్గుణాలువచ్చి చేరుచున్నవి.

శివాజీ అణచిపెట్టి ఉంచిన, దుష్టరాజకీయ ప్రవృత్తులు మళ్ళీ తలెత్తినవి. రాజసింహాసనానికి, పీష్వా గాదికి సంబంధించిన ఉత్తరాధికార వివాదాలు, మహారాష్ట్ర రాజకీయాలకు వినాశకరమైనవి. సవతితల్లి కుమారుడైన రాజారామ్, శంభాజీకి విరుద్ధంగా సింహాసనానికై ప్రయత్నించి ఉండినాడు. షాహూను మళ్లీ సింహాసనానికి తెచ్చే ప్రయత్నానికి రాజారామ్ భార్య, తారాబాయి అడ్డుపెట్టింది. షాహూను, కుమారులు లేనందువల్ల సింహాసన ఉత్తరాధికార విషయమై ముఖ్యులైన అధికారులమధ్య, సంఘర్షణ సిద్ధించింది. రాజుకు బలం క్షీణించడంతో, పీష్వా అతని అధికారాన్ని హస్తగతం చేసుకొన్నాడు. పీష్వామరణానంతరం అతని పదవికై, మళ్లీ వివాదాలు బయలుదేరినవి.

రాజ్యాధికారం పీష్వాకు సిద్ధించడంవల్ల, సర్దారులలో ఈర్ష్యాభావాలు ఉత్పన్నమైనవి.

తన ప్రాధాన్యంపోయిందని ఒక ప్రక్కన రాజు, తమకు ప్రాధాన్యం కలుగలేదని మరొకవైపు సర్దారులు. తమ అయిష్టాన్ని ప్రదర్శిస్తు-వచ్చిరి. రాజు, పీష్వా, సర్దారులు,- ఈ మూడు పక్షాలవారూ చేస్తున్న కుట్రలవల్ల, రాజ్యవ్యవహారాలు పాడైపోయినవి. రఘూజీ భోంస్లే బెంగాలు ప్రాంతంపై దాడిచేసినప్పుడు, నవాబ్ అల్లావర్దీఖాన్, పీష్వా సహాయాన్నిపొంది, భోంస్లేను ఓడించి, పారదోలినాడు (1743). తారాబాయికి ఆలంబనంగా నిలిచి, దామాజీ గయక్వాడూ, దాభాడేలు, పీష్వాప్రాంతాన్ని దోచుకొని, ధ్వంసం కావించిరి. నాలుగో పీష్వాఐన మాధవరావుకు, అతని పినతండ్రిఐన రఘునాథరావుకూ జరిగిన గృహయుద్ధంలో, హోల్కార్, భోంస్లేలూ, దక్కను పరిపాలకుడు నిజామ్ ఆలీకూడా, రఘునాథరావు పక్షం వహించిరి (1761). ఐదవ పీష్వా నారాయణరావును, రఘునాథరావు చంపించినాడు (1773). పంద్రెండ్లేండ్లు ఉత్తర భారతంలో దండయాత్రలు సాగించి, మహాద్జీ సింధియా పూనాకు మరలిరావడంతోనే, పూనాలో భయోత్పాతం ఉత్పతిల్లింది. సింధియాను ద్వేషిస్తున్న నానాఫడ్నవీసూ, పూనాలోని ఇతర రాజకీయ నాయకులూ భయభ్రాంతులై, మైసూరు నుండి మరలి వస్తున్న బొంబాయి సేనలను తమకు సహాయంగా ఇవ్వవలసిందని, కారన్‌వాలీసును ప్రార్థించిరి (1792). ఈ రెండు పక్షాలవారూ, ఒకరిపై ఒకరు, ఒక సంవత్సరకాలం కుతంత్రాలు పన్నుతూ వచ్చిరి. సింధియాను పడద్రోయడానికై హోల్కారుతోను, ఇతరుల తోను, నానా, కుట్రలు జరుపుతూవచ్చినాడు. కడపటికి, హోల్కారు సింధియాల మధ్య బాహాటమైన ఛిద్రం ఏర్పడింది. అంతతో, లాఖేరీవద్ద జరిగిన యుద్ధంలో, హోల్కారు పూర్తిగా ఓడిపోయినాడు (1793). మహాద్జీ వారసుడైన, దౌలత్‌రావ్, బాజీరావ్ ప్రేరణతో ద్రోహమార్గాన్ని అవలంబించి, నానాను, బందీగా పట్టుకొని, కేంద్రప్రభుత్వ స్థానమైన పూనాను దోచుకొన్నాడు (1798). నానా, హోల్కార్, సింధియాలమధ్య జరిగిన కలహాలు, రాజ్యము యొక్క పునాదులను కదలించివేసినవి. బాజీరావ్ II రఘునాథరావులు అంధప్రాయంగా ప్రవర్తించి, బ్రిటిష్ ఈస్ట్‌ఇండియా కంపెనీ, అనే ట్రోజన్ గుర్రానికి మహారాష్ట్ర వ్యవహార దుర్గంలోనికి ప్రవేశం కల్పించి, ప్రాణాంతకమైన ముప్పును తెచ్చిపెట్టిరి. యుద్ధాలు ఆరంభమైనవి. మరాఠా సర్దారులు, మంత్రులు, ఆత్మఘాతకములైన అంతఃకలహాలలో మునిగి ఉండిరి. వీటివల్ల తప్పకలాభంపొందినవారు బ్రిటిషువారు. 1802 సంవత్సరం నాటికి, మహారాష్ట్ర స్వాతంత్ర్యాన్ని వదలుకొన్నట్లు, పీష్వాచే బలాత్కారంగా వ్రాయించుకొన్నారు బ్రిటిషువారు. తక్కిన సర్దారులందరినీ వెదకి పట్టుకొని, రూపుమాపిరి. 1818 సంవత్సరం నాటికి, మహారాష్ట్ర రాజ్యం గాలిలో కలిసిపోయింది.

ఔరంగజేబుతో జరిగిన యుద్ధాలకారణంగా, మరాఠాపరిపాలన విధానంలో, మార్పులు తేవలసిన అవసరం ఏర్పడింది. రాజ్యస్థాపకుడైన శివాజీ నిర్మించిన సుదృఢమైన రాజ్యవ్యవస్థ, ఈ మార్పులవల్ల బలహీనమైపోయింది. జాగీర్దారీపద్ధతిని పునఃస్థాపించడం, ఒక మార్పు. నియమితకాలాలలో, క్రమంగా, పన్నులు వసూలుచేయడం సాధ్యంకాలేదు. కాబట్టి, ఉద్యోగస్థుల వేతనాలకై జాగీరుభూముల రాజస్వాన్ని వారికి అప్పగించడం తప్ప, వేరే మార్గం లేకపోయింది. ఈ శిస్తులను సరంజామాలు అని, వ్యవహరించిరి. ఔరంగజేబుతో సిద్ధించిన యుద్ధకాలంలో సైన్యం అత్యధికంగా, పెరిగిపోయింది.

సైన్యపు కర్చులను భరించడానికై, పరిసరప్రాంతాలపైబడి, కఠినచర్యతో ధనాన్ని

లాగకొనే పద్ధతిని అవలంబించవలసి వచ్చింది. ప్రతిసంవత్సరమూ, ఎనిమిదినెలల కాలం, తూర్పుపడమరలకు, ఉత్తరదక్షిణాలకు, దండయాత్రలు సాగించి, దోపిడిధనాన్ని సమకూర్చుకొనేవారు కాని, దీనిలోని అధికభాగాన్ని, హతవాదులైన సేనానాయకులే సంగ్రహించుకొనేవారు. పూనాలోని ప్రభుత్వకోశానికి చేరుతూఉండిన దోపిడి ద్రవ్యము, రాజస్వము, అత్యల్పం. పీష్వాలు ఎప్పుడూ అప్పులలో మునిగిఉండేవారు; ఎప్పుడూ డబ్బుకై ఎదురు చూచేవారు.

మొదటి బాజీరావు [1720-40] యుద్ధవీరుడైన పీష్వా; సైనికుడుగా ప్రఖ్యాతుడైనవాడు. కర్ణాటక ప్రాంతంలోని నైజాముపైనా, ఉత్తరదేశంలోనూ, ఇతడు దండయాత్రలు సాగించినాడు. ఈ దండయాత్రలవల్ల కీర్తి సిద్ధించింది; రాజ్యము విస్తృతమయింది. కాని, అప్పులలో మునిగిపోయినాడు. "సైనికుల వేతనాలు బాకీపడినవి. సాహుకార్లకు (Bankers) అనేక లక్షలు ఇతడు స్వయంగా రుణపడి ఉండినాడు. కాబట్టి, ఇకముందు డబ్బు ఇవ్వమని వారు నిరాకరించిరి. తన సేనా శిబిరంలో, సైనికులు మాటి మాటికీ తిరుగుబాటు చేస్తున్నారని ఈ ఉపద్రవం, తనకు వ్యథకలిగిస్తున్నదనీ, అతడు తన బాధను వ్యక్తంచేసి ఉన్నాడు." "అప్పుల వారు నాచుట్టూ మూగి నాకు నరకయాతన కలిగిస్తున్నారు. ఈ సౌకార్లను, సిల్లిదార్లను శాంతిపరచడానికై, వారి పాదాల దగ్గరవ్రాలి, నానుదుటిపై చర్మంకూడా ఊడిపోయింది." అని పీష్వా దీనంగా వ్రాసినాడు.

బాజీరావు I తర్వాత పీష్వాగా వచ్చిన బాలాజీరావు, 1740-1760 ల మధ్యకాలంలో, ఒకటిన్నరకోటి రూపాయలు రుణంచేసినాడు దీనిపై, పన్నెండు మొదలు పద్దెనిమిది శాతందాకా, వడ్డీ చెల్లించవలసివచ్చేది. 1751-52 వ సంవత్సరంలో మూడుకోట్లా అరవై ఐదు లక్షల రాజస్వం వసూలు ఐనప్పటికీ కూడా [ఇంత ఎక్కువ ఆయం, పూర్వం ఎప్పుడూ రాలేదు.] ఇతని ఉత్తరాధికారి మాధవరావ్, పీష్వాఅయ్యే నాటికి ప్రభుత్వం మాత్రం గొప్ప అప్పులోనే మునిగి ఉండింది. తన స్నేహితుడైన నానా, పురందరేకు జాబువ్రాస్తూ, బాలాజీరావు తన విత్త పరిస్థితిని బైటపెట్టి ఉన్నాడు. ఉత్తరం నుంచి, దక్షిణం నుంచి కూడా, నదీ రూపంలో బంగారం మహరాష్ట్రప్రాంతంలోనికి ప్రవహిస్తూఉన్నా, "అది మన తృష్ణను ఇంకా ఎక్కువచేస్తూనే ఉంది. శుష్కములై ఉన్న పూనా ప్రాంతాలలో ఈ బంగారు నది ప్రవహిస్తూరాగా, పూనా చేరకముందే ఇంకిపోతున్నదని నాకుతోస్తుంది." పానిపట్టు యుద్ధంవల్ల, రాజ్యకోశానికి అత్యంతమైన నష్టం సంభవించింది. ఉన్న మూలాధారాలను పొదుపుగా నడపుకోడానికి, పీష్వామాధవరావు జాగ్రత్తతో ప్రయత్నించినాడు. "ఐనప్పటికీ కోశాగారం, శూన్యమైపోయింది." నానాఫర్నవీసు పెద్దపిసినిగొట్టు. తన స్వంతానికి గొప్ప సంపదను చేర్చి పెట్టుకొన్నాడు కాని, సైన్యాన్ని పస్తుపెట్టినాడు. తత్ఫలితంగా, "అతని శవాన్ని దహన క్రియలకు కొనిపోయే సమయంలో, అతని ఇంటివద్ద కాపలా ఉన్న రక్షకభటులు, తమ వేతనాలు చెల్లించక శవాన్ని కదలించకూడదని, గలభాచేసిరి".

మాధవరావు అనంతరం [1761-72], సింధియాల అధికారం ప్రబలమై, పీష్వా ప్రభుత్వం మరుగుపడిపోయింది. కాని, విత్తసంబంధమైన వ్యవహారాలను నిర్వహించడంలో సింధియాలు కూడా పీష్వాలవలెనే భావిదృష్టిలేనివారు. పెద్దసైన్యాలను జతకూర్చుకొని, మొగల్‌సామ్రాజ్య వ్యవహారాలలో జోక్యం కలిగించుకొంటూ, కుటిలుల, కుతంత్రాలలో, పాల్గొంటూ, తాముకోరిన ద్రవ్యాన్ని ఇస్తానని మాటఇచ్చిన ప్రతివానికీ, తమ సైన్యాలను సహా-

యంగా పంపుతూవచ్చిరి. వీరి మద్దతు కోరినవారు, వాగ్దానాలను మాత్రం చాల తేలికగా చేసే వారు. వారినుంచి బాకీలను రాబట్టుకోడానికి, మళ్లీ దండయాత్రలు జరుపవలసివచ్చేది. ఈ విధంగా వసూలుచేసుకొన్న కప్పములు, సహాయకద్రవ్యాలు,- అన్నీ కర్చైపోతూవచ్చినవి. పరిపాలన మాత్రం, ఏరోజుకు ఆరోజు భత్యంతో, సాగుతూ ఉండింది.

మహద్‌జీ సింధియాయొక్క కార్యకర్త 1785లో, నానాఫర్నవీసుకు వ్రాసినదాన్ని బట్టి, ఈ విషయం రుజువయింది. "అతని అధీనంలోని ప్రాంతాలనుంచి వచ్చిన ఆదాయ మంతా పదాతిదళంపైనా, తుపాకిదళంపైనా, కర్చైపోతూఉంది. సైన్యంలోని మహరాష్ట్రి భాగమైన, అశ్వికదళం వస్తుపడుతూ ఉన్నది. వీరు, అధికసంఖ్యలో, సైన్యాన్ని వదలిపెట్టి పోతూఉన్నారు. షాహుకార్లవద్ద పెద్దమొత్తాలలో రుణంతీసుకొన్నారు. కార్యతః అందరి షాహు కార్లవద్దా- [మరాఠా, గుజరాతీ, రంగడాలు] అప్పుచేయడం జరిగింది." మరిన్నీ, లాల్‌సోట్ యుద్ధం తర్వాత (1787), సింధియా ధనసహాయార్థం, నానాను, ఒత్తిడిచేస్తూ, ఈ విధంగా వ్రాస్తాడు,- "ధనాభావంవల్ల నేను, నిస్సహాయస్థితిలో ఉన్నాను. పదిలక్షలైనా, నానా, నాకు పంపవలసి ఉంటుంది. మూలాధారాలన్నీ, నిస్సారములై పోయినవి; ఇంక ఎంతోకాలం, హిందూస్థాన్‌లో నేను ఉండజాలను."

1793లో, కారన్‌వాలిస్, ఈ విధంగా, తన, పైఅధికారులకు వ్రాసిఉన్నాడు. "మహాద్‌జీ సింధియా, ఉత్తరభారతంలో లేనందువల్ల, అతనికి రావలసిన రాజస్వం, చాల వేగంగా, క్షీణించిపోయింది. అతని సైన్యాన్ని పోషించడానికి ఆదాయం ఏమాత్రమూ చాల దంలేదు. ఎమ్. డె. బోయిన్ (M. de-Boigne) అధీనంలోఉన్న సేనాదళము యొక్క ఖర్చులకుగాను, సంవత్సరానికి ఇరవైఏడులక్షల రాజస్వఆదాయంగల జైదాద్‌జిల్లాను, ఆ అధికారిని మార్చవలసిన పరిస్థితి ఏర్పడింది. సింధియా ఆధిపత్యానికీ, భద్రతకూ కూడా, చాల అపాయకరమైన చర్య ఇది. కాబట్టి, ధనాన్ని సేకూర్చగల ఇతర ఆధారము ఏదీ లేనందువల్ల, ఈ చర్యను అతడు తీసుకోవలసి వచ్చిందని తెలుస్తుంది."

యూరోపియనుల శిక్షణలో తరిఫీదుపొందిన సైన్యాలు ఉత్తమమైనవి అనే దృఢాభి ప్రాయం సింధియాకు కలిగింది. వెంటనే, అట్టిసైన్యాన్ని సిద్ధంచేసుకోడానికి పూనుకొన్నాడు. సైనికులను సమకూర్చుకోడానికీ, వారికి తగిన శిక్షణను ఇవ్వడానికీ, ఫ్రెంచి అధికారులను పెక్కుమందిని నియోగించెను. కాని, అమితమైన ధనవ్యయంతో జరుగవలసింది ఈ కార్యం. వారి వేతనాలను సక్రమంగా ఇవ్వడానికై, తన ఇతరసేనలను వస్తు ఉంచవలసి వచ్చింది. కూలిసైనికుల నాయకులైన విదేశీయుల స్వామిభక్తి విశ్వాసాలు ఎప్పుడూ నిస్సంశయమైనవి కావు. కడపటికి, వీరు సింధియాకు ద్రోహంగావించిరి. ఇండియా సైన్యాధికారులకు ఈ విధ మైన శిక్షణ లేనందువల్ల, విడిచిపోయిన విదేశీయుల స్థానాలను పనికి రాకపోయిరి. ఇక, విత్త పరిస్థితులు అస్తవ్యస్తమై ఉన్నందువల్ల, ఖర్చులను భరించడం సాధ్యంకాలేదు.

మహరాష్ట్రుల విదేశీయ రాజనీతి, దోషములతో కూడినది. వహించడానికి సాధ్యంకాని అమిత భారాన్ని ప్రభుత్వంపై మోపింది. శివాజీకాలంలో జరిపిన ముల్క్‌గిరి అనే దాడులకు, ఏవోకొంత ఔచిత్యం ఉండింది. శత్రువుల మతాంధతకు, వారి క్రౌర్యానికీ, ఇది ప్రతి క్రియగా జరిగిందని సమర్థించవచ్చు. తమ జీవితాన్ని రక్షించుకొని నిలుపుకోడానికై, ఔరంగజేబుతో పోరాటాన్ని సాగించినంతకాలమూ, ముల్క్‌గిరిని సమర్థించడానికి వీలున్నది. కాని, పీష్వాల

కాలంలో, అది, స్పష్టమైన పరాక్రమణ ప్రవృత్తిగా ఏర్పడింది. వారు జరిపినదాడులలో, మిత్రులు శత్రువులు అనే విభేదాన్ని పాటించక, అందరినీదోచు కొన్నారు. తమ మతస్థులను కాని, రజపుత్రులతోనూ జాటులతోనూ, సన్నిహితమైత్రిని పాటించి ఉండిన, మొగల్ కులీనుల హిందూస్తానీ వర్గాన్నికాని, విడువకుండా, చిన్నా పెద్దా అనే వివక్ష లేక, అందరివద్దా కప్పము లను లాక్కొన్నారు. ఈ విధంగా, తాము విధించిన ఉద్గ్రహణాలవల్లను, జరిపిన దోపిడి చర్యలవల్లను, రజపుత్రులను, జాటులను, బుందేలులను, వీరు తమకు శత్రువులుగా చేసు కొనిరి. వారు జరిపిన ఘోరకృత్యాలు, బెంగాలు ప్రాంతాన్ని, గంగానదీ లోయప్రాంతాన్ని, భయోత్పాతంలో ముంచివేసినవి. తమ ప్రాంతానికి బాహ్యమై ఉన్న ప్రదేశాలలో, వీరు అవలంబించిన విధానం కేవలం, ప్రాణిహింసతో ఉదర పోషణ కావించుకొనే విధానమే.

తాము జయించిన ప్రదేశాలను పరిపాలించడంలో కూడా, వీరు రాజనీతిని, వివేచనను పాటించలేదు. రైతులను ఒత్తిడిపెట్టి, క్రూరమైన పద్ధతులను ఉపయోగించి, వారినుంచి డబ్బును లాక్కొన్నారు. "తాము జయించిన దేశాల పరిస్థితులను బాగుచేయడం తమకుగర్వ కారణమని, ఇతర హిందూరాజులు భావించి ఉండిరి. దేవాలయాలు, బావులు, నీటి కాలువలు, రహదార్లు, ఇతర పౌరనిర్మాణాలు,-ఇత్యాదులను వారు నిర్మించిరి. మహారాష్ట్రులు అట్టి కార్యాలు ఏవీచేయలేదు. తాము దండయాత్రలు సాగించిన దేశాలలోని సంపదను, పరిశ్రమ లను, నాశంచేయడంవల్ల, వీరు, బంగారు గ్రుడ్డును పెట్టుతున్న బాతును చంపిన అవివేకివలె, ప్రవర్తించినారు." తాను జయించిన రాజ్యాలలోని ప్రజల మనస్సులను, పీష్వా, వశపర్చుకో లేకపోయినాడు." అని, రాజ్‌వాడే, అంగీకరించినాడు. మహారాష్ట్రుల ఆదర్శాలను, ఆశయా లను, విజిత ప్రజలకు వివరించి, వారి సహాయాన్ని, ఆలంబనాన్ని సంపాదించుకోడానికి తగిన సంస్థలను, ఆప్రదేశాలలో నెలకొల్పలేదు. కన్నడిగులు, ఆంధ్రులు, గుజరాతీలు, సిక్కులు, బుందేలులు, పూర్బియాలు,- రంగాడులు,-వీరందరూ, మహారాష్ట్రులు నూతనంగా జయించిన ప్రాంతాలలోని వారు. కాని, వీరందరూ కూడా, మహారాష్ట్రులను పరదేశీయులుగానే భావించిరి. కాబట్టి, మహారాష్ట్రులకు బాహ్యశత్రువులవల్ల అపాయం ఏర్పడిన సందర్భంలో, వీరెవ్వరి సహాయమూ లభించనట్టి స్థితిని, మహారాష్ట్రులే కల్పించుకొనిరి. ఈ వెలతో ఏమైనా చేయగలంకాని, వాటిపై మాత్రం కూర్చోలేము, అనే సామెత, మహారాష్ట్రులకు, పానిపట్ యుద్ధ సందర్భంలో అర్థమయింది."

మహారాష్ట్రనాయకత్వానికి సిద్ధించిన అపజయం దేశానికి, అత్యంతమైన విపత్తుగా పరిణమించింది. పరదేశీయులకు తలుపులు తెరచి, వారి చిరకాల ఆక్రమణకు ద్వారాన్ని అప్పగించింది.

## VIII. సిక్కులు

విస్పష్టమైన లక్షణాలుకల సిక్కుజాతి ఏర్పడడం, సాంఘికమైన ఒక అద్భుత సంఘటన. భక్తి ఉద్యమం, అతి ఉచ్ఛదశలో ఉండిన కాలానికి చెందినవాడు, సిక్కుమత స్థాపకుడైన, గురునానక్. రామానంద, కబీర్, నామదేవ్, త్రిలోచన్, చైతన్య, మొదలైన మహనీయులు, మానవ ప్రేమను, ఈశ్వరభక్తిని, తీవ్రంగా ప్రచారం కావిస్తూ ఉండిన కాలము అది. ఏకేశ్వరోపాసన, గురుభక్తి, సామూహిక పూజావిధానము అనేవాటికి వీరు

ఎక్కువ ప్రాధాన్యము ఇచ్చినారు. విగ్రహారాధనను, కులవ్యవస్థను ఖండించి, హిందూ ముస్లిము మతాల మధ్యగల విభేదాలకు సమాధానం కూర్చడానికి ప్రయత్నించిరి. సకల మానవ సమానత్వ భావాన్ని బోధించి, ప్రజలలో సద్భావాన్ని, వివేచనను పెంపొందించినారు.

వీరి అభిప్రాయాలతో ఏకీభవించిన గురునానక్, అన్ని వర్గాల ప్రజలకూ, ఈ భావాలను బోధిస్తూవచ్చెను. సరళములైన అతని ప్రత్యక్షబోధనలు, విశేషప్రయోజనార్థం అర్పితమైన అతని విశుద్ధ జీవనము, నిష్కపటములైన అతని శ్రద్ధాసక్తులు, ప్రజలను ఆకర్షించినవి; అనేకులు శిష్యులుగాచేరిరి. వీరిలో హిందువులు, ముసల్మానులు కూడా కలరు. ఉన్నత వర్గాలకు చెందిన వ్యక్తులు కూడా ఇతనికి శిష్యులైరి. కాని, అత్యధిక సంఖ్యాకులైన శిష్యు లందరూ, సామాన్య ప్రజావర్గాలనుంచి వచ్చి చేరినవారే. జీవితాలను ఈశ్వరార్పితం కావించే అంతఃకరణంతో, ప్రపంచంలో పనిచేస్తూ జీవించవలసిందని, మానవకర్తవ్యమని. గురునానక్ వీరికి ఉపదేశించినాడు.

గురునానక్ యొక్క ఆచార్యపీఠం, గురుఅంగద్‌కు, అతని ఉత్తరాధికారులకూ సంక్రమించింది. గురునానక్ యొక్క సందేశాన్ని విస్తార ప్రచారంకావించి, అతని మతాను యాయుల సమూహానికి విస్పష్టమైన రూపురేఖలను కల్పించిన అసాధారణ వ్యక్తులు అనేకులు, ఈ గురుంపరలో ఉండినారు. తత్ఫలితంగా, సిక్కులు ఒక విస్పష్టమైన మతసంస్థగా ఏర్ప డిరి. ఇతర సాధువుల పంథాలను అవలంబించిన ప్రజలు, హిందూసమాజంలోని ఒక భాగం గానే నిలిచిపోయిరి; కాని, సిక్కులు ఒక విశిష్టమైన వ్యక్తిత్వాన్ని సిద్ధింపచేసుకొని, ప్రత్యేక వర్గంగా స్థిరపడిరి.

హిందూమతతత్త్వశాస్త్ర, న్యాయశాస్త్రాల లక్షణాలను అనేకములను సిక్కులు నిలుపు కొని ఉండడం వాస్తవమే. ఐనా, హిందువుల బహుముఖ దేవతావర్గాన్ని హిందువుల పవిత్ర మతగ్రంథాలను, సమాజంలో బ్రాహ్మణుల సర్వోత్కృష్ట స్థానాన్ని, వీరు అంగీకరించక, తమ ప్రత్యేక వర్గజీవిత స్వాతంత్ర్యాన్ని దృఢపరచుకొన్నారు. ఈ విధమైన అభివృద్ధిని సాధించినవారు, గురు అర్జున్, గురుహర్‌గోవింద్, గురుగోవింద్‌సింగ్,- అనే ముగ్గురు గురు వులు. తమ మతానుయాయుల జీవితాలలో సమగ్రమైన పరివర్తనం కలిగించడానికి, వీరు ఒక్కొక్కరూ తమ శక్తి సామర్థ్యాలను వినియోగించినారు. ఈ పరివర్తన ప్రక్రియను సార్థ కంగా పూర్తిచేసినవాడు, సిక్కుల కడపటిగురువు. సిక్కులను దళ్‌ఖాల్సాగా ('ఉత్కృష్ట దళం'), రూపొందించిన గురువు ఈయనే.

వైష్ణవభక్తి నిష్ఠ రహస్యోపాసనలతో ప్రారంభించి ఏర్పడిన సిక్కుజాతి, ధార్మికయుద్ధ వీరుల సమాజంగా పరివర్తనం చెందడానికి, ఎక్కువకాలం పట్టింది. కాని ఈ పరివర్తనం, అనివార్యమైనట్టిది. బాబర్, హుమాయూన్, అక్బరులు, మతవిషయంలో, సాధారణ నిష్ఠావరు లైనవారు. అస్తిమితము, అన్వేషణ శీలము ఐనట్టిది అక్బరు మనస్సు; మతవిషయంలో నూతన అభిప్రాయాలను, వినూత్న అనుభవాలను అన్వేషించడంలో, సదా, సంభ్రమానికి లోనైనట్టిది. ప్రజల మతవిశ్వాసాల విషయంలో ఉత్పన్నమయ్యే ఉద్రేకోత్సాహాలూ, సంక్షోభా, మానసిక స్వస్థతకు లక్షణములని అక్బరు భావించేవాడు.కాబట్టి, సిక్కు మతప్రచారవిషయంలో అతడు జోక్యం కలిగించుకోకపోవడం, సహజమైనదే. కాని, సిక్కుసమాజం, పరివర్తనానికి లోనౌతూవచ్చింది. అక్బరు తరువాతి చక్రవర్తులు, ఉదారభావాలు కలవారుకారు. రాజకుమారు

దైన ఖుస్రూకు ఆలంబనం ఇచ్చినాడనే అనుమానంతో జహంగీరు, గురుఅర్జునుని కారాగారంలో బంధించెను. గురుఅర్జున్ కుమారుడైన, గురుహర్‌గోవింద్ కూడా, జహంగీరు ఆగ్రహానికి గురిఐనాడు. పంజాబులోని ప్రభుత్వాధికారులతో, ఇతనికి సంఘర్షణ సిద్ధించింది. అతని నాయకత్వంలో, సిక్కులసంఖ్య అభివృద్ధిచెంది, "సామ్రాజ్యంలోనే ప్రత్యేకమైన సిక్కురాజ్యం ఏర్పడింది". ఈ రాజ్యానికి రాజకోశము, సైన్యసంస్థ కూడా, సమకూడినవి.

గురుగోవింద్‌సింగు యొక్క మంత్రిమండలిస్థాపన, ఔరంగజేబు పరిపాలన, రెండూ ఏకకాలంలో జరిగినవి. మొగలులు సిక్కులకు కలిగిస్తున్న హింస, స్వమత ధర్మ రక్షణకై, గురు తేజ్‌బహదూర్‌సింగు యొక్క ఆత్మాహుతి, గురుగోవింద్‌సింగుయొక్క మనస్సులో ద్వేషాన్ని రగులు కొల్పుతూ ఉండినవి.

మతము, రాజకీయాలు, సంయోగం పొందిన మార్గంలో నడవడానికి, తన అనుయాయులు అప్పటికే పూనుకొనిఉండిరి. అపాయకరమైన ఈ మార్గాన్ని విడువకుండా అనుసరించడానికి వీరు చేసుకొన్న ఘోరనిశ్చయానికి, ఔరంగజేబు అవలంబించిన విధానాలూ, తీసుకొన్న చర్యలూ, హేతువులుఐనవి. తమ జీవన మరణాలు ఆధారపడి ఉన్న ఈ సంఘర్షణ కాలంలో, సిక్కులసంస్థ, పరివర్తనం పొందడం తప్పనిసరి ఐనది. గురునానక్ బోధించిన మత సూత్రాలపట్ల నూతనోత్సాహాన్ని, సిక్కులలో ప్రవేశపెట్టి, సిక్కుమత సంస్థయొక్క విలక్షణ అంశాలనూ లక్షణాలనూ విస్పష్టంగా నిర్ధరించి, గురుగోవింద్‌సింగ్, సిక్కులను ధార్మిక యుద్ధానికి సిద్ధపరచెను. రహస్యోపాసనతో ప్రారంభమైన మతసంస్థ, ఈ విధంగా, ధార్మికయుద్ధోన్ముఖమైన ఖాల్సాసంస్థగా, పరివర్తనం పొందింది. సిక్కుభ్రాతృ సంఘానికి హితకరముకైన నూతన భావాలను, అభిప్రాయాలను ప్రవేశపెట్టినవాడు కూడా, గురుగోవిందసింగే. గురుసంస్థను రద్దుపరచి, గ్రంథసాహేబును గురుపీఠంలో నిలిపినాడు. గ్రంథసాహేబ్, సిక్కులకు గురువని, ఐదుగురు, సిక్కులు సమావేశమైన ప్రతిచోటా, గురువుయొక్క చిన్మయ స్వరూపసాన్నిధ్యం సిద్ధిస్తుందనీ, గురుగోవిందసింగ్ ప్రకటించెను. సిక్కు సమాజము వారందరూ, సమావేశమై, ఈ ఐదుగురినీ ఎన్నుకొంటారు. ఈ విధంగా సమస్తమైన భ్రాతృవర్గమూ (పంథ్) ఒక వ్యవస్థగా ఏర్పడి, సిక్కులకు గురుస్థానంగా, మార్గదర్శక స్థానంగా, నిలిచింది.

దురదృష్టంవల్ల, ఈ అభిప్రాయాలు సఫలంకాలేదు. గురుగోవిందసింగూ, ఔరంగజేబూ, ఇరువురూ మరణించిన తర్వాత, అంతర్యుద్ధాలతో, శత్రువుల దండయాత్రలతో, అరాజకత్వంతోకూడిన యుగం ప్రారంభమయింది. హింసాత్మకమైన సంక్షోభంయొక్క ఆవర్తంలో, పంజాబుప్రాంతం చిక్కుకొంది. సిక్కులను కూడా ఈ ఆవర్తం, తనలోకి లాగుకొంది. సామ్రాజ్యాధికారం వేగంగా క్షీణిస్తూ వచ్చింది. నాదిర్‌షా, అహమద్‌షా అబ్దాలీలు జరిపిన దండయాత్రలు, సుభిక్షమై, సంపన్నమై ఉలడిన పంజాబు ప్రాంతాన్ని, అవ్యవస్థకూ, వినాశానికీ పాల్పరచినాయి. ఈ విధమైన ధ్వంసానికి లోనైన పంజాబుప్రాంతంలో సిక్కులు మాత్రమే ఒక సంఘంగా, నిలిచిఉన్నట్టు పైకి కనబడుతూ ఉండింది. కాబట్టి, దండయాత్రా ప్రవాహం వెనుకకు మరలడంతోనే, సిక్కులు, ఖాళీగాఉండిన రాజకీయరంగాన్ని ఆక్రమించిరి.

కాని, ఇదివరకు జరిగిన సంఘర్షణల కాలంలో ఖాల్సాసంస్థయొక్క సుసంబద్ధతను

కూడా భంగం కలిగింది. వీరిని ఏకైకమైన సంస్థగా నిలుపగల అసాధారణ నాయకుడు లేక పోవడం, ఇందుకు కారణం. సిక్కుసమాజం పండ్రెండువర్గాలుగా (Misls) ఏర్పడి ఉండింది. ఈ ప్రతివర్గమూ తన రక్షణకై మాత్రమే పోరాడుతూవచ్చింది. సంకుచితమైన వర్గప్రయోజనాలకై ప్రయత్నించే అలవాటువల్ల, వీటిమధ్య పరస్పర సంఘర్షణలు సిద్ధించినవి. మతనిష్ఠ, ఆధ్యాత్మిక ఉత్కృష్టత, ఆత్మత్యాగము, సిక్కుభ్రాతృ వర్గసేవ,- ఇత్యాదుల విషయంలో, గురునానక్, గురుగోవిందసింగులు ఉత్తేజితమొనర్చిన ధార్మికోత్సాహాన్ని, అధికారవాంఛ, స్వప్రతిష్ఠ అనే స్వార్థపరభావాలు మరుగుపరచినవి. క్షుద్రమైన రాజకీయాల క్రిందపడి, సార్వజనికమైన ధర్మసంస్థ నలిగిపోయింది.

అంతట, మరొక గొప్పనాయకుడు సిక్కుసంస్థలో ఉద్భవించినాడు. కాని, సిక్కుల మనోభావాలు అప్పటికే మారిపోయిఉండినవి. రాజకీయాధికారవాంఛ, మతనిష్ఠను మరుగు పరచింది. నాయకుని మహోన్నతగుణాలు, మహారాజా రంజిత్‌సింగ్‌కు, సహజసిద్ధమైనట్టివి. ధైర్యస్థైర్యములు, యుద్ధకౌశలముగల సేనానాయకుడు, గొప్పకార్యనిర్వాహకుడు, సమర్థుడైన పరిపాలకుడు, నిపుణుడైన రాజకీయవేత్త, రంజిత్‌సింగ్. తన ఆశయాలను సాధించు కోవడంలో కనికరం చూపనివాడు; కాని క్రూరుడుకాడు. ఔదార్యము, దాతృత్వమూ, ఆదరణ, ఇతని సహజస్వభావాలు. ఆకాలానికే, అతని వర్గానికి సహజమైన దౌర్బల్యం, అతనికి కూడా సంక్రమించింది. తీవ్రమతాభినివేశం కలవాడు కాడు రంజిత్‌సింగ్; కాని, మతాధిపతులపట్ల గౌరవము, నమ్రత, కలవాడు.

చిన్నరాజ్య మండలిలో రంజిత్‌సింగ్, ఒక సర్దారు మాత్రమే. ఐనా, తనశక్తి సామర్థ్యాలతో, సట్లెజ్‌నదికి దక్షిణభాగంలో ఉన్న సిక్కుమిసల్స్ అన్నిటినీ తన పరిపాలనకు అధీనమైనవిగా చేసినాడు. ఆపిమ్మట, సమయోచితంగా యుద్ధచర్యను, రాజనీతిని ప్రయోగించి, విస్తారమైన భూభాగాన్ని, వశం కావించుకొన్నాడు. సింధునదికి అవతల ఉన్న పెషావర్, ముల్టాన్, కాశ్మీర్, కంగ్రా, పరిసర పర్వత రాజ్యాలు, సరిహద్దు ప్రాంతంలోని, జనజాతి ప్రదేశాలు,-ఇవన్నీ, అతని పరిపాలన క్రిందికి వచ్చినవి.

సైన్యవ్యవస్థకు, నూతన పద్ధతులలో, రూపాంతరం కలిగించడం, వ్యవస్థాపకుడుగా అతడు సాధించిన ముఖ్యకార్యం. ఒక అనియత అశ్విక దళానికి నాయకుడుగా, రాజకీయ జీవితయాత్రను ప్రారంభించినాడు. కాని, క్రమంగా ఒక గొప్ప సైన్యాన్ని నిర్మించుకొన్నాడు. యూరోపువారి పద్ధతిపై కూర్చబడిన ఒక పదాతిదళము, సమగ్ర ఆయుధ పరికరాలతో కూడిన ఒక ఫిరంగి దళము, ఒక నియతమైన అశ్వికదళము, ఇతని సేనా బలంగా ఏర్పడింది. ఏషియాలోని శత్రురాజ్యాల అన్నిటిలోనూ, ఎక్కువశక్తివంతమైన యుద్ధసాధనగా ఈసేనా బలం ఏర్పడింది.

సైన్యవ్యవస్థను ఏర్పరచడంలో, ఇతడు ఒక ముఖ్య విషయాన్ని గమనించలేదు. రాజ్యానికి ఒక సాధనం మాత్రమే సైన్యం. అట్లుకాక, దానికి ప్రాధాన్యం ఏర్పడినట్లయితే రాజ్యవ్యవస్థకే ముప్పుకలుగుతుంది, అనే విషయం ఇతడు గ్రహించలేదు. పౌరపరిపాలన విషయంలో కూడా, రంజిత్‌సింగ్, తగిన శ్రద్ధవహించలేదు. విత్త విషయంలో అతడు కావించిన ఏర్పాట్లు, చాలప్రాకృత స్థితికి చెందినవి. శివిల్, క్రిమినల్, న్యాయ పరిపాలనను

అతడు, సర్దారులకు అప్పగించినాడు.

పంజాబులో నెలకొని ఉండిన అవ్యవస్థ స్థితిలో నుంచి, వ్యవస్థితమైన ప్రభుత్వాకారాన్ని సృష్టికి తెచ్చి ఉండడం, రంజిత్‌సింగు సాధించిన ఘనకార్యం. అతనికి ప్రతిష్ఠ కలిగించిన విషయమిది. దురదృష్టవశాత్తూ, అతడు స్థాపించిన రాజ్యముయొక్క పునాదులు దుర్బలములైనట్టివి. అతని రాజ్యం, సిక్కుమతముయొక్క ఆధారంపై ఏర్పడిందని చెప్పడానికి వీలులేదు. సిక్కు మతస్థులందరూ, ఏకగ్రీవంగా అంగీకరించి, భాగస్థులుగా నెలకొల్పిన రాజ్యముకాదు, ఇది. సట్లెజ్ నదికి అవతలఉన్న సిక్కువర్గాలు (Misls), బలవంతంపై ఈ రాజ్యంలో చేరినవి. సట్లెజుకు ఈ ప్రక్కఉన్న వర్గాలు, ఇతని ఆధిపత్యానికి ఒప్పుకోలేదు. వాస్తవానికి, ఈ వర్గాలు బ్రిటిషువారి ఆధిపత్యాన్ని అంగీకరించినవి. రంజిత్‌సింగుకు లొంగిపోయిన సిక్కువర్గాల భక్తివిశ్వాసాలు కూడా, హృదయపూర్వకమైనవికావు, అనేది ఫలితార్థం.

వివిధ మతాలవారిని తన సేవలో చేర్చుకోడానికి, రంజిత్‌సింగ్ ప్రయత్నించినాడు. హిందూ, ముస్లిం, సిక్కు, అధికారులు ఎక్కువ బాధ్యతతో కూడిన పదవులలో, నియమించబడిరి. మత విచక్ష, అనేది లేక, అందరినీ రంజిత్‌సింగు, తన విశ్వాసానికి పాత్రులుగా చేసెను. కాని, భక్తివిశ్వాసాలతో, అత్యభిమానంతోవారు రంజిత్‌సింగును వైయక్తికంగా సేవించినారు; కాని. రాజ్యంపట్ల వారందరికీ ఏవిధమైన అభిమాన బంధనాలూ ఏర్పడలేదు. అతని అధికారానికి ప్రధానాధారమైన సైన్యంలో, హిందూవులు, ముస్లిములు, సిక్కులు కూడా, సైనికస్థానాలలోనూ, అధికార స్థానాలలోనూ, నియోగించబడిఉండిరి. యూరోపియన్ సేనానాయకులూ, హిందూముస్లిం సేనానాయకులూ, అందరూ కూడా, యుద్ధాల్లో తమ శక్తిసామర్థ్యాలను ప్రదర్శించినారు. కాని, వారు ఈ విధంగా పోరాడింది వ్యక్తిగతంగా, రంజిత్‌సింగు కొరకేకాని, మతము, జాతి, దేశము, అనేవాటిని ఉద్దేశించికాదు.

రంజిత్‌సింగు వంశము, చాలకాలం పంజాబుపై పరిపాలనసాగించి ఉండేదేకాని, దురదృష్టవశాత్తూ, అతని కుమారులలోకాని, మనుమలలోకాని, అతని సుగుణాలుకల వ్యక్తి ఒక్కడూ, లేకపోయినాడు. అంతేకాక, ఇండియాలో బ్రిటిషురాజ్యం ఏర్పడడంవల్ల, రాజకీయపరిస్థితులు పూర్తిగా తారుమారైపోయి ఉండినవి. రంజిత్‌సింగ్ కాలంలోనే, బ్రిటిష్‌వారు పంజాబుచుట్టూ, రక్షక ఆవరణాన్నీ, పారాతాణాలనూ ఏర్పరచుకొని ఉండిరి. సట్లెజ్‌నదిని దాటి, అతడు రాజ్యాన్ని విస్తరించుకోకూడదని. అడ్డుపెట్టి ఉండిరి. సింధుప్రాంతాన్ని ఆక్రమించి, బ్రిటీషువారు, ఆఫ్గనిస్తాన్‌వైపు తమ పలుకుబడిని వ్యాపింపచేస్తూ ఉండిరి. ఇండియా పశ్చిమోత్తర ప్రాంతాలను వేగంగా సమీపిస్తున్న రష్యాతో బ్రిటిషువారికి ఏర్పడిన స్పర్థవల్ల, పంజాబులోని స్వతంత్రరాజ్యానికి కష్టాలు కలుగకపోవు. కొంతకాలం తర్వాత, ఆఫ్గనిస్తానుకు అట్టిగతేపట్టింది. కాబట్టి, ఇట్టిపరిస్థితులలో రంజిత్‌సింగ్ రాజ్యానికి, ఉత్తరాధికారులైనవారు స్వతంత్రులై చాలకాలం ఉండియుండడం కూడా సంశయాస్పదమైనదే. సిక్కులకు బ్రిటిష్‌వారితో యుద్ధం, అనివార్యమయింది. విభిన్నజాతుల ప్రజావర్గంతోకూడిన, సర్వతంత్ర స్వతంత్రుడైన ఒకరాజుకూ, జాతీయభావమూ, దేశభక్తీ అనేవాటితో ఐక్యసంస్థగా ఏర్పడి ప్రజల ఆలంబనంకల, ఒక బలవత్తరమైన ఆధునిక ప్రభుత్వానికీ, జరిగిన యుద్ధపరిణామము, ఎట్టిది, అనేవిషయంలో సందేహానికి, ఏ మాత్రమూ ఆస్పదం ఉండదు.

పంజాబు సింహం [రంజిత్‌సింగ్] మరణించిన తర్వాత జరిగిన ఆంగ్ల-సిక్కు యుద్ధాలలో ఈ విషయం, బాగా స్పష్టమయింది. రంజిత్‌సింగ్ నిర్మించిన గంభీరరాజ్యసౌధం, కనుమూసి తెరచునంతలో శిథిలమై మట్టిలో కలిసిపోయింది. అనిశ్చితమైన కొన్ని యుద్ధాలు జరిగినవి; కాని, బ్రిటిషుసైన్యాన్ని ఎదిరించి, సుస్థిరంగా నిలిచే సామర్థ్యం సిక్కు-సైన్య వ్యవస్థకు లేకపోయింది. సిక్కు-సైన్యంలో శౌర్య సాహసాలకు లోపం కలుగలేదు. సైనికులు మహావీరులవలె పోరాడినారు. కాని, సైన్యాధికారులు స్వార్థపరులై, లంచాలకు అమ్ముడుపోయినారు. ఈర్ష్యాపరులై, స్వప్రయోజనపరులై, ద్రోహభావంతో ప్రవర్తించి, సిక్కు-సైన్యంలోని అధికారులు అత్యుత్కృష్టమైన సిక్కు-సేనను భగ్నంచేసి, నశింపచేసిరి.

సిక్కు-రాజత్వమునకు సంబంధించిన ఉపాఖ్యానంవల్ల, పెక్కు-హితకరములైన గుణపాఠాలను గ్రహించవచ్చు. శక్తివంతమైనశీల సామర్థ్యములుగల, యోగ్యులైన నాయకులకు, భారతదేశంలో ఎప్పుడూ కొరతలేదు, అనే విషయం దీనివల్ల స్పష్టమయింది. శక్తిసామర్థ్యాలు, ఉత్కృష్టత అనే గుణాలు, ఏవర్గానికీ ఏకస్వామ్యములుకావు, అనే విషయం స్పష్టంకావడం, రెండవది. రంజిత్‌సింగుయొక్క రాజాస్థానాన్ని అలంకరించిన ప్రతిభావంతులు, ప్రపంచములోని ఏభాగంలోని, ఏప్రభుత్వాన్నైనా, తేజోవంతంగా చేయగలిగినవారు. సమాజంలోని అతినిమ్న స్తరాల నుంచీ, ఉన్నత స్తరాల నుంచీ కూడా వచ్చిన వ్యక్తులు, వీరిలోకలరు. బ్రాహ్మణులు, రజపుత్రులు, జాటులు, ఖత్రీలు, గుజార్లు, ముసల్మానులు, అంగడివాళ్ళ కుమారులు, ఖద్మత్‌గార్లు, హీనవృత్తిలో ఉన్న సేవకులు, మాత్రమేకాక, సంపన్నుల సంతతివారు, రాజవంశీయులు కూడా, రంజిత్‌సింగ్ ఆస్థానాన్ని అలంకరించి ఉండిరి.

సిక్కులు, మహారాష్ట్రులు, మొగలులు,- వీరందరూ, పతనమై పోవడానికి కారణం, శక్తిసామర్థ్యాలుగల వ్యక్తులు లేకపోవడంకాదు. వ్యక్తియొక్క శక్తిసామర్థ్యాలను, సమాజ సర్వస్వంయొక్క సేవకు, శ్రేయస్సుకు, అధీనపరచి, మానవుని ప్రకృతిలో ఉన్న ప్రత్యేకతను సర్వవ్యాపకంగానూ, నశ్వరత్వాన్ని శాశ్వతంగానూచేసే మహదాశయం లేకపోవడమే, హేతువు. సమాజంలో ప్రముఖులైనవారు, ఈ విషయంలో తమకర్తవ్యాన్ని నిర్వహించలేదు.

పద్ధెనిమిదోశతాబ్దపు మధ్యకాలానికి, ప్రళయోత్పాత పరిస్థితులు వేగంగా దేశంలో ఏర్పడుతూ వచ్చినవి. ఇండియాలోని వివిధప్రాంతాల రాజులను, ప్రజలను, ఏకైకమైన రాజకీయ వ్యవస్థలో రెండువందల సంవత్సరకాలం, సంయోజనపరచి ఉంచిన మొగల్ సామ్రాజ్యం, ఒకేసారి రెండు విఘటనశక్తుల ప్రాబల్యానికి లోనైనది. అంతరచ్ఛిద్రాలు, పశ్చిమోత్తర ప్రాంతంనుంచి జరిగే దండయాత్రలు,- ఈ రెండూ ఒక్కసారిగా సామ్రాజ్యానికి ఒత్తిడి కలిగించినవి. కేంద్రాధిపత్యం క్షీణించడంతో, రాజకీయ సంయోజనం భగ్నమైపోయి, దుష్టమైన ప్రత్యేకతాభావం దేశంలో తలఎత్తింది. అంతేకాక, దుష్టప్రవర్తన, నైతిక భ్రష్టత సర్వసాధారణమై వ్యాపిస్తూవచ్చినవి. సమాజంపట్లా, ప్రభుత్వంపట్లా, ప్రజలభక్తి. విశ్వాసాలు సడలిపోయినవి. అహంభావము, అధికార సంపదలకై దురాశా, ప్రబలములై, సామాజిక జీవితముయొక్క పునాదులను కదిలించివేసినవి. వెంటనే ప్రాప్తించే స్వార్థలాభానికై, వ్యక్తులు గుడ్డివారివలె ప్రాకులాడడం ప్రారంభించినారు. వివేచనజ్ఞానము, దూరదృష్టి, వీరిని పూర్తిగా వదలివేసినవి. కనుకనే, తాము అవలంబిస్తున్న విధానాల సద్యఃపరిణామాలు ఎట్టివి, అనే పరిజ్ఞానం పూర్తిగా లోపించింది; ఎవరు తమకు వాస్తవంగా శత్రువులు, ఎవరు

నిజమైన మిత్రులు అనే విషయకు దూరులైపోయినారు. భవిష్యత్తు ప్రేరణపుబట్టైతె వీరు ఆత్మ వినాశానికి అభిముఖంగా నడుస్తున్నట్లు గోచరిస్తుంది.

మొగల్‌సామ్రాజ్యం పతనంవల్ల, అన్నివర్గాలవారూ కష్టాలకు గురిఐనారు. అధికారుల పీడనవల్లను, గుత్తవ్యవసాయిదారుల దౌర్జన్యాలవల్లను, రైతులు నలిగిపోయిరి. తమ ఆశ్రయ దాతలు ఆర్థికకష్టాలకు లోనైనందువల్ల, ఆదరించేవారు లేక, వృత్తికార్మికులు చిక్కుల పాలైరి. పంజాబులో అవ్యవస్థపరిస్థితులు ఏర్పడడంవల్ల, వర్తకసార్థవాహుల భూమార్గాలు నిరోధింపబడినవి. సముద్రంపై ఆధిపత్యాన్ని సాధించుకోడానికై, పరస్పరం పోరాడుతున్న, యూరోపురాజ్యాల, నావికాదళాలతో, ఇండియా సముద్రమార్గాలు కట్టుబడిపోయినవి. సరకుల రవాణాసాగిస్తున్న నెపంతో, ఈ నావికాదళాలు, వర్తకనావలను దోచుకోడానికీ, దకాయితీలకూ, పూనుకొన్నవి. ఈ విధంగా, ఇండియాను ఇతరదేశాలతో కలిపే భూమార్గ సముద్ర మార్గాలు రెండూ కట్టుబడిపోవడంవల్ల, ఇండియా వర్తకులూ, వృత్తికార్మికులూ కూడా దెబ్బ తిన్నారు. విదేశవ్యాపారం, ఇండియావర్తకుల చేతులలో నుండి జారిపోయింది. అంతర్యుద్ధాల వల్లను, కులీన వర్గాలవారు దరిద్రస్థితికి రావడంవల్లను, అంతర్దేశీయ వ్యాపారం కుంటు పడింది.

# 4
# పద్ధెనిమిదో శతాబ్దంలోని ఆర్థిక పరిస్థితులు

మధ్యయుగాల అనంతరపు యూరోపుయొక్క ఆర్థిక వ్యవస్థను, వర్తకవిస్తృతి సూచిస్తుంది. పట్టణాలలో పరిశ్రమలు అభివృద్ధిచెంది వ్యాపారానికి ప్రోద్బలం కలిగించినాయి. ఆర్థిక రాజకీయరంగాల్లో, ఎక్కువ ప్రాముఖ్యం వహిస్తూవచ్చిన ఒక నూతన సమాజవర్గం, సృష్టికివచ్చింది. ఇది మధ్యమ తరగతి సమాజం. భూస్వామ్య వ్యవస్థలోని కులీన వర్గము నుంచి కాని, కృషకదాస వర్గము నుంచి కాని, ఏర్పడిందికాదు. ఈమధ్యమ తరగతి. ఈ తరగతి ఉత్పన్నం కావడంవల్ల, భూస్వామ్య వ్యవస్థ నెలకొని ఉండిన యూరోపుయొక్క స్వరూపమే మారిపోయింది. జాతీయ రాజ్యాలు ఏర్పడడానికి కారకములైన, సాంఘిక శక్తుల ప్రవృత్తికి కూడా, ఇదే కారణమయింది. ఈ విధంగా, పట్టణాలలో అభివృద్ధికి వచ్చిన మధ్యమ తరగతుల ద్వారా, యూరోపులోని సామాజిక విప్లవం సాధింపబడింది.

*పట్టణాలు వాటిలోని వ్యాపారము, పరిశ్రమలు :* ఇండియాలోని పరిస్థితులు, దీనికి భిన్నమైనట్టివి. జీవనానికి మాత్రమే తగినంత వ్యవసాయంతో, స్వయంపోషక సమర్థమై ఉన్న ఇండియా గ్రామాల ఆర్థికస్థితికి, మధ్యయుగాల యూరోపులోని వ్యవసాయ పద్ధతికి, సమానములైన లక్షణాలు కొన్ని ఉన్నప్పటికీ, పట్టణాలస్థితి మాత్రం పూర్తిగా భిన్నమైనది. ఇండియాలోని పట్టణాలలోను, నగరాలలోను, వ్యాపార పరిశ్రమలు ఏర్పడిన పద్ధతులకు, యూరోపు పట్టణాలలోని పద్ధతులకు, బాహ్యరూపమైన సాదృశ్యం కూడా, ఏ మాత్రమూ లేదు. ఇండియాలో పట్టణాలకు కొరతలేదు. కాని ప్రత్యేకంగా పరిశ్రమలపైనా, వ్యాపారంపైనా ఆధారపడి జీవిస్తున్న పట్టణాలు, కొన్ని మాత్రమే.

ఈ పట్టణాలలోని జన సంఖ్యాభివృద్ధినిబట్టి, అచ్చటి పరిశ్రమలు, వ్యాపారము, వృద్ధి చెందుతూవచ్చినవి. యూరోపులోని పట్టణాలలో, ఆర్థిక వ్యవహారాలకు ప్రాబల్యం ఏర్పడిఉండగా, ఇండియా పట్టణాలలోని పౌరజీవితంపై ఆర్థిక వ్యవహారాలకు ప్రాధాన్యం సిద్ధించలేదు. ఇండియాలోని వర్తకవర్గంవారి స్వభావము, వృత్తి ధర్మాలు, ఆశయాలు, యూరోపు మధ్యమ తరగతులవారి స్వభావాదులతో, పూర్తిగా విభిన్నమైనవి. పద్దెనిమిది పంతొమ్మిదో శతాబ్దాలలో, పాశ్చాత్యదేశాల మధ్యమ తరగతులవారు, పరిశ్రమల అభివృద్ధి విషయంలోనూ, రాజకీయ వ్యవహారాలలోనూ, తమ పలుకుబడిని ఉపయోగించుకొన్నారు. ఇండియాలోని వర్తకసంఘం, ఈ విషయాలలో, ఏ విధంగానూ పాల్గొనలేదు. కాబట్టి, ఇండియాలో పారిశ్రామిక విప్లవం జరగడానికి అవకాశమే లేకపోయింది; సర్వసత్తాకమైన జాతీయ రాజ్య పరిణామానికి కూడా వీలులేక పోయింది. సాహసోద్యమాలకు పూనుకొనే చైతన్యవంతమైన పారిశ్రామిక వర్గం కూడా, ఇండియావర్తక సమాజము నుంచి ఉత్పన్నంకాలేదు.

అక్బర్ పరిపాలనకులోనై ఉండిన ప్రదేశంలో, 120 నగరాలు, 1,200 పట్టణాలూ ఉండినట్లు, అంచనా లెక్కనుబట్టి తెలుస్తుంది. 5 లక్షలు మొదలు 6.6 లక్షల దాకా ఉండిన ఆగ్రానగర జనాభా, ఆకాలపు లండన్ నగర జనాభా కంటె పెద్దది. పారిస్‌నగర జనాభాకు ఢిల్లీనగరంలోని జనాభా, కొంతపెద్దది కావచ్చు. అహమదాబాద్ జనాభా, లండనుతో చాల వరకు సమానమైనది. యూరోపులోని ఏ నగరానికి కూడా తీసిపోనిది లాహోర్‌నగరం. పాట్నానగరంయొక్క జనాభా, సుమారు రెండు లక్షలు. కాని ఇంత విస్తారమైన జనాభా ఉన్నప్పటికీ కూడా, ఈ నగరాలు యూరోపు నగరాలకు సాటి ఐనవికావు. యూరోపు నగరాలలోను, పట్టణాలలోను, వర్తక సంఘాలు స్థాపించిన స్వతంత్ర సంస్థలవంటి సంస్థలు, ఇండియాలో లేకపోవడమే ఇందుకు ముఖ్యకారణం. పద్దెనిమిదో శతాబ్దంలో జరిగిన యుద్ధాలు, దండయాత్రలు, ఇతరవిపత్తులు, దేశాన్ని నాశం కావించినవి. ఉత్తరభారతంలో లాహోర్, ఢిల్లీ, ఆగ్రా, మథురా, వంటి నగరాలు దక్కనులోని విస్తారమైన దేశభాగాలు, ధ్వంసం కావింపబడినవి. యూరోపుదేశాల వర్తకులు, ఇండియా సముద్ర తీరాలకు రావడంతో, ఈ విపత్తువల్ల కలిగిన నష్టాన్ని కొంతవరకు సరిదిద్దుకోడానికి సాధ్యమయింది. ఇండియాలో తయారైన వస్తువులను, ఈ వర్తకులుకొని వాటికి బదులుగా వెండి బంగారాలను ఇస్తూ వచ్చిరి. ఈ వ్యాపారం పరిశ్రమలకు ప్రోద్బలం కలిగించింది.

ఉన్నత వర్గాలవారి అవసరాలను తీర్చడానికై, అభివృద్ధికి వచ్చిన కళలు, వృత్తి విద్యలు ప్రత్యేకంగా పట్టణాలకు సంబంధించిన పరిశ్రమలుకావు. శ్రీమంతుల అవశ్యకాలకు సంబంధించిన పరిశ్రమలు, పట్టణాలలోను గ్రామాలలోను కూడా బాగుగా వికాసాన్ని పొందినవి. శ్రేష్ఠములైన వస్తువులను తయారుచేసే నైపుణ్యం అభివృద్ధికి వచ్చింది. ఈ వస్తువులను తయారుచేయడంలో, వేర్వేరు వర్గాలవారు విస్పష్టమైన వేర్వేరు ప్రక్రియలను అనుసరిస్తూ, ఇతర ప్రక్రియలను అనుసరించే వర్గాలవారి సహకారంతో, పరిణత వస్తువును తయారుచేసేవారు. ఇందుకు నిదర్శనంగా, నూలు వస్త్రాలను తయారుచేయడంలో, దూదిని వడికి పింజలు కట్టడము, నూలు వడకడము, గుడ్డలునేయడము, చలవచేయడము, రంగులు వేయడము, అచ్చువేయడము, మొదలైన వేర్వేరు పనులను, వేర్వేరు వర్గాలవారుచేసేవారు. ప్రత్యేకములైన గ్రామాల్లోను, పట్టణాల్లోను, కొన్ని పరిశ్రమలు స్థానికములై ఏర్పడి ఉండడం, పారిశ్రామిక విశిష్టతకు సంబంధించిన మరొక పద్ధతి. వేర్వేరు లోహాలతో పనిచేసేవారు, నగరంలోని వేర్వేరు భాగాలలో నెలకొని ఉండిరి. వజ్రంగులు, రత్నాలసొమ్ములు చేసేవారు, కంసాలులు, గానుగవాండ్లు, మొదలైనవారు, వారి వారికి ప్రత్యేకములైన వీధులలోచేరి ఉండేవారు. కొన్ని గ్రామాలలో చీటీగుడ్డలు తయారయ్యేవి. కొన్నిట్లో, రవ శల్లాలు (Muslins), కొన్నిట్లో తలపాగాలు, ఈ విధంగా వేర్వేరు వస్తువులకు వేర్వేరు గ్రామాలు ప్రసిద్ధిచెందినవి. బుటేదారీ చేసినవస్త్రాలు [కిం-ఖ్వాబ్], పట్టువస్త్రాలు, వెండిబంగారు జరీ చేసినవస్త్రాలు,- కొన్ని ప్రదేశాలకు విశిష్టములైన పరిశ్రమలు.

విశిష్టవస్తువులను తయారుచేయడంలో, సహజంగా నైపుణ్యం, అభివృద్ధి ఔతుంది. ఇండియాలోని వృత్తికార్మికులు ప్రపంచంలో మరెచ్చటా లేనట్టి నైపుణ్యాన్ని, కౌశలాన్ని, సాధించినారు. పరిశ్రమలను వ్యవస్థీకరించడంలోనూ, వాటి కౌశలంలోనూ, కూడా, ఇండియా పాశ్చాత్యదేశాలకంటె ఎక్కువ అభివృద్ధిదశలో ఉండినది. ఇండియా పరిశ్రమలలో ఉత్పన్న

మైన వస్తువులు, ఏషియా, ఆఫ్రికాదేశాల ఆవశ్యకాలను తీర్చడమేకాక, యూరోపుదేశాల బజారులలో కూడా ఎక్కువగా అమ్ముడుబోయేవి. సముద్రమార్గాలద్వారా, భూమార్గాల ద్వారా, ఈ వస్తువులు పాశ్చాత్యదేశాలను చేరుతూ ఉండినవి.

తూర్పుదేశాల వస్తువులను సరఫరాచేస్తున్న ఇండియావర్తకులు పర్షియా సముద్రతీరం లోను, ఎర్రసముద్రతీరంలోను ఉన్న రేవుపట్టణాలన్నిటిలోనూ ప్రసిద్ధులై, అక్కడ తమ వర్తకస్థానాలను స్థాపించుకొని ఉండిరి. ఆఫ్ఘనిస్థాన్, మధ్యఏషియా ప్రాంతాలలోని కాంధహార్, కాబూల్, బాల్ఖ్, కాష్ఘర్, మొదలైన పట్టణాలలోనూ; ఇరానుదేశములోని షిరాజ్, ఇస్ఫహాన్, రే, మేషేద్‌పట్టణాలలోనూ, రష్యాలోని బాకూ, అస్త్రఖాన్, నిజ్నీనోవోగోరాడ్, మొదలైన పట్టణాలలోనూ, ఈ వర్తకులు అధికసంఖ్యలో ఉండినారు. రష్యా చక్రవర్తియైన, పీటర్ మహాశయుడు (Peter the great) చెప్పినవిధంగా, "ఇండియాదేశ వాణిజ్యమే ప్రపంచవాణిజ్యము, ...... దానిని ప్రత్యేకంగా తన అధీనంలో నిలుపుకోగలిగినవాడు యూరోపుఖండానికి నియంత ఔతాడు".

బర్మా, మలయా, ఇండొనీషియా, చైనా, జపాన్, వంటి తూర్పు ఏషియాదేశాల లోనికి కూడా, ఇండియావస్తువులు ప్రవేశించినవి. కోరోమాండల్ సముద్రతీరము, బెంగాలు, వాటిని, సరఫరాచేసే కేంద్రాలు.

*పారిశ్రామిక వ్యవస్థ :* రెండువిధములైన ఆవశ్యకాలను, ఇండియాపరిశ్రమలు తీర్చవలసి ఉండినవి. సామాన్యప్రజల అవసరాలకు సంబంధించిన పరిశ్రమలు, ఒక విధమైనవి. జనాభాలోని అత్యధికభాగం గ్రామసీమల్లో నివసించేవారు. వీరి అవసరాలు ఒక విధమైనవి. సమాజంలోని ఉన్నత స్తరాలవారి ఆవశ్యకాలు వేరు.

గ్రామసీమల ప్రజానీకానికి కావలసిన వస్తువులను తయారుచేసి, సరఫరాచేసే పారిశ్రామిక వ్యవస్థ, చాల ప్రాథమిక దశలోని పద్ధతులపై ఏర్పడినట్టిది. ఈ పరిశ్రమలకు చెందిన వృత్తికార్మికులు, సంవత్సరంలో కొంతకాలం, సేద్యములో నిమగ్నులై ఉండేవారు. వారు తయారుచేసే వస్తువులకుగల గిరాకీతక్కువ. సంవత్సరమంతా పని చేయవలసినంత అవసరంలేదు. అంతేకాక, ఒక వస్తువుకు బదులుగా మరొకవస్తువును ఇచ్చి తీసుకొనేపద్ధతి,- వినియమపద్ధతి - ఆచారాన్నిబట్టి ఏర్పడింది. ఒకొక రైతుయొక్క వ్యవసాయక్షేత్రానికి కట్టుబడిఉన్న వృత్తికార్మికులకు ప్రతిఫలంగా, సంవత్సరం పంటలో ఒక భాగం నియమితమై ఉండినది. పూర్వాచారాన్ని అనుసరించి ఈ భాగం నియమితమైనదేకాని, బజారుయొక్క ఆవశ్యక సరఫరా పరిస్థితుల ప్రాబల్యాన్నిబట్టికాదు.

ఉన్నత వర్గాలవారైన భూస్వాములకూ, సంపన్నులైన వర్తకులకూ ఆవశ్యకములైనవి, భోగవిలాసవస్తువులు. ఈ వస్తువులు అధికపరిమాణంలో కావలసి ఉండినవి. సంపన్నులైనవారు, అల్ప సంఖ్యాకులే ఐనప్పటికీ, ఉత్తమ వస్తువులను ఆశించేవారు. తమ ఉపయోగార్థమేకాక, వాటిని తమ ఇండ్లలో ప్రదర్శనార్థం అలంకరించడానికై, ఎక్కువ వెలగల సున్నితమైన పనితనంకల వస్తువులను కోరేవారు. ఇట్టి వస్తువులు విదేశాలలో కూడా ఆవశ్యకమైనవి. కాబట్టి, వీటిని భారతదేశ వర్తకులు అధిక పరిమాణంలో ఎగుమతి చేసేవారు.

ఇటువంటి సున్నితమైన విలాసవస్తువులను వృత్తికార్మికులు, తమ గృహములలోకాని,

లేదా, పట్టణాలలోని ప్రభుత్వ కార్ఖానాలలోకాని, తయారుచేసేవారు. ప్రత్యేకమైన తమ వృత్తులలో విశిష్ట నైపుణ్యాన్ని సాధించుకొన్న గ్రామీణ వృత్తికార్మికులు, తమ గ్రామాలలోనే నివసిస్తూ, ఈ వస్తువులను పైవారికి సరఫరా చేసేవారు.

ఇండియా వృత్తికార్మికుల వ్యవస్థ, యూరోపులోని వృత్తికార్మికవ్యవస్థవలె, సమర్థమైనది కాదు. సువ్యవస్థితమైన వృత్తికార్మిక సంస్థలు ఇండియాలో ఏర్పడి ఉండేవని అనడానికి, గుజరాతు ప్రాంతము ఒక్కటే సాక్ష్యంగా కనబడుతుంది. ఒక వృత్తిలో ప్రవేశించదలచుకొన్న యువకులకు, ఆ వృత్తిలో పరిణతుడైన వృత్తికార్మికుడు, శిక్షణను ఇచ్చేవాడు. ఆనువంశీయంగా సంక్రమించి వచ్చేది వృత్తివిద్య; వృత్తికార్మికుడు ఒక ప్రత్యేక కులానికి చెందినవాడు. కాబట్టి, వృత్తి సంస్థలు కులాధిపత్యాన్ని అతిక్రమించలేదు. వాస్తవ పరిస్థితుల ప్రకారం, వృత్తికి సంబంధించిన సమస్త వ్యవహారాలూ పంచాయతీ సభవిచారణకూ, ఆ కులముయొక్క చౌదరీ విచారణకూ వచ్చేవి. యూరోపులోని వృత్తికార్మిక సంస్థలు నిర్వహిస్తూ ఉండిన పరిపాలన ధర్మాలను, ఇండియాలో ఆయావృత్తులకు సంబంధించిన కులాలు నిర్వహిస్తూ ఉండినవి.

పై గ్రామాలలోని వృత్తికార్మికులకు పనిని అప్పగించి, వస్తువులను తయారుచేయించే పద్ధతి, మధ్యయుగాల యూరోపు పారిశ్రామికవ్యవస్థలోని ఒకభాగం. ఆ పద్ధతి ఇండియాలో కూడా అభివృద్ధిచెందింది. వృత్తికార్మికులందరూ, చాలవరకు, బీదవారే, కాబట్టి, దాదనీవర్తకులవద్ద, సంచకారం పుచ్చుకొని, వారికై వస్తువులను తయారుచేయవలసి వచ్చింది. దళాలులద్వారా కాని, లేక, గోమాస్తాలు అనే కార్యకాములద్వారా కాని, వర్తకులు ఈ వృత్తికార్మికులచే పనిచేయించేవారు. ముడిసరకులకు, సాధనపరికరాలకు, డబ్బును, వర్తకుడే ఇచ్చేవాడు. తయారుచేసి, సరఫరాచేసిన వస్తువులకుగాను, కూలీని ముందుగా ఇచ్చేవారు. ఒప్పందంచేసుకొన్న వస్తువులను పూర్తిగా అప్పగించి, వాటిపై వర్తకుని ముద్రపడేవరకూ, వృత్తికార్మికులు వర్తకుని ఆధీనంలో ఉండి, పనిచేయవలసిందే. తయారైన వస్తువులను సేకరించుకొని, మధ్యస్థులు, బజారుకుపంపేవారు. కొన్ని సమయాల్లో, ఉన్నతవర్గంవారు, వృత్తికార్మికులతో స్వయంగా వస్తువులను చేయించుకొనేవారు. దరిద్రులైన ఈ వృత్తికార్మికులను పీడించడానికి ఇది అవకాశాన్ని కలిగించింది.

రాజధానీనగరాలలోని కార్ఖానాలు ఉత్తమ పద్ధతిలో వ్యవస్థీకరింపబడి ఉండేవి. వేర్వేరుపనులుచేసే కార్మికులు ప్రత్యేకంగా, విశాలమునైన భవంతులలో పనిచేస్తూ ఉండిరని, బెర్నియర్ తెలిపియున్నాడు. మాలికుల (యజమానులు) నిర్దేశాన్ని అనుసరించి, దరోఘాల (Superintendents) పర్యవేక్షణలో, ఈ కార్మికులు తమ పనులను సాగించేవారు. పరిపాలకులైన వారు,-రాజులు, గవర్నర్లు,-ఈ కార్ఖానాలలో ఎక్కువ శ్రద్ధ వహించి, స్వయంగా ఆదరణ పోషణలను కల్పించి, వాటిని నడిపేవారు. వృత్తికర్మలో అభివృద్ధికిరాగల నైపుణ్యం ప్రదర్శించిన కార్మికులకు బహుమతులిచ్చి, ప్రోత్సహించేవారు. తయారైన వస్తువులు శ్రేష్ఠమైనవిగా ఉండడానికి తగిన సదుపాయాలను కలిగించి, కార్మికులకు తోడ్పడేవారు.

ఐనా, వస్తువుల ఉత్పాదన వ్యవస్థ, మొత్తంమీద కార్మికుల కుటుంబాలు అనే, ఏకాంశాల ద్వారా ఏర్పడింది. కార్మికుల సంపాదన స్వల్పమైనది. వర్తకులు ఇచ్చే సంచకార ద్రవ్యంపైనా, ఆశ్రయదాతల అభిమానాదరణలపైనా ఆధారపడి, వీరు తమ కార్యక్రమాన్ని

ఉపయోగపడవలసివచ్చేది. పరిశ్రమల పెట్టుబడి ద్రవ్యం కూడా స్వల్పమైనదే. కాబట్టి, యూరోపులో అభివృద్ధికి వచ్చినట్టి, కార్మిక సంస్థలు ఏర్పడే అవకాశంలేకపోయింది. అదీకాక, ప్రతి వృత్తి ఒక ప్రత్యేక సంఘంగా ఏర్పడిన కులముపై ఆధారపడినది. కాబట్టి, ఒకవృత్తిలో పని చేస్తున్న కార్మికులను మరొకవృత్తిలోనికి మార్చడానికిగాని, వివిధవృత్తి వర్గాలు పరస్పరం సహకరించుకోడానికిగాని, సాధ్యంకాలేదు.

ఇండియాలోని గ్రామం, స్వయం పోషక సమర్థమైన ఒక ఏకాంశమై ఉండింది. గ్రామీణ ప్రజల అవశ్యకాలు స్వల్పమైనవి కాబట్టి, అవి వారికి తమ గ్రామంలోనే లభించేవి. రైతు కర్చులకుపోగా మిగిలిన పంటలోని భాగం, వస్తులరూపంగా, రాజుకు చెల్లిస్తూఉండిరి. ప్రభుత్వపు బాకీ చెల్లించగా మిగిలిన దానితో, పట్టణ పరిశ్రమలలో తయారైన వస్తువులను కొనడం సాధ్యంకాదు. ఇట్టి పరిస్థితులలో, గ్రామాలకూ పట్టణాలకూ మధ్య జరిగే వస్తువుల పరస్పర వినిమయం, అత్యల్పం. వర్తక వ్యాపారాలను, బ్యాంకు కార్యక్రమాలను, నిర్వహిస్తున్న సాంప్రదాయిక వర్తక వర్గాలవారు,-యూరోపులోవలె-సుసంయోజితము, దృఢతరము, ఐన మధ్యమతరగతి సంస్థగా ఏర్పడకపోవడానికి కారణాలు లేకపోలేదు. పెట్టుబడి ద్రవ్యంలేక పోవడము, కులనిర్బంధాలు కఠినములై ఉండడము, పట్టణ గ్రామాల మధ్య వ్యాపారము, అత్యల్పమై ఉండడము, అనే కారణాలు, మధ్యమ తరగతి సంస్థయొక్క ఉత్పత్తికి ప్రబల ప్రతి బంధకములైనవి.

సాధారణము, స్వయంపోషక సమర్థము ఐన గ్రామీణ ఆర్థికవ్యవస్థయొక్క ప్రభావం- ప్రజల దృక్పథంపైనా, ప్రకృతిసహజమైన, ప్రజల విరక్తదృక్పథము యొక్క ప్రభావం ఆర్థికవ్యవస్థపైనా, పరస్పరం ప్రసరించినవి. మతవిషయికమైన వారి ప్రవృత్తి, ప్రాపంచిక వస్తుసంపదపై విరక్తిభావాన్ని ప్రోత్సహించింది. ఇంద్రియతృప్తి పాపకరమైనదని, ఇంద్రియ నిగ్రహమే సౌశీల్యమని, మతం బోధించింది. ప్రాపంచికమైన ఆస్తి, ఒక పాశము. అది అస్థిరమైనది, చంచలమైనది; కాబట్టి, బుద్ధిమంతుల దృష్టికి అనర్హమైనది. తమ సంపదను, అధికారాన్ని లోకానికి ప్రదర్శించి రాజులు, శ్రీమంతులు సంతోషాన్ని పొందవచ్చు; వారి విషయంలో అది సమర్థనీయం కూడా కావచ్చు. ఐనా. వారుకూడా, అశోకుడు, ఔరంగజేబు అనుసరించిన జీవనవిధానాన్ని అనుసరిస్తే, ఉత్తమమానవులు ఔతారు. ఐహిక భోగభాగ్యాల త్యాగము, అనివార్యములైన జీవిత సుఖదుఃఖాలపట్ల సమాధానభావము,- ఇవి, తక్కిన సాధారణ ప్రజానీకానికి, జీవితాదర్శాలు. చిరకాలం నుంచీ జరుగుతూవచ్చిన ఈ బోధ, ప్రజల జీవితాలలో నిలిచిపోయింది. ఈ విధమైన నైతికవాతావరణం, మూలధన సేకరణకు అనుకూలించలేదు. అంతేకాక, ఇండియాలోని సమష్టికుటుంబ పద్ధతివల్లను, హిందూముస్లిముల వారసత్వపు న్యాయసూత్రాలవల్లను. ఆస్తులూ, సంపదలూ, కుటుంబాలలో శాశ్వతంగా నిలిచి ఉండడానికి వీలుకాలేదు. కొన్నితరాలలోనే అవిఛిద్రమై పోతూవచ్చినవి. వారసుదారులు లేని శ్రీమంతులు మరణించడంతో, అతని ఆస్తి, ఆదేశపురాజుకో, లేదా, ప్రభుత్వానికో సంక్రమించే ఆచారం అనువంశీయమైన సంపన్నకులీనవర్గం, ఏర్పడడానికి ప్రతిబంధకమయింది. భారతదేశ విద్వాంసులు అర్థశాస్త్రాన్ని అభివృద్ధికి తేలేదు.

వ్యాపారస్థులు, బ్యాంకర్లు, వడ్డీవ్యాపారస్థులు,- అనే వర్గాలతో ఏర్పడిఉన్న వర్తక సమూహాన్ని, ఆ కాలపు మధ్యమతరగతి సమాజంగా పరిగణించవచ్చు. వీరు తమ వృత్తుల

ద్వారా సంపదను గడించుకొన్నారు; కాని, పెద్దప్రమాణంలో వస్తువులను తయారుచేసే పరిశ్రమలను స్థాపించడానికై, తమ ధనాన్ని పెట్టుబడిగా చేయలేదు. పరిపాలక వర్గంలోని వారికి, ఎక్కువవడ్డీపై అప్పులు ఇవ్వడానికీ, వృత్తికార్మికులకు సంచకార ద్రవ్యాన్నిఇచ్చి, వారినుంచి, తయారైన వస్తువులను తీసుకోడానికీ, తమధనాన్ని వినియోగించినారు. యూరోపులోని పరిశ్రమలకు ఉత్తేజకమైన, సాహసోద్యమ ఉత్సాహం, వీరికి లేకపోయింది. యూరోపు దేశాల వర్తకులు సంయుక్తసంఘాలను, వ్యాపారసంస్థలను ఏర్పరచుకొని ఉండగా, ఇండియాలోని వర్తకసమాజంలో, కేవలం వ్యక్తులు, లేదా కుటుంబాలు మాత్రమే ప్రత్యేకంగా తమ వ్యాపారాన్ని సాగించుకొంటూ ఉండిరి.

ఇండియా పారిశ్రామికవ్యవస్థ, పెట్టుబడి విధానానికి పూర్వపుదశలోనే నిలిచిఉన్నది; పారిశ్రామిక మధ్యమ తరగతివర్గం, దేశంలో ఇంకా ఉన్నతంకాలేదు. అయినప్పటికీ, ఉత్పత్తి ఐన వస్తువుల వైవిధ్యంలోను, ఉత్పాదనకు సంబంధించిన ప్రక్రియా కౌశలంలోను, ఆనాటి భారతదేశం పారిశ్రామికంగా, సమకాలిక యూరోపుదేశాలకంటె ముందు ఉండినది. మధ్యయుగాల ఇండియాదేశ ఆర్థికవ్యవస్థను గూర్చి వ్రాసిన మోర్‌లాండ్ (Moreland). "పరిశ్రమలవిషయంలో, ఈనాటికంటె కూడా ఆకాలపు భారతదేశం, యూరోపుదేశాలకంటె ఎక్కువ పురోగమించి ఉండినది. ఈ విషయం నిర్వివాదాస్పదమైనది". అని ఒప్పుకొన్నాడు. ఇండియా సాధించిన గొప్పతనాన్ని, అతిశయోక్తులతో పొగిడే ప్రవృత్తిలేనివాడు, మోర్‌లాండ్ కాబట్టి, ఇతని అభిప్రాయాన్ని వాస్తవంగా గ్రహించవచ్చు.

ఇండియా పరిశ్రమలలోను, సంస్కృతిలోను గల స్వోపజ్ఞను, గొప్పతనాన్నిగూర్చి, పైరార్డ్ (Pyrard), చిరకాలం నిలిచే సాక్ష్యాన్ని ఇచ్చి ఉన్నాడు. "బంగారు, వెండి, ఇనుము, ఉక్కు, తామ్రము, మొదలైన లోహాలతోను, రత్నాలు, శ్రేష్ఠతరమైనకర్ర, విలువలు అమూల్యములు ఐన, ఇతర పదార్థాలతోను, తయారుచేసిన వస్తువుల వైవిధ్యానికి, అంతులేదు. ఈ కార్మికులు అతినైపుణ్యం కలవారు; శిల్ప విషయంలో, పాశ్చాత్యులకు ఏవిధంగానూ రుణపడిన వారుకారు. మనకు సాధారణమై ఉన్న బుద్ధికుశలత కంటె తీక్ష్ణమైన బుద్ధికుశలత, వీరికి సహజ సిద్ధమైనది. సూక్ష్మమైన వీరి హస్తకౌశలం మన శిల్పుల కౌశలమునకు ఏమాత్రమూ తీసిపోయేదికాదు. ఒకసారి మాత్రమే చూచిన దానిని, లేక, విన్న దానిని వీరు తక్షణమే గ్రహిస్తారు. నేర్చుకొంటారు. ఉపాయకౌశలము, నేర్పు, కలజాతి ఇది: కాని, వీరు మోసంచేయరు, సులభంగా మోసపోరు. వారుతయారుచేసిన వస్తువులన్నిటిలోనూ గమనింపతగినవి,-వాటి పనితనము, తక్కువవెల. ఇండియాదేశస్థులకు ఉన్న తీక్ష్ణమైన సమయస్ఫూర్తి, నాజూకుతనము నేనెక్కడా ఇతర దేశస్థులలో చూడలేదు. సంస్కార విహీనమైన ప్రవృత్తికాని, క్రౌర్యప్రవృత్తికాని, మనం భావించే విధంగా, వీరిలో ఎక్కడా గోచరించడంలేదు. పోర్చుగీసువారి, ఆచారాలను, ప్రవర్తనలను అవలంబించడానికి వీరు అంగీకరించనిమాట వాస్తవమే. కాని, కుతూహలము, జిజ్ఞాస కలవారు కాబట్టి, మనము తయారుచేసిన వస్తువులను, వాటి పనితనాన్ని, గ్రహించడానికీ, నేర్చుకోడానికీ ఎప్పుడూ సిద్ధంగా ఉంటారు. వాస్తవానికి పోర్చుగీసువారు ఇండియనులకు నేర్పేదానికంటె, వారినుంచి నేర్చుకొనేదే ఎక్కువ. గోవాకు క్రొత్తగావచ్చిన విదేశీయులు, ఇండియనుల ప్రవర్తన రీతులను, మర్యాదలను నేర్చుకొనేవరకూ నిజంగా మూఢులుగనే ప్రవర్తిస్తారు. ఈ ప్రాంతంలోని

క్యాంబే, సూరత్ మొదలైన ప్రదేశాలు, సింధునది ప్రాంతాలు, అద్భుతమైన మోగోదు ప్రాంతాలు, ఇండియాద్వీప సముదాయంలో అత్యంతమూ సారవంతమైనవి, శ్రేష్ఠమైనవి. తక్కిన దేశాలరాకపోకలను, వర్తకాన్ని, పోషించే తల్లివంటిదని, ఈ భూభాగాన్ని వర్ణించవచ్చు. ఇవే ఆచార వ్యవహారాలు ప్రవృత్తులు, గల ప్రజలతో కూడిన బెంగాలు రాజ్యము కూడా ఇటువంటిదే. ఇచ్చటి ప్రజలు,-స్త్రీలూ పురుషులూ కూడా, ఇతర ప్రాంతాలవారికంటె ఎక్కువ సంస్కారం కలవారు. ఈ దేశములన్నీ ఇండియా పడవల వాణిజ్య కేంద్రాలు. అక్కడి ప్రజల జీవనస్థాయి, ఇతర ప్రదేశాలలో దానికంటె ఉత్తమమైనది."

ఇండియా శిల్పులనైపుణాన్ని గురించి, అతడు, ఈ విధంగా వ్రాస్తాడు. "ముత్యాలు, రత్నాలు,- వీటి నాణ్యాన్ని గురించి వీరికిగల విజ్ఞానం, ప్రపంచంలో మరెవ్వరికీలేదు. గోవాలోకూడా బంగారునగలు చేసేవారు, మణులను సానపెట్టేవారు. రత్నపరీక్షకులు, సున్నితమైన ఇతరవృత్తులలో ఉద్యుక్తులైనవారు, - అందరూ క్యాంబేనుంచివచ్చిన బనియాలు, బ్రాహ్మణులు. వీరికి ప్రత్యేకమైన వీధులు, అంగళ్ళు ఏర్పడి ఉండినవి".

*ఉత్పాదన* : ప్రాథమికములైన పంటలు మొదలు, సున్నితమైన పత్తివస్త్రాలు, పట్టువస్త్రాలు,- ఇనుము, ఉక్కు, ఇత్తడి, రాగి, బంగారు, వెండి మొదలైన లోహాలతో తయారైన వస్తువులు- వివిధ పరిమాణం కల పడవలు, మొదలైన వాటితోసహా విస్తారవ్యాప్తిగల వస్తువులు, దేశములో ఉత్పన్నమయ్యేవి. ఆహారధాన్యాలు వ్యవసాయోత్పత్తిలో మిక్కిలి ప్రధానమైనవి. ప్రతిగ్రామమూ తన అవసరాలకు కావలసిన ఆహారధాన్యాలను పండించేది- పత్తి, చెరకు, పొగాకు, గసగసాలు, నీలిమందు మొదలైనవి, ఇతర పంటసరకులు. బెంగాల్, ఒరిస్సా, సింధుప్రాంతాల ప్రజల ఆహారంలో చేపలు ముఖ్యభాగము. చేపలను ఎండించి, ఉప్పులో ఊరబెట్టి, పడవ ప్రయాణాలకు ఆహారంగా నిలువచేసేవారని, యాత్రికులు పెక్కుమంది వ్రాసిఉన్నారు. సింధుప్రాంతంలో, చేపనూనెను తయారుచేసేవారు. పశ్చిమ భారత ప్రాంతంలో, చేపలఎరువును ఉపయోగించడం, అలవాటుగా ఏర్పడింది. ఖనిజపరిశ్రమ ఎక్కువగా వృద్ధికిరాలేదు; కాబట్టి, దేశములోని ఖనిజఉత్పత్తి స్వల్పమైనది. కాని స్వల్ప పరిమాణంలో ఇనుము తయారుచేసుకొనే పరిశ్రమలు, విస్తారంగా వ్యాపించిఉండినవి. ప్రతి ప్రాంతమూ, తనకు అవసరమైన ఇనుమును తయారుచేసుకొనేవి. ఇండియాలో తయారైన ఖడ్గాలకు, పడమటి ఏషియాలో ఎక్కువవిలువ ఉండినది. లోహములు మాత్రమేకాక, వజ్రాలు, ఉప్పు, సూరేకారము, ఇండియాలోని ఉత్పన్నమైన ఇతర ఖనిజాలు.

పెద్దపరిమాణంలో తయారయ్యే వస్తువులలో నూలుగుడ్డలు ప్రధానమైనవి. ఈ పరిశ్రమ, దేశమంతటా విస్తారంగా వ్యాపించి ఉండినది. కాని, ఢక్కా, బనారస్, ఆగ్రా, ముల్తాన్, బర్హాన్‌పూర్, లాహోర్, అహమదాబాద్, పాట్నా, బరోడా, బ్రోచ్, సూరత్ నగరాలు, ప్రధానములైన ఉత్పాదన కేంద్రాలు. పట్టువస్త్రాలు, రక్తవర్ణపు ఉన్నివస్త్రాలు, బెంగాలులోని గోగునార, జనపనార,- నూలుకు సంబంధించిన ఇతర పరిశ్రమలు.

చక్కెర, వనస్పతినూనె, రంగుద్రవ్యాలు, అపీము, లోహపువస్తువులు,-వీటి ఉత్పాదన, దేశంలో బాగుగా నెలకొని ఉండినది. గృహపరిశ్రమలలో, బంగారు వెండి పనులు, రత్నాభరణాలపనులు, పేర్కొనతగినవి.

అంతర్దేశీయ వ్యాపారానికీ, విదేశవ్యాపారానికీ, ప్రధాన సాధనములైనవి పడవలు.

కాబట్టి, పడవలకూ, నావలకూ, దేశములో ఎక్కువ గిరాకీ ఉండేది. రేవు పట్టణాలలోని వర్తకపు ఓడలు, దేశంలోని నదీ మార్గాలలో సంచరిస్తున్న పడవలు,- అన్నీ దేశంలో తయారైనవే. ఢక్కా, అలహాబాద్, లాహోర్, థాటా, మచిలీపట్నం, పులికాట్, క్యాలికట్, బాస్సేయిన్, గోవా పట్టణాలలో, పడవల నిర్మాణ పరిశ్రమ, మంచి అభివృద్ధిలో ఉండినది. సింధునదిపై సంచారం చేస్తున్న పడవల సంఖ్య 40,000. బెంగాలులో, 40,000 వేల నుంచి 50,000 దాకా, కల, పడవల తండము, నదీ మార్గాలలో సంచరించేది. ఆగ్రాసట్‌గోనల మధ్య 180 పడవల పంక్తి, నదులపైనడిచేది. మలబారులో 100 గలివత్‌ల (Gallivats) పంక్తి విహారం కావించేది. ఇవికాక ఇండియా రేవులలో అనేకములు నావలు ఉండేవి. ఈ వివరాలనుబట్టి, ఇండియాలో పడవ నిర్మాణపరిశ్రమ ఎంత విస్తృతమై ఉండినదో, వ్యక్త మౌతుంది. క్యాంబే, గోవాల మధ్య 300-400 నావలు తిరుగుతూ ఉండినవి. గోవానుంచి దక్షిణానికి ప్రయాణంచేసే నావల సంఖ్య 250. ఇవి మాత్రమేకాక, బెంగాల్, ఒరిస్సా, తూర్పుతీరాలలో అధిక సంఖ్యాకములైన ఓడలు, సంచరిస్తూ ఉండినవి. ఇండియా రేవులను ప్రవేశించి, లేదా, ఇండియా రేవుల నుంచి పోయే నౌకా పరివహనం (Shipping), సంవత్సరానికి మూడు లక్షలా నలభై ఐదువేల టన్నుల [3,45,000] మొత్తం, అని బాలకృష్ణ అంచనావేసినాడు. దీనిలో, ఎనభై ఐదువేల టన్నుల నౌకలు [85,000], విదేశవ్యాపారములో నియుక్తమై ఉండినవి. తక్కినవి, తీరప్రాంతాల రాకపోకలకు ఉపయోగించినవి.

నౌకా నిర్మాణ వృత్తిలో, ఇండియాదేశం, యూరోపు దేశాలకంటె ముందుండినది. నౌకా శిల్పులైన భారతీయుల నైపుణ్యాన్ని గురించి, పార్కిన్‌సన్ (Parkinson) ఈ విధంగా వ్రాస్తాడు.

"నౌకా నిర్మాణ విషయంలో, ఆంగ్లేయుల నుంచి నేర్చుకొన్న దానికంటె, భారతీయులు ఆంగ్లేయులకే ఎక్కువగా బోధించినారు." గోవా, బాస్సేయిన్, సూరత్, మచిలీపట్టణం, సట్‌గోన్, ఢెక్కా, చిటగాంగు పట్టణాలు, నౌకానిర్మాణకేంద్రాలలో ప్రధానమైనవి. ఆకాలంలోని నౌకల ప్రమాణపరిమాణం, మూడువందల టన్నులు మొదలు ఐదువందల టన్నులదాకా [300 నుంచి 500] ఉండేది. 1500 టన్నుల నావలు కూడా, ఆకాలంలో లేక పోలేదు. పోర్చుగీసువారు పట్టుకొన్న 'రహీమీ' అనే గోఘానౌకయొక్క పరివహనం, 1500 టన్నులు.

విదేశవాణిజ్యము : ఇండియాలోని ఉత్పాదన విధానం, చాలవరకు, దేశములోని అవసరాలకు, అనుగుణంగా ఏర్పడింది. దేశము స్వయంసంపూర్ణమైనట్టిది. తన జనాభాయొక్క వినియోగానికి అవసరమైన వ్యవసాయపదార్థాలను, పారిశ్రామిక వస్తువులను ఉత్పాదన చేసుకోవడంలో, సాధారణంగా, స్వయంపోషక సమర్థమైనట్టిది. విసూత్నమైన అంశంతో కూడిన భోగవిలాసవస్తువులను మాత్రమే, విదేశాలనుంచి దిగుమతి చేసుకొనేవారు. కాని, వీటి ఆవశ్యకం, స్వల్పమైనట్టిది. కేవలం, తమ కుతూహలాన్ని, ఆడంబరాన్ని సంతృప్తి పరచుకోడానికై, సంపన్నులైనవారు మాత్రమే వీటిని కొనేవారు. అంతేకాని, నిజంగా, వీటి అవసరం ఉండడంవల్ల కాదు. ముడిపట్టు, దంతము, పగడాలు, తాబేలుచిప్పలు, తృణమణి [Amber = శిలారాశము, తృణమణి] ఇత్యాదివస్తువులు; బంగారు, వెండి, సీసము, తగరము, రాగి, తుత్తునాగము, మొదలుగాగల లోహాలు; వెలిగారము, గంధకము, వంటి ఖనిజ

వస్తువులు, ఈ దిగుమతి వస్తువులలో ముఖ్యములైనవి.

దేశపు అవశ్యకాలను తీర్చడమేకాక, ఇండియాపరిశ్రమలు, విదేశబజారుల అవసరాలను కూడా, వస్తువులను ఒదిగించేవి. పద్దెనిమిదో శతాబ్దాంతంవరకూ నిలిచిఉండిన, భారతీయ పారిశ్రామిక సర్వోత్కృష్టత, వాణిజ్యపరిశ్రమ, ప్రపంచంలో, అపేక్షణీయమైన స్థానాన్ని భారతదేశానికి సిద్ధింపచేసింది. పదహేడో శతాబ్దారంభంలో, ద్రవ్యాన్ని వస్తువులనూ ప్రపంచానికి సరఫరాచేసే, శ్వాసనాంగమై (Respiratory organ) ఉండింది భారతదేశం. వర్తకానికీ, పరిశ్రమలకూ సంబంధించిన నదీప్రవాహాలను అన్నిటినీ, తనలో లీనము కావించుకొని, తన ప్రజలను ధనవంతులుగా చేసిన సముద్రమువంటిది, భారతదేశం. పదహేడో శతాబ్దంలో ప్రపంచమంతటిలోనూ, పారిశ్రామిక వస్తువులను అత్యధికంగా ఉత్పాదన చేసే దేశం, భారతదేశం అనుండవచ్చు. పద్దెనిమిదో శతాబ్దారంభమువరకూ, భూమిపైఉన్న ప్రతి దేశమూ చాలవరకు, తనకు ఆవశ్యకమైన, మేలురకపు పత్తిని, పట్టువస్త్రాలను, మసాలా సామగ్రిని, నీలిమందును, చక్కెరను, మందుదినుసులను, అమూల్యములైన రత్నాలను అద్భుతములైన శిల్పకళాఖండాలను, భారతదేశమునుంచి గ్రహించి, వాటికి బదులుగా, వెండి బంగారాలను ఇస్తూఉండేవి.

వెండిబంగారాలవంటి బహుమూల్య వస్తువులకు, భారతదేశం ఒక మడుగుగా సిద్ధించింది. హిందూస్థాన్‌లోని రాజులనుగురించి, వ్యాన్‌ట్విస్ట్ (Vantwist) ఈ విధంగా వ్రాసిఉన్నాడు. "వెండి బంగారు గనులు ఇండియాలో లేకపోయినా, ఈ రెండు లోహాలూ అత్యధిక పరిమాణంలో విదేశాలనుంచి దిగుమతి ఐనవి. వీటిని ఇండియానుంచి ఎగుమతిచేయడం, నిషిద్ధం కావింపబడింది". హాకిన్స్ (Hawkins) ఈ విధంగా వ్రాసిఉన్నాడు. "భారత దేశంలో, వెండి సమృద్ధిగా ఉన్నది. అన్ని దేశలూ, వెండినాణ్యాలను ఇండియాకు తీసుకొని వచ్చి, వాటికి బదులుగా, ఇండియా వస్తువులను తీసుకొని పోతున్నవి. ఈ నాణ్యాలు ఇండియాలోనే పాతుకొనిపోతున్నవి; బైటికిపోవడంలేదు." "ఎర్రసముద్రం నుంచి ఇండియాకు తిరిగివచ్చే నావయొక్క విలువ సాధారణంగా, రెండులక్షల పౌనుల విలువగలది. దీనిలో అత్యధికభాగం, బంగారు వెండి రూపములలో ఉండినది", అని, టెర్రీ, అంచనావేసినాడు. "నదులు సముద్రాభిముఖంగా ప్రవహించి, దానిలో లీనమైపోయినట్లు, అనేకదేశాల నుంచి వెండిప్రవాహాలు ఇండియాలో ప్రవేశించి, అందే, లీనమైపోతున్నవి. వెండిని ఇండియాకు తీసుకొనివచ్చి, దానికి బదులుగా అందులోని వస్తువులను తీసుకొనిపోవడం, న్యాయబద్ధమైనదే. కాని, ఇండియానుంచి ద్రవ్యాన్ని కొనిపోవడం, హత్యాపరాధానికి సమానమైన నేరము" అని, అతడే వ్రాసిఉన్నాడు. 1703-1753ల మధ్యకాలంలో, ఒక్క ఇంగ్లాండుదేశము నుంచి మాత్రమే 220 లక్షల విలువగల వెండినాణ్యాలు, ఇండియా దిగుమతిచేసుకొన్నది. ఈవిధంగా దిగుమతిఐన విస్తారమైన వెండిలో, స్వల్పభాగం మాత్రమే నాణెములను తయారుచేయడానికి ఉపయుక్తమయింది. తక్కిన అధికభాగమంతా, వ్యక్తుల స్వంతనిధులలోనూ, వెండిసొమ్ముల రూపంలోనూ, నిలిచిపోయింది.

దేశము నుంచి ఎగుమతి ఔతున్న వస్తువులలో మిక్కిలి ప్రధానమైనది నూలువస్త్రాలు. నాణ్యమైన నూలువస్త్రాలకు, ఇండియా దేశం, ప్రపంచమంతటా, శతాబ్దాలుగా ప్రఖ్యాతిచెందింది. ప్రాచీనకాలపు రోములో, ఇండియాలో తయారైన వస్తువులను విస్తారంగా వినియోగించేవారు.

"ఢాకా మస్లినులను 'గంగేటిక' అనే పేరుతో గ్రీకులు వ్యవహరించినారు. రెండువేల సంవత్సరాలకు పూర్వమే, ఇండియాలో, నూలువడికి వస్త్రాలు నేసే విద్య అతినిపుణమైన కళగా సిద్ధించి ఉండినది." "ఇండియాలోని ప్రధానమైన సంపద, నూలు, పట్టువస్త్రాలతో ఏర్పడినట్టిది. గుడ్‌హోప్ అగ్రమునుంచి (Cape of Good Hope) చైనా దేశం వరకు గల ప్రాంతమంతటా, స్త్రీ పురుషులు అందరూ ఆపాదమస్తకంవరకూ, ఈ వస్త్రాలనే ధరిస్తారు." ఇండియాలో తయారైన వస్త్రాలకు ప్రపంచ విస్తృతమైన ఆదరం లభించడానికి, మిక్కిలి శ్రేష్ఠమైన వాటి పనితనం కారణం. "సున్నితమైన నేతగల వస్త్రాలను తయారుచేయడము, రంగులను మిశ్రితం చేయడము, లోహాలతోను, అమూల్యములైన రత్నాలతోను వస్తువులను తయారుచేయడము, సుగంధద్రవ్యాలను తయారుచేయడము, వివిధములైన సాంకేతిక కళల ప్రక్రియలు,-ఇత్యాదులలో భారతీయులు సాధించిన నైపుణ్యము, చిరకాలంగా ప్రపంచ ప్రఖ్యాతిని సంపాదించుకొన్నది." అని వెబర్ (Weber) వ్రాసిఉన్నాడు.

పదహేడో శతాబ్దంలో, ప్రతి సంవత్సరమూ ఇండియా నుంచి ఎగుమతి ఔతూ ఉండిన నూలు వస్త్రాలు, సుమారు 8000 కట్టలు (Bales) అని, మోర్‌లాండ్ అంచనా వేసినాడు. వీటిలో 4700 కట్టలు, యూరోపుదేశాలకు చేరేవి. పద్దెనిమిదో శతాబ్దపు పూర్వార్ధభాగంలో, పదిలక్షల థానుల చీటి గుడ్డలను, నూసీలను, ఇంగ్లండు దేశమొక్కటే దిగుమతి చేసుకొంది. ఇండియా చీటి గుడ్డలను ఇంత విస్తృత పరిమాణంలో, ఎందుకు దిగుమతి చేస్తున్నారని, జేమ్సురాజు (1623) ప్రశ్నించగా, థామస్‌మన్, డిప్యూటీ గవర్నర్ మారిస్ అబట్, ఈ విధమైన వింతసమాధానాన్ని ఇచ్చినారు ;-"ఈ గుడ్డలతో మంచి ఉపయోగం ఉంది, కాబట్టి ఇంగ్లాండులో బాగా అమ్ముడుపోతున్నవి. వీటి దిగుమతివల్ల, లాన్, క్యాంబ్రిక్, మరి ఇతర నార బట్టల వెలలు, తగ్గిపోయినవి. ఈ బట్టలకై ఇతరులు ఇంగ్లాండుపై ఆధారపడే అవకాశం కూడా, వీటివల్ల ఏర్పడింది. చక్రవర్తియొక్క రాజ్యాలలోని ఆవశ్యకాలు తీరగా, మిగిలిన వాటిని, ఇంగ్లాండులో తయారైన వస్త్రాలుగా ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నాము." ఇండియా నుంచి ఇంగ్లాండులోనికి దిగుమతి ఐన నూలు వస్త్రాలతో, ఆదేశంలోని పరిమితమైన అవసరాలు తీరడమేకాక, మిగిలినవాటిని విదేశాలలో అమ్మడంవల్ల వచ్చిన అధికలాభాలతో, ఇంగ్లాండు దేశం ధనవంతమయింది.

ఇండియా నుంచి ఎగుమతి ఔతున్న ఇతర వస్తువులలో, నీలిమందు ఎక్కువ ముఖ్యమైనది. పరిమిత పరిమాణాల్లో, ఇనుము, ఉక్కు, కూడా, మచిలీ పట్టణం నుంచి విదేశాలకు ఎగుమతి అయ్యేవి. కోరోమాండల్ తీరం నుంచి, దూదినూలు ఎగుమతిఅయ్యేది. గుజరాతు నుంచి ఎగుమతి ఔతున్న సరకులలో, నూలు వస్త్రాలు, నీలిమందుతోపాటు, అపీము, ఇంగువ, లక్క, ఉసిరికాయలు, తోళ్లరంగులు, మందు దినుసులు, విలువైనమణులు, పాలరాయి, (Alabaster), అమృతశిల (Marble stone), మొదలైనవి కూడా చేరి ఉండినవని, వ్యాన్ ట్విస్ట్, తెలిపిఉన్నాడు.

విత్తవిధానము, వర్తకవర్గాలు : ఉచ్ఛ్రయస్థితిలో ఉన్న ఈ వర్తకపరిశ్రమలకు ఆవశ్యకమైన ధనాన్ని సమకూర్చి, వాటిని వ్యవస్థీకరించినవారు ఇండియావర్తకులు. పరిశ్రమల పరిమాణాన్నిబట్టి, అనేకులు వర్తకులు ఈ కార్యాన్ని నిర్వహిస్తూ ఉండినారని వ్యక్తమౌతుంది. వీరిలో చాలమంది, తీరపట్టణాలలో నివాసము ఏర్పరచుకొని ఉండిరి. "గోవాలో

నివసిస్తున్న, ఈ క్రైస్తవేతర భారతీయులు, ధనవంతులైన వర్తకులు; వీరి వర్తకం విస్తారమైనట్టిది. పట్టువస్త్రాలు, మేలురకపు రేష్మవస్త్రాలు, గులాబిరంగు నారవస్త్రాలు, చైనాదేశపు పింగాణిసామాను, మఖమల్‌గుడ్డలు, నారగుడ్డలు, షర్టులు, అన్ని విధములైన వ్యక్తులకూ అవసరమైన ఉడుపులూ,- మొదలైనవి వీరి అంగళ్ళలో నిండి ఉండినవి." అని లిన్స్‌ఛోటెన్ వ్రాసిఉన్నాడు. గోవాలోని బనియాలు, అన్నిరకములైన రత్నాలను, ఇతరవస్తువులను విక్రయించేవారు. ఏకాక, నగలవర్తకులు, సాధారణ వస్తువులను విక్రయించే ఇతర వర్తకులు, గోవాలో ఉండినారు. డబ్ల్యూ. జి. దేజోంఘ్ (W. G. de-Jongh), గుజరాత్ అభిలేఖ పత్రంలో (1623-29) ఈ విధంగా వ్రాసినాడు. "సముద్రతీరాన్ని అనుసరించిన ప్రదేశంలో అంతటా,- అనగా, గోవా, కోరోమాండల్, బెంగాల్‌తీరాలలో అంతటా,- వ్యాపారంవల్ల జీవనం సంపాదించుకొంటున్న, బనియాలను మనం చూడవచ్చు. అని విస్తృతమైన వర్తకాన్ని సాగిస్తున్న విశేషధనవంతులు, ఈ బనియావర్తకులలో ఉన్నారు. శ్రేష్ఠమైన వస్తువుల వ్యాపారం, విస్తారంగా వీరి చేతులపై నడుస్తుంది. మహమ్మదీయుల వ్యాపారం కంటె వీరి వ్యాపారం అధికం. వ్యాపారంలో నిశితమైన చాకచక్యంగల ఈ వర్తకులు, మాట ప్రకారం నిక్కచ్చిగా డబ్బుచెల్లిస్తారు. ద్రవ్యమారకపు వ్యాపారాన్ని సాగించేవర్తకులు అనేకులు, అన్నిప్రదేశాలలోనూ ఉన్నారు." మరొక యాత్రికుడు, డాక్టర్ ఫ్రైయర్ (Dr. Fryer) సూరత్‌లోని వర్తకపరిస్థితులను ఈ విధంగా వర్ణిస్తాడు. "ప్రకృతి, ఇండియాదేశాన్ని వర్తక కేంద్రంగాచేసే ఉద్దేశంతో, సముద్రమార్గాలను, భూమార్గాలనూ, కల్పించినట్లు కనబడుతుంది. కాబట్టి, ప్రపంచవర్తకానికి, ఇండియాదేశం యాజమాన్యం వహించడంలో ఏ విధమైన ప్రతిబంధకమూలేదు. స్వభావాన్నిబట్టి ఈ ప్రజలు వర్తకవిద్యలో ఉత్తీర్ణులైన యజమానులు. దేశీయములైన వస్తువులను, విదేశాలనుంచి వచ్చిన వస్తువులను కూడా, తక్కువ వెలకుకొని, అత్యధికమైన వెలలకు అమ్మడంలో, బాగా ఆరితేరినవారు. రాజకోశాగారంతో తులదూగగల సంపదకలవారైనా, ఈ వర్తకులు, పిశినాసులుగా జీవనంగడుపుతూ, హీనమైన దారిద్ర్యంలో ఉన్నట్టు కనబడతారు. అవకాశం కలిగించుకొని, గవర్నరు వీరిని పలుమార్లు దోచుకొంటూ ఉన్నప్పటికీ, ఈ పట్టణములో అతివేగంతో జరుగుతున్న వ్యాపారంవల్ల, తమ నష్టాన్ని వెంటనే పూడ్చుకో గలుగుతున్నారు."

ఈ వ్యాపారస్థులవర్గం, తీర పట్టణాలను మాత్రమే ఆశ్రయించి ఉండలేదు. దేశంలోని వ్యాపార మార్గాలను అనుసరించి ఏర్పడిన, అన్నిపట్టణాలలోను, నగరాలలోను వీరు వ్యాపించిఉండిరి. పంజాబులోని ముల్తాను, సింధుప్రాంతంలోని బుక్కూర్, సుక్కూర్, రోహ్రీలు, పశ్చిమోత్తర భూభాగంలో ముఖ్యములైన, అంతర్దేశీయ వ్యాపార కేంద్రాలు. ప్రధానంగా, ఖత్రీలు, లోహణాలు, భాటియాలు అనే వారితో ఏర్పడిన వర్తకవర్గం, ఈ వర్తక వర్గాలలో, మిక్కిలి ఉచ్ఛ్రయ స్థితిలో ఉండినది. అంతర్దేశీయ జలమార్గ సౌకర్యాలు సిద్ధించి ఉన్న, ఉత్తరభారత ప్రాంతంలో, లాహోర్, ఢిల్లీ, ఆగ్రాలు, విస్తారమైన వర్తక వ్యాపార కలాపాలకు ప్రధాన కేంద్రాలు. మాల్దా, రంగపూర్, కాసింబజార్లు, బెంగాలులోని ముఖ్య వ్యాపార కేంద్రాలు. రాజస్థాన్ లోని జైసల్‌మీర్, పాలీ, జోధ్‌పూర్, అజమీరులు, పురాతన వ్యాపారకేంద్రాలు. పద్దెనిమిదో శతాబ్దంలో కూడా, ఇవి తమ ప్రాధాన్యాన్ని నిలుపుకొని ఉండినవి. గుజరాతుప్రాంతంలో అహమదాబాదు, మహారాష్ట్ర ప్రాంతంలో నాగపూరు, 1750

తర్వాత వర్తకంలో ప్రాముఖ్యానికి వచ్చినవి. దక్షిణదేశంలో కోరోమాండల్, కొంకణ్ తీర ప్రాంతాల పట్టణాలు, మిక్కిలి ప్రధానమైన వర్తక కేంద్రాలు.

దేశాంతర్గత భాగంలో హైదరాబాదు, బెంగుళూరు, తంజావూర్లలో, వర్తక వ్యాపారాలు మంచి అభివృద్ధిలో ఉండినవి. ఉత్తరప్రదేశ్ బీహారు ప్రాంతాలలో, ప్రధానమైన వ్యాపారవర్గం, బనియాలది. అగర్‌వాల్, ఆస్వాల్, జైన్, మేశ్రీ (మాహేశ్వరీ) అనే బనియా కులాలవారు, ఎక్కువ ధనవంతులని ప్రసిద్ధి. పద్దెనిమిదోశతాబ్దపు రెండోభాగంలో, రాజస్థాన్ నుంచి వచ్చిన మార్వాడీలు అనేకులు, మహరాష్ట్ర ప్రాంతంలో నివసించేవారు. దక్షిణదేశంలో, ఆంధ్రప్రదేశపు కోమట్లు, తమిళదేశపు చెట్టీలు, ప్రముఖమైన వ్యాపార వర్గాలు. కాని, ఇండియాలోని వ్యాపారస్థులందరూ ధనికులై ఉండిరని భావించడం తప్పు. సాధారణస్థాయిలో ఉన్నవారూ, దారిద్ర్యంలో ఉన్న వారూ కూడా, అనేకులు వారిలో ఉండినారు.

వర్తకులేకాక, విత్తనిర్వాహకులు కూడా-పెద్ద-చిన్న-అనేకులు ఉండినారు. బెంగాలులోని జగత్ సేఠులు, గుజరాతులోని నాథ్‌జీలు, దక్షిణదేశంలోని చెట్టీలు, ఎక్కువ అభివృద్ధిలో ఉన్న, సంపన్న విత్త నిర్వాహకులు (Financiers). అల్లావర్దీఖాన్ పరిపాలనారంభ కాలానికి, జగత్ సేఠులవద్ద, పదికోట్ల రూపాయల మూలధనం, ఉండింది. బెంగాలుపై జరిపిన మొదటి దండయాత్రలో మహరాష్ట్రులు జగత్‌సేఠుల కోఠీనుంచి రెండుకోట్ల ఆర్కాటు రూపాయలను దోచుకొనిపోయిరి. ఇంతటిపెద్దనష్టంవల్ల కూడా వారి ధన సంబంధమైన ఆధార మూలాలకు భంగంకలుగలేదు. ఒక్కొక కోటిరూపాయల విలువగల దర్శనహుండీలను, వారు విడుదల చేస్తూ ఉండేవారు, అనే విషయాన్నిబట్టి, వారి కార్యకలాపాల విస్తృతిని, నిర్ణయించవచ్చు. సూరత్‌లోని నాథ్‌జీలకు కూడా ఇదే విధమైన ధనాధారమూలములు ఉండినవి. దేశీయులైన రాజులతో తూర్పు ఇండియా కంపెనీ పోరాటం సాగిస్తున్న కాలంలో, బ్యాంకింగు వ్యవస్థ, కంపెనీ వారికి విత్తసహాయాన్ని ఇచ్చింది.

బెంగాలు జగత్‌సింగుసేఠులు పూర్వం మార్వారుప్రాంతంనుంచి వచ్చినవారు; సూరత్‌లోని నాథ్‌జీలు, బనారస్‌నుంచి వలసవచ్చినవారు. తూర్పుదేశంలోను [బెంగాల్] పశ్చిమ దేశంలోను [గుజరాత్], ఉన్న విధంగానే, దక్షిణదేశంలో, వర్తకవ్యాపారాలలో ఏకస్వామ్యమైన స్థానాన్ని వహించినవారు, నాటుకోటి చెట్టియార్లు- అత్యధికమైన సంపత్తికలవారని ప్రసిద్ధి. వీరి వ్యాపారం, బర్మా, ఇండియా, మలయా, తూర్పుద్వీపాలకు కూడా వ్యాపించింది. తూర్పుకంపెనీ వారికాలంలో, లంకలో ఉన్న చెట్టియార్లు, బ్యాంకర్లుగా వ్యవహరిస్తూ మదరాసు, బొంబాయి, కలకత్తా నగరాలపై ఉన్న హుండీలకు బదులుగా, ఆంగ్లవర్తకులకు నగదు ద్రవ్యాన్ని ఇచ్చేవారు. రాజధానీనగరాలలో, వారికి సక్రమమైన కార్యనిర్వాహక సంస్థలు ఉండినవి.

ఈ బ్యాంకింగు సంస్థలకు, రాజకీయవ్యవహారాలలో కూడా ఎక్కువ పలుకుబడి ఉండేది. సర్‌ఫరాజ్‌ఖానును పదవోసి, అల్లావర్దీఖానును రాజుగాచేయడంలో సేఠ్‌మహతాబ్‌రాయ్, సేఠ్‌సరూప్ చందులు, సహాయంచేసిరి. జగత్‌సింగ్ తనకు ఎదురు తిరగడంవల్ల, సురాజ్-ఉద్-దీన్, నాశమైనాడు. ఔరంగజేబు తర్వాతవచ్చిన చక్రవర్తులు, సైన్యాలను సమకూర్చుకోడానికి డబ్బులేక ఆపదలకులోనైరి. చక్రవర్తి అధీనంలోని ఖాల్సాభూములను

పృథగా పోగొట్టుకొని ఉండడంవల్ల, ఈ చక్రవర్తులు అప్పులుచెల్లించలేరని గ్రహించి, బ్యాంకర్లు అప్పులు ఇవ్వడానికి నిరాకరించిరి. ధనాభావంవల్ల ఎల్లప్పుడూ చిక్కులలో పడి యున్న, కడపటి పీష్వాలకు కూడా ఇట్టిగతే పట్టింది.

న్యాసధనాన్ని (Deposits) స్వీకరించడము, అప్పులు ఇవ్వడము, హుండీలను విడుదలచేయడము, మొదలైన అధునాతన బ్యాంకు కార్యక్రమాలను అన్నిటినీ, ఆనాటి పెద్ద బ్యాంకర్లు నిర్వహించేవారు. వ్యాపారానికీ, పరిశ్రమలకూ విత్తాన్ని సమకూర్చడము, వృత్తి కార్మికులకూ, ఇతరవస్తూత్పాదకులకూ అప్పులను ఇవ్వడము, మొదలైన కార్యాలను నిర్వహిస్తున్న చిన్న బ్యాంకర్లూ కూడా ఉండినారు. ప్రతిగ్రామంలోనూ, వడ్డీవ్యాపారస్థుడు ఉండేవాడు. వ్యవసాయకార్యక్రమాలు నడపడానికి రైతుల, కుటుంబకర్చులకు, చావు, పెండ్లి, పశువులు కొనడము, మొదలైన అత్యవసర సందర్భాల కర్చులకు, ఇతడు రైతుకు అప్పులు ఇచ్చేవాడు. వాస్తవంగా, గ్రామసమాజము అంతా వడ్డీ వ్యాపారస్థుల చేతులలో చిక్కుకొని ఉండేంది. రైతులు, వృత్తికార్మికులు, సంపన్నగృహస్థులు, రాజులు, రాజకుమారులు,- అందరికీ వడ్డీవ్యాపారస్థులతో సంబంధం ఏర్పడి ఉండింది. తమ స్వంతవ్యవహారాల విషయంలోనూ, దేశవ్యవహారాల విషయంలోనూ కూడా, వీరు, విత్తసహాయానికై వడ్డీవ్యాపారస్థులపై ఆధారపడిఉండిరి. "దేశీయులైన రాజులు, ఋణపత్రాలరూపంలో డబ్బుచెల్లించేవారు. ఈ ఋణపత్రాలకు బదులుగా ఎంతద్రవ్యం ఇవ్వవలసింది అనే నిర్ణయం, ఋణదాతలపై ఆధారపడి ఉండేది. "దేశంలోని అందరి బ్యాంకర్లకు, విత్తనిర్వాహకులకు, ఋణదాతలకు ఉండిన ద్రవ్య ఆధారాలను లెక్కకు తీసుకొన్నట్లయితే, దేశంలోని మొత్తం మూలధనం యొక్క ఆధారాలు మిక్కిలి భద్రములైనవని, వ్యక్తమౌతుంది. కాని, ఈ ద్రవ్యాధారమూలాలు, అసమానస్థితిలో ఉన్న కుటుంబాలలో చెదరిఉండినవి. కాబట్టి, విస్తృతపరిమాణంకల పరిశ్రమలను అభివృద్ధిచేయడానికి అవి సమర్థములు కాలేదు.

**వ్యవసాయముయొక్క హీనస్థితి :** పదహేడు పద్దెనిమిదో శతాబ్దాలలో, వ్యాపారము-పరిశ్రమలు, మంచి అభివృద్ధిలో ఉండినవి. కాని, వీటితో సమానంగా వ్యవసాయము వృద్ధికి రాక, ప్రాచీనకాలపు పద్ధతిలోనే చైతన్య రహితంగా నిలిచిపోయింది.

రైతుయొక్క అధీనంలో ఉన్న పొలంయొక్క సరాసరి విస్తీర్ణాన్ని తెలుసుకోడానికి, తగిన ఆధారాలు లభ్యంకాలేదు. క్షేత్రస్వభావాన్ని, భూసారాన్ని, వాతావరణాన్నీబట్టి, రైతు పొలంయొక్క విస్తీర్ణం, ప్రాంతానికి ప్రాంతానికీ, గ్రామానికి గ్రామానికీ కూడా భిన్నమై ఉండి యుండవచ్చు. సేద్యానికి అవసరమైన పెట్టుబడిని రైతుకుటుంబంలోని శ్రామికుల సంఖ్యనుబట్టి, అతడు సాగుచేసే జమీను పరిమాణం పరిమితమై ఉండి ఉంటుందేకాని, ఆ ప్రదేశంలో ఉన్న వ్యవసాయక్షేత్ర విస్తీర్ణాన్ని బట్టికాదు. సాగుబడి చేయగల క్షేత్రం, రైతుల అవసరానికంటె, ఎక్కువగానే ఉండింది. రైతు అనుభవంలో ఉన్న జమీను చిన్నదై ఉండడానికి, పెద్దపొలాలను సాగుచేసే శక్తిసామర్థ్యాలు అతనికి లేకపోవడమే, కారణం. ఐనప్పటికీ, మొగలు సామ్రాజ్యకాలంలో, రైతు అనుభవంలో ఉన్న పొలంయొక్క సరాసరి విస్తీర్ణం పందొమ్మిదో శతాబ్దపు ఉత్తరార్థంలో దాని కంటే, పెద్దదే. దీనికి మునుపటి రోజుల్లో వ్యవసాయాన్ని నిర్వహిస్తున్న ప్రజల సంఖ్య తరువాతికాలం కంటె స్వల్పమై ఉండడం, మొదటి హేతువు. మొత్తం జనాభాలో, రైతుల సంఖ్యా నిష్పత్తికూడా చిన్నదై

ఉండడం రెండవ హేతువు. మొగలుల కాలంలోని, జమీను ప్రమాణం, సాధారణంగా ఒక రైతుకుటుంబం, సౌలభ్యంతోను, పొదుపుతోను, నిర్వహించడానికి తగినట్లుగా, ఏర్పడి ఉండేనది. కాబట్టి, జమీనును పీలికలు చేయడము, ఉపభాగాలుగా చేయడము, ఆర్థికంగా స్వయంపోషకము కాకపోవడము, అనే సమస్యలు పద్దెనిమిదో శతాబ్దాంతం వరకు, ఉత్పన్నం కాలేదు. పదిహేడు పద్దెనిమిదో శతాబ్దాలలోని రైతుయొక్క జీవన పరిస్థితి, పందొమ్మిదో శతాబ్దంలోని రైతు పరిస్థితికంటె మెరుగుగా ఉండేంది. జమీను విస్తీర్ణ విషయంలోనే కాక, మొగలుల కాలంలోని సరాసరి ఉత్పత్తి, తర్వాతి కాలంకంటె అధికమైనది. అక్బర్ కాలంలో, పోలజ్ భూముల మాధ్యమ సరాసరి [ఉత్తమ, మధ్యమ, అధమరకపు పొలాల సరాసరి] ఉత్పత్తి, ఎకరానికి 12 మణుగులు 33 సేర్ల గోధుమలు, ఇదే పరిమాణం వడ్లు. ఇప్పుడు ఉత్తరప్రదేశ్ అని వ్యవహారంలో ఉన్న భూభాగానికి సంబంధించిన, అంచనా, ఇది. ఇరవైయో శతాబ్దపు ప్రథమ దశాబ్దంలో, ఇక్కడి భూముల సరాసరి ఉత్పత్తి 12 మణుగులు 31 సేర్లు గోధుమలు; 10 మణుగులు, 13 సేర్ల వడ్లు, అని అధికార సంఖ్యా పరిగణన వివరాలవల్ల తెలుస్తుంది. ఉత్పాదన ఇంతకంటె తక్కువ అని ఇతర అధికార సంఖ్యాపరిగణనలను తెల్పుతున్నవి. ఉత్పత్తి ఈ విధంగా తగ్గిపోవడానికి రెండు విషయాలు హేతువులైనవి,- (1) జనాభా ప్రాబల్యం అధికమౌతూరాగా, తగ్గురకపు భూములనుకూడా సాగుబడిలోనికి తీసుకొనిరావలసిన అవసరం ఏర్పడింది. ఈ భూములలోని ఉత్పాదన పూర్వము సారవంతములైన భూముల ఉత్పాదనకంటె, చాల తక్కువ. ఇది ఒక కారణం. (2) శతాబ్దాలుగా పంటలు పండిస్తూ, ఎరువులతో దోహదంచేయకపోవడంవల్ల భూమిసారం క్షీణించి పోవడం జరిగింది. క్షేత్రం, తన సహజఉత్పాదకశక్తులను మళ్ళీ వృద్ధిచేసుకొనేవరకూ, దానిని కొంత కాలం బీడుగాకూడా విడువలేదు. కాబట్టి, రెండు విధాలా భూమి, నిస్సారమై పోయింది: కాబట్టి ఉత్పత్తి తగ్గిపోయింది.

వ్యావసాయిక ఉత్పాదనలో మిక్కిలి ప్రధానమైనవి, ఆహారధాన్యాలు. పధ్నాలుగో శతాబ్దంలో దక్కనును సందర్శించడానికి వచ్చిన న్యూనిజ్ (Nuniz) వ్రాసినదాన్నిబట్టి, గోధుమ, పప్పుదినుసులు, వరి, జొన్న, ఈ ప్రాంతంలో పండించే ధాన్యాలు. "వీటిలో ప్రజలు ఎక్కువగా వినియోగించేది, జొన్నలు. దాని తర్వాత, నోటిలో ఎప్పుడూ ప్రజలు నములుతూ ఉండేది, తాంబూలం." దక్కనులోని ప్రజలు ముఖ్యాధార ధాన్యాలైన జొన్నలు, సజ్జలు విస్తారంగా పండిస్తారని, ఖాఫీఖాన్ కూడా వ్రాసినాడు. ఉత్తరదేశంలో కూడా, ప్రజల ఆహారపదార్థాలలో ముఖ్యమైనది జొన్న; కాబట్టి, దానిని ఎక్కువగా పండించేవారు. కాని, ఔధ్ ప్రాంతంలో శ్రేష్ఠమైన బియ్యం, "తెల్లదనానికీ, నాజూకుతనానికీ, సువాసనకూ, ఆరోగ్యానికీ, అద్వితీయమైనది"- పండించేవారు. ఆకాలంలో, ఉత్తరప్రదేశంలో గోధుమ ప్రధానమైన పంటకాదు. ఆగ్రాలోని అక్బరు ఆస్థానంకూడా, బెంగాలునుంచి గోధుమలు తెప్పించుకొంటూ ఉండింది.

ఆహారపదార్థాల తర్వాత, చెరకు, పత్తి, విస్తారంగా పండేపంటలు. అన్ని ప్రదేశాలలోనూ పత్తి పండించేవారని, చెరకును కొన్ని ప్రదేశాలలో మాత్రమే పండించేవారని, థేవెనాట్ (Thevenot) వ్రాస్తాడు. వాణిజ్యపు పంటలలో ముఖ్యమైన పొగాకును, పదహేడో శతాబ్దారంభంలో, పోర్చుగీసువారు, గుజరాతుప్రాంతంలో మొదటిసారిగా ప్రవేశపెట్టిరి.

పొగాకువినియోగం, దేశంలో శీఘ్రంగా పెరిగింది. దానితో, పొగాకుపంటకూడా విస్తృత మయింది. వాణిజ్యపుపంటలుగా అపీము, నీలిమందుకూడా కొంత ప్రాముఖ్యానికి వచ్చినవి. బీహారులోని కొన్ని ప్రదేశాలకుమాత్రమే ఈ పంటలు పరిమితమై ఉండినవి. గుడ్డలు తయారు చేసుకోడానికై పత్తి, చాలవరకు, కుటుంబాలలోనే వినియోగపడేది. బెల్లము, చక్కెర, తయారుచేయడానికి, చెరకు వినియోగపయ్యేది. ఆహారధాన్యాల వ్యాపారం పరిమితమైనట్టిది. పట్టణాలలోని ప్రజల అవసరంతీరగా, సుభిక్షములైన ఏండ్లలో, మిగిలినధాన్యాన్ని, భూమిలో నిర్మించిన పాతర్లలో రైతులు, నిలువచేసి ఉంచేవారు. వాతావరణ పరిస్థితులవల్ల ఉత్పాదనలో ఏర్పడే వ్యత్యాసాలను సరిదిద్దుకోడానికై, ఈ నిలువ ధాన్యాలు సమీకరణ భండారాలుగా (Buffer Stocks) ఉపయోగించేవి. ధాన్యాన్ని పాతర్లలో నిలువచేసి ఉంచే ఆచారం, బ్రిటిషువారికి పూర్వం, విస్తారమై ఉండిందని, అది సర్వసామాన్యమైన పద్ధతిఅని, బ్రిటిషు వారి రాజస్వ అభిలేఖలు తెలుపుతున్నవి. దేశంలో రైలుమార్గాలు ఏర్పడి, సముద్ర ప్రయాణానికి సూయెజ్ కాలువ ఉపయోగించిన పిమ్మట, అనగా, 1860 తర్వాతనే, ఈ ధాన్యాల నిలువ పద్ధతి, ఆగిపోయింది. ధాన్యాన్ని నిలువచేసేపాతర్లు, చాలభద్రంగా నిర్మితములైనవి, కాబట్టి, "40, 50, సంవత్సరాల దాకా ధాన్యం ఏమాత్రమూ చెడకుండా, మంచి స్థితిలో నిలువ ఉండేది." పరస్పరం మిక్కిలిదూరంలో ఉన్న పంజాబు, మైసూరు ప్రాంతాలలో ఈనాటికీ, అట్టి పాతర్లు నిలిచి ఉండడాన్నిబట్టి, ఈపద్ధతి దేశంలో ఎంత వ్యాప్తిలో ఉండినదీ, వ్యక్తమౌతుంది.

దేశంలో క్షామభయం కూడా లేకపోలేదు. 1595కు 1792కు మధ్యగల 200 సంవత్సరాలలో 24 క్షామాలు, దుర్భిక్షాలు, ఏర్పడినవని అభిలేఖపత్రాలనుబట్టి తెలుస్తుంది. వీటిలో అధికభాగం తీవ్రమైనవికావు. కాని, 1630లో విజయనగరం, దక్కన్, గుజరాతులను నాశనంకావించిన పెద్ద క్షామాలు ఎక్కువ జననష్టాన్ని, వర్ణించరాని దుస్థితినీ కలిగించినాయి. క్షామాలవల్ల కలిగిన భయంకరదుస్థితిని, వ్యాన్‌ట్విస్ట్, ఈ విధంగా వర్ణిస్తాడు. "వర్షపాతం అల్పాతల్పమైనందువల్ల, విత్తినబీజం నష్టమైపోయింది. పొలంలో గడ్డి కూడా పెరగలేదు. పశువులు చనిపోయినాయి. పట్టణాలలో, గ్రామాలలో, పొలాల్లో రోడ్లలోకూడా, అసంఖ్యాకంగా ప్రజలు మరణించినారు. ఆశవాలు కుళ్ళి దుర్గంధం వ్యాపించడంవల్ల, రోడ్లలో నడవడం కూడా దుస్సహమయింది. గడ్డి లేకపోవడంవల్ల పశువులు శవాలను తినడం ఆరంభించినాయి. తినడానికై, పశువులశవాలను మనుష్యులు మోసుకొనిపోయేవారు. తినడానికి ఏదీ దొరకక, దిక్కులేని ప్రజలు, కుక్కలు కొరికిన ఎముకలకై ప్రాకులాడేవారు."

దుర్భిక్షానికి గురియైన ప్రాంతంలో ఆహారధాన్యాల కొరత ఏర్పడడంవల్ల, ఆ రోజులలో క్షామపరిస్థితులు ఏర్పడినవని చెప్పవచ్చు. అప్పుడప్పుడుకలిగే ఈ విపత్తులు, దేశం మొత్తంలో, ఆహారం కొరతపడింది అనడానికి, సూచకములుకావు. 1630, 1647. సంవత్సరాలలో ఉత్పన్నమైన తీవ్రక్షామాలకాలంలో కూడా "దేశంలోని ఇతరప్రాంతాలలో ఆహార వస్తువులు సమృద్ధిగా లభిస్తూఉండేవి." దుర్భిక్షానికి గురియైన ప్రాంతాలకు, ఆహారధాన్యాలను సరఫరాచేయడానికి తగిన సౌకర్యాలు చాలతక్కువ. భారపశువులపై (Pack anima's) ఆహారధాన్యాలను దూరప్రాంతాలకు సాగించడం, చాలకష్టం. వాటికి కావలసినగడ్డి, నీరు, సరఫరాచేస్తూ ప్రయాణాలు సాగించడం, అమితవ్యయంతో కూడిన ప్రయత్నం. క్షామాలవల్ల,

ఏర్పడిన భయానక పరిస్థితులను తగ్గించడానికి ప్రతిబంధకమైనది, సులభ శీఘ్రము లైన రవాణా మార్గాల కొరత. పదిహేడు, పద్దెనిమిదో శతాబ్దాల క్షామాలవల్ల, ఏర్పడిన దురంతకష్టాలు, 1860 తర్వాత ఏర్పడిన క్షామాల పరిస్థితులకు, స్వభావతః భిన్నమైనవి. 1860 తరువాత, సాధారణ పరిస్థితుల సంవత్సరాల పంటధాన్యాలను ఎగుమతిచేయడం వల్ల, దుర్భిక్ష సంవత్సరాలలో ధాన్యం కొరతపడి, ధరలు పెరిగిపోయి, తిండిలేని దుస్థితి ఏర్పడింది. కాబట్టి, 1860 తర్వాతి క్షామ పరిస్థితులలో, దుస్థితికి కారణమైనది ఆహార ధాన్యాల కొరత; రవాణా సౌకర్యాలు లేకపోవడం కాదు.

పదిహేడు పద్దెనిమిదో శతాబ్దాలలో, సహజస్థితులు సాధారణమై ఉన్నప్పుడు, ఆహార ధాన్యాల సరఫరా దేశ ప్రజల అవసరాలకు సరిపోయేది. కాని, పందొమ్మిదో శతాబ్దపు రెండవ భాగంలో, "దేశం మొత్తం జనాభాలోని ఐదవ వంతు,-అనగా 4 కోట్ల ప్రజానీకం, సగం కడుపుతో జీవనం సాగిస్తున్నారు," అని, విశ్వసనీయమైన అధికార సాక్ష్యం. కాబట్టి, అంతకు పూర్వపు రోజులలోనే, ప్రజల పరిస్థితి మెరుగగా ఉండింది. పందొమ్మిదో శతాబ్దపు ఉత్తర భాగంలోని పరిస్థితులనుగూర్చి వ్రాస్తూ, సర్ చార్లెస్ ఎలియట్, "ఆకలిని సంతృప్తిపరచు కోవడం అనే అనుభవం, సంవత్సరంలో ఒక్కనాడు కూడా, మన కర్షక జనంలో సగం మందికి కలుగదు అని చెప్పడానికి, నేనేమాత్రమూ జంకను," అని వివరించినాడు. కాబట్టి, దుర్భరక్షామాలు పదేపదే ఏర్పడుతున్నప్పటికీ కూడా, బ్రిటీషు వారికి పూర్వపు రోజులలోని సాధారణ సంవత్సరాలలో, కర్షక జనం యొక్క పరిస్థితి, పందొమ్మిదో శతాబ్దంలోని పరిస్థితికంటె ఉత్తమమైనది.

వెలలు, కూలీలు: సంచార సాధనలు. రవాణాసౌకర్యాలు, తక్కువగా ఉండడంవల్లను, ఆహారధాన్యాల వ్యాపారము, ఇతర వ్యవసాయోత్పత్తుల వ్యాపారము, పరిమితమై ఉండడం వల్లను, ప్రదేశానికీ, ప్రదేశానికీ సరకుల ధరలలో ఎక్కువ వ్యత్యాసము: ఏర్పడింది. ఆహార ధాన్యాల ధరలు, సాధారణంగా, ఉత్తర భారతంలో కంటె, బెంగాలులో చౌకగా ఉండినవి; గుజరాత్, పశ్చిమభారత ప్రాంతాల్లోని ధరలు, ఉత్తర భారతంలో కంటె అధికం.

ఈ ప్రాంతీయ భేదాలను లెక్కపెట్టక, దేశం మొత్తంలోని పరిస్థితిని చూస్తే, ఆహార ధాన్యాలు, జీవనానికి అవసరములైన ఇతరవస్తువులు, ఇప్పటికంటె, బ్రిటీషువారి పూర్వపు రోజులలో, అసాధారణమైన చౌకగా ఉండేవి. ఈ విషయాన్ని, ఈ క్రింది వివరాలు నిరూపిస్తాయి. 1600 సంవత్సరం, ఉత్తర భారతంలో, రూపాయకు 90 సేర్ల గోధుమలు లభించేవి. 1650లో, 107 సేర్లు; 1729లో, 131 సేర్లు (బెంగాలులో). 1600లో, రూపాయకు 103.5 సేర్లు జొన్నలు అమ్మేవి; 1650లో, 123 సేర్లు. 1600లో సజ్జల వెల రూపాయికి 181 సేర్లు; 1650లో, 214 సేర్లు. పప్పుల ధర 1600లో, రూపాయికి 130 సేర్లు; 1650లో, 160 సేర్లు; 1729లో, 171 సేర్లు (బెంగాలులో). ఆహార ధాన్యాల్లో అత్యంతమూ ప్రియమైనది బియ్యం. కాని, అది కూడా, 1600లో, రూపాయికి 54 సేర్లు అమ్ముడుపోయింది; 1650లో, 64 సేర్లు; 1729లో, 153 సేర్లు (బెంగాలులో). 1807 నాడు కూడా, ఉత్తర బెంగాలులోని బియ్యం ధర రూపాయికి, 120 సేర్లు.

రోజూ ప్రజలు వినియోగించే ఇతర పదార్థాలలో ముఖ్యమైనవి, నెయ్యి, నూనె, చక్కెర, ఉప్పు. 1600లో ఉత్తర భారతంలోని నెయ్యి ధర, రూపాయికి 10.8 సేర్లు;

1661లో, 7 నుంచి 8.75 సేర్లు; 1729లో, 9.6 సేర్లు. 1300లో, నూనె రూపాయికి 13.5 సేర్ల ప్రకారం, అమ్ముడు పోయేది; 1661లో, 20 నుంచి 23 సేర్లు; 1729లో 21 సేర్లు. 1600లో, చక్కెర ధర రూపాయికి 19.3 సేర్లు; 1661లో, 41 సేర్లు. 1600లో, రూపాయికి 67 సేర్లు ఉప్పు లభించేది.

ధరల వ్యత్యాసాలు రెండు విధములైనట్టివి; ప్రాంతాలకు సంబంధించినవి; కాలముల మార్పులకు సంబంధించినవి. ఎక్కువ పరిమాణంగల ఆహార పదార్థాలను ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి రావాణా చేయడంలో ఉన్న కష్టాలు, దానికి అయ్యే ఎక్కువ ఖర్చులు, మొదటి వ్యత్యాసానికి కారణాలు. రైలు మార్గాలు ఏర్పడక పూర్వం ఒక ప్రదేశంలో గోధుమల ధర రూపాయికి మూడు, నాలుగు సేర్లు ఐఉండడము, నూరు మైళ్లకు లోపుగా ఉన్న ఇతర ప్రదేశంలో, అదే గోధుమలు 40, 50 సేర్లు రూపాయికి అమ్మడము, క్షామ సందర్భాల్లో ఉండిన సాధారణ పరిస్థితి.

మొగలులు రాజకీయమైన ఐక్యాన్ని, దేశంలో నెలకొల్పిరి. కాని, విస్తృతమైన ఈ ఉప ఖండంలోని వివిధ ప్రాంతాలకు అన్నిటికీ సమానమైన ఒక బజారును స్థాపించి, సరుకులకు ఏక ప్రకారమైన ధరల స్థాయిలను, దేశమంతటికీ వర్తించే వర్తకపు పోటీని, ఏర్పరచలేకపోయిరి. ఇటువంటి ఆర్థిక సంయోజనాన్ని, దేశములోని వివిధ ప్రాంతాలకు సిద్ధింపచేసినవారు బ్రిటిషువారు. విస్తారమైన ఈ భూ భాగంలోని ప్రజలలో ఐక్య భావాన్ని, జాతీయమైన ఐక్యాన్ని కలిగించడానికి, ఈ విధమైన ఆర్థిక సంయోజనం, అత్యావశ్యకం.

ఆహారధాన్యాల వర్తకాన్ని చక్కగా నిర్వహించే బజారు, దేశంలో అభివృద్ధికి రానందువల్ల, ప్రతిప్రాంతమూ, ప్రతిగ్రామమూ కూడా, ఆహారపదార్థాల సరఫరాలో తనకుతాను, స్వయంపోషక సమర్థమై ఉండేపరిస్థితి, సహజంగా ఏర్పడింది కాని, ఇట్టిపరిస్థితులవల్ల కొన్ని అసౌకర్యాలు, అననుకూలాలు కూడా సిద్ధిస్తాయి. సువృష్టి కలిగిన సంవత్సరాలలో పండిన ఎక్కువధాన్యాన్ని అమ్ముకొనే అవకాశం రైతులకు లేకపోయింది. మిగులుధాన్యాన్ని నిలువచేసి ఉంచడమో, లేక చౌకధరలకు అమ్మడమో చేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఇక, వర్షము తక్కువగా ఉండి, పంటలుపండని సంవత్సరాలలో, తనకు కావలసిన ధాన్యాన్ని బైటినుంచి తెచ్చుకొనే సౌకర్యం కూడా లేదు. విధిలేక తెచ్చుకొనే సందర్భంలో, తలకుమించిన ధరలు రైతును నాశంచేసేవి. ఒకే ప్రదేశంలో కూడా, ఒక సంవత్సరం ఉన్న ధరలకు, మరొక సంవత్సరం ధరలకు, విస్తారమైన వ్యత్యాసం ఏర్పడుతూఉండేది. ఈ క్రిందివివరాలు ఇందుకు నిదర్శనం. 1712 సంవత్సరం, ముర్షీదాబాదులో గోధుమలధర, రూపాయికి 20 సేర్లు;1729లో, అదే స్థలంలో రూపాయికి 3 మణుగుల 30 సేర్లు. 1712లో బార్లీధర రూపాయికి 27 సేర్లు; 1729లో, 8 మణుగులు. 1712లో బియ్యంధర రూపాయికి 10 సేర్లు; 1729లో, ముడిబియ్యం 0,4 మణుగులు 15 సేర్లు.

కూలిమీద ఆధారపడి ఉండే ప్రజల విషయంలో, ధరల స్థాయికిగల ప్రాబల్యం అధికం. వారి జీవనపరిస్థితులు, దీనిపై ఆధారపడి ఉంటాయి. పదిహేడు, పద్దెనిమిదో శతాబ్దాలలో, కూలిశ్రామికులందరూ ప్రత్యేకంగా పట్టణాలవ్యవస్థకు చెందినవారు. గ్రామాలలోని వృత్తికార్మికులకూ, సేవకులకూ, వారుచేసిన సేవలకు ప్రతిఫలంగా, ప్రతిసంవత్సరపు పంటలోనూ, వారి వారికి తగినఅంశాలు నిర్దిష్టమై ఉండినవి. పట్టణాలలోని సాధారణ శ్రామిక

లకు, నిపుణ శ్రామికులకు, ప్రభుత్వసేవలోని చిన్న ఉద్యోగులకు, లభించేకూలీలు, వేతనాలు, ద్రవ్యరూపమైనవి. (నగదు).

అక్బర్‌కాలంలో, దాసులకు (Slaves), అతినిమ్నస్థాయికి చెందిన శ్రామికులకు, లభిస్తూఉండిన దినకూలి, 3, లేక 4 కానులు మాత్రమే. మేదరవాండ్లు, ఇటికలు తయారు చేసేవారు, రంపపుకోతగాండ్లు. వార్నీషుపూసేవాండ్లు, రోజు కూలీలు,-మొదలైనవారు ఈ నిమ్న స్థాయికి చెందిన శ్రామికులు. వడ్రంగులు, బేల్దార్లు. సున్నపుగారచేసేవాళ్ళు. మొదలైన నిపుణ శ్రామికుల దినకూలి, 9 కానులు మొదలు 10½ కానుల దాకా ఉండినది. జహంగీర్ కాలంలో, సాధారణ శ్రామికునికి 5 లేక, 6 కానులు దినకూలి, లభించేది. నిపుణ శ్రామికుని కూలి, దీనికి రెండంతలు.

పద్దెనిమిదోశతాబ్దపు మధ్యకాలానికి, కలకత్తాలో, సాధారణ శ్రామికుని దినకూలి 6 కానులుగాను, నిపుణ శ్రామికుని కూలి 10 కానులుగాను, వ్యవహారములో ఉండినది. జహంగీరు కాలంలో ఉన్న కూలీలకు, ఇవి సమానమైనవి. జహంగీరుకాలంలో, కూలిరేటు అత్యున్నత స్థాయికి పెరిగినట్టు తోస్తుంది.

ఇప్పటి ప్రమాణాలతో పోల్చిచూస్తే, సాధారణ శ్రామికులకు జహంగీర్‌కాలంలో లభిస్తూ ఉండిన కూలీలు, అత్యంతమూ అల్పమైనవిగా కనబడతాయి. మొగలుల పరిపాలన కాలంలోని శ్రమికవర్గంవారు, బ్రిటీషు పరిపాలన కాలంలోని వారికంటె, దరిద్రులై ఉండిరని, దీని అర్థంకాదు. మొగలుల కాలంలో ఆహార పదార్థాలు, ఇతర పదార్థాలు అతి చౌకగాఉండి నందువల్ల, శ్రామికుల అసలు కూలీలు (Real wages), అల్పమైనవి కావు. వాస్తవంగా పరిశీలిస్తే, వీరికి రెండు వందల సంవత్సరాల తర్వాత, శ్రామికులకు లభించిన కూలీల కంటె, వీరికి లభిస్తూ ఉండిన కూలీలే నిజంగా అధికమైనవి. బ్రిటీషువారి పరిపాలన కాలంలో కంటె, మొగలుల పరిపాలన కాలంలోని కర్షక శ్రామికులకు,-ఎక్కువ తిండి దొరుకుతూ ఉండింది. [దుర్భిక్షకాలంలో తప్ప.]

పట్టణాలలోని సాధారణ శ్రామికునికి లభించే కూలికికూడా, ఇదే విధంగా, ఎక్కువ ఆహారవస్తువులు లభించేవి. దిన కూలిని ఆహారధాన్యంలో లెక్కిస్తే, జహంగీరు కాలంలో 12.5 సేర్లు బార్లీ, లేదా, 10.23 సేర్లు జొన్నలు, లేదా, 16.7 సజ్జలు, సాధారణ శ్రామికుని దినకూలికి లభించేవి.

1825 కాలంనాటికి, సాధారణ శ్రామికుని దిన కూలికి బదులుగా 2.3-2.9 సేర్లు బార్లీ, లేక, 2.1-2.6 సేర్లు జొన్నలు, లేదా, 2-2.5 సేర్లు సజ్జలు మాత్రమే లభించేవి. పందొమ్మిదో శతాబ్దం నాటికి, కూలి విలువ ఈ విధంగా తగ్గిపోయింది. జహంగీర్‌కాలంలో, సమర్థుడైన శ్రామికుడు తాను సంపాదించే దినకూలితో, నలుగురు ఐదుగురు వ్యక్తులతో కూడిన కుటుంబాన్ని పోషించగలిగేవాడు. ఆతర్వాత, నూటయాభై సంవత్సరాలకు ద్రవ్య రూపంలో వచ్చే దినకూలి ఒక కాని ఎక్కువైనప్పటికీ, కూలిడబ్బులకు లభించే ఆహార ధాన్యం, చాలతక్కువైపోయింది. ఈ విధంగా శ్రామికులకు లభించే కూలి విలువ, అనగా అసలుకూలి, ఎంతో తగ్గిపోయింది. కాబట్టి, కుటుంబ యజమాని సంపాదించే కూలికుటుంబ పోషణకు చాలకపోగా, చిన్నపిల్లలు, ముసలివాళ్లూ తప్ప, కుటుంబములోని తక్కిన వారందరూ, శ్రమించి పొట్టపోసుకో వలసినగతి పట్టింది.

*ఆహారధాన్యాల వినియోగము,-ప్రజానీకంయొక్క జీవన ప్రమాణము :* ఇప్పటి వలెనే, ఆనాడు కూడా బీదప్రజల వర్గాలు ఉండినవి; వారి జీవన ప్రమాణం చాల హీనస్థితిలో ఉండింది. ఐనా, ఆకాలపు బీదప్రజలకు, జీవితానికి అవసరములైన వస్తువులు తరువాతి కాలం వారి కంటె ఎక్కువగా ఉండినవి. తరువాతికాలంలో కంటె మొగలుల కాలంలో, ఎక్కువ పుష్టికరమైన ఆహారం బీదలకు లభిస్తూఉండింది. యూరోపుదేశాలలో జరిగిన ఆర్థికాభ్యుదయంవల్ల, అచ్చటి బీదవర్గాలవారి జీవన ప్రమాణం అభివృద్ధిచెందుతూ వచ్చింది. కాని, ఇండియాదేశం ఆర్థికంగా క్షీణిస్తూరావడంవల్ల, ఇచ్చటి బీద ప్రజలవస్తు వినియోగం (Consumption), క్షీణించడం దేశంయొక్క దురదృష్టం.

బీద ప్రజల వినియోగం క్షీణించడం, ముఖ్యంగా ఆహార పదార్థాల విషయంలో. పదహేడోశతాబ్దంలో, ప్రజానీకమంతా, సామాన్యంగా, వెన్న, లేక నెయ్యి, ఉపయోగించే వారు. పెల్‌సేర్ట్, దలెట్ (Pelsaert and Delaet) అనేవారు వ్రాసినదాన్నిబట్టి, సామాన్య ప్రజలు, నెయ్యి లేక వెన్న, కలుపుకొని, కిచిరి [కిచిడీ] రాత్రిపూట తినేవారని, అదే వారి రాత్రి భోజనమని, తెలుస్తుంది. ఉత్తర భారతంలోని ప్రజలు, జొన్నరొట్టెలు, లేదా గోధుమ రొట్టెలు తినేవారు. ఇచ్చటకూడా,-ఉత్తర బీహార్, బెంగాల్ తప్ప,-నెయ్యి, వెన్న, సమృద్ధిగా ఉండినవి. ఈ పదార్థాలు ఈనాటి కంటె ఎక్కువగా, ఆనాటి ప్రజలు వినియోగించేవారు. పందొమ్మిదో శతాబ్దంలోని బీద ప్రజల జీవనం ప్రమాణం కంటె, పదిహేడోశతాబ్దంలోని వారి జీవన ప్రమాణం ఉన్నతమై ఉండినది, అనే అభిప్రాయాన్ని అంగీకరించని మోర్‌ల్యాండ్ కూడా, ఒక విషయాన్ని మాత్రం ఒప్పుకొంటాడు. "కొవ్వు పదార్థాలు,-అనగా వెన్న, నెయ్యి, వనస్పతి నూనెలను తయారుచేసే నూనెగింజలు, ఆహార ధాన్యాలు ఈ నాటికంటె ఆకాలంలో, ఎక్కువ చౌకగా ఉండినవి అనడం ఖండితం. హీన వర్గాలవారు, వాటిని ఉత్పాదన చేసేవారు కాకపోయినప్పటికీ, విరివిగా వినియోగించేవారు." వేర్వేరు ప్రదేశాలలో నివసించే ప్రజలు వేర్వేరు అహార ధాన్యాలను వినియోగించేవారు. ఆయా ప్రదేశాలలో ఉత్పత్తిఅయ్యే పంటల వైవిధ్యాన్నిబట్టి, అచ్చటిప్రజల ఆహారధాన్యాల వినియోగం జరిగేది. ఈ విధంగా ఉత్తరభారతంలోని ప్రజలు చలికాలంలో మొక్క జొన్నలు, సజ్జలు, పప్పుదినుసులు, వినియోగించేవారు; వసంతకాలంలోను, గ్రీష్మకాలంలోను గోధుమరొట్టెలను ఉపయోగించేవారు.

యూరోపులోపండే గోధుమలకంటె ఇండియాగోధుమలు ఎంతోశ్రేష్ఠమైనవని, టెర్రీ అభిప్రాయం. "మిక్కిలి రుచికరమైన, శుచికరమైన రొట్టెలను ఇండియనులు గోధుమతో తయారుచేస్తారు. మనుష్యప్రయత్నంతో ప్రపంచాన్ని బాగుచేయవచ్చు, అని, లీజ్(Leige)ను గురించి చెప్పినవాదం (ఉన్నయనవాదం), ఈ రొట్టెలవిషయంలో, చక్కగా వర్తిస్తుంది." అని అతడు ఇండియా గోధుమలను శ్లాఘించినాడు. లాహోర్‌బజార్లలో, మూడు విధములైన గోధుమరొట్టెలు లభించేవి:- సాధారణమైన చపాతీలు, కుల్చాలు, గోఘనీలు, బియ్యం, ప్రధానాహారంగా ఉపయోగించేవారు. వెన్నతోచేర్చి కిచిడీ తినినట్లుగా, ఉత్తరభారత ప్రజలు వెన్నను, జున్నుగడ్డను, విరివిగా వినియోగిస్తారు. పశువులు, గొర్రెలు, మేకలు, ఈప్రాంతంలో బహుళసంఖ్యలో ఉండడంవల్ల, వెన్న, జున్ను, మొదలైన వస్తువులు వీరికి సమృద్ధంగా ఉన్నవి." ఆ కాలంలోని ప్రజలు వినియోగిస్తూఉండిన ఆహారధాన్యాలు ఉత్కృష్టమైనవి;

వాటిని వారు వినియోగించడం కూడా ఎక్కువే. అప్లే, వెన్న, నెయ్యి, పాలు, అనే వస్తువులను వినియోగించే విషయంలో కూడా, పదిహేడోశతాబ్దంలోని జనానీకం, పంతొమ్మిదోశతాబ్దంలోని వారికంటె, ఎక్కువ సుఖజీవనం గడిపేవారు.

జీవనానికి అవసరములైన చక్కెర, ఉప్పు అనే వస్తువుల వినియోగవిషయంలో, నిశ్చయాత్మకమైన చారిత్రిక సాక్ష్యం సమగ్రంగాలేదు. మొగల్‌కాలంలో నాజూకైన తెల్లచక్కెర సామాన్యప్రజల అందుబాట్లో ఉండలేదని, మోర్‌ల్యాండ్, అభిప్రాయము. ధాన్యవినిమయ పద్ధతిప్రకారం, ఆనాటి ఉప్పుధర ఇప్పటికంటె రెండురెట్లు అధికము," అని అతడువ్రాస్తాడు. పదార్థాలమ పరస్పరం గల ధరలను ఆధారంగాచేసుకొని, అవసరపదార్థాల వినియోగాన్ని నిర్ణయించడం తప్పుపద్ధతి. మోర్‌ల్యాండ్ అభిప్రాయానికి విరుద్ధమైన సాక్ష్యాన్ని, మైత్రీ ప్రదర్శించి ఉన్నాడు. "ఇండియాలో, ఉప్పు అధికంగా నిలువఉన్నది; చక్కెరసమృద్ధంగా పండుతూఉంది," అని ఈ విషయానికి ప్రాముఖ్యం ఇచ్చి వ్రాసియున్నాడు. మేలిమిచక్కెర ధర ఎక్కువగాఉండి, సామాన్యప్రజల దైనికవినియోగానికి, అందుబాటులో లేకపోయి ఉండవచ్చు. కాని, బెల్లము, సంస్కరింపబడని ఎర్రశర్కర (Brown sugar) బీదవారి ఇండ్లలో కూడా, విరివిగా వాడుకలో ఉండినవి. ఇప్పటి సామాన్యప్రజల వినియోగంకంటె, మొగలుల కాలపు బీదప్రజల వినియోగం, ఏ మాత్రమూ తక్కువకాదు. ఉప్పువిషయంలో మోర్‌ల్యాండ్ ఇచ్చిన అభిప్రాయం ముఖ్యంగా, దక్కనుప్రాంతం విషయంలో బలవత్తరమైనదే. "దక్కనులో, ఉప్పుకు గల విలువ అత్యధికమైనందువల్ల, అన్నానికంటె ఉప్పుకేప్రాధాన్యం ఇచ్చినారు. నీవు ఎవరి అన్నం తింటున్నావు, అనడానికి మారుగా, 'నీవు ఎవరి ఉప్పు తింటున్నావు, అనేమాట సామెతగా వ్యవహారంలో వచ్చింది." అని అతడు వ్రాసిఉన్నాడు.

యూరోపుదేశాల యాత్రికులూ, సమకాలపు రచయితలూ, పదిహేడు పద్దెనిమిదో శతాబ్దాల ఇండియా సామాన్య ప్రజల దారిద్ర్యాన్ని వర్ణించి ఉన్నారు. ప్రజానీకం ధరించే దుస్తులు చాలీ చాలనివి; వారు నివసించేవి మట్టిగుడిసెలు; వంట పాత్రలు కూడా సాధారణంగా మట్టివే; కుర్చీలు, బల్లలు మొదలైన గృహ పరికరాలులేవు. వీటిని ఆధారంగాచేసుకొని, ఈ రచయితలు ప్రజలు దరిద్రులని వర్ణించిరేకాని, ప్రజలకు తగినంత పుష్టికరమైన ఆహారం లభిస్తున్నదా అనే విషయంపై ఆధారపడి కాదు. "నడుముకు చుట్టుకొన్న గుడ్డ తప్ప, ఉత్తర భారతంలోని ప్రజలు సాధారణంగా, ఏ గుడ్డలు ధరించకుండానే, తిరుగుతారు. దూది రజాయిలతో (Cothon quilts) కుట్టినగౌనులు, టోపీలు, పీరు. చలికాలంలో ధరిస్తారు. చూడడానికి వీలుగా రెండు రంధ్రాలుమాత్రం ఈటోపీలకు ఉంటాయి," అనిఫిచ్ (Fitch) అనే వ్యక్తివ్రాస్తాడు. దక్కనులోని ప్రజలంతా గుడ్డలు ధరించడమేలేదని, పావరక్షలే ధరించరని, పదహైదో శతాబ్దంలో, నికిటిన్, వ్రాసిఉన్నాడు. "నడుముకు పైభాగంలో, దిగంబరులుగా ఉంటారని, తలపైమాత్రం చిన్న పాగాలు ధరిస్తారని," బార్బోసా, వ్రాస్తాడు. గుజరాతులోని హిందువులను గురించి, "కొందరు దిగంబరులుగా ఉంటారు, కొందరు తమ రహస్యావయవాలను మాత్రమే కప్పుకొంటారు అని, బార్బోసా, వ్రాసిఉన్నాడు. "విజయనగరంలోని సామాన్య ప్రజలు నడుముకు చుట్టుకొన్న గుడ్డతప్ప, వస్త్రం లేకుండాచరిస్తారు." అని కూడా వ్రాసినారు.

సామాన్య ప్రజల నివాసాలను గురించి, గృహపరికరాలను గురించి ఈ విధంగానే

వారు వర్ణించినారు. పెల్‌సేర్ట్, ఈ విధంగా వ్రాస్తాడు. "వారి ఇండ్లు మట్టిగుడిసెలు. గృహోపకరణాలు లేవనే చెప్పవచ్చు. నీళ్ల నిలువచేసుకోడానికి, వంటకు, కొన్ని మట్టి కుండలు, భార్యాభర్తలు ఒకే మంచంపై పడుకోరు కాబట్టి రెండు మంచాలు, మాత్రమే వారి గృహోపకరణాలు. పరుపు గుడ్డలు అత్యల్పం; పరచుకోడానికీ, కప్పుకోడానికీ, ఒకటి రెండు దుప్పట్లు మాత్రమే ఉండేవి." బెంగాలును గురించి, మ్యాన్‌రిక్ (Manrique) ఈ విధంగా వ్రాస్తాడు. "మట్టిగోడలతోను, తాటాకు కప్పులతోను నిర్మించిన గుడిసెలలో, ఈ ప్రజలు, సాధారణంగా నివసిస్తారు. పేడను బంకమట్టినికలిపి, నేలను గోడలను అలికి శుభ్రంగా ఉంచుతారు. వారు భోజనంచేసే స్థలాన్ని, ప్రతి నిత్యమూ దీనితో అలికి శుభ్రం చేస్తారు. కొన్ని శాఖలవారు, ప్రతి భోజనానంతరమూ, నేలను ఈ విధంగా శుభ్రపరుస్తారు." కర్ణాటక ప్రాంత, మలబారు ప్రాంత ఓద ప్రజల నివాసాలను గురించి, డాక్టర్ ఫ్రైయర్ ఈ విధంగా వ్రాస్తాడు. "ఇవి చిన్న గుడిసెలు, లేక, పందులదొడ్లు. వీటిలో అత్యుత్తమమైనది, పాక అనే పేరుకు కూడా అర్హమైనదికాదు". రాజధాని ఐన ఆగ్రానగరంలో కూడా, "నగరంలోని అత్యధిక భాగం పూరిగుడిసెలతో ఏర్పడినట్టిది; సంవత్సరంలో ఒకటి రెండు సార్లు, అగ్నికి ఆహుతియైపోతూఉండింది." అని, జొర్డెయిన్ (Jourdain) వ్రాసిఉన్నాడు.

తర్వాత గృహోపకరణాల విషయంలో, డేలేట్ ఈ విధంగా తన సాక్ష్యాన్ని వ్రాసి పెట్టిఉన్నాడు. "గృహోపకరణాలు అనేవే, సాధారణంగా లేవు. కొన్ని మట్టికుండలు మంచాలు, పలచని పరుపులు, తప్ప వేరే ఏవీలేవు." పశ్చిమ సముద్రతీరప్రాంతాన్ని గురించి వ్రాస్తూ,- లిన్‌స్‌ఛోటెన్ (Linschoten) ఈవిధమైన అభిప్రాయాన్ని వ్యక్తం కావించినాడు. "కూర్చోడానికీ, పడుకోడానికీ ఉపయోగించే చాపలు, అరటిఆకులు తప్ప, వేరే గృహోపకరణాలులేవు".

ఈ పాశ్చాత్యులు గమనించిన విషయాలు వాస్తవమైనవే. అందులో సందేహంలేదు. కాని, వాటినిబట్టి వీరు కావించిన అనుమాన సిద్ధాంతాలు రెండువిధాలుగా తప్పు. ఈ విధంగా వ్రాసినవారు విదేశీయులు. వారి దేశాలలోని సామాన్యప్రజల జీవనవిధానాలు, దుస్తులు, మొదలైనవి ఇండియాలోని వాటికి పూర్తిగా విభిన్నములైనట్టివి. కాబట్టి, ఇండియాప్రజల నిరాడంబరమైన నివాసాలను గురించి, చాలీచాలని దుస్తులను గురించి, ప్రతికూలంగా వ్రాయడం సహజమైనదే. దేశాచార సంప్రదాయాలేకాక, ఒకదేశంలోని ప్రజలదుస్తుల పద్ధతిని, నివాసాలను ఏర్పరచుకొనే విధానాన్ని నిర్ణయించేది, ఆ దేశంలోని శీతోష్ణపరిస్థితులు. యూరోపుదేశాలతో పోల్చగా, ఇండియా శీతోష్ణపరిస్థితులు సాధారణంగా వేడిగా ఉంటాయి. కాబట్టి, స్వల్పమైన దుస్తులు ధరించడం, ముఖ్యంగా వేసవికాలంలో,- దేశంలోని ఉష్ణపరిస్థితి వల్ల అలవాటుగా ఏర్పడింది. యూరోపుదేశాలలో ఏర్పడే తీవ్రమైన శీతలపరిస్థితి, ఇండియా లోని అత్యంత ఉత్తరప్రాంతాలలో తప్ప, ఇతరత్రా ఏర్పడదు. కాబట్టి, సంవత్సరంలో అధికభాగం ఇండియాప్రజలకు మానరక్షణకుతప్ప, ఎక్కువ గుడ్డలు ధరించవలసిన అవసరము కలుగదు. ఈ రోజులలో కూడా, దేశమంతటా, గ్రామసీమలలోని ప్రజల దుస్తులు, జీవనపద్ధతులు పదిహేడోశతాబ్దంలోవలెనే గడచిపోతూఉన్నవి. వారి అల్పమైన దుస్తులు, మట్టితోకట్టిన పూరిగుడిసెలు, ఇండియాప్రజలకు చిరంతనంగా అలవాటైన జీవన విధానాన్ని సూచిస్తాయేకాని, వారి దారిద్ర్యాన్నికాదు. ఇండియాగ్రామసీమల ప్రజల జీవనవిధానం, ఇట్టిదే

అని నిరూపించే చారిత్రిక సాక్ష్యం సమృద్ధిగా ఉంది; అంతేకాక, ఈనాటికి కూడా ఆ విధానం ఇంకా నిలిచేఉంది.

ఇండియాలోని బీద ప్రజల జీవితానికి సంబంధించిన అవసరాలు స్వల్పమైనవి; దేశంలో ఉత్పత్తి ఔతూఉన్న వాటితో ఈ అవసరాలు పూర్తిఅయ్యేవి, అనేదే, బీదప్రజల విషయంలో, సరియైన సిద్ధాంతం. క్షామ పరిస్థితులలో తప్ప, ప్రజానీకం పస్తుపడడంకాని, పుష్టికరమైన ఆహారం తగినంత లభించక పోవడంకాని, ఎప్పుడూ జరగలేదు. కాని, సామాన్య పరిస్థితులలో కూడా, పంటల నుంచి వీరికి ఏమీ మిగులుతూ ఉండలేదు. కాబట్టి, నిలువచేసుకొని, క్షామాలవంటి విపత్తులను ఎదుర్కోడానికి తగిన ఆర్థిక ప్రాపరక్షణను (Economic Reserves) ఏర్పరచుకొనే అవకాశంలేదు. వారి దుస్తులు స్వల్పములు; వారి నివాసాలు అతి సామాన్యములు. ఇంతకంటె శ్రేష్ఠమైనవి, అధికమైనవి తమకు అవసరములు అనే భావమే, వారికి కలుగలేదు. వాటిని అభివృద్ధిచేసుకొనే ప్రయత్నానికి కూడా ఏమాత్రమూ వారు పూనుకోలేదు. వారి జీవనం నిరాడంబరమైనది, సంతుష్టితో కూడి నట్టిది. సామాన్యములు, స్వల్పములు ఐనవారి అవసరాలు, సులభంగా లభించేవి. కాబట్టి, ఆకాలంలో జీవన సంఘర్షణ, ఇప్పటి విధంగా కఠినమై ఉండలేదు. ఈ విధమైన నిరాడంబర జీవనంవల్ల, సంతుష్టివల్ల, కొన్ని సౌకర్యాలు సిద్ధిస్తాయి; కాని, పెద్ద అనానుకూలం కూడా కలుగుతుంది. పదహారో శతాబ్దంలోను, తరువాతి శతాబ్దాలలోను, యూరోపుదేశాల సామాన్య ప్రజలు, తమ పురోభివృద్ధి విషయంలో చూపిన ఉత్సాహ, ఉద్వేగాలు, ఇండియా సామాన్య ప్రజలలో ఉత్పన్నంకాలేదు. కాబట్టి, యూరోపు దేశీయులు తమ ఆర్థిక పురోభివృద్ధిని పోరాడి, సాధించుకొని ఉండగా, భారతీయులు అట్టి ప్రయత్నానికే పూనుకోలేదు.

*పద్దెనిమిదో శతాబ్దంలో, ఇండియా ఆర్థికాభివృద్ధికి ప్రతిబంధకములైన అంశాలు :* ఉన్నతవర్గాల వారి వినియోగవిధానాన్ని పరిశీలించడంవల్ల, ఆర్థికరంగంలోని దేశపురోభివృద్ధికి ప్రతిబంధకమైన అంశము వ్యక్తమౌతుంది. మధ్యయుగాలరాజులు, కులీనులు, ప్రాంతీయసర్దారులు, వైభవంతో, భోగవిలాసాలలో జీవిస్తూఉండినారు. ఈ విధమైన జీవిత పద్ధతిని ప్రవృత్తిలో పెట్టినవారు రాజులు. వీరి జీవితమార్గాలను, ప్రవర్తనను, రాజాస్థానంలోని కులీనవర్గంవారు, తమ ఆదాయాన్నిబట్టి అనుకరిస్తూ వచ్చిరి. విదేశాలనుంచి దిగుమతి ఐన పండ్లు మొదలైన సున్నితవస్తువులు, సేవకులు, ఆశ్రితులు, గృహాలు, ఏనుగులు, విహారాలు, కట్టాలు, దుర్గములవంటి నివాసస్థానాలు, మొదలైన వాటిపై, అమితంగా ధనాన్ని వెచ్చిస్తూ వచ్చిరి. ఆదాయంలోని అధికభాగం, ఆభరణాలకూ విలువగల దుస్తులకూ ఖర్చైపోయేది. ప్రతికులీనుడూ తన ఇంటినీ, అశ్వశాలనూ సేవించడానికై, వందలాదిగా సేవకులను పోషించేవాడు. కానుకల ప్రదానానికై అధికధనాన్ని ఖర్చుచేసేవారు. సర్దారులు,రాజుకు కానుకలను అర్పిస్తూ, తమ క్రిందివారినుంచి కానుకలను గ్రహించేవారు. ఈ కానుకల పద్ధతి అధికారపదవులలో, శ్రేణీబద్ధంగా జరుగుతూవచ్చింది. మొగలు ఆస్థానంయొక్క వైభవాన్ని, భోగాన్ని వర్ణించడం ఏమాత్రమూ సాధ్యముకాదని, డే-లేట్ వ్రాస్తాడు. "ప్రతి విధమైన సౌఖ్యాన్ని మితిమీరి అనుభవించడమే, వారి ఏకైకమైన జీవితాశయం". సర్ థామస్‌రో, కూడా, మొగల్ కులీనవర్గాన్ని ఈవిధంగానే వర్ణించినాడు. "విషయలంపటత్వమూ, సంపదా, కలిగిన గొందలమే, ఈ కులీనుల జీవితం." అని అతనివర్ణన. ధనాన్ని ఇంత విచ్చలవిడిగా

ఖర్చుపెట్టడానికి కారణం లేకపోలేదు. కులీనుడు కూడబెట్టుకొన్న ధనమంతా, అతని మరణానంతరం, రాజు కోశానికి చేరిపోతుంది. కాబట్టి తమకు సంప్రాప్తమయ్యే ధనాన్ని అంతటినీ, తమ జీవితకాలంలోనే ఖర్చుపెట్టి సౌఖ్యాలను అనుభవించవలెననే ప్రవృత్తి కులీనవర్గం వారిలో ఏర్పడింది. అదీకాక, ఆదాయంకూడా, ప్రతిసంవత్సరమూ సక్రమంగా, ఒకేరీతిగా రావడంలేదు. కాబట్టి, రెండుకారణాలవల్ల, వీరికి ఆదాయాన్ని మించి ఖర్చుపెట్టడం, అలవాటైపోయింది. ఈ విషయంలో, వీరు మధ్యయుగాల యూరోపులోని కులీనవర్గం వారికి భిన్నమైనవారుకారు. యూరోపులోని కులీన వర్గంవారు కూడా అధిక సంఖ్యాకమైన సిబ్బందిని పోషిస్తూ, అమిత ధనాన్ని వెచ్చిస్తూ, అవివేకంగా జీవించే వారని ప్రసిద్ధిచెందినారు. ఇండియాలోని, ఉమ్రాల విషయంలో, రాజుకు అనేక సందర్భాలలో విలువగల కానుకలు చెల్లించవలసిన బాధ్యత ఒకటి ఎక్కువగా ఉండినది. కానుకలు చెల్లించే ఈ ఆచారం, అత్యంతమైన ధన వ్యయముతో కూడినది కాబట్టే, కులీనులలో అధిక సంఖ్యాకులు ఋణగ్రస్తులై ఉండిరని, బెర్నియర్ యొక్క విశ్వాసం. ఇట్టి పరిస్థితులలో, మూలధన సంచయం సులభమైనదికాదు. కొందరు కులీనులు మాత్రం, పొదుపుగా జీవించి, అధిక సంపదను కూడబెట్టిరి ; కాని, కడపట వీరు కూడా, ఆ ధనాన్నంతటినీ వివాహాలకూ, కట్నాలకూ, భవననిర్మాణాలకూ వెచ్చపెట్టిరేకాని, వర్తకంలో కాని పరిశ్రమలలో కాని, పెట్టుబడిపెట్టలేదు.

ధనాన్ని సేకరించి నిలువచేసుకొన్నవారు వర్తకులు; వీరిలోకూడా కొన్ని పెద్ద కుటుంబాలవారు మాత్రమే సంపన్నులైనారు. వ్యాపారాన్ని విస్తరించడానికి, పరిశ్రమలను స్థాపించడానికి, తగినంతధనం, ఇతర వర్తకులవద్ద లేకపోయింది. జమాబ్యాంకు విధానం ఏర్పడి ఉండలేదు. పదిహేడో శతాబ్దంలోను, పద్దెనిమిదో శతాబ్దపు మొదటి భాగంలోను కూడా, ఆర్థికపురోభివృద్ధికి అవసరములైన రెండు ముఖ్యాంశాలు లోపించి ఉండినవి. తాము పురోభివృద్ధి చెందవలెననే ఔత్సుక్యం, సామాన్య ప్రజానీకంలో లేకపోవడం మొదటిది. పరిశ్రమలను, వర్తకాన్ని, వ్యవసాయాన్ని, అభివృద్ధిపరచి, విస్తరింపచేయడానికి తగిన మూలధనాన్ని ధనవంతులైన వారు నిలువ చేయకపోవడం, రెండవది.

పురోభివృద్ధి చెందుతున్న పాశ్చాత్యులతో, నిశ్చైతన్యమై ఉన్న ప్రాచ్యదేశానికి ఏర్పడిన సంపర్కంవల్ల, కలిగే పరిణామము ఎట్టిది, అనే, విషయంలో, సంశయానికి ఆస్పదమేలేదు. క్రియాశక్తమై, ప్రగతిపరమై ప్రవర్తించేది ఒకటి; నిశ్చైతన్యమై, సాంప్రదాయబద్ధమై నిలిచినది రెండవది. మధ్యయుగాల ఇండియా సమాజం, ఈ జడ ప్రాయమైన స్థితిలో ఎంతోకాలంనిలిచిఉండి ఉండేదికాదు; నశించిపోయే చిహ్నాలు అప్పటికే పొడచూపినవి. విదేశీయ పరిపాలన దేశంలో ఏర్పడడంతో, ఈ వినాశప్రక్రియ యొక్క వేగం, వృద్ధి పొందింది. నూతన సామాజిక వ్యవస్థకు పునాదులు ఏర్పడినవి.

# 5
# సాంస్కృతిక జీవితం - విద్య, కళలు, సారస్వతము

పద్ధెనిమిదో శతాబ్దంలో వ్యాప్తిలో ఉండిన అభిప్రాయ భావ ప్రవృత్తుల చరిత్రలేకుండా, ఆకాలపు పరిస్థితుల పరిశీలనం సమగ్రంకాదు. రాజకీయ పరివర్తనాలకు, ఆ కాలపు అభిప్రాయాలు ఎంతవరకు హేతువులు, అభిప్రాయాలు ఏర్పడడానికి భౌతికపరిస్థితులు ఎంతవరకు హేతువులౌతాయి, అనే సమస్యలను విడదీయడం కష్టం. ఈ రెండూ, పరస్పరం కలిసి ఉంటాయి, అనడంలో సందేహంలేదు. కాబట్టి, ఈ రెండు విషయాలనూ, పరిశీలించడం వల్ల, చరిత్రను అర్థంచేసుకోవడం సుకరమౌతుంది, అనే విషయాన్ని అంగీకరించవచ్చు.

ప్రతిదేశము యొక్క చరిత్రా, భిన్నమార్గాన్ని అనుసరిస్తుంది. సుదూరవ్యాప్తిగల పరిణామాలను తెచ్చిపెట్టిన రాజకీయ విపర్యయాలకు, కొన్నిదేశాలు, పదేపదే, లోనైనాయి. కొన్ని దేశాలలో ఇట్టి వ్యత్యయాలు కలుగక పోవడంవల్ల, ప్రజాజీవితం సాఫీగానడచి పోయింది. యూరోపుదేశాలలో, ఇటలీ, మొదటివర్గానికి నిదర్శనం; రెండవవర్గానికి, ఇంగ్లాండు నిదర్శనం. ప్రాచీనకాలంలో, ఇటలీదేశం గొప్పసామ్రాజ్యంగా ఏర్పడి, ఏడుశతాబ్దాల కాలం నిలిచి ఉండింది. తర్వాత అతివేగంగా క్షీణించిపోయిన ఇటలీని, అనాగరకజాతులు జయించి, ఆక్రమించిరి. ఆదేశంలో, ఒక కొత్తనాగరకత క్రమంగా అభివృద్ధిచెంది, సాంస్కృతిక పునరుజ్జీవనకాలంలో, సమగ్రమైన వికాసాన్ని పొందింది. కాని, ఫ్రాన్సునుంచి వచ్చిన శత్రువుల దండయాత్రలవల్ల, ఇది కూడా పతనమైపోయింది. ఆ తర్వాత కొంతకాలం, ఇటలీదేశం మరుగుపడిఉండి, మ్యాజీని, క్యవోర్; గ్యారిబాల్డి (Mazzini, Cavour and Garibaldi) వంటి, ప్రవక్తలు, రాజనీతిజ్ఞులు, యుద్ధవీరులు, కావించిన మహాప్రయత్నాల కారణంగా, మరల ప్రాముఖ్యానికివచ్చింది.

సాంస్కృతిక జీవితం నిరంతరాయంగా, నిర్విరామంగా సాగిపోయిన దేశాలకు, ఇంగ్లాండు శ్రేష్ఠమైన ఉదాహరణ. నార్మనులు ఇంగ్లాడును జయించి, రాజ్యాన్ని స్థాపించిన కాలం నుంచీ, విదేశీయుల దండయాత్రల ఆతంకాలకు, ఇంగ్లాండు దేశం గురికాలేదు. కాబట్టి, దేశ జీవితం నిరంతరమైన క్రమపరిణామానికిలోనై, అభివృద్ధి చెందింది.

*భారతీయుల భావసంపద,-సంస్కృతి:* ఇటలీ దేశచరిత్ర విధంగానే జరిగింది, ఇండియా దేశచరిత్రకూడా. ఇంగ్లాండు దేశంలో ఏర్పడిన ప్రశాంత పరిస్థితి, ఇండియాలో ఏర్పడలేదు. ఇటలీదేశంలో జరిగిన విప్లవాత్మక పరివర్తనాలతో ప్రజాసమాజము, రాజ్యము, సంస్కృతి, అనే అంశాలన్నిటికీ ప్రత్యక్ష సంబంధం ఏర్పడింది. ఇండియాలోని పరిస్థితి వేరు. దేశంలో కలిగిన పరివర్తనలు ప్రజాభ్యుదయానికి సంబంధించినవికావు; కేవలం

రాజుల జీవితంతో మాత్రమే సంబంధించినట్టివి.

ఇండియా ఆక్రమణవల్ల, పరిపాలన వ్యవస్థలో కలిగిన మార్పులు, కేవలం బాహ్యములు మాత్రమే. సమాజవ్యవస్థలో ఏవిధమైన మార్పూ కలుగలేదు. దేశంలో ఇంతకు పూర్వం ఉండిన మతాలను, దేశభాషలను అధికంగా కొత్త మతాలు, భాషలు, వచ్చిచేరినవి. హిందూ ముస్లిము సంస్కృతులలో ఏపరివర్తనమూ కలుగక, తమ విశిష్ట మార్గాలలో సాగిపోయినవి. మత విశ్వాసము, పూజా విధానము, వైయక్తిక న్యాయసూత్రాలూ, ప్రాచీన భాషల వ్యవహారము, మొదలైన విషయాలలో, ఉన్నత వర్గాలవారు పూర్వ సంప్రదాయాలనే, అనుసరిస్తూవచ్చిరి.

ఈ సాధారణ సమీక్షకు కొంత వివరణం అవసరం. ఆదర్శరూప విషయంలో, హిందూ ముస్లిము సంస్కృతులు ఏక ప్రకారమైనవికావు. సామరస్య, ఆత్మసామంజస్యములతో కూడిన, సమగ్ర వ్యవస్థలు కావివి. హిందూసమాజము సమైక్యమైన వ్యవస్థకాదు. సాంస్కృతిక అంశాలలో వైవిధ్యంగల విజాతీయ ప్రజానీకాలతో, ఏర్పడినది, హిందూ సమాజం. భిన్నప్రాంతాలలో భిన్నభాషలు వ్యవహారములో ఉండినవి. అల్పసంఖ్యాకులైన ఉన్నత కుల హిందువులకు మాత్రమే, విస్వపరిమితమై ఉండిన ప్రాచీన కాలంలో, ఉన్నత వర్గంలోని, ఏ పది మంది మాత్రమో సంస్కారవంతులై ఉండిరి. కాని, వీరి సంస్కృతి, అధిక సంఖ్యాకులైన ప్రజల సంస్కృతికి భిన్నమైనట్టిది. ఈ ప్రజానీకంలోని చాలభాగం అజ్ఞానంలోను, అంధవిశ్వాసంలోను, దారిద్ర్యంలోను మునిగి ఉండింది. అంతేకాక, ఆరాధన పద్ధతి, న్యాయసూత్రాలు, సమాజంలోని స్థాన తారతమ్యము, ఉపజీవిక, సంపద, మొదలైన విషయాలకు సంబంధించిన విభేదాలు, మధ్యమ కులవర్గాలలోను, నిమ్నకుల వర్గాలలోను, కూడా, ఏర్పడిఉండినవి. తత్త్వశాస్త్ర సంబంధమైన పరమసత్యాలు మొదలుకొని అసహ్యకరమైన అంధవిశ్వాస ప్రవృత్తుల వరకూగల అన్ని మతవిశ్వాసాలతోను, ఆచారాలతోను, ఏర్పడిన దృశ్యపరంపరంగా, హిందూమత వ్యవస్థ గోచరిస్తూఉండినది.

ముస్లిము సమాజంలోని వర్గభేదాలు హిందువులలో ఉన్నంత సూక్ష్మములైనవి కావు; అంత నిష్కర్షగా బిగిసిపోయినవీకావు. కాని, వారిలోకూడా ఉన్నతవర్గాలూ, హీనవర్గాలూ ఏర్పడి ఉండినవి. యుద్ధవీరులతోను, విద్వాంసులతోను, పురోహితులతోను, ఏర్పడిన పరిపాలకవర్గము,- షరీఫ్, అనే వ్యవహారంతో, ఉన్నతవర్గంగా పరిగణించబడింది. ఉన్నతవర్గాలవారు చేయడానికి తగని హీనవృత్తులను అవలంబించిన అధమవర్గంవారిని అజ్లాఫ్, అని వ్యవహరించేవారు.

ఈ ప్రతివర్గంలోను, ఇస్లాము మతాన్ని పుచ్చుకొనివచ్చిన ఇతరులు భిన్న నిష్పత్తులలో చేరి ఉండిరి. కాని, ఈ మతాంతరుల అలవాట్లు, ఆచారాలు, జీవన విధానాలు, విశ్వాసాలు, తమ పూర్వపు మత వ్యవస్థలో వాటికి సదృశ్యమై ఉండినవి. ఇతర ముస్లిము దేశాలనుంచి కొత్తగా వలస వచ్చినవారు, వారి ఒకటి రెండు తరాల సంతతివారు, చిరకాలవాసులైన ముస్లిములను, మతాంతరులైన ముస్లిములను సంస్కృతి విషయంలో విభిన్నులై ఉండిరి. ఇరాన్, ఆఫ్గనిస్తాన్, అవతలి ఆశ్సియానా ప్రాంతాలనుంచి, విద్వాంసులు, సైనికులు, వర్తకులు, నిరంతరమైన ప్రవాహరూపంలో, ఔరంగజేబు మరణకాలంవరకూ, ఇండియాను ప్రవేశిస్తూ వచ్చిరి. మొగలు సామ్రాజ్య వైభవంచే ఆకర్షింపబడి, ఉద్యోగాలకూ, ధన సంపాదనకూ

గం అవకాశాలను పురస్కరించుకొని వీరు, ఇండియాకు వచ్చి, నిలిచిపోయిరి. ఇండియాలోని ప్రజలను ఏకంచేసే సంయోజకశక్తులు, వీరి కారణంగా దుర్బలములైనవి.

ఐనప్పటికీ, శతాబ్దాలుగా ఏర్పడిన సంపర్క సాహచర్యాల ప్రాబల్యంవల్ల, అనివార్యములైన పరిణామాలు కలిగినవి. పదహైదో శతాబ్దారంభ కాలంనుంచి, కబీర్, నానక్ వంటి సంస్కర్తలు, హిందూ ముస్లిముల మధ్యగల విభేదాలను తగ్గించి, రెండు మతాల వారిని దగ్గరగా చేర్చడానికి ప్రయత్నించినారు. ముస్లిం సూఫీలు, సాధువులు,-వారిలో ముఖ్యంగా ఇబన్అరాబీ బోధనలను అనుసరించినవారు,-హిందూ వేదాంత సూత్రాలలోను, యోగాభ్యాసాలలోను, ఆసక్తి వహించడమేకాక, వాటి ప్రభావానికి లోనయిరి. హిందూ ముస్లిము రచయితలు ఆధునిక దేశ భాష సారస్వతాల అభివృద్ధికి తోడ్పడిరి. కళాకారులు దేశీయాంశాలను, ఇస్లాం కళల అంశాలనూ మేళవించి, వాస్తు శిల్పము, చిత్రలేఖనము, సంగీతము మొదలైన కళలలో నవ్య వైఖరులను, బాణీలను, సృష్టించిరి. భక్తిమార్గంపై ఆధారపడిన నూతన మతాలు, సమాజంలోని మధ్యమ తరగతులవారిని ముఖ్యంగా ఆకర్షించినవి. ఐనప్పటికీ, ఉన్నత, అధమ తరగతుల వారిలోకూడా అనేకులు ఈ నవ్యమతాల పట్ల ఆసక్తిని, చూపినారు. రాజులు, రాజకుమారులు, జాగీరుదార్లు, కళాసారస్వతాలను ఆదరించి పోషించడమేకాక, దేశభాషా గ్రంథాలను దేశభాషలలోనికి, అనువదించేటట్లు విద్వాంసులను ప్రోత్సహించిరి. రెండు వైఖరులూ మిశ్రితమైన కళాఖండాలను రచించేటట్లు, తమ ఆస్థాన కళాకారులను ప్రేరేపించిరి.

హిందూభక్తి సంస్థలు దేశమంతటా వ్యాపించి నెలకొన్నవి. వ్యక్తిరూప రహితంగానూ, వ్యక్తిరూప సహితంగానూ ఏర్పడిన రెండు భక్తి పంథాలుకూడా, ప్రజల మనస్సులను వశపరచుకొన్నవి. భక్తిపంథాను అవలంబించిన ఉపాసకుల సంఖ్యను, అంచనా వేయడానికి సాధ్యంకాదు. కాని, వర్తకులు, వృత్తి కార్మికులు, శిల్పులు, రైతులు, మొదలైన వారితో ఏర్పడిన సమాజముయొక్క మధ్యమ స్తరాలలో, భక్తి పంథానికి ఎక్కువ ప్రాబల్యం ఏర్పడింది.

ఇదే విధంగా, తసవ్వుఫ్, అనే, రహస్యోపాసన, దేశంలో విస్తృతంగా వ్యాపించింది. ఏదో ఒక సూఫీ సంస్థలో చేరి, రహస్యోపాసనలో శిష్యులకు మార్గదర్శకుడైన ఒక పీరును గురువుగా గ్రహించడం అవసరమని, ఉన్నతవర్గంలోని ప్రతి ముస్లిమూ భావించేవాడు. అనేకములైఉన్న ఈ సూఫీశాఖలలో, ఖ్వాజామొయినుద్-ఉద్దీన్, ఇండియాలో స్థాపించిన ఛిష్టియా శాఖకు ఎక్కువ ప్రజాదరణ లభించింది. ఆధ్యాత్మిక దృక్పథంలోను, సాధన మార్గాలలోను, ఇది హిందూ భక్తి పంథాకు సన్నిహితమై ఉండినది.

విశ్వదేవైక్యవాదముపై (Pantheistic monism) ఈ రెండు మత విశ్వాసాలూ స్థాపించబడినవి. (అద్వైతము-వహదత్-ఆల్-వుజుద్). రెండు వర్గాలవారూ ఒకే విధమైన, ఆత్మ సంయమన ఆత్మశుద్ధి మార్గాలను అనుసరించినారు. [యోగము-ధిక్ర్]. ధ్యానము, ఐక్యము, అనే రహస్యగర్భిత మానసికావస్థలకు ప్రేరకములైనవి, పాటలు, సంగీతము, అని, ఈ రెండు వర్గాలవారూ భావించిరి. ప్రతి ముస్లిమ్ విద్వాంసుడూ, ప్రతి మత ధర్మ శాస్త్రజ్ఞుడూ, షరియత్‌ను [న్యాయ శాస్త్రం], తరికత్‌ను [రహస్యోపాసన] కూడా అధ్యయనం చేసేవాడు. అదేవిధంగా, హిందూ విద్వాంసులు ధర్మశాస్త్రాన్ని, వేదాంతాన్ని, అధ్య

యనం చేసేవారు.

హిందూ ముస్లిము విద్వాంసులలో, స్థూలంగా, మూడు విధములైన అభిప్రాయ వర్గములు ఉండినవి. తమ పవిత్ర గ్రంథాలలోని వాచ్యార్థాన్ని నిష్కర్షగా అనుసరించవలెననీ, భగవత్సంకల్పముపై ఆధారపడి ఉన్న మత నిబంధనలకు, నిర్వివాదంగా విధేయులమై ఉండవలెననీ, నిర్బంధపరిచే సాంప్రదాయికులు, పూర్వాచార పరాయణులు, మొదటి వర్గానికి చెందినవారు. మత తత్త్వాన్నీ, సిద్ధాంతాన్నీ, హేతువాదంతో, పరిశీలించకూడదనీ, శాస్త్రాధికారానికి సంపూర్ణంగా అధీనులమై ఉండవలెననీ వారి నిశ్చితాభిప్రాయం. హేతువాదాన్ని అంగీకరించక, ధర్మశాస్త్రంలోని వాచ్యార్థానికి నిష్కర్షగా కట్టుబడి ఉండడంవల్ల, వీరిని బాహ్యాచార ప్రియులని, వ్యవహరించేవారు. (ఉలామ-ఇ-జాహిరీ). శాస్త్ర విధులను అనుసరించి కర్మలు చేయవలసిందని వీరు నిర్బంధిస్తారు. కాబట్టి, కార్యములను బట్టి. ఆచరణను సమర్థించే సిద్ధాంతాన్ని విశ్వసించే వారి వర్గంలో, వీరిని చేర్చవచ్చు.

బాహ్యములైన పూజావిధానాలను జరపడము, విధినిషేధాలను శుద్ధిగా పాటించడము, సహించని వ్యక్తులతో రెండవవర్గం ఏర్పడింది. ఈశ్వరప్రేమ, మానవప్రేమ, పరతత్త్వంపై భక్తి, పరిణతస్థితినిగూర్చి అన్వేషణ, ఆత్మనిగ్రహము, ఆత్మప్రకాశనము, అనేవాటిలో మతము యొక్క సారము ఇమిడిఉన్నదని వీరి భావము. విశ్వాసమే సమర్థన సాధనమని వారి దృక్పథం.

ఈ రెండింటికీ మధ్యగల అంతరాన్ని కలపడం, మూడవవర్గముయొక్క ఆశయం. ధర్మశాస్త్రానికి మానవప్రేమతో సమన్వయము కలిగించడము, మతసంబంధమైన విధి సూత్రాలను హేతువాదంతో సమర్థించడము, మతానికి ఆధారములైన సూత్రాలను విడిచిపెట్టకుండా, పరమత అసహనప్రవృత్తిని నిరోధించడము,- ఈవర్గముయొక్క ఆశయాలు.

మొగల్ చక్రవర్తులలో, అక్బర్ రెండవసంస్థకు, జహంగీర్ మూడవ సంస్థకు ఆలంబనము ఇచ్చినారు. కాని, మొదటిసంస్థకు ఆలంబనంగా, నిలిచినవాడు ఔరంగజేబు. ఈ సంస్థల అనుయాయులలో, ఉపనిషత్తులకు అనువాదం రచించిన, దారాషుకో, రెండవసంస్థను సమర్థించినవారిలో ప్రముఖుడు. మూడవసంస్థను, షావాలీ ఉల్లా, మొదటిసంస్థను, షేక్ అహమద్ సార్ హిందీ, సమర్థించిరి.

దారాషుకో, ముల్లాషాబాదషానీ శిష్యుడు: కాదిరీసాధువైన సూఫీమియాన్ మీర్ (క్రీ. శ. 1635) కు శిష్యుడైనవాడు, ముల్లా బాదషానీ. ఇస్లాము రహస్యోపాసన అభివృద్ధి చెందడంలో, అత్యంతమైన ప్రభావాన్ని నెరపిన మహనీయుడు ఇబన్ అరాబీ [1165-1240]. ఇతని దృక్పథాన్నే, వీరు పునరుద్ఘాటించినారు. న్యాయశాస్త్రసంస్థల శుష్కపాండిత్యాన్ని నిరసించి, హేతువాద నిదర్శనాన్ని విశ్వసించిన జాహిరైట్లసంస్థను, మత ధర్మశాస్త్రవిషయంలో అనుసరించినవాడు ఇబన్‌అరాబీ. సిద్ధాంతవిషయంలో అధికారాన్ని [తక్లీద్] అతడు త్రోసిపుచ్చినాడు. సక్రమమార్గంలో మానవునినడిపే ఆత్మప్రకాశములో విశ్వాసం ఉన్నవాడతడు. నిరుపాధికుడు, నిర్గుణుడు, నిస్సంగుడు, ఐన ఈశ్వరుడు, ఏకైక మూర్తి అని, [వహత్-అల్-వుజుద్] అని విశ్వసించినవాడు. విశ్వములోని ఆకాశ, కాల, కారణ, తత్త్వాలన్నీ, కేవలం, ఇంద్రియ గోచర విషయాలు; ఏకైకమైన సత్త్వము యొక్క వ్యక్త రూపాలు. యథార్థమైనదీ [సత్], కేవలం ఇంద్రియ గోచరమైనదీ [అసత్] రెండూ

మానవునిలో కలిసిఉన్నవి. క్షణికములైన విషయాలచే మరుగుపడిఉన్న అతనిలోని దివ్యాంశం, ఆత్మయొక్క నిజరూప జ్ఞానానికై పాటుపడుతుంది. పరస్పర సాపేక్షతో పరిశీలిస్తే, మత విశ్వాస రూపాలన్నీ సత్యమైనవి అనే, అభిప్రాయంగల ఏకతత్త్వవాది, ఇబన్ అరాబీ. "నీవు ఏ ప్రక్క తిరిగినాకూడా నీకు ప్రత్యక్షమయ్యే ముఖం, భగవంతుని యొక్క (అల్లా) వాస్తవరూపం." అని, అతడు సూచించినాడు. "అన్ని రూపాలనూ, లోగొనడానికి, నా హృదయం సిద్ధంగా ఉంది; ప్రీతి పాత్రమైన అన్ని ప్రాణులకూ అది పోషక స్థానం; క్రైస్తవ సన్యాసులకు అది ఆశ్రమం; విగ్రహాలకు అది ఆలయం; పుణ్య క్షేత్ర యాత్రికులకు, అది, కాబా; యూదుల న్యాయ శాస్త్రానికి, ఖురానుకూ అది శిలాఫలకం. నేను అనుసరించేది మానవ ప్రేమమార్గం. నా ప్రేమ అనే ఒంటెలు, ఏ మార్గాన్ని అనుస రించినా అదే నా మతం; మానవ ప్రేమ మాత్రమే నా విశ్వాసం." బ్రహ్మానంద సాక్షాత్కా రాన్ని పొందిన సాధువు (వాలీ), ప్రవక్త (నబీ) కంటె, దేవదూతకంటె (రసూల్) ఉత్త ముడు, అని అతని విశ్వాసం. దివ్య లక్షణాలను కలిగి ఉండడము, సాధుత్వము, నిత్య మైనది కావడము ఇందుకు హేతువులు. నిత్యమైన ఈ ధ్యేయానికి తీసుకొనిపోయే రహస్య గర్భిత మార్గం, ధర్మశాస్త్రాన్ని అధిగమించినది.

బాహ్యమైన సంస్కార ప్రవృత్తినుంచి వేరుచేసే ఈ పరతత్త్వాన్ని గురించి, దారాషు కోకు గురువైన ముల్లాషా ఈ విధంగా వచించినాడు. "వాస్తవతత్త్వంలో విశ్వాసమున్న భక్తులారా, భక్తిపారవశ్యానికి, భ్రాంతికిలోనై, బాహ్య పూజా విధానమైన ప్రార్థనను [నమాజ్] సమీపించకండి. క్లుప్త పరిమితిలో, భక్తి పరవశస్థితి, ప్రార్థనకర్మాచరణం కంటె ఉన్నతమైనట్టిది. ధర్మ విరుద్ధములైన, ఐహిక విషయాలకై భ్రాంతి పడేటట్లయితే, ప్రార్థన మలినమైపోతుంది. ప్రార్థనకు ఇది అగౌరవం. కాబట్టి, అట్టి లౌకిక స్థితిలో ప్రార్థనను చేయడం ధర్మరీత్యా నిషిద్ధమైనది. కాని, భక్తిపరవశత్వం అలౌకికమైనట్టిదే ఐతే, బాహ్యాచార మైన ప్రార్థనను చేయడంవల్ల, భక్తి పరవశత్వాన్ని అగౌరవపరచిన వారమౌతాము. కాబట్టి, అలౌకిక భక్తిపరవశత్వంలో కూడా, ప్రార్థన నిషిద్ధం. భక్తి పారవశ్యానికి లోనైనప్పుడు ఈశ్వరుడు కాని, మనం కూర్చున్న ఆస్తరణంకాని, ఇంద్రియగోచరములుకావు కదా : అట్టి సందర్భంలో ప్రార్థన చదివేవాని ప్రసక్తి ఏమి ?"

దారాషుకో, ఈ సూత్రాలను తన రచనల ద్వారా ప్రజలలో ప్రచారం కావించినాడు. మజ్మా-అల్-బహరేన్ [రెండు సముద్రాల సమాగమం], సిర్రో-ఈ-అక్బర్ [పరమ రహస్యం ఇది ఉపనిషత్తుల అనువాదం.] అనేవి ఇతని రచనలలో ప్రఖ్యాతివహించిన ఉద్గ్రంథాలు. కొన్ని ముస్లిము వర్గాలు, ఇబన్అరాబీని, దారాషుకోను కూడా సంప్రదాయ బాహ్యులని, ఖండించిరి. తాను వహించిన దృఢ విశ్వాసాల కారణంగా దారాషుకో తన ప్రాణాలను బలిచేయవలసి వచ్చింది. దారాషుకో అపజయానికి, ఉరిశిక్షకూ గురిఐనాడు. ఇది అతని సంస్థకు తగిలిన గొప్పదెబ్బ. ఆకాలపు చక్రవర్తి ఐన ఔరంగజేబు, ఈ సంస్థపట్ల ద్వేషం వహించడము, అతని మరణానంతరం ఏర్పడిన కల్లోల పరిస్థితులు, దారాషుకో మతానికి నష్టహేతువులైనవి. ఉదారమైన మత సహనాన్ని, స్పష్టమైన హేతువాదంతో ప్రతిపాదించిన దారాషుకో మతానికి, దురదృష్టకాలం ప్రాప్తించింది. దారాషుకోయొక్క అభి ప్రాయాలు, భావాలు అక్కడక్కడ కొందరి వ్యక్తుల జీవితాలలోనూ, అతని కవితా

ప్రవాహంలోను, ఉత్తేజక శక్తులుగా మాత్రమే నిలిచిపోయినవి.

రహస్య గర్భితమైన ఉదార మతసంస్థను మొంది పట్టుదలతో ఎదిరించిన విరోధి. షేక్ అహమద్ సార్‌హిందీ. డ్యామస్కస్ నగరంలో, హంబాలీ న్యాయశాస్త్రానికి ఆచార్యుడుగా ఉండిన ఇబన్-ఈ-తైమీయా [1263-1328] అభిప్రాయాలు, సార్‌హిందీ బోధనలకు మూలములు. కేవలం వాచ్యార్థం మీద ఆధారపడి, నూతన భావాలను నిరసించిన, ప్రాచీన సంప్రదాయవాది, ఇబన్-ఈ-తైమీయా. కేవలం, ప్రత్యక్షంగా వ్యక్తమై ఉన్న శబ్దార్థాన్ని బట్టి, కురానును వ్యాఖ్యానించి, మహమ్మద్ ప్రవక్తకు, నరదేవత్వాన్ని కల్పించిన మానవతారోపవాది (Anthropomorphist), ఇతడు. అవిశ్వాసానికి దారితీస్తుందని, గ్రీకు తత్త్వశాస్త్రాన్ని ఖండించి వ్రాసిన భాష్యకారుడు.

ఇటువంటి, ఇబన్-ఈ-తైమీయా గురుపీఠం షేక్‌అహమద్‌సార్ హిందీకి సిద్ధించడంతో, అతడు రెండు ముఖ్యవిషయాలను, దృఢంగా సమర్థించి నిలిచినాడు: (1) న్యాయసూత్రాలకు, ఉపదేశాలకు, సంప్రదాయాలకు బద్ధులై ఉండడం, [ఇత్బా-ఈ-సున్నత్], (2) నూతన కల్పనలకు అవకాశం ఇవ్వకపోవడం [రఫా-ఈ-బిదత్]. మత విశ్వాస విషయంలో, హేతు వాదాన్ని ఉపయోగించడం తప్పు, అని ఖండించినాడు. "హేతువాదం సమర్థమై, చాలి ఉంటే, దానిని మార్గదర్శిగా అవలంబించిన గ్రీకుతత్త్వశాస్త్రజ్ఞులు, సంపూర్ణ పరివర్తనము అనే ప్రమాదంలో పడిఉండే వారుకారు. ఈశ్వరుని మాహాత్మ్యాన్ని గుర్తించడానికి ఇతరులకంటె, గ్రీకులే ఎక్కువ సమర్థులై ఉండిరి; ఐనప్పటికీ, వైభవోపేతుడైన ఈశ్వరుని నిజతత్త్వ, లక్షణ పరిజ్ఞాన విషయంలో, ఇంతటి అజ్ఞానులు మరెవ్వరూ లేరు" అని ఇతని అభిప్రాయం.

అతడు ప్రతిపాదించిన వాదము ఇది;- "జ్ఞానసంపాదన విషయంలో, ఇంద్రియ ప్రవృత్తిని అధిగమించినట్టిది హేతువాదపద్ధతి కాబట్టి, ఇంద్రియగోచరం కాని విషయాలు హేతువాదంవల్ల గ్రాహ్యమౌతాయి. ఇదేవిధంగా, భవిష్యజ్ఞానవిధానం హేతువాదవిధానానికి అతీతమైనది. హేతువాదంవల్ల గ్రాహ్యములుకాని విషయాలు, భవిష్యజ్ఞానంద్వారా గ్రాహ్యములౌతాయి. హేతువాదయుక్తమైన భక్తికి మించినది ఏదీ, దివ్యసత్యాన్ని నిరూపించజాలదు, అని చెప్పడం, భవిష్యజ్ఞానమార్గమే లేదని చెప్పడం, ఔతుంది". తత్త్వశాస్త్రజ్ఞుడు కావలసి వ్యక్తి, సైతాను సాహచర్యంలో ఉండవలసి ఉంటుంది. కాబట్టి, అతడు నిరాశకు, ఆత్మనష్టానికీ గురిఔతాడు, అని అతని అభిప్రాయం. "ఈశ్వరుడు, తన తత్త్వాన్నీ, తన లక్షణాలనూ, ప్రవక్తల సందేశంద్వారా ప్రజలకు తెలియజేస్తాడు. అట్లే, ప్రజల ఆచరణలలో, ఏవి, తన సంకల్పానికి అనుగుణమైనవి, ఏవి, విరుద్ధమైనవి అనే జ్ఞానాన్నికూడా, ఈ ప్రవక్తల ద్వారానే, మనకు అందచేస్తాడు". అని అతని విశ్వాసం. ప్రవక్తలు రచించిన గ్రంథాలనుంచి, వైద్యానికి, జ్యోతిష్యానికి సంబంధించిన విషయాలను దొంగిలించుకొని, తత్త్వశాస్త్రజ్ఞులు మందమనుసుల లక్షణాలను గ్రహించిరనీ, సూఫీలవద్ద నుంచి నీతిశాస్త్రవిషయాలను, ఇతర సంస్కారాలను నేర్చుకొనిరనీ, ఘజాలీ, తన, అల్‌మున్ కిధ్‌మిన్ అల్‌ధలాల్, అనే గ్రంథంలో వ్రాసుకొన్నాడు. ఈ అభిప్రాయంతో, సార్‌హిందీ ఏకీభవించినాడు.

ఈశ్వరుని ఆదేశాలను ప్రజలకు అందచేయడానికి సాధనమైనవాడు ప్రవక్త. కాబట్టి, అతనికి విధేయులమై ఉండడమే, మనము ఈశ్వరునిపట్ల ప్రదర్శించే విధేయత. దీనినిబట్టి,

ప్రవక్త నిర్దేశించిన ఆదేశాలను, ఆచారాలను మనసా, వాచా, కర్మణా, పాటించవలసింది, ఇస్లాముమతస్థుల ప్రథమకర్తవ్యం. ప్రవక్త ఆదేశాలను భిన్నమైన, ప్రబోధ, నిషేధము. నూతన కల్పనలలో గుణదోషతారతమ్యాన్ని చూపి, కొన్ని మంచివికూడా ఉన్నవని నిరూపించిన, మతశాస్త్రజ్ఞుల ప్రయత్నం తప్పు, అని షేక్ ఖండించినాడు. "ప్రతినవ్యతా, ఒక కల్పిత మతసూత్రమై, ఇట్టి ప్రతిసూత్రమూ ఒక ప్రమాదమై ఉన్నప్పుడు, వీటిలో కొన్ని మంచివి, కొన్ని ఉచితమైనవి, అని ఎట్లు చెప్పగలం? సంప్రదాయాలను అనుసరించి (హదీస్), ప్రతి నూతనకల్పనా,- (అపవాదమనేదే లేదు)- మతసూత్రాలను, ఉపదేశాలను త్రోసివేస్తుంది, కాబట్టి ప్రతికల్పనా దుష్టమైనదే" అని, అతడు ఉద్ఘాటిస్తాడు.

నూతన మతాభిప్రాయాలను అన్నిటినీ, షేక్అహమద్, సమగ్రంగా ఖండించినాడు. ఏ ఒక్కదానిని కూడా అతడు సహించలేదు. షియామతం, విశ్వాసఘాతుకత్వంకంటె, అధమమైన నూతనకల్పన, అని అతనిభావం, కాబట్టి, షియాలతో చేరకుండా ఉండడం అవసరం. షేక్ఫరీద్‌కు వ్రాసిన ఒక జాబులో అతడు ఈ విధంగా వ్రాస్తాడు.- "నూతన అభిప్రాయాలు కలవారితో చేరడం, విశ్వాసఘాతకులతో చేరడంకంటె దుష్టమైనది, అనేది సత్యం. ప్రవక్తయొక్క అనుయాయులపట్ల ద్వేషభావంవహించిన వర్గంవారు, వీరందరిలోనూ అధములు. పరమమైన కురానుకూడా వీరిని విశ్వాసఘాతకులని ఖండిస్తుంది". ప్రవక్తయొక్క సహచరులందరిలోనూ, అలీ అత్యుత్తముడు అని ప్రతిపాదించే షియాసిద్ధాంతాన్ని నిరసిస్తూ, ఇతడు, రద్దేరవాఫిజ్ అనే గ్రంథాన్ని రచించెను. గానము, నృత్యము, [సమా-వా-రాక్స్] అనే వాటిపట్ల తన అసమ్మతిని వ్యక్తపరచినాడు. పెద్దవిషయాల్లోను, అల్పవిషయాల్లోను, కూడా, నిష్కర్షను పాటించినవాడు ఇతడు. ఇందుకు నిదర్శనంగా; ప్రవక్తధరించిన తలపాగా యొక్క కొన, రెండుభుజాలకూ మధ్యగా వీపుపై వ్రేలాడుతూ ఉండేది. కాబట్టి, ఆ కొనను ఎడమభుజంపై వేసుకొనే ముస్లిముల అలవాటు అనుచితమని, ఇతడు అభిప్రాయపడినాడు.

హిందువులను ద్వేషించడంలో, అత్యుత్సాహాన్ని వహించినవాడు, షేక్అహమద్. హిందూ మతస్థులను, అవమానాన్ని, అమర్యాదను కలిగించడానికంటె, ఈశ్వరునికి సంతోషకరమైన కార్యం మరొకటిలేదని ఇతని నమ్మకం. "తిరస్కారంతోను, ధిక్కారంతోను, హిందువులను అణచివేయడానికి తగిన సాధనం, జిజియాపన్నులను విధించడమే" అని అతని భావం.

హిందువుల అలవాట్లను, ఆచారాలను పెక్కింటిని, ముస్లిములు అవలంబించినారు. వివాహ సంప్రదాయాలు, శవసంస్కారాది ఉత్తరక్రియలు, ప్రకృతికి అతీతమైన శక్తులను విశ్వసించి పూజించడము, కులభేదాలు, గోవధను ప్రతిఘటించడం, విధవాపునర్వివాహనిషేధము, మొదలైన హిందూ ఆచారాలు ముస్లిములలో కూడా ప్రవేశించినవి. ఈ ఆచారాలన్నీ దూష్యములని, తప్పక విసర్జింపతగినవి, అని, షేక్అహమద్ ప్రకటించెను. ప్రవక్తకాలంలోని అరబ్బులవలె, ముస్లిములు తమ జీవనాన్ని నడపవలెనని, ఇండియాలో అధిక సంఖ్యాకులుగా ఉన్న ముస్లిమేతర ప్రజల పద్ధతులను, ఏమాత్రమూ గ్రహించ కూడదని, ఇతడు కోరి కోరినాడు.

ఇండియాలో ఏర్పడిఉండిన అన్ని సూఫీశాఖలన్నిటిలోనూ ఇతనికి ప్రవేశం ఉండెను

ఉంచినది. కాని, రహస్యోపాసక శిక్షణజ్ఞానాల కంటె ఎక్కువ ప్రాముఖ్యాన్ని, శ్రద్ధాభక్తులను, షరియత్ అనే మత న్యాయసూత్రాలకు ఇచ్చిన నక్షబందియా సూఫీశాఖపట్ల, ఇతనికి ఎక్కువ అభిమానం. ఐనప్పటికీ అధ్యాత్మజ్ఞాన సంపన్నుడైన పరమసాధువు (వాలీ) యొక్క స్థానం, ప్రవక్తల (నబీ) స్థానంకంటె ఉన్నతమైనదని చెప్పే సూఫీల విశ్వాసాన్ని ఇతడు ఒప్పుకోలేదు. ఇదే విధంగా, వీరి విశ్వదేవైక్య సిద్ధాంతాన్ని కూడా అంగీకరించలేదు. దాని స్థానంలో, ఇతడు, ఈశ్వర లక్షణైక్య వాదాన్ని [వహీదత్-అల్-షుదుద్] ప్రసారం చేసినాడు.

న్యాయపరుడు, బుద్ధిమంతుడుఐన ఉలామాచేసిన అర్థనిర్ణయాన్ని అనుసరించి, కురాన్, హదీసులద్వారా మతాన్ని పరిశుద్ధంచేసుకోవడము, నూతనసిద్ధాంతాలను పూర్తిగా విసర్జించి, న్యాయానికి నిష్కర్షగా బద్ధులైఉండడము, ఇస్లాముమతము యొక్క ప్రధానసూత్రాలు. వీటిని అనుసరించడం, అందరి ముస్లిములకూ తప్పనికర్తవ్యం, ఇది అతని అభిప్రాయ సంగ్రహం.

తన ఉన్నతధ్యేయంపట్ల నిశ్చితజ్ఞానం కలవాడు షేక్అహమద్. భిన్న జీవనవ్యవస్థలను చెందిన, పలుకుబడిగల మొగల్ కులీనులతోను, ఇతర ప్రసిద్ధవ్యక్తులతోను, పత్రవ్యవహారాలు జరుపుతూ, తన అభిప్రాయాలను వారిలో వ్యాపింపచేయడానికి కృషిచేసినాడు. ఖాన్-ఈ-ఖానన్, సికందర్ఖాన్లోడీ, మహబత్ఖాన్, ఖాన్-ఈ- అజామ్ ముర్తజాఖాన్, షేక్ఫరీన్బుఖారీ, ఖాన్-ఈ-జహన్, కిలిచ్ఖాన్, సద్ర్జహాన్, లాలాబేగ్, సుమారు ఐదువందలమంది ప్రముఖులు,- ఇతనితో పత్రవ్యవహారం జరిపినవారు. ప్రతిప్రాంతానికీ, ప్రతి నగరానికీ తన మతప్రచారకులను పంపి, కర్తవ్యాన్ని వారు సక్రమంగా, సమర్థతతో నిర్వహించేటట్లు, జాగ్రత్తపడినాడు.

"సన్మార్గాన్ని ప్రవర్శించి, సత్యాన్ని నిరూపించడం మాత్రమేకాక, తన జీవితానికి మరేవో ఉన్నత లక్ష్యము ఉన్నదని, ఏదో ఉద్దేశంతో, భగవంతుడు తన్ను సృష్టించినాడని," దృఢంగా నమ్మినవాడు, షేక్అహమద్. అబూబక్ర్, ఉమర్ స్థానాలను ఇదివరకే అతిక్రమించి, వారికంటె ఉన్నత స్థానాన్ని తానుచేరుకొన్నానని, ఇతడు చెప్పేవాడు. "సాధుత్వము యొక్క (వలీయత్) తలుపులను తెరవడానికి తాను ఏర్పడి ఉన్నాడని, రహస్యోపాసకుల క్రమశ్రేణిలో తాను అఖరువాడని," ధైర్యంతో ప్రకటించేవాడు. రెండవ సహస్రాబ్దంలో వచ్చిన ఇస్లాము మత సంస్కర్త, మహమ్మద్ స్థానాన్ని ఈశ్వరుని మిత్ర స్థానానికి [ఖలీల్] చేర్పగల వ్యక్తితాను, అనిచెప్పుకొనేవాడు. ఈ అసాధారణములైన అధికార ప్రకటనలను గుర్తించి, ముస్లిము ఉలామా, జహంగీరుకు, ఫిర్యాదుచేసెను. జహంగీరు, విషయాలను అనుసంధానం కావించి, న్యాయసభలో విచారణ జరిపి, నిజాన్ని తెలుసుకొని, గ్వాలియర్ దుర్గంలో బందీగా ఉండే శిక్షను ఇతనిపై విధించెను. రాజ్యాపాయకరములైన ద్రోహాలుచేసినవారు అనేకులు, ఈ దుర్గంలో బందీలుగా ఉండిరి. కొంతకాలానికి జహంగీరు దయతలచి, తన సైన్యముయొక్క కావలాలో కొంతకాలంపెట్టి, పిమ్మట, ఇతనిని విడుదలచేసెను.

ఇతనిపై ఈ విధమైన చర్యతీసుకొన్నప్పటికీ, కూడా, జహంగీర్, షాజహానుల సడలమైన పరిపాలనలో ఇతని మతప్రచారం విరివిగా సాగింది. ఇతని కుమారుడైన మహమ్మద్ మసూమ్, తీవ్రమైన ప్రచారాన్ని సాగించినాడు. ఆ సమయంలో ముల్తాన్ గవర్నరుగాఉండిన

ఔరంగజేబు, ఇతని ఉపన్యాసాలకు హాజరైనాడని తెలుస్తుంది.

మెక్కా యాత్రకుపోయే ముందు మసూమ్, ఢిల్లీ సింహాసన వారసత్వ సంఘర్షణలో ఔరంగజేబుకు విజయం లభిస్తుందని, భవిష్యత్తును సూచించినాడు. బాల్ఖ్‌పై పంపిన సామ్రాజ్యసైన్యానికి నాయకుడుగా ఔరంగజేబును నియమించిన సందర్భంలో, అతనికి వాబు వ్రాస్తూ, మసూమ్, ధార్మికయుద్ధము యొక్క ఉత్కృష్టతనుగూర్చి విపులంగా పొగడి ఉన్నాడు. "ప్రాపంచిక విషయాల నుంచి విరమించుకొని, కఠిన వ్రతాలను ఆచరిస్తూ, దీర్ఘకాల ఉపవాసాలను పాటిస్తు-ఉన్న మావంటి సన్న్యాసులు కూడా, ధార్మికయుద్ధంవల్ల లభించే సత్ఫలంలో, కట్టకడపటి అంశాన్నికూడా అందుకోలేము. మహమ్మద్ ప్రవక్తయొక్క మసీదులో పునరుచ్చారణ కావించిన ప్రార్థనవల్ల, పదివేల రెట్లు పుణ్యంలభిస్తుంది; మెక్కా మసీదులో జరిపిన ప్రార్థనవల్ల నూరువేలరెట్లు పుణ్యం లభిస్తుంది; ధార్మిక యుద్ధరంగంలో చేసిన ప్రార్థనవల్ల, ఇరవై లక్షలరెట్లు పుణ్యం సిద్ధిస్తుంది".

మహమ్మద్ మసూమ్ కుమారుడైన, షేక్‌సైఫ్-ఉద్-దీన్ (క్రీ. శ. 1639-40 లో జననం) ను, తన మార్గదర్శిగా, గురువుగా, ఔరంగజేబు స్వీకరించెను. అతని ప్రభావానికి లోనై, ఔరంగజేబు, షేక్‌అహమద్ సార్ హిందీ యొక్క అభిప్రాయాలను కార్యరూపంలో ప్రవర్తింపచేసెను. మొగలు సామ్రాజ్య పతనానికి, ఇవి చాల వరకు హేతువులైనవి. సామ్రాజ్యం నశించిపోయినప్పటికీ, మతం నిలిచిందని, సార్ హిందీని సమర్థించేవారు చెప్పుతారు. కాని, వీరి అభిప్రాయాన్ని సమర్థించడమూ కష్టం, త్రోసిపుచ్చడమూ కష్టమైనదే. ఏది ఏమైనా, దేశంమాత్రం అంతరసంఘర్షణలకు లోనయింది; బాహ్య శత్రువుల దండయాత్రలకు చక్కని అవకాశం ఏర్పడింది; అరాజకత్వంలో మునిగిపోయింది. ఔరంగజేబు మరణానంతరం నూరు సంవత్సరాలలోపుననే, భారతదేశం విదేశీయుల పరిపాలనకు లోబడిపోయింది. సుమారు రెండు వందల సంవత్సరాలకాలం పరదేశీయుల పరిపాలనలో ఉండి, కడపటికి. దేశం, స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొంది. కాని మత విభేదంవల్ల, భారతదేశం రెండు రాజ్యాలుగా చీలిపోయింది.

అక్బరు ప్రారంభించిన ఉద్యమం, దారాషుకోతో పరిణతి కాంచింది. కాని, ముస్లిముల మనస్సులను ఇది వశపరచుకోలేక పోయింది. అక్బరు అభిప్రాయాలు ఆకాలానికి చాలా దూరంగా పురోగమించి యుండినవి. కాబట్టి అక్బరు అభిప్రాయాలకు ప్రతి క్రియగా ఉద్భవించి మైన విరుద్ధాభిప్రాయాలకు సార్‌హిందీ ప్రధాన ప్రచారకుడైనాడు. ఔరంగజేబు సార్‌హిందీ అభిప్రాయాలను అనుసరించినాడు. కాని ఔరంగజేబు తీసుకొన్న చర్యలవల్ల, ముస్లిముల జీవన పద్ధతిలో ఏవిధమైన మార్పూకలుగలేదు. సంపన్నవర్గాలవారు, పూర్వముకంటె ఎక్కువ భోగాలలో మునిగిపోయి, జడప్రాయులైనారు. రైతులతోను, వృత్తికార్మికులతోను, వర్తకులతోను ఏర్పడిన సామాన్య ప్రజానీకం, ప్రభుత్వముయొక్క మితిలేని నిర్బంధాలవల్ల, నలిగిపోయింది. సైన్యము ధర్మభ్రష్టమైపోయింది; సేనానాయకులు లంచగొండితనానికిలోనై, శత్రువులకు అమ్ముడు పోవడానికి సిద్ధమై ఉండిరి. కపటాచరణులైన మత విశ్వాసజ్ఞులు అసంఖ్యాకంగా బయలుదేరిరి. వారిలో ప్రధానుడైనవాడు షేక్‌అహమద్‌యొక్క మనుమడైన షేక్, సైఫ్-ఉద్-దీన్. ఇతని ఆడంబరము, వైభవము, రాజులను పోలినవి. సహజ బంధాలు సడలిపోయినవి; జనజాతి భావము, పంథాభిమానము తీవ్రమైనవి; రాజ్యభక్తి విశ్వా

సాలు దుర్బలమై పోయినవి. విషాదకరములైన ఈ పరిస్థితుల హేతువులను గూర్చిచర్చిస్తూ, ఒక ముస్లిము రచయిత ఈ విధంగా వ్రాస్తాడు. "న్యాయశాస్త్ర ధర్మశాస్త్రాలు కేవలం మానవుని బాహ్య ప్రవృత్తులకు మాత్రమే సంబంధించినవి. కాబట్టి, వాటిపై మనకు గల ఆసక్తి ఉత్సాహాలు, మానవుని హృదయాంతర్గతములైన రోగాలను బాగుపరచలేవు. [బాహ్య విచారణచేసే అధికారికి, ఇంటి లోపలి పరిస్థితులతో సంబంధమేమున్నది?] ఇస్లాము మతములోని సంప్రదాయాలను, ఆచారాలను రక్షించడానికి మాత్రమే ఈ శాస్త్రాలు పూనుకొన్నవి ;- జూదాన్ని ఆపడం, తాగుడుమాన్పడం, జిజియాపన్నును విధించడం, కొత్తగా దేవాలయనిర్మాణాన్ని ఆపడం, చిన్నవీ పెద్దవీ ఐన పాపాచరణాలకు తగిన శిక్షలు విధించడం,- మొదలైనవి మాత్రమే ఆ శాస్త్రాల పరిమితిలోనివి. ఈ విషయాలకు న్యాయశాస్త్ర వేత్తలు ప్రాధాన్యం ఇస్తారు. అంతేకాని మానవుని ఆధ్యాత్మిక లోపాలు వీరి అధికార పరిధిలోనివికావు కాబట్టి, ఈ అంతరంగిక రోగాలకు వీరు ఉపశమనం చేయలేరు."

షేక్అహమద్ మరణానికి (1625), ఔరంగజేబు మరణానికి (1707) గల మధ్య కాలంలో ఈ రెండు మతసంస్థలు పూర్తిగా విఫలమైపోయినవనే విషయం స్పష్టంగా నిరూపితమైపోయింది. ఔరంగజేబు అనంతరం, ఇండియాలోని పరిస్థితులు వేగంగా అరాజకత్వస్థితికి వచ్చినవి. విధ్వంసము, నిరాశ, దట్టంగావ్యాపిస్తున్న దేశవాతావరణంలో, మూడో ఇస్లాముమతసంస్థను షావాలీఉల్లా స్థాపించినాడు. [1703లో, అతడు ఢిల్లీలోజనించి 1762లో, మరణించెను.] సమాజము, రాజ్యము, మతము నీతి, రాజకీయాలు,- ఈ అన్ని విషయాలకూ సంబంధించిన విషమసమస్యలను ఇతడు ఎదుర్కొనవలసివచ్చింది. అభిప్రాయవైవిధ్యము, వర్గీకరణము, ఆనాటి సమాజంలోని సార్వత్రికపరిస్థితులు. కేవలం మతసిద్ధాంతాలకు, ఆచారాలను ఆశ్రయించుకొని ఉండిన సాంప్రదాయిక శుష్కపండితులకూ, అంతరంగిక శిక్షణమే మతసారమని విశ్వసించిన దీక్షావివేచనపరులకూ, మధ్య, సంఘర్షణ ఏర్పడిఉండినది. ఇదే విధంగా, న్యాయశాస్త్రపండితులకూ, సంప్రదాయవాదులకూ, మధ్యా, నాలుగు మతసంస్థల న్యాయశాస్త్రజ్ఞులమధ్యా, షియాసున్నీలమధ్యా- కూడా ఘర్షణలు సిద్ధించినవి. విషయాలను పరిశీలించడంలో, వీరు అనుసరించిన విధానాలుకూడా భిన్నమైనవే. మతాధికారాన్ని (తక్లీద్) గ్రుడ్డిగా అనుసరించడమే శ్రేష్ఠమని కొందరు విశ్వసించిరి. శాస్త్రాలను వివరించి వ్యాఖ్యానించడానికి (ఇజ్తిహాద్) విస్తారమైన అవకాశం ఉన్నదని ఇతరులు గ్రహించిరి. మతతత్త్వాలను వివరించడంలో గ్రీకుతత్త్వశాస్త్రాన్ని ఉపయోగించకూడదని కొందరు పట్టుబట్టిరి. శాస్త్రాలను అర్థంచేసుకోడానికి, హేతువాదాన్ని, తర్కాన్ని అవలంబించడం మంచిదని మరి కొందరు అంగీకరించిరి. ఇవేకాక, నైతికసమస్యల విషయంలోను, రాజకీయసమస్యల విషయంలోను కూడా, అభిప్రాయభేదాలు ఏర్పడినవి. సామ్రాజ్యం క్షీణించడానికీ, నైతికవ్యవస్థ భగ్నంకావడానికీ గల హేతువుల విషయంలో కూడా ఎవరికీ ఏకాభిప్రాయం లేదు.

ఈ బహుముఖ సమస్యలను అన్నిటినీ, ఒకస్వతంత్రమైన దృక్పథంతో, పరిశీలించడానికి, వలీఉల్లా పూనుకొన్నాడు. ఈ అభిప్రాయభేదాలకు హేతువులైన మూల విషయాలను నశింపచేసి, ప్రతికూల భావాలను అధిగమించి, పరస్పర విరుద్ధములైన దృక్పథాలకు సామరస్యం కూర్చదలచుకొన్నాడు. ఈశ్వరుడు సర్వజ్ఞుడు (ఆలీం), సంపూర్ణబుద్ధిస్వరూపుడు (హకీం) ఐ, ఉండడంవల్ల మత సంబంధమైన సమస్యలను పరిష్కరించడంలో,

హేతువాదాన్ని నిరూపణ పద్ధతిని త్రోసివేయరాదు, అని ఇతడు వాదించినాడు. ఈశ్వరుని కార్యములన్నీ హేతువాదబద్ధములైనవే. హేతువాదాన్ని ప్రయోగించి, వాటిని గ్రహించడం మానవుని కర్తవ్యం. తన ప్రవక్త ద్వారా, ఈశ్వరుడు ప్రకాశన మొనర్చిన విషయాలు, ఈశ్వర సంకల్పాన్ని అర్థంచేసుకోడానికి సహకరిస్తాయి. "విస్పష్టమైన హేతువాదంతో తప్ప, ఇతర విధంగా ప్రజలకు విశ్వాసం కలిగించడం, కురాను ఉద్దేశం కాదు." న్యాయశాస్త్ర పద్ధతి (షరియత్), రహస్యోపాసన పద్ధతి (తరీకత్), అనేవి పరస్పర విరుద్ధములైన మత విధులు కావు; ఒకే చెట్టులో ఉద్భవించిన రెండు పండ్లు అవి. ఈశ్వరసారవాదము, ఈశ్వర లక్షణైక్యవాదము, అనే రెండు తత్త్వశాస్త్రాల అనుయాయుల మధ్యా ఏర్పడియుండిన వివాదాన్ని, ఇతడు అంతమొనర్చడానికి పూనుకొన్నాడు. ఈ రెండు తత్త్వశాస్త్రాలకూ సమానములై ఉన్న లక్షణాలను, అంశాలను ఆధారంగా చేసుకొని, వాటికి మాత్రమే ప్రాధాన్యం ఇచ్చి, రెండు పక్షాలవారికీ సామరస్యం కూర్చడం, ఇతని ప్రయత్న ప్రక్రియ. ఇదే విధంగా, నాలుగు న్యాయశాస్త్ర సంస్థలూ, కూడా, మాలిక్ రచించిన 'మువట్టా' అనే మూలగ్రంథము నుంచి ఉద్భవించినవే అని, నిరూపించి, ఈ సంస్థలకు ఐక్యాన్ని కలిగించడానికి ప్రయత్నించినాడు.

తురానీ వంశజులైన సున్నీ కులీనులకు, ఇరానీజాతి వంశజులైన షియా కులీనులకు గల కలహాలు, పద్దెనిమిదో శతాబ్దపు పరస్పర వినాశకర యుద్ధాలకు ప్రధానమైన కారణాలు. ఈ రెండు పక్షాలవారికీ సమాధానంకూర్చే విధంగా, షావలీఉల్లా, నలుగురు ఖలీఫాల జీవితాలను, వారు సాధించిన మహాకార్యాలను, వారి గుణశీలాలను వర్ణించి, ఇజలాతుల్ అనే ప్రకరణ గ్రంథాన్ని రచించెను.

వ్యక్తియొక్క వివేచన శక్తికి ప్రేరణం కలిగించి, అతనిని ఉలామా ప్రాబల్యమనే బంధనాల నుంచి విముక్తిగావించడం, షావలీఉల్లా ఉద్దేశం. కురానును ఇతడు పర్షియా భాషలోనికి అనువదించడంవల్ల ఈ విషయం స్పష్టంగా వ్యక్తమౌతుంది. పవిత్రమత గ్రంథాల అర్థాన్ని గ్రహించడానికి తన బుద్ధిశక్తిని ఉపయోగించే హక్కు ప్రతివ్యక్తికీ ఉన్నదని దీని వల్ల, గుర్తించబడింది. షావలీఉల్లా సాధించిన ఈ అతి సాహస కార్యం, లూథర్ కావించిన సాహసకార్యానికి సమానమైనట్టిది.

నైతిక, రాజకీయ, ఆర్థికవ్యవస్థలకు గల పరస్పర సన్నిహిత సంబంధాలను, అతి నిశితదృష్టితో గ్రహించినవాడు, షావలీఉల్లా. రాజకీయరంగంలో, ఈ విధమైన పర్యాలోచన శక్తిగల ముస్లిము ఇతడొక్కడే అని తోస్తుంది. అతని అభిప్రాయప్రకారం, నైతికవ్యవస్థ రెండుభాగాలతో ఏర్పడింది; స్వంతము, లేక, వ్యక్తిగతమునైనది ఒకభాగం; పౌరసంబంధమైనది, లేక, సమాజసంబంధమైనది రెండవభాగం. ఈ రెండవభాగమే మొదటిదానికంటె, ఎక్కువ ప్రధానమైనది. దీనికే మనము ఎక్కువవిలువ ఇవ్వవలసిఉంది. సామాజిక నీతి విషయంలో, న్యాయప్రవృత్తికి అత్యున్నతస్థానాన్ని ఇవ్వవలెనని, అతని అభిప్రాయం. వినయము, సౌజన్యము, సభ్యత, ఇత్యాది వ్యక్తిప్రవర్తనలో వ్యక్తమయ్యేది న్యాయప్రవృత్తి. విత్తసంబంధమైన వ్యవహారాలలో, ఆర్థికవ్యవస్థగా, సామాజికనీతి వ్యక్తమౌతుంది; సామాజిక జీవితంలో అది, పౌరస్వాతంత్ర్యంగాను, రాజకీయాలలో క్రమవ్యవస్థరూపంలోను, అది వర్తిస్తుంది. ఈ సామాజికనీతి అనే ఉత్కృష్టశీలం, భ్రాతృత్వానికి, పరస్పరప్రీతికి, సహభాగి

త్వానికి ఆధారంగా ఏర్పడినప్పుడు, దానికి సాంఘిక శ్రేయస్సు అనే వ్యవహారం సిద్ధిస్తుంది. మానవులు న్యాయంగా ప్రవర్తించినప్పుడే, ధర్మబద్ధమైన సమాజం ఏర్పడుతుంది. అట్టి సమాజాన్ని నిర్మించడమే ఈశ్వరునికి ఇష్టమైనకార్యం.

న్యాయప్రవృత్తిని గూర్చి, వలీఉల్లా ప్రతిపాదించిన అభిప్రాయము సమగ్రము, గభీరముఐ, ప్లేటో ప్రతిపాదించినదానికి సదృశమైఉన్నది. ఈ అభిప్రాయానికి రావడంలో, వీరు అనుసరించిన భావప్రక్రియలుమాత్రం భిన్నమైనట్టివి.

సంపద మితిమీరి అభివృద్ధిచెందిన సందర్భంలో, ధర్మబద్ధమైన ఈ సమాజం భ్రష్టమైపోతుంది. సంపన్నులైన వారిని, ఆడంబరప్రదర్శనమూ, అహంభావమూ ఆవేశించినపుడు, ఐహికాపేక్షలను, ఇంద్రియాలను తృప్తిపరచుకోవడమే, జీవిత ఆశయంగా ఏర్పడుతుంది. భోగవస్తువులపై అతికాంక్ష, విషయలోలుపత, జీవితంలో ప్రధానప్రయోజనాలు ఔతాయి. ఇది తప్పనిసరిగా అధికాదాయసంపాదన ప్రయత్నానికి దారితీస్తుంది. సంఘంలోని పర్బలవర్గాల ప్రజలను, రైతులను, వర్తకులను, కార్మికులను, పీడించి, వారి రక్తాన్నిపీల్చి. అధికధనాన్ని చేకూర్చుకొని, నమ భోగవిలాస జీవనాన్ని సాగించుకోవలసి వస్తుంది. దేశము యొక్క ఆర్థికవ్యవస్థ ఈ విధంగా, తప్పుత్రోవలలో పడింది. భోగవిలాసవస్తువుల ఉత్పాదనకు అధిక ప్రాధాన్యం సిద్ధించినందువల్ల, గ్రామికవర్గప్రజలు దరిద్రులైపోయిరి. రాజాస్థానాన్ని ఆశ్రయించుకొని ఉన్న సోమరులసంఖ్య దినదినమూ వృద్ధిఔతూఉంది కాని; వారివల్ల దేశానికి కలిగే ప్రయోజనం మాత్రం శూన్యం. వీరిని పోషించడానికై రాజ్యకోశం క్రమంగా, కాళీఐపోయింది.

ఇట్టి పరిస్థితులను నివారించడానికి, షావాలీఉల్లా, ఒక పద్ధతిని ప్రతిపాదించినాడు. "ఇప్పుడు నెలకొనిఉన్న వ్యవస్థను పూర్తిగా రద్దుచేయడం (ఫక్కి-కుల్లి నిజాం) మొదట చేయవలసినపని". మానవులకు సంబంధించిన వ్యవహారాలలో న్యాయాన్ని మళ్ళీ నెలకొల్పి, ప్రజలలో సామరస్యాన్ని పునఃప్రతిష్ఠకావించడం, తర్వాత జరగవలసిన కార్యం.

వాలీఉల్లా కావించిన ప్రతిపాదనలో, విలువగల భావాలు ఉన్నవి. వాటిని అవలంబించి, అభివృద్ధిపరచి ఉంటే, ఇండియా జీవితములోని చిక్కు సమస్య లనేకములు విడిపోయి ఉండేవి. కాని, దురదృష్టవశాత్తూ, కాలం ప్రతికూలమై ఉండింది. షావాలీఉల్లావు మూలాధారాలు కూడా తగినంతగాలేవు. సంస్కరణలు కలిగించడానికి అతడు ఆధారపడ తలచుకొన్న సాధనాలు, అసమర్థములైనవి, లేదా, అనర్హములైనట్టివి. ఇండియాదేశ వ్యవహారాలలో కలుగజేసుకొని ఇస్లాము మతముయొక్క విశుద్ధకీర్తిని, నిలుపవలసిందని ప్రార్థిస్తూ, అతడు నజీబ్-ఉద్-దౌలా, నిజామ్-ఉల్-ముల్క్, అహమద్‌షా అబ్దాలీలకు, విన్నవించుకొన్నాడు. ఈ ముగ్గురు కూడా, షావాలీ నిరసించి ఖండించిన పూర్వపద్ధతికి రక్షకులైనవారే. తాను ఎన్నుకొన్న ఈ వ్యక్తులు తాను తలచుకొన్న కార్యానికి తగిన వారు కారని, గ్రహించలేకపోయినాడు. అంతేకాదు, మొగలు సామ్రాజ్యంలోని ఉత్తమోత్తమ ప్రాంతాలను దోచి ధ్వంసంకావించి, హిందువు, ముస్లిము, అనే దయాదాక్షిణ్యాలు లేకుండా అందరి సర్వస్వాన్ని దోపిడిచేసిరి. అంతకంటె ముఖ్యంగా, తన దేశ ప్రజలలోనే స్థానం లేనట్టి అల్పోద్ధతుడైన అహమద్‌షా అబ్దాలీని, ఇతడు విశ్వసించడం అతి విచిత్రం. జాతి మత వర్గాల అవధులను అతీతమై, ఇండియా సమాజంలోని అన్ని భాగాలనూ సామరస్యంతో కూడిన ఏకైక సంస్థగా

కూర్చి, ఇండియా ప్రజలందరినీ సమాన దృష్టితో చూడగలిగినట్టి న్యాయము మాత్రమే. తాను కలలు కంటున్న సమాజాన్ని స్థాపించి, రక్షించగలదని, ఊహించడం అతనికి సాధ్యం కాలేదు. ఇండియాలోని రాజకీయ పరిస్థితులను పూర్తిగా మార్చివేస్తున్న, బెంగాలులోని సంఘటనల భావగర్భిత సూచనను కూడా, అతడు గ్రహించలేక పోయినాడు.

ఇతని కుమారుడైన, షాఅబ్దుల్‌అజీజ్ (1746-1823) ఢిల్లీని బ్రిటిషువారు ఆక్రమించడం, (1803) ప్రత్యక్షంగా చూచినవాడు. ఆత్మసాక్షికి సంబంధించిన స్వేచ్ఛ, ఆత్మాభిప్రాయ స్వాతంత్ర్యము, పౌరస్వాతంత్ర్యము, అనేవి ప్రజలకు లేకుండా చేయడంవల్ల, ఇస్లాము మతముయొక్క పునాదులు నాశమైనవనీ, అందువల్లనే ఇండియాదేశం యుద్ధభూమిగా (దారుల్-హార్బ్) మారిపోయిందనీ, ఇతడు అర్థంచేసుకొన్నాడు. అయినప్పటికీ, ఈ మార్పుయొక్క అంతరార్థాన్ని తండ్రికాని, కుమారుడుకాని గ్రహించలేదు. దేశానికి కలిగిన నూతన అపాయాన్ని పూర్వపు ఆయుధాలతో ఎదుర్కోలేమని తెలుసుకోలేకపోయిరి. అంతే కాక, తక్కిన మతవర్గాలవారిని అసంతుష్టికి, క్లేశానికీ, గురిచేసి, దాస్యంలో పడలి, ఏ ఒక్క మతవర్గంకానీ, ప్రత్యేకంగా ఉన్నత స్థితికి రాజాలదు, అనే పరిజ్ఞానం కూడా వారికి లేక పోయింది.

హిందూమతభావాలు : దక్షిణంలోని విజయనగరసామ్రాజ్య పతనంతో, స్వతంత్ర భావయుగం హిందువులలో, అంతమైనదని చెప్పవచ్చు. స్వతంత్రపర్యాలోచనతో కూడిన భాష్యాదులు కాని, ప్రాచీన గ్రంథపునర్నిర్మాణము కాని, ఆపైజరగలేదు. ప్రాచీనకాలంలో, ఉపనిషత్తులతో ఆరంభమైన స్వతంత్రభావోద్యమం, శంకర, రామానుజ, మధ్వ, నింబార్కుల తాత్త్విక విచారరచనలతో స్థిరపడింది. కాని, ఈ భావోద్యమం, మతాచార్యులలో కడపటివాడైన వల్లభునితో ముగిసింది. ఈ విషయమై రాధాకృష్ణ, ఈ విధంగా వ్రాస్తారు. "ఈ క్షీణదశాకాలంలోని తత్త్వవేత్తలు,- లేదా, తత్త్వశాస్త్రరచయితలు, సత్యోపాసకులమని భావించినారు. భిన్నమతసిద్ధాంతాలకు పూజ్యములైన సత్యాభాసాలను అతిసూక్ష్మతర్కంతో సమర్థించుకొంటూ, మైలపడకుండా కాపాడుకొంటున్న మతభావాలు,- సత్యమని ఈ తత్త్వశాస్త్ర పండితులు నమ్మిఉండిరి. తమ సమీపంలో, మెల్లమెల్లగా పారుతూ, ఇసుకలో ఇంకి పోతూ, ఆవిరిగా గాలిలో కలిసిపోతూఉన్న పిల్లకాలువను, భారతీయతత్త్వశాస్త్ర నదీప్రవాహమని, మీమాంస న్యాయశాస్త్రులు వృత్తిగాగల ఈ పండితులు ఊహించుకొంటూ ఉండిరి".

దేశమంతటా వ్యాపిస్తూ, ప్రజాదరణను పొందుతున్న భక్తిపంథకు, తాత్త్విక సిద్ధాంతాలతో పునాదులువేసినవారు, రామానుజ, రామానంద, వల్లభాచార్యులు. వల్లభాచార్యుడు ప్రతిపాదించిన భక్తి సిద్ధాంతానికి పుష్టిమార్గమని వ్యవహారం. దివ్యతత్త్వానుభూతికి ఈశ్వరుని కృపను సంపాదించడం ఒక్కటేమార్గం, కాబట్టి, ఈశ్వరానురక్తికి వారు ప్రాధాన్యం ఇచ్చినారు. వల్లభునితర్వాత, అతడు ప్రతిపాదించిన తత్త్వశాస్త్రంలో ప్రఖ్యాతులైనవారు లేరు. కాని, విస్తృతమైన భక్తిమార్గసంస్థలు దేశంలో ఏర్పడడానికి, ఇతని భావాలు ఉత్తేజకములైనవి. ఈ మార్గాన్ని అవలంబించిన భక్తులు ఈశ్వరప్రేమను ఈశ్వర కృపనుకూర్చి, దేశభాషలలో పాటలను రచించి, పాడుతూ భక్తిభావాన్ని ప్రసారం కావించినారు.

భాగవతపురాణాన్ని పునరుద్ధరించి, ప్రజలలో వ్యాప్తికి తెచ్చినఉద్యమం, ఈ భక్తి మార్గాభివృద్ధికి దోహదమొసర్చి, పోషించింది. పూర్వపుఆచార్యులు, ఉపనిషత్తులు, బ్రహ్మ

సూత్రాలు, భగవద్గీత, అనే ప్రస్థానత్రయాన్ని మాత్రమే గ్రహించి, వాటిని తమ భాష్యాలతో, వివరణాలతో ప్రచారంకావించి ఉండిరి. కాని, వల్లభాచార్యుడు, ఇతరులు, ఈ గ్రంథత్రయంతో, భాగవత పురాణాన్ని కూడా జతపరచి, దానిపై వ్యాఖ్యానాలను రచిస్తూవచ్చిరి.

సూరదాస్, తులసీదాసుల శాశ్వత కవితా రచనలలో, భక్తిమార్గ వ్యాఖ్యాతల భావ ప్రవాహాలు, భావనలు, భాసించినవి. భిన్నమతశాఖలయొక్క తత్త్వశాస్త్రాల ప్రభావం కూడా, సూరదాస, తులసీదాసులపై ప్రసరించింది. కాని, ఈ కవులు మతశాఖల భేదాభిప్రాయాలను, సంకుచిత భావాలను, అవధులను, అధిగమించి, ఉన్నత వీధులలో విహరించినారు. ఉత్తర భారతదేశభాషలు, పదహారో శతాబ్దంలో, నూతన భావ వ్యక్తీకరణకు, నూతన కావ్యసృష్టికి, సాధనములుగా ఏర్పడినవి. సంస్కృత భాషాప్రాధాన్యం తగ్గిపోయింది.

ధర్మశాస్త్రాధ్యయనం విస్తృతమై ఉండినది. కాని, వాచస్పతిమిశ్ర (15 శతాబ్దం), రఘునందన్ (16 శతాబ్దం) కమలాకర, మిత్రసేన (17 శతాబ్దం)-అనే వ్యాఖ్యాతల తర్వాత ధర్మశాస్త్రాలపై విలువగల వ్యాఖ్యానాలు రచింపబడలేదు. పద్ధెనిమిదోశతాబ్దంలో, బాలకృష్ణ పంజగుండా రచించిన 'బాలం భట్టి' అనే గ్రంథం 'మితాక్షర' కు మంచి వ్యాఖ్యానంగా ప్రసిద్ధిచెందింది.

న్యాయశాస్త్రము, ఇతర తత్త్వశాస్త్రాలు కూడా బోధింపబడుతూ వచ్చినవి; కాని వాటిలో, గమనింపతగిన అభివృద్ధి ఏదీ జరగలేదు. జ్యోతిషశాస్త్ర, గణితశాస్త్రాల, అధ్యయనంలో కొంత శ్రద్ధవహించి ఉండిరి. ముఖ్యంగా, జాతకరచనకు, సుముహూర్తాల నిర్ణయానికి, పర్వదినాల నిర్ణయానికి, ఈ శాస్త్రాలు ఎక్కువగా ఉపకరించినవి.

మొత్తంమీద కడపటిరోజుల సంస్కృత సారస్వతాన్ని గూర్చి 'కీత్' (Keith) పండితుని నిర్ణయం, సమంజసమైనది. "రచయితలు శాస్త్ర నిబంధనాలకు కట్టుపడినవారు. శాస్త్రాధికారాన్ని అనుసరించడంలో, ఏవిధమైన స్వతంత్ర ప్రవృత్తినీ పెంపొందించుకోలేక పోయిరి. శాస్త్రనిబంధనలతో అన్వయం లేని వాటికి, కుతర్కంతో అన్వయాన్ని సాధించడానికి, తమ ప్రాంతంలోని ఆచారాలు శాస్త్రసమ్మతములైనవని నిరూపించడానికై, ప్రాచీన శాస్త్రాలను సాగదీసి వాటిలో లేని అర్థాలను పిండి తమ వాదాన్ని సమర్థించుకోవడంలో తార్కికశక్తిని ప్రదర్శించడానికి తప్ప, స్వతంత్రంగా పర్యాలోచించే ఏ ప్రయత్నానికి పూనుకోలేదు".

విద్య : సమాజాభ్యుదయానికి ఉపకరించే విద్యావిధానం లేక పోవడం, హిందూ ముస్లిము సంస్కృతులలోగల ప్రాణాంతకమైన దోషం. రెండు మతాల వారూ ప్రాచీనమైన విద్యాపద్ధతినే అనుసరించినారు. కాబట్టే, హిందూముస్లిములు, విద్యావిషయంలో వెనుకపడియుండిరి. పాశ్చాత్యదేశాలలో జరిగిన విజ్ఞాన శాస్త్రాభివృద్ధినిగూర్చి, హిందువులకుగాని, ముస్లిములకుగాని, లేశమాత్రంకూడా తెలియదు. పరిశీలన, ప్రయోగము, విమర్శ, అనే వాటికి సంబంధించిన నూతన పద్ధతులు కూడా వీరికి ఏమాత్రమూ తెలియవు. యూరోపు దేశీయులైన మత ప్రచారకులు పెక్కుమంది అక్బరును, అతని ఆస్థానంలో సందర్శించినారు. వారితో, ఏండ్ల పర్యంతం, మతాన్నిగురించీ, మత ధర్మశాస్త్రాన్ని గురించీ, అక్బర్ వారితో చర్చించినాడు. కాని యూరోపుదేశీయుల తత్త్వశాస్త్ర విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్రాలలో ఏ మాత్రమూ ఆసక్తి చూపకపోవడం, అత్యాశ్చర్య కరమైన విషయం. జైసింగ్ శిబిరంలో,

శివాజీ, రెండు గంటలకాలం, మ్యానుస్సి (Manucci) తో కలిసి, మాట్లాడినాడు. కాని, ఇటలీ దేశస్థుల సంస్కృతి ఎట్టిదో తెలుసుకోవలెననే ఉత్సాహం అతనిలో కలుగలేదు.

ఇండియాను ఆవరించిఉన్న సముద్రాలపై యూరోపుదేశీయులు తమ అధికారాన్ని స్థాపించుకొని, తూర్పు పడమటి సముద్రతీరాలలో, చౌకీలను (Landing stations), వర్తకగారాలను, నిర్మించుకొని ఉండిరి. ఈ విదేశీయుల ఉనికివల్ల, గుజరాత్, కొంకణ్, కేరళ, చోళమండల్, ఒరిస్సా, బెంగాల్ ప్రాంతాలలోని ఇండియాప్రజల పరిజ్ఞానవిషయంలో ఏవిధమైన మార్పూ కలుగలేదు. యూరోపుదేశాల జంతువులు, పక్షులు, అద్దాలు, బొమ్మలు, ద్రాక్షరసాలు, మద్యసారాలు,- మొదలైనవాటిలో రాజులు, రాజాస్థానాలలోని కులీనులు ఆసక్తిని వహించినారేకాని, యూరోపుదేశీయుల సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక వ్యవహారాలలో ఆసక్తిని చూపిన వారెవ్వరూ లేకపోయిరి.

ఇది చాల ఆశ్చర్యకరమైన విషయం. మధ్యయుగాల అంధకారపరిస్థితుల నుండి యూరోపుఖండము బైటపడడానికి పూర్వమే, హిందూదేశము, విజ్ఞానశాస్త్రాలలో ఎంతో పురోగమించి ఉండింది. అంకగణితము, బీజగణితము, రేఖాగణితము, త్రికోణమితి, అత్యల్ప కలనగణితము, (Infenitismal calculus) మొదలుగాగల గణితశాస్త్ర భాగాలలో కూడా, హిందువులు చాలా ముందుకు పోయిఉండిరి. శూన్యము (Zero), అనంతరము (Infinity) అనే అత్యంత భావనాత్మక సంకల్పనలను, ఆధునిక ప్రమాణాలకు సరిపోగే విజ్ఞానశాస్త్రవిధానాలను, వారు, క్రమంగా వృద్ధిపరచుకొని ఉండిరి. ఇతర శాస్త్రాలలో జ్యోతిషశాస్త్రము, వైద్యము, శల్యచికిత్స, ప్రకృతిశాస్త్ర మూలవిషయాలు, వృక్షశాస్త్రము, జంతుశాస్త్రము, మొదలైనవాటిలో కృషిచేసి ఉండిరి. విచారణ, పరిశీలన, ప్రయోగము, అంగవిచ్ఛేదనము, అనే ప్రక్రియలను, కారణకార్య సంబంధాన్ని ఆధారంగాచేసుకొని, నిర్ణయాలను కావించిరి.

ముస్లిములు కూడా విజ్ఞానశాస్త్రాన్ని ఎక్కువగా అభివృద్ధికితెచ్చి ఉండిరి. ఇండియా, గ్రీకు, శాస్త్రాల అరబ్బీ అనువాదాలను అధ్యయనంచేసి, ముస్లిములు నూతనవిషయాలను చేర్చి, విజ్ఞానాన్ని అభివృద్ధికావించిరి. అనేకశాస్త్రాలలో వీరు హిందువులకంటె ఎక్కువ అభ్యుదయాన్ని సాధించినారు. బీజగణితము, రేఖాగణితము, గోళీయత్రికోణమితి (Spectrical trignometry), లఘుగణకం (Logarithams) అనే గణితశాస్త్ర శాఖలలో ముస్లిములు ఎక్కువగా పురోగమించి ఉండిరి. జ్యోతిషశాస్త్రానికి సంబంధించిన సారిణులు (Tables),, గ్రహోన్నతిమాపక వేధయంత్రము (Astrolabe), వలయయంత్రము (Armillory sphere)- ఇత్యాదులను వీరు నిర్మించుకొని ఉండిరి. రసాయనశాస్త్రంలో, సల్ఫ్యూరిక్, నైట్రిక్, ఆమ్లములను, ఆమ్లరాజమును(Aqua regia) సంబంధించిన సంయోజన విధానాన్ని తెలుసుకొని ఉండిరి. లవణములను తయారుచేయడము, ఆంటిమొనీ, ఆర్సెనిక్ పదార్థాలను వాటి సల్ఫైడులనుంచి, వేరుచేయడము, మొదలైన విధానాలను గ్రహించి ఉండిరి. వైద్యశాస్త్రంలోని కొన్నిశాఖలలో కృషిచేసి ఉండిరి. ప్రపంచభూగోళానికి సంబంధించిన విషయజ్ఞానాన్ని ఎక్కువగా సేకరించిఉండిరి. చరిత్ర రచనను విశేషంగా అభివృద్ధికి తెచ్చినవారు ముస్లిములు. వాస్తవంగాచూస్తే యూరోపుదేశీయులకు ప్రథమంగా విజ్ఞానశాస్త్రాన్ని బోధించినవారు ముస్లిములే. యూరోపులోని వివిధదేశాలనుండి వచ్చిన క్రైస్తవ

విద్యార్థులకు, ముస్లిములు తమ విద్యాలయాలలో శిక్షణ ఇచ్చినారు. అరబ్బీగ్రంథాల ల్యాటిన్ భాషా అనువాదాలు, యూరోపులోని విద్యావ్యాప్తికి ఆధారములుగా ఏర్పడినవి.

ముస్లిములు వివిధశాస్త్రాలలో అభివృద్ధికి తెచ్చిన, విజ్ఞానం సర్వస్వమూ, ఈ విధంగా, స్పెయిన్. ఇటలీ, ఫ్రాన్స్, దేశాల క్రైస్తవ విశ్వవిద్యాలయాలలో, అధ్యయనానికి ఉపయుక్తమై, యూరోపుదేశీయుల సంస్కృతి స్వత్వంలో ఐక్యమైపోయింది. కాని, పదహైదో శతాబ్దంనుంచి, యూరోపుదేశాలలో జరుగుతూ వచ్చిన విజ్ఞానాభ్యుదయము నూతన ఆవిష్కారణాలు (discoveries) ఎట్టివి అనే విషయం, పద్ధెనిమిదో శతాబ్దం కడపటి వరకు, భారత దేశీయులకు ఏమాత్రమూ తెలియలేదు. ఈ నూతన విజ్ఞాన విషయంలో శ్రద్ధచూపిన వారు లేరు.

ఇండియాలో విద్యాలయాలు లేనందువల్ల ఈ అశ్రద్ధ జరిగిందని చెప్పడానికి వీలు లేదు. వాస్తవంగా, పాఠశాలలు దేశంలో సమృద్ధిగా ఉండినాయి. బెంగాల్, బీహార్, ప్రాంతాలలోని విద్యా పరిస్థితిని గూర్చిన రిపోర్టులో, (1835-1838), సుమారు నూటయాభై వేల గ్రామాలకు, నూరువేల ప్రాథమిక పాఠశాలలు ఉండినవని, ఆడం (Adam) వ్రాసి ఉన్నాడు. జనాభా లెక్క ప్రకారం, ప్రతి నాలుగు వందల మంది ప్రజలకూ, ఒక పాఠశాల ఉండినదని లెక్కించినాడు. ఉన్నత తరగతి విద్యా విషయంలో, బెంగాలులోని ప్రతి జిల్లాలోను, సరాసరి నూరు పాఠశాలలు ఉండినవి. ప్రాంతం మొత్తంమీద, ఇట్టి ఉన్నత తరగతి పాఠశాలల సంఖ్య ఎనిమిది వందలు. మదరాసు ప్రాంతాలలో రాజులూ, పౌరులూ నిర్వహిస్తూ ఉండిన విద్యాలయాల మొత్తం సంఖ్య, 12,500.

పాఠశాలలలో బోధింపబడుతున్న విద్యయొక్క స్వభావంలోనే దోషమున్నది. అభ్యుదయం లేక పోవడానికి ఇదే నిజమైన కారణం. మతాన్ని ఆధారంగా చేసుకొని, విద్యావిధానాన్ని ఏర్పరచడం, మొదటిదోషం. వాస్తవంగా, రెండు విభిన్న విద్యావిధానాలు దేశంలో స్థిరపడి ఉండినవి. ప్రాంతీయ దేశభాషలు బోధన భాషగా ఏర్పడిన ప్రాథమిక విద్యాదశ, సంస్కృతం బోధన భాషగా ఏర్పడిన ఉన్నత విద్యాదశ,-అనే భాగాలతో, ప్రత్యేకంగా హిందువులకై ఏర్పాటు కావింపబడిన విధానం ఒకటి. ముస్లిములకు, ప్రభుత్వోద్యోగాలను ఆశించే హిందువులకు ఏర్పడిన విద్యావిధానం, రెండవది. ఈ రెండోవర్గపు పాఠశాలలోని బోధన భాష పర్షియన్ భాష.

హిందువుల పాఠశాలలు కూడా, పరస్పర సంసర్గంలేనట్టి రెండు వర్గాలుగా ఏర్పడినవి. ప్రాథమిక విద్యకుమాత్రమే ప్రత్యేకించబడిన పాఠశాలలు ఒక వర్గం. వ్యవసాయానికీ వర్తకవ్యాపారాలకూ సంబంధించిన వృత్తులను అవలంబించదలచుకొన్న విద్యార్థులకు అవశ్యకమైన విద్యను బోధించడం, ఈ పాఠశాలల ఉద్దేశం. కాబట్టి, ఈ పాఠశాలలలోని విద్యార్థులు, జిల్లాలోని అన్నికులాల నుంచీ వచ్చినవారై ఉండడం సహజమైనదే. ఇందుకు ఉదాహరణంగా;- మూర్షిదాబాద్ జిల్లాలోని (నగరంతోసహా) ప్రాథమిక పాఠశాలలలోని విద్యార్థులు, యాభైకుల, ఉపకులాలకు చెందినవారు. 993 మంది విద్యార్థులలో, 181 మంది బ్రాహ్మణులు, 129 మంది కాయస్థులు, తక్కినవారు ఇతరకులాలవారు. వీరిలో, 82 మంది ముస్లిము విద్యార్థులు.

దక్షిణబీహారు ప్రాంతంలోని, 2918 మంది విద్యార్థులలో, 48 వేర్వేరు కులాలవారు

చేరిఉండిరి. గంధవణిక, మాగధ, తేలి కులాల విద్యార్థుల మొత్తంసంఖ్య, అన్నిటిలోను పెద్దది. బ్రాహ్మణులు, కాయస్థులు కలిసినసంఖ్య తరువాతిది. రజపుత్రులు, కహార్లు, ఇతరులు కలిసినసంఖ్య మూడవది. ముస్లిము విద్యార్థుల మొత్తంసంఖ్య 172.

ఈ పాఠశాలలలోని ఉపాధ్యాయులు, చాల భాగం వ్రాయస కులాలవు (Writer class) చెందినవారు. మూర్షిదాబాదులో గల 67 మంది ఉపాధ్యాయులలో, 39 మంది కాయస్థులు, 14 మంది బ్రాహ్మణులు, తక్కిన 14 మంది ఇతర కులాలవారు. దక్షిణ బీహారు ప్రాంతంలోని పాఠశాలల సంఖ్య 285; ఉపాధ్యాయుల మొత్తం సంఖ్య కూడా 285. వీరిలో 273 మంది కాయస్థ కులంవారు; తక్కిన ఏడు మందీ ఇతర కులాలవారు. బ్రాహ్మణ ఉపాధ్యాయులులేరు.

చదవడము, వ్రాయడము, సామాన్యగణితము, అనే పాఠ్య విషయాలతో కూడిన ఈ ప్రాథమిక విద్యాభ్యాసం పూర్తిచేయడానికి ఐదు మొదలు, పదిసంవత్సరాలకాలం పట్టేది. వ్రాతనేర్చుకోడానికే చాలకాలం తీసుకొనేది. మొదట ఇసుకలో దిద్దడం ప్రారంభించి, తర్వాత తాటాకులపై గంటంతో వ్రాయడం నేర్చుకునేవారు. ఆ తర్వాత అరటి ఆకులపై వ్రాయడం కొంతకాలం అభ్యసించి, కట్టకడపట కాగితంపై వ్రాయడం అలవరచుకొనేవారు. జాబులు వ్రాయడము, వర్తకానికి సంబంధించిన పత్రవ్యవహారం జరపడము, అర్జీలు, అనుదాన పత్రాలు, గుత్తచీటీలు, మొదలైన వాటిని వ్రాయడము, నేర్చుకొనేవారు. వ్యవసాయానికి, లేక, వర్తకానికి సంబంధించిన జమ ఖర్చుల లెక్కలను వ్రాయడంలో సామర్థ్యాన్ని సంపాదించడం, సామాన్య గణితశాస్త్ర ప్రయోజనము. ఎక్కాలు, గుణింతాలు, తూకాలు, కొలతలు, భిన్నాంకాలు, మొదలైన వాటికి సంబంధించిన సారిణీలను, (Tables), కంఠతా పెట్టడానికి ప్రాధాన్యం ఏర్పడింది. దేశభాషలలోని రామాయణము వంటి పుస్తకాలవ మాత్రమే చదవడం పరిమితమై ఉండేది.

ఆనాటి విద్యాప్రణాళిక కేవలం ప్రయోజనాత్మకమై అత్యంతమూ సంకుచితమై ఉండింది. మానసిక వికాసానికి తోడ్పడే విద్యకాదది; సంప్రదాయ శృంఖలాల నుంచి విముక్తి కలిగించి, భావస్వాతంత్ర్యాన్ని కలిగించేది కూడా కాదు. ఈ విద్యావిధానాన్ని, ఆడమ్, ఈ విధంగా విమర్శించినాడు;- విద్యాభ్యాస ప్రక్రియలో చేయి, కన్ను, చెవి, అనే మూడు ఇంద్రియాల ప్రవృత్తికీ అవకాశం ఏర్పడింది; జ్ఞాపకశక్తిని వృద్ధిచేయడానికి ఎక్కువ ప్రయత్నం చేస్తారు. విద్యార్థుల నిర్ణయశక్తి విషయంలో పూర్తిగా అశ్రద్ధచూపలేదు. తప్పు మార్గంలోనే ఐనప్పటికీ, మతభావనను పెంపొందించడానికి, విద్యార్థులబాల్యదశ నుంచీ కూడా దృఢప్రయత్నం జరుగుతూ ఉంది. కాని, పిల్లల మానసికవికారాలను, మనోరాగాలను గమనించనందువల్ల, అవి స్వేచ్ఛగా, ఇష్టమువచ్చిన త్రోవలో పెరిగిపోవడం జరుగుతూఉంది. అవి వికృతంగా పెరగకుండా, సరిదిద్ది, వాటిని సక్రమమార్గంలో, చక్కగా పెరిగేటట్లుచేసే ప్రయత్నం జరగడంలేదు. వాటిని ప్రయోజనాత్మక మార్గాల్లో నిర్దేశించే ప్రయత్నం కూడా జరగడంలేదు." ఇది అతని విమర్శ.

ఉన్నత పాఠశాలలలోని పరిస్థితులు ఇంతకంటె అధమమైనట్టివి. ఈ పాఠశాలలలోని విద్యార్థులు, ఉపాధ్యాయులు కూడా, చాలవరకు బ్రాహ్మణులే. కొన్ని సహాయక పాఠ్యవిషయాలు తప్ప, విద్యాప్రణాళిక సర్వస్వమూ, మతధర్మశాస్త్ర సంబంధమైనది కావడం, ఇందువ

కారణం. ముర్షీదాబాదులో ఉన్న ఇరవైనాలుగు ఉన్నతపాఠశాలలలోనూ, ఇరవైనలుగురు ఉపాధ్యాయులు, నూటయాభైమంది విద్యార్థులుఉండిరి. ఉపాధ్యాయులందరూ బ్రాహ్మణులే; ఒక్క కాయస్థ విద్యార్థితప్ప, తక్కినవారందరూ బ్రాహ్మణవిద్యార్థులే. ఇది ఈ విషయంలో నిదర్శనం. దక్షిణబీహారులోని ఇరవైఏడు పాఠశాలల ఉపాధ్యాయులందరూ (27 మంది) బ్రాహ్మణులే. వీరిలోని 437 మంది విద్యార్థులలో, బ్రాహ్మణేతర విద్యార్థి ఒక్కడు కూడా లేడు.

బెంగాలు బీహారు ప్రాంతాలలో, మూడు ముఖ్య విద్యాప్రణాళికలు అనుసరించబడి నవి;-(1)వ్యాకరణము, సాధారణ సారస్వతం. (2) న్యాయశాస్త్రం. (3) తర్కము. ఇవికాక దర్శనము, వేదాంతము అనే తత్త్వ శాస్త్రాలను, పురాణాలను, తంత్ర శాస్త్రాన్ని, జ్యోతిష శాస్త్ర వైద్యశాస్త్రాలను, బోధించే పాఠశాలలు కూడా కొన్ని ఉండినవి. "లక్షమంది బ్రాహ్మణులలో వేయిమంది సంస్కృత వ్యాకరణాన్ని అధ్యసించేవారని, వీరిలో నాలుగైదు వందలమంది, సంస్కృత కావ్యాలలోని కొన్ని భాగములను చదివే వారని, సుమారు యాభై మంది అలంకార శాస్త్రాన్ని చదివేవారని, అంచనావేసినారు. ఈ వేయి మందిలోను, నాలుగు వందలమంది కొన్ని స్మృతి గ్రంథాలను చదివి ఉండవచ్చు. కాని, తంత్ర శాస్త్రాలను చదివిన వారు వీరిలో పదిమంది కంటె ఎక్కువలేరు. మూడువందలమంది న్యాయశాస్త్రాన్ని చదివి ఉండవచ్చు. కాని, మీమాంస, సాంఖ్య, వేదాంత, పతంజలి, వైశేషిక, శాస్త్రాలను, వేదాలను చదివినవారు ఐదారుగురు కంటె ఎక్కువలేరు. ఈ వేయి మంది బ్రాహ్మణ విద్యాంసులలోను, జ్యోతిష శాస్త్రాన్ని అధ్యయనం చేసినవారు పదిమంది కంటె ఎక్కువ ఉండరు; ఇంకొక పది మందికి ఈ శాస్త్రంతో అల్పపరిచయం ఉండవచ్చు. ఈ వేయిమందిలోను, యాభైమంది మాత్రమే భాగవత పురాణాన్ని, కొన్ని ఇతర పురాణాలను, చదువ గలిగి ఉండిరి. [ఈ వివరాలనుబట్టి, బ్రాహ్మణులలో పదోవంతు మాత్రమే సంస్కృత విద్యను అభ్యసించిరని తెలుస్తుంది.]

ఈ వివిధ విషయాల అధ్యయనం, రెండు, పండ్రెండు, ఇరవై రెండు సంవత్సరాల కాలం కూడా జరిగేది. పాఠశాలలో, ఒక ఉపాధ్యాయుడు, కొంతమంది విద్యార్థుల అధ్యయ నాన్ని నిర్వహించేవాడు. సరాసరి, ఒక ఉపాధ్యాయుడు ఆరుమంది విద్యార్థులకు ఆయా శాస్త్రాలలో విద్యను బోధించేవాడు. విద్యాబోధన, ఉపాధ్యాయుని ఇంటిలో జరిగేది. ప్రాతః కాలంలో ఆరంభమైన నియతక్రమం, మధ్యాహ్న విరామకాలం మినహా, సూర్యాస్తమయ కాలం వరకూ జరిగేది.

అధ్యయనం చేయవలసిన అన్ని విషయాలకూ, సంస్కృత భాషాధ్యయనం మూల మైనట్టిది. సాధారణ సాహిత్య అధ్యయన విషయంలో, వ్యాకరణము, అలంకారశాస్త్రము, అమరకోశము, అనే విషయాలు మిక్కిలి ప్రధానమైనవి. సాహిత్యాధ్యయనం, మొదట, భట్టికావ్యంతో ప్రారంభించేవారు; తర్వాత, రఘువంశకావ్యాన్ని, ఇతర కావ్యాలనూ, తీసు కొనేవారు.

హిందూన్యాయశాస్త్రాన్ని అధ్యయనంచేసే విద్యార్థులు, హిందూధర్మశాస్త్రాలపైనా, మతవిధులపైనా, అధికారం సంపాదించుకోడానికి, ఎనిమిది మొదలు ఇరవై రెండు సంవత్స రాలవరకూ కష్టపడేవారు. దాయభాగము, దాయతత్త్వము, అనే గ్రంథాలు బెంగాలుప్రాంతంలో

ప్రాధాన్యం వహించినది. ఇతర ప్రాంతాలలో, మనుస్మృతి, మితాక్షర గ్రంథాలు ప్రాధాన్యం వహించినందువల్ల, వాటిని పాఠశాలలలో అభ్యసించేవారు.

తర్కశాస్త్రాధ్యయనానికి, పన్నెండు మొదలు ఇరవై రెండేండ్లదాకా పట్టేది. పరమాణువు, గుణాలు, పదార్థాలు ఇత్యాదుల లక్షణాల మొదలు, ఈశ్వర అస్తిత్వాన్ని గూర్చిన తర్క వాక్యాలు, హేత్వానుమానాలు, అనుమతి, నిగమనము తర్కాభాసాలు, సాధనసంపన్నం సర్వవిషయాలూ, ఈ అధ్యయన విషయంలో చేరి ఉండినవి. వైద్యశాస్త్రము, జ్యోతిష శాస్త్రము, మాత్రమే బోధన ప్రణాళికలో చేరిన విజ్ఞానశాస్త్రాలు. ఈ విషయాలలోని బోధన మంతా, ప్రాచీనగ్రంథాలపైనా, వాటి వ్యాఖ్యానాలపైనా ఆధారపడింది.

ప్రత్యేకమైన ఒక్క శాస్త్రాన్ని, సూక్ష్మాతి సూక్ష్మములైన వివరాలతో సహా, చాల దీర్ఘకాలం అధ్యయనం చేయడంవల్ల, బుద్ధికి నిశితత్వము, సూక్ష్మపరిశీలన సామర్థ్యము సిద్ధించడం వాస్తవమే; కాని, అత్యంతమైన సంకుచిత దృష్టి ఏర్పడుతుంది. వ్యాకరణ, ధర్మ శాస్త్ర తర్కశాస్త్రాల నియమబద్ధమైన శిక్షణ, కేవలం బాహ్య సాంప్రదాయికమైనది, శబ్దాత్మక మైనది మాత్రమే. ప్రత్యక్షమైన వాస్తవ విషయాలనుంచి దృష్టిని మరల్చే ప్రవృత్తిగలది ఈ శాస్త్ర శిక్షణ. "ఈ శాస్త్రాల అధ్యయనంవల్ల, పండితులు. "అగాధమైన వ్యాకరణశాస్త్రంలోని సూక్ష్మాతి సూక్ష్మ విషయాలలో నిష్ణాతులౌతారు; తమ జాతీయ ధర్మశాస్త్ర సారస్వత శాఖల వైవిధ్యంతోను, వాటి అన్వయంతోను, మంచి పరిచయం సంపాదిస్తారు; తాత్త్విక, నైయాయిక శాస్త్రాలకు సంబంధించిన అతిగహనములైన చర్చలలో, ఆసక్తి వహిస్తారు. కాని, తమ మనస్సును మాత్రం సుప్తావస్థలోనే ఉంచుతారు. ప్రాచీన పురాణగాథలను, తాత్త్విక చర్చలను, విడదీస్తూ, కూరుస్తూ, వివిధ రూపాలను వాటికి కల్పిస్తూ, ఒక విధమైన స్వప్న జీవితాన్ని సాగిస్తారు." అని, ఆడమ్, ఈ సంస్కృత విద్యావిధానాన్ని వర్ణించినాడు.

ఇస్లాము విద్యావిధానం కూడా ఇంతకంటె మెరుగైనది కాదు. ఉన్నత వర్గాలవారికి మాత్రమే ఉద్దిష్టమైనది ఈ విద్య; ముస్లిము ప్రజానీకానికి, ఏ విధమైన విద్యాబోధనా జరుగ లేదు. దేశభాషలను ఆధారంగా చేసుకొని హిందువులు ఏర్పరచిన ప్రాథమిక విద్యాపద్ధతి వంటిది ముస్లిములలో లేకపోయింది; ప్రాథమిక పాఠశాలలే ఏర్పడలేదు. ముస్లిముల పాఠ శాలలన్నిటిలోనూ, పర్షియనే బోధనభాష; ఉర్దూకాని, ఇతర విదేశ భాషకాని, ఉపయుక్తం కాలేదు. కాబట్టి, హిందూ ప్రజానీకానికంటె ఎక్కువ అజ్ఞానంలో ముస్లిము ప్రజానీకం ఉండింది.

ముస్లిముల విద్యాబోధనపద్ధతి మూడువిధములైనది. అర్థాన్నిగ్రహించే ప్రయత్నమే లేక, ఖురానులోని పద్యాలను కంఠస్థంచేయించడం మొదటిపద్ధతి. అత్యల్ప విద్యావంతులైన ముల్లాలు (Mullas) ఈ విషయంలో పిల్లలకు బోధకులుగా ఏర్పడిఉండిరి. "ప్రహసన ప్రదర్శన యొక్క సమగ్రస్వరూపం" అని వీరి బోధనపద్ధతికి, ఆడమ్స్ లక్షణమేర్పరచి నాడు. అర్థరహితము, ప్రయోజనశూన్యము అయినది ఈ బోధన.

పర్షియన్ పాఠశాలలో బోధింపబడేది, రెండవ విద్యాపద్ధతి. సారస్వతము, వ్యాకర ణము, గణనము, అనే విషయాలను బోధించడమే ఈ పాఠశాలల ప్రధానోద్దేశము. కొంత సామాన్యగణితం కూడా, వీటితో, అప్రధానంగా చేర్చేవారు. ఫిర్దౌసీ, సాదీ, హాఫీజ్, ఉర్ఫీ, జమీ, ఖకానీ, మొదలైన పద్యకావ్యాలు; గులిస్తాన్, వాకైనియత్‌ఖాన్‌అలీ, బహర్-

ఈ-దానిష్, మొదలైన గద్యరచనలు; అబుల్‌ఫజల్, అలంగీర్, మథోరాంబ్రాహ్మణ్, ఇత్యాదుల పత్రరచనాశిల్పము; హదీకత్-ఉల్-బలఘాల్, దస్తూర్-ఉల్-ముబ్తాదీ, మొదలైన వ్యాకరణ అలంకారగ్రంథాలు, ఈ పాఠశాలలో బోధించేవారు. సామాన్యగణిత, రేఖాగణిత సూత్రాలు కూడా ఈ ప్రణాళికతోచేరి ఉండినవి.

పర్షియనుభాష నేర్చుకొన్న తర్వాత, పాండిత్యానికి మెరుగుపెట్టే అరబ్బీభాషను చదివేవారు. శబ్దనిష్పత్తి, పదప్రత్యయస్వరూపము, వాక్యస్వరూపము, ఛందస్సు, ఇత్యాదులతో కూడిన అరబ్బీ భాషావ్యాకరణానికి సంబంధించిన సమగ్రశిక్షణతో, అరబ్బీ భాషాధ్యయనాన్ని ప్రారంభించేవారు. భాషలో మంచి అధికారం సంపాదించిన తర్వాత, ఉన్నత విషయాల అధ్యయనానికి పూనుకొనేవారు. ఉన్నత విద్యాప్రణాళిక రెండువర్గాలుగా విభక్తమయింది; మన్‌కులాత్, అనే సాంప్రదాయికవిద్య, మకులాత్, అనే తర్కసమ్మతమైన విద్య,- అనేవి ఈ వర్గాలు. అఖ్‌బర్, హదీత్‌లు (చరిత్ర, సంప్రదాయము), తఫ్‌సీర్ (సాధనలు), అదాబ్ (సారస్వతం), ఫిఖ్ (న్యాయశాస్త్రం),- అనే విషయాలు మొదటివర్గంగా ఏర్పడినవి. తర్కము (మంతిక్), తత్త్వశాస్త్రము (హిక్‌మత్) వైద్యము (తిబ్). గణిత శాస్త్ర, జ్యోతిషశాస్త్రాలు (రియాజీ, హైయత్), అనే విషయాలతో ఏర్పడింది రెండో వర్గం.

భాషా సారస్వతాలు, శాస్త్రాధ్యయనానికి పునాదులు. కాబట్టి, వ్యాకరణానికి (సర్ఫ్-ఓ-నహవ్), నియమితములైన పద్య గద్యకావ్యాలకూ అత్యంత ప్రాధాన్యాన్ని ఇచ్చినారు. హదీత్‌కు సంబంధించిన ఆరుసంకలన గ్రంథాల నుంచి ఏరుకొన్న భాగాలు, ముస్లిం న్యాయశాస్త్రము, (ఫిఖ్), ముస్లిం వ్యవహార ధర్మశాస్త్రము (ఉసుల్-ఈ-ఫిఖ్)-అనే విషయాలను ఎక్కువగా చదివేవారు. అర్థ నిరూపణకు, జలాలేయిన్, బైదావీ, అనే భాష్య గ్రంథాలలోని భాగాలు సరిపోయేవి. అరిస్టోటల్‌యొక్క ప్రకరణ గ్రంథాలు, వీరి తర్కశాస్త్రానికి ఆధారములైనవి. గ్రీకుల అభిప్రాయాలు, ముస్లిముల అభిప్రాయాలు మేళవించి, వీరి తత్త్వశాస్త్రంగా సిద్ధించింది. హిందూ, గ్రీకు శాస్త్రాల ఆధారంతో, వీరి వైద్య, గణిత, జ్యోతిషశాస్త్రాలు ఏర్పడినవి. కాని, వైద్యము, జ్యోతిషశాస్త్రము, ఇతరతర్క బద్ధములైన విజ్ఞానశాస్త్రాలు,- మొదలైన విషయాల బోధన, కేవలం, పుస్తకాలపై మాత్రమే ఆధారపడినట్టిది. ప్రయోగశాలలు, వేధశాలలు (Observatories) ఆ కాలంలోలేవు; కాబట్టి విజ్ఞానశాస్త్రాధ్యయనంలో ప్రయోగాత్మక పద్ధతిని ఉపయోగించడం వీలుకాలేదు. మతధర్మశాస్త్రము, న్యాయశాస్త్రము - ఈ రెండు విషయాలకే, ఆకాలంలో ప్రాధాన్యం ఎక్కువ. ప్రాచీన కాలపు మహనీయ బోధకుల అధికారాన్ని, నిర్వివాదమైన గౌరవంతో అంగీకరించేవారు.

మధ్యయుగీన సంప్రదాయాలలో పూర్తిగా మునిగి ఉండినది ముస్లిముల భావ ప్రపంచం. కాబట్టి పాశ్చాత్యనాగరకతయొక్క ఘర్షణను ఎదుర్కోడానికి, ముస్లిముల భావ ప్రవృత్తి సిద్ధంగాలేదు. ముస్లిము విద్యావిధానాన్ని, దాక్షిణ్య రహితంగా ఖండించి విమర్శించినవాడు, ఔరంగజేబు కావడం, అత్యాశ్చర్యకరమైన సంఘటన. బాల్యంలో ఇతని అధ్యాపకుడై ఉండిన, ముల్లాసలే, ఎక్కువ ఆదరణను ఆశించి, ఔరంగజేబును పీడిస్తూ ఉండినాడు. అధ్యాపకుడుగా అతడుచేసిన ఉపకారమెట్టిదో ఔరంగజేబు, నిర్దాక్షిణ్యంగా అతనికి వివరించి, బుద్ధి చెప్పుతాడు. ఈ సంభాషణను, బెర్నియర్, సమగ్రంగా లిఖించి ఉంచినాడు.

ఔరంగజేబు, ఈ విధంగా ముల్లానకేను ప్రశ్నిస్తాడు;- "నీవు చెప్పిన పాఠంవల్ల నాకు లభించిన జ్ఞానమెంత ? ప్రపంచములోని ప్రతిజాతియొక్క విశిష్టలక్షణాలనూ నేను గ్రహించేటట్లు చేయడం, నాకు గురువైన వానియొక్క కర్తవ్యంకాదా ? ఆయా దేశాలకు ఉన్న, మూలబల సూలసాధనాలూ; వాటి యుద్ధనిర్వహణ విధానాలూ; వాటి ప్రవర్తనలు, మతాలు, ప్రభుత్వవిధానాలూ, దేశాలు ఉద్దేశించిన ముఖ్యప్రయోజనాలు, ఇత్యాదులను నాకు బోధించవద్దా ? ఆయా రాజ్యాల సృష్టిక్రమాభివృద్ధులను, వాటి క్షీణపతనాలను, అట్టి గొప్ప పరివర్తనాలకు, మహావిప్లవాలకు హేతువులైన సంఘటనలు, ఆపదలు, తప్పులు,- మొదలైన విషయాలను గ్రహించడానికి తగిన ప్రపంచరాజ్యాల చరిత్రను నాచే పఠింపచేయడం, నీ బాధ్యతకాదా! నావేశంచుట్టూ ఉన్నదేశాల భాషాపరిజ్ఞానం, రాజుకాబోయే వానికి ఎంతో ఆవశ్యకమై ఉండగా, అరబ్బీభాషను చదవడము, వ్రాయడము మాత్రమే నీవు నాకునేర్పినావు. రాజకుమారుడైన వానికి ఆవశ్యకములైన ముఖ్యవిషయాలు ఎన్నో, విద్యాప్రణాళికలో చేర్చవలసి ఉండగా, వ్యాకరణజ్ఞానము, న్యాయశాస్త్ర నిష్ణాతులైన వానికి అవసరమైన జ్ఞానము, మాత్రమే, నాకు చాలినదని, నీవు నిశ్చయించుకొని ప్రవర్తించలేదా ? భగవత్స్వరూప, న్యాయ శాస్త్ర విజ్ఞానశాస్త్రాలలోని జ్ఞానసంపాదన, ఈరెండూ కేవలం ఒక్క అరబ్బీభాష మూలంగానే సాధ్యమా ? వ్యర్థములు, అవివేకములు, ఐన ప్రమేయాలతో, సమస్యలతో, సంవత్సరాల తరబడి నామెదడును కష్టపెట్టి, విసిగించి ఉంచడం, నాకు బాగా జ్ఞప్తిలో ఉంది. ఆ ప్రమేయాలను, సమస్యలను సాధించినందువల్ల, మనస్సునకలిగే తృప్తి ఏదీలేదు; అవి జీవిత వ్యవహారాలకు ఏ మాత్రము సంబంధించినవికావు. నీ వద్ద చదువుముగించే కాలానికి, నేను గర్వించ తగినవిజ్ఞానం ఏ మాత్రమూ నాకు లభ్యంకాలేదు. మహాబుద్ధిమంతుడు, శక్తిమంతుడు ఐన యువకుని కూడా నిరుత్సాహపరచి, దిగ్భ్రమచెందించి, భీతిపుట్టించవానివైన కఠినంబి నట్టి అస్పష్టములు, అపరిచితములు, వికారములు ఐన, పారిభాషిక పదప్రయోగం మాత్రమే నాకు మిగిలింది. ఏతత్త్వశాస్త్రం మనస్సును హేతుబద్ధంకావిస్తుందో, నిష్కృష్ట మైన నిరూపణలతోనే తప్ప తృప్తిచెందని విధంగా, మనస్సును ఏ శాస్త్రం శిక్షిస్తుందో, అదే నిజమైన శాస్త్రం. అట్టి శాస్త్రాన్ని నీవు నాకు బోధించలేదు. మానవస్వభావాన్ని సరిఐన జ్ఞానాన్ని నాకు కలిగించలేదు. ప్రాథమిక సూత్రాలను ఆధారంగా చేసుకొని సమస్యలను పరిశీలించే పద్ధతితో నాకు పరిచయం కలిగించలేదు. విశ్వమునుగూర్చిన ఉదాత్తమైనభావాన్ని, విశ్వముయొక్క వివిధభాగాల క్రమప్రవృత్తుల పరిజ్ఞానాన్ని నేను ఎంతమాత్రమూ నాకు కలిగించలేదు. ఈ విధమైన వాస్తవజ్ఞానం నాకు నీవు కలిగించియుంటే, అలెగ్జాండరు అరిస్టోటలుకు, ఋణపడిన దానికంటె ఎక్కువగా, నేను నీకు ఋణపడి ఉండేవాడిని".

బనారసులోని పండితులు బోధిస్తూ ఉండిన విద్యా స్వభావాన్ని కూడా, చాల స్పష్టంగానే, బెర్నియర్, వివరించియున్నాడు. ఇందియాకు ఏథెన్సు నగరం వంటిదని, ప్రసిద్ధి చెందిన, ఈ విద్యాకేంద్రములోని బోధన విధానం, గ్రీసులోని విద్యావిధానాన్నే పోలినది. గురువుల ఇండ్లలోనూ, నగర పరిసరాలలోని తోటలలోనూ, విద్యాబోధన జరిగేది. ప్రతి గురువుద్దా, నలుగురు మొదలు పదహైదుమంది దాకా, విద్యార్థులు ఉండేవారు. గురువుతోనే నివసిస్తూ, పదిపండ్రెండు సంవత్సరాలు విద్యాభ్యాసంగం చేసేవారు. కేవలం అధ్యయనంతో ఏర్పడిన, ఆ, వాతావరణంలో విద్యార్థులు, ఆహార వ్యవహారాలలో మిత నియ

నాన్ని గడిపేవారు.

సంస్కృతము, పురాణాలు, షడ్దర్శనాలు, వైద్యశాస్త్రము, జ్యోతిషశాస్త్రము, భూగోళశాస్త్రము, విద్యాప్రణాళికలో చేరినవి. వైద్యశాస్త్రాన్ని గురించి, బెర్నియర్, ఈ విధంగా విమర్శించినాడు. రోగ చికిత్సకు సంబంధించిన పద్ధతులు ప్రయోజనకారులేకాని, శారీరావయవ రచనా విజ్ఞానం, వైద్యులకు ఏ మాత్రమూలేదు. "మానవ దేహాన్నికాని, జంతువుల దేహాలను కాని, వారు ఎన్నడూ కోసి పరీక్షించి ఉండలేదు." జ్యోతిషశాస్త్ర విషయంలో, సూర్యచంద్ర గ్రహణకాలాలను నిష్కృష్టంగా నిశ్చయించడానికి సమర్థములైన గణిత సారిణీలు సిద్ధంగా ఉండినవి. కాని, గ్రహణాలను గూర్చినవారి సిద్ధాంతాలు హాస్యాస్పదములు. అట్లే, చంద్రగ్రహానికి భూమికి మధ్యగల దూరము విషయంలోను, చంద్రునికాంతి విషయంలోను, వారికి గల అభిప్రాయాలు, అసంబద్ధములైనవి. మరిన్ని, భూగోళశాస్త్ర విషయంలో,-భూమి త్రిభుజాకారంగానూ, సమతలంగానూ విస్తరించి ఉన్నదనీ, అది ఏడు ఖండాలుగా విభక్తమై ఉన్నదనీ, ఒక్కొక్క ఖండమూ, ఒక్కొక విశిష్టమైన సముద్రంతో ఆవరింపబడి ఉన్నదనీ, ఆ సముద్రాలు పాలు, చక్కెర, వెన్న, తేనె, ఇత్యాదులలో ఏర్పడినవనీ, వీరు అభిప్రాయపడి యుండిరి.

ఈ పిచ్చి ఊహలకు వాస్తవ విషయాలతో సంబంధమేలేదు. ప్రకృతితో ప్రత్యక్ష పరిచయం కల్పించుకొని, ప్రకృతి శక్తులపై అధికారాన్ని సంపాదించుకొని ఉండిన పాశ్చాత్యులతో, ఇట్టి పిచ్చి ఊహలు కలవారు పోటీచేసి నిలువడం సాధ్యంకాని ప్రయత్నం.

*కళలు, వాస్తు శిల్పము, సారస్వతము :* పద్దెనిమిదో శతాబ్దపు కళా సారస్వతాలలో అభివ్యక్తమైన భావాలను పరిశీలించడంవల్ల, ఆకాలపు భారతీయుల మనోభావాలను గ్రహించవచ్చు. భారత జాతీయ ఆత్మ, ఏదో చెప్పరాని అస్వస్థతకు లోనైనదని, నీతిని, బుద్ధిని నశింపచేస్తున్న ఉపద్రవం, ఏదో, జాతీయశక్తిని, సత్త్వాన్ని, పీల్చివేస్తున్నదనడానికి, ఆ కాలపు కళాసారస్వతాలు ప్రత్యక్ష సాక్ష్యములై ఉన్నవి. జాతిలో అంతస్థమై ఉన్న నైతిక మానసిక సత్త్వం, ఒక్కసారిగా క్షీణించిపోయినట్లు గోచరిస్తుంది. కాని కార్య రూపంలో ఉన్న రాజకీయాలలోను, ఆ శతాబ్దపు నాయక వ్యక్తుల ప్రవృత్తిలోనూ, ఈ శక్తి వ్యక్తమవుతుంది. జాతిని పట్టుకొన్న ఈ అస్వస్థతను ఔరంగజేబు గుర్తించి, సరిదిద్దడానికి ప్రయత్నించినాడు ; కాని, రోగంకంటె, చికిత్సా విధానమే ఎక్కువ వినాశకారిగా పరిణమించింది.

పరిస్థితులు క్షీణస్థితికి వచ్చినవనడానికి, కళలు, అందునూ ముఖ్యంగా, వాస్తుశిల్పం, బాహాటమైన ప్రత్యక్ష నిదర్శనాలు. "ఔరంగజేబు అలంగీర్ యొక్క దుఃఖభరితమైన దీర్ఘకాలపరిపాలన, కళలు, వాస్తుశిల్పము, క్షీణించిపోవడానికి నిదర్శనమయింది". అని విన్‌సెంట్‌స్మిత్, చెప్పిఉన్నాడు. కళలకు ప్రభుత్వంతో సన్నిహిత సంబంధం ఏర్పడడం, కళలు నశించిపోవడానికి ఒక కారణం. కళలకు ముఖ్యపోషకుడైనవాడు చక్రవర్తి. కాబట్టి, కళాభంగిమలను నిర్ణయించడంలో, అతని అభిరుచులు, మనఃప్రవృత్తులు, ఆదర్శాలు, ప్రబల అంశములైనవి.

సార్వత్రికమైన శాంతి సామరస్యాలను గూర్చి కలలుగన్న భావనాజీవి అక్బర్. 'ఫతేపూర్ సిక్రీ' అనే "అద్భుతనగరంగా" అతని స్వప్నం ప్రత్యక్షస్వరూపాన్నికైకొన్నది.

"మహాప్రభువైన చక్రవర్తి, అత్యుత్కృష్టములైన నగరాల నిర్మాణానికి పథకం వేస్తాడు. అతని [మనోహృదయాల] భావభావనలను శిలలతోను, మట్టితోను సుందరరూపాలుగా కల్పిస్తాడు". అని అబుల్ ఫజల్ వ్రాశాడు. స్వప్నం క్షణికమైనది అనడానికి, ఫతేపూర్ సిక్రీని వదలి పెట్టిపోవడం, సంకేతం.

స్త్రీ సౌకుమార్యం కల భోగనిరతుడు, ఐహికవిషయలంపటుడు, జహంగీర్. అతని రసజ్ఞతా, సౌందర్యాభిరుచులు ఆస్థానచిత్రకారచయితలకు ఉత్తేజకమైనవి. ఆ యుగపు అత్యుత్తమ కళాకారులతో పోటీచేయగల కళాకారులు వీరు. అలంకరణ సంపదవిషయంలోను, సున్నితములైన ఆకారరేఖల మార్దవవిషయంలోను, ఇతనిరాణి నూర్‌జహాన్ నిర్మించవేసిన, 'ఇతిమద్-ఉద్-దౌలా' అనే శోభాయమానమైన సమాధిభవనం [Mausoleum = రౌజా] అతని ఆస్థాన అభిరుచులకు అత్యుత్తమ నిదర్శనం.

వైభవంపట్ల అనురక్తికలవాడు, షాజహాన్. అతని ప్రణయగాథామూలమైన భావగీతం, 'తాజ్‌మహల్,'గా, అత్యుత్తమ వ్యక్తస్వరూపాన్ని దాల్చింది; ప్రేమతత్వానికి శాశ్వతమైన స్మారకమందిరం, అది.

షాజహానును చక్రవర్తిపదవినుంచి తొలగించడం, ఒకయుగం అంతమైనదనడానికి గుర్తు. దయాదాక్షిణ్యరహితుడైన, సంధానశాలియైన, మతోన్మాది, ఔరంగజేబు. అతని మతాభినివేశము అనే, గడ్డకట్టుకొనిపోయే చలిలో, కళల జన్మస్థానాలు మాడిపోయినవి. 1769లో, ఔరంగాబాదులో నిర్మితమైన, రాబియాదౌరాని సమాధిని గురించి, పెర్సీబ్రౌన్, ఈ విధంగా వ్రాశాడు. "మొగలులకాలపు శిల్పులను ఉత్తేజితమొనర్చిన మానవతత్వ, ఆధ్యాత్మిక తత్వాల సమ్మేళనం, దీనిలో లోపించింది." లాహోర్‌లోని బాదషాహీమసీదులో వాస్తుశిల్ప స్వభావానికి సారభూతమైన అంశమే, లేకపోయినది; అంతస్సారము ఎండిపోయి ఉంది; వాస్తుశిల్పకళ, ఆత్మరహితమై, బిగుసుకొనిపోతూ ఉంది." అని అతను వ్రాశాడు.

ఔరంగజేబు తర్వాత, మొగల్ సార్వభౌములు స్మారక భవనాలను నిర్మించడం ఆపివేసిరి. ప్రాంతీయ పరిపాలకులు ఈ కార్యానికి పూనుకొన్నారు. వీరిలో ప్రధానులైనవారు ఔధ్‌నవాబులు. కాని, వీరు నిర్మించిన భవనాలను గురించి, విన్సెంట్ స్మిత్, ఈ విధమైన విమర్శక నిర్ణయాన్ని వ్యక్తంచేసి ఉన్నాడు. "పర్షియన్ సంప్రదాయ రీతిని అనుసరించి, ఔరంగజేబు కాలంలో నిర్మితములైన భవనాలు కేవలం క్షీణదశకు పోతున్న శిథిల ఉదాహరణాలు మాత్రమే. కాబట్టి, విస్తృత పరిశీలనకు, ఏమంతగా అర్హమైనవికావు. హుమాయూన్ సమాధి భవనానికి తగుమాత్రం నమూనాగా నిర్మించబడిన, సఫ్దర్‌జంగ్ సమాధి [ఢిల్లీకి సమీపంలో] యొక్క కళాసౌందర్యం, అంతర్భాగంలో గచ్చు అలంకరణాల [illegible] పోయింది. లక్నోలోని నవాబ్ వజీరుల నికృష్ట నిర్మాణాలు, [illegible] కరములైన వస్తువులు. "బాహ్యాడంబర అనుచిత అలంకారాలతో నిండిన" [illegible] లక్నోలోని పెద్ద ఇమాంబారాకు లక్షణం కల్పించినాడు, పెర్సీబ్రౌన్. "దీని నిర్మాణ విధానంలో ఆధ్యాత్మిక విలువలేవు." అని అతని అభిప్రాయం.

వాస్తుశిల్పంపట్ల లభించిన ఈ ప్రోత్సాహాన్ని, ఇతర కళలు కూడా సముపార్జించాయి. బాబర్, హుమాయూనుల పరిపాలనకాలంలో, చిత్రకళ రాజాస్థానంలో ప్రవేశాన్ని పొంది, అభివృద్ధి చెందింది. బాబర్ హుమాయూనులు ఇద్దరూ కూడా అద్భుతచిత్రాలయొక్క పరీక్షను గుర్తెరిగి,

నిలిచినవారు. విపత్తుకూ, దురదృష్టానికీ, అతి సాహస కార్యాలకూ, గురియై నిలిచి, విజయాన్ని సాధించి, సామ్రాజ్యాన్ని స్థాపించినవారు. వారు పోషించి అభివృద్ధికి తెచ్చిన తంత్రంలో, వారి వ్యక్తిత్వం ప్రతి ఫలించింది. ముట్టడులు, యుద్ధాలు, వేటలు, భవన నిర్మాణాలు, ఉద్యానవన రచనలు,-మొదలైన సాహసోద్యమరంగాలు, సృజనాత్మక ఉద్యమాలను వస్తువులుగా చేసుకొన్న తైలవర్ణ చిత్రాలు, వీరి ఆదరణ పోషణలలో, సృష్టికి వచ్చినవి. చిత్రకళ దైవానుగ్రహ సిద్ధికి సాధనమని భావించిన అక్బర్, ఈ ఉత్తమ చైతన్య స్వరూపానికి ఎక్కువప్రోద్బలం కలిగించినాడు. చిత్రకళకు సంబంధించిన వస్తువులు, పద్ధతులు భారతీయ భావాలతో ఐక్యంపొందేటట్లు ప్రోత్సహించెను. అపూర్వమైన అంతరదృష్టిగల కళాభిజ్ఞుడు జహంగీర్. అతని పోషణలో, కళలు ఉత్కృష్ట స్థితికి అభివృద్ధి చెందినవి. వాస్తుశిల్పంపట్ల అత్యంతాను రక్తికలవాడు షాజహాన్. ఐనప్పటికీ, అతని ఆస్థానంలో చిత్రకళకు ప్రోత్సాహం లభించి, వృద్ధిచెందింది. అతని పిమ్మట, ఔరంగజేబుయొక్క మితిమీరిన మతాభినివేశమువల్లను, అతని తరువాతి చక్రవర్తుల దౌర్బల్య, దురవస్థలవల్లను, కళలకు ప్రాపకం లేక క్షీణింపసాగినవి. సృజనాత్మక శక్తి, పొందిక, ఆత్మప్రత్యయం, ఆనంద పరవశత్వం, ఇత్యాది ఉత్తమ కళాధర్మాలు నశించినవి. రేఖా విన్యాసము, వర్ణసామరస్యము, అనే గుణాలు క్షీణించినవి. అతినాజూకు తనము, స్తోత్ర బహుమానాలు ఉద్దిష్టమైన ప్రదర్శనాడంబరము, వాస్తవ జీవితాన్ని తప్పించుకొనే వినోదము, సారములేని భావనాప్రదర్శనము,- అనేవి, ఈ కాలపు కళల లక్షణాలు. సామ్రాజ్య మధ్య సీమలకు దూరంగా, విదేశ శత్రువుల ప్రచండ దండయాత్రల పరిధులకు బాహ్యమై నిలిచిఉన్న చిన్నరాజ్యాలలో మాత్రమే, పద్ధెనిమిదో శతాబ్దపు చిత్రకళ, కొంత సారవంతంగాను, శక్తిమంతంగానూ, నిలిచి ఉండింది.

సమాజ జీవితానికి (ప్రతి ఫలింప చేసే) దర్పణము వంటిది సారస్వతం. పరివర్తనం పొందుతున్న సామాజిక మనోధర్మాలు, ప్రవృత్తులు, ఆకాలపు సారస్వతంలో, ప్రతిబింబిస్తాయి. కోరికలు, ఉత్కాంక్షలు, ఆశలు, భయాలు, సుఖదుఃఖాలు,-మొదలైన మానవ హృదయ వ్యాపారాలను, ఇతర కళలవలెనే, సారస్వతం కూడా వ్యక్తం చేస్తుంది. ఐనా, తక్కిన కళలకంటె సారస్వతం ఒక విషయంలో విభిన్నమైనది. అయోగ్యములు, అడ్డుదిడ్డములు, ఐన పరిస్థితుల నుంచి కూడా కావ్య సౌందర్యాన్ని సృష్టించే విశిష్టశక్తి సారస్వతంలో నిహితమైఉంది. ఇండియాలోని ఉత్తమ తరగతి కళలన్నీ, రాజాస్థాన పోషణపై ఆధారపడి ఉండినవి. రాజ్యాలు స్థిర సంపన్నములై ఉన్న కాలాలలో వాస్తు శిల్పము, స్థగిత శిల్పము, చిత్రకళ, సంగీతము, ఆరాజ్యాల ఉత్తేజనంతో పురోభివృద్ధిచెందినవి ; రాజాదరణ లోపించి నపుడు సత్త్వహీనములైనవి. మొగల్ పరిపాలకులు, తమ మూలాధారాల నుంచి వస్తున్న సంపదను స్వేచ్ఛగా కర్చుచేసి, కోటలను, మసీదులను, వైభవోపేతములైన సమాధులను, రాజనగరులను, నిర్మింపచేసినారు. అత్యంత విలాస గాంభీర్యాదులతో ఒప్పుతున్న, అత్యుదాత్త స్మారక కళాఖండాలను నిర్మించి, భావి జాతికి వదలిపెట్టి పోయినారు. మృదురేఖావిన్యాసంలోను, వర్ణసామరస్యంలోను, అద్వితీయమైన కళాసౌందర్య ప్రపంచాన్ని సృష్టించిన, తమ కార్ఖానాలలోని చిత్రకారులపై, తమ ఆదరణను, బహుమానాలను కురిపించినారు.

విద్యా సంస్కృతులుగల రాజులు, రాజకుమారులు, ధారాళంగా ఇచ్చిన ధనంతోను,

ఆదరణతోను, ఢిల్లీ, గ్వాలియర్, ఆగ్రాలలోని సంగీత పాఠశాలలకు తగినపోషణ సిద్ధించింది. అమీర్‌ఖుస్రో, తాన్‌సేన్, బైజూ, ఇతర గాయకులు, ఈ పాఠశాలలను నిర్వహిస్తూ, నూతన రాగాలను, రాగిణీలను కనిపెట్టినారు; సితారువంటి నూతన జంత్రవాద్యాలను కల్పించినారు.

రాజ్యకోశం క్షీణిస్తూరావడము, దేశంలో అరాజకపరిస్థితి ఎక్కువౌతూ పోవడము, కారణాలుగా, కళలకు రాజాదరణ తగ్గిపోయింది; విషణ్ణాంధకారం, కళలను ఆవరించింది. పద్ధెనిమిదోశతాబ్దంతో, కళల క్షీణదశ ప్రారంభమయింది. కాని, సారస్వతరంగంలో ఇట్టి దుష్టపరిస్థితి ఏర్పడలేదు. అనుభూతికి వ్యక్తమాపకమైన కవిత, పూర్తిగా వ్యక్తిగతమైన ప్రవృత్తి. బాహ్యపరిస్థితులకు లోబడనట్టిది కవితాప్రతిభ. ఔరంగజేబుకాలంలో, ఉష్ణదేశాలకు స్వాభావికమైన వేగంతో, అంధకారం, దేశాన్ని ఆవరిస్తూరాగా, మహాకవులు అనే నక్షత్రాల కాంతి, దేశం నలుమూలలావ్యాపించి, ప్రజలకు వెలుగును ప్రసాదించింది. ఇంచుమించు భాషలన్నీ క్షీణదశకురానున్న సమయంలో, సారస్వత ప్రతిభ, కొంత చైతన్యాన్ని ప్రసాదించింది.

హిందీ ఉర్దూ సారస్వతాల చరిత్రలు ఈ విషయంలో, చక్కని నిదర్శనాలుగా ఉన్నవి. ఈ రెండు సారస్వతాల అభివృద్ధికీ, పదహేడోశతాబ్ద మధ్యకాలం, ఒక విధంగా, సారస్వత పరీవాహక్షేత్రంగా ఏర్పడిందని చెప్పవచ్చు. మొదటి దశావస్థలో, కళాకారులు జీవనోపాధికి సాధనంగా కళలను అవలంబించినారు. రెండవదశలో, కళాసౌందర్యానుభూతి మాత్రమే ప్రధాన ప్రయోజనమయింది. ఉన్నత జీవితాన్ని గూర్చి మానవుని ఆశాప్రయత్నాలు, అనిర్వచనీయమైన వాస్తవతత్త్వ సందర్శనానికై, మానవులు వహించే ఉత్కాంక్షలు, దివ్యత్వంతో ఐక్యాన్ని పొందడానికై పడే ఆవేశము, జీవితము యొక్క అంతిమధ్యేయాన్ని గూర్చి పయనించే యాత్రికుని సుఖదుఃఖానుభూతులు, ఇత్యాది మానవ జీవితవిషయాలు ఉదాత్త కావ్యాలరచనకు, ఇతివృత్తములైనవి. ఇదేవిధంగా, వీరసాహసకార్యాలు, మహాప్రయత్నాలు, ఉన్నతాదర్శాలను ఉదాత్తమైన విధంగా సాధించడము. ప్రణయము, ప్రేమ, భక్తి, మొదలైనవిషయాలు, ఉన్నతకావ్యాల రచనకు తగినవస్తువులైనవి. ఈ విధమైన సాహిత్యాభివృద్ధి పదహేడోశతాబ్దంలోని ప్రథమార్ధభాగంలో జరిగింది.

హిందీలో అత్యుత్తమకావ్యాలు వృద్ధిపొందడానికి, మూడు భక్తిసంఘాలు కారణములైనవి. కబీర్, సూరదాస్, తులసీదాసులు ఈ కావ్యరచయితలలో ప్రధానులు. వీరేకాక, మలిక్‌మహమ్మద్, జయాసీవంటి, గూఢార్థద్యోతక కల్పిత గాథారచయితలు కూడా, దోహా, చౌపాయీ, అనే ఛందస్సులనువాడి, హిందీసాహిత్యాన్ని పోషించిరి. తరువాతికాలంలో రచించిన రామచరిత మానసకావ్యంలో కూడా, ఈ ఛందోరీతులను వాడినారు.

ఆ తర్వాత ప్రారంభమైనది, రీతి కవితాయుగం. కవితా ప్రతిభ, ఈ మార్గాన్ని అప్పటి పరిస్థితిలో, ఎందుకు అనుసరించిందో, చెప్పలేము. కళలు, సారస్వతము, కూడా, పూర్వపు ఉత్కృష్ట మార్గాన్ని వదలిపెట్టి, అధోముఖంగా, ప్రవృత్తమైనవని మాత్రం చెప్పగలము. ఈ నూతన రచనలలో అలసత, బాధ్యతారాహిత్యము, లాఘవము, చపలత, అనే దుర్లక్షణాలు స్పష్టంగా గోచరిస్తాయి. ఆస్థానాలను ఆశ్రయించుకొని ఉన్న కవులు, తమ పోషకుల క్షుద్రవినోదాలనూ, బాహ్యాడంబరాలనూ, తృప్తిపరచే రచనలు కావిస్తూ వచ్చిరి.

రాజులు, ఆస్థాన సభ్యులు చేస్తున్న అక్రమ సంబంధాలకు, అశ్లీల భాషణలకు, వ్యభిచారాలకు, ఈ కవులు ప్రత్యక్ష సాక్షులు. కాబట్టి, వారి కవిత్వ రచన కూడా, తమ పోషకుల కామోద్రేక ప్రవృత్తికి తోడుపడినది.

స్త్రీని ఒక ఆటవస్తువుగాను, పురుషుని కామోద్రేకాన్ని తృప్తిపరచే సాధనంగాను, వీరు భావించిరి. స్త్రీకి స్వతంత్రమైన వ్యక్తిత్వం ఉన్నదని, వీరు ఊహించినవారు కారు; కాబట్టి, వాస్తవమైన, పవిత్రప్రేమకు స్త్రీ అర్హురాలు కాదు. భావ స్థైర్యంతో స్త్రీ హృదయాన్ని వశపరచుకోవడము, గౌరవ మర్యాదలతో స్త్రీని సమీపించడము, అపాయకరములైన కార్యాలను సాధించడంవల్లను, త్యాగంవల్లను, ఆమెమనోహృదయాలను జయించి, పత్నిగా గ్రహించడము,- మొదలైన ఉదాత్త పురుష ప్రవృత్తులు, వీరి జీవితంలో లేనివి. దౌర్బల్యకారకములైన భోగవస్తువుల మధ్య, పట్టు మఖమల్, జరీవస్త్రాలను, అమూల్య రత్నాభరణాలను ధరించి, రాజప్రాసాదంలో నివసించే గంధర్వ రాజపుత్రి, ఈ కవుల రచనలకు కథానాయిక.

ఆ కవులు నివసించి ఉండిన, సామాజిక జీవనపరిస్థితులు అట్టివి. ఆత్మోత్సాహం మానవ ద్వేషంగా మారింది; ఆదర్శాలపై అభిమానం నశించింది. ధర్మనిష్ఠ, శ్రద్ధాభక్తులు నశించి, వేషధారితనము, కపటాచరణము అలవడినవి. ఆత్మదురభిమాన భోగాసక్తులకు సంఘంలో ప్రబల స్థానం సిద్ధించింది. గాఢమైన భావస్థైర్యము, భావనాశక్తి కవులలో అభివృద్ధిచెందలేదు. జీవన ప్రవాహంపైన మాత్రమే తేలుతూ ఉండడము, ఏ వైపుపోతున్నామనే పరిజ్ఞానం కూడా లేక పోవడము, వీరి మనోధర్మాలు. ప్రాపంచిక సౌఖ్యాలకు, విశ్రాంతి జీవనానికి ప్రజలు ప్రాకులాడినారు. చెమటోడ్చి సాధించే పరిశ్రమ, సంస్కరణ, అభ్యుదయము, అనే ప్రయత్నాలవైపు వీరి మనస్సు ప్రసరించలేదు.

సంప్రదాయాలను, పూర్వగ్రంథాలను, ఆధారంగాచేసుకొని, కవిత్వ సృష్టి జరిగిందే కాని, మానవ జీవితాధారంపై కాదు. ప్రాచీన సంస్కృతకావ్యాలలోని భావాలను, ఉపమానాలను, ఉత్ప్రేక్షలను ఇతివృత్తాలను కూడా గ్రహించి, తమరచనలలో చేర్చుకొన్నారు. కామశాస్త్రంలోని విషయాలు, అలంకారశాస్త్రంలోని నాయికానాయకభేదాలు,- అన్నీ వీరి కావ్యాలలో చేరిపోయినవి.

ఐనప్పటికీ, ఈ నూతనకావ్యాలలో ఒక్క సుగుణంమాత్రం సిద్ధించింది; శబ్దప్రయోగ సౌష్ఠవం అనేది ఈ గుణం. శబ్దసామరస్యము, సుపరిచితములైన ఉచిత ఉత్ప్రేక్షలు, సరళంగా నడిచే శబ్దాలంకారాలు,- ఇత్యాదులవల్ల, ఈ కావ్యాలు ప్రజలకు ఆకర్షకములైనవి. అసహ్యకరమైన విషయాన్ని, హృదయరంజకములైన రంగులతో కప్పిపుచ్చి, ఆకర్షణీయంగా చేసినారు. ఈ రంజకత్వవిధానం, కొంతవరకు పర్షియన్, ఉర్దూసాహిత్యాల నుంచి, సంక్రమించింది. భావనాతీక్ష్ణత, మనోధర్మాలవైవిధ్యం, భావనాప్రధాన రచన, అలంకార ప్రయోగము, శబ్దసౌష్ఠవము,- ఇత్యాదులు ఉర్దూ పర్షియన్ సాహిత్యం నుంచి గ్రహించినవి.

1650లో కవికుల కల్పద్రుమగ్రంథాన్ని రచించిన, చింతామణి త్రిపాఠితో ఈ ఉద్యమం ఆరంభమయింది. పందొమ్మిదో శతాబ్దారంభమువరకు కవులు అనేకులు, ఈ కవి

తను అభివృద్ధిపరచిరి. మతీరామ్, దేవ్, రస్లీన్, దాస్, పద్మాకర్, అనేకవులు వీరిలో మిక్కిలి ప్రసిద్ధులు.

ఉర్దూ సారస్వతం కూడా, ఈ విధమార్గాన్నే అనుసరించింది. ఉర్దూభాష ఢిల్లీపరిసర ప్రాంతాలలో పరిణతి చెందింది; కాని దాని సారస్వతమాతృస్థానం, దక్కన్‌ప్రాంతము. ఇస్లాము మతసందేశాన్ని ప్రసారం చేయబూనుకొన్న సూఫీసాధువులు, ఉర్దూసారస్వతానికి మూలకర్తలు. శీఘ్రమే, పద్యరచనపై ఆసక్తి, విద్యావంతులలో వ్యాపించింది. అంతతో కవులనేకులు బయలుదేరి, భాషను సున్నితంగాచేసుకొని, తమరచనలతో దానిని పోషించిరి. ప్రథమ దశలో ఉత్పన్నమైన కవితాభాష, సహజసరళమైనట్టిది; వ్యావహారిక ఉర్దూభాష, మాతృకఐన ప్రాకృతానికి సన్నిహితంగా ఉండింది. కవితా వస్తువును జీవితం నుంచి గ్రహించినారు. రచనావిధానం, సహజసిద్ధమైనట్టిది; శక్తివంతమైనది. నీతి బోధకములైన మత విషయాలు, రహస్య గర్భిత జీవిత యాత్రను సంబంధించిన గూఢార్థద్యోతక గాథలు, వీరగీతాలు, పౌరాణిక వీర కావ్యాలు, ప్రణయగాథలు, సాహసకార్యాలు,-మొదలైన విషయాలు వస్తువులుగా కావ్యాలు రచింపబడినవి.

అంతట మొగలులు దక్కనుపై దండయాత్ర సాగించిరి. కట్టకడపట, బహమనీ సుల్తానుల రాజ్యాలు అడుగంటినవి. రాజపోషణ లేకపోవడంవల్ల, కవులు ఉత్తర భారత దేశానికి వలసపోసాగిరి. మొగల్ సామ్రాజ్య సూర్యాస్తమయకాలానికి, వీరు ఢిల్లీ చేరుకొన్నారు. అప్పటికే, ధర్మభ్రష్టత సార్వత్రికంగా జరిగి ఉన్నప్పటికీ, ఉర్దూ కవితా లత మాత్రం, తన మాతృభూమిలో పుష్టిగా అభివృద్ధిచెందింది. పద్దెనిమిదో శతాబ్దంలో, ఉర్దూభాష దేశము నలుమూలలా వ్యాపించింది. ప్రతి ప్రాంతంలోనూ ఉర్దూ సారస్వత సంఘాలు స్థాపితమైనవి. ఉత్తర భారతంపై, బ్రిటిషు రాజ్యం విస్తరించిన కాలంలో ఉర్దూభాష, సర్వసామాన్యమైన భాషగా సిద్ధించి ఉండినది. హిందూ ముస్లిము సభ్యవర్గాల వారందరూ, ఉర్దూ భాషనే వ్యవహరించేవారు. పరస్పర సామాజిక వ్యవహారాలకు, సాంస్కృతిక విషయాలకూ కూడా, ఉర్దూభాష సాధనంగా ఉండినది.

కాని, ఈ భ్రష్టకాలంలో సమాజానికి సంక్రమించి ఉండిన దుష్ట స్వభావాలన్నీ, ఆ కాలంలో ఉత్పన్నమైన సారస్వతానికి కూడా సంక్రమించినవి. సౌమ్యోక్తులతోను, విచిత్ర కల్పనలతోను నిబిడమైఉండిన, ఆనాటి కవిత్వం, అనధికారులైనవారు రచించినట్టిది. కృతకములైన శబ్దాలంకారాల పరిమితులకు కావ్యాత్మ కట్టుబడిపోయింది. కవుల మనోధర్మం, విషయలోలుపతకు, ఆధ్యాత్మిక తత్త్వానికి మధ్య, ఊగిసలాడుతూ ఉండేది; ఏదానిలో కూడా గాఢానుభూతి వీరికిలేదు. జీవితం దుఃఖ భూయిష్ఠమైనదనే అభిప్రాయము, నిరాశా భావము, ఈ కవితను ఆవరించి ఉండినవి. వాస్తవ పరిస్థితుల నుంచి పారిపోయి భావనా ప్రపంచంలో విశ్రాంతి తీసుకొనే ప్రవృత్తి, ఈ రచనల ప్రధాన లక్షణం. సమకాలికులైన హిందీ కవులవలెనే ఉర్దూ రచయితలు కూడా, శబ్దప్రయోగ విషయంలోను, శైలి విషయంలోను, ఎక్కువ కౌశలాన్ని ప్రదర్శించినారు. భావవ్యక్తీకరణానికి, మిక్కిలి మృదువైనసాధనంగా, భాషను తీర్చి దిద్దినారు. ఉత్తమ కవుల వర్గంలో, అసాధారణమైన కవితా తేజస్సుతో భాసించినవారు, సౌదా, మీర్, మోమిన్, ఘ్యాలీబులు.

కాని, ఈ యుగంలోని హిందీ ఉర్దూకవులు, లలితకళాభిజ్ఞులు కాబట్టి, వారు ప్రయో

గించే పదాలకు, సమాసాలకు నగిషీపనిచేయడంలో, తమ నైపుణ్యమంతా, వినియోగించిరి. రత్నహారాలను తయారుచేసే శిల్పులు, రత్నాలవర్గాలను, కాంతిని పరస్పరం పొందిక ఉండే ట్లు పొదిగినట్లుగా, వీరు శబ్దాలను తమ రచనలో, పొదిగేవారు. ఈ ప్రయత్నంలో నిమగ్నులై, జీవితముయొక్క అర్థప్రయోజనాలను, సారస్వతముయొక్క ఉదాత్తాశయాన్ని, గమనించిన వారేకారు.

హిందీ ఉర్దూ సాహిత్యాల లక్షణమే, ఇతర, ఉత్తర, దక్షిణదేశ సారస్వతాల విషయంలో కూడా వర్తిస్తుంది. భాష, జాతి, మతము, అనే వైవిధ్యాలకు అన్నిటికీ వెనక, సంస్కృతికి సంబంధించిన గాఢమైన ఐక్యత దేశమంతటా అలముకొని, ఉండడం, గమనింపతగిన విషయం. మధ్యయుగాల భారతదేశ సారస్వతచరిత్రను రెండుయుగాలుగా విభజింపవచ్చును. ఈ రెండుయుగాలలోను కూడా ప్రపంచదృక్పథం, మానవసమస్యలు, కావ్యవస్తువు, రచనావిధానము, అనేవిషయాలలో సాదృశ్యం ఉన్నది.

మొదటియుగంలో, కావ్యవస్తువులకు కోశాగారములైన రామాయణ, మహాభారత పురాణాలను కవులు, గాలించినారు. ఉపనిషత్తులు, భగవద్గీత, భాగవతము, జీవిత తత్వానికి మూలాధారములైనవి. అన్ని దేశభాషలలోనూ ఈ గ్రంథాలు అనువాదాలుగా, లేక, రూపాంతరాలుగా పరివర్తనం పొందినవి. తులసీదాసు హిందీభాషలోను, కృత్తివాస్ ఓఝా బెంగాలీలోను, కంబన్ తమిళంలోను, భాస్కరుడు తెలుగులోను, ఎళుత్తచ్చన్ మళయాళంలోను, ముక్తేశ్వర్ మరాఠీలోను, గిరిధర్ గుజరాతీలోను, మాధవకందాలే అస్సామీలోను, బలరాం ఒరియాలోను, తమతమ ప్రాంతీయభాషల్లో రామాయణాన్ని అనువదించడమో, లేక, తమ ఊహావిశ్వాసాలను అనుసరించిన మార్పులను కావించి రామాయణ ఇతిహాసాన్ని కావ్యాలుగా రచించడమో, చేసినారు. ఉర్దూపర్షియన్ భాషలలో కూడా, రామాయణానువాదాలు రచింపబడినవి. మహాభారతము, పురాణాలు, ఈ అన్నిభాషల కవులకూ ఉత్తేజకములైనవి. వారు, వాటికి సమగ్రమైన వాదాలను, లేక, అందలిభాగాలకు కావ్యాలను రచించినారు.

ఉపనిషత్తులు, భగవద్గీత, భాగవతము, లక్షలాది ప్రజల ఉత్తమ జీవన విధానానికి ప్రేరకములైనవి. ఈ విషయంలో ప్రజల మత విశ్వాసాలకు ప్రసక్తి ఏ మాత్రమూ కలుగలేదు. ఇండియాలోని హిందువులందరూ, ఈ గ్రంథాల సంస్కృత మూలమునో, లేక, దేశభాషల అనువాదాలనో పఠిస్తారు. ఇది సహజమే. కాని, ముస్లిములకు కూడా సూఫీ సాధువుల ద్వారా, వీటితో మంచి పరిచయం ఏర్పడింది. హిందూసాధువుల సాహచర్యంవల్లను, ఈ గ్రంథాల అనువాదాల మూలంగాను, సూఫీలు ఈ గ్రంథాలలోని బోధనలను గ్రహించి ఉండిరి. భగవద్గీతను, పైజీ, పర్షియా భాషలో, అనువదించెను. దారాషుకో, యాభై ఉపనిషత్తులను పర్షియన్ వచన రూపంలో అనువదించినాడు. భగవద్గీతలోని పహో అధ్యాయాన్ని, అతడు పర్షియన్ భాషలోనికి అనువదింపచేసినాడు. కృష్ణ మిశ్రుని ప్రబోధచంద్రోదయ నాటకాన్ని, బన్వాలీదాస్‌వాలీ, పర్షియన్ భాషలో అనువదించినాడు.

రెండో సారస్వత యుగం కూడా, ఇట్టి సార్వజనీనమైన స్వభావాన్నే అనుసరించింది. ఆ కాలపు తమిళ సారస్వతాన్ని గురించి, డాక్టర్ వరదరాజన్ కావించిన దోషారోపణనే, తక్కిన భాషా సారస్వత చరిత్ర కారులు కూడా పునరుద్ఘాటించినారు. తమిళ సారస్వతాన్ని

గురించి, వరదరాజన్, ఈ విధంగా వ్రాసిఉన్నాడు. "ఈ యుగ సారస్వతమంతా, వైయాకరణుల నిస్సారములైన విచిత్రకల్పనలతోను, శుష్కపాండిత్య సాధనలతోను, నిరవికేక్రతమై ఉన్నది. ప్రాచీనకాలపు సారస్వత లక్షణములైన, సరళత, రుజుత్వము, నిగ్రహము, అనే సల్లక్షణాలు నశించిపోయినవి. ఈ యుగంలోని. పెక్కు మంది కవులు కేవలం అనుకరణపరులైనవారు. కథాకథన విధానంలోనేకాక, వర్ణనల విషయంలో కూడా, వీరు కేవలం అనుకర్తలే. కవితాభిరుచి కృతకమైపోయింది. ఛందస్సులను ఉపయోగించడంలో కవులు ప్రదర్శించే సాముగరిడీలను. అనుప్రాసాదులనుబట్టి, వారి కవితా సామర్థ్యం, నిర్ణయమౌతూ ఉన్నది. స్వతంత్ర రచనలు కావించడానికి సమర్థులైన సహజశక్తిగల కవులు గోచరిస్తారు, కాని, వారి సంఖ్య అత్యల్పం. ఈ ఉత్తమ కవులు కూడా, అతిరేకములైన ఊహాపోహలను అతిశయోక్తులను, వాడడంలో, బాల్యావస్థకు అనుగుణమైన ఉల్లాసాన్ని ప్రదర్శించినారు. ఈ యుగంలో సృష్టికి వచ్చిన కావ్యాలలో, సహజ కళావిశేషం కంటె కృతకచాతుర్యమే ఎక్కువ. కనుకనే, ఈ రచనలలో, చాలభాగం మరుగుపడిపోయినవి.

ఈ కాలపు తెలుగు సారస్వతాన్నిగూర్చి, డాక్టర్ గిడుగు సీతాపతి, ఈ విధంగా వ్రాస్తాడు,–"నిజమైన కవిత, అదృశ్యమై పోయింది ; క్షీణయుగం ప్రాబల్యం వహించింది." శ్రీ ఆద్యరంగాచార్య ప్రకారం, "పద్దెనిమిదో శతాబ్దపు మధ్యకాలానికి, కన్నడ సారస్వతం అంతరించింది." మరాఠీభాషలో, లావణీలు అనే జానపదాలు ప్రచారంలో వచ్చినవి.

ఆధ్యాత్మిక ప్రణయము, భక్తికూడా, కాముకసంబంధమైన అనురక్తిగా పతితమయింది. శ్రీమతి దేశపాండే, ఈ విధంగా అభిప్రాయపడింది. "నైతికభ్రష్టత ప్రారంభించినదని స్పష్టమయింది. ఆధ్యాత్మిక వివేచన ముద్దుబారిపోయింది. భక్తిశ్రద్ధల ఉత్సాహం క్షీణించింది. యుద్ధవీరుని జీవితానికి సంబంధించిన ఓజస్సు, ఉత్సాహము కూడా నశించి, పోతున్నవి. అంత్యకాలపు పీష్వాల, విశ్రాంతితో కూడిన భోగజీవితము, అలంకార పాండిత్యము, సారస్వతంలో శాశ్వతస్థానాన్ని పొందినవి." త్రివేదీ అభిప్రాయాన్నిబట్టి, గుజరాతులో, "1790 మొదలు బ్రిటిషువారు ప్రవేశించేవరకూ, జీవితం భ్రష్టస్థితిలో నిలిచిపోయింది." దయారాం యొక్క ఉత్కృష్టరచనలు కూడా, ఈ స్థితిని చక్కచేయలేకపోయినవి. పద్దెనిమిదోశతాబ్దపు బెంగాలీకవితను గూర్చి, డాక్టర్. ఎస్. కె. ఛటర్జీ, ఈ విధంగా వ్రాస్తాడు. "కావ్యేతివృత్తవిషయంలోను, కావ్యరూప విషయంలోను, కూడా, పాతపద్ధతులనే, నీరసమైన విధంగా, కవులు బైటికి లాగుకొని వచ్చినారు." అస్సామీ సారస్వతంలో "ఐహిక విషయచ్ఛాయలు ప్రబలమైనవి." ఈ యుగంలో, కామశృంగార పద్యకావ్యాలు, వ్యక్తిప్రశంసాత్మక పద్యకావ్యాలు అస్సాములో సృష్టికివచ్చినవి. జడప్రాయమైయుండిన ప్రజాజీవితానికి ఈ రచనలు అనుగుణమైనవి.

దేశాన్ని ఈ విధంగా ఆవరించిన విషణ్ణాంధకారంలో, ఒక విశేషమైన వెలుగును చూపినవారు, అలంకారశాస్త్రంలోను, శైలిలోను, పదప్రయోగవిన్యాసంలోను, నిష్ణాతులైన రచయితలు. భావాలవిషయంలో వీరు, ఎంత దరిద్రులైనా, భాషావిషయంలో ఉత్తమాధికారం కలవారు. వారు ఉపయోగించే భాషను చక్కగా సంస్కరించి, అభివృద్ధిపరచి, కాని

కాలపు ఆవశ్యకాలకు తగినట్టుగా తీర్చిదిద్దినారు. వారు ఈ విధంగా, పూర్వపుయుగానికి ప్రతినిధులు, భావియుగానికి ప్రారంభకులు. వీరి సారస్వత ఉత్పత్తి, భారతదేశ సారస్వత ఐక్యతకు నిర్వివాదమైన సాక్ష్యంగా నిలిచిఉన్నది. హిందూముస్లిముల విద్యావిధానాలు పరస్పరము మిళితమైపోవడానికి వీలులేనివి. కార్యరంగంలో కూడా, జాతీయభావ చైతన్యం, ఈ రెండు వర్గాలలోనూ ఉత్పన్నం కాలేదు. కాబట్టి, ఈ సారస్వత ఐక్యానికి విలువ లేకపోయింది.

# 6
# భారతదేశాన్ని బ్రిటిషువారు జయించడం

## ఇండియాకు సముద్ర మార్గం ఏర్పడడం

వాస్కోడగామా ఇండియాకు సముద్ర మార్గాన్ని కనిపెట్టడంతో, ఏషియా యూరోపు ఖండాల సంబంధాలను గూర్చిన చరిత్రలో, నూతన ఘట్టం ఆరంభమయింది. తూర్పు ఆఫ్రికా తీరాలను, ఏషియాలోని అరేబియా, పర్షియా, ఇండియా తీరాలను ఇంతవరకు చుట్టూతా ఉండిన, టర్కీ దేశసముద్రాధికారం తొలగి పోవడం, ఈ సముద్ర మార్గ ప్రకాశనంవల్ల కలిగిన ప్రథమ పరిణామం.

కాని, ఈ మార్గ ప్రకాశనం తర్వాత, రెండువందల సంవత్సరాలదాకా, పాశ్చాత్యుల సముద్రవర్తికార్యాచరణాలు, సముద్రతీర వర్తకానికి మాత్రమే పరిమితమై ఉండేవి. సముద్రాలపై వీరు అధికారాన్ని నెలకొల్పుకొన్నారు. కాని, అనటోలియ, పర్షియా, ఇండియా మొదలైన అంతర్దేశీయ ప్రాంతాలలో, ఆటోమనులు, సఫావీలు, మొగలులు, కట్టుదిట్టములైన సామ్రాజ్య వ్యవస్థలను వృద్ధిపరచిఉండిరి. పాశ్చాత్య సాహసిక వ్యక్తుల అత్యాశలను, ఈ విధానాలు అరికట్టి ఉంచినవి.

పదహారు పదహేడో శతాబ్దాలలో, ఏషియాఖండ వైభవ ప్రఖ్యాతులు మిన్ను ముట్టినవి. ఈ వైభవ సంపదలే, దీని వినాశ హేతువులుగా పరిణమించినవి. ఇంతవరకు విజయవంతములై నిలిచిన ఈ విధానాలను మార్చడం సాధ్యముకాలేదు. సంప్రదాయాలు పాతుకొని పోయినవి; మనస్సు చైతన్యము లేనిదై తన బంధనాలలో తానే చిక్కుబడిపోయింది. ఆర్థిక వ్యవస్థ, పరమాణు రూపంలో ఛిద్రమైపోయే స్వభావాన్ని, సమాజంపై విధించింది. ఈ స్వభావంవల్ల, మానవ సహజీవనం అత్యంతమూ సంకుచితమైపోయింది. వ్యక్తిగత స్వాతంత్ర్యం, బాహ్యాధికారానికి, బాహ్యములైన నిబంధనాలకు, సమాధానపడి, ఆత్మ ప్రవృత్తిని కోల్పోయింది. విమర్శ, అభిప్రాయభేదము, పాపములుగా పరిగణింపబడే పరిస్థితి ఏర్పడింది. ఇది ఏషియా దేశాల పరిస్థితి.

యూరోపుదేశాలలోని పరిస్థితులు వీటికి విభిన్నములైనవి. పదహైదో శతాబ్దం ముగిసే నాటికే, స్వాతంత్ర్య వాయువుల ప్రబల ప్రసారం ప్రారంభమయింది. కాలంగడిచే కొద్దీ, ఈ వాయువులకు విస్తృతి, బలమూ సిద్ధించినవి. సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమంవల్ల, బుద్ధి, తన బంధనాలను తెంచుకొని బైటపడింది. మత సంస్కరణోద్యమం, చర్చియొక్క నిరంకుశాధికారం నుంచి, మానవుని మనస్సుకు, విముక్తి, కలిగించింది. వర్తక, పారిశ్రామిక విప్లవాలు, సమాజముయొక్క పునాదులను విస్తరింపచేసినవి. రాజకీయ పరివర్తనాలు, జాతీయ రాజ్యాల సృష్టికి హేతువులైనవి. విజ్ఞానాభివృద్ధివల్ల మానవుడు, ప్రకృతిపై అధికా

రాన్ని సంపాదించుకొన్నాడు. నూతన భావనలు బహిర్గతములై, మానవ సహజీవన వ్యవస్థకు నూతన పరిమాణాలను ప్రదర్శించినవి. భూస్వామ్య విధానంవల్ల, ఏర్పడి ఉండిన కుష్ఠ ఛాశితమై పోయింది. క్రియాత్మకశక్తి జీవితంలో ప్రవేశించడంతో, ఆత్మోన్నతి కలిగినట్లు మానవుడు భావించుకొని, ఉత్సాహ పరుడైనాడు.

తూర్పుదేశాలనుంచి, ముస్లిము టర్కులు క్రైస్తవ యూరోపుఖండంలోనికి చొచ్చుకొనిపోవడము, క్రైస్తవులు ముస్లిములను ఆఫ్రికాఖండం చుట్టూవెంటాడుతూ, పోవడము,– ఈ రెండూ పదహైదోశతాబ్దంలో, ఏకకాలంలో జరిగిన ఉద్యమాలు. వీటివల్ల, ప్రపంచదేశాలన్నిటికీ సమానంగా వర్తించే పరిణామాలు ఉద్భవిల్లినవి. జడప్రాయములై నిలిచి ఉండిన తూర్పుఖండాల సమాజాలకు, పాశ్చాత్యదేశాల అభ్యుదయ రాజ్యాలతో తీవ్రమైన సంఘట్టనం కలగడానికి, ఈ ఉద్యమాలు హేతువులు. బుద్ధిశక్తి, ఆర్థికవ్యవస్థ, రాజకీయ కార్యక్రమ, అత్యున్నతస్థాయిలో ఉన్న సమాజవర్గానికీ, తగ్గుదశలో ఉన్న రెండవ సమాజవర్గానికీ, సంఘట్టన సిద్ధించిన సందర్భంలో, ఈ రెండువర్గాలకూ గల స్థాయీ అంతరాన్నిబట్టి, ఒకదానినుంచి రెండవదానిలోనికి శక్తిప్రవహించడం, ప్రకృతిసిద్ధమైన విషయం.

జరుగబోయే ఈ ఉద్యమానికి, సూచనగా వచ్చినవాడు వాస్కోడగామా. ఆక్రమణ ప్రవృత్తిగల యూరోపుదేశీయుల వ్యూహాముఖమువంటివాడు ఇతడు. కాని, ఇతడు ప్రాతినిధ్యంవహించిన పోర్చుగల్ దేశము, ఈ విదేశాక్రమణ ఉద్యమాన్ని చాలకాలం నిర్వహించలేక, ప్రయత్నం నుంచి విరమించుకొంది. అంతతో, నాయకత్వం, బలవద్రాజ్యాల చేతుల్లోకిపోయింది. హాలండ్, ఫ్రాన్సు, ఇంగ్లాండుదేశాలు, పోర్చుగల్ స్పెయిన్‌దేశాలతో పోటీపడినవి. మొదటి మూడుదేశాల ఒత్తిడికి నిలువజాలక, కడపటి రెండుదేశాలూ, రంగంనుంచి తప్పుకొన్నవి. సంపన్నమైన భారతదేశమనే ఉత్కృష్టబహుమతిని సాధించుకోడానికి, హాలండ్, ఫ్రాన్సు, ఇంగ్లండులు పరస్పరం పోరాడసాగినవి. తుదకు హాలండును, ఫ్రాన్సును, ఇండియానుంచి పారదోలి, ఇంగ్లాండుదేశం విజయాన్ని సంపాదించింది. ఐనా, ఇండోనీషియా ద్వీపాలపై అధికారాన్ని, హాలండు కోల్పోలేదు. ఇండో-చైనాను, ఫ్రాన్సు తన అధికారానికి వశపరచుకొంది.

ఆంగ్లేయులు, ఇండియా తీరాలను చేరడానికి సాహసించడము, అతి సామాన్య వర్తకులవలె వ్యాపారం సాగించుకొంటూ, అవకాశానికై ఎదురుచూస్తూ, నూటయాభై సంవత్సరాలు శాంతంగా వేచిఉండడము, ఇండియాదేశపు రాజకీయ వ్యవస్థ క్షీణించడంతోనే, దేశాన్ని ఆక్రమించి తమ అధికారానికి లోబరచుకోవడము, అనే ప్రయత్నాలలో, వీరు అవలంబించిన విధానం, మానవ జాతి చరిత్రలో ఒక అద్భుతావహమైన సంఘటన. దీనిని సరిగా గ్రహించడానికి, ఆకాలపు యూరోపుదేశాల సిద్ధాంతాలకు, సంస్థలకు సంబంధించిన పరిస్థితులను వివరించడం ఆవశ్యకం.

*యూరోపులోని వాణిజ్యవాదం :* పదహారోశతాబ్దంనాటికి, యూరోపు దేశాలలో వ్యవసాయ క్షేత్రిక విధానం అంతరించి, వాణిజ్యవాద యుగం ఆరంభమయింది. వర్తక పెట్టుబడిదారీ వర్గము, లేక, బూర్జువా మధ్యతరగతి వర్గము, అనే పట్టణ ధనిక తంత్రం **(Burgher Plutacracy)** వాణిజ్య వాదంతోనే ఉత్పన్నమయింది.

వాణిజ్యవాదము అనేది, కేవలం ఆర్థికసిద్ధాంతం కాదు; భావప్రవృత్తి- లేక, జీవన

తత్త్వశాస్త్రము కాదు. ఒకరకపు సమాజస్వరూపం అది.

మధ్యయుగ వ్యవస్థనుంచి అధునాతన వ్యవస్థకూ, భూస్వామ్యపు అరాజకత్వం నుంచి జాతీయసంయోజనానికీ, జరిగిన పరివర్తనానికి సూచకమైనది వాణిజ్యవాదం. వ్యవసాయము, పరిశ్రమలు, వర్తకము, అనే కార్యకలాపాలలో, సహకార ప్రవృత్తులను అది బలపరచింది. జాగీర్దారీ వ్యవసాయ విధానం భగ్నమై పోవడము, వృత్తిశ్రేణుల అతి సంకుచిత నియమనం నుంచి బైటపడి, పరిశ్రమలు, వర్తకము స్వతంత్రములు కావడము, కారణములుగా, ఉత్పాదన, సహకార వర్తకము విస్తృతిచెందినవి. స్థానిక, వర్గీయ ప్రయోజనాలు, మొత్తం దేశం యొక్క విస్తృత ప్రయోజనాలకు లోబడిపోయినవి. పురపాలక సంస్థల ఆచారాలు, అలవాట్లు తొలగిపోయి, దేశసమస్తానికీ వర్తించే, ఏక రూపశాసన ప్రమాణాలు అమలులో వచ్చినవి. గ్రామాలకు, పట్టణాలకు సంబంధించిన స్వయం పోషణ సమర్థత, అనేవి, జాతి సమస్తంయొక్క స్వయం పోషక సామర్థ్యంలో ఐక్యం పొందినవి. ఒకవైపు వ్యక్తికిగల ఆత్మప్రతిష్ఠను పోషిస్తూ, రెండవవైపు, వ్యక్తులమధ్య పరస్పర సహకార ప్రవృత్తిని అభివృద్ధి పరచింది, వాణిజ్యవాదం. ఈ రెండు విధములైన అభివృద్ధులూ, ఉద్యమకర్తల వర్గం సృష్టికి రావడంలో వ్యక్తమైనవి. ఈ ఉద్యమకర్తల వ్యాపారకౌశల దూరదృష్టి, ఉద్యమ సాహసాల వల్ల మూలాధార వస్తువుల సద్వినియోగము, వృత్తుల నైపుణ్యాభివృద్ధి, ఎక్కువ ప్రయోజక మార్గాలలో జరిగింది; నూతన కార్యకలాపాలు, బజార్లు సృష్టికివచ్చినవి; సంయుక్త ఉద్యమాలు స్థాపింపబడినవి. విదేశీయ వర్తకాన్ని నిర్వహించడానికి అవసరమైన ధన సంచయం కూడా, వీరి ప్రయత్నంవల్ల ఏర్పడింది. తత్ఫలితంగా, బ్యాంకింగు పద్ధతి, పరపతి, జాతీయ పరిశ్రమ, విదేశవర్తకము, అనే ఉద్యమాలకు ఉత్తేజనం లభించింది. శ్రామికగతి శీలత (Labour mobility) వృద్ధిచెందింది; కార్మికుల విశేషజ్ఞత, పరిశ్రమలు అభివృద్ధికి వచ్చినవి. అల్పపరిమాణంలో వస్తువులను ఉత్పాదనచేసే వ్యక్తులు తొలగిపోయిరి. వారి స్థానాన్ని విస్తృత పరిశ్రమల నాయకులు, వర్తక శ్రీమంతులు, విత్తదక్షులు, ఆక్రమించిరి.

నైతిక వ్యవస్థ విషయంలో, వాణిజ్యవాదం, కొత్తనీతి సంహితను విధించింది. మధ్యయుగాలలో, నీతి, మత వ్యవస్థలనుంచి. ఆర్థికవ్యవస్థ వేరుపడి ఉండలేదు. కాబట్టి, చర్చియొక్క వ్యాదేశాలను అనుసరించి ఆర్థిక వ్యవస్థ నడిచేది. ఇప్పుడు, విద్యా సంస్కృతులతో కూడిన ఆత్మహితం, నీతిమతాల స్థానంలో వచ్చినిలిచింది. "మార్పుదానికి సాధ్యపడని సామాజిక కార్యకారణ సంబంధ సూత్రాలలో విశ్వాసము,-నీతితత్త్వ, మానవ హితతత్త్వాలను సంబంధించని సామాజిక జీవిత దృక్పథంతో కూడిన తర్కపారమ్యవాదము (Rationalism) అనేది, క్రిశ్చియన్ న్యాయశాస్త్రాన్ని, మత తత్త్వాన్ని త్రోసివేసి, వాటి స్థానాన్ని ఆక్రమించింది." ఆతర్వాత, ఆడంస్మిత్ రచించిన మానవజాతుల సంపద (The Wealth of Nations) అనే ఉద్గ్రంథంలో ప్రతిపాదింపబడిన స్వేచ్ఛావాణిజ్యము (Laisserz Faire), ముక్తవ్యాపారము (Free Trade) అనే ఉపదేశాలు, ప్రవృత్తిలోనికివచ్చినవి. ఆడంస్మిత్, ఈ విధంగా వ్రాసాడు.-"మాంసము, మద్యము, రొట్టెలు, మొదలైన సామగ్రులను అమ్మేవర్తకులకు, స్వప్రయోజనంపట్ల ఉన్న లక్ష్యంవల్లనే మనకు భోజనలభిస్తూ ఉంది కాని, వారి దయాధర్మబుద్ధివల్లకాదు. మానవహితాన్ని గూర్చి వారితో మనం చెప్పం. వారి స్వాభిమానాన్నిగూర్చి, వారి ఆత్మహితాన్నిగూర్చి మాత్రమే చెప్తాము. మన అవసర

కాలను వారితో ప్రస్తావించము; వారికి సిద్ధించే, సౌకర్యాలను లాభాలను గూర్చి మాట్లాడ తాము."

స్వాభిమానము అనేది, ఈ విధంగా మానవసమాజ వ్యవహారాలను అన్వయపరచే ఆధారసూత్రంగా సిద్ధించింది. "మానవునిలోని స్వాభిమానం, దైవకృపవల్ల సిద్ధించినట్టిది. ఈ నూతన, నీతిసంహిత, కార్యాలనుబట్టి, సాధనాల మంచిచెడుగులను నిర్ణయిస్తుంది. ఇందువల్ల, వర్తకులు, మరింతనిర్దయులైరి. ప్రాచీనకాలంనుంచి గౌరవించబడుతున్న ఆచారాలను, మానవత్వ అవసరాలను పూర్తిగా తొలగించవలెనని పట్టుపట్టుతూ వచ్చిరి. తమ అభిప్రాయాలను సాధించుకోవడంలో, చిరకాలంనుంచి ఫలకారులై ఉన్న నిర్బంధవిధానాలను అన్నిటినీ ప్రయోగిస్తూవచ్చిరి." అని ఆడంస్మిత్ వ్రాసిఉన్నాడు.

మతాధికారం విధించిఉండిన నిర్బంధాలనుంచి, వ్యక్తికి విడుగడలభించింది; కాని, ప్రభుత్వాధికారానికి తాను పూర్తిగా విధేయుడై ఉండవలసిన పరిస్థితి ఏర్పడింది. మానవుని ఆత్మను ఉద్ధరించడమే, మన ప్రయత్నాలన్నిటికీ ప్రధానప్రయోజనమని, మధ్యయుగాల వారిభావం. మానవుని ఇహలోకశ్రేయస్సును సాధించడానికి పూనుకొన్నది, ఆర్థిక ఉదారతావాదం. వాణిజ్యవాదాన్ని అవలంబించిన రాజనీతిజ్ఞులు, రచయితలు, ప్రజలను తమ ఆశయానికి సాధనాలుగా గ్రహించిరి. రాజ్యాన్ని శక్తిసంపన్నంగా చేయడమే వారి ఆశయం.

ఈ విధంగా, రాజ్యాధికారంపై మతసంస్థ విధించిఉండిన పరిమితులు, అవధులు తొలగిపోవడానికి, వాణిజ్యవాదం తోడ్పడి, సమగ్ర ప్రభుత్వాధికారం అనే తిమింగలాన్ని బైటవదలింది. ఈ పరిస్థితికి మిక్కిలి అనుగుణంగా, తగిన సమయానికి థామస్‌హాబ్స్ వచ్చి, దీని జన్మను ఆశీర్వదించి, జాతకాన్ని రచించినాడు.

తమ ఆర్థికావసరాలను పూర్తిచేసుకోడానికి మధ్యమతరగతుల వారికి కావలసిన రాజకీయవ్యవస్థ ఎట్టిదో, హాబ్స్ తన గ్రంథంలో సమగ్రంగా చిత్రించినాడు. ఈ పద్ధతి ప్రకారం, ప్రభుత్వానికి సర్వోచ్చాధికారం సిద్ధిస్తుంది. మధ్యయుగాలలో అధికారానికై పోటీచేసిన చర్చి, కులీనవర్గము అనే రెండుసంస్థలూ, ఇప్పుడు ప్రభుత్వాధికారానికి లోబడిఉంటాయి. స్వతంత్ర ఉద్యమ ప్రవృత్తిని అరికట్టే నిర్బంధాలను వ్యక్తిపై విధించినందువల్ల, తన అధికారాన్ని, చర్చి పోగొట్టుకొన్నది. దేశంలో శాంతికి భంగం కలిగించి, వ్యాపారోద్యమ స్వాతంత్ర్యంతో జోక్యం కలిగించుకోవడంవల్ల, కులీనులు తమ అధికారాన్ని కోల్పోయిరి.

మధ్యమ తరగతులవారు స్వదేశంలోను, విదేశాలలోను సాధించుకోదలచుకొన్న ఆర్థిక ప్రయోజనాలకు, అనుకూలమైన పరిస్థితులు ఏర్పడవలసిఉన్నది. అట్టి పరిస్థితులను నెలకొల్పి, వాటిని నిలిపి ఉంచడానికి తగినంత అధికారం ప్రభుత్వానికి సిద్ధించవలెనని, హాబ్స్ అభిప్రాయం. ఆ కాలానికి అవసరమైనది కూడా, అదే.

జాతియొక్క భౌతిక సంపదను అభివృద్ధిచేయడమే, వాణిజ్యవాదముయొక్క ప్రధాన ఆశయం. కేవలం లౌకికమైనది దీని ప్రవృత్తి; దీని దృక్పథం విజ్ఞానశాస్త్రాత్మకమైనట్టిది. మానవునిచుట్టూ ఆవరించియున్న ప్రపంచాన్ని నూతన దృష్టితో పరిశీలించడం, ఈ పద్ధతిలో చేరింది. భౌగోళిక పరిశీలన, జ్యోతిష శాస్త్రము, ప్రకృతిశక్తులు, ప్రకృతి సంఘటనలు, మొదలైన విషయాలలో నూతనమైన ఆసక్తిపహించింది. పర్యాలోచనకు, కార్యాచరణకు సంబంధించిన రంగాలలో కూడా, హేతువాదాన్ని వర్తింపచేయడం, ఈ పద్ధతికి

అభిమతమైనది.

1645 లో, స్థాపితమైన రాయల్ సొసైటీ, ఈ మనోధర్మానికి తగినవ్యక్తరూపం. ఈ సంఘచరిత్రకారుడైన, థామస్ స్ప్రాట్ (రాఛెస్టర్ బిషప్) "ఈకాలపు ప్రజలు ప్రాచీన సంస్థల అవశేషాలతో విసిగినారు; మత సంబంధమైన వివాదాలతో వీరికి వెగటు పుట్టింది... ... ... విజ్ఞానం కొరకు, సార్వజనీనమైనకోరిక, ఆశ, ఉదయించినవి." అని వ్రాసి ఉన్నాడు.

వాణిజ్య తత్త్వాన్ని అవలంబించిన మధ్యమ తరగతులవారు, ఆకాలపు రాజకీయాలలో ప్రబలమైన సంస్థగా ఏర్పడిరి. అధికారము, సంపద అనే తన జంట ఆశయాలను సాధించుకోడానికి అనుకూలంగా, ప్రభుత్వ విధానాలను దిద్దడానికై, తమ పలుకుబడిని వినియోగిస్తూ వచ్చిరి. పరిశ్రమల విస్తరణను, విదేశీయుల పోటీనుంచి రక్షణకలిగించే చర్యలతో దేశంలోని ఉత్పాదనకు ప్రోత్సాహం కలిగించడానికి, అంతర్దేశీయ నిర్బంధాలను తొలగించడానికి, ప్రభుత్వ శక్తి వీరికి అవసరమయింది.

విదేశాలలో తయారైన వస్తువుల దిగుమతిని ఆపివేసి, తమ దేశంలో తయారైన వస్తువుల ఎగుమతిని ప్రోత్సహించి, దేశాన్ని స్వయం పోషక సమర్థంగా చేయడం, వీరి ఉద్దేశం. వాణిజ్య వాదులు, బంగారు, వెండి, వంటి విలువగల వస్తువుల దిగుమతిని ప్రోత్సహించిరి. వస్తువుల ధరలను పెంచి ఎక్కువ లాభాలను సంపాదించడానికి ఈ దిగుమతులు సహకరిస్తాయి. అంతేకాక, సైన్యాన్ని విస్తృత పరచడానికి, ఉత్తమ ఆయుధ పరికరాలను సైన్యానికి సమకూర్చడానికి తగిన సామర్థ్యం ప్రభుత్వానికి సిద్ధిస్తుంది. ఈ విధంగా, ధనమే సంపద అనే భావమూ, ఎగుమతులకు సరితూగే వెండిబంగారాలను దిగుమతి చేసుకోవలెననే అభిప్రాయమూ, ప్రజామోదాన్ని పొందినవి. ప్రపంచ వాణిజ్య పరిమాణం, హెచ్చుతగ్గులు లేక స్థిరమై ఉన్నదనిన్నీ, కాబట్టి, ఒక దేశంలో సంపద అభివృద్ధి కావడంవల్ల, ఇతర దేశాల సంపద తప్పక తగ్గిపోతుందనీ, వీరు నమ్మి ఉండిరి.

అంతర్జాతీయవాణిజ్య విషయంలో, వీరు ప్రత్యేకవాదులు. తమతో పోటీచేసిన వర్తక దేశాలను యుద్ధచర్యతో ఐనా, బజారులనుంచి పారదోలడానికి వెనుదీసేవారుకారు. తమ జాతి దేశాలమధ్య కూడా పోటీని వీరు ఒప్పుకోరు. పోటీవల్ల తమ లాభాలు క్రమంగా తగ్గిపోతాయనే భయమే, ఇందుకు కారణం. అందువల్ల, తమకు ప్రత్యేకమైన విశిష్టాధికారాలను, విశిష్టమైన రియాయితీలను, ఏకస్వామ్యాలనూ, సంపాదించుకొనే ప్రయత్నానికి పూనుకొన్నారు. తమ వస్తువులను అధికధరలకు విక్రయించి, విదేశాల ముడిసరుకులను చౌకగా కొనవలెననేకోరిక, వలసరాజ్యస్థాపనకు దారితీసింది. అట్టి వలసరాజ్యాలను స్థాపించుకోవడానికి, పరదేశాల ఆక్రమణ, రాజ్యస్థాపన, తప్పని సరిఐనవి.

ఈ విధంగా, హాబ్స్ చిత్రించిన ప్రకృతిపరిస్థితికి సంబంధించిన న్యాయాలు, వాణిజ్యవాదుల ఆర్థిక కార్యకలాపాలకు అభిమతమైనవి. కత్తి చేతపట్టుకొని, వాణిజ్యాన్ని జరిపే పద్ధతి, ప్రారంభమయింది. తత్ఫలితంగా, పదహారో శతాబ్దంనుంచి పంధొమ్మిదో శతాబ్దంవరకూ, యూరోపురాజ్యాలమధ్య వాణిజ్యమూలక యుద్ధాలు, నిరంతరంగా సాగినవి. పోర్చుగీసువారు, అధికారం వహించిఉండిన సముద్రాలపై, ఇంగ్లాండు నౌకాధికారులు తిరుగుతూ, అట్లాంటిక్, హిందూమహాసముద్రాలపై చౌర్యాన్నీ, దోపిడినీ, సాగిస్తూవచ్చిరి. ధనంతోను, వాణిజ్య వస్తు

వులతోను నిండియున్న నావలనుపట్టుకొని, దోపిడిచేసేవారు. రక్తపాతంతో కూడిన యుద్ధ చర్యలుజరిపి, విస్తారమైనధనాన్ని, విలువగల ఇతరవస్తువులను సంగ్రహించేవారు. పశ్చి మాఫ్రికాతీరాలలో, దాసజనాన్ని వేటాడిపట్టుకొని, అమెరికాకు తీసుకొనిపోయి, హాకిన్స్, అత్యధికమైన లాభాలను గడించినాడు. డ్రేక్, ఫ్రాబిషర్, గిల్బర్ట్, ర్యాలే,- వీరందరూ సముద్రాలపై తిరుగుతూ, అక్రమవ్యాపారాన్ని సాగిస్తూ, పడవలను దోచుకొంటూ, ఇతర దేశాల లోని భూభాగాలను ఆక్రమించి, ఇంగ్లాండుకు వలసరాజ్యాలను స్థాపించిరి.

ఈ వలసరాజ్యాల స్థాపన వాణిజ్యవాదుల ఉద్దేశాలను పూర్తిచేసింది. ఇంగ్లాండులో తక్కువపడిన ముడిసరకులను సరఫరాచేయడానికి ఇవి ఉపకరించినవి. ఇంగ్లాండులోని ప్రధానపరిశ్రమలకు,- (ఉదాహరణకు నౌకానిర్మాణము) అవసరమునైన ముడిసరకులను, ఈ వలసరాజ్యాలనుంచి దిగుమతిచేసుకొనేవారు. తమ "మాతృదేశమైన ఇంగ్లాండుకు, ఈ వలస రాజ్యాలు, ధనసంచయాన్ని కూర్చే అక్షయములైన గనులవంటివి." అని ఆంగ్లేయుల సార్వ జనిక అభిప్రాయము. ఇంగ్లాండులో తయారైన వస్తువులను ఈ వలసరాజ్యాలు వినియో గించుకొని, ఇంగ్లాండుకు అవసరమునైన పదార్థాలను పండించి, సరఫరాచేస్తూ రావడంవల్ల, వీటికై ఇంగ్లాండు డబ్బు, ఇతరదేశాలకు ప్రవహించవలసిన అగత్యం లేకపోయింది.

అమెరికా, ఐర్లండుదేశాలలో స్థాపించబడిన బ్రిటిషువారి నెలవులు, వలసరాజ్య వ్యవస్థకు చక్కని నిదర్శనాలు. "సామ్రాజ్యంలోని అన్ని భాగాలకు ఆవశ్యకమైన వస్తు వులను, మాతృదేశం తయారుచేసి సరఫరా చేయడము, ఈ వస్తువుల తయారుకు అవ సరమునైన ముడి సరకులనూ, నాగరక జీవనానికి ఆవశ్యకములౌతూఉన్న ఉష్ణమండలపు సుఖ భోగవస్తువులనూ, వలస రాజ్యాలు సరఫరా చేయడము, అనే విధానాలతో ఏర్పడిన స్వయం పోషకత్వము, స్వయంపూర్ణత," అనే ఆదర్శంపై ఈ వలస రాజ్య విధానం ఏర్పడింది.

ఈ ధ్యేయాన్ని దృష్టిలో ఉంచుకొని "వలస రాజ్య వాణిజ్యంపై నిష్కర్షమైన నిర్బంధ విధానాన్ని విధిస్తూ, బ్రిటిషు పార్లమెంటు, వరుసగా కొన్ని చట్టాలను ఆమోదించింది. ఇంగ్లాండు వాణిజ్య నౌకలు, ఇంగ్లీషు ప్రజలు, వలస రాజ్యాలతో వాణిజ్యం జరపవచ్చు; వలస రాజ్యాల వారి ఎగుమతులలో అత్యధికభాగం, ఇంగ్లాండు రేవు పట్టణాల మూలంగా జరుగవలెను; వారి దిగుమతులు పూర్తిగా ఇంగ్లాండు రేవు పట్టణాలకే పరిమితమైనవి; ఖండాంతర వాణిజ్యంపై కొన్ని సుంకాలు విధింపబడినవి." అమెరికా వలస రాజ్యాలపై రాజకీయ నిర్బంధాలను బలప్రయోగంతో విధించిరి. "ప్రజాప్రాతినిధ్య పద్ధతిని తుడిచివేసిరి. సమస్తమైన పరిపాలన విధానము, శాసననిర్మాణము, పన్నుల నిర్ణయము,- మొదలైనవన్నీ గవర్నరులోను, అతనిసలహా మండలిలోను నిహితమైనవి." ఇంగ్లాండు రాజు గవర్నరును నియమించేవాడు. సలహామండలిలో ఏర్పడే ఖాళీలను గవర్నర్ భర్తీచేసేవాడు.

ఐర్లండులోని పరిస్థితులు ఇంతకంటె అన్యాయమైనవి. 1494 లో, పాయినింగ్స్ న్యాయాన్ని ప్రఖ్యాపనంచేసి (Promulgation) ఐరిష్ పార్లమెంటుకు స్వాతంత్ర్యం లేకుండాచేసిరి. ట్యూడర్‌రాజుల పరిపాలన కాలంలో, రాజకీయ సంస్కరణచట్టాన్ని బల వంతంగా ఐర్లండుపై విధించి, అవిధేయులైన జాగీర్‌దారులను అణచివేసిరి. అంతతో దేశంలో విద్రోహాలు బయలువేరగా, దయాదాక్షిణ్యాలు లేకుండా వాటిని అణగద్రొక్కిరి. విద్రోహుల భూములను స్వాయత్తం చేసుకొని, వాటిని ప్రొటెస్టెంట్ శాఖీయులైన ఆంగ్లేయు

లకు పంచిపెట్టిరి. ఐర్లాండు నుంచి ఇంగ్లాండుకు పశువులు దిగుమతి కాకుండా ప్రతిషేధించిరి. అట్లే నూలు, తోళ్ళు, జున్నుగడ్డ మొదలైన వస్తువుల దిగుమతి కూడా నిషేధింపబడింది. ఐర్లాండులో తయారైన ఉన్నిగుడ్డలు విదేశాలకు ఎగుమతి కాకుండునట్లుగా శాసించి, తమ దేశపు గుడ్డలకు పోటీలేనట్లు చూచుకొనిరి. దీనితో, ఐర్లాండుదేశపు వినిర్మాతలు (Manufacturers) నాశమై పోయినారు. అల్స్టర్‌తో కూడిన ఆరు ప్రాంతాలూ, ఇంగ్లాండు దేశపు తోటలుగా ఏర్పడినవి. ఐర్లాండుదేశం, రక్తస్రావంతో, ఇంగ్లాండు పాదాలపై సాష్టాంగంగా పడిపోయింది.

సాంఘిక-ఆర్థిక పరిణామంలోని ఉన్నతదశకు ప్రాతినిధ్యం వహించినది, వాణిజ్య వాదం. కాని, కేవలము ప్రాకృతికమైన స్వార్థము, అత్యంతమైన హింసాకాండ దట్టంగా వ్యాపించిఉన్న పర్యావరణంలో, అది, ప్రగతిపరంగా ప్రవృత్తమౌతూవచ్చింది." భూస్వామ్య సంస్థలు జరిపిన హింసాకాండ సమస్తమూ సాధించలేని దానిని, విదేశవాణిజ్య వినిర్మాణాల నిర్దయాప్రవృత్తి, చల్లగా, క్రమంగా, సాధించింది." అని ఆకంస్మిత్ వ్రాస్తాడు. ఇంగ్లీషు వారి ఈస్ట్ఇండియా కంపెనీ, వాణిజ్యవాదానికి ఆదర్శసృష్టి.

*ఈస్ట్ ఇండియా కంపెనీ :* చిరకాలం జరిగిన వాణిజ్యోద్యమ ప్రక్రియ, కంపెనీ స్థాపనతో, అత్యుచ్చదశను అందుకొంది. చాల తొలిరోజుల్లోనే (1313) స్టేపల్స్ సంఘం స్థాపితమయింది. ఉన్నివర్తకంలో ఈ సంఘానికి ఏకస్వామ్యాధికారం ఉండేది.

ఒక శతాబ్దం తర్వాత (1407) (Company of merchant adventurers) వర్తక సాహసికుల కంపెనీ ఏర్పడింది. ఉన్నివర్తకాన్ని మానివేసి, ఈ కంపెనీ, ఉన్ని వస్త్రాల వాణిజ్యానికి పూనుకొన్నది. ఇంగ్లాండుదేశం వినిర్మాణయుగంలో ప్రవేశించడానికి ఇది సూచన.

పదహారోశతాబ్దంనాటికి, కంపెనీవ్యవస్థను క్రమబద్ధం చేయడంలో, ఎక్కువ శీఘ్రాభివృద్ధి జరిగింది. ఈ శతాబ్ది మధ్యకాలానికి, మస్కోవీకంపెనీ బయలుదేరింది. ఈ రకమైన కంపెనీలలో, మొట్టమొదటిది ఇదే. ఆపైన, పెక్కుకంపెనీలు వాణిజ్యసంబంధమైన రాజప్రపత్రాలను సంపాదించుకొన్నవి. 1567 ఆఫ్రికన్ కంపెనీ, 1577లో స్పానిష్ కంపెనీ, 1578లో ఈస్ట్‌ల్యాండ్‌కంపెనీ, 1581లో టర్కీకంపెనీ,- మొదలైనవి. వీటిలో కడపటిదైన ఈస్ట్‌ల్యాండ్ కంపెనీ, 1592లో లెవాంట్ కంపెనీతో విలీనమయింది. కట్టకడపట, 1600లో ఎలిజబెత్‌రాణి "మా జాతిప్రతిష్ఠకుగాను, మా దేశప్రజల సంపదకుగాను;" ఈస్ట్‌ఇండియా కంపెనీకి ప్రపత్రాన్ని ప్రసాదిస్తున్నాము అని చెప్పింది. కంపెనీ వ్యవహారాలన్నిటినీ, కంపెనీ ఏర్పరచుకొన్న పాలకసమితి నిర్వహిస్తుంది. గవర్నర్, డిప్యూటీగవర్నర్, ఇరవైనలుగురు సభ్యులు, వీరితో ఏర్పడింది ఈ పాలకసమితి. కంపెనీ ఆంతరంగిక వ్యవహారాలను నిర్వహించే అధికారం ఇంగ్లాండు రాజు చేతిలోను, ప్రివీకౌన్సిలులోను నిహితమైఉంటుంది. ఇవి ప్రపత్రంలోని ముఖ్యవివరాలు. ఇంగ్లాండురాజుకు గల పరమాధికారాన్నిబట్టి ఇచ్చిన ఈ ప్రపత్రం ప్రకారం, కంపెనీ ఆస్తిపై అధికారము, సభ్యులపైనా, ఉద్యోగులపైనా క్రిమినల్ న్యాయాధికారము, వాణిజ్యంపై ప్రత్యేకాధికారము,- కంపెనీకి సిద్ధించినవి.

కంపెనీలో ఎక్కువ శ్రద్ధాసక్తులను వహించిన ఎలిజబెత్‌రాణి, కంపెనీ మూలధనానికి అనుదానాన్ని కూడా ఇచ్చింది. ఈ విధంగా ప్రారంభించబడిన కంపెనీ, ఆ కాలపు

వాణిజ్యవాదనీతికి, సరియైన లక్ష్యంగా ఏర్పడింది. ప్రపత్రంద్వారా సిద్ధించిన, ఏకస్వామ్య శాశ్వత ఇండియావాణిజ్యాన్ని, సాయుధబలంతో జరిపిన అతివిస్తృత సముద్రవాణిజ్యం"- అని దీనిని వర్ణించినారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ చరిత్ర, ఒకే విధంగా జరిగిందికాదు ; అవస్థావైవిధ్యంతో ఏర్పడినట్టిది. మొదటి నూరు సంవత్సరాల చరిత్రలో కంపెనీ, మూడువర్గాల సమస్యలను ఎదుర్కోవలసివచ్చింది. రాజుయొక్క పరమాధికారంపై ఆధారపడినట్టిది, కంపెనీయొక్క వాణిజ్య ఏక స్వామ్యాధికారం. దీని స్వభావాన్నిబట్టి ఏర్పడినవి మొదటి వర్గపు సమస్యలు. కంపెనీ నిగమనం పూర్తియైన వెంటనే, ఇంగ్లాండు రాజ్యవంశం, మారిపోవడం జరిగింది. స్టూవర్ట్‌లు రాజ్యానికి రావడంతో, ప్రజలకూ రాజులకూ మధ్య, రాజకీయ సంఘర్షణ ప్రారంభమయింది.

*1. మొదటి సమస్య-కంపెనీయొక్క ఆంతరంగికములైన చిక్కులు* : జేమ్స్ I (1603-25), కంపెనీకి ఆలంబనాన్నీ రక్షణనూ కలిగించినాడు. ఎలిజబెత్ 1600 లో ఇచ్చిన ప్రపత్రాన్ని బలపరచి, పదహైదేండ్ల ప్రపత్రకాలావధిని శాశ్వత కాలావధిగాచేసి, కంపెనీస్థితిని బలవత్తరం కావించెను. అవిమ్మట తాను కూడా కంపెనీలో భాగస్థుడుగాచేరి, తన అధికారాలంబనాన్ని చేకూరుస్తానని, తన ఆసక్తిని ప్రదర్శించెను. కాని, చిక్కు పరిస్థితులను తెచ్చిపెట్టగల రాజభాగస్వామ్యాన్ని ఇష్టపడక, కంపెనీ ఎట్లోతప్పించుకొంది.

వాణిజ్యంలో, కంపెనీకిగల ఏకస్వామ్యాధికారాన్ని భగ్నంచేసే ప్రయత్నాలు, జేమ్స్ I కాలంలోనే ప్రారంభమై ఉండినవి. ఛార్లెస్ I పార్లమెంటుతో కలహించి, కంపెనీకి ఆలంబనం ఇచ్చే విషయంలో, నిశ్చితాభిప్రాయం లేనివాడై ఉండెను. తనకు ధనం ఎక్కువగా అవసరం ఉన్నందువల్ల, ఈస్ట్ ఇండియాతో వాణిజ్యం జరపడానికి కావలసిన అనుజ్ఞాపత్రాన్ని (License) కోర్టెన్స్ అసోసియేషన్, అనే పోటీ కంపెనీకి ఇచ్చి, ప్రోత్సహించెను. అంతట, దీర్ఘకాల సంఘర్షణ సాగింది. కట్టకడపట 1657 లో, క్రామ్‌వెల్, ఈస్ట్ఇండియా కంపెనీకి నూతన ప్రపత్రాన్ని ఇచ్చి, ఈ సంఘర్షణను అంత మొందించినాడు. ఈ ప్రపత్రం మూలంగా కంపెనీ, సంయుక్తము అవిచ్ఛిన్నము ఐన- ఉమ్మడి వాటా కార్పొరేషన్‌గా ఏర్పడింది. ఇతర కంపెనీలపోటీ, ఈ విధంగా తొలగింపబడింది.

కంపెనీకి, క్రాంవెల్‌చేసిన ఈ సహాయాలు, రాజుగా పునఃస్థాపితుడైన ఛార్లెస్ II కు, క్లిష్టపరిస్థితిని తెచ్చిపెట్టినవి. కాని, కంపెనీవారు, అమితమైన రాజభక్తిని ప్రదర్శిస్తూ, అప్పుల రూపంలో మితిలేని బహుమతులను రాజుకు సమర్పిస్తూ, కడపటికి, అతని అభిమానాన్ని సంపాదించుకొనిరి. దీనికి ప్రతిరూపమైన ఆధారంగా, ఛార్లెస్ II కంపెనీకి, ఏకస్వామ్యాన్ని స్థిరపరచే ప్రపత్రాలను అనేకంగా, ఇచ్చినాడు. కంపెనీవారు ఆక్రమించియుండిన ప్రదేశాలను, రాజనీతి యుద్ధనీతులను ప్రయోగించి వారికి దక్కేటట్లు చేయడమేకాక, వారి అధికారశక్తులను ఎక్కువకావించినాడు. కోటలు మొదలైన రక్షకస్థానాలను కట్టించి, వాటికి తగిన సైన్యాలను ఇంగ్లాండునుంచి రవాణాచేయడం, ఇతడుచేసిన ప్రధానకార్యాలు. ఇండియా పశ్చిమ తీరంపై అంతటా అధికారాన్ని వహించగల బొంబాయిరేవును కంపెనీకి బదిలీచేయడం, ఇతడుకావించిన ఉపకారాలన్నిటిలోనూ ఎక్కువ ప్రయోజకమైనది. ఇంగ్లాండుకు వలస స్థానంగా ఏర్పడిన బొంబాయిలో, ఒక సైన్యస్థావరాన్ని ఏర్పరచుకొన్నారు. దీనిసహాయంతో

కంపెనీ, బంగాళాఖాతంనుంచి, మధ్య అట్లాంటిక్ సీమవరకూ, తన సైనికాధికారాన్ని చెలాయించగలిగింది.

స్టూవర్టుల పరిపాలన అంతమయ్యేనాటికి, "కంపెనీ మాతృదేశంపై ఆధారపడనట్టి సంస్థగా సిద్ధించినప్పటికీ, ఇంగ్లాండు, ప్రభుత్వాధికారాలను ఇండియాపై నెరపుతూ వచ్చింది. చెలామణి ద్రవ్యాన్ని ముద్రించుకోవడము, పన్నులను విధించడము, రేవుపట్టణాలను నిర్మించడము, సైన్యాలను పోషించడము, యుద్ధచర్యలను నడపడము, సంధికార్యాలను నడపడము,- మొదలైన ప్రభుత్వకార్యాలన్నీ కంపెనీకి హస్తగతమైనవి." కంపెనీ వ్యవహారాలు అతి శీఘ్రంగా విస్తరించినవి; అమితలాభాలు చేకూరినవి. కంపెనీ ఋణపత్రాల విలువ బాగా పెరిగిపోయింది. షేరుధర, 100 పౌనులనుంచి 360 పౌనులు, తర్వాత 1683 నాటికి 500 పౌనుల వరకు పెరిగింది. కంపెనీ వాణిజ్యం గమించడానికి సాధ్యముకాని విధంగా, పెరిగింది. అందువల్ల, "ఇంగ్లాండు వాణిజ్యంలోని సగంభాగాన్ని, కంపెనీవారు సంగ్రహించివేస్తున్నా"రనే దోషారోపణకు కూడా అవకాశం కలిగింది.

1683లో జరిగిన విప్లవంఫలితంగా, రాజుయొక్క అధికారం, పార్లమెంటుకు బదిలీ అయింది. కంపెనీకిగల ఏకస్వామ్యాధికారాన్నిగూర్చి ఇదివరలో కావించిఉంచిన ఆక్షేపణను, మళ్లీ లేవదీసిరి. కంపెనీ విఘటనమైపోకుండా, రక్షించుకోడానికి డైరెక్టర్లు తమ శక్తిసామర్థ్యాలను, పూర్తిగా ఉపయోగించిరి. మంత్రులకూ, రాజాస్థానానికి, మితిలేని లంచాలనుపోసిరి. ఇంత జరిగినాకూడా, 1698లో, పార్లమెంటు ఒకచట్టాన్ని పాలితంచేసి, నూతన ఈస్ట్ ఇండియా కంపెనీని స్థాపించిరి. దీనితో, ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది.

రాజు ప్రసాదించిన ప్రపత్రంపై ఆధారపడిన పూర్వపుకంపెనీ, పార్లమెంటు చట్టాన్ని ఆధారంగా చేసుకొని ఏర్పడిన కొత్తకంపెనీ,- ఈ రెంటికీ బాహాటమైన సంఘర్షణ సిద్ధించింది. ఈ రెండింటిమధ్యా, పదిసంవత్సరాల కాలం యుద్ధంసాగింది. తుదకు, 1708 నాటి గోడాల్ఫిన్ మధ్యవర్తి తీర్పుప్రకారం (Godolphin award) రెండు కంపెనీలు ఏకంగా లీనమైనవి.

వాణిజ్యవాదపద్ధతికి చెందిన లక్షణాలన్నీ ఈ సంయుక్త కంపెనీలో సంయోగం పొందిఉన్నవి. ఏకస్వామ్యాధికారము సాయుధబల వ్యాపారము, వలసరాజ్య నిర్మాణము,- అనేవి, ఈ లక్షణాలు. ఈస్ట్ఇండియా కంపెనీ, కేవలం బ్రిటిషుదేశము యొక్క వాణిజ్యాన్ని విస్తరింపచేయడానికై ఏర్పరుపబడిన కంపెనీగా కనబడడంలేదు. రాజ్యముయొక్క (ఇంగ్లాండుయొక్క) సమస్తాధికారాలను, సార్వభౌమత్వాన్ని అప్పగించి, దూర్పుఖండాలకు పంపిన ఇంగ్లాండు ప్రభుత్వప్రతినిధి ఈ కంపెనీ అనడం, వాస్తవం".

*2. రెండోసమస్య - ఈస్ట్ ఇండియాకంపెనీ ప్రతిస్పర్ధులు* : ఇండియా వాణిజ్యంలో ఏకస్వామ్యాన్ని నిలుపుకొనే ప్రయత్నానికి సంబంధించినవి, మొదటి వర్గపు చిక్కులు. సాయుధ బలప్రక్రంలో, కంపెనీయొక్క స్థానాన్ని స్థిరపరచుకొనే ఉద్యమానికి సంబంధించినట్టివి రెండోవిధమైన చిక్కులు. తన దేశాన్ని సంపన్నంగా చేయడానికి, ఇతర దేశాలకు నష్టం కలిగించక తప్పదు, అనే ప్రబలవిశ్వాసంపై ఏర్పడింది సాయుధబల వాణిజ్యవాదం.

ఈస్ట్ ఇండియా వాణిజ్య రంగంలో మొదట ప్రవేశించినవారు పోర్చుగీసువారు.

ఇండియాకు సముద్ర మార్గాన్ని కనిపెట్టి, ముస్లిము దేశాల నౌకలను హిందూమహాసముద్రంపై నుంచి వెడలగొట్టి ఉండిరి. వాణిజ్య పద్ధతులను ఏర్పరచడానికి కూడా వీరే మూలకర్తలు. కోటలను నిర్మించుకొని, వాటిలో సైన్యాలను, మందు గుండు సామగ్రిని, యుద్ధ పరికరాలను జమకూర్చుకొని, క్రైస్తవేతరులపై యుద్ధంసాగిస్తూ ఉండిరి. తమ క్రీస్తు మతంలో చేరిన వారిని తప్ప ఇతరులను తమ కత్తులకు బలిఇస్తూ, ప్రజలను ఫిరంగి ముఖాలలో పెట్టి ముక్కముక్కలుగా పేల్చివేస్తూ, కంకణాలను, కర్ణాభరణాలను, లాక్కోడానికై స్త్రీల చేతులను, చెవులను కోసివేస్తూ, స్త్రీ శిశు వివక్షలేకుండా, సామూహికంగా ప్రజలను సంహరిస్తూ, అమానుషకృత్యాలను విచ్చలవిడిగా, వీరు జరిపినారు. భయానకమైన హింసాకాండను ప్రవర్తింపచేసి, మానవరక్త కళంకితమైన తమ వర్తకాన్ని సాగించుకొనిరి. ఇండియా యువకులను సైనికులుగా తీసుకొని, వారిని, తరిఫీదుచేసి, తమ సైన్యంలో చేర్చుకోడానికి, ఏషియాలోని రాజుల పరస్పర స్పర్థలను అవకాశంగా తీసుకొని, తమ సామ్రాజ్యాన్ని విస్తరించుకోడానికి, దారిచూపినవారు పోర్చుగీసులే. దురభిమానము, డాంభిక ప్రదర్శనము, వైభవాట్టహాసము, శీలభ్రష్టత,-మొదలైన దుర్లక్షణాలు వీరికి సహజాతములు. తూర్పు దేశాలకు రావడానికి సాహసించిన పాశ్చాత్య దేశీయులలో పోర్చుగీసువారు, ప్రప్రథములే కాక, అధమాధములు కూడా. ఆబ్బేరేనాల్ (Abbe Raynal) వీరిని ఈ విధంగా చిత్రించినాడు ;-"అత్యుగ్రక్రౌర్యంతో కూడిన మతోన్మాదము, సముద్రతీరాన్ని ఆశ్రయించుకొని ఉన్న అన్ని జాతులవారికీ తీవ్రమైన ఉపద్రవము, అతి స్వార్థపరత్వంతో కూడిన విరోధము, అత్యాశ, క్రౌర్యము, వ్యభిచారాది దుర్వర్తనము,-మొదలైన ప్రవృత్తులుగల పోర్చుగీసుజాతి, చీడపట్టి పుచ్చిపోతున్నజాతి." "స్త్రీ సహజమైన స్వభావం వారి సైన్యాలలో దట్టంగా వ్యాపించింది ... ... క్రమశిక్షణ, అధికారవిధేయత, కీర్తికాంక్ష, అనే వీర లక్షణాలు ఏవీ, సైనికులకుగాని, అధికారులకుగాని, ఉత్సాహకారకములు కాలేదు." వీరి దుష్ప్రవృత్తికి తగినట్లుగా శీఘ్రకాలంలోనే, తమ దుష్కర్మ ఫలాన్ని అనుభవించినారు. ఉత్తరదేశాల ప్రొటెస్టెంటు రాజ్యాలు వీరి సామ్రాజ్యాన్ని పడదోసి, తూర్పు సముద్రాల నుంచి వీరిని పారదోలిరి.

స్పెయిన్ రాజైన ఫిలిప్ II, 1580 లో పోర్చుగల్ సింహాసనాన్ని ఆక్రమించుకొన్నాడు. ఆ తర్వాత, అరవై సంవత్సరాల దాకా రెండు దేశాలూ ఒకే రాజు పరిపాలనలో, సంయుక్త రాజ్యాలుగా నిలిచిపోయినవి. ఈ రెండూచేరి, రోమన్ కాథొలిక్ మతానికి రక్షక దుర్గంగా నిలిచినవి. కాబట్టి, యూరోపులోని ప్రొటెస్టెంట్ రాజ్యాల దాడికి ఇవి గురికావడం సహజమైనదే. మత సంస్కరణ ఉద్యమానికి పురోగామిత్వం వహించింది, హాలండ్‌దేశం. స్పెయిన్ దేశపు అధీశతకు ఎదురు తిరిగి, హాలండ్ 1579, లో, స్వాతంత్ర్యాన్ని సాధించుకొంది. కాని, రెండుదేశాలమధ్యా, యుద్ధచర్యలు నడుస్తూనే ఉండినవి. ఆకాలంలో, సముద్రాలపై అధికారంకల యూరోపు రాజ్యాలన్నిటిలోనూ, అత్యంతనూ శక్తివంతమైనది హాలండుదేశం. స్పెయిన్ పోర్చుగలుల సంయుక్త రాజ్యంతో, హాలండు రాజ్యానికి ఏర్పడిన సంఘర్షణలో, ప్రొటెస్టెంట్ రాజ్యమైన ఇంగ్లాండు, హాలండుకు తోడ్పడింది. బ్రతుకుచావులతో కూడిన ఈ మహాయుద్ధంలో, స్థలసేనలు, నౌకాదళాలు, వర్తకనావలు,-అన్నీ ఉపయుక్తమైనాయి. పర్యవసానంగా, కాథొలిక్ రాజ్యాలు పూర్తిగా ఓడిపోయినవి. వీటి ఏక

స్వామ్య వాణిజ్యం నశించిపోయింది.

తూర్పులో జరిగిన యుద్ధంలో ప్రధానభారమంతా, హాలండ్‌దేశంపై పడింది. స్పైస్ ద్వీపాలు, మలై ద్వీప జలసంధులు, శ్రీలంక, గుడ్‌హోప్ అగ్రము,- అనే ప్రదేశాలను ఆక్రమించి ఉండిన పోర్చుగీసువారిని, పారద్రోలిరి. కాని, ఈ ప్రాంతాలను తమ అధికారంలోనికి తెచ్చుకొన్న తర్వాత, వీరు కూడా, పోర్చుగీసు వారి వాణిజ్య విధానాన్నే అవలంబించిరి. ఏకస్వామ్యము, చౌకగా సరకులనుకొని, తమ వస్తువులను ఎక్కువ ధరలకు అమ్మడము, దయాదాక్షిణ్య రహితంగా దేశవాసులను స్వార్థం కొరకు ఉపయోగించుకోవడం, కఠినమైన పరిపాలన సాగించడము,-మొదలైన చర్యలన్నీ వీరు కూడా పాటించినారు.

పోర్చుగీసువారిని డచ్చివారు ఈప్రాంతాల నుంచి తొలగించినవారు. కాబట్టి, ఈ ప్రాంతాలు తమ వాణిజ్యానికి ప్రత్యేకించబడినవిగా భావించి, ఇంగ్లీషువారి వాణిజ్య కార్యకలాపాలను సహించలేకపోయిరి. ఈ రెండు దేశాల ఉద్దేశాలకూ యూరోపులో ఐక్యం కలిగి ఉండినప్పటికీ, అస్థిరమైన మైత్రి రెండు దేశాలమధ్యా ఏర్పడి ఉండినప్పటికీ, ఇప్పుడు మాత్రం, ఇంగ్లీషువారిని వాణిజ్యరంగం నుంచి, బహిష్కరించడానికి, డచ్చివారు పూనుకొన్నారు. ఈ ప్రయత్నంవల్ల ఏర్పడిన సంఘర్షణ, ఆంబోయినా సామూహిక సంహారం (1623) అనే సంఘటనతో అంతమయింది. తత్ఫలితంగా, ఇంగ్లీషువారు ఈ ద్వీప మండలాన్ని వదలిపెట్టి, ఇండియాదేశానికి మాత్రమే తమ వాణిజ్యోద్యమాన్ని పరిమితం చేసుకోవలసి వచ్చింది. ఇండియాలోను, ద్వీపమండలంలోను కూడా తమ వాణిజ్య ప్రయోజనాలను రక్షించుకోవడం, దుస్తరమైన కార్యమని, తమ సామర్థ్యానికి మించినదని, డచ్చివారు కూడా గ్రహించిరి. అంతతో, స్పైస్ ద్వీపాలను మాత్రమే తమ వాణిజ్యానికి రంగంగా చేసుకొనిరి.

ఈ విధంగా, డచ్చివారు ఇండియానుంచి విరమించుకోడానికి, యూరోపులోని పరిస్థితి ప్రధానహేతువు. ప్రతి స్పర్ధరాజ్యాలు, శత్రురాజ్యాలు, హాలండు చుట్టూమూగి, ఒత్తిడి చేయసాగినవి. తూర్పుద్వీపమండలిని తమ ఏకైక స్వామ్యాధికారంలోనికి తెచ్చుకొన్న వెంటనే, యూరోపుఖండ యుద్ధాలలో డచ్చివారు దిగవలసి వచ్చింది. మొట్టమొదట, స్పెయిన్ దేశంతో యుద్ధం చేయవలసివచ్చింది 1648లో చేసుకొన్న వెస్ట్‌ఫ్యాలియా సంధి ఒడంబడికతో, ఈ యుద్ధం ముగిసింది. ఆ తర్వాత, 1652, 1665లలో, ఇంగ్లాండుతో యుద్ధాలు సిద్ధించినవి. కడపట, ఫ్రాన్సుతో సిద్ధించిన యుద్ధం, 1672 మొదలు 1713 దాకా జరిగింది. హాలండ్‌వంటి చిన్నదేశంలోని సైనికశక్తి, విత్తసమర్థతా, నిరంతరంగా బైటికి ప్రవహించి పోవడంవల్ల, దేశంలోని మూలాధారాలు ఖాళీ ఐపోకతప్పలేదు. ...... ఇంగ్లాండుదేశం తన చిక్కులనుంచి, అంతర్యుద్ధాలనుంచి, రాజకీయ విప్లవంనుంచి, బైటపడేనాటికి, హాలంచ్ దేశం, బలహీనమై ఉండినది. అధికారానికై ఇంగ్లాండుతో పోటీచేసే శక్తిసామర్థ్యాలులేని రాజ్యంగా సిద్ధించింది.

*3. మూడోసమస్య - ఈస్ట్ ఇండియా కంపెనీ వసతిస్థానాలు :* పోర్చుగీస్ వారితోను, డచ్చివారితోను జరపవలసివచ్చిన యుద్ధాలఫలితంగా, ఈస్ట్‌ఇండియా కంపెనీవారు, ఇండియాలో మాత్రమే, తమ భాగ్యాన్ని సంపాదించుకోవలసి వచ్చింది. నివాసస్థానాలను ఏర్పరచుకోడానికై వారుచేసిన ప్రథమప్రయత్నాలు ఫలించలేదు. హాకిన్స్‌కాని, సర్ థామస్‌రో కాని, ఎక్కువగా ఏమీ సాధించలేకపోయిరి.

ఒక కర్మాగారాన్ని స్థాపించుకోడానికి అవసరమైన చక్రవర్తి ఫర్మానాను సంపాదించుకోడానికై ఆదిలో ఇంగ్లీషుకంపెనీవారు చేసిన ప్రయత్నాలను, పోర్చుగీసు జెసూయిట్లు, మొగల్‌రాజాస్థాన కులీనులు, భంగపరచిరి. తర్వాతికాలంలో, అనగా, 1603లో, జహంగీరు అనుమతిని వీరు సంపాదించుకొనిరి; కాని, స్థానికగవర్నర్ ప్రతిబంధకాలను కల్పించెను. ఆరోసముద్రయానాన్ని చేసిన నౌకలకు అధ్యక్షుడైన మిడల్‌టన్, గుజరాతు ఎర్రసముద్రాల మధ్య ఇండియా పడవల రాకపోకలను అరికట్టి, (1611), గవర్నరుపై ఒత్తిడి సాగించినాడు. 1612, 1615, లలో, స్వాలీకి అవతలి ప్రదేశంలో, బెస్ట్, డౌన్‌టన్, అనే ఇంగ్లీషు నౌకాధికారులు పోర్చుగీసువారిపై విజయాన్ని సాధించిరి. ఈ విజయాలతో, గవర్నరు సంశయం తీరిపోయింది. ఇంగ్లీషువారు సూరత్‌లో స్థానాన్ని ఏర్పరచుకొనిరి.

కాని, ఆదరణతో ప్రసాదించిన ఈ రియాయితీని, ఆంగ్లేయులు దురుపయోగం కావించిరి. ఆంగ్లేయులకు సముద్రాలపై అత్యుచ్చాధికారం సిద్ధించిఉండినది. ఈ అధికారాన్ని దుర్వినియోగం కావించుకొని, "గుజరాతీలు ఎర్రసముద్రంపై సాగిస్తూఉండిన వాణిజ్యాన్ని తామే కబళించివేసి, గుజరాతీలను తోసివేసిరి". దీనితో, భారతచక్రవర్తితో శత్రుత్వాన్ని తెచ్చిపెట్టుకొన్నారు. "ఈ మొగలుల స్వభావం నాకు తెలుసు. ఒకచేత కత్తిని, మరొకచేత వినీత రాజదూత లాంఛనాన్ని, పట్టుకొని వీరితో వ్యవహారం జరపడం ఉత్తమమైన పద్ధతి". అని, కంపెనీవారికి, రో (Roe) ఉపదేశించినాడు. ఇతని పురోహితుడైన ఎడ్వర్డ్‌టెర్రీ, డచ్చివారి ప్రవర్తనను గురించి చెప్పినవిషయం, ఆంగ్లేయులకు చక్కగా వర్తిస్తుంది. "వారు స్థానాలు ఏర్పరచుకొన్న ప్రతిప్రదేశంలోను రక్షకస్థానాలను ఏర్పరచుకొని, ఆత్మరక్షణ కావించుకోడానికి సర్వదా సన్నద్ధులైనిలిచి, దేశీయులకు భీతికల్పించి, తమ వస్తువులను వారికి బలాత్కారంగా విక్రయిస్తారు".

ఈ వాణిజ్య నీతిని అనుసరించి, 1611లో, మిడల్‌టన్, గుజరాత్ ఎర్రసముద్రాల మధ్య పడవల రాకపోకలను ఆపివేసినాడు. ఈ విధంగానే, క్యాప్టన్ కీలర్, క్యాలికట్ రాజా నుంచి మలబార్ తీరంలోని ఒక రేవుస్థలాన్ని సాధించుకోడానికి ప్రయత్నించినాడు. (1616). కాని, గుజరాతుతీరంలో ఆంగ్లేయులు రక్షకస్థానాలను నిర్మించుకోడానికి, తగిన సమయం ఇంకారాలేదు. మొగల్‌చక్రవర్తి ఇంకా బలవంతుడే కాబట్టి, వీరి ఆటలు సాగలేదు. గోవా చుట్టూ ఉన్న ప్రదేశాలలో ఆంగ్లేయులు కాలు పెట్టడానికి కూడా, పోర్చుగీసువారు ఒప్పుకోరు.

కాబట్టి, పడమటి సముద్రతీరంలో, భూభాగాన్ని సంపాదించుకోవడము, కోటలను నిర్మించుకోవడము, అనే ఆంగ్లేయుల ఆశలు పూర్తికాలేదు. వీరి కార్యకలాపాలను మొగల్ ప్రభుత్వం జాగ్రత్తగా గమనిస్తూ, వీరిని నిష్కర్షమైన హద్దులలో నిలిపింది. 1625లో, ఇంగ్లీషు కర్మాగారాధ్యక్షులకు బేడీలు తగిలించి, కారాగారంలో ఉంచింది ప్రభుత్వం. మరిన్నీ, కోర్టెన్స్ అసోసియేషన్ ఉద్యోగులు సముద్రంపై ఓడదోపిడీలు జరపగా, సూరత్ గవర్నర్, ఆ కంపెనీ అధ్యక్షుడైన మెత్‌వోల్డును, కంపెనీ సమితిని కారాగారంలో తోసినాడు. 18000 పౌనులు అపరాధపరిహార ధనంగాఇచ్చి, వారు జైలునుంచి బైటపడిరి.

ఆంగ్లేయులు ఈ విధమైన అవమానాలకు లోనౌతున్న సమయంలో, దక్కన్ ప్రాంతము, మొగలు అశ్వదళాల డెక్కల క్రిందపడి నలిగిపోతూ ఉండింది. 1626 లో,

ఔరంగజేబు దక్కనుకు రాజప్రతినిధిగా ఉండినాడు. అప్పటినుంచీ, మొగలు సామ్రాజ్యము, బహమనీ రాజవంశీయులు, శివాజీ నాయకత్వంలోని మహారాష్ట్రులు, భయంకరమైన పరస్పర యుద్ధాలలో మునిగి ఉండిరి. అందువల్ల, ఇండియా దేశాంతర్భాగాలలో నివాసస్థానాలను ఏర్పరచుకోవడం అపాయకరమయింది.

1647 లో, శివాజీ, తోరణ దుర్గంపైపడి ఆక్రమించడంతో, అతని జైత్రయాత్ర ప్రారంభమయింది. 1664 లోను, మళ్లీ 1670 లోను, అతడు సూరత్‌పై దండయాత్ర సాగించినాడు. ఈ దండయాత్రలవల్ల, ఆంగ్లేయుల పరిస్థితి విషమించింది. తమతో పోటీ చేస్తున్న యూరోపు దేశవర్తకులవల్లను, దేశీయరాజులవల్లను, తమకు కలుగుతున్న కష్టాలను ఎదుర్కొని, తమకు రక్షణను ఇచ్చే సైన్య సహాయం లేకుండా, వాణిజ్యం సాగించడం కష్టమయింది. భూభాగాలు, రక్షకస్థానాలు, సైన్య శిబిరాలు, సైన్యపరికరాలు, అవసరమైనవి. కాని, వీటిని సమకూర్చుకోడానికి ఆవశ్యకమైన మొగల్ సార్వభౌముని అనుమతి, సులభంగా లభించేదికాదు. అంతట, అదృష్టవశాత్తూ, ఛార్లెస్ రాజు II, 1668 లో, బొంబాయిని కంపెనీకి బదిలీచేసి ఇచ్చినాడు. వెంటనే, దానిని రక్షకస్థానంగా బలపరిచే ప్రయత్నాలు జరిగినవి. కాని, మొగలులకూ మహారాష్ట్రులకూ జరుగుతున్న పోరాటంవల్ల, పడమటి సముద్రతీరం, ఔరంగజేబు మరణించేవరకూ, అపాయానికి గురియై ఉండినవి.

ఇటువంటి క్లిష్టపరిస్థితుల నుంచి, తప్పించుకోడానికై, తూర్పుతీరాన్ని, ఆశ్రయించినారు కంపెనీవారు. ఇక్కడి పరిస్థితులు వీరికి అనుకూలమై ఉండినవి. 1565 లో, తళ్ళికోట వద్ద జరిగిన యుద్ధంలో, విజయనగర సామ్రాజ్యం కూలిపోయిన తర్వాత, సామ్రాజ్యం చిన్నచిన్న ముక్కలుగా ఛిద్రమైపోయింది. ఈ ప్రాంతాలలోని చిన్న రాజులూ, అధికారాన్ని వృద్ధిపరచుకొంటున్న గోలకొండ కుతుబ్‌షాహీలూ కలిగిస్తున్న విపత్తులకు లోనై ఉండిన ఒరిస్సా మొదలుకొని, కోరమాండల్ తీరంవరకుగల, బాలసోర్, పిప్లీ, పులికాట్, పట్టాపోలి, మసులీపట్టం, మొదలైన రేవుపట్టణాలన్నిటినీ, ఆంగ్లేయులు ప్రయత్నించిరి. ఈ ప్రాంతంలోని కొన్ని ప్రదేశాలలో కర్మాగారాలను కూడా నిర్మించుకొనిరి. కాని, వీటిలో ఏదీ కూడా తృప్తికరమైనదిగా తోచలేదు. కట్టకడపటికి, 1639లో వీరు మదరాసును ఆక్రమించుకొనిరి.

కాని, ఉత్తరభారత వాణిజ్యమంతా కేంద్రీకరించే గంగానదీ డెల్టాప్రాంతానికి,మదరాసు చాల దూరమైనది కాబట్టి, ఆంగ్లేయులదృష్టి బెంగాలువైపు మరలింది. ఇక్కడ డెల్టాలోని నైరుతికాలువయైన హుగ్లీపై, పోర్చుగీసువారు, పూర్వమే ఒక కర్మాగారాన్ని నిర్మించుకొని ఉండిరి; కాని 1632లో, షాజహాన్, వీరిని అచ్చటినుంచి పారదోలినాడు. 1650లో, ఈస్ట్ ఇండియాకంపెనీ, బెంగాల్ గవర్నరును ప్రాధేయపడి, వ్యాపారం చేసుకోడానికి అవసరమైన అనుమతిపత్రాన్ని అతనినుంచి గ్రహించింది. బెంగాలులోని కంపెనీ సంస్థాపనలన్నీ, మదరాసు 'ఫోర్ట్‌సెయింట్ జార్జ్' అధిపత్యానికిలోనై ఉండినవి.

1649 నుంచి, 1699 వరకు గల మధ్యకాలంలో, కంపెనీవాణిజ్యం విస్తారంగా అభివృద్ధిచెందింది. కాని, వర్తకం అభివృద్ధిచెంది, లాభాలు పెరగడంతో, కంపెనీవారి అత్యాశ కూడా పెరిగింది. 1661లో, పార్లమెంటు విడుదలచేసిన ప్రపత్రమూలంగా, యుద్ధచర్యకు, సంధివ్యవహారాలకు, న్యాయపరిపాలనకు సంబంధించిన అధికారాలు కూడా కంపెనీకి సిద్ధించినవి.

ఈ విధమైన నియోజిత అధికారంతో బలపడినవారై, కొందరువర్తకులు రాజ్యస్థాపన రాజ్యాధికారములను గూర్చి, కలలు కనసాగిరి. 1674లో, సర్ జోసయ్యా ఛైల్డ్, కంపెనీకి డైరెక్టరులలో ఒకడు ఐనాడు. తరువాత ఇరవైఐదు సంవత్సరాలదాకా, కంపెనీ సలహా సంఘంలో, ఇతని పలుకుబడి అధికమౌతూవచ్చింది. "అతని సలహాలను పాటించి, కంపెనీ, రాజకీయ ప్రాధాన్యాన్నీ, రాజకీయాధికారాన్నీ, సాధించుకోడానికి, మొట్టమొదటిసారిగా, ఉద్రేకంతో ముందుకు చొరబడింది." ఇతని దూరపుబంధువైన సర్ జాన్ ఛైల్డ్, బాల్యంనుంచీ ఇండియాలో ఉద్యోగవృత్తిలో ఉండినవాడు. ఇతడు, 1632లో, సూరత్, బొంబాయి నగరాంలోని కంపెనీ కర్మాగారాలకు అధ్యక్షుడైనాడు. వాణిజ్యంలో తమ కంపెనీతో పోటీచేస్తూ, తమ, ఏకస్వామ్యాన్ని భంగపరుస్తూ ఉన్న ఇతర ఆంగ్లకంపెనీలను, కంపెనీ ఆదాయాన్ని వృద్ధిచేసుకొనే ప్రయత్నాలకు ఆటంకాలు కలిగిస్తున్న మొగల్‌పరిపాలనను కూడా, ఎదిరించి నిలిచి, తమ కంపెనీకిగల ఆధిపత్యాన్ని సమర్థించుకోడానికి, ఈ ఇద్దరు ఛైల్డులూ, దృఢంగా నిశ్చయించుకొనిరి.

ప్రభుత్వాధికారం లేకుండా ఇండియా వాణిజ్యంలో ప్రవేశించిన ఆంగ్లేయ వర్తకులను, వాణిజ్యం నుంచీ బహిష్కరిస్తూ, నిర్బంధమైన ఆజ్ఞలను జారీచేసిరి. "తమ దేశీయులను అణచివేయడంలో, అన్ని విధములైన క్రూరచర్యలనూ ప్రయోగించినారు." ఇంగ్లాండు గ్రామసీమలకు చెందిన కొందరు శ్రీమంతులు, అజ్ఞానులై క్రోడీకరించిన ఇంగ్లాండు ప్రభుత్వపు చట్టాలు, అర్థరహితములైనవి. తమ స్వంత కుటుంబాలకు తగిన చట్టాలను కూడా చేసుకోలేని ఈ పల్లెసీమల శ్రీమంతులు, కంపెనీలను, విదేశవాణిజ్యాన్ని, నిర్దేశించగల చట్టాలను నిర్మించడానికి ఏ మాత్రమూ అర్హులుకారు." అని వాదించి, ఇతర ఆంగ్లవర్తకులపై చర్యకు పూనుకొనిరి. ఈ వర్తకులను పట్టుకొని, నౌకాధికరణ న్యాయస్థానాలకు ఈడ్చుకొని వచ్చిరి.

"సర్వకాలానికీ శాశ్వతము, స్థిరము, విస్తారము, ఐన ఆంగ్లరాజ్యాన్ని ఇండియాలో స్థాపించడానికి తగిన పునాదిని ఏర్పరచడం, సర్ జోసయ్యా ఛైల్డ్ యొక్క ఉత్కాంక్ష. అట్టి పునాదికి తగిన, శివిల్ మిలిటరీ శక్తులతో కూడిన రాజ్య తంత్రమూ విస్తారమైన రాజస్వమూ, ఏర్పడడం ప్రథమలక్ష్యం". జోసయ్యా స్థూలంగా నిర్దేశించిన ఈ విధానాన్ని కార్యరూపంలో నిర్వహించడానికి సర్ జాన్ సిద్ధమైనాడు. ఈ విధానాన్ని, ఇతడు ఎక్కువగా అభిమానించడానికి మరొక ముఖ్యకారణం కూడా ఉన్నది. సూరత్‌లోని దేశీయ వర్తకులకు కంపెనీవారు 231, 259 పౌనులు బాకీపడి ఉండిరి. ఈ పెద్ద మొత్తంపై వడ్డీ చెల్లించడం కూడా, కంపెనీకి అసౌకర్యంగా ఉండింది. కాబట్టి, పూర్వపు పద్ధతి ప్రకారం, బాకీ చెల్లించడానికి మారుగా, అప్పును చెల్లించకుండా తప్పించుకొనే మార్గాలను, సాధనాలను అన్వేషించడానికి పూనుకొనిరి". స్వభావంలోనే అప్రామాణికమైన పరిపాలన పద్ధతికి కార్యకర్తలైన వీరు, మొగల్ సార్వభౌమునితో కంపెనీకి యుద్ధాన్ని తెచ్చిపెట్టిరి. "బెంగాలు నవాబుపై యుద్ధచర్య జరపడమేకాక, ఆ ప్రసంగంలో కలుగచేసుకొనే మొగల్ చక్రవర్తితో కూడా, యుద్ధం చేయడానికి కృత నిశ్చయులమై ఉన్నామని, కంపెనీ అధికారమండలి, అట్టహాసంతో ప్రకటించింది".

విస్తారమైన పరిమాణంలో యుద్ధప్రయత్నాలు జరిగినవి. ఫిరంగులుబిగించిన సాయుధ

నౌకలను సమకూర్చుకొన్నారు. పెక్కు పదాతిదళాలను జతకూర్చుకొన్నారు. ఒక సమగ్రమైన నియతపదాతి దళాన్ని, సైన్యాధికారులతోసహా, ఇంగ్లాండునుంచి తెప్పించుకొన్నారు. మదరాసులోని రక్షకస్థానాన్ని భద్రపరచి, చుట్టూ గోడలను నిర్మించుకొనిరి. బెంగాలులోని చిటగాంగును బలాత్కారంగా ఆక్రమించి రక్షకస్థానాన్ని ఏర్పరచడానికీ, హుగ్లీని వదలిపెట్టి, సముద్రతీరంలో మరొక రేవును పట్టుకోడానికీ, నిశ్చితమయింది. పడమటి తీరంలోని ఇండియా నావలను ధ్వంసంచేసి, మొగల్ సామ్రాజ్యంపై యుద్ధం ప్రకటించడానికీ, ఏర్పాట్లు జరిగినవి. "దేశంలోని భౌగోళిక పరిస్థితులను, ప్రాంతాల మధ్యగల అంతరాలను, గమనించక, ఎదుటి బలాబలాలను ఏ మాత్రమూ లెక్కపెట్టక, హాస్యాస్పదమైన అవివేకంతో వచ్చిన ఈ విస్తార కార్యక్రమ ప్రణాళికలో, ఒక్క అంశాన్ని కూడా వీరు నెరవేర్చలేకపోయిరి." కంపెనీవారి వాణిజ్యవాదానికి సంబంధించిన బలపరాక్రమణ విధానం ఫలించడానికి తగిన సమయం ఇంకా సిద్ధించలేదు. మొగల్ సామ్రాజ్యం ఇంకా చైతన్యవంతంగానే ఉంది. సామ్రాజాధికారాన్ని నిర్భయంతో ధిక్కరించలేమని కంపెనీకి అర్థమయింది.

బెంగాలులో, హిజలీవద్ద దాగుకొని ఉండిన ఆంగ్లేయులను, నవాబ్ షయిస్తాఖాన్ సైన్యాలు పారదోలినవి; చిటగాంగును ఆక్రమించడానికి వారికి అవకాశం ఇవ్వలేదు. సూరత్, మచిలీపట్టణం, వైజాగ్‌పట్టణాలలోని ఆంగ్లేయుల కర్మాగారాలను చక్రవర్తి సైన్యాలు పట్టుకొన్నవి. ఇండియాలోని ఇతరప్రదేశాలలో కూడా మొగల్‌ప్రభుత్వం, అత్యంతవేగంతో కఠినమైన చర్యలను జరిపింది. సిద్దీనౌకాదళం బొంబాయిని ముట్టడించి, కోటతప్ప, తక్కిన ద్వీపభాగాన్నంతటినీ వశపరచుకొని ఆక్రమించుకొంది. అహంకారం నశించి, ఆంగ్లేయులు దీనావస్థకు వచ్చిరి; చరిత్రకారుడైన 'మిల్' వాక్యాలలో "నీచదశలోని అల్పులవలె తలవంచి శరణాగతులైనారు." "తాము చేసిన విద్రోహాపరాధాలను క్షమించవలసిందని ప్రార్థిస్తూ," దీనంగా మనవిపత్రాన్ని ప్రభుత్వానికి నివేదించుకొనిరి. ఆంగ్లేయ కంపెనీవారు చక్రవర్తి వద్దకు పంపిన ప్రతినిధుల మొరలను, చక్రవర్తి సాంతంగా విని, కొన్ని షరతులపై కొత్త ఫర్మానాను ఇవ్వడానికి అంగీకరించినాడు. (1690). ఇండియావర్తకులకు కంపెనీ ఇవ్వవలసిన బాకీలను చెల్లించడము, సామ్రాజ్యానికి కలిగించిన నష్టాలకు తగిన పరిహార ద్రవ్యాన్ని ప్రభుత్వానికి భర్తీచేయడము, సర్‌జాన్ చైల్డ్‌ను, ఇండియానుంచి పంపించివేయడము,- అనేవి చక్రవర్తి విధించిన షరతులు. ఈ షరతులను కంపెనీవారు పూర్తిచేసిన తర్వాత, చక్రవర్తి సైన్యం, బొంబాయిని వదలిపెట్టింది. పడమటితీరంలోను, బెంగాలులోను వర్తకం జరుపుకోడానికి, పూర్వం ఇచ్చిఉండిన అనుజ్ఞాపత్రాలు, ఇకముందు కూడా వర్తించేటట్లు, ప్రభుత్వం అనుమతించింది.

కంపెనీ, బెంగాలుకు మరలివచ్చి, సుతనాతి, గోవిందపూర్, కలకత్తా గ్రామాలను, నవాబువద్ద భాటకానికి తీసుకొని, జమీందారీగా ఏర్పడింది. తమవాణిజ్య రక్షణకోసం, కలకత్తాలో ఫోర్ట్‌విలియమ్ అనే కోటను నిర్మించుకొంది.

కంపెనీవారు గుణపాఠాన్ని నేర్చుకొన్నారు. ఆపై యాభై సంవత్సరాలదాకా, ఇండియా పరిపాలకుల అధికారాన్ని ఉల్లంఘించే ప్రయత్నాలకు పూనుకోలేదు. వాణిజ్యంలో తమతో ప్రతిస్పర్థ వహించి ఉండిన పోర్చుగీస్, డచ్చి, వర్తక సంస్థలు రెండూ, దేశం నుంచి తొలగిపోయినవి. దానితో, ప్రత్యేకమైన వాణిజ్య హక్కులు తమకు సిద్ధించినవి. ఇది కంపెనీకి

గొప్ప విజయం. ఇండియాలోని ప్రభుత్వ పరిపాలకులతో వ్యవహారాలను నడుపుకొనే అమూల్యానుభవం కూడా, వీరు సంపాదించు కొన్నారు. ఇండియాలోని ప్రధానములైన మూడుకేంద్రాలలోను, కంపెనీ, దృఢంగా స్థిరపడింది; పడమటితీరంలోని బొంబాయి, కోరమాండల్ తీరంలోని మదరాసు, బెంగాలు తీరంలోని కలకత్తా,-ఈ మూడు కేంద్రాలు. వీటిలో, ఏ, కేంద్రం కూడా మొగల్ సామ్రాజ్య సేనలు సులభంగా చేరగలిగినంత సమీపంలో లేదు. అంతేకాక, ఇండియాను చుట్టుకొని ఉన్న సముద్రాలపై ఆధిపత్యంగల రాజ్యం, ఈ మూడు కేంద్రాలను, చాలవరకు, సమర్థంగా రక్షించగలదు.

అత్యంతమూ, లాభదాయకమైన ఇండియా వాణిజ్యాన్ని, కంపెనీ, ఈ రేవు పట్టణాలలో అభివృద్ధిచేసుకొన్నది. కాని, వీరి వ్యవహారాలు, సులభంగా, సాఫుగా జరిగినవికావు. వాణిజ్యనీతి సూత్రాలను అనుసరించి, కంపెనీ డైరెక్టర్లు రెండు ప్రయోజనాల సాధనకై ప్రయత్నం సాగిస్తూ ఉండిరి. "రాజకీయమైన విశేషాధికారాన్ని సాధించుకోవడం, వారి మొదటి అత్యాశ. ఈ విశేషాధికారం, సాధ్యమైనంతవరకూ, కొద్ది మందికి మాత్రమే లభించవలెను, అనడం, రెండవది". తమ ప్రయోజనాలను సాధించుకొనే ప్రయత్నంలో వారు "ఒకవైపు రాజుదయకై ప్రాధేయపడుతూ, మరొకవైపు కృత్రిమాన్ని నడుపుతారు; అన్యాయంగా డబ్బును లాక్కొంటూ కూడా, దానిని అతిదైన్య ప్రదర్శనంతో కప్పిపుచ్చుతారు; తమ దురాశకు ముఖస్తుతిని కలుపుతారు. వ్యాపారము అధిక లాభకరంగా ఉన్నంతవరకూ, ఇండియా సరకులకు బదులుగా, ఏ వస్తువులను అమ్ముతున్నాము, అనే విషయంలో, వివేచనను ఏ మాత్రమూ వారు పాటించలేదు. దాసజనం, ఏనుగుదంతము, ఉన్ని, ఉన్ని వస్త్రాలు, తగరము, బంగారము,-మొదలైనవన్నీ వారు ఇండియాలో అమ్మి లాభాలు సంపాదించు కొన్నారు." ఈ పద్ధతులను ఇండియాలోను, తమ మాతృదేశమైన ఇంగ్లాండులోను కూడా, ఒకేవిధంగా ప్రయోగించినారు. ఫలితాలనుబట్టి నిర్ణయిస్తే,- వీరు ప్రయోగించిన ప్రయోజక విధానాలు పూర్తిగా అపేక్షిత ఫలకారులైనవి."

*ఈస్టు ఇండియాకంపెనీ రాజ్యావిస్తరణం :* ఆంగ్లవాణిజ్య కంపెనీలు రెండూ విలీనం కావడంతో, ఇండియా బ్రిటిష్‌దేశాల పరస్పర సంబంధాల చరిత్రలో నూతన యుగం ఆరంభమౌతుంది. "ఇంతవరకూ ఈస్టుఇండియా కంపెవారు, కేవలం వర్తకస్వభావాన్ని మాత్రమే ప్రదర్శిస్తూవచ్చినారు. నమ్రతను, విధేయతను ప్రదర్శిస్తూ, దేశీయరాజుల రక్షణకు, లేక, అన్యాయానికి గురిఔతూ, సుమారంలో ఉన్న ఇండియాదేశంలో తమ స్థానాన్ని సమర్థంగా నిలదొక్కుకొని, నిలిచిఉన్నారు. ఇకముందు, వీరు యుద్ధరంగంలో ప్రవేశించడమూ, రాజుల పరస్పర సంఘర్షణలలో అత్యాసక్తితో కలిసిపోవడమూ, మనం తప్పకుండా చూస్తాము". అని 'మిల్' భావిసూచన కావించిఉన్నాడు.

దీనికి, రాజకీయపరిస్థితి కూడా అనుకూలించింది. ఉట్రెచ్ట్ ఒడంబడిక (1713) మొదలు, ఆస్ట్రియన్ ఉత్తరాధికార యుద్ధంవరకూ (1740), యూరోపుఖండం, యుద్ధకల్లోలాలనుంచి ముక్తమై ఉండింది. లూయి XIV జరిపిన యుద్ధాలవల్ల, స్పెయిన్, హాలండ్, ఫ్రాన్సుదేశాలన్నీ అలసిపోయి, ఆ దుష్ఫలితాలనుంచి తేరుకోడానికి ప్రయత్నిస్తూ ఉండినవి. శత్రుదేశాలను రెచ్చకొట్టకుండా తప్పుకొనిపోయే రాజనీతిని అనుసరించిన వాల్‌పోల్, ఆ కాలంలో ఇంగ్లాండు ప్రభుత్వానికి నాయకుడు. ఈస్టుఇండియా కంపెనీవాణిజ్య ఏకస్వామ్యా

నికి, తీవ్రమైన ఆక్షేపణ ఏదీలేదు. ఇక, ఇండియాలోని మొగల్‌సామ్రాజ్యంలో, అరాజకత్వం వేగంగా వ్యాపిస్తూవచ్చింది. ప్రాంతీయగవర్నర్లు, మహారాష్ట్రులు దేశాన్ని అన్నివైపులా నాశంకావిస్తూ, భయానకపరిస్థితులను వ్యాపింపచేస్తూ వచ్చిరి. ముర్షీదాబాద్, లక్నో, హైదరాబాదులు, ఆ కాలంలో ఢిల్లీనగరానికంటె ఎక్కువ ప్రాధాన్యం వహించినవి. ఇండియాలోని ప్రాంతాలన్నిటిలోను, పూనాకు ఎక్కువ పలుకుబడి ఏర్పడుతూఉంది.

మొగల్ సామ్రాజ్యంపై సూటిగా దండయాత్ర సాగించడం అపాయకరమైన ప్రయత్నమని కంపెనీ, ఇదివరలోనే గ్రహించింది. కాని, 1689, డైరెక్టర్లు సిద్ధంచేసిన విధానాన్ని కంపెనీ ఏమాత్రమూ విసర్జించి ఉండలేదు. అనగా, "వ్యాపారనిర్వహణం మన బాధ్యత ఐనట్లే, ఆదాయాన్ని వృద్ధిపరచుకోవడంకూడా మన బాధ్యతే. ఇరవై ప్రమాదాలు మన వ్యాపారాన్ని భంగపరచినప్పటికీకూడా, మన బలాన్నీ, శక్తినీ, రక్షించినిలిపేది ఆదాయమే; ఈ అధికాదాయమే, మనము ఒక జాతిగా ఇండియాలో నిలవడానికి ఆధారమైనది. అది లేనంతవరకూ రాజ్యప్రపత్రంద్వారా ఒక సంస్థగాఏర్పడి, కేవలం వ్యాపారానికిమాత్రమే అర్హులై ఇండియాకు వచ్చిన అనధికార ఆంగ్లేయులుగా మాత్రమే. మనలను గణిస్తారు. అంతేకాక, బలవంతమైనరాజ్యం, వాణిజ్యంలో ఆసక్తివహించనంతవరకే, మన వ్యాపారంకూడా సాగుతుంది." అనే విధానాన్ని కంపెనీ ప్రవృత్తిలో పెట్టదలచుకొన్నది.

ఈ ఆదాయాభివృద్ధివిధానం, ఏ విధంగా కార్యరూపంలో ప్రవృత్తమయింది, అనే విషయం తంజావూరు వ్యవహారాలలో కంపెనీ కలిగించుకొన్న జోక్యంలో వ్యక్తమౌతుంది. ఈ విషయాన్ని, మిల్, అత్యుత్తమరీతిగా వర్ణించినాడు. "తంజావూరు పరిపాలకుడైన ప్రతాపసింగుతో, ఆంగ్లేయులు సంవత్సరాలుగా పత్రవ్యవహారాన్ని జరిపిఉండిరి; ఇంగ్లీషుజాతి అతనితో మైత్రినికోరుతూ ఉన్నదని పదేపదే వ్రాస్తూవచ్చినారు. తర్వాత, ఫ్రెంచివారికి విరుద్ధంగా తమకు సహాయం చేయవలసిందని ప్రార్థిస్తూ, దానికై ప్రయత్నం చేసినారు. కాని, ఇప్పుడు లేశమాత్రమైన ఉద్రేకకారణానికి కూడా, అతడు అవకాశమివ్వలేదు. దేవీకోటను వశపరచుకోవడంవల్ల తమకు లభించే సౌకర్యంతప్ప, ఇతరమైన ఏ ఇతరఉద్దేశాన్నీ అతనిపై ఆరోపించడానికి వీలులేదు. ఐనప్పటికీ, కంపెనీపరిపాలకులు సైన్యాన్నిపంపి, అతనిని రాజ్యభ్రష్టుని కావించినారు." సంవత్సరానికి 9000 పగోడాల రాజస్వం లభించే భూములతోసహా, దేవీకోటదుర్గం, ఈ విధంగా ఆంగ్లేయుల వశమైపోయింది.

ఈ మధ్యలో, ఇంకనూ విస్తారమైన భూభాగాన్ని సంపాదించుకొని, కోటలు నిర్మించుకోడానికై మెలకువతో ప్రయత్నాలు కావించినారు. సూరత్‌లో భూములుకొనడానికి కలకత్తా సమీపంలోని గ్రామాలను భాటకానికి తీసుకోడానికి, ఫరూఖ్‌సియార్‌వద్ద నుంచి 1716లో అనుమతి లభించింది. మద్రాసుసమీపంలోని ఐదుగ్రామాలను కంపెనీకి దానంగా ఇవ్వడంకూడా స్థిరమయింది.

పశ్చిమ సముద్రతీరంలో ఆంగ్రియా నాయకత్వంలోని మహారాష్ట్ర నౌకాదళంతో, పదేపదే సముద్రయుద్ధం సాగుతూనేఉంది. బెంగాలు నవాబుతో బాహాటమైన శత్రుత్వం తెచ్చిపెట్టుకోవడం రాజకీయరీత్యా, శ్రేయస్కరమైనది కాదని, కంపెనీ గుర్తించింది. తమ దుశ్చర్యలను కప్పిపుచ్చుకొనే ఉద్దేశంతో, పెద్దమొత్తాల ద్రవ్యాన్ని నవాబుకు కానుకలుగాపంపి, అతడు తమపట్ల ప్రసన్నుడుగా ఉండేటట్లు చేసుకోడానికి ప్రయత్నించిరి. "దస్తక్" పత్రా

లను దుర్వినియోగం చేయడము, విస్తారములైన వర్తకుల సరకులను గోప్యంగాపెట్టి రాజ్యానికి రావలసిన శుల్కధనాన్ని వంచించడము,- వీరు చేస్తూఉండిన న్యాయవిరుద్ధ కార్యాలకు ఉదాహరణలు".

అల్లావర్దీఖాన్ (1740-56) ఈ ఆంగ్లేయవర్తకులను నిష్కర్ష ఐన అదుపాజ్ఞలలో నిలిపి ఉండినాడు. వీరు దక్కనులో జరిపిన దుశ్చర్యలను బెంగాలులో పునః ఆరంభించడానికి, ఏమాత్రమూ అవకాశము ఇవ్వలేదు. కలకత్తాలోని కంపెనీ రక్షక స్థానాలను కూడా బలపరచుకోనివ్వలేదు.

రాజస్వాదాయం లభించే భూములను సంపాదించుకొనే కంపెనీ ఆశయం, పద్ధెనిమిదో శతాబ్దమధ్యకాలంవరకూ, పూర్తిగా సఫలం కాలేదు. కాని, వాణిజ్యవిషయంలో కంపెనీ, ఎక్కువ విజయాన్ని సాధించింది. 1708 లో ఇంగ్లాండునుంచి ఇండియాకు ఎగుమతిచేసిన వస్తువుల మొత్తం విలువ పూర్తి 61000 పౌనులుకూడా కాదు. 1748 నాటికి, వీటివిలువ 127,000 పౌనులకు పెరిగింది. ఇదేవిధంగా, ఇండియానుంచి ఇంగ్లాండుకు ఎగుమతి ఐన సరకుల విలువ, 500,000 పౌనులనుంచి, 1000,000 పౌనులగాకా, పెరిగింది. ఈమధ్య కాలంలో, కంపెనీ వాటాదారులకు ఎనిమిది, పది, శాతందాకా, లాభాంశాలు చెల్లించింది. 1744 లో 1000,000 పౌనుల రుణాన్ని, 1670 లో 4000,000 పౌనులకు మించిన రుణాన్ని, ప్రభుత్వానికి కంపెనీ ఇచ్చింది. ఈ విషయాన్నిబట్టి, కంపెనీ వాణిజ్యం, ఎంతటి ఉచ్చ్రయస్థితిలో ఉండిందో వ్యక్తమౌతుంది.

*ఆంగ్లేయులకు, ఫ్రెంచివారికి మధ్య ప్రతిస్పర్ధ* : ఇండియా వాణిజ్యంలో ఆంగ్లేయులకు సిద్ధించిన అతిశయలాభం యూరోపుదేశవర్తకుల ఈర్ష్యకు హేతువయింది. పోర్చుగల్, స్పెయిన్, హాలండుదేశాలు, ఇదివరకే పోటీనుంచి విరమించుకొన్నవి; ఇంగ్లాండుతో మళ్లీ పోటీ చేసే స్థితిలోలేవు. కాని, ఇండియావాణిజ్యాన్ని వశపరచుకొని, తూర్పుదేశాలలో తన ప్రాబల్యాన్ని విస్తరింపచేసుకోడానికి, ఫ్రాన్సు ప్రబల ప్రయత్నం చేసింది. 1664లో, కోల్‌బర్ట్, ఫ్రెంచి ఈస్టిండియాకంపెనీని స్థాపించి, ఉండినాడు. కాని, లూయీ XIV కాలంలో, స్పెయిన్, హాలండ్, రోము, సామ్రాజ్యంతో ఫ్రాన్సుజరిపిన యుద్ధాలవల్ల, ఈ కంపెనీ ఎక్కువగా పురోగమించలేకపోయింది. 1720లో, జాన్‌లా, ఫ్రెంచి ప్రభుత్వపు విత్తపరిస్థితిని సంస్కరించి, కంపెనీని పునః వ్యవస్థీకరించినాడు. అంతనుంచి, కంపెనీ వేగంగా అభ్యుదయాన్ని పొందింది. ఇండియాకు మధ్యదారిలో ఉన్న మారేషయన్ ద్వీపాన్ని, 1721 లో ఆక్రమించుకొని, 1725లో మాహేను, 1739లో, కారికాల్‌ను ఆక్రమించిరి. ఫ్రెంచి కంపెనీకి ముఖ్యస్థానంగా ఏర్పడిఉండిన పాండిచ్చేరీని, డచ్చివారు వశపర్చుకొని ఉండిరి. కాని, 1697 నాటి, రిస్‌విక్ ఒడంబడికతో, అది మళ్లీ ఫ్రెంచివారి వశమయింది. 1691 నాటికే, చందర్‌నగర్ ఫ్రెంచివారి అధీనమైపోయింది.

రాజకీయ ప్రాబల్య సంపాదన, వాణిజ్యోద్యమము, అనే, ద్వివిధమైన నీతిని, కొత్తగా సంఘటితమైన ఫ్రెంచికంపెనీ, అత్యుత్సాహంతో అనుసరించింది. దేశీయరాజుల దాడులకు లోనుకాకుండా, తన నివాసస్థానాలను బలపరచి, రక్షకస్థానాలను సుదృఢం కావించుకొన్నది. "సౌభాగ్యస్థితిలో ఉన్న నివాసస్థానాలవల్లను, సుదృఢములైన కొన్ని రక్షకస్థానాలవల్లను, కంపెనీకి, ఇండియాలో ప్రతిష్ఠ ఏర్పడుతుందని," ఫ్రెంచివారి నమ్మకము. కాని, 1740

తర్వాతనే, ఈ విధానాన్ని స్వేచ్ఛగా వీరు అభివృద్ధి చేసుకోగలిగినారు.

ఇండియాదేశంలో, కొంతభూభాగాన్ని వశపరచుకొని, దానిని ఒక సామ్రాజ్యంగా ఏర్పరచుకొనే అభిప్రాయానికి భావనాశక్తి సంపన్నమైన, డూప్లే మనస్సులో ఆకారం, ఏర్పడింది. ఫ్రాన్సునుంచి తగినంత ధనసహాయం రాకపోవడంవల్ల, కంపెనీ వాణిజ్య కార్యక్రమాలు కుంటుపడినవి.ఈ చిక్కుపరిస్థితి కారణంగా, డూప్లే, మనస్సులో ఈ అభిప్రాయం ఏర్పడింది. వాణిజ్యానికి అవసరమైన మూలధనాన్ని సేకరించడానికి, రాజస్వాదాయంగల భూములను వశపరచుకోవడం ఒక్కటే సాధనమని, ఈ సమస్యను పరిష్కరించడానికి రాజకీయాధికారం ఆవశ్యకమని, డూప్లే గ్రహించినాడు. "అమెరికాదేశము, ఇతర ప్రపంచ దేశాలు, యూరోపుజాతుల అధికారనియమాలకు లోబడకతప్పదని అతడు భావించి యుండినవాడు. ఇండియా విషయంలో కూడా ఈవిధంగా భావించి ఉండెనో లేదో కాని, ఇండియా దేశాన్ని సామ్రాజ్యంగాచేసి, ఫ్రాన్సుదేశానికి అప్పగించవలెనని నిశ్చయించుకొన్నాడు.

పాండిచ్చెరీలోని ఫ్రెంచికంపెనీ ఉన్నతసమితిలో మొదటి సభ్యుడుగా, డూప్లే, నియమితుడైనాడు. (1720). పదేండ్లతర్వాత, చందర్‌నగర్‌లోని ఫ్రెంచిస్థానానికి సర్వవిషయ విచారణ కర్తఐనాడు. ఆ తర్వాత, 1742లో, ఇండియాలోని ఫ్రెంచి సంస్థాపనలకు గవర్నర్ జెనరల్‌గా నియమింపబడినాడు. కర్ణాటక ప్రాంతంలోని చిన్నచిన్న రాజుల అంతర్యుద్ధాలలో భిన్నపక్షాలను వహించే అవకాశాలు, యూరోపుకంపెనీలకు అప్పటికే ఏర్పడి ఉండినవి. ఆ ప్రాంతాలలోని కల్లోలపరిస్థితులే ఇట్టి అవకాశానికి హేతువులు.

కర్ణాటకప్రాంతపు నవాబైన సాదతుల్లాఖాన్ మరణించడంతో, (1732), అతని అన్నకుమారుడు, దోస్తుఆలీ, సింహాసనాన్ని ఆక్రమించి ఉండెను. ఇతడు ఫ్రెంచివారితో మైత్రి చేసుకొన్నాడు. ఫ్రెంచి గవర్నర్ డ్యూమాస్ ప్రార్థనపై ఇతడు ఫ్రెంచివారికి ద్రవ్యాన్ని ముద్రించుకొనే అధికారాన్ని, ఢిల్లీ సార్వభౌమునినుంచి సంపాదించి ఇచ్చినాడు. అత్యధిక లాభ సంపాదనకు, ఇది ఒక మూలాధారంగా ఏర్పడింది. దోస్త్ ఆలీకి అల్లుడైన చందాసాహేబ్ అత్యాశాపరుడైన యువకుడు; తన ప్రయోజనాలను సాధించుకోడానికై, బలవంతులైన ఫ్రెంచివారి సహాయకమైత్రిని కోరినవాడు. కాబట్టి, తంజావూరు రాజ్యంపై దాడి చేసి, కారికల్‌ను పట్టుకొని, ఫ్రెంచివారికి అప్పగిస్తానని, ఫ్రెంచివారితో ప్రస్తావించెను. ఫ్రెంచివారి అంగీకారంపై, ఈ ప్రయత్నం సఫలమయింది. కారికల్‌ను, దానిచుట్టూ ఉన్న జిల్లాలను ఫ్రెంచివారు 1739 లో ఆక్రమించిరి.

ప్రతీపజలంవలె, ప్రశాంతంగా ఉన్న కర్ణాటక ప్రాంతంలో రాజులు పరస్పర కలహాలలోను, కుట్రలలోను, నిమగ్నులై ఉండిరి. అట్టి సమయంలో, రఘూజీ భోంస్లే, నారాయణరావులు యాభైవేల మరాఠా సైన్యంతో, బాంబువలె వచ్చిపడి, కర్ణాటకప్రాంతాన్ని కల్లోలపరచిరి. వీరిని ఆపడానికి ప్రయత్నించిన దోస్తుఆలీ, యుద్ధంలో మరణించినాడు. ఇతని వారసుడైన సఫ్దర్ ఆలీ, చందాసాహేబు, తమ కుటుంబాలను పాండిచెరీకి పంపి, రక్షించుకొనిరి. రఘూజీ, తిరుచినాపల్లిని ముట్టడించి, కోటను వశపరచుకొని, చందాసాహేబును ఖైదీగా పట్టుకొన్నాడు. ఆపైన, పాండిచెరీవైపు నడిచినాడు. కాని, తన్ను ఎదుర్కొడానికి, ఫ్రెంచివారు సంసిద్ధులై ఉండడం చూచి, వెనుకకు మరలిపోయినాడు.

ఫ్రెంచి గవర్నర్ డ్యూమాస్ ప్రదర్శించిన ధైర్యం, దక్కనురాజుల ప్రశంసా గౌరవా

లకు పాత్రమయింది. మహమ్మద్‌షా చక్రవర్తి, డ్యూమాసును, నవాబ్, మన్‌సాబ్, బిరుదులతో గౌరవించెను. నిజామ్-ఉల్-ముల్క్ గౌరవచిహ్నమైన దుస్తులను పంపించినాడు. కర్ణాటక నవాబు సఫ్దర్‌అలీ, అమూల్యములైన బహుమతులను పంపించెను. ఈ పరిస్థితులలో, డ్యూమాస్ గవర్నర్ పదవినుంచి, విశ్రాంతి తీసుకోగా, డూప్లే, గవర్నర్ అధికారాన్ని వహించెను. (జనవరి 1742).

పరిస్థితులు తృప్తికరంగాలేవని, డూప్లే వెంటనే, గ్రహించినాడు. బాకీపడిఉన్న రాజస్వాన్ని చెల్లించవలసిందని, కర్ణాటక నవాబును నైజాము ఒత్తిడిచేస్తూ, ఉండినాడు. ఫ్రెంచి వారికి ఆశ్రితుడైన చందాసాహేబు, మహరాష్ట్రుల ఖైదీగా ఉన్నాడు. కర్ణాటకప్రాంతంపై మళ్లీ దాడిసలిపి, కప్పమును వసూలుచేసుకోడానికి, మహరాష్ట్రులు మళ్లీ సిద్ధపడుతున్నారు. కంపెనీ పరిస్థితికూడా నిశ్చింతమై ఉండలేదు. ఫ్రెంచి నివాసస్థానాల ఆవశ్యకాలను తీర్చడానికి తగిన ధనం డైరెక్టర్లవద్ద లేదు. ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాల మధ్య యుద్ధపరిస్థితి ఏర్పడుతూఉంది; ఇండియాలోని కర్మాగారాలను భద్రపరచడానికి అవసరమైన ధనాన్ని కంపెనీ, పంపలేకపోయింది. ఇట్టి కష్టపరిస్థితులన్నిటినీ ఎదుర్కొని నిలిచింది డూప్లే యొక్క స్థిర నిశ్చయం. అతని మాతృదేశభక్తి, సమయోచిత వ్యవహారజ్ఞానము, ఉపాయకౌశలము, ఆ సందర్భానికి యోగ్యంగా ప్రవర్తించినవి.

ఆస్ట్రియాదేశపు ఉత్తరాధికారవిషయమై, మార్చి 1740లో, యూరోపులో యుద్ధం ఆరంభమయింది. ఇంగ్లాండు ఫ్రాన్సుదేశాలుకూడా ఈ యుద్ధంలో చిక్కుకొన్నవి. ఫ్రాన్సు ఇంగ్లాండుదేశాలకు సంబంధించిన రెండు వాణిజ్యసంస్థలూ, ఇండియాలో ఉండడం, పరస్పర అసంబద్ధమైన పరిస్థితి అనే విషయాన్ని, రెండుకంపెనీల కార్యకర్తలు గుర్తించిరి. తమ మాతృదేశాల అధికారుల అభిప్రాయాలకూ, ఆదేశాలకూ విరుద్ధంగా ప్రవర్తిస్తూ, తమ తమ వాణిజ్య ఏకస్వామ్యాధికారాన్ని ఇండియాలో నిలుపుకోడానికై పరస్పరం ఘర్షణపడుతూ వచ్చిరి. ఈ ఏకస్వామ్యాధికార సాధనకు, రాజకీయ ప్రభావము, భూభాగంపై ఆధిపత్యము ముఖ్యంగా ఆవశ్యకములని మొదట గుర్తించినవాడు, డూప్లే. తీవ్రములైన అనానుకూలాలకు, క్లిష్టపరిస్థితులకు లోనై ఇతడు వ్యవహరించవలసి వచ్చింది. ఫ్రాన్సుప్రభుత్వం అలసతకు లోనై, చైతన్యంలేనిదై ఉండినది. ఫ్రాన్సుదేశ కీర్తివైభవాలకై ఇండియాలో కష్టపడుతున్న తమ దేశీయులకు తగిన ఆలంబనాన్ని, సహకారాన్ని, లూయీచక్రవర్తి XV, అతని మంత్రులు, ఇవ్వలేకపోయిరి. ఫ్రెంచి వాణిజ్యకంపెనీ చాలభాగం, తన దేశప్రభుత్వంపై ఆధారపడినట్టిది. కాబట్టి దూరదృష్టిలేని, ప్రభుత్వం అనుసరించిన దుర్బలములు, చంచలములూ ఐన విధానాలవల్ల కంపెనీ కష్టాలకు లోనయింది. కంపెనీ వాణిజ్యం ఎక్కువగా వృద్ధి చెందింది; కాని. ఖర్చులు మితిమీరడంవల్ల, అధికమైన ఋణాలపాలయింది. ఇట్టి విషమపరిస్థితిలో, ఫ్రాన్సు ప్రభుత్వం, ఇండియాలోని తన సంస్థాపనలకు పంపవలసిన సహాయక ద్రవ్యాన్ని ఆపివేయడం జరిగింది.

ఇవన్నీ చాలనట్లు, కంపెనీ ఉన్నతనాయకుల మధ్య ఏర్పడిన ఆత్మఘాతుకసదృశములైన విభేదాలు, పరస్పర ఈర్ష్యాస్పర్థలు, సమిష్టి కార్యాచరణానికి ప్రతిబంధకములైనవి. ప్యారిస్‌నుంచి జారీచేసిన అసాధారణములు, విపరీతములు ఐన ఆజ్ఞలవల్ల, విసుగు, ఖేదము జనించినవి.

నాలుగు సంవత్సరాలకాలము జరిగిన యూరోపు యుద్ధం, ఫ్రెంచివారి విజయంగా పర్యవసానం పొందింది. ఈ వివిధములైన కష్టాలను అన్నిటినీ, డూప్లే, తన సహజసిద్ధమైన ప్రతిభా సంపదతో జయించినాడు. తన రాజనీతికౌశలంతో దేశరాజుల సహకారాన్ని సంపాదించి, దానిని ఆంగ్లేయులపై ప్రయోగించినాడు. ఫ్రెంచిసైన్యం తగినంత లేకపోవడం, ఒక గొప్ప లోపం. కాని, దేశీయులను సైన్యంలో చేర్చుకొని, వారికి పాశ్చాత్య శిక్షణను ఇచ్చి, ఈ లోపాన్ని పూర్తికావించుకొన్నాడు. సరియైన యుద్ధశిక్షణలేని దేశీయసైనికదళాల కంటె, సుశిక్షితులైన సైనికులు ఉత్కృష్టులు, అనేవిషయాన్ని, డూప్లే ప్రత్యక్షంగా నిరూపించినాడు. కర్ణాటక నవాబు అన్వార్-ఉద్-దీన్ కుమారుడైన మహఫూజ్‌ఖాన్ సైన్యాలకు, ఫ్రెంచ్ సేనానాయకుడు పరదీస్‌కు, అదయార్‌నదీతీరంలో సెయింట్‌థోమ్ వద్ద జరిగిన యుద్ధంలో [4-11-1746] సంపూర్ణమైన విజయం, అతిశీఘ్రకాలంలో, ఫ్రెంచివారికి సిద్ధించింది. పరదీస్ నాయకత్వంలో ఉండిన సైన్యము, 230 మంది యూరోపుసైనికులతోను, 700 మంది దేశీయ సైనికులతోను మాత్రమే ఏర్పడినట్టిది; వీరివద్ద ఫిరంగులు కూడా ఉండలేదు. ఫిరంగి సామగ్రితో, 10000 మంది సైనికులతో ఎదురుగా నిలిచింది నవాబు సైన్యం. అట్టి పరిస్థితిలో ఫ్రెంచివారి చిన్నసైన్యం అదయారునదిని దాటవలసివచ్చింది. అమితకష్టమైన ఈ యుక్తి చాలనమును (manoure) సమర్థతతో నిర్వహించిరి. సమర్థులు, ధైర్యశాలులుఐన నాయకులు, సుశిక్షితమైన ఈ చిన్న సేనావ్యవస్థను చక్కగా నడిపి, యుద్ధంలో విజయం సాధించిరి. సమంజసమైన స్వాభిమానంతో, మ్యాలెసన్, ఈ విజయాన్ని గురించి ఈవిధంగా వ్రాసినాడు. "ఇండియాలో విజయాన్ని సాధించిన ఏ యుద్ధంకూడా, దీనివలె స్మరణయోగ్యమైనదికాదు. ఇట్టి యుద్ధం జరగడం ఇదే మొదటిసారి కాబట్టి, ఇది ఎన్నటికీ మరవరాదు. అంతేకాక, సుశిక్షితుడైన యూరోపుదేశ సైనికుడు, ఏషియాదేశాల సైనికునికంటె అన్నివిధాలా పరమ శ్రేష్ఠుడు, అనే విషయాన్ని ఈ యుద్ధం ప్రత్యక్షంగా నిరూపించి, రెండు పక్షాలవారికీ అత్యాశ్చర్యం కలిగించింది." డూప్లే మదరాసును ఆక్రమించి, చాలవరకు సమస్తములైన కోరమాండల్ తీరప్రాంతాలనుంచి ఆంగ్లేయులను తరిమివేసెను.

ఐక్స్-లా-షాపెల్, సంధి ఒడంబడికతో (1748) యూరోపులోని యుద్ధం ముగిసింది; కాని, ఈ రెండుజాతుల ప్రతిస్పర్థుల మధ్య, ఇండియాలో శాంతి ఏర్పడలేదు. "అత్యాశకు ప్రేరణ కలిగి, పరస్పర ఈర్ష్యాభావం ప్రకోపించి, అధికరాజ్యసంపాదన ప్రలోభం చెయిపట్టి లాగుతూ ఉండగా, శాంతివల్ల వీరికి ప్రయోజనమేమి ?"

1748 సంవత్సరం జ్ఞాపకం ఉంచుకోతగింది. మహమద్‌షా చక్రవర్తి మరణించింది ఈ సంవత్సరంలోనే; అహమద్‌షా అబ్దాలీ ఇండియాపై మొదటిసారిగా దండయాత్ర జరిపింది కూడా, ఈ సంవత్సరంలోనే. నిజామ్-ఉల్-ముల్క్ మరణించినాడు. అంతతో, మస్‌నద్‌కై ఉత్తరాధికార యుద్ధం బయలుదేరింది. ఇందులో ప్రతిస్పర్థులైనవారు, మహరాష్ట్రులను, కర్ణాటక పరిపాలకుని, ఫ్రెంచివారిని, ఆంగ్లేయులను, తమ పక్షాలకు సహాయకులుగా తెచ్చుకొనిరి. కాని, త్వరలోనే, ఈ సంఘర్షణయొక్క స్వభావమే పూర్తిగా మారిపోయింది. ప్రతిస్పర్థులైన దేశీయరాజులకు సహాయకసైన్యాలుగా నిలవడానికి మారుగా, ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, తామే ప్రధానపాత్ర వహించి, తమ స్థానాధిక్యతకై పోరాడసాగిరి. తమ జాతులు రెండింటికీ యూరోపులో శాంతి ఏర్పడిందనే విషయాన్ని కూడా వీరు పాటించలేదు.

ఇండియాలోని ప్రభుత్వాలు తన నిర్దేశాన్ని అంగీకరించి, వాటి మూల సాధనము లన్నీ తన అధీనంలో నిలిపితేనే, ఆంగ్లేయులను ఇండియానుంచి పారదోలడం సాధ్య మౌతుంది అనే విషయాన్ని, ఫ్రెంచి స్థానాల గవర్నర్ జనరల్ డూప్లే, సూక్ష్మబుద్ధితో గ్రహించినాడు. దక్కనులోను, కర్ణాటకంలోను ఏర్పడిన ఉత్తరాధికార యుద్ధాలు దీనికి తగిన అవకాశాలను కలిగించడంవల్ల, డూప్లే వీటిలో ప్రవేశించి, ఈ రాజకీయ విధానాన్ని కార్యరూపంలో పెట్టగలిగినాడు. చక్కగా యుద్ధ శిక్షణను పొందిన తన యూరోపియ సైన్యాన్ని, తనకు కక్షిదారులైన రాజులకు సహాయంగా పంపి, వారి విజయానికి తోడ్పడి నాడు. ఇతడు, ఇతని సహాయ సేనాధిపతియైన, బుస్సీ, వ్యవహారాలను ఉపాయకౌశలంతో నిర్వహించడంవల్ల, 1748 నుంచి 1756 వరకూ, దక్షిణ ఇండియా ద్వీపకల్పంలో ఫ్రెంచి వారికి ప్రబలాధికారం ఏర్పడిఉండినది. డూప్లే, కార్యతః, కర్ణాటక ప్రాంతానికి నవాబుగాను, కృష్ణానదికి దక్షిణంలోని సమస్త భూభాగానికి గవర్నరుగాను, నియమితుడైనాడు. నైజామును కీలుబొమ్మగా చేసుకొని, బుస్సీ, దక్కను వ్యవహారాలన్నిటిపైనా, తానే ఆధిపత్యం వహించినాడు.

కాని, డూప్లే ప్రదర్శించిన వ్యవహార సామర్థ్య, ఉపాయకౌశలములు, బుస్సీ సాహ సోద్యమాలు, వెనుకంజ వేయని అతని ధైర్యస్థైర్యాలు, పర్యవసానంలో ఫలించక పోయి నవి. ఫ్రెంచివారి రాజకీయ వ్యవస్థ జీర్ణావస్థకు వచ్చి ఉండడమే, ఇందుకు ముఖ్య కారణము. ఫ్రెంచి రాజ్య వ్యవహారాలు బలహీనులైన రాజకీయవాదుల హస్తగతమైనవి. విత్త విష యంలో, ఫ్రాంసు ప్రభుత్వం దివాలా స్థితికి వచ్చింది. నౌకాదళం అశ్రద్ధకు, గురియై పోయింది. తన భావి దృష్టితోను, స్థిర నిశ్చయంతోను, ఇండియా భూభాగంలో, ఒక ఫ్రెంచి సామ్రాజ్యాన్ని నిర్మించిఉండిన, డూప్లేను, ఇట్టి పరిస్థితుల్లో ఫ్రాన్సు దేశానికి పిలి పించుకోవడం, ఫ్రెంచివారి భవిష్యత్తుపై తీరరాని దెబ్బగా పరిణమించింది. అతడు ఇండియా నుంచి 1755లో మరలిపోవడంతో, ఫ్రెంచి వారికి దక్కనుపై ఉండిన పట్టు సడలిపోయింది. తర్వాత జరిగిన సప్త వార్షిక యుద్ధంలో, ఆంగ్లేయులు ఫ్రెంచి వారిని తల ఎత్తనట్లుగా ఓడించిరి. ఈ ఓటమినుంచి ఫ్రెంచివారు మళ్లీ కోలుకోలేదు. ఈ సప్త వార్షిక యుద్ధం యూరోపులో, ఆగస్ట్ 1756 ప్రారంభమైనప్పటికీ, ఇండియాలోని యుద్ధచర్య 1758లో, ఆరంభంకావడం, ఆంగ్లేయుల అదృష్టం. ఆనాటికి, ప్లాసీ యుద్ధం ముగిసి, బెంగాలులోని అత్యధిక మూల సాధనాలన్నీ, ఆంగ్లేయుల హస్తగతమై ఉండినవి. కాబట్టి, దక్కనులో జరిగే, ఏ సంఘటన కూడా, ఇండియాలోని ఈ రెండు జాతుల భవిష్యత్తునూ, మార్చచాలదు.

సప్తవార్షిక యుద్ధకాలంలో, ఫ్రెంచివారు దక్కనులో చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమై పోయినవి. డూప్లే, బుస్సీల మహాప్రయత్నాలవల్ల ఏర్పడిన సామ్రాజ్యంలో, నిరాయుధము లైన ఐదు ప్రత్యేకపట్టణాలు మాత్రమే, సముద్రతీరంలో మిగిలినవి. ఫ్రెంచివారి రాజకీయ ప్రాబల్యం, పూర్తిగా మరుగుపడిపోయింది.

ఈవిధంగా, ఆంగ్లేయులతో, వాణిజ్యానికై పోటీచేసిన రాజ్యాలన్నీ ఒక టొకటిగా వెనుకబడిపోయినవి. తాము పూనుకొన్న సంకల్పాలను కార్యరూపంలో పెట్టడానికి, ఇండియా రంగంలో, ఆంగ్లేయులకు స్వేచ్ఛ లభించింది. జీవనసంగ్రామంలో, అత్యంతమూ శక్తివంత మైనది, జయించి నిలబడింది. పోర్చుగల్ ప్రయత్నాలు విఫలం కావడానికి కారణాలు

విస్పష్టములైనవే. ఆరోశతాబ్దంలో, పోర్చుగల్ జనాభా పదిలక్షలు మాత్రమే. "ఇథియోపియా' అరేబియా, పర్షియా, ఇండియా, దేశాల విజయానికి, నౌకావిహారానికి, వాణిజ్యానికి, ప్రభువు" అని పోర్చుగల్ రాజు ఆడంబరాట్టహాసంతో ప్రకటించుకొన్న ఆధిపత్యాన్ని, నిలుపడానికి ఈ స్వల్పమైన జనాభా చాలినదికాదు. పోర్చుగల్ లక్ష్యాలు అతివిస్తృతములైనవి, — ఇస్లాం ప్రపంచంపై ధార్మికయుద్ధాన్ని సాగించడము, రోమన్ క్యాథొలిక్ మతతత్త్వాన్ని, హీథెన్ జాతులలో వ్యాపింపచేయడము, మసాలాదినుసుల వాణిజ్యాన్ని వశపరచుకోవడము, ప్రపంచార్ధ భాగంపై పరిపాలనను నెలకొల్పడము, — అనేవి, వీరి తీరని ఆశయాలు. తాను పూనుకొన్న ఈ మహాకార్యానికి తగిన జనబలము, అనుభవము, వివేచనజ్ఞానము - పోర్చుగల్‌దేశానికి కొరతపడినవి. అమిత శ్రమకులోనైన జాతిబలం భగ్నమయింది. రాజవంశము పతనమై పోవడంతో, రాజత్వంపై ఆధారపడిన ఉద్యమం విఫలమైపోయింది.

1580 లో, పోర్చుగీసురాజ్యం స్పెయిన్‌రాజుకు సంక్రమించింది. ఈవిధమైన రెండు రాజ్యాల సంయోజనంవల్ల, బలంమాత్రం సిద్ధించలేదు. స్పెయిన్‌దేశపు విత్తవ్యవస్థ అస్తవ్యస్తమై ఉండినది. పదహారో శతాబ్దంలో, ధరలు ఐదురెట్లు పెరిగి ఉండినవి. ఉత్పాదన క్షీణించింది; ప్రపంచపు బజార్లను పోగొట్టుకొన్నారు; పరిశ్రమలు జడప్రాయంగా నిలిచి పోయినవి. చెలామణి ద్రవ్యం అధికం కావడం ధనవంతులకు, కులీనులకు లాభకరమయింది. కాని, బీదలు, కూలీలు, వస్తువులను వినియోగించుకొనే ప్రజలు, మరింత దరిద్రులైపోయిరి. ధనికవర్గాలకు సామాన్య ప్రజావర్గాలకూ మధ్యగల భేదభావం ఎక్కువయింది ; వర్గసంఘర్షణ తీవ్రరూపం దాల్చింది. సోమరులైన ధనికవర్గమువారు, తిండిలేని లక్షలాదిప్రజలు, క్రోధంతో ఒకరినొకరు మింగివేద్దామా అనేటట్లు చూచుకొంటూ ఉండిరి. సమాజముయొక్క జీవనాడులను, అవినీతి విషక్రిమి, తినివేస్తూ వచ్చింది. సంపదవల్ల ఈర్ష్యాస్పర్ధలు ఉత్పన్నమైనవి ; కష్టపరిస్థితులను ఎదుర్కొని నిలిచే చైతన్యశక్తి జాతిలో కొరపడింది. కాబట్టే, "సముద్ర భిక్షుకులైన" డచ్చివారు, "సముద్రనాయకులైన" ఆంగ్లేయులు, స్పెయిన్ సామ్రాజ్యాన్ని మట్టిలో కలిపివేసిరి.

ఆపైన, యాభైలక్షలు జనాభాకూడా పూర్తిగాలేని డచ్చివారు, పోర్చుగీసువారి వాణిజ్యోద్యమంలో ధైర్యంతో ప్రవేశించిరి. తమ వాణిజ్యఆశయాలను నెరవేర్చుకోడానికి వారు ఏర్పరచుకొన్న సాధనం, ఒక జాతీయప్రాయమైన కంపెనీ. వాణిజ్య యుద్ధనిర్వహణాలు రెండూ, దీని కర్తవ్యాలు. అనేకములైన అధికారాలతో దీనిని సంపన్న మొనర్చిరి. - తూర్పుదేశాల ఏకస్వామ్యవాణిజ్యము, దిగుమతి సుంకాల విరుగడ, భూమిపైనా, సముద్రాల పైనా, సాయుధబలాలను నిలుపుకోవడము, కోటలను నిర్మించుకోవడం, యుద్ధచర్య, సంధి చర్యలను నిర్వహించడం, ఒడంబడికలను ఏర్పాటుచేసుకోవడము, ధనసేకరణము, తన అధికారపరిధికి లోనైన ప్రాంతాలలో, పరిపాలన న్యాయశాసనవిధానాలను నిర్వహించే ఆధిపత్యము, - మొదలైన అధికారాలన్నీ కంపెనీలోనిహితమై ఉన్నవి.

కాని, కంపెనీకి డచ్చిరాజ్యాల జెనరల్‌తో ఏర్పడిన సన్నిహితసంబంధంవల్ల, డచ్చి ప్రభుత్వానికి కలిగిన అదృష్టవ్యత్యయాలలో కంపెనీకూడా, చిక్కుకోవలసి వచ్చింది. కంపెనీ ప్రారంభంనుంచీ కూడా, హాలండు నిరంతరమైన యుద్ధాలలో మునిగిఉండడం జరిగింది. మొదట, పోర్చుగల్ - స్పెయిన్ సంయుక్తరాజ్యంతోను, పదిహేడోశతాబ్ద మధ్యకాలంనుంచి,

ఇంగ్లాండుతోను, ఆ తర్వాత ఫ్రాన్సు చక్రవర్తి లూయీ XIV తోనూ, యుద్ధాలు ఏర్పడినవి. "పద్దెనిమిదో శతాబ్దమంతా సార్వభౌమత్వ బాధ్యతలు కంపెనీపై ఎక్కువౌతూ వచ్చినవి. సైన్యదళాల సంఖ్య పెరిగింది; పరిపాలనవ్యయం అధికమౌతూ వచ్చింది. తత్ఫలితంగా, కంపెనీ వాణిజ్యం పుష్కలంగా అభివృద్ధిచెంది లాభకారిఐనప్పటికీ, దాని విత్త పరిస్థితికి సంబంధించిన చిక్కులు రాను రాను ఎక్కువౌతూ వచ్చినవి.

తన శత్రువులపై యుద్ధచర్య సాగించడానికి అవసరమైన ధనం కొరకు, కంపెనీ, డచ్చి ప్రభుత్వంపై ఆధారపడవలసి వచ్చింది. ఇందువల్ల కంపెనీ వ్యవహారాలు కుంటుపడక తప్పవు. స్థల యుద్ధాలకు ప్రాధాన్యం కలిగినందువల్ల, నౌకాదళం అశ్రద్ధకు గురి అయింది. కంపెనీయొక్క పెక్కు వాణిజ్య కేంద్రాలు లాభకారులు కానందువల్ల, వర్తకంలో విస్తారమైన నష్టం కలిగింది. ఈ కారణం వల్ల, అప్పులు క్రమేణా పెరుగుతూ, కడపటికి, పదికోట్ల గిల్డరుల రుణం తేలింది. కంపెనీ డైరెక్టర్ల నియామకము, కంపెనీ పరిపాలన వ్యవహార విధానాల నిశ్చయాధికారము, డచ్చి రాజ్యాల జెనరల్ చేతులలోఉండడం, కంపెనీ శ్రేయోభివృద్ధికి హానికరంగా పరిణమించింది. డచ్చి ప్రభుత్వముయొక్క భాగ్యాభాగ్య వ్యత్యయాలకు కంపెనీ కూడా లోను కావలసివచ్చింది. కాబట్టి, ఫ్రెంచి విప్లవ యుద్ధాలు ప్రారంభమై, నెపోలియన్ రాజ్య వ్యవస్థలో హాలండు కూడా ఒక భాగమైపోగానే, ఆంగ్లేయుల నౌకాదళం, డచ్చి నౌకలను ఇండియా సముద్రాలనుంచి పారదోలింది.

పైరార్డ్ డేల్వావల్, మార్టిన్ దేవిట్రేయి, తమ ప్రాణాలను ఒడ్డి, ఇండియా సముద్ర ప్రయాణాన్ని నిర్వహించడంతో (1601), ఫ్రెంచివారి "సోమరి నిద్రమత్తు" వదలిపోయింది. కాని, వాణిజ్యవాద ప్రబల సమర్థకుడైన కోల్బర్ట్, ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీని 1664లో స్థాపించేదాకా, తూర్పు దేశాల వాణిజ్యాన్ని ఆరంభించడానికి ఫ్రెంచివారు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమైనవి. కాని, ఫ్రెంచి దేశంలోని వస్తు నిర్మాతలు, కోల్బర్ట్ ఉద్యమాన్ని ప్రతిఘటించడం వల్ల, ఇతని ఉద్యమ కార్యక్రమాలు విస్తృతి చెందలేకపోయినవి. నౌకాబల ప్రధానములైన రాజ్యాలతో లూయీ XIV జరిపిన యుద్ధాలు కారణంగా, ఫ్రెంచివారి సముద్ర వ్యాపారానికి చైతన్యం తగ్గి, కంపెనీ కార్య కలాపాలు మరింత క్షీణించినవి. ఇట్టి మృతప్రాయమైన అవస్థనుంచి, 1720లో, దీనిని రక్షించిన వాడు, జాన్ లా. కాని, కార్యారంభశక్తి, బాధ్యత లేనిదై, ప్రభుత్వాధీనంలోని ఒక సంస్థాపనగా ఏర్పడింది ఈ వాణిజ్య సంస్థ. వాటా దారులలోని కొందరు వ్యక్తులను డైరెక్టర్లుగా నియమించే వాడు రాజు. ప్రభుత్వం నియోగించిన ఇద్దరు హైకమీషనర్ల నిశ్చయాలను ఈ డైరెక్టర్లు కార్యరూపంలో పెట్టేవారు. ఫ్రాన్సు ప్రభుత్వపు మహా నియంత్రకుడు, డైరెక్టర్ల సమావేశాలకు అధ్యక్షుడు. ప్రాధాన్యం కల విషయాలన్నిటికీ ఇతని ఆమోదం ఆవశ్యకం. వాణిజ్య నీతికి ఆవశ్యకములైన అధికారాలన్నీ కంపెనీకి దత్తం కావించినాడు. ఏకస్వామ్య వాణిజ్యము, యుద్ధచర్యను, సంధి కార్యాలను నడిపే హక్కులు, మొదలైన అధికారాలన్నీ కంపెనీకి సిద్ధించినవి.

కాని, స్వాతంత్ర్యా భావం, కార్యారంభశక్తిని అణచివేసింది. భావి ప్రయోజనకరములైన వర్తక విధానాలను ఏర్పరచడానికి, ఫ్రాన్సులోని వస్తు నిర్మాతల ప్రతిఘటన అడ్డు తగిలింది. కంపెనీ వ్యవహార సమితి సంఘాలలో ప్రభుత్వాధికారులు ప్రాబల్యం వహించడం వల్ల, పద్దెనిమిదో శతాబ్దంలో ఫ్రెంచి ప్రభుత్వం, లోనైన దుస్థితులన్నిటికీ, కంపెనీ కూడా

లోను కావలసి వచ్చినది. మూల ధనం దుర్వినియోగానికి పాల్పడినందువల్ల, కంపెనీ ఋణ గ్రస్తమయింది. కాబట్టి, డూప్లే వేసుకొన్న రాజ్యాంగ ప్రణాళికలకు ఆవశ్యకమైన ధనం లభ్యం కాలేదు. లూయీ XIV, యూరోపు యుద్ధాలలో నిమగ్నుడై ఉండినందువల్ల వర్తక నౌకలు, యుద్ధ నౌకలు, అశ్రద్ధకు గురియైనవి. తన అసమర్థతకు, దుష్పరిపాలనకు, తగిన ప్రతిఫలాన్ని, ఫ్రాన్సు దేశం, అనుభవించవలసివచ్చింది. ఫ్రాన్సులోని భూస్వామ్య రాజకీయ వ్యవస్థ, పద్దెనిమిదో శతాబ్దపు పరిస్థితులకు, ఎంత మాత్రమూ తగినట్టిదికాదు. విప్లవ ప్రక్రియలో ఈ భూస్వామ్య రాజకీయ విధానం కూలిపోయింది. దాని ఆలంబనంపై బ్రతుకుతూ ఉండిన సంస్థలుకూడా, దీనితోనే నశించిపోయినవి.

ఇతరదేశ వాణిజ్య సంస్థలకంటె, ఆంగ్లేయుల ఈస్టిండియా కంపెనీ అదృష్టం మంచిది. అది స్వతంత్రమైన సంస్థ; ప్రభుత్వాంతరాయాలు, ఏవీ దీని వ్యవహారాలకు అడ్డుతగలవు. ప్రభుత్వంతో కంపెనీకిగల సంబంధాలు పొందిక కలవి. అంతర్యుద్ధాలవల్లా, రాజకీయ విప్లవాలవల్లా కంపెనీకి కూడా కొన్ని చిక్కులు ఏర్పడినప్పటికీ, రాజకీయసంక్షోభాల్లో దానికి గాఢసంబంధం ఏర్పడలేదు. అట్లే విదేశయుద్ధాలలో బాధ్యత వహించవలసిన ఆవశ్యకం కూడా కంపెనీకి కలగలేదు. ఇంగ్లాండుదేశపు సముద్రాధికారాన్ని వృద్ధిచేయడానికి, జాతీయ సంపదను అభివృద్ధిపరచడానికీ, కంపెనీ చేస్తూఉండిన అమూల్యమైన సేవను ఇంగ్లాండుదేశం చక్కగా గుర్తించింది. కాబట్టి, అధికారం రాజుచేతుల్లోఉన్నా, పార్లమెంటుచేతుల్లోఉన్నా, కంపెనీ ప్రయోజనాలకుమాత్రం, ఏవిధమైన భంగమూ కలుగదు. ట్యూడర్లకాలంలోని రాజత్వంకాని, లేదా, క్రాంవెల్ కాలంలోని పార్లమెంటు నిరంకుశాధికారంకాని, లేదా, పద్దెనిమిదో శతాబ్దంలోని ఉన్నత మధ్యమవర్గ అల్పజన పరిపాలనకాని, ఏదైనప్పటికీ, ఇంగ్లీషు రాజకీయ వ్యవస్థ, ప్రజాభిమతానికి అనుగుణంగా, వారి శ్రేయోభివృద్ధికై పాటుపడుతూవచ్చింది. కాబట్టి, పోర్చుగల్, స్పెయిన్, ఫ్రాన్సుదేశాల రాజకీయవ్యవస్థలకంటె, ఇది ఉత్తమమైనట్టిది.

ఆంగ్ల కంపెనీ వ్యవస్థావిధానము, దాని వ్యాపార పద్ధతులు కూడా, ఫ్రెంచి డచ్చి కంపెనీలు అవలంబించినవాటికంటె శ్రేష్ఠమైనవి. మూలధనంలేని ఫ్రెంచి డచ్చికంపెనీల వంటిది కాదిది. సంపన్నమైన ఆంగ్లకంపెనీ, ధనం అవసరమైన ప్రభుత్వాలకు కూడా, ఋణములు ఇవ్వగలిగి ఉండేది. తన మాతృదేశంలోని పరిశ్రమలకు భంగం కలిగించకుండా, దేశానికి లాభాన్ని కూర్చే వ్యాపారప్రణాళికను, కంపెనీ ఏర్పరచుకొన్నది. ఇంగ్లాండునుంచి ఎగుమతిఔతున్న బంగారు వెండినాణ్యాల మొత్తం చాలస్వల్పం; నీటిబిందువులతో సదృశమైనది. ఇది మళ్లీ, అఖండమైన వస్తురూప ప్రవాహంగా దేశంలో ప్రవేశించి, దేశప్రజల వినియోగాన్ని సమగ్రంగా తీర్చడమేకాక, విదేశాలకు ఎగుమతిరూపంలో ప్రవహించి, మళ్ళీ వెండి బంగారాలను సంపాదిస్తూ ఉండింది. ఈవిధంగా, ఇంగ్లాండుదేశాన్ని సంపన్నంగాచేస్తూ వచ్చింది ఈస్ట్ ఇండియా కంపెనీ. అతితీవ్రములైన ప్రతిబంధాలకు, పరీక్షలకు గురిఐనప్పటికీ కూడా, ఆంగ్లకంపెనీకి గల సహజసిద్ధమైన ఉత్కృష్టయోగ్యత కారణంగా, పర్యవసానంలో, విజయవంతమయింది.

*ఆంగ్లేయుల ఆక్రమణకు పూర్వపు బెంగాల్ :* ఆస్ట్రియారాజ్య ఉత్తరాధికారయుద్ధం, యూరోపుశాంతికి భంగం కలిగించడానికి ముందే, దక్షిణభారతదేశంలో అత్యున్నతాధికారానికై ఘర్షణపడుతూఉండిన ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, తమ యుద్ధచర్యలను తాత్కాలికంగా

అపడానికి ఒప్పుకొనిఉండిరి. 1754 నాటి విరామసంధితో, డూప్లే పన్నిన గొప్పతంత్రాంగం విఫలమయింది. మహాప్రతిభావంతుడైన బుస్సీ, దక్కను నైజాముపై తాను సాధించుకొన్న అతంత్రమైన ప్రాబల్యాన్ని నిలదొక్కుకొంటూవచ్చినా ఇండియాలో ఫ్రెంచివారి స్థానం దుర్బలమైపోయినదన్న విషయం స్పష్టంగా వ్యక్తమైపోయింది. కాబట్టి, ఫ్రెంచివారు యుద్ధం వల్ల కలిగిన దుష్ఫలితాలను సరిదిద్దుకొంటూ, నిర్నివార్యమై కలుగబోయే మరొకయుద్ధానికి సన్నాహపడుతూఉన్న సమయంలో, ఆంగ్లేయులు విజయగర్వంతో అత్యుత్సాహంతో ఉండిరి. ఫ్రెంచివారు ప్రారంభించిన రాజకీయక్రీడావిశేషాలన్నిటినీ గ్రహించడమేకాక, గురువులను మించిన ఉపాయకౌశలాన్ని సంపాదించుకొని ఉండిరి. ఫ్రెంచివారి తంత్రాంగాలన్నిటినీ భగ్న మొనర్చి, రాజ్యతంత్ర విషయంలో అభ్యుదయాన్నికూడా సాధించిరి. దేశరాజుల శక్తిసామర్థ్యా దులను, వారి యుద్ధదక్షతను చక్కగా అవగాహన చేసుకొనిరి. యూరోపులో రెండుజాతుల వారికీ యుద్ధం సాగుతూఉన్నాకూడా, 1756 నుంచి, 1758 వరకు ఇండియాలోని తమ ప్రతిస్పర్థులతో ప్రత్యక్షమైన సంఘర్షణ సిద్ధించకపోవడం, ఆంగ్లేయుల అదృష్టం. కాని, ఈ విరామకాలంలో, తమప్రణాళికకు విరుద్ధమైన సంఘటన, ఒక్కసారిగా, బెంగాలులో ఉత్పన్నమయింది.

పదహైదు సంవత్సరాల కాలం, బెంగాలు ప్రాంతాన్ని పరిపాలించిన నవాబ్ అల్లా వర్దీఖాన్, 1756లో మరణించెను. ఇతని మరణంతో, ఇండియా దేశ చరిత్రలో దురదృష్ట కరమైన ఘట్టం ఆరంభమయింది. పద్దెనిమిదో శతాబ్దపు ప్రథమార్ధకాలంలో సమర్థులైన ఉత్తమ వ్యక్తులు బెంగాలుకు గవర్నర్లు కావడం, దేశము యొక్క అదృష్టం. 1700లో, బెంగాల్ ప్రాంతానికి దివాన్‌గా నియమితుడైన ముర్షీద్ ఆలీఖాన్, 1727లో, అతని మరణ కాలందాకా, బెంగాల్ వ్యవహారాలను దక్షతతో నిర్వహించెను. తర్వాత అతని అల్లుడు సుజాఖాన్, బెంగాలు ప్రాంతాన్ని పద్నాలుగేండ్లు పాలించెను. ముర్షీద్ కూలీఖాన్ కుమారుడు అవివేకియై, ఒక సంవత్సరం మాత్రమే, బెంగాలు ప్రాంతాన్ని పాలించిన పిమ్మట, అల్లావర్దీఖాన్ బెంగాల్ ఆధిపత్యాన్ని వహించి, 1756 దాకా, పరిపాలించినాడు. ఈ ముగ్గురు గవర్నర్లూ కూడా శక్తిమంతులు, సమర్థులు ఐన రాజపాలకులు. వీరి పరిపాలనలో బెంగాలు ప్రాంతం ఉచ్ఛ్రయస్థితికి వచ్చి, ఇండియాలోని 'స్వర్గసీమ' అని ప్రఖ్యాతి చెందింది.

దీనికి కారణాలు అనేకములు. ఇండియాలోని ఇతర ప్రాంతాలు భ్రాతృ ఘాతుక యుద్ధాలకు, మహరాష్ట్రుల దండయాత్రలకు, జాటుల విద్రోహచర్యలకు పాల్పడినవి. ఉత్తర భారతదేశం, నాదిర్‌షా, అహమద్‌షా అబ్దాలీల దండయాత్రల వల్ల ధ్వంసమైపోయింది. అట్టికాలంలో, బెంగాలు ప్రాంతంలో మాత్రం, చాలవరకు, ప్రశాంత పరిస్థితులు ఏర్పడి ఉండినవి. 1742-52 మధ్యకాలంలో జరిగిన మహరాష్ట్రుల దండయాత్రలు మాత్రం, బెంగాలు చరిత్రలో విషాదకరమైన ఘట్టంగా సిద్ధించింది. ఒరిస్సాను మహరాష్ట్రులకు దత్తం చేయవలసి వచ్చింది. ఈ ఒక్క విషయం తప్ప, తక్కిన కాలమంతా ప్రశాంతం గానే గడిచిపోయింది. పౌర వ్యవస్థను చక్కగా నిర్వహించడమేకాక, చక్కని పరిపాలన వ్యవస్థకు తగిన చర్యలను కూడా, తీసుకోవడంవల్ల, దేశంలో సంపద అభివృద్ధిచెందింది. ప్రభుత్వాదాయానికి సంబంధించిన రెండు మూలాధారాలను,-భూమి రాజస్వము, వర్తకము,- విశేషమైన శ్రద్ధతో పరిశీలిస్తూ వచ్చినారు.

కడపటి మొగల్‌చక్రవర్తుల పరిపాలనలో, జాగీరుపద్ధతి మితిమీరి విస్తరించినందువల్ల, ఇతరప్రాంతాలవలెనే బెంగాలుకూడా చిక్కులకు లోనయింది. ఈ జాగీరుపద్ధతి, ఆర్థిక రీత్యా, వినాశకరమైనట్టిది; రాజకీయవిధంగా అపాయకరమైనట్టిది. ముర్షిద్ కూలీఖాన్ ఈ పద్ధతిపై దాడిసాగించి, చాలభాగం నశింపచేసినాడు. బెంగాలు జాగీర్లలోని పెక్కింటిని, ప్రభుత్వాధీనం కావించుకొని, ఆ జాగీరుదార్లకు ఒరిస్సాలోని భూములను విధించి ఇచ్చినాడు. ఈవిధంగా ఏర్పడిన ఖాల్సాభూములను (రాజుకుచెందినవి), ప్రభుత్వం ఖుద్దుగా నిర్వహిస్తూ వచ్చింది. ఈ భూములపై పన్నులను నిష్కర్షచేయటానికి, పెక్కుమార్గాలు ఉండినవి. తోడర్‌మల్ ప్రవేశపెట్టిన జబ్త్ పద్ధతి, మిక్కిలి శాస్త్రీయమైనట్టిది. రైతుల అధీనంలోని పొలాలను కొలిచి, సరాసరి ఉత్పాదనను అంచనావేసి, రాజ్యానికి చెందవలసిన అంశాన్ని ద్రవ్యరూపంలో వసూలుచేయడం, - అనే ప్రక్రియలు ఈ పద్ధతికి ఆధారాలు. బెంగాలు ప్రాంతానికి విశిష్టములైన నేలస్వభావాన్ని, వాతావరణ పరిస్థితులనుబట్టి, ఈ పద్ధతిని అవలంబించడానికి వీలుకాదు. 'సెటన్-కార్' వ్రాసినప్రకారం, "బెంగాలులోని క్రిందిప్రాంతంలో, - [ఇతర ఇండియా ప్రాంతాలన్నిటికంటె ఎక్కువగా] - వర్షాకాలంలో పసుపుపచ్చని నీటి ప్రవాహంతో, అత్యంతమైన రభసంతో ప్రవహించి వచ్చే నదుల వేగంవల్ల, ఊహించరానట్టి మార్పులు విస్తారంగా కలుగుతాయి. విస్తారమైన జలప్రవాహం, ప్రకృతిసిద్ధములైన అడ్డంకులను చీల్చుకొని, గ్రామాలను పూర్తిగా తుడిచివేస్తూ, క్షేత్రాన్ని సగానికిపైగా హరించివేసి, విస్తారమైన భూభాగాలను నీటితో ముంచివేసి, అక్టోబర్‌నెలలో మాయమైపోతుంది. అట్లు పోతూ, సారవంతమైన ఒండ్రుమట్టితో పొలాలను కప్పివేస్తుంది. పొలాలను విభజించే గుర్తులు కూడా కనబడవు. దిగ్భ్రాంతి చెందిన రైతులు, తమ పొలాల ఆకారాలను ఊహించుకొని, మళ్లీ ఏర్పరచుకోవలసివస్తుంది."

బెంగాలు రైతులు నివసించే కుగ్రామాలు, అక్కడక్కడ చెదరి ఏర్పడిఉంటాయి. దాటడానికి వీలులేని నదులు, చాలభాగం, పల్లెలను చుట్టిఉంటాయి. పరిస్థితులు ఇట్టివైఉండడంవల్ల, భూములకొలతలు, ఇతరములైన లెక్కలు, చాలకాలం ఒకేవిధంగా ఉండడం సాధ్యంకాదు. కాబట్టి, బెంగాలు నవాబులు గ్రామాలను గుత్తకు ఇచ్చే విధానాన్ని అవలంబించిరి. గుత్తేదార్లు, అతిక్రూరమైన పద్ధతులను అనుసరించి, పన్నులు వసూలుచేస్తూ రావడంవల్ల, రాజ్యకోశాలుమాత్రం ధనంతో తొణికిసలాడుతూ ఉండినవి. కాని, రైతులుమాత్రం అత్యంతమైన తీవ్రదారిద్ర్యానికి క్రుంగిపోయిరి. జమీందారుల స్థితికూడా చాలవరకు ఇట్టిదే. స్వప్రయోజనానికై, రాజస్వాన్ని హరిస్తున్నారని శంకించి, వారిని పన్నులు వసూలుచేసే పనినుంచి తొలగించిరి. అమీల్, అనే రాజస్వాధికారులను, పన్నులు వసూలుచేయడానికై నియమించిరి. వీరు చాలవరకు హిందువులు. ఎదురుతిరిగే ముస్లిముకంటె స్వాభావికంగా విధేయుడై ఉండే హిందువుతో, పనిచేయించుకోవడం సులభమై ఉండడమే ఇందుకు కారణం.

తోడర్‌మల్ అంచనాప్రకారంగా, సుమారు కోటిరూపాయలు ఐఉండిన రాజస్వం డిమాండు, ఈ సంస్కరణచర్యల ఫలితంగా, ముర్షీద్ కూలీఖాన్ కాలంలో ఒకటిన్నరకోటికి పెరిగింది. అల్లా వర్దీఖాన్ మరణకాలంనాటికి అది ఒకకోటి, ఎనభై అరులక్షలదాకా అభివృద్ధి చెందింది. ఈ అభివృద్ధికి కారణం, చాలవరకు శిస్తులపెంపకం. కాని, డిమాండు ఎక్కువౌతూ ఉన్నా, కార్యరూపంలో వసూలైన మొత్తం, డిమాండులో సగానికంటె తక్కువే. 1762-63

సంవత్సరంలో, వసూలు కావలసిన శిస్తు మొత్తం, ఏడున్నరకోటిరూపాయలుగా నిశ్చితమయింది. కాని, వసూలైన మొత్తం, దీనిలో సగానికి తక్కువే. ఈవిధంగా, బాకీలు నిలిచిపోయినా, ప్రాంతపు రాజస్వ ఆదాయం సంవత్సరంసంవత్సరం పెరుగుతూనే వచ్చింది.

ప్రాంతీయ ఆదాయానికి రెండో మూలాధారం, సీమాశుల్కాలు (customs duties). ఈ సమయంలో, విదేశవ్యాపారం ఆశ్చర్యకరమైనవిధంగా వృద్ధిచెందింది. ఒక ఢక్కామాత్రమే, ఏషియాదేశాలకు సుమారు ముప్పైలక్షలరూపాయల విలువగల గుడ్డలను ఎగుమతి చేసింది. ఇరవై ఐదులక్షల పౌనుల తూకంగల పట్టును, కాసింబజార్ ఉత్పాదనచేసింది. డెబ్బైలక్షలు విలువగల పట్టును ఎగుమతిచేసినట్లు, ముర్షీదాబాద్ సీమాశుల్క అధికారస్థానం రిజిస్టర్ చేసింది. పర్షియా అఖాతానికి, ఇండియాప్రాంతాలకు, బెంగాలునుంచి యాభై వేల మణుగుల చక్కెర సరఫరా అయింది. దీనితోపాటు, విస్తారమైన జనుము సరఫరాకూడా జరిగింది. విదేశాలలో అమ్ముడుబోయిన పదార్థాలు అనేకములు. సూరేకారము, అపీము, మొదలైనవి ఇట్టి సరకులు. 1706 నుంచి 1756 వరకు జరిగిన అర్ధశతాబ్దకాలంలో, తన ఎగుమతి సరకులకు బదులుగా, బెంగాలుప్రాంతానికి, ఆరున్నరకోటిరూపాయల విలువగల వెండిబంగారు గట్టీలు, 23 కోట్ల విలువగల వస్తువులు దిగుమతిఐనవి.

తూర్పుఏశియా, పడమరఏశియా దేశాలలోను, ఆఫ్రికా, యూరోపుఖండాలలోను, ఇండియా సరకులకు ఎక్కువ గిరాకీ ఉండింది. అధికలాభకరమైన సముద్రరవాణా కార్యక్రమాలను నడపుతూఉండిన ఇండియనులను, ఇతర ఏశియాజాతులవారిని సముద్రాలపైనుంచి తొలగించిన యూరోపు వర్తకులు, ఈ సరకుల రవాణాలమూలంగా విస్తారలాభాలను సంపాదిస్తూ ఉండిరి. సముద్రాంతర విదేశీయవాణిజ్యం, విస్తారంగా అభివృద్ధి చెందింది. కాబట్టి, సీమాశుల్కాలు అతిస్వల్పమైఉన్నప్పటికీ, [విలువనుబట్టి 2.5 శాతం], ఆంగ్లేయులకు శుల్కరహితమైన రియాయితీని ఇచ్చిఉన్నప్పటికీకూడా, మొగల్‌సామ్రాజ్యముయొక్క మొత్తం ఆదాయము,-అందునూ విశేషించి బెంగాలు ఆదాయము,-అతి విస్తృతమై ఉండింది.

పరిశ్రమలకు ప్రేరకమై, దేశ సంపదను అభివృద్ధి పరచేది విదేశ వాణిజ్యం. ఆంగ్ల వర్తకులను, ఇతర విదేశ వర్తకులను, ఇండియా పరిపాలకులు ఆదరించి ప్రోత్సహించడానికి, ఇదే కారణం. ఇందుకు నిదర్శనాలు అనేకములు. 1686-89 మధ్యకాలంలో ఈస్ట్ ఇండియా కంపెనీవారు తనపై యుద్ధాన్ని జరిపిఉన్నప్పటికీ, ఔరంగజేబు, వారికి ఇదివరలో ఇచ్చియుండిన అనుమతులను మళ్లీ ప్రసాదించెను. బెంగాల్ గవర్నర్ అభిప్రాయాన్ని త్రోసిపుచ్చి, ఫరూఖ్‌సియార్, ఆంగ్ల కంపెనీపై సీమా శుల్కాలను రద్దుగావిస్తూ, చక్రవర్తి ఆజ్ఞను 1716లో, జారీచేసినాడు. తమ కర్మాగారాలను భద్రపరచుకోవడానికీ, దేశీయ సైనికులను వాటి రక్షణార్థం నిలుపుకోడానికీ, అజీం-ఉష్-షాన్, డచ్చి, ఆంగ్ల, ఫ్రెంచి కంపెనీలకు అనుమతి ఇచ్చినాడు. ముర్షీద్ కూలీఖాన్, వర్తకులను ఎక్కువగా ఆదరించినందువల్ల, హూగ్లీ పట్టణం, గొప్ప సాంస్కృతిక కేంద్రంగా అభివృద్ధిచెందెది; 1704లో, 15000 జనాభాతో ఉండిన కలకత్తా పట్టణం, 1750 నాటికి లక్ష జనాభాగల నగరంగా వృద్ధి చెందింది. అదే విధంగా, ఢక్కా, ముర్షీదాబాదులు కూడా, ఎక్కువ జనాభాగల నగరాలుగా అభివృద్ధికి వచ్చినవి.

వర్తకము, పరిశ్రమలు, వ్యవసాయము,-అనే కార్య రంగాలలో జరిగిన అభ్యుదయం

కారణంగా, బ్యాంకింగు వ్యవస్థకు ఉత్తేజనం కలిగింది. జగత్ సేఠుల (World Bankers) అభివృద్ధి ఇందుకు నిదర్శనం. ప్రాంతీయ ప్రభుత్వం తరపున వీరు, ఒక్కొక్క సారికి కోటి రూపాయల హుండీలను జారీచేసేవారు. బెంగాలులో వసూలైన సంవత్సరాదాయాన్ని, ముర్షిద్‌కూలీఖాన్, ఈ బ్యాంకర్ల కార్యకర్తల ద్వారా ఢిల్లీ సార్వభౌమునికి పంపించేవాడు. కాబట్టి, ఆ కాలపు రాజకీయాలలో వీరు ముఖ్యపాత్ర వహించడం సహజమైనదే!

దేశ సంపదను పెంపొందించడానికి ఇతర కార్యక్రమాలను కూడా ప్రారంభించిరి. ప్రభుత్వ వ్యయాన్ని తగ్గించిరి. కాని, పొదుపుకోసం, సైన్య బలాన్ని తగ్గించి, 2000 మందితో కూడిన అశ్విక దళాన్నీ, 4000 మంది సైనికులతో కూడిన కాల్బలాన్నీ మాత్రమే నిలుపుకోవడం వివేకంగా తోచదు.

క్షీణస్థితి, నిశ్చైతన్యము, దివాలాస్థితి ఇత్యాదులతో మబ్బుకప్పిఉన్న ఇండియాదేశం అంతటిలోను, సంపదకు ఆకరమై ఉచ్ఛ్రాయస్థితిలో ఉండిన బెంగాలుప్రాంతం ఒక్కటే, ఆకర్షణీయమైన భాగం. "మొఘల్‌సామ్రాజ్యంలో నిలిచిఉన్న ఏకైకమైన వెండిగని". అని దీనిని వర్ణించినారు. తాను దక్కనులో సాగిస్తున్న వ్యర్థ, ద్రవ్యనాశక దండయాత్రల కర్చులకు, తక్కినప్రాంతాలు ద్రవ్యాన్ని సమకూర్చలేని పరిస్థితిలో, ఔరంగజేబు, ముర్షీద్ కూలీ ఖాన్‌పైమాత్రమే ఆధారపడినాడు. బెంగాలునుంచి ఇతనికి ప్రతిసంవత్సరమూ కోటిరూపాయల ఆదాయం లభించేది. ఇది కారణంగా, బెంగాలు గవర్నరకు సంపూర్ణమైన స్వేచ్ఛాధికారాన్ని ఇచ్చినాడు. "నీవు సంపూర్ణాధికారాలుగల దివాను, ఫౌజ్‌దారు. ఎవరు నీపై ఏ దోషారోపణ కావించినా నావద్ద చెల్లదు" అని ఔరంగజేబు అతనితో చెప్పినాడు.

కాని, సంపద అనే ఈ తళుకుబెళుకుల ముఖభాగం వెనక ఉండేది, శిథిలావస్థలో ఉన్న భవనం. సముద్రంవైపునుండి వీచే గాలి ఒక్కసారి తాకడంతోనే కూలిపోయే దుర్బలస్థితిలో ఉన్నదిది. నవాబు సంపద, అల్పసంఖ్యాకులైన అతని అధికారుల సంపద, - సమస్తమూ, దరిద్రులైపోయి, దుస్థితికిలోనైఉన్న రైతుల చెమటబిందువులద్వారా, హీనస్థితికి లోనైఉన్న కార్మికుల రక్తబిందువులద్వారా, బలవంతంగా, సమకూర్చుకొన్నదే. ఈ నవవిభవోద్ధతులకూ, చిరకాల దీనావస్థకు గురియైఉన్న ప్రజానీకానికీ మధ్యగల బంధనాలు కేవలం ఇసుకతో ఏర్పడినట్టివి మాత్రమే.

ప్రజల మధ్యలో నివసించిన విదేశీయులు, ఇండియా రాజ్యవ్యవస్థలోని సామర్థ్యాన్ని, దౌర్బల్యాన్నికూడా జాగ్రత్తగా పరిశీలించినారు. దేశీయరాజుల అధికారశక్తి మిక్కిలి హీనమైనట్టిదని వారి అభిప్రాయం. ఇండియా సైన్యాన్నిగురించి, బెర్నియర్, తన అభిప్రాయాన్ని ఈవిధంగా వివరిస్తాడు, - "అతివిస్తారమైన ఈ సైన్యాలు ఒక్కొక్కప్పుడు ఘనకార్యాలను సాధిస్తాయి; కాని శత్రువులు వీటిని అస్తవ్యస్తంచేసినప్పుడు క్రమశిక్షణతో వీరిని జతకూర్చడం అసాధ్యమైన పని. ఏవిధమైన సైనికవ్యవస్థకూ బద్ధులుకాక, పశువులమందవిధంగా, ఏక్రమాన్నీ పాటించక, నడిచిపోయే ఈ సైన్యాలను చూచినప్పుడు, నాకు ఒక భావం తప్పక కలుగుతుంది. కాండే రాజకుమారుని నాయకత్వంలోకాని, లేదా, మార్షల్ ట్యురేన్ నాయకత్వంలో కాని, ఫ్లాండర్స్ సైన్యంలోని ఇరవై ఐదువేలమంది యుద్ధవీరులుమాత్రమే, ఎంతటి అసంఖ్యాకమైన ఇండియా సైన్యాన్నైనా సులభంగా జయించడానికి చాలు అనేభావం, నాకు కలుగుతుంది." పద్దెనిమిదోశతాబ్దం కడపటి ఇండియాను చూచిన ఒక రచయిత, ఈవిధంగా

వ్రాస్తాడు, - "ఇండియా సైన్య సంయోజనం, అధికవ్యయంతో కూడినదిమాత్రమేకాక, దోషంతోకూడా కూడుకొన్నట్టిది. అసంఖ్యాకులైన దృఢగాత్రులతో కూడిన సైన్యము, దాక చక్యంగల ఈ అశ్వికదళాలు, తమరాజు ప్రయాణాన్ని అనుసరించిపోయే ఉద్దేశంతోమాత్రమే కూర్చబడిన, అలంకరణవస్తువులుగా కనబడతాయి." ఇండియారాజుల సైన్యమూకలో, క్రమశిక్షణ లేకపోవడం గమనించి, మార్క్విస్ ఆఫ్ అలోర్నా, ఈవిధంగా వ్రాసినాడు. "సుశిక్షితులైన ఐదువేలమంది సైనికులదళంతో మాత్రమే, యాభై వేలమంది సైనికులుగల ఇట్టి సైన్యాన్ని ఎదిరించడానికి, నేను ఏమాత్రమూ వెనుదీయను. ఇండియారాజుల సైన్యాలతో స్వయంగా యుద్ధాలను సాగించిన ఫ్రెంచి, ఆంగ్లసేనానాయకులు, ఇండియాసైన్యాల యుద్ధ దక్షత అతిహీనమైనదని భావించినారు. ఇందుకు నిదర్శనంగా, డూప్లే, పారిస్‌లోని కంపెనీ డైరెక్టర్లకు ఈవిధంగా వ్రాసిఉన్నాడు, - "కృష్ణానదికి ఇవతలఉన్న ముస్లిముదుర్గాలను, ప్రాంతాలను అన్నిటినీ, 500 మంది యూరోపుసైనికులు కూల్చగలరు." 1759 జనవరి, 7 వ తేదీనాడు, క్లైవ్, విలియమ్‌పిట్‌కు ఈవిధంగా వ్రాసి ఉన్నాడు; - "మీర్‌జాఫర్, మీరాన్‌లనుంచి, ఇండియా సార్వభౌమత్వాన్ని వశపరచుకోడానికి, కంపెనీకి కావలసింది, 2000 మంది యూరోపుదేశసైనికులు మాత్రమే."

"యూరోపు దేశ సైన్యాలు, పదివేల బాహువులుగల రాక్షసుని వంటివి. సైన్యాధిపతి, అనే మనస్సుయొక్క ఆజ్ఞలను అనుసరించి, ఆత్మరక్షణ, శత్రు ధ్వంసము, అనే రెండు కార్యాలను ఒకేసారి జరుపుతాయి." ఇక ఇండియా సైన్యములన్ననో, "క్రమశిక్షణ విరహితమైన మానవమూక. చేతులు, చేతులు కలిపి పోరాడుతూ శత్రువును గాయపరచలేవు, ఆత్మ రక్షణ కావించుకోలేవు." అని వ్రాసినాడు.

ఈ దౌర్బల్యాన్ని అల్లావర్దీఖాన్ గుర్తించి ఉండినట్లు కనబడుతుంది. తనకు ఈ విషయమై కలిగిన భావి శంకను, ఈ విధంగా వ్యక్తం కావించినాడు,-"భూస్థలంపై ఏర్పడుతున్న మంటలను ఆర్పడమే మనకు కష్టంగా ఉంది; కాని, సముద్రమే అగ్నిజ్వాలలో మునిగిపోతే, ఎవరు ఆర్పగలరు?"

1756లో అతడు మరణించడము, అతని మనుమడు సిరాజ్-ఉద్-దౌలా, బెంగాలు మస్నద్‌ను ఆరోహించడము జరిగిన వెంటనే, అల్లావర్దీఖాన్ ఊహించినట్లుగా, సముద్రానికే నిప్పంటుకొంది. అహమద్‌షా అబ్దాలీ పంజాబుపై దాడిచేసింది ఈ సంవత్సరమే. దీని ఫలితంగా, బెంగాలుకు సామ్రాజ్యాలంబనం పూర్తిగా నిష్ప్రయోజకమైపోయింది. ఢిల్లీ చక్రవర్తికి సూచన చేయకుండానే, సిరాజ్-ఉద్-దౌలా, గవర్నర్ పదవిని ఆక్రమించినట్లు తోస్తుంది. ఢిల్లీ చక్రవర్తియొక్క పూర్వస్థితి సందేహగ్రస్తమైనట్లు ఉండడం, ఇతని చర్యకు హేతువు.

***ఆంగ్లేయులు బెంగాలును జయించడం*:** సిరాజ్-ఉద్-దౌలా, అప్పటి కాల పరిస్థితులకు తగిన పరిపాలకుడు కాడు. బాల్యంలో, అతి గారాబంవల్ల చెడిపోయిన వాడు ఇతడు. వృద్ధుడైన తాత, ఇతనిని బాల్యంలో పొగుడుతూ, ముద్దు చేసినందువల్ల, ఇతడు అహంకారిగానూ, హఠమారిగానూ తయారైనాడు. దురాశతోను, స్వచ్ఛందతతోను, క్రౌర్యంతోను కూడిన వ్యవహారాలతో ఉన్నతులకు, సామాన్యులకు కూడా ఇతడు బాధ కలిగించి ఉండినాడు. "ఇతనికి ఎన్నడో నిర్దిష్టమైపోయిన బెంగాల్ సింహాసనాన్ని ఇతడు ఆక్రమించే

నాటికి, రాజ్యం, అంతఃకలహాలకు లోనై ఉండింది. సైన్యంలో ఒక భాగం ఇతనికి విరుద్ధము. ప్రజలు ఇతని పట్ల అభిమానం లేనివారు." ఇతనిని దూషించడానికి పూనుకొన్న యూరోపు చరిత్రకారులు, ఇతని శీల స్వభావాలను అత్యంతమైన నిందా వాక్యాలతో చిత్రించినారు. కాని, ఇతడు చేసిన ఇతర చర్యలు సమర్థనీయములు కానప్పటికీ, బ్రిటీషువారి విషయంలో ఇతడు తీసుకొన్న చర్యలు మాత్రం దూష్యములైనవి కావు. బ్రిటీషువారిపట్ల అతడు పాపం చేయడానికంటె అత్యధికంగా, బ్రిటీషువారే అతనివిషయంలో పాపంచేసినారు.

కలకత్తాలోని ఈస్ట్ఇండియా కంపెనీ కార్యకర్తలకు, ఇతనికి. మధ్య, ఏర్పడిన తగాదాలో, సిరాజ్-ఉద్-దౌలావాదమే, సక్రమమైనది. అతని నవాబ్ పదవీస్వీకారాన్ని కంపెనీవారు, పద్ధతిప్రకారం గుర్తించి, గౌరవాన్ని ప్రదర్శించలేదు. న్యాయరీత్యా దండనకుపాత్రుడై, తప్పించుకొనివచ్చిన వ్యక్తికి, కంపెనీవారు అక్రమంగా ఆశ్రయం ఇచ్చినారు. బెంగాలునవాబు యొక్క. సార్వభౌమాధికారానికి బద్ధుడై, అతని సేవలోఉన్న అధికారికి, నవాబు ప్రవాసశిక్ష విధించి, కలకత్తానుంచి బహిష్కరించగా, కంపెనీ, అట్టివానికి ఆశ్రయం ఇవ్వడం, అక్రమం కాకపోదు. అంతేకాక, నవాబు అనుమతిని తీసుకోకుండానే, కంపెనీవారు, కలకత్తాలో రక్షకస్థానాలను నిర్మించుకొని, తమ సైనికబలాన్ని ఎక్కువచేసుకొన్నారు. అల్లావర్దీఖాన్ పూర్వం ఇచ్చిఉండిన, నిష్కర్షఐన, ఆజ్ఞలను ఈవిధంగా ధిక్కరించడం, కంపెనీవారి అపరాధాలన్నిటిలోను అధమమైనట్టిది. ఆంగ్ల ఫ్రెంచి కంపెనీలవారికి, ఇదివరకే, అల్లావర్దీఖాన్, "మీరు వర్తకులు; కాబట్టి కోటలతో మీకు అవసరమేమి? నా రక్షణలోఉన్న మీకు, ఏశత్రుభయమూ ఉండజాలదు." అని ఖండితంగా చెప్పి, వారిని తన ఆజ్ఞలోఉంచినాడు.

ఆంగ్లేయులు ఒకప్రక్క క్షమాపణవాక్యాలు పలుకుతూ, మరొకప్రక్క ఫ్రెంచి, డచ్చివారి సహాయానికి ఎదురుచూస్తూ, నవాబును ధిక్కరిస్తూ వచ్చిరి. వారి సహాయం లభించకపోవడంతో తమ సైన్యాన్ని వృద్ధిచేసుకొని, తగినంత ఆహారపదార్థాలను, ఇతర పరికరాలను సమకూర్చుకొని, రక్షకస్థానాలను బలపరచుకొంటూ వచ్చిరి. ఆంగ్లేయుల ఈ చర్యలవల్ల ఉగ్రుడైన నవాబు, వేగంగా కలకత్తా చేరుకొని బాహరీచౌకీలను పడగొట్టి, ఫోర్ట్విలియమ్ దుర్గాన్ని ముట్టడించి, వశపరచుకొన్నాడు. కాని, ఇంగ్లీషుగవర్నర్, నౌకలతో కూడా, ఫుల్టాకు తప్పించుకొని పోతూఉండగా, నవాబు చూస్తూఉండిపోయినాడు. గవర్నరు ఫుల్టాచేరుకొని, క్లైవ్నాయకత్వంలో సహాయకబలం, మద్రాసునుంచి వచ్చేవరకూ వేచిఉంచినాడు.

యుద్ధతంత్రవిషయంగా చూస్తే, ఆంగ్లగవర్నరును తప్పించుకొని పోనివ్వడంకంటె, గొప్పతప్పు మరొకటిఉండదు. దీనివల్ల ఫుల్టాను, సైన్యాల ఆశ్రయస్థానంగాచేసుకొని, తాము పోగొట్టుకొన్న కోటలను నౌకాదళసహాయంతో మళ్లీ సాధించుకోడానికి, ఆంగ్లేయులకు మంచి అవకాశం లభించింది. మదరాసుసైన్యాలతో క్లైవు బెంగాలును చేరుకోవడంతో, యుద్ధపరిస్థితి తారుమారైపోయింది. బెంగాలులో జరిగిన అంశాలవల్ల, ఆంగ్లేయులు ధైర్యహీనులైఉండిరి; 1636-59 మధ్య జరిగిన ఉదంతాల స్మరణ వీరి మనస్సులను వేధిస్తూనే ఉన్నది. జాన్ రస్సెల్, మొగల్సార్వభౌమునికి అతిదీనంగా వ్రాసుకొన్న విన్నపపత్రం, వీరి హృదయాలలో ఇంకా మెదుల్తూనేఉంది. కాని, దక్కనులో సిద్ధించిన విజయపరంపరలతో, ఆంగ్లేయులకు కైపెక్కింది. తత్ఫలితంగా, వాట్సన్, క్లైవులు నిప్పులు కక్కుతున్న జాబులను, సిరాజ్-ఉద్-దౌలాకు వ్రాసినారు. క్లైవు, నవాబుకు వ్రాసిన జాబు ఈవిధమైనది, - "ఎటు

పంటి సైన్యం బెంగాలును చేరుకొన్నదనేవిషయం, తాము ఇతరులవల్ల వినిఉండవచ్చు. అంతటి సైన్యాన్ని బెంగాలుప్రాంతంలో, మీరు ఇదివరకు చూచిఉండరు. తాము, ఈ విషయాలను సమగ్రంగా తెలుసుకొని, పరిస్థితిని జాగ్రతగా పర్యాలోచిస్తే, మీ శ్రేయస్సును, మా శ్రేయస్సును, మీ ప్రాంతంలోని వర్తకముయొక్క శ్రేయస్సును చక్కగా గుర్తుంచుకొని, కంపెనీకి జరిగిన నష్టానికి పూర్తిగా పరిహారాన్ని ఇస్తారని నేను నమ్ముతున్నాను."

వాట్సన్ వ్రాత, ఇంతకంటె ఖండితంగా ఉంది; రాజనీతి కౌశల ప్రదర్శనకు ఏ మాత్రమూ పూనుకోక, దాపరికం లేకుండా, ఈ విధంగా వ్రాసినాడు. "మీ దేశంలో నేను రగిలింపబోయే కార్చిచ్చును, మీ గంగానదిలోని జలమంతా పోసికూడా, మీరు ఆర్పలేరు." బెంగాలు ప్రాంతాన్ని బ్రిటీషువారు వశపరచుకోవడంలో వారు జరిపిన "యుద్ధాలు, వంచనలు, కుయుక్తులు, కుట్రలు, రాజకీయ సంధానాలు, దేవునికిమాత్రమే తెలిసిన ఇతరదుశ్చర్యలు;"- మొదలైన వాటితో ఏర్పడిన విషాదగాథను విస్తారంగా వివరించడం, ఇప్పుడు, అనవసరం.

జూన్ 1757లో జరిగిన ప్లాసీ యుద్ధంతో, సిరాజ్-ఉద్-దౌలా పడిపోయినాడు. మీర్ జాఫర్ ఆంగ్లేయులకు కృతజ్ఞుడై, సిగ్గులేక "కల్నల్ క్లైవుకు నక్కగా" పనిచేయడానికీ, బెంగాలు నవాబు పదవిలో బొమ్మగా కూర్చోడానికీ, ఇష్టంతో అంగీకరించినాడు. ప్లాసీ యుద్ధంతో ఆరంభమైన పరిణామ పరంపర, ఇండియా దేశ వ్యవస్థనే పూర్తిగా మార్చివేసింది. శతాబ్దాలుగా ప్రవృత్తిలో ఉండిన ఆర్థిక పద్ధతి, ప్రభుత్వపద్ధతి, పూర్తిగా రూపాంతరం పొందినవి.

ప్లాసీ యుద్ధంతో, అధికారం ఆంగ్లేయుల వశమైపోయింది. 1764లో జరిగిన బక్సార్ యుద్ధంతో, ఆంగ్లేయులకు దేశంలో హక్కులు సిద్ధించినవి. నామ మాత్రమైన అధికారం గల మొగల్ చక్రవర్తి, బెంగాల్, బీహార్, ఒరిస్సా ప్రాంతాల దివానీని [పౌర ప్రభుత్వం] కంపెనీ వారికి అనుదానం కావిస్తూ, ఫర్మాన్‌ను జారీచేసినాడు. కంపెనీ చరిత్రలోని సక్రమమైన ఆర్థిక వాణిజ్య ఘట్టం, దీనితో ముగిసింది; రాజకీయాధికార బలంతో, ప్రభుత్వ రాజస్వధనాన్ని ఉపయోగించి నడిపే వాణిజ్యం ప్రారంభమయింది. ఇండియా దేశ చరిత్రలో, నూతన సాంఘిక శక్తులు ప్రవృత్తం కావడానికి, ఇదే ప్రారంభం. ఇదివరకే పాశ్చాత్య దేశాలలో ఉత్పన్నమైన ఈ సాంఘిక శక్తులు, క్రమంగా, సముద్రాలను, ఖండాలను, దాటి, భూభాగాన్నంతటినీ ఆక్రమించబోతున్నవి.

*ఆంగ్లేయుల విజయానికి మూలములైన హేతువులు* : ఎదురులేని ఆంగ్లేయుల ఈ మహాబలాన్ని నడిపే కార్యకర్తలు అందరూ, చాల భాగం, అన్యాయపరులు, అత్యాశాపరులు, కలహశీలురు, ఈర్ష్యాపరులు. ఇది ప్రామాణికమైన చారిత్రక సత్యమై ఉండడం, అత్యాశ్చర్యాన్ని కలిగిస్తుంది. దుర్మార్గులైన ఈ సాహసికుల ఆధిపత్యంలో పనిచేస్తున్న సిబ్బందీ సమస్తమూ, అపరాధులు, స్వపక్షద్రోహులు, సంకరజాతులు, యూరోపు దేశజాతుల పోకిరీలు, మొదలైన నీచులతో ఏర్పడింది. లోకాని కంతకూ తుచ్ఛులైన వారందరూ, ఈ సిబ్బందిలో చేరినారు. "ఒక చొక్కాకుకూడా నోచుకోని బిచ్చగాండ్లను, ఉద్యోగులుగాను, అధికారులు గాను, కంపెనీ ఇండియాకు పంపిస్తూ ఉంది". అని డూప్లే పలికినాడు. వీరి ప్రవృత్తిని ప్రత్యక్షంగా చూచిన ఒక విదేశీయుడు, బొంబాయి వదిలి వెళ్ళిపోయిన తర్వాత, ఈ విధంగా వ్రాసినాడు. "ఈ ప్రదేశంలో, అన్ని విధములైన దుష్ప్రవృత్తులు ఎంత విప

రీతంగా మితిమీరిపోయినవో చెప్పడానికి నాకే జుగుప్స కలుగుతుంది. ఆచరణపు మూలము లైన ఆంగ్లేయుల దుష్ట తత్త్వాలు, వాటిని అనుసరించిన పాపకార్యాలు అకాల సంకటాలను క్లేశాలను, వారికి వేగంగా తెచ్చిపెట్టినవి. ఈ అంటురోగాలకు సంబంధించిన విషవాయువులు వీరి మర్మ స్థానాలను, జీవనాడులను ఆక్రమించి, పరలోక యాత్రకు శీఘ్రమార్గాన్ని కల్పించినవి. అమిత భోగాసక్తి, అసభ్యత, మర్యాదహీనమైన వ్యభిచారి ప్రవర్తన,- మొదలైనవి స్వేచ్ఛగా జరగడానికి నూతనఅవకాశం లభించింది." ఈ వ్రాతకు ఆండర్సన్, ఈవిధంగా ఎక్కువ విషయాన్ని చేరుస్తాడు. "అన్నిరకములైన దుర్వ్యసనాలు మితిమీరి ప్రవృత్తిలో ఉన్నవి. అత్యంతము హేయములైన పాపాలను విశృంఖలంగా, అవధిలేక, అనుభవిస్తున్నారు. దుర్వ్యసనాలు ఇంత వ్యాప్తిలో ఉండడం ప్రత్యక్షంగా చూచి గ్రహించడానికి, కంపెనీ డైరెక్టర్ల సభను ఆహ్వానించవలసిన అవసరంఉన్నది. నీతి, పూర్తిగా భ్రష్టమై పోయింది. కాబట్టి, డైరెక్టర్లు కలుగచేసుకోవలసివచ్చింది. కంపెనీ అధికారులనుంచి తక్షణమే సంస్కరణచర్యలను తీసుకోవలసిందని ఆదేశిస్తూ 1862 లో కఠినమైన ఉత్తర్వులు వచ్చినవి. 'వ్యభిచారము, దుర్వ్యయము, అశ్రద్ధ, అవివేకము, సర్వసామాన్యమై ఉండడంచూచి, డైరెక్టర్లు తమ తిరస్కారాన్ని నిష్కర్షగా తెలుపుతున్నారు.' "అతివ్యయంతో కూడిన అలవాట్లను, దుర్వ్యసనాలను, ఆపడానికి, కంపెనీ డైరెక్టర్లు నిశ్చయించుకొన్నారు." అని ఆజ్ఞాపత్రంలో ఖండితంగా వ్రాసినారు.

వీరి పాపప్రవృత్తులకు బలిఐన దేశీయుల నైతికవ్యవస్థకూడా ఇటువంటిదే, అనే విషయం ఒక్కటే ఆంగ్లేయులకు అనుకూలమైన వాదం. ఇండియా రాజులు, సంపన్నులుకూడా ఆంగ్లేయులను ఎదుర్కొని నిలిచి, పోరాడినవారే. కాని, వారి ప్రవృత్తులుకూడా అపేక్షించ తగినట్టివి కావు. డూప్లే వారిని "ఆత్మవిక్రయపరులు, భీరువులు." అని వర్ణించినాడు. "ప్రభుత్వ పరిపాలనకు, రాజనీతి విశ్వాసానికి, సంబంధించిన ప్రాథమిక సూత్రాలనుకూడా గ్రహించజాలనివారు." అని దేశరాజుల యోగ్యతనుగూర్చి, డూప్లే, వ్రాసిఉన్నాడు.

ఈ రాజుల స్వభావానిగూర్చి డూప్లే, "అంధవిశ్వాసం కలవారు, చంచలస్వభావులు, పరస్పరసంశయగ్రస్తులు. బలప్రదర్శనంలోను, భయపెట్టి తమకార్యాన్ని సాధించుకోవడం లోను నమ్మకం కలవారు; డబ్బుకుమాత్రమే ప్రాధాన్యం ఇచ్చేవారు; భోగవిలాసాలలో ఆసక్తులు; విషయ లంపటులు," అనే వాక్యాలను ప్రయోగించినాడు. ఇండియాలో సామ్రాజ్య నిర్మాణానికి పూనుకొన్న ఈ విదేశీయుని నిర్ణయంలో అతిశయోక్తి, మత్సరము చేరి ఉండవచ్చు. కాని, ఇతని నిర్ణయాన్ని, స్తిమితస్వభావులైన ఇండియా చరిత్రకారుడుకూడా, చాల వరకు సమర్థించినాడు. పద్దెనిమిదోశతాబ్దంలోని, ఇండియా పరిపాలనవ్యవస్థ అత్యంతము అప్రామాణికమైనదని, అసమర్థమైనదని, జదునాథసర్కార్ వ్రాసిఉన్నాడు. పరిపాలకులను గూర్చి, "అల్పులు, స్వార్థపరులు, గర్విష్ఠులు, ప్రజాపాలకవర్గానికి అనర్హులు" అని వర్ణించినాడు. "బుద్ధిశూన్యులైన వ్యభిచారులు, పరపీడనరతులు" అనే పదాలను వారి విషయంలో ఇతడు ప్రయోగించినాడు. వారి పరిపాలనలో "కుటుంబజీవిత పవిత్రతకు భంగం వాటిల్లింది......దుర్వ్యసనాలకూ అవివేకప్రవృత్తులకూ, మతం, పరిచారికగా సిద్ధించింది."

పౌరసంబంధమైన నైతికప్రవృత్తి, రాజకీయపరిజ్ఞానము, వారికి లేవు, అనే విషయంలో సందేహంలేదు. పౌరసంబంధమైన సచ్ఛీలమెట్టిదో వారికి తెలియదు. రాజ్యవిషయంలోను,

దేశవిషయంలోను, భక్తివిశ్వాసాలు లేనివారు. మతంపట్లకూడా స్థిరనిష్ఠ, విశ్వాసము, వారికి లేవు. కాని, ధైర్యసాహసాలు లేనివారు, అనే ఆరోపణ అన్యాయమైనది. వారిలో అనేకులు, ప్రాణానికి వెరవని ధైర్యశాలులు, అవిశ్రాంతంగా పోరాడిన వీరులు, సాధనోపాయ కుశలులు, ప్రశాంతభావంతో ఆత్మార్పణ చేయగల ధీరులు, బాధలను భరించడంలో అంతులేని సహనం చూపగలిగినవారు. జీవితాంతంవరకు, వ్యక్తులపట్ల విశ్వాసాభిమానాలను వహించగలిగినవారు అనేకులు. తమ మాటను నిలబెట్టుకోడానికై వీరోచితకార్యాలకు నిశ్చయించినవారుకూడా అనేకులు ఉండినారు.

వారు అపజయాన్ని పొంది, అవమానానికి పాల్పడడం, ఆంగ్ల ఫ్రెంచివారితో సమానమైన ధైర్యసాహసాలు లేకకాదు. వారి ఆయుధసామగ్రి, యుద్ధతంత్రాలు సమర్థములైనవి కాకపోవడంకూడా వారి అపజయానికి కారణాలు కావు. బ్రిటీషువారికి లభించిన విజయం దుశ్శీలంపై సచ్ఛీలం సాధించిన జయం కాదు. పద్దెనిమిదో శతాబ్ద ప్రథమభాగంలో ఇంగ్లాండు ప్రజల నైతిక ప్రవృత్తికూడా ఏమాత్రమూ ఆదర్శప్రాయమైనది కాదు.

జార్జ్ I, జార్జ్ II లు, ఇరువురూ, ఆ కాలపు ఢిల్లీ, ముర్షీదాబాద్, పూనా, హైదరాబాదు ప్రాంతాలరాజులకు, ప్రవృత్తివిషయంలో, ఏమాత్రమూ తీసిపోయినవారుకారు. చెస్టర్‌ఫీల్డ్ ప్రభువు జార్జి I ను గూర్చి వ్రాస్తూ, సోమరి, అలసుడు, మొరటుమనిషి, తుచ్ఛుడైన ఇంద్రియలోలుడు, హాస్యగాండ్ర సాహచర్యంతో వినోదించేవాడు, లావుపాటి స్త్రీలపై మోజు కలవాడు, ఇంగ్లాండు దేశంపై అభిమానంలేనివాడు. అని వర్ణించినాడు. తండ్రి ముంగోపం తప్ప, తక్కిన అన్ని లక్షణాలలోనూ, రెండో జార్జి అచ్చం తండ్రిపోలికే. మందబుద్ధి, ఉదాసీనుడు, స్వార్థసాధనకై సమయానుకూలంగా నడచుకొనేవాడు ఇతడు. ఒకప్పుడు అతడు చెప్పినమాటనుబట్టి అతని విద్యాబుద్ధుల సామర్థ్యం వ్యక్తమౌతుంది. చిత్రలేఖనానికి, కవిత్వానికి తనకు సమయంలేదని చెప్పడంలో, (Painting, poetry) అనే పదాలను Bainting, Boetry అని ఉచ్చరిస్తాడు.

ఉద్యోగాలకు ప్రాకులాడే స్వార్థసాధనపరులతో వీరి పార్లమెంటు ఏర్పడినది. ఓట్ల అధికారం కలిగిన నీతిభ్రష్టములైన గ్రామాలు ఎన్నుకొన్నవారు, ఈ పార్లమెంటుసభ్యులు. లండన్‌నగరప్రజలు, వినయప్రవర్తనకు, శాంతిభద్రతలకు ఏమాత్రమూ లెక్కపెట్టని రౌడీమూక. ఈ పోకిరీల పుండాతనంవల్ల, రాత్రులు వీధులలో సంచారంచేయడంకూడా అపాయకరమై ఉండింది. "మా ఆంగ్లేయులకు, దెబ్బలాటపై చాల అభిరుచి" అని ఆకాలపువ్యక్తి ఇచ్చిన అభిప్రాయం. 'జిన్' అనే మద్యాన్ని మితిమీరి త్రాగేవారు. బాగా త్రాగిన యువజనం, అన్ని విధములైన దౌర్జన్యాలను విచ్చలవిడిగా జరిపేవారు. శ్రీమంతులైన తుంటరులగుంపులు (Mohocks), నర్తకబోధకులు, దొమ్మరాటవాండ్లు, దారులుకాచి, స్త్రీలను పురుషులను కొట్టి, ముక్కులుకోసి, దోచుకొనేవారు; సంసారిస్త్రీలను పీపాలలోపెట్టి, స్నోహిల్, అనే గుట్టపైనుంచి కిందికి దొర్లించేవారు; అనేకవిధములైన అసభ్యప్రవర్తనలకు వారిని గురిచేసేవారు.

రక్షకభటులు అసమర్థులు; ఎల్లప్పుడూ తాగి ఉండేవారు. తప్ప తాగిన ఒక రక్షకభటుడు, ఇరవై ఐదు, ఇరవై ఆరు మంది బిచ్చగాండ్లను,-[స్త్రీలతో, ఒక గర్భిణీ స్త్రీతో, ఒక వర్తకునితో సహా]-సెంట్‌మార్టిన్ వద్దగల ఠాణాలో, రాత్రంతా బంధించి ఉంచినాడని,

తలుపులు కిటికీలు బంధించడంవల్ల, దప్పిచెంది, రాత్రంతా బంధితులు నీటికై అరుస్తూ ఉంచి రని, హారేస్‌వాల్‌పోల్, లిఖించి ఉంచినాడు. ఉదయమయ్యేటప్పటికి, నలుగురు శ్వాస తప్పి పడి ఉండినారు. వారిలో ఇద్దరు, తర్వాత చనిపోయిరి. పంద్రెండుగురు శోచనీయా వస్థలో ఉండిరి.

దొంగలు, దోపిడిగాండ్లు, దారులు కాచేవారు, అసంఖ్యాకులై ఉండిరి. "ప్రయాణం చేయదలచుకొన్న వారు, పగటివేళలోకూడా, యుద్ధానికి పోతున్నట్లు, ఆయుధబల సన్న ద్ధులైపోవలసి వచ్చేది." అని వాల్‌పోల్ వ్రాస్తాడు. దౌర్జన్యము, దొంగ వ్యాపారము, జంతు వులను పోట్లాడించడం, వ్యభిచారము, విషయలాంపట్యము, సర్వసామాన్యములైన ప్రవృ త్తులు. స్త్రీ పురుష సంబంధాలు, అతి సడలమైనట్టివి. నీతి భ్రష్టులైన పాదిరీలు నడిపే రహస్య వివాహాలు (Fleet marriages),- అనగా "ఒప్పుకొని పురుష సంగమాన్ని పొందడం," సక్రమమైనవిగా పరిగణింపబడేవి. "భార్యలను విడిచిపోవడం వ్యభిచార దాంపత్య ద్రోహం, స్త్రీకి ఇరువురు భర్తలు, పురుషునికి ఇరువురు భార్యలు ఉండడం, వంచక పాదిరీలు నడిపే కృతక వివాహాలు,-మొదలైనవన్నీ ఆ కాలపు సమాజ వ్యవస్థకు సహజ ములై, తరచుగా నడుస్తూ ఉండినవి." అని లెక్కీ (Lecky) వ్రాస్తాడు. భార్యలను వేలంలో అమ్మడం, ఆనాడు అలవాటులో ఉండింది.

చిత్తోద్రేకము, ఉన్మాదము, దేహాన్ని బాధించుకొనే తపశ్చర్య, అలౌకిక సంఘటనల లోను, మంత్ర ప్రయోగంలోను, నమ్మకము, మతధర్మశాస్త్ర అభిప్రాయ వైవిధ్యము,- మొదలైన వాటితో కూడిన మత పునరుజ్జీవన ఉద్యమం, విస్తార వ్యాప్తిలో ఉండింది. నీతి శాస్త్ర నిబంధనలను తోసివేసే ప్రవృత్తులు ప్రబలములై ఉండినవి.

పద్ధెనిమిదో శతాబ్దంలో, ఇండియా సాంఘిక పరిస్థితులు, ఇంగ్లాండు సాంఘిక పరిస్థి తులుకూడా హితకరమైనవి కావు, అని సంగ్రహంగా చెప్పవచ్చు. కాని, ఆంగ్లేయులు ఒక విషయంలో భారతీయులకంటె శ్రేష్ఠులు. జాతీయ భావాన్ని అభివృద్ధి పరచుకొని, జీవి తంలో క్రమశిక్షణను, వ్యవస్థా విధానాన్ని అలవరచుకొని ఉండిరి. భారతీయులకు ఈ విష యాలు తెలియవు.

ఆంగ్లేయులు బెంగాలును జయించిన విధానం, ప్రపంచచరిత్రకు కొత్త. పూర్వం ఎప్పుడూ ఇట్టిది జరగలేదు.

ఈ ఆక్రమణప్రక్రియను జరిపినవారు కేవలం ఒక వాణిజ్యసంస్థలోని వర్తకులు; యుద్ధానుభవంకాని, వ్యూహనిర్మాణాది సంగ్రామతంత్రాల అనుభవంకానీ, లేనివారు. వీరి సేనలను నడిపినవారు, చాలవరకు, తమ కార్యాలయాలలో గుమాస్తా ఉద్యోగాలను నిర్వహిస్తూ ఉండినవారు. ఇచ్ఛాపూర్వకంగా యుద్ధంలో చేరినవారు కొందరు, సందర్భాల ప్రాబల్యంవల్ల యుద్ధంలో వచ్చిపడినవారు కొందరు, ఈవిధంగా వీరు యుద్ధచర్యలో పాల్గొన్నారు. వీరు జయించిన జాతివారు ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాలలోని అడవిజాతులవంటివారు కారు; అర్ధ నాగరికులైన, అమెరికా రెడ్‌ఇండియనులవంటివారూ కారు. మిక్కిలి పరిణతమైన ప్రాచీన సంస్కృతి కలవారమని గర్వించే భారతీయులు. సంస్కృతివిషయంలో వీరు సాధించిన [illegible] కార్యాలు ప్రపంచవిఖ్యాతి కాంచినవి. భారతదేశంలోని వివిధములైన [illegible] ఉత్కృష్టములైన కళలు, శిల్పకౌశలవిషయంలో పాశ్చాత్యదేశాల వాటికంటె [illegible]

మైనవి, శ్రేష్ఠమైనవి. తత్త్వశాస్త్ర, మతసారస్వతవిషయాలలో భారతదేశాన్ని మించిన దేశం లేదు. కాని, విజ్ఞానశాస్త్రము, సాంకేతికశాస్త్రము, రాజకీయాలు, మొదలైన లౌకిక శాస్త్రాలలో పాశ్చాత్యదేశాలు భారతదేశానికి ఎంతో ముందున్నవనడంలో, సందేహమేలేదు. ఐనప్పటికీ, పద్దెనిమిదోశతాబ్దంనాటికి, ఇండియాకు పాశ్చాత్యదేశాలకు, ఈవిషయంలోగల అంతరం అంత ఎక్కువైనది కాదు.

ఆంగ్లేయుల విజయం మరొకవిధంగా కూడా విశేషమైనది. ఆంగ్లేయుల యుద్ధవ్యయ మంతా, జయింపబడిన భారతీయులే వహించవలసివచ్చింది. యుద్ధనిర్వహణకు, దేశాక్రమణకు, జరిగిన ఖర్చుకు విజేతలైన ఆంగ్లేయులు ఒకపైసాకూడా ఇవ్వలేదు. అంతేకాదు, తమ్ము జయించడానికి ఆవశ్యకములైన సమస్తసాధనములను కూడా, చాలభాగం జయించబడిన భారతీయులే, విజేతలకు సమకూర్చిఉండడం, ప్రకృతి విచిత్రం. దక్కన్ యుద్ధాలలో (1744-54) పాల్గొన్న సైన్యంలో, ఆంగ్లసైనికులు 300 మంది మాత్రమే. తక్కిన మూడు నాలుగువేలమంది సిపాయీలూ, భారతీయులే. వీరిలో, క్రైస్తవులు, ముస్లిములు, హిందువులు కూడా చేరినారు. క్లైవునాయకత్వంలో 950 మంది ఆంగ్లేయ పదాతిసైనికులు, 150 మంది తుపాకిసైనికులు, 2100 మంది సిపాయిలు, ప్లాసీయుద్ధాన్ని నిర్వహించి, ఆంగ్లేయులకు విజయాన్ని చేకూర్చినారు. ఈ 2100 మంది సిపాయీలలో, తెలుగువాళ్లు (తెలింగా) పఠానులు, జాట్లు, రజతపుత్రులు, బ్రాహ్మణులు కూడా, చేరిఉండిరి.

ఈవిధంగా, ఇంత చౌకగా, సాధించిన విజయానికి సదృశమైనది, ప్రపంచచరిత్రలో కానరాదు. ప్లాసీయుద్ధంలో 7 మంది యూరోపుసైనికులు, 13 మంది సిపాయిలు మరణించి నారు. 13 మంది యూరోపుసైనికులు, 36 మంది సిపాయిలు, గాయపడిరి. ఆంగ్లేయులకు కలిగిన నష్టం ఇంతమాత్రమైనదే. ఇండియాలో అతిసంపన్నమైన బెంగాలుప్రాంతంపై ఆధి పత్యము, వీరికి దీనివల్ల సిద్ధించిన బహుళలాభం. మూడుకోట్ల జనాభాతో, సంవత్సరానికి 2.55 కోట్ల రూపాయల రాజస్వ ఆదాయంతో కూడిన ఈ విశాల భూభాగం, ఆంగ్లేయులకు ఏమాత్రమైన ఖర్చు లేకుండా, ప్రాప్తించింది.

బెంగాలులోని విస్తృతమైన మూలసాధనాలను ఆంగ్లేయులు క్రమశిక్షణతో, వ్యవస్థీక రించడానికి ప్రారంభించిరి. ఆంగ్లేయుల ప్రతిష్ఠ, దేశంలో అత్యున్నతస్థాయిని అందుకొన్నది. మొగలుల సామ్రాజ్యానికి పోటీపడేవారిలో, ఆంగ్లేయులది ప్రథమస్థానం, అనేభావం వ్యాప్తికి వచ్చింది. వీరి అదృష్టం ఫలించి, పానిపట్ వద్ద మహారాష్ట్రులకు గొప్పఅపజయం కలగడము. మహారాష్ట్రులలో అంతఃకలహాలు చెలరేగడము, అహమద్‌షా అబ్దాలీ మరణించడంతో ఆఫ్ఘనిస్థాన్‌లో అరాజకపరిస్థితులు ఏర్పడడము, అనే సంఘటనలు జరిగినవి. అంతతో, మొగల్ పదవికి ప్రబలప్రతిస్పర్ధులై ఉండిన మహారాష్ట్రులూ, ఆఫ్ఘనులూ ఆంగ్లేయులమార్గం నుంచి తొలగిపోయిరి.

బక్సారు యుద్ధ ఫలితంవల్ల, బ్రిటిషువారు బెంగాలు ప్రాంతానికి, న్యాయరీత్యా ప్రభుత్వ పరిపాలకులుగా ఏర్పడిరి. దీనిలో ఔధ్ నవాబుయొక్క సహాయ మైత్రి కూడా నిబద్ధమై ఉండడంవల్ల, బెంగాలుకు పశ్చిమంలోని సరిహద్దులు ఆంగ్లేయుల అధికారంలోనికి వచ్చినవి. దీనితో, ఢిల్లీ చక్రవర్తి కేవలం, నివృత్తి వేతనం పుచ్చుకొనే వ్యక్తి స్థానానికి దిగి పోయినాడు; కాబట్టి మొగల్ సామ్రాజ్యాన్ని పునః సాధించుకొనే అవకాశం ఏనాటికీ లేని

వాడైనాడు.

తాల్మితోకూడిన స్థిర ప్రయత్నం ఉత్తమమైన సౌశీల్యమని, డూప్లే, విసుగు లేక బోధిస్తూ ఉండేవాడు. దానిని చక్కగా అభ్యసించిన వారు, ఆంగ్లేయులు. మిత వ్యయం అనేది కూడా, ఇట్టి సౌశీల్యమే అని ఆంగ్లేయుల దృఢ విశ్వాసం. ఈ విషయమైన హెచ్చరిక కూడా వీరికి ఫ్రెంచివారి వల్లనే కలిగింది. ఫ్రెంచివారి వ్యాపార పద్ధతులు పొదుపుతో కూడినవి కావు. కాబట్టి, ఆంగ్లేయులు వాటిని అసహ్యించుకొనేవారు. ఇండియాలో ఫ్రెంచివారు ఏర్పరచుకొన్న స్థాపనను, "క్రైస్తవ ఆరాధన సంగీతాన్ని వినడానికి పనికివచ్చే చిన్న చర్చి" అని, ఆంగ్లేయులు తమ నిరసన భావాన్ని ప్రకటించిరి. 1765 తర్వాత, ఆంగ్లేయులు అంతవరకూ సాధించినది చాలుననుకొని, తమ భూభాగాలను సంఘటితం చేసుకోడానికీ, లాభాలను వృద్ధిపరచుకోడానికీ పూనుకొనిరి. ఇంగ్లాండులోని కంపెనీ డైరెక్టర్ల సభ, ఇండియాలోని తమ కార్యకర్తలకు ఈ విధమైన ఆదేశాన్ని పంపింది,- "(ఇండోస్తాన్) ఇండియా దేశాన్ని సమైక్యపరచే పాత్రను వహించడం, కంపెనీ ఆశయం కాదు.......... ఇండియాలోని రాజులు ఒకరికి ఒకరు ప్రతికూలురుగా, పరస్పర విరోధులుగా ఉండేటట్లు చూడడమే, మనకు ప్రయోజనకరమైన పరిస్థితి. మనం వారితో ఐక్యం కలిగించుకోకుండానే, ఈ పని జరగడం శ్రేయస్కరం."

*తరువాతి విజయాలు, రాజ్య విస్తరణము :* ఇండియా రాజకీయాల సుడిగుండంలో పడిన తర్వాత, బైటపడడం సాధ్యంకాలేదు. బొంబాయి చుట్టూగల పడమటి తీరము, మదరాసు ప్రాంతపు ఆగ్నేయ భాగతీరము, కలకత్తా ప్రాంతపు ఈశాన్య తీరము,- ఈ మూడు ప్రాంతాలు బ్రిటీషువారి ప్రయోజనాలకు కేంద్రాలు. మహారాష్ట్ర ప్రాంతాలు బొంబాయిని అన్ని వైపులా ఆవరించి ఉన్నవి. మహారాష్ట్ర పరిపాలకుల రాజకీయ కార్య కలాపాలు, బొంబాయి శ్రేయోభివృద్ధికి ప్రతిబంధకములైనవి. దక్షిణ భారతంలోని బ్రిటీషు రాజ్యాలు, మూడు దేశీయ ప్రభుత్వాల ప్రభావాలకు అత్యంత సన్నిహితమై ఉన్నవి. ఈ మహారాష్ట్ర మైసూరు, నైజాం రాజ్యాలు మూడూ, తమ సహాయమైత్రీ సంబంధాలను పదే పదే మార్చుకొంటూ, నూతన సంయోగాలను ఏర్పరచుకొంటూ ఉండేవారు. తాము క్రొత్తగా జయించుకొన్న రాజ్య భాగాలను రక్షించుకోడానికి, ఇతరులు వాటిని అతిక్రమించకుండా చేయడానికి, బ్రిటీషువారు ఈ రాజ్యాల పరస్పర కలహాలలో ప్రవేశించడం, ఆవశ్యకమయింది. అందులోనూ, ఫ్రెంచివారు ఈ రాజ్యాలతో దేనితోనైనా స్నేహం కల్పించుకొన్న సందర్భంలో, తమకు ప్రతి స్పర్ధులైన వారిని నశింపచేయడానికై, బ్రిటీషువారు ఈ రాజ్య కలహాలలో దిగడం ఎక్కువ అవసరమయింది.

ఉత్తరభారతంలో, మొగల్‌సామ్రాజ్యాధికారం పూర్తిగా క్షీణించిపోయింది; కాని పేరు ప్రతిష్ఠలుమాత్రం ఇంకా నిలిచిఉన్నాయి. ఈ శవానికై జరిగిన తీవ్రసంఘర్షణ కోలాహలం, పద్దెనిమిదోశతాబ్దపు కడపటిభాగమంతా ప్రతిధ్వనించింది. దీనికై ఘర్షణపడినవారిలో మహారాష్ట్రులు, ఆఫ్గనులు, ముఖ్యులు. సహాయకపాత్రలు ధరించినవారు అనేకులు. వీరు, ఒక పక్షంనుంచి మరొకపక్షానికి, క్షణక్షణానికీ మారుతూఉండడం, రంగులపెట్టెలోని మార్పుల వలె జరిగిపోయింది. కాబట్టి, ఈ విషాదాంత నాటకం, అసాధారణమైన సంక్లిష్టవ్యవహారంగా సిద్ధించింది. రోహిల్లా సర్దారులు, ఔధ్‌నవాబులు, ఢిల్లీ రాజాస్థానంలో ప్రాబల్యాన్ని సంపా

దించుకోడానికై, పరస్పరం, పదేపదే పోరాడుతూ వచ్చిరి. రజపుత్రులు, జాటులు కూడా ఈ వ్యవహారంలో పాల్గొన్నారు. శతాబ్దాంతంనాటికి, సిక్కులు కూడా దీనిలో ప్రవేశించిరి. అనుసంధానాలు, కుట్రలు, పన్నుగడలు, ఎడతెగని పన్నాగాలు, దండయాత్రలు, దాడులు, - మొదలైన వీరి చర్యలు, దేశంలోని భద్రతకు భంగం కలిగిస్తూ, అంతటా అరాజకపరిస్థితులను వ్యాపింపచేసినవి. దోఆబ్ ప్రాంతపు కింది భాగాన్ని ఆంగ్లేయులు ఇదివరకే తమ ప్రభావానికి లోబరచుకొని ఉండినారు. ఇప్పుడు దేశీయరాజులు తాగినవారివలె చేస్తున్న ఈ పిచ్చి గలభా నంతటినీ కనిపెట్టుతూ, ఆంగ్లేయులు తగిన సమయానికై వేచియుండిరి.

డైరెక్టర్ల సభ, వ్యతిరేకమైన ఆదేశాలు పంపిఉన్నప్పటికీకూడా, మదరాసు, బొంబాయి, బెంగాలు రాజధానులలో, బ్రిటిషువారు, నిరంతరమైన యుద్ధాలు సాగిస్తూనే ఉండిరి. తామై స్వయంగానో, లేక, ఇతరపక్షాలవారికి సహాయకులుగానో, వీరు యుద్ధాలలో ప్రవేశిస్తూ వచ్చిరి. ఇందుకు కారణాలు లేకపోలేదు. కలకత్తాప్రాంతంలో జరిగిన అభివృద్ధికార్యాలను, సాధించుకోడానికి మదరాసు, బొంబాయి, ప్రాంతాలుకూడా, ఉత్సహిస్తూఉండినవి. రాజస్వాదాయాన్ని వృద్ధికావించుకొనే ఆశ, రెండుప్రాంతాలకూ కలిగించి. దానికై, తన ఆధీనంలోఉన్న రాజ్యాన్ని విస్తరించుకోవడం తప్పక అవసరమయింది. ఇండియారాజు లందరూ ఐక్యంగా జరిపే కార్యాచరణం భయావహమైనదే. కాబట్టి, ఈ రాజులమధ్య, ప్రాబల్య సమతౌల్యాన్ని (Balance of Power) నెలకొల్పడం, బ్రిటిషువారికి అత్యావశ్యకం. పరస్పరం ఈర్ష్యాపరులైన దేశీయరాజులు, తమ స్వార్థపరత్వంవల్ల సిద్ధించే పరిణామాలు ఎట్టివో ఊహించక, భావిదృష్టిలేనివారై, కంపెనీవారికి ప్రయోజకమైన కార్యక్రమాన్ని నడిపినారు. తమకు ఇతర రాజులతో కలిగిన యుద్ధాలలో, ఆంగ్లేయుల సహాయాన్నికోరి, ఆంగ్లేయులు పూనుకొన్న తంత్రాంగానికి అవకాశం కల్పించినారు. సప్తవార్షికయుద్ధం ముగిసినప్పటినుంచీ, ప్రతీకారావకాశానికై, ఫ్రెంచివారు నిరీక్షిస్తూఉండినారు. బ్రిటిషువారికి ఏర్పడిన కష్టాలను పూర్తిగా ఉపయోగించుకొని, వారి సామ్రాజ్యాన్ని, అతివిస్తృతమైన వారి వాణిజ్యాన్ని, నశింపచేయడానికి, సర్వదా ప్రయత్నిస్తూ ఉండినారు. అమెరికాలోని బ్రిటిషు వలసరాజ్యాలు స్వాతంత్ర్య యుద్ధాన్ని ప్రకటించడంతోనే, ఫ్రాన్సు ప్రభుత్వం, అట్లాంటిక్ సముద్రంమీదుగా వెళ్లి, అమెరికా వారికి తోడ్పడింది. అంతేకాక, ఆంగ్లేయులకు చిక్కులు కల్పించే ఉద్దేశంతో, హైదర్ఆలీ, టిప్పుసుల్తానులకు సహాయంగా, సైన్యదళాలను ఇండియాకు పంపింది. ఇండియారాజులతో ఫ్రెంచివారు జరుపుతున్న సంధానాలు, రాజులసైన్యాలలో ఫ్రెంచిసేనాధికారులు ప్రవేశించడము, తమపట్ల జరిపిన విరోధచర్యలుగా, కంపెనీవారు భావించిరి. ఫ్రెంచివారి ప్రయత్నాలన్నిటినీ జాగ్రతగా పరిశీలిస్తూ, వాటికి తగిన ప్రతిచర్యలను ముందుముందే జరుపుతూ, వచ్చిరి. ఈవిధంగా, ఆంగ్లేయులు దేశరాజులను ఒకరితర్వాత ఒకరిని నశింపచేస్తూ, లేదా, అణచివేస్తూ వచ్చిరి. ఇది, వారు అవలంబించిన కార్యక్రమ ప్రక్రియ. తత్ఫలితంగా, సమస్త భారతదేశమూ, కడపట, ఆంగ్లేయులకు ఆధీనమైపోయింది.

**హైదరాబాద్ నైజామ్ :** ఆంగ్లేయులు అనుసరించిన ప్రక్రియ, రెండు కాలావస్థలలో జరిగింది. మొదటి అవస్థలో, దక్కను రాజ్యాలను తమ ప్రభావానికి ఆధీనం చేసుకొన్నారు. రెండవ అవస్థలో, బ్రిటిషు ప్రభుత్వాధికారాన్ని ఇండియా సరిహద్దుల వరకు వ్యాపింప చేసినారు. దక్కను ప్రాంతంలో ఉండినవి మూడు ప్రధాన రాజ్యాలు;- నైజామ్, మైసూరు

సుల్తానులు, మహారాష్ట్రులు. వీరందరిలోనూ దుర్బలుడైనవాడు నైజామ్. అతని రాజనీతి విధానం, చంచలమైనట్టిది. సప్తవార్షిక యుద్ధం ముగిసేవరకు, అతడు ఫ్రెంచివారి ప్రభావాన్ని ఆశ్రయించి ఉంచినాడు. ఆ తర్వాత, బ్రిటిషువారితో సహాయక మైత్రిని ఏర్పరచుకొన్నాడు. 1795లో, మహారాష్ట్రులు ఇతనిని ఖార్దావద్ద ఓడించడంతోనే, మళ్ళీ ఫ్రెంచివారి వైపు తిరిగినాడు. కాని, బ్రిటిషు వారితో సహాయక మైత్రిని చేసుకొనేటట్లు, వెల్లెస్లీ, నైజామును సులభంగా ఒప్పించగలిగినాడు. (1798). ఈ విధంగా బ్రిటిషువారినుంచి సైన్య రక్షణను పొంది, దానికి బదులుగా తన స్వాతంత్ర్యాన్ని వదలుకొన్నాడు నైజాము. బ్రిటిషు సేనాధికారుల ఆధీనంలో ఉన్న గొప్ప సిపాయి దళాన్ని, ఇతని రక్షణకై నిలిపే ఏర్పాటు జరిగింది; కాని, ఈ సైన్యపు కర్చును భరించవలసినవాడు నైజామే.

మైసూరు : మైసూర్ సుల్తానులైన హైదర్‌ఆలీ, టిప్పూలు ఇంత సులభంగా లొంగిపోయే స్వభావం కలవారు కారు. బ్రిటిషు వారినీ, వారికి సహాయకులైన నైజామ్, మహారాష్ట్రులను కూడా వీరు ధిక్కరించిరి. ధైర్య సాహసోపేతములైన నాలుగు యుద్ధాలను జరిపినారు. మొదటి యుద్ధంలో, హైదర్ ఆలీ విజయం సాధించి, మదరాసు కోట గోడల లోపల నిలిచి, సంధి షరతులను విధించినాడు. రెండో యుద్ధంలో (1780-84) ఫ్రెంచి వారి సేనలు ఇతనికి సహాయంగా వచ్చినవి. 2000 మంది సైనికులు బుస్సీ నాయకత్వంలో ఇతనికి తోడైనవి. ఫ్రెంచి నౌకాధ్యక్షుడైన అడ్మిరల్ సఫ్రెన్, బ్రిటిష్ నౌకాదళాన్ని తరిమినాడు. కాని, ఇంగ్లాండు ఫ్రాన్సు దేశాలు, 1783లో సంధిపత్రాలపై సంతకాలు చేసిన తర్వాత, ఫ్రెంచివారు వెనుదిరిగిపోయిరి. మంగళూరులో జరిగిన సంధిషరతులతో రెండో యుద్ధం అంతమయింది. యుద్ధారంభానికి పూర్వం, ఇరు పక్షాలవారికీ ఉంచిన స్థానాలు యథాతథంగా ఉండేటట్లు, ఈ ఒడంబడిక నిశ్చయించింది. ఐనా, ఈ ఒడంబడికను భిన్నం కావించి, కారన్‌వాలిస్, మూడోసారి, యుద్ధాన్ని టిప్పూపై బలవంతంగా మోపినాడు. "షరతు అవలంబించిన మార్గం విశ్వాసరీత్యా అన్యాయమైనది మాత్రమే కాదు; టిప్పూ సుల్తాన్ మనస్సుకు నొప్పి కలిగించినట్టిది. ఏ విధంగా నైనా సుల్తానుతో యుద్ధాన్ని ప్రారంభించడానికే కారన్‌వాలిస్ ప్రయత్నం ఉద్దిష్టమయింది కాని, టిప్పూ సుల్తాన్ అత్యాశాపరుడై తన రాజ్యాన్ని విస్తరించడానికి ప్రయత్నించగా, ఆత్మ రక్షణార్థం బ్రిటిషువారు పూనుకొన్న యుద్ధం కాదు." టిప్పూకు అపజయాలు కలిగినవి; బ్రిటిష్ సైన్యం అతని రాజధానియైన శ్రీరంగ పట్టణాన్ని సమీపించినవి. సగం రాజ్యాన్ని బ్రిటిషు వారికి దత్తంచేసి, టిప్పూ సంధిని కొనుక్కోవలసి వచ్చింది.

నాలుగోయుద్ధంలో బ్రిటిషువారి ఫిరంగులు సాధించలేనిదానిని, కాని బంగారం సాధించింది. మంత్రులు సుల్తానుకు ద్రోహంచేసి, రహస్యాలను శత్రువులకు తెలిపిరి. కాని, టిప్పూసుల్తాన్ లొంగిపోవడానికి నిరాకరించి, తన కోటరక్షణార్థం ధైర్యంగా పోరాడి, రణరంగంలోనే మరణించినాడు. ఇంతటితో, హైదరాలీ రాజవంశం అంతమయింది. పూర్వపు హిందూ రాజవంశాన్ని తెచ్చి, బ్రిటిషువారు, సంకుచితమైపోయిన మైసూరురాజ్యానికి [illegible] సామంతులుగా నియమించిరి. టిప్పూసుల్తానుకు విరుద్ధంగా తమకు సహాయం చేసినందుకు నైజాముకు ప్రతిఫలంగా, మైసూరురాజ్యంలోని కొంతభూభాగం, లభించింది.

**మహారాష్ట్రులు :** మహారాష్ట్రుల బుద్ధిలేని పరస్పర వైషమ్యాలు, [illegible]

దౌర్జన్యంతో కూడిన స్వార్థసాధన ప్రయత్నాలు, - అనే దోషాలే, వీరి పతనానికి హేతువులైనవి. ఆత్మఘాతుకమైన అంతరాబంధ (Schizophrenia) రోగం, వీరిని పట్టుకొన్నట్టు తోస్తుంది. బ్రిటిషువారితో మహరాష్ట్రులకు కలిగిన మొదటియుద్ధం, రఘునాథరావుయొక్క దురాశవల్ల సిద్ధించింది. ఇతని అన్నకుమారుడైన పీష్వా మాధవరావ్, క్షయపీడితుడై మరణించినాడు. స్త్రీజనుల ఈర్ష్యలు, రాజనగరులోని కుట్రలు, కారణాలుగా, అతని తమ్ముడైన నారాయణరావును హత్యకావించిరి. రఘునాథరావ్ పీష్వా, గద్దెకు, ఆశించినాడు. కాని, గర్భిణియైయుండిన నారాయణరావు భార్యకు కుమారుడు జనించడంతో, రఘునాథరావుకు ఆశాభంగం కలిగింది. కాబట్టి, బ్రిటిష్‌వారి చేతుల్లోని కీలుబొమ్మవంటి పీష్వాగా ఉండడానికి అంగీకరించి, 1775 నాటి సూరత్ సంధి ఒడంబడికలో సంతకంచేసి, మహరాష్ట్ర రాజ్యస్వాతంత్ర్యాన్ని పారవేసినాడు. ఇట్టి అవకాశాన్ని ఉపయోగించుకోడానికై, బ్రిటిషువారు ఎంతో ఆతురతతో వేచిఉండినారు. కాని, ఈ ప్రయత్నం ఇంకా ఫలసిద్ధికి వచ్చియుండలేదు. మహరాష్ట్ర రాజ్యాల సమ్మేళనానికి, ఇంకా భంగం కలిగిఉండలేదు. మితవాదులు, సమర్థులు ఐన, మహాద్‌జీ సింధియావంటి మంత్రుల పలుకుబడి ఇంకా చెల్లుతూఉండింది. కాబట్టి, తర్వాత జరిగిన యుద్ధంలో రెండుపక్షాలవారికీ గెలుపు సమానంగా లభించింది. బ్రిటిషువారు అవమానాలకు పాల్పడిరి; కాని, గాడర్డ్, మధ్యభారతసీమల మీదుగా సేనలను నడిపించుకొని పోయి, సింధియాను ఓడించడంతో, ఆంగ్లేయుల ప్రతిష్ఠ నిలిచింది. 1782 లో జరిగిన సాల్‌బే సంధి ఒడంబడికతో, యుద్ధం ముగిసింది.

ఈ యుద్ధాలవల్ల ఆంగ్లేయులకు రాజ్యలాభం ఏదీ సిద్ధించలేదు; కాని, పూర్వముకంటె బలవంతులైరి. తమ అదృష్టం అతిహీనస్థితిలో ఉండినకాలంలో, మొదటి మహరాష్ట్ర యుద్ధాన్ని వీరు సాగించిరి. అమెరికాలోని వలసరాజ్యాలను ఆంగ్లేయులు పోగొట్టుకొంటూఉన్న కాలం అది. వీరి ప్రతిస్పర్థులైన యూరోపురాజ్యాలు, వీరికి సిద్ధించిన చిక్కులను స్వప్రయోజనార్థం ఉపయోగించుకొంటూ ఉండినవి. ఇక, ఇండియాలో, కంపెనీ వ్యవహారాలు సాఫీగాజరుగుతూ ఉండలేదు. కలకత్తాలోని కేంద్రాధిపత్యముయొక్క అభిప్రాయాలను పాటించక, ప్రాంతీయ గవర్నర్లు తమకు అభిమతమైన విధానాలను అనుసరిస్తూ వచ్చిరి. రెగ్యులేటింగ్ చట్టమువల్ల కలకత్తాలో క్లిష్టపరిస్థితి ఏర్పడింది. మండలి సభ్యులు గవర్నర్ జెనరల్ ప్రతిపాదించే విధానాలను నిరోధిస్తూవచ్చిరి. విత్తపరిస్థితికూడా తృప్తికరమై ఉండలేదు. ఇట్టి విషమపరిస్థితిలో అపాయము లన్నిటినీ జయించి, బ్రిటిషు ప్రయోజనాలను రక్షించిన కీర్తి, వారెన్ హేస్టింగ్స్‌కు దక్కింది. ఆ తర్వాత ఎన్నడూ, ఇటువంటి అపాయకరపరిస్థితి, బ్రిటిషువారికి ఇండియాలో దాపురించలేదు.

రెండో మరాఠా యుద్ధంకూడా ఇటువంటి పరిస్థితులలోనే ప్రారంభమయింది. దీనికి కారకుడైన దుర్మార్గుడు, రఘునాథరావ్ కుమారుడైన, పనికిమాలిన రెండో బాజీరావ్. సింధియాకు, హోల్కారుకు చిరకాలంనుంచి జరుగుతూ వచ్చిన సంఘర్షణలో, ఇతడు సింధియాను సమర్థించినాడు. ఈ ఇరువురి సంయుక్త సైన్యాన్ని, హోల్కారు జయించి, పూనాను ఆక్రమించెను. బాజీరావ్ పరుగెత్తిపోయి బ్రిటిషు వారిని ఆశ్రయించినాడు. ఇండియాలో సమ్రాట్ పదవిని స్థాపించడానికి నిశ్చయించుకొన్నవాడు, గవర్నర్ జెనరల్ వెల్లెస్లీ. బాజీరావును ఆదరంతో ఆహ్వానించి, బ్రిటిషువారి అధీన స్థానాన్ని అంగీకరించే ఒడంబడిక పత్రంపై

అతనితో సంతకం చేయించినాడు. ఇదే బాస్సేన్ సంధి ఒడంబడిక. (1802). పీష్వా చర్యను, మరాఠా సర్దారులు తమకు కలిగిన ధిక్కారంగా భావించిరి. తమ వినాశం. ప్రత్యక్షంగా ఎదుటనిలిచి ఉన్నప్పటికీ కూడా, వీరి పరస్పర ప్రాచీన కలహాలు, ఈర్ష్యలు వీరి కండ్లను కప్పినవి. కాబట్టి అందరూ ఏకమై శత్రువును ఎదిరించడానికి అంగీకరించలేదు. గయక్వాడ్, తటస్థంగా నిలిచిపోగా, హోల్కార్ చిరచిర లాడుతూ నిలిచిపోయినాడు. కాబట్టి, సింధియా, భోంస్లేలు మాత్రమే బ్రిటిషువారి సైన్యాఘాతాన్ని భరించవలసి వచ్చింది. ఇట్టి అసమాన బలాలకు జరిగిన యుద్ధ ఫలితం ఎన్నడో నిశ్చితమై పోయినట్టిది. దక్కను ప్రాంతంలోను, హిందూ స్థానంలోను కూడా, బ్రిటిషువారు మహారాష్ట్రులతో తలపడిరి. ఆర్థర్ వెల్లెస్లీ [తరువాతి కాలంలో డ్యూక్ ఆఫ్ విల్లింగ్టన్] నాయకత్వంలోని దక్కను సైన్యాలకు, అస్సాయె, ఆర్గోన్‌లవద్ద నిష్కర్షమైన విజయాలు కలిగినవి. అహమద్ నగర్. బర్హాన్‌పూర్, అసీర్‌ఘర్, గావిల్‌ఘర్, పట్టణాలను బ్రిటిష్ సేనలు ఆక్రమించినవి. హిందూస్తాన్‌లో, అలిఘర్, ఢిల్లీ నగరాలను పట్టుకొని, లేక్, లస్వారీవద్ద సింధియా సేనలను తరిమికొట్టినాడు. మహారాష్ట్ర నాయకులు సంధికై ప్రార్థించవలసివచ్చింది. తమ రాజ్యాలలోని విస్తార భాగాలను వశపరచి, బ్రిటిషువారి ఆధిపత్యాన్ని అంగీకరించ వలసివచ్చింది.

హోల్కారు కావించిన అవివేక కార్యానికి తగిన ప్రతి ఫలాన్ని అనుభవించి ఉండే వాడేకాని, వెల్లెస్లీ ప్రభువును ఇంగ్లాండు అధికారులు వెనుకకు పిలిపించుకొనిరి. అతని తర్వాత వచ్చినవారు తేలిక షరతులతో, హోల్కారును వదిలివేసిరి.

ఈవిధంగా, మహారాష్ట్రులు నిర్జితులై, బ్రిటిషువారికి సామంతులై, ఒకరితో ఒకరికి సంబంధంలేక ఛిద్రులైపోయిరి. ఈ అవమానం మనస్సును వేధిస్తూఉన్నా, తమకు కలిగిన పరాజయంవల్ల ఎట్టిగుణపాఠాన్నీ వీరు గ్రహించలేదు. ముక్కలైపోయిన తమ రాష్ట్ర భాగాలను. జతపరచుకొని, అఖండరాజ్యాన్ని స్థాపించుకొనే ఓపిక వీరికి లేకపోయింది. ఉపాయ కౌశలము, బలముగల శత్రువుకు తాము కోల్పోయినదానిలో, కొంత భాగాన్నైనా సంపాదించుకోడానికై, సుసంఘటితమైన సమైక్యప్రయత్నానికి కూడా వీరు పూనుకొలేదు. అట్టి ఉద్యమ ప్రణాళికకు ఆవశ్యకమైన వివేకము, కౌశలము, వీరికి లేకపోయినవి. ఇట్టి మహాప్రయత్నం చేతకాక, సంధానాలకు, కుట్రలకు ప్రారంభించిరి. కాని, వీరిలో ఉన్న ద్రోహులే, వీరి ఎత్తుగడలను శత్రువులకు అందచేస్తూ వచ్చిరి. ఏండ్లు గడిచేకొద్దీ, పరిస్థితి చెడిపోతూవచ్చింది. కాని, వెల్లెస్లీ జరిపిన యుద్ధాలవల్లను, ఆక్రమణలవల్లను, కంపెనీ విత్తపరిస్థితి చిక్కులలో పడింది. కంపెనీ డైరెక్టర్లు గాబరాపడి, దేశీయరాజులతో జోక్యం కలుగచేసుకోకూడదని నిశ్చయించుకొని, అలీనపద్ధతిని అవలంబించిరి.

కాని, వెల్లెస్లీ మరలిపోయినతర్వాత, పదిసంవత్సరాలు పూర్తికాకపూర్వమే, బ్రిటిషు వారు, మళ్లీ రాజ్యవిస్తరణకు ప్రారంభించిరి. 1818 లో, గవర్నర్‌జెనరల్‌గా ఇండియాకు వచ్చిన, వారెన్‌హేస్టింగ్స్, యుద్ధచర్యకు సైన్యాన్ని ఆజ్ఞాపించెను. మహారాష్ట్రులు చేసిన ప్రతిఘటన అతిదుర్బలమైనది కాబట్టి, సులభంగా భగ్నమైపోయింది. అంతతో మహారాష్ట్ర రాజ్యం అంతరించింది. దక్కనుపైనా ఉత్తరభారతంలోని అధికభాగంపైనా, బ్రిటిషువారి ఆధిపత్యం 1818 నాటికి స్థిరపడింది.

బ్రిటిషు రాజ్యవిస్తరణలోని తర్వాతి అవస్థలో, ఆసేతుహిమాచల పర్యంతంగల అన్ని

ప్రాంతాలలోను, భారతీయ స్వాతంత్ర్యం నశించిపోయి, ఆంగ్లేయుల ఆధిపత్యం ఏర్పడింది. సింధు, పంజాబుప్రాంతాలను జయించిరి ; మధ్యభారతప్రాంతాలను తమరాజ్యంలో కలుపుకొనిరి ; అక్కడక్కడ నిలిచియుండిన ఇండియా పరిపాలకుల అల్పరాజ్యాలను తుడిచివేసిరి.

*సింధ్* : విభేదాలవల్ల దుర్బలమైపోయినదుర్గతి సింధుప్రాంతానికి పట్టినది. ఈ ప్రాంతానికి పరిసరంలో ఉన్న రాజ్యాలు బలవంతములైనవి. అహమద్‌షా అబ్దాలీకాలంనుంచి సింధు రాజ్యాలు, ఉత్తరదిక్కులో ఉన్న ఆఫ్గనులకు, కప్పము చెల్లించే అధీనరాజ్యాలై ఉండినవి. సింధునది పైభాగానికి, అధికారులై ఉండిన సిక్కులు, నదీముఖంవరకూ తమ అధికారాన్ని వ్యాపింపచేసే ఉద్దేశంకలవారు. సట్లెజ్‌నదీతీరంవరకూ తమరాజ్యాన్ని ఆంగ్లేయులు విస్తరింప చేసుకొని ఉండిరి వారి ఉద్దేశాలు, ప్రయత్నాలు వేరు. మధ్యఏశియాలోనికి రష్షియనులు చొచ్చుకొనిరావడం, అపాయసూచనగా వీరు గ్రహించిరి. కాబట్టి, ఆఫ్గనిస్తానును చుట్టుముట్టి, దానిని వేరుపరచడం ఆవశ్యకమయింది. కాని, రంజిత్‌సింగు పంజాబుపై స్థిరంగా నిలిచి ఉండడంవల్ల, పర్వతరాజ్యమైన ఆఫ్గనిస్తాన్ చేరడానికి సింధుప్రాంతం ఒక్కటే మార్గం. బ్రిటిష్‌సామ్రాజ్యాన్ని రక్షించుకొని, అది శిథిలంకాకుండా భద్రపరచుకోడానికి, ఆంగ్లేయులు సింధుప్రాంతాన్ని బలిచేసినారు. ఇతరుల భూభాగాలను జయించడంలో స్వైరవిహారు డైన వాడు, నేపియర్. ఇతడు ఇంగ్లాండులోని అధికారులకు పంపిన సంక్షేపమైన ప్రేషణపత్రాన్ని, పంచ్ (Punch Magazine) పత్రిక ప్రకటించింది. ఇతడు చేసిన వీరకృత్యానికి ప్రచారం కలిగించడం ఈ పత్రిక ఉద్దేశం. దౌర్జన్యానికి ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన ఈ పత్రాన్ని తనదిగా అంగీకరించడంలో, నేపియర్ ఏమాత్రమూ సిగ్గుపడలేదు.

*పంజాబ్* : ఇక పంజాబులో,- తాను జీవించి యున్నంతవరకూ బ్రిటిషు వారిని రెచ్చగొట్టే ప్రయత్నానికి రంజిత్‌సింగు పూనుకోలేదు. అతడు వారి సామర్థ్యాన్ని చక్కగా గుర్తించి ఉండినాడు. కాని, రాజనీతిజ్ఞత, సామర్థ్యముగల, అతని నాయకత్వం లోపించడంతోనే, అవ్యవస్థను, అరాజకత్వాన్ని, కలిగించే శక్తుల స్వేచ్ఛా విహారం ప్రారంభమయింది. సంశయము, ఈర్ష్య, దురావేశము ప్రబలమైనవి. నిరర్థకమైన హత్యలు, రక్తపాతము, దేశంలో వ్యాపించినవి. రాజ్య వ్యవహారాలలో, సైన్యం కలుగజేసుకోడానికి ప్రారంభించింది. ఖాల్సా సంస్థకు ధైర్య స్థైర్యాలు ఉన్నప్పటికీ, మత భావనలకు సులభంగా వశమైపోయేది. రాబోయే ఫలితాలు ఎట్టివో ఊహించకుండా, తొందరపడి. కార్యాచరణానికి పూనుకొనే స్వభావం కలది. అందులోనూ ముఖ్యంగా, నిహంగులు, పూజారులు, వీరి మంత్రాంగంలో ప్రబలులైయున్న సందర్భాలలో, ఖాల్సా ముందు వెనకలు చూడకుండా ముందుకు దూకేది. దేశానికి దాపురించిన ఈ విషమ పరిస్థితిలో, వాస్తవంగా ఖాల్సాకు నిర్దేశకులైనవారు, నిహంగులు. పూజారులు. ఆత్మలాభ పరాయణులు, నీతి భ్రష్టులు ఐన నాయకులు, ఈ సంస్థ యొక్క దౌర్బల్యాన్ని తమ స్వార్థంకొరకు ఉపయోగించుకొనిరి. తమ ఉద్దేశాలను సాధించుకోడానికై. వివిధ పక్షాలవారూ, సైన్య సమితికి (పంచ ఖాల్సా) పదే పదే విన్నపాలను పంపుతూ ఉండిరి.

శీఘ్ర కాలంలోనే, ప్రభుత్వ వ్యవహారాలపై సైన్యం, ప్రాబల్యం వహించడానికి ప్రారంభించింది. ఫ్రాంకిన్‌స్టెయిన్ భూతానికి జీవం పోసిన వారే, తమ పదవులు పోతాయని భయభ్రాంతులైరి. ఆ సమయంలో, దిలీప్‌సింగ్ అనే చిన్న బాలుడు సింహాసనానికి

ఉత్తరాధికారి. అది అప్పటి పరిస్థితి. అతని తల్లియైన జిందన్‌కౌర్, రాజ ప్రతినిధి. ఆమె ప్రియుడైన లాల్‌సింగ్ ముఖ్య మంత్రి. ఆమెకు ఆప్తుడైన తేజసింగ్, సేనాధ్యక్షుడు. ఈ ముగ్గురు కూడా క్రూరులు; ఆ పదవులకు పూర్తిగా అనర్హులు. ముగ్గురూ కూడా ఖాల్సాను ద్వేషించినవారు; దానిని కూలద్రోయడానికి పన్నాగాలు పన్నినవారు.

బ్రిటిషువారితో వీరు రహస్యసంధానాలను జరిపినారు. పంజాబువ్యవహారాలలో ప్రవేశించడానికి అవకాశాన్ని ఎదురుచూస్తూ ఉండినవారు ఆంగ్లేయులు, సమగ్రమైన ఇండియా దేశానికి అధికారులుగా ఏర్పడిన ఆంగ్లేయులు, సైన్యసంచాలన విషయంలో అతిప్రాముఖ్యమైన పంజాబుప్రాంతంలో ఆసక్తివహించలేకపోవడం అసంభవం. తన పరిసరప్రాంతంలో, అరాజకత్వం ఏర్పడియుండగా, సువ్యవస్థితమూ, శక్తివంతమూ ఐన ఏ ప్రభుత్వం కూడా చూస్తూ ఉండలేదు. అందులోనూ, ఆ ప్రాంతవ్యవహారాలలో ప్రవేశించడానికి అవకాశం లభించినప్పుడు, ఉదాసీనంగా ఉండడం అసహజం. బ్రిటిషువారు పంజాబువ్యవహారాలలో ప్రవేశించకపోతే, ఆఫ్ఘనిస్తాన్ ప్రవేశించే ప్రమేయంకూడా ఉంది. అంతేకాక, రష్యనులు మర్దక యంత్రంవలె (Steam roller) నిర్దాక్షిణ్యంగా ముందుకు చొచ్చుకొని వస్తున్నారు. సిక్కుల ఆంతరంగిక ఘర్షణలవల్ల ఏర్పడిన అధికారశూన్య స్థానాన్ని ఎంతోకాలం ఇతరులు ఆక్రమించకుండా ఉండరు.

బ్రిటిషువారి ఉద్దేశాలను పెక్కువిషయాలు సూచించినవి. ఫెరోజ్‌పూర్‌ను ఆక్రమించి, బ్రిటిష్‌సైన్యాలు నివసించడానికి తగిన 'లష్కర్'గా, దానిని సిద్ధపరచడం ఒకటి. అంబాలాలో సైన్యాలను నిలపడము, సిక్కుల సరిహద్దు పర్వతాలలో సైన్యాలను నిలిపిఉంచడము, సట్లెజ్‌నదిపై పడవలతో వంతెనను నిర్మించుకోవడము, అమీర్‌దోస్త్ మహమద్ ఖాన్‌కు, పెషావర్ నగరాన్ని అప్పగిస్తామని ఆశకొల్పడము,- ఇవన్నీ బ్రిటిషువారి ఉద్దేశాలెట్టివో వ్యక్తపరచినవి. ఈ విరుద్ధచర్యలు, సిక్కుల మనస్సులలో సంశయాలను కలిగించక మానవు. సిక్కుల వ్యవహారాలను గమనించడానికి కార్యకర్తగా నియమించబడిన, మేజర్ బ్రాడ్ ఫుట్, ప్రవృత్తి, సిక్కులకు ఉద్రేకం కలిగించింది. మహారాజా దలీప్‌సింగ్ మరణంతో కాని, లేదా, అతని పదవీచ్యుతితోకాని, సట్లెజ్‌నదికి ఈవలఉన్న రాజ్యభాగమంతా బ్రిటిషు రాజ్యంలో చేరిపోగలదని, బాహాటంగా, అతడు ప్రకటించినాడు.

పంజాబును తమ రాజ్యంలో కలుపుకోవడానికి, బ్రిటిషువారు యోచిస్తున్నారని, సిక్కు సైన్యానికి పూర్తిగా అర్థమయింది. లాల్‌సింగ్, తేజ్‌సింగులు సైనికుల భయాన్ని రెచ్చగొట్టి, వారికి భావనావేశాన్ని కలిగించిరి. సైన్యం ఇట్టి అవస్థలో ఉండగా, లూధియానా సమీపంలోని కొన్ని గ్రామాలను బ్రిటిషువారు స్వాధీనపరచుకొన్నారని, బ్రిటిష్‌గవర్నర్ జనరల్, తమ సరిహద్దులపై సైన్యంతో నడచివస్తున్నాడని, పుకార్లువిన్నారు. ఇక, తమ్ము తాము నిగ్రహించుకో లేకపోయినారు. 1845 డిసెంబర్, 11 తేదీనాడు, సిక్కు సైన్యాలు సట్లెజ్ నదిని దాటినవి; యుద్ధం ప్రారంభమయింది. కాని. ఈ యుద్ధంలో "ఏకైకమైన ప్రయోజనాన్ని సాధించడానికి అత్యుత్సాహంతో పూనుకొన్న సైన్యానికి, నాయకులైనవారు, యుద్ధ నిర్వహణ విధానము, యుద్ధతంత్రాలు, తెలియనివారు. అంతేకాక, తమ్ము అనుసరించి వచ్చిన సైన్యానికి ద్రోహంచేయడానికి పట్టుదలతో పూనుకొన్నవారు, అనే విషయం స్పష్టమైపోయింది." సైనికులందరూ కూడా అత్యాశ్చర్యకరమైన శౌర్య సాహసాలను ప్రదర్శించి

పోరాడినారు; కాని నాయకులు సిగ్గువిడిచి విశ్వాస ఘాతుకులై, ద్రోహంచేయడంవల్ల, సైన్యం ప్రదర్శించిన వీర సాహసాలన్నీ వ్యర్థమైపోయినవి. లాహోర్ బ్రిటిషువారి వశమైపోయింది. పంజాబుప్రాంతం, స్వాతంత్ర్యాన్ని గోల్పోయింది; కాని ఛాయా మాత్రమైన సిక్కు రాజ్యాన్ని బ్రిటిషువారు నిలిపియుంచినారు.

సిక్కులు పరాజయాన్ని అనుభవించినారు; కాని నిరాశచెందలేదు. తమ స్థానాన్ని మళ్ళీసాధించుకోడానికి ప్రయత్నించిరి. 1849 లో రెండో యుద్ధం జరిగింది; కాని మొదటి యుద్ధంలో జరిగిన ద్రోహగాథే ఇందులోనూ పునరావృత్తమయింది. మ్యాలెసన్, ఈ యుద్ధాన్ని గురించి ఈ విధంగా వ్రాస్తాడు,- "సిక్కులు పోరాడినంత ధైర్య శౌర్యాలతో మరే సైన్యమూ పోరాడి ఉండజాలదు; ఇంత అధమరీతిలో సైన్యాన్ని నడిపిన సేనా నాయకులూ ఉండరు." ఈ యుద్ధ ఫలితంగా, ఛాయామాత్రంగా నిలిచియుండిన సిక్కు రాజ్యం కూడా అంతరించింది. పంజాబు ప్రాంతం, బ్రిటిషు రాజ్యంలో కలిసిపోయింది. యుద్ధవీరోచితమైన సాహసోద్యమంతో, రాజనీతిజ్ఞుని సామర్థ్యంతో, క్రియాశీలమైన ప్రతిభతో ఒక సిక్కు నాయకుడు, మహత్ప్రయత్నంతో నిర్మించిన సిక్కురాజ్య భవనం, అపకీర్తిపరులైన ఇతని ఉత్తరాధికారుల సహజనైచ్యంవల్లను, స్వపక్ష ద్రోహబుద్ధివల్లను, శిథిలమైపోయింది.

ప్లాసీయుద్ధానంతరం నూరుసంవత్సరాలలోపుననే, సమగ్ర భారతదేశాన్ని బ్రిటిషువారు బలాత్కారంతో తమ అధికారానికి లోబరచుకొన్నారు. సైన్యవిషయ దృష్ట్యా ఈ కార్య సాధన విచిత్రమైనట్టిది. ఇండియనులపై జరిపిన అన్నియుద్ధాల్లోనూ, బ్రిటిషువారి పక్షంలో నిలిచి పోరినవారు, అధికసంఖ్యాకులైన ఇండియాసిపాయీలే. ఇండియాలోని దేశరాజుల సైన్యాల సంయోజనము ఈస్ట్‌ఇండియా కంపెనీ సైన్యాల సంయోజనము, ఒకేవిధమైనట్టివి. యూరోపు అధికారుల అధీనంలో ఉండే చిన్న యూరోపుసైనికదళము,- ముఖ్యంగా ఫిరంగి శాఖకు చెందినట్టిది,- యూరోపు యుద్ధపద్ధతులలో శిక్షితులైన సిపాయీల పదాతిదళము, పూర్వ యుద్ధసంప్రదాయాలను అనుసరించి పోరాడే, అధికసంఖ్యాకమైన భారతీయ అశ్విక పదాతిదళాలు,- చేరి, దేశరాజుల సైన్యంగా ఏర్పడిఉండేది. యూరోపు సైనికదళముతోను, యూరోపు సేనాధికారుల శిక్షణపొందిన సిపాయీల పదాతిదళంలోను ఏర్పడినది, కంపెనీ వారి సైన్యం. యుద్ధశిక్షణలేని సైనికదళం అనే మూడో అంశం, అప్రధానమైన సహాయక సైన్యంగా పర్తించేది. ఈ విధంగా, పాశ్చాత్య, భారతీయ, అధికారుల నాయకత్వంలోని దేశ రాజుల సైన్యాలు, పాశ్చాత్య, భారతీయ అధికారుల నాయకత్వంలో ఉన్న పాశ్చాత్య భారతీయ సైన్యంతో యుద్ధాలు జరిపినవి. కాని, దేశరాజుల సేవలో పనిచేసిన పాశ్చాత్యసేనాధికారులు, పాశ్చాత్యసైనికులు, తమకు యజమానులైన ఈ రాజులపట్ల భక్తివిశ్వాసాలు, ప్రభునిష్ఠ లేనివారు. ఇక, రెండవపక్షంలో పాశ్చాత్య అధికారుల అధీనంలోని భారతీయసైనికులు, తమ యజమానులైన కంపెనీవారిపట్ల, సంపూర్ణమైన భక్తివిశ్వాసాలతో నిలిచినవారు. ఈ రెండుపక్షాల సైన్యాలకూ గల తారతమ్యం, ఇట్టిది.

యుద్ధసాధన పరికరాల విషయంలో రెండుపక్షాలవారికీ పెద్ద తేడాలేదు. తుపాకులు, మస్కెట్లు, మాచ్‌లాకులు, రాకెట్లు, ఫిరంగులు, మొదలైన నూతన యుద్ధపరికరాలతోపాటు. కత్తులు, ఈటెలు, విల్లమ్ములు, మొదలైన సాంప్రదాయిక ఆయుధాలు కూడా ఉపయోగించేవారు.

ఐనప్పటికీ, మనోబలవిషయంలో (Morale) మాత్రం, ఈ రెండు పక్షాలమధ్యగల భేదం విస్తారమైనట్టిది. ఫిరంగులు, బందూకులు, మొదలైనవాటిని ఉపయోగించడం భారతీయులకు కొత్త; వాటిని వాడడంలోగల ఉపాయకౌశలం వీరికింకా పట్టుబడలేదు. సాంకేతిక విజ్ఞానశాస్త్ర జ్ఞానం లేనందువల్ల, నష్టమైపోయిన ఈ పరికరాలను, సామగ్రిని, భర్తీచేసుకొనే అవకాశం, భారతీయులకులేదు. వీటికై విదేశీయులపై ఆధారపడవలసి ఉండేది; కాని, విదేశీయులు నమ్మదగినవారుకారు. దేశరాజుల సేవలోఉన్న సేనాధికారులందరూ, ధనానికి ఆశపడి వచ్చిన అతి సాహసికులు. పూర్వపురోజులలో, తమ మాతృజాతి ప్రయోజనాలను సహకరిస్తున్నామనే భావంలో, ఈ విదేశీయులు ఇండియా పక్షంలో నిలిచిఉండిరి. కాని, నెపోలియన్ యుద్ధాలు అంతం కావడంతో, సైనికులనేకులకు ఉద్యోగాలు పోయినవి; రాష్ట్రీయ వైశిష్ట్యం కూడా తొలగిపోయింది. కాబట్టి, కేవలం ధనం చేకూర్చుకొనే ఉద్దేశంతో మాత్రమే వీరు, ఇండియారాజుల సేనాసేవలో చేరినారు. యుద్ధవీరులకు ధర్మమైన ప్రతిష్ఠను పాటించి, కొందరు మాత్రం, ఈ యుద్ధాలలో చక్కగా తమ ధర్మాన్ని నిర్వర్తించినారు. కాని, యుద్ధ ఫలితం అనుమానా స్పదంగా తోచిన వెంటనే, ఈ విదేశీయ సైనికులనేకులు, తమ యజమానులను వారిగతికి వదలిపెట్టి, వెళ్ళిపోయేవారు.

యుద్ధోపాయాల విషయంలోను, యుద్ధవ్యూహాది తంత్రాల విషయంలోను, పాశ్చాత్యులు ఎక్కువ సమర్థులు. కాని, ఈ భేదమొక్కటే యుద్ధ ఫలితాన్ని నిర్ణయిస్తుందని చెప్పజాలము. ఈ ఉపాయాలను, తంత్రాలను శీఘ్రకాలంలోనే నేర్చుకోవచ్చు; సులభంగా సంపాదించడానికి సాధ్యంకానిది మనోబలం ఒక్కటే. సైనికుల అసంతృప్తి, అనేక యుద్ధాల అపజయాలకు మూలకారణమయింది. వారివేతనాలు బాకీపడి ఉండడమో, లేక, వారిని సరిగా చూడకపోవడమో, ఈ అసంతృప్తికి ఆధారమయింది. విత్తసంబంధమైన వ్యవహారాలను అవ్యవస్థకు పాల్పరచడం, భారతీయుల పక్షంలోగల, జాతీయ దౌర్బల్యం. సైన్యాలకు సక్రమంగా, సకాలంలో, వేతనాలు బటవాడా చేయకపోవడము, ప్రభుత్వాలకు క్లిష్టపరిస్థితులు ఏర్పడడము, ఈ దౌర్బల్యముయొక్క సహజ పరిణామాలు.

ఇండియా సిపాయికి పిరికితనం ఎన్నడూలేదు. అనేక సందర్భాలలో, అననుకూల ప్రతి బంధకాలకు లోనై కూడా, తన ధైర్య స్థైర్యాలను, సహనశీలాన్ని, దృఢనిశ్చయాన్ని ప్రత్యక్షంగా నిరూపించినాడు. బ్రిటిష్ సేనానాయకుల కింద యుద్ధంచేసిన ఇండియా సిపాయీలు, ప్రతి యుద్ధంలోను, యుద్ధవీరుల ఉత్తమ లక్షణాలను ప్రదర్శించినారు. కాబట్టి, ఇండియా అపజయాలకు సైనికులు ఎంతమాత్రమూ కారకులుకారు. దోషమంతా ఇండియా నాయకుల అయోగ్యతలో ఉంది. తన యజమానుని ఉప్పుతిన్నందుకై, తన యజమానుని రక్షణార్థం సైనికుడు పోరాడి, ప్రాణాలను అర్పించినాడు; కాని, యుద్ధానికి పూనుకోవడంలో, యజమానికి ప్రేరకమైనదేది? తన స్వప్రయోజనము, తన కుటుంబప్రయోజనముతప్ప, ఇతడు జరిపిన యుద్ధాలకు ఇతర ఉన్నతాశయం ఏదీ, కారణంగా గోచరించడంలేదు. సైనికులలో మనోబలాన్ని అభివృద్ధిపరచడానికి, ఈ స్వార్థ ప్రయోజనం సరియైన ఆధారం కాజాలదు. శత్రు సైనికులైన ఆంగ్లేయులు,-వారి వ్యక్తిగత నీతి ప్రవర్తనలు ఎట్లున్నా - స్వప్రయోజనాన్ని రక్షించుకోడానికై, తమ మాతృదేశ ప్రయోజనాలను బలిచేసే వారెన్నడు-

కారు. అట్టివారితో పోరాడవలసిన ఇండియా సైనికుల మనోబలాన్ని పోషించడానికి, వారి యజమానుల స్వార్థం పనికిరాదు.

బ్రిటిషు సేనాధిపతికి కలిగే పరాజయం, కేవలం ఒక వ్యక్తియొక్క తాత్కాలిక పరాభవానికి మాత్రమే కారణమౌతుంది. యుద్ధంలో వినియోగింపబడే ఒక వస్తువునంటి వాడు మాత్రమే, సేనానాయకుడు; అతని స్థానం మరొకవ్యక్తితో భర్తీఔతుంది. ఇండియా విషయం అట్టిదికాదు. ఇండియా రాజుకు కలిగే పరాజయంతో, రాజకీయవిధానమంతా పూర్తిగా కూలిపోతుంది. ప్లాసీయుద్ధ పరాజయంతో, బెంగాలుప్రభుత్వం పడిపోయింది; శ్రీరంగపట్టణ పరాజయంతో మైసూరుప్రభుత్వం, కూలిపోయింది; అర్గోన్‌యుద్ధంతో భోంస్లేరాజ్యము, మెహిద్‌పూర్ యుద్ధంతో హోల్కార్‌రాజ్యము, ఖిర్కీయుద్ధంతో బాజీరావ్ పీష్వారాజ్యము, నశించిపోయినవి. ఆలివాల్, సోబ్రోన్ యుద్ధాలతో సిక్కురాజ్యం, బ్రిటిషువారికింద పడిపోయింది; కడపటి గుజ్రాత్ యుద్ధంతో ఈ రాజ్యం కూకటి వ్రేళ్ళతో పెకలింపబడింది.

ఇక మరొకప్రక్క - ఇండియారాజులకు లభించిన విజయాలు ఎట్టివి ? "హిమ ఘన ప్రపాతం రీతిగా వినాశాన్ని కలిగించిన" హైదర్‌అలీ విజయాలు ; పశ్చిమటికనములలో, మహారాష్ట్రులు బ్రిటిషువారిని ఓడించి, అవమానకరమైన వాడ్‌గోన్ ఉపసంధి పత్రంపై, బ్రిటిషు సేనాధిపతిచే సంతకం చేయించిన విజయము ; భరత్‌పూర్‌వద్ద, లేక్‌సేనాధిపతిని తిరుగగొట్టిన విజయము; ముర్కి, ఫెరోజ్‌షాల వద్ద, సిక్కులు బ్రిటిషుసైన్యాలను శిక్షించి, "అపాయకరమైన విషమస్థితికి" వారినితెచ్చి. సాధించిన యుద్ధజయము; చిల్లియన్‌వాలా వద్ద బ్రిటిషు సైన్యాలను, ఫిరంగులను వశపరచుకొని, సిక్కులు సాధించిన విజయము;- ఇవన్నీ తాత్కాలికములైన ప్రాసంగికోదంతాలు మాత్రమే ; పర్యవసానాన్ని నిశ్చయించేవి కావు.

వీటివల్ల గ్రహించవలసిన నీతి స్పష్టంగానేఉంది. ఇండియావిషయంలో ప్రభుత్వ వ్యవస్థ సమస్తమూ సైన్యాన్ని నడిపిన అధికారిలో నిహితమై ఉండింది. అతని పరాజయంలో రాజ్యపతనం కూడా ఇమిడిఉంది. అదీకాక, సమస్తదేశము యొక్క భక్తివిశ్వాసాలకు, గాఢాభిమానానికి పాత్రమైన ఒక్క రాజ్యం కూడా, ఇండియాలో ఏర్పడి ఉండలేదు. పరస్పరం పోరాడుకొంటున్న రాజుల సంకలన సముదాయం ఇండియా; అంతకలహాలతో ఆత్మనాశానికి పూనుకొన్నట్టిది. దురభిమానాంధులై, దేశీయులు, పరదేశీయులు అనే వివక్ష కూడా లేనివారై, వ్యర్థమైన యుద్ధాలను ఒకరిపై ఒకరు జరుపుతూఉండిన రాజులతో ఏర్పడింది ఈ దేశం. ఇంగ్లీషు సేనానాయకుని వెనుక, ఆసరాగా నిలిచినది, అతని జాతి. కొన్ని అపజయాలు దానికి కలుగవచ్చు, దాని పరిణామాలు కొంతకాలం నిలిచి ఉండవచ్చు. కాని, అపజయాలవల్ల నశించిపోయే జాతికాదు. ఆంగ్లజాతిలో, వ్యక్తికీ ప్రభుత్వానికీగల సంబంధం అట్టిది. అట్టి సంబంధం ఇండియాలో ఏర్పడడానికి వ్యక్తి ప్రయోజనాలకంటె, జాతిప్రయోజనాలు ప్రధానములైనవి, అనే భావచైతన్యం కలగడానికి, నూరు సంవత్సరాలకాలం వేచి ఉండవలసి వచ్చింది.

# 7
# బ్రిటిషు పరిపాలనాభివృద్ధి 1793 వరకు

## ప్లాసీకి పూర్వం - ఇండియా

ఈస్టిండియా కంపెనీవారు బెంగాలును జయించి, పరిపాలనాధికారాన్ని వహించడం వల్ల, ఏర్పడినట్టి పరిస్థితి, ఇండియా దేశచరిత్రకు నూతనమైనది. విదేశీయులు ఇదివరలో ఇండియాను జయించి ఆక్రమించి ఉండిరి. కాని ఈ విజేతలందరూ ఏశియా వాసులేకావడం వల్ల, సంస్కృతి విషయంలోను దృక్పథంలోను, ఇండియా వాసులతో సమానమైన లక్షణాలు కలిగినవారై, సమానమైన సామాజిక పరిస్థితులలో నివసించియుండినవారు. వారిదేశాక్రమణవల్ల, చాలవరకు పరిపాలక వ్యక్తులలో మార్పు కలిగిందేకాని, సామాజిక వ్యవస్థలోకాని, దేశీయ ఆర్థిక వ్యవస్థలో కాని, ఎట్టిమార్పూ కలుగలేదు. రాజకీయ విధాన, పరిపాలన వ్యవస్థలకు సంబంధించిన విషయాలలో, ఈ రెండు వర్గాల వారికీ మధ్య ముఖ్య భేదాలులేవు. ఈ విదేశీయులు వచ్చి నెలకొనడంవల్ల, ఇదివరకే దేశంలో వ్యాపించియుండిన భిన్నసంస్కృతులకు మరికొన్ని సంస్కృతి లక్షణాలు వచ్చిచేరినవి. తొలిరోజులలో వచ్చిన ముస్లిమ్ విజేతలు, అరబ్బీ పారసీకభాషలను ఈ దేశంలో, కొత్తగా ప్రవేశపెట్టినారు. తమ ఇస్లాముమతాన్ని, నూతన కళాభంగిమలనూ కొన్ని కొత్తవృత్తులనూ, దేశంలో ప్రవేశపెట్టిరి. వారి ప్రవర్తన పద్ధతులు, ఆచారాలు, ఆహారపద్ధతులు, దుస్తులు, మొదలైనవి దేశంలో వ్యాప్తికి వచ్చినవి. వ్యవసాయము, పరిశ్రమలు, వర్తకము, ఇత్యాదులకు సంబంధించిన ఆర్థికవ్యవస్థ యొక్క స్వరూపంలో మార్పులు కలుగలేదు. గ్రామీణ ఆర్థికవ్యవస్థ, ప్రాచీన స్వరూపంలోనే నిలిచింది. సాంఘిక వ్యవస్థకు సంబంధించిన అతినిష్ఠాప్రవృత్తులు మరింత బిగిసిపోయినవి. ఈ ప్రభావానికి ముస్లిములు కూడా లోనైనందువల్ల, కులవ్యవస్థవంటి వర్గభేదాలు వారిలో కూడా ఉత్పన్నమైనవి. దీనికి వ్యతిరేకమైన మార్పు హిందూసంఘంలో వచ్చింది. ఇస్లామ్ ప్రభావానికి లోనైన హిందూసంస్కర్తలు అనేకులు కులవ్యవస్థను ఖండిస్తూవచ్చిరి.

*సాంప్రదాయిక రాజకీయస్వరూపం* : రాజకీయాధికారము, దానికి ఆలంబన ఆధారాలుగా ఉన్న సైన్యము, విజేతల చేతుల్లో నిలిచింది. కాని, పరిపాలన యంత్రాంగాన్ని, అందులోనూ ముఖ్యంగా విత్తవ్యవస్థను నడపుతున్నవారు చాలవరకు, హిందువులే.

మొగలులు ఇండియాలో నెలకొన్న తర్వాత, కేంద్రీకృతమైన పరిపాలన వ్యవస్థను స్థాపించిరి. సర్వసామాన్యమైన సంస్కృతిని అభివృద్ధిచేయడానికి అవసరములైన అవకాశాలను కల్పించిరి. వివిధప్రాంతాలకు, భిన్నజనజాతులకు, మధ్యగల విభేదాలు క్షీణించి, ఐక్యభావం ఏర్పడడానికి, ఇది హేతువయింది. భూమిపన్నుల వ్యవస్థలో వారు అనుసరించిన విధానం, సంయోజక శక్తులకు ప్రేరణ కలిగించింది. కళాసారస్వతాలను ఆదరించి పోషించ

దంవల్ల, దేశంలో సాంస్కృతిక పునరుజ్జీవన ప్రయత్నం ఆరంభమయింది. మతవిషయంలో వారు అవలంబించిన ప్రవృత్తి, పరస్పర విభేదాలు మానిపోవడానికీ, అన్నిమతాలవారూ, రాజ్యంపట్ల భక్తివిశ్వాసాలను పెంపొందించుకోడానికీ, సహకరించింది.

కాని, భారతదేశీయుల భావాలు, ప్రాచీన కాలం నుంచీ ఏర్పడియున్న సంకుచిత మార్గాలను వదలిపెట్టలేదు; శాస్త్రాధికారాన్ని అంటిపెట్టుకొని ఉండే ప్రవృత్తిని మానడానికి ఇష్టపడలేదు. హిందూముస్లిమ్ పండితులు ప్రాచీనతత్త్వ శాస్త్రాలను, మతసిద్ధాంతాలను, ధర్మ శాస్త్రాలను, చదివినవాటినే చదువుతూ, నెమరువేస్తూ నిలిచిపోయినారు. కొత్త విజ్ఞానశాస్త్రాల అధ్యయనానికి పూనుకోలేదు. రసాయనశాస్త్రము, మానవ శరీర నిర్మాణశాస్త్రము, క్రియా విజ్ఞానశాస్త్రము,-మొదలైన విషయాల ప్రాథమిక సూత్రాలు కూడా వీరికి తెలియవు. ప్రయోగాత్మక శాస్త్రాధ్యయనము, ప్రకృతి విషయావలోకనము, పరికల్పనను ప్రకృతి పరి శీలనలో పరీక్షించడము,-ఇత్యాదులు వీరికి స్వప్నదృశ్యాలుగా ఐనా గోచరించలేదు.

అన్ని సామాజిక సంస్థలలోను, వ్యక్తిత్వ పూజ (Personality cult) ప్రాబల్యం వహించి ఉండింది. 'రాజ్య పరిపాలకుడే రాజ్యము' అనే భావం స్థిరపడింది. సమాజ ప్రజల సామూహిక సంకల్పమునకు సూత్రప్రాయంగా ఏర్పడినట్టిది సార్వభౌమత్వము, అనే విషయం వీరికి తెలియదు. వ్యక్తిపరంగా రాజుపట్ల భక్తివిశ్వాసాలు వహించడమే, వీరు రాజ్యంపట్ల చూపేరాజ్యనిష్ఠ. కేవలం వ్యక్తిగతమైన ఈ భక్తి విశ్వాసాలు అతి దుర్బలము లైనవి; కాబట్టే సులభంగా తెగిపోయేవి. ఈవిధంగా, ఒక వ్యక్తిని ఆధారంగా చేసుకొని ఏర్పడిన రాజ్యం అస్థిరంకాక తప్పదు; సంక్షోభాలకు, ప్రతి బలాలకు చలించక నిలబడగల సామర్థ్యం ఇట్టి రాజ్యాలకు ఉండదు. విపత్తులలో, మునిగిపోకుండా నిలిపి ఉంచగల అవ లంబనం లేని రాజ్యాలు ఇవి.

సమాజముయొక్క రాజకీయానుబంధాలు చాలదుర్బలములైనట్టివి. దేశాభిమానము, మాతృదేశప్రేమ, అనే భావాలకు ప్రసక్తే లేకపోయింది. ఈ ఉత్తమ భావాలకు మారుగా, రక్తసంబంధంపై ఆధారపడిన బాంధవ్యాలు దృఢతమమై ఉండినవి. రక్తసంబంధ బాంధవ్యానికి దేశంలో ఏర్పడిన ప్రాధాన్యం, దేశసమాజ విషయంలో నష్టంగా పరిణ మించింది. మతము సమాజంలో ప్రవృత్తమైన విధానం కూడా, ఇదేవిధంగా, రాజ్య స్థితికి భంగకరమైనట్టిది. సమాజంలోని భిన్న భాగాల సంయోజనానికి, జాతీయైక్యానికి ప్రతిబంధకమై నిలిచింది మతము. సమానమైన పూజావిధానాన్ని అనుసరించి ప్రజా సంఘా నికి విధేయులై ఉండడం, మతాభిమానానికి ఆవశ్యకమైన విషయం. కాబట్టి, బహు విధ మతాలను అనుసరించే ప్రజలతో ఏర్పడిన లౌకికరాజ్యము, అనేభావానికి మతాభిమానం విరుద్ధమైనట్టిది. ఇట్లే, వ్యక్తియొక్క న్యాయప్రవర్తనకు సంబంధించిన ధర్మశాస్త్రం కూడా, వ్యక్తి అవలంబించిన మతంలో ఒక భాగమైపోయింది. కాబట్టి, సమగ్రదేశప్రజల ప్రవర్తనకు సంబంధించిన న్యాయశాస్త్రానికి, ఇది విరుద్ధమైనది. న్యాయశాస్త్రప్రక్రియ, వ్యక్తికి సమా జంలోగల స్థానప్రతిష్ఠలను అనుసరించిందేకాని, న్యాయశాస్త్ర సంబంధమైన వాస్తవిక విష యాన్నిబట్టి కాదు. సంప్రదాయ ప్రాబల్యంలో, న్యాయసూత్రాల ప్రవృత్తి మరుగుపడి పోయింది. ఉపజీవికలు, వృత్తులు, వ్యక్తియొక్క కులాన్నిబట్టి నిర్ణయమైపోయినవి; వ్యక్తి కోరికను, అతని యోగ్యతనుబట్టి ఏర్పడినవి కావు. సాహచర్య స్వాతంత్ర్యము, భావనా

స్వాతంత్ర్యము, అనే ప్రధానాంశాలకు వివాహవ్యవస్థలో తావులేదు. కేవలం జాతిని విస్తరింపచేయడానికి మాత్రమే ఏర్పడినట్టిది వివాహవ్యవస్థ. రాజ్యనీతి రాజ్యతంత్రాలు వ్యక్తుల పరికర్మ కౌశల ప్రవర్తనములైనవి. చర్చ, పూర్వాపరవిషయపరిశీలన, అనుకూలం అననుకూల పరిస్థితుల పర్యాలోచన, కారణ కార్యసంబంధమైన విచారణ, మొదలైనవాటిపై, రాజ్యనీతి రాజ్యతంత్రాలు ఆధారపడలేదు. వ్యక్తియొక్క జీవిత వర్తనమంతా, రహస్యగర్భితము, భావనాత్మకము, పరలోకనిష్ఠము, ఐన ప్రవృత్తులతో ఏర్పడినట్టిది. స్పష్టము, నిష్కృష్టము, ఐన వాస్తవిక జ్ఞానాన్ని కప్పిపుచ్చి, అనాగరూకతను, సంకీర్ణతను పెంపొందించే ప్రవృత్తి ఇది.

ఇండియా ప్రజల కార్యరూప జీవనమంతా, ఈ విధంగా, అస్పష్టమైన ఔదాసీన్యంతో నడుస్తూ ఉండింది. జీవిత ప్రధానములైన సమస్యలను పరిష్కరించుకోవడంలో, సహజ ప్రవృత్తిపై ఆధారపడినారేకాని, హేతువాదంపైకాదు. కాబట్టి, పద్దెనిమిదో శతాబ్దపు ప్రభుత్వ దస్తావేజులు, అపారంగా, దేశంలో ఉన్నప్పటికీ కూడా, రాజ్యవ్యవహారాలను సంబంధించిన వివరాలేవీ, వాటిలో స్పష్టంగా లేకపోవడం వింతకాదు. రాజ్యవిధానాల చర్చల వివరణలుకాని, రాజదూతలకుపంపిన అనుదేశాలుకాని, ప్రభుత్వోద్యోగుల ఉత్తరప్రత్యుత్తరాలుకాని, ఈ దస్తావేజులలో కానరావు. ఆర్మె (Arme), ఈ విషయమై, ఈవిధంగా గుర్తించి ఉంచినాడు. "మిక్కిలి పరిణామకారులైన ప్రధానరాజ్యవిషయాలలో కూడా సందిగ్ధార్థ స్ఫోరకములైన మాటల తోడప్ప, ఇండియా దేశరాజులు ఎప్పుడూ లిఖిత పూర్వకమైన అనుదేశాలను ఇచ్చేవారుకారు." రాజకీయాలను, రాజ్యనీతికి సంబంధించిన కొన్ని లిఖిత పత్రాలు దేశంలో నిలిచి ఉన్నవి. కాని, అస్పష్టత, వాగాడంబరము, ప్రధానలక్షణాలైన ఈ వ్రాతలో, అర్థము ఎక్కడో మరుగుపడిపోయింది. వ్రాతలో పెట్టడంవల్ల విషయానికి నిష్కృష్టత సిద్ధిస్తుందని, ఒక అభిప్రాయం వ్యాప్తిలో ఉంది. ఈ లక్షణాన్ని ఉద్దేశపూర్వకంగా, ఇండియా రాజనీతిజ్ఞులు విడిచిపెట్టినట్లు తోస్తుంది. అస్పష్టతకు, భిన్న వ్యాఖ్యానాలకు, అవకాశం కలిగించే వ్రాతను, వాఙ్మాలకమైన మంత్రాంగానికి, ప్రాధాన్యమిచ్చి, వీరు దాక్షిణ్యను తప్పించుకొన్నట్లు ఊహించడానికి వీలున్నది. సమగ్రదృష్టితో చూస్తే, మెత్తదనము, విధేయత, ఓర్పు, పోరాటానికంటె లొంగిపోవడానికే సిద్ధంగా ఉండడము, అనేవి భారతీయుని ప్రధాన లక్షణాలుగా వ్యక్తమౌతాయి. పద్దెనిమిదో శతాబ్దంలోని భారతీయునిలో, అసామాన్యమైన మతాభిమానము, హ్రస్వదృష్టి, ధర్మభ్రష్టత,-అనే దుర్లక్షణాలు బాగా ఏర్పడి ఉండినవి. ఆత్మనిష్ఠ, పరనిష్ఠ, లేని వ్యక్తిగా తయారైనాడు.

*ప్లాసీ యుద్ధము, తదనంతరము :* ప్లాసీ యుద్ధంలో ఇండియా లోపాలన్నీ బైటపడినవి. ఇండియా అంతటికీ, సంపన్నమైన, ఉత్కృష్టమైన బెంగాలు ప్రాంతం, పరుల ఆక్రమణకు వశమైపోయింది. దీనితో, ఆంగ్లేయులకు భారతీయులకు మధ్య ఇంతవరకూ ఉండిన సంబంధాలు, ఒక్కసారిగా తారుమారై పోయినవి. అతి వినయంతో, ఆదరాన్ని అర్థిస్తూ ఉండిన ఆంగ్లేయుడు, భారతీయులకు వరము లిచ్చే దాతయై కూర్చున్నాడు. బెంగాలు నవాబుతో జరిపిన వ్యాపార వ్యవహారంలో, క్లైవ్, తన దుండగీడు తనాన్ని మొదటిసారిగా ప్రదర్శించినాడు. విజయంవల్ల, ఆంగ్లేయులు, సహించరాని అహంకారాన్ని, ఉద్ధతిని, క్రౌర్యాన్ని ప్రదర్శింప సాగిరి. తమ సహజ స్వభావంలోని అసహ్యమైన లక్షణాలు, గెలుపువల్ల తీవ్రమైనవి.

విజేతలైన ఆంగ్లేయులలో ఆత్మ ప్రతిష్ఠను, హఠమారి తనాన్ని, అది వృద్ధిచేసింది.

ప్లాసీ యుద్ధంతో, బెంగాలులో అత్యంతమైన అసంగత పరిస్థితి ఏర్పడింది. జయించ బడిన ప్రాంతానికి యజమానిలేడు. నవాబు అధికారాలను పూర్తిగా కత్తిరించివేసినారు బ్రిటిషువారు. ఈస్ట్ ఇండియా కంపెనీ, చాల దూరంలో ఉన్నది. అంతేకాక, అది కేవలం వాణిజ్య సంస్థ. రాజకీయాలకు, పరిపాలన వ్యవస్థకు సంబంధించిన వ్యవహారాలకు పూను కోడానికి తగిన విధానం ఇంకా ఏర్పడి యుండలేదు. కంపెనీ కార్యకర్తలు ఇండియాలో చేస్తున్న విషయాలు, ఇంగ్లాండు ప్రభుత్వానికి ఏ మాత్రమూ తెలియవు; జయింప బడిన ఇండియా ప్రజలపట్ల తన బాధ్యతలు ఎట్టివో కూడా ఆ ప్రభుత్వానికి బుద్ధి గోచరం కాలేదు. ఈ విషయమై, లెక్కీ, ఈ విధంగా వ్రాస్తాడు. "సుశిక్షితులైన ఇండియా సిపాయీలతో ఏర్పడిన గొప్ప సైన్యాలకు నాయకులై, ఇంగ్లాండు ప్రభుత్వపు శాసనాధీనానికి దూరులై, ప్రత్యేకంగా నిలిచిపోయినట్టి సేనా నాయకుల గుంపు, అధికార సర్వస్వాన్నీ తమ ఏక స్వామ్యంగా చేసుకొన్నది."

ఈ అధికారులలో కొంతమంది, "కీర్తి మర్యాదలను కళంకిత మొనర్చుకొని, ఆస్తి పాస్తులను పోగొట్టుకొని, తెగించి వచ్చిన అతి సాహసికులు." శ్వేత జాతులు కానట్టి క్రీస్తు మతేతర ప్రజలకు తమ నైతిక సూత్రాలను వర్తింపచేయడానికి, యూరోపు దేశీయులలో ఉత్తములైన వారెవ్వరూ ఇష్టపడని కాలంలో ఇండియాకు వచ్చినవారు వీరు." మిడతలదండు పంటపొలంపై పడి కావించిన విధ్వంసానికంటె, ఈ వ్యక్తులు ఇండియాదేశంపై పడి చేసిన విధ్వంసం ప్రబలమైనది. ఆంగ్లేయుల ప్రవర్తనను గురించి, లెక్కీ,-ఈ విధంగా వ్రాస్తాడు. "విస్తృతమైన జనాభాతో, ఉచ్ఛ్రయ స్థితిలో ఉన్న జిల్లాలు పూర్తిగా నిర్మానుష్యమై పోయినవి. ఆంగ్ల వర్తకులు కనబడడంతోనే, ప్రజలు గ్రామాలను వదిలిపెట్టి అడవులలోకి పారిపోయేవారు; వర్తకులు అంగళ్లను మూసివేసేవారు; భయ భ్రాంతులైన కాందిశీకులతో రోడ్లు నిండిపోయేవి."

ధనసంచయనానికి పూనుకొన్న దురాశాపరులైన ఈ వర్తకులను, ఏవిధమైన నైతిక భీతీ అడ్డుకోలేదు. "ఇంతటి బలంతో, ఇంతటి నేర్పుతో, ఇంత కూలంకషంగా జరిపిన ఉపద్రవాన్ని భారతదేశీయులు ఇంతవరకూ ఎన్నడూ, అనుభవించి ఉండలేదు. కంపెనీలోని లేఖకులు, గుమాస్తాలు, వర్తకులు,- అందరూ ఒక్కసారిగా అధికారులైపోయిరి. స్వల్ప జీతాలను మాత్రమే వారికి ఇచ్చి, స్వంతవర్తకంతో డబ్బు సంపాదించుకొనే అవకాశాలను కంపెనీ కల్పించింది. బెంగాల్ ఆక్రమణ వారికి ఇట్టి సదవకాశాన్ని కలిగించింది. కంపెనీ వారు ఇచ్చిన విస్తారమైన అధికారాలను ఉపయోగించి, ఇండియా వర్తకులను, ఇతర దేశీయ ప్రతిస్పర్థులనూ తమ మార్గంనుంచి పారద్రోలిరి. సుంకాలను, రవాణాశుల్కాలను చెల్లించడం నిరాకరించిరి. కంపెనీవారు వర్తక నిర్వహణకై ఇచ్చిన రియాయితీ పత్రాలను, పెద్దమొత్తాలకు దేశీయ వర్తకులకు అమ్ముకొనిరి. కార్యకర్తలుగా పనిచేస్తున్న దేశీయులను బెదిరించి, తాము అమ్ముతున్న సరకులను ఇతరవర్తకులు అమ్మకుండా నిరోధించి, తమ వస్తువులను అత్యధిక ధరలకుకొని, వారి సరకులను చౌకగా తమకు అమ్మేటట్లు గ్రామీణప్రజలను ఒత్తిడి చేసి,- ఈవిధంగా ఈ ఆంగ్లేయులు విచ్చలవిడిగా, దేశీయులను దోచుకోసాగిరి. జీవనానికి అత్యవసరములైన సరకుల వ్యాపారాన్ని ఏకస్వామ్యం కావించుకొని, వాటిని కరువుకాలపు

ధరలకు అమ్ముతూవచ్చిరి. తమ ఆదాయాన్ని వృద్ధిచేసుకోడానికి, ఇతర పద్ధతులను, మార్గాలను కూడా, అవలంబించిరి. జరిమానాలు విధించడము, పన్నులు వసూలు చేసుకోవడము, దూబరగా కర్చుపెట్టే సంపన్నవర్గాలవారికి ధనహీనులైన జమీందారులకు, అమితమైన వడ్డీపై అప్పు లివ్వడము,- మొదలైన పద్ధతులన్నీ వీరు అవలంబించిరి. ఇతరులను పీడించి డబ్బును లాక్కోవడం, ఉద్యోగాశ కల్పించి డబ్బు గ్రహించడము, లంచాలు తీసుకోవడము,- మొదలైనవన్నీ తమ ఇచ్ఛవచ్చినట్లు ఆచరణలో పెట్టిరి. ఇవన్నీ చూచిన మీర్ కాసీంకు, 1762 మే నెలలో, గవర్నరుకు, సమితికి, ఈవిధంగా ఫిర్యాదు చేసుకోవలసిన గతిపట్టింది. "మీ పెద్ద మనుష్యులు ఏవిధంగా ప్రవర్తిస్తున్నారో గమనించండి. నా దేశంలో అంతా అరాజకంగా, గలభాచేస్తూ ప్రజలను దోచుకొంటూ, నా సేవలోని వారిని హింసించి అవమానపరుస్తున్నారు... తమ కంపెనీ బావుటాలను స్థాపించుకొంటూ, కంపెనీవారి అనుమతి పత్రాలను ప్రదర్శిస్తూ, తమ శక్తిసామర్థ్యాలన్నిటినీ ప్రజలను పీడించడానికీ, వర్తకులను, ఇతర దేశీయులను బాధించడానికి వినియోగిస్తున్నారు. ప్రతిగ్రామంలోను, ప్రతికర్మాగారంలోను, ఉప్పు, పోక చెక్కలు, బియ్యము, ఎండుగడ్డి, వెదుళ్లు, చేపలు, గోనెసంచులు, అల్లము, చక్కెర, పొగాకు, అఫీము, ఇతర సరకులు,- మొదలైనవన్నీ చౌకగా కొని, ఎక్కువ ధరలకు అమ్మి డబ్బు చేసుకొంటున్నారు. రైతులవద్దా, వర్తకులవద్దా ఉన్న సరకులకు, నాలుగోవంతు ధరలు మాత్రమే చెల్లించి, బలాత్కారంగా వాటిని లాక్కొని పోతున్నారు. రైతులను హింసపెట్టి, పీడించి, రూపాయి విలువగల వస్తువుకు ఐదురూపాయలకు వారికి అంటగట్టుతున్నారు. నూరు రూపాయలు శిస్తు చెల్లించే వ్యక్తినికూడా, ఐదురూపాయలు గ్రహించడానికై, బంధించి, అవమానపరుస్తున్నారు. నా ఉద్యోగుల అధికారాన్ని ఏ మాత్రమూ చెల్లించడంలేదు."

కంపెనీ ఉద్యోగులు చేస్తున్న దుండగీడు చర్యలనుంచి తన ప్రజలను రక్షించడానికి పూనుకొన్న మీర్‌కాసీం, ఈ కష్టాలను చూచి భరించలేకపోయినాడు. విధిలేక, హింసా చర్యకు, యుద్ధానికీ దిగవలసి వచ్చింది. కాని, కట్టకడపటికి, పరాజయాన్ని పొంది, ప్రవాసంలోకి పోవలసి వచ్చింది.

గవర్నర్లు, సేనానాయకులు, మండలి సభ్యులు, మొదలైన ఉన్నతాధికార్లు, రాజుల వద్దా, దేశీయాధికారులవద్దా బహుమతి రూపంగా ధనం గ్రహించి, విస్తారమైన ఆస్తులను సమకూర్చుకొనిరి. తమ పదవులను నిలుపుకోడానికి, కంపెనీవారి ఆదరణను ఆశించి, ఈ రాజులు మొదలైనవారు, కంపెనీ ఉన్నతాధికారులను బహుమతులతో మేపుతూ వచ్చిరి.

1757 నుంచి 1766 దాకా, దేశరాజులు, బెంగాలు ప్రాంతవాసులూ కంపెనీ ఉన్నతోద్యోగులకు బహుమతి రూపంలో, బటవాడా చేసిన మొత్తాల వివరాలను, జేమ్సుమిల్, లెక్కవేసి చూపి ఉన్నాడు. ఈ మొత్తం, సుమారు అరవైలక్షల పౌనులు, లేక ఆరుకోట్లరూపాయల దాకా పెరిగిపోయిందన్న విషయం, నిజంగా దిగ్భ్రాంతి కలిగిస్తుంది. ఈ మొత్తంలో, క్లైవు సంపాదించుకొన్న జాగీరు చేరలేదు. సాలుకు 30,000 పౌనులు ఆదాయం వచ్చే జాగీరును క్లైవు ఒక్కడే సంగ్రహించు కొన్నాడు. ముప్పైనాలుగు సంవత్సరాల వయస్సులో ఇంగ్లాండుకు మరలిపోయిన క్లైవుకు, సాలుకు 40,000 పౌనులు ఆదాయం లభించే ఆస్తి ఏర్పడింది. ఇదికాక, తన బంధువులకై, 50,000 పౌనులను నగదు రూపంలో తీసుకొని వెళ్ళినాడు.

కంపెనీ సేవలో ఉన్న ప్రతి ఉద్యోగీ, ప్రతి సైనికుడూ కూడా, తనకు సాధ్యమైనంత ద్రవ్యరాశిని కూడబెట్టుకొన్నాడు. ఇండియా దేశంలోని తమ తాత్కాలిక నివాసం, ధన పంతులు కావడానికి సిద్ధించిన అపూర్వావకాశంగా తీసుకొని, ఇండియా ప్రజల గతి ఎట్టి దౌతుందన్న విషయాన్నే పట్టించుకోక; దేశాన్ని దోచుకొని, తాము బాగుపడిరి. కడపటికి, కంపెనీ డైరెక్టర్లు కూడా, ఈ వాస్తవ విషయాన్ని గ్రహించవలసి వచ్చింది. "అంతర్దేశీయ వ్యాపార మూలంగా, మనవారు గడించుకొన్న విస్తృత సంపదలన్నీ, అత్యంతమైన ప్రజా పీడనంవల్లను, పరుసగా జరిపిన నిరంకుశ బాధాచరణం వల్లను, సిద్ధించినవనడం వాస్తవం. ఈ విధమైన ప్రవృత్తి, ఏ యుగంలోనూ, ఏ దేశంలోనూ జరిగి యుండలేదు."

సులభ శీఘ్రంగా, ధనం సేకరించుకొనే అవకాశాలు ఉన్నవనే విషయాన్ని గ్రహించడంతోనే, ఇతర ఆంగ్లేయుల దురాశకు ప్రేరణ కలిగింది. ఇంగ్లాండులోని కంపెనీ యజమానులు, పలుకుబడిగల ఇతరులు, కంపెనీని నిర్బంధించి, తమ బంధు వర్గంలోని యువకులను, స్నేహవర్గంలోని వారిని కంపెనీ సేవలో ప్రవేశపెట్టిరి. బెంగాలులో లేఖక పదవిని సంపాదించి ఇస్తే, వేయి గినీలు, తాము చెల్లిస్తామని, ఉద్యోగాలకై ప్రాకులాడే వ్యక్తులు ఇంగ్లాండు పత్రికలలో ప్రకటించిరి.

ఈ విధంగా, ఇండియాలోని కంపెనీ సంస్థాపన అమితంగా పెరిగిపోయింది. ఇంగ్లాండులోని ఉన్నత వ్యక్తుల మద్దతుతో ఇండియాకు వచ్చిన ఈ ధనాన్వేషణ యువకులు, లక్షలాది, ఇండియా ప్రజల భాగ్యాలను నిర్వహించడానికి నియమితులైరి. ఇండియాలోని పరహోల చెట్టును దులుపుకొని [శీఘ్రంగా ఇండియాలో ధనం సేకరించుకొని] సంపన్నులై, యౌవనంలో ఉన్నప్పుడే ఇంగ్లాండుకు మరలిపోవడ మొక్కటే, వీరి జీవితాశయం. కీత్ ఈ విధంగా వ్రాస్తాడు. "అత్యంతమైన నిరంకుశ ప్రభుత్వానికీ, నిష్ప్రామాణిక ప్రభుత్వానికీ, లోనై ఉన్నకాలంలో కూడా, ఉచ్చాయస్థితిలో ఉండిన ఈ ఉత్తమ దేశం, రాజ్య పరిపాలనలో అధికభాగం వహించిన ఆంగ్లేయుల కాలంలో నశించిపోయే స్థితికి వచ్చింది. దీని కంతటికీ, కంపెనీ ఉద్యోగుల ధన సంపాదన ప్రయత్నమే మూలము."

క్లైవు మూలంగా, దేశంలో వ్యాపించిన తీవ్ర దురాశా ప్రభావం, ఆంగ్ల సమాజంలోని అన్ని వర్గాలకూ ప్రాకింది. కంపెనీ యజమానులు అధిక లాభాంశాలకై ఒత్తిడి చేయసాగిరి. 1767లో. లాభాంశం, 10 శాతానికి వృద్ధి అయింది. దానిని పంద్రెండున్నర దాకా పెంచడానికి, 1771లో ప్రయత్నం జరిగింది. ఇంగ్లాండు మంత్రులకు, పార్లమెంటు సభ్యులకు కూడా ఈ అంటురోగం సోకింది. "ఇంగ్లాండు జాతీయ రుణాన్ని, ఇండియాదేశం చెల్లించేటట్లు చేయవచ్చును,-అనే ప్రతిపాదన మిక్కిలి ఆకర్షణీయమైనదిగా కనబడింది. ప్రాచ్య దేశ సంపద విషయమై ప్రచారంలో ఉన్న అతిశయోక్తి, ఈ అభిప్రాయానికి దోహదం కావించింది. బెంగాలు ఆక్రమణను కాలాంతరంలో, జాతీయ రుణవిమోచనకు ఉపయోగించుకోవచ్చునని, క్లైవు, పిట్‌కు వ్రాసియున్నాడు. ప్రత్యక్ష రాజస్వాదాయానికి, ప్రాచ్య దేశం మూలాధారం కావచ్చునని, బెక్‌ఫోర్డ్, అభిప్రాయపడినాడు. ఇంగ్లాండు రాజు యొక్క ప్రత్యక్షాధికారం కింద. ఇండియా దేశ ప్రభుత్వాన్ని ఏర్పరిస్తే, జాతీయ రుణాన్ని తీర్చడానికి తగినంత లాభం సమకూరగలదని సమర్థిస్తూ, ఒక లఘు గ్రంథం ప్రచారంలోకి వచ్చింది."

ప్రతిసంవత్సరమూ సుమారు ఇరవైలక్షలు పౌనులు, కప్పం రూపంలో బ్రిటిషు ప్రభుత్వానికి, కంపెనీ చెల్లిస్తూఉన్నదని, అంచనా వేసినారు. "ఇంగ్లాండు ప్రభుత్వము కంపెనీకి ఇచ్చిన ప్రపత్రం ప్రకారం, ఛాయామాత్రమైన ఆధారం లేకపోయినప్పటికీ, న్యాయ సూత్రాలు సమర్థించనప్పటికీ కూడా, కంపెనీ ఆదాయవిషయంలో, మంత్రులు, ఒక వ్యత్యాసాన్ని లేవదీసిరి. వాణిజ్యంవల్ల లభించే ఆదాయం వేరు, రాజ్యాలనుంచి లభించే రాజస్వాదాయం వేరు, అని వీరు రెంటికీ వ్యత్యాసాన్ని ప్రదర్శించిరి. రాజస్వాదాయం ఇంగ్లాండు ప్రభుత్వానికి చెల్లవలసిందని, కంపెనీవారిని బెదిరించి, యథాప్రకారంగా రాజ్యకోశానికి కంపెనీ చెల్లిస్తూ ఉన్న శుల్కధనంకాక, సాలుకు,- 400,000 పౌనుల ధనాన్ని కప్పంగా, కంపెనీనుంచి గ్రహిస్తూ వచ్చిరి. ఆ సమయంలో, కంపెనీ విత్తపరిస్థితి, ఈ బలవద్గ్రహణాన్ని భరించే స్థితిలో లేకపోయినా, చెల్లించవలసి వచ్చింది. కంపెనీ దివాలా తీయడానికి మూలకారణమైన ఈ కప్పము, నిజంగా దోపిడే. ఏదో ఒక రూపంలో, ప్రతిసంవత్సరమూ కంపెనీనుంచి, ఇరవై లక్షల పౌనులు ప్రభుత్వ కోశానికి పోతూ ఉన్నదని, లెక్కవేసినారు.

"క్లైవు, కంపెనీని భ్రష్టు కావించినాడు; అతడు జాతిని కూడా భ్రష్టపరచకుండా చూచుకోవలెనని, చాథాం (Chatham) ప్రయత్నం." జాతి, భ్రష్టమై పోగలదనే భయం, ఊహాకల్పితమైనది కాదు; వాస్తవ నిదర్శనాలున్నవి. పద్దెనిమిదో శతాబ్దపు రెండో భాగంలో, ఇంగ్లాండులో నైతిక వ్యవస్థ అత్యధమస్థితికి వచ్చి ఉంది. లంచగొండితనము, అధికార దుర్వినియోగము, ప్రబలమై వ్యాపించినవి. పార్లమెంటు సభ్యులను ఎన్నుకొనే ఓటింగు హక్కుగల గ్రామాలూ, పురగ్రామాలూ, అమ్ముడుబోయే బజారువస్తువుల స్థితికి దిగజారి పోయినవి. వీటిని కొనడానికి రాజులూ, రాజకీయ నాయకులూ కూడా, ఆసక్తులై ఉండిరి. కాబట్టి, కంపెనీనుంచి ఎక్కువ మొత్తాల ద్రవ్యాన్ని లాక్కోడానికి ఆశపడినారు. ఇండియా కంపెనీ సేవలో సంపన్నులై, "నబాబు" లుగా ఇంగ్లాండుకు తిరిగి వచ్చిన వ్యక్తులు కూడా, వీరితో సమానంగా, శాసనసభలలో తమ ప్రాబల్యాన్ని నిర్మించుకోడానికి ప్రయత్నించినారు. 1768 లో జరిగిన సాధారణ ఎన్నికలలో, ఇట్టి వ్యక్తులు ఇరవైయొక్కమంది, శాసన సభకు ఎన్నుకోబడడం, ఈ ప్రవృత్తికి నిదర్శనం. "కొత్తగా ఏర్పడిన పార్లమెంటు నిజంగా, నబాబుల సమావేశమే." అని వర్ణింపబడింది. వారిలో, క్లైవువంటి వ్యక్తులు నలుగురు ఉండినారు. తక్కినవారందరూ, ఇటీవలి ఇండియా సంఘటనలలో ముఖ్యపాత్ర వహించిన వ్యక్తులు.

వాణిజ్య దూతలు, రోము శాసనసభలో (సెనేట్) ప్రాబల్యం వహించి, గణరాజ్య ప్రభుత్వాన్ని సామ్రాజ్యంగా మార్చిన మార్గాన్నే, ఇంగ్లాండు కూడా అనుసరిస్తుందా? అనేక తరాల ఆంగ్లేయులు బాధలకు లోనై, కష్టపడి సాధించుకొన్న ప్రాచీన స్వాతంత్ర్య సూత్రాలకు భంగం కలిగే పరిస్థితి ఏర్పడింది.

అమిత జనాభాతో కూడిన విస్తారమైన భూభాగాన్ని సంపాదించుకోవడంతో, పరిపాలన సంవిధానానికీ, న్యాయశాస్త్రానికీ సంబంధించిన క్లిష్టసమస్యలు ఎదురైనాయి. ఇంగ్లాండు ప్రభుత్వం సృష్టికి తెచ్చిన వ్యాపారసంస్థ, ఈస్టిండియా కంపెనీ. ప్రభుత్వం ప్రసాదించిన ప్రపత్రాల ద్వారా సిద్ధించిన కార్యధర్మాలు, హక్కులు మాత్రమే, అది నెరవేర్చవలసిన విషయాలు. మూడుకోట్ల జనాభాతో, 150,000 చదరపు మైళ్ల విస్తీర్ణంతో ఏర్పడియున్న

ఈ భూభాగంపై, తాను సార్వభౌమాధికారాన్ని వహించగలదా ? అనేది మొదటి ప్రశ్న. అంతేకాక, తన మాతృదేశమైన ఇంగ్లాండు [గ్రేట్ బ్రిటన్, ఐర్లాండు కలిసి] విస్తీర్ణం 120,000 చదరపు మైళ్లు; దాని జనాభా 90 లక్షలు మాత్రమే. అట్టి స్థితిలో, ఇండియా సార్వభౌమత్వంవల్ల, మాతృదేశంలోని రాజకీయ వ్యవస్థలో సంక్షోభం బయలుదేరే అపాయం కూడా లేకపోలేదు. సామ్రాజ్యంలో సామ్రాజ్యము అనేది, ఎప్పుడూ అపాయకరమైనదే. అందులోనూ, నీతినియమ విహీనులై కేవలం ద్రవ్యలాభపరులైన వర్తకవర్గంచే ఏర్పడిన ప్రత్యేక, అల్పజనసంస్థ, రాజ్యపరిపాలనకు పూనుకోవడం మరింత అపాయకరమైనది.

బెంగాలు ప్రాంతంపై కంపెనీ సాధించుకొన్న అధికారాన్ని లజ్జాహీనంగా, దుర్వి నియోగించుకొన్నారు. ప్లాసీయుద్ధం తర్వాత, ముప్పైఏండ్లకాలము వీరు జరిపిన దుశ్చర్యలు, దేశచరిత్రలో, అత్యంతమూ అపకీర్తి కరమైన విషాదఘట్టాన్ని సృష్టించినవి. 1757 నుంచి 1763 దాకా, తాము జయించిన బెంగాలు ప్రాంతాన్ని కేవలం భూభాగంగా మాత్రమే గణించి, అతివిస్తృతమైన దోపిడికి పాల్పడిరి. ఈ భూభాగంలో నివసించే ప్రజల విషయంలో, విజేతలైన తమకు ఏవిధమైన బాధ్యత, కర్తవ్యము, లేవనే నిశ్చయభావంతో వీరు ప్రవర్తించి నారు. నీతినికాని, న్యాయాన్ని కాని పాటించకుండా, నవాబులను తొలగిస్తూ, కొత్తవారిని సింహాసనం ఎక్కిస్తూ, ఆ సందర్భాలలో వారినుంచి ధనాన్ని లాగుకోవడం, వీరికి పరిపాటి ఐపోయింది. కంపెనీ అధ్యక్షుడు, సమితి సభ్యులు, సేనానాయకులు, అందరూ కూడా ఆ సందర్భాలలో అమిత ధనరూపమైన బహుమతులను, బలవంతంగా తీసుకోడానికి అలవాటు పడిపోయినారు. చిన్నఉద్యోగులు జిల్లాలపై పడి దోచుకోసాగిరి. 1765 లో బెంగాల్, బీహర్, ఒరిస్సా, ప్రాంతాల దివానీ, కంపెనీకి లభించింది. ఆ తర్వాత, ఏడు సంవత్సరాల కాలం, క్లైవు స్థాపించిన ద్వంద్వ ప్రభుత్వ పరిపాలన విధానాన్ని సాగించిరి. ప్రాంతంలోని ఆర్థిక వ్యవస్థపై ఉన్న అధికారాన్ని కంపెనీవారికి హస్తాంతరం చేయడం వినాశకరమైన పెద్దమార్పు. దీనితో ఒక వాణిజ్య కంపెనీలోని గుమాస్తాలు, వర్తకులు, ఒక్క రోజులో, పరిపాలకులుగాను, రాజనీతిజ్ఞులుగాను మారిపోవడం జరిగింది. ఊహించడానికి సాధ్యము కాని క్లిష్టసమస్యలు ఏర్పడే అవకాశాలుగల రాజకీయ విషయాల నిర్ణయం వీరికి అప్పగించడం జరిగింది. ఆస్తుల సంబంధాలను గురించికాని, భూములకు సంబంధించిన విషయాలుకాని, వీరికి తెలియకపోవడము, దేశానికి కలిగిన మరొక దురదృష్టం. అట్టి అజ్ఞానపరిస్థితిలో, తమకు పరిచయంగల ఇంగ్లాండు రాజకీయ ఆర్థికసూత్రాలను, వాటికి పూర్తిగా వ్యతిరేకమైన ఇండియా పరిస్థితులకు వర్తింప చేసిరి.

బెంగాల్ దివానీని వహించడంతోనే, దానిలో అంతర్నిహితమైయున్న బాధ్యతలు కూడా సంక్రమిస్తాయి. కాని, ఈ బాధ్యతలను వహించే నైతిక స్థైర్యం కంపెనీవారికి లేక పోయింది. కనుక, కొన్ని సంవత్సరాలదాకా, తాము ఇండియా సామ్రాజ్య ప్రభుత్వానికి అధీనులమని నటిస్తూ, మొగల్ సార్వభౌముని తెరగా పెట్టుకొని, వెనక నాటకమాడుతూ వచ్చిరి. [1784 లో, పిట్టు ప్రతిపాదించిన ఇండియా బిల్లు శాసనరూపం దాల్చేవరకు, శాస్త్రీకంగా మొగలు చక్రవర్తి రాజుగా ఉంటూ వచ్చినాడు.] ఈ దశాకాలంలో వాస్తవ అధికారాన్ని నెరపడానికి ఆంగ్లేయులు తమకు అనుకూలమైన ఏర్పాటు కావించుకొనిరి. ఇండియా పరిపాలకుని కేవలం కీలుబొమ్మవలె సింహాసనంపై నిలిపి, అధికారం సర్వస్వమూ

అతనిదే అని పైకి చూపిస్తూ, కార్యరూపమైన అధికారాన్ని కంపెనీ అధికారులు వహించిరి. దేశంలో భద్రతారక్షణలను నెలకొల్పి, పోషించే బాధ్యత నవాబుపై ఉంచిరి. కాని, ప్రాంతీయ రాజస్వనిధీ, ప్రయోజకమైన సైన్యమూ కంపెనీవారి అధీనంలో ఉండడంవల్ల, దస్బురూ, సైన్యశక్తికీ కూడా నవాబు కంపెనీపై ఆధారపడవలసి వచ్చింది. భూమి పన్నులను వసూలుచేసే పద్ధతిని కూడా కంపెనీవారు మార్చలేదు; పూర్వపు వేరీజు ప్రకారమే వసూలు చేస్తూ వచ్చిరి. రాజ్య కోశం ముర్షీదాబాదులో ఉండింది. రాజస్వాన్ని వసూలుచేసే కార్యక్రమాన్ని పర్యవేక్షిస్తూ, దానిపై అధికారాన్ని వహించడానికై ఒక నయాబ్-దివానును నియోగించిరి. బాహ్యప్రదర్శనకై మాత్రము ఈ ఉద్యోగ నియామకం, నవాబు పేరుపై జరిపిరి; కార్యతః ఈ ఉద్యోగి కంపెనీకి బాధ్యుడు.

ఈ ఏర్పాట్లు సంతృప్తికరంగా సాగలేదు. కంపెనీ యొక్క దురాశా, కంపెనీ సేవకుల దౌష్ట్యమూ ఏకమై బెంగాలు ప్రాంతాన్ని, అవ్యవస్థకు అరాజకత్వానికి పాల్పరచినవి. తత్ఫలితమే, 1769-70లో ఏర్పడిన దుర్భరక్షామం. మూడు వంతుల జనాభా ఈ క్షామానికి బలియైపోయింది. సమకాలికుడైన ఒక పాశ్చాత్యుడు వ్రాసిన దాన్ని, హంటర్, ఉల్లేఖించినాడు. "ఆమధ్య కాలంలో ఏర్పడిన దుస్థితి ఇప్పటికీ మాసిపోలేదు. దాని వర్ణన మానవత్వం సహించరానట్టిది. కొన్ని ప్రదేశాలలో, జీవచ్ఛములై ఉన్నవారు, శవాలను తిని బ్రతికినారు అనడం, ఖండితమైన సత్యం." ఐనా కంపెనీవారు ఆ క్షామ సంవత్సరంలో, 5 శాతం పన్నును మాత్రమే రద్దు కావించి, తక్కిన భాగాన్ని వసూలుచేసుకొన్నారు. అంతేకాదు. తరువాతి సంవత్సరమే శిస్తును పది శాతం పెంచి, "జనాభా మొత్తంగా నశించిపోవడంవల్ల కలిగిన రాజస్వనష్టాన్ని, కంపెనీవారు, బ్రతికి బైటపడిన వారినుంచి లాక్కొని పూర్తి చేసుకొన్నారు."

కంపెనీవారు, అమానుషమైన ఈ చర్యలను జరపడానికి వేరే కారణాలు కూడా ఉన్నాయి. బెంగాలు ఆక్రమణతో, కంపెనీ భాగస్వాముల అత్యాశ ప్రకోపించినందువల్ల, ఎక్కువ లాభాంశాలకై ఒత్తిడిచేస్తూ వచ్చిరి. ఇంగ్లాండు మంత్రివర్గం కూడా ఈ దోపిడీ ధనంలో తన భాగాన్ని ఇమ్మని పట్టుపట్టింది. ఈ రెండు వర్గాలూ, ఇండియా దేశాన్ని ఒక సువర్ణ భూమిగా భావించిరి. (ఎల్‌డొరాడో) తరిగిపోని ఈ బంగారు నిధిని ఉపయోగించుకోడానికి రెండు వర్గాల వారూ పూనుకోదలచినారు. విశ్వసించడానికి సాధ్యము కానంతటి సంపదలను, క్లైవూ, ఇతర అధికారులూ ఇండియా నుంచి తెచ్చియుండడం, వీరు చూచినారు. కాబట్టి, ఇండియాలోని సంపద విషయంలో అతిశయమైన అభిప్రాయాలకు వీరు లోను కావడం, వింతకాదు.

కాని, కంపెనీ ఉద్యోగులు బాగా ధన సంచయాన్ని చేసుకొన్నా, కంపెనీ, విత్త సంబంధమైన తీవ్ర కష్టాలకు గురి కావడం విచిత్రమైన వాస్తవ విషయం. 6000,000 పౌనుల ఋణభారం, కంపెనీపై పడింది. ప్రతి సంవత్సరమూ 400,000 పౌనులు ఇంగ్లాండు ప్రభుత్వానికి చెల్లించేటట్లు మాట ఇచ్చింది. అదీకాక, మొగల్ చక్రవర్తికి, బెంగాలు నవాబుకు, ఇండియా రాజులకు, ప్రతి సంవత్సరమూ 1000,000 పౌనుల దాకా, సహాయక ద్రవ్యాన్ని ఇవ్వవలసి ఉంది. వీటన్నిటికీ పైగా, కంపెనీ భాగస్వాములు తమ లాభాంశాలను 6 శాతంనుంచి, 1767లో, 10 శాతానికి పెంచిరి; మళ్ళీ 1772లో, 12 1/2 శాతంవరకు

అధికం కావించిరి. అందువల్ల, ఇంగ్లాండు ప్రభుత్వానికి చెల్లించవలసిన 400,000 పౌనులకు వాయిదా వేయడమేకాక, ప్రభుత్వం వద్దనుంచి 10 లక్షల పౌనుల ఋణానికై ప్రార్థించవలసి వచ్చింది. దీనితో, ఇంగ్లాండులోని వారు, భయపడడం సహజమే. ఇంతలో, 1769–70 నాటి క్షామకాలానికి సంబంధించిన భీభత్స ఉదంతాలు ఇంగ్లాండు చేరడంతో, కంపెనీ వ్యవహారాలను చక్కబరచే చర్యలకు తక్షణమే పూనుకోవలసి వచ్చింది.

*ముఖాచ్ఛాదన తొలగించి, వారన్ హేస్టింగ్స్, ఆంగ్ల నిజ స్వరూపాన్ని ప్రదర్శించడం :* కంపెనీ సేవలో, అనేక పదవులను ఇదివరలో నిర్వహించి యుండిన వారెన్ హేస్టింగ్స్‌ను, 1772లో బెంగాల్ గవర్నర్‌గా నియమించిరి. మొగల్ సార్వభౌమత్వమనే మేలి ముసుగును ఒక్కసారిగా చించి పారవేసి, హేస్టింగ్సు, ఆంగ్ల కంపెనీ నిజ స్వరూపాన్ని బట్టబయలు కావించినాడు. దేశాన్ని జయించడం వల్ల సిద్ధించిన హక్కును, సైన్య శక్తిచే నిలుపుకొనే సంస్థ కంపెనీ,-అనే విషయాన్ని వ్యక్తం కావించెను. మొగల్ చక్రవర్తితోను, బెంగాలు నవాబుతోను చేసుకొని యుండిన ఒడంబడికలను రద్దు కావించెను. నవాబుకు సజీంగా సిద్ధించిన హక్కులను తీసివేసి, దివానీని [భూమి పన్నుల అనుదానం] నిజామత్‌తో [దండనీతి, పోలీసు పరిపాలన] కలిపివేసినాడు. నయిబ్ దివానులను ఉద్యోగాలనుంచి తొలగించి, రాజస్వాధికారాన్ని స్వయంగా వహించి, రెవిన్యూ బోర్డును, రాజ్య కోశాన్ని, ముర్షీదాబాదునుంచి కలకత్తాకు తరలించినాడు. చక్రవర్తికి వాగ్దానం చేసిన కప్పాన్ని నిలిపివేసి, రాజస్వంలోని నవాబు భాగాన్ని తగ్గించివేసెను. చక్రవర్తికి నిర్దేశించి యుండిన అలహాబాద్, కోర్హా సుభాలను, యాభై లక్షల రూపాయలు గ్రహించి, ఔధ్ నవాబుకు దత్తం కావించెను. అంతేకాక. నవాబునుంచి 4000,000 పౌనులను తీసుకొని, రోహిల్లాలను అణచివేసే నిమిత్తం, ఆంగ్ల సైన్య దళాన్ని అతనికి సహాయంగా పంపినాడు. హేస్టింగ్సు చేసిన ఈ వ్యవహారాలను, బర్క్ "ఘోరము, అసహ్యకరము, దౌర్జన్యము ఐన విశ్వాస ఘాతుకత్వం" అని, నిరసించినాడు. గవర్నర్ జెనరలు, అతని అభిమానులు, దీనిని ఆత్మ రక్షణ కార్యమని సమర్థించిరి.

కంపెనీయొక్క, సంవిధానానికి, పరిపాలన వ్యవస్థకు, ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన విషయాలలో సమగ్రమైన పరివర్తనం కలుగవలసిన సూచన బయలుపడింది. "ఇండియా దేశం అన్యాయాలతో, దుష్కృత్యాలతో సమృద్ధమై ఉంది. ఈ పాపపంకిలం వాసన భూమ్యాకాశాల మధ్య సీమను పూర్తిగా వ్యాపించి ఉంది" అని, చాథాం, తన మనోవేదనను వ్యక్తం చేసినాడు. ఒక స్వంత వర్తక సంస్థ సంపాదించి ఇచ్చిన సామ్రాజ్యాన్ని నిర్వహించే బాధ్యతను తప్పించుకొని తిరగడం, ఇంక సాధ్యం కాదు. ఈస్టిండియా కంపెనీ, ఇప్పుడు, కేవలం వాణిజ్య సంస్థ మాత్రమే కాదు. లక్షలాది ప్రజలపై సామ్రాజ్యాధికారం నడిపే రాజకీయ వ్యవస్థగా సిద్ధించింది. కాబట్టి, ప్రభుత్వానికీ, ఇంగ్లాండులోని కంపెనీ అధికారానికీ మధ్యగల సంబంధాలనూ ; ప్రభుత్వానికీ, ఇండియాలోని కంపెనీ అధికారులకు మధ్యగల సంబంధాలనూ ; అట్లే, ఇంగ్లాండులోని కంపెనీ డైరెక్టర్లకు, ఇండియాలోని కంపెనీ అధికారులకు మధ్యగల సంబంధాలనూ, పునఃపరిశీలన కావించి, ఒక నిర్ణయానికి వచ్చి, నూతనమైన సంబంధాలను సూత్రీకరించవలసిన ఆవశ్యకం ఏర్పడింది.

ఈ ఇండియా సమస్యకు సమాధానంగా, పార్లమెంటు 1773 లో (రెగ్యులేటింగ్

ఆక్ట్‌ను) వినిమయక శాసనాన్ని పారితం చేసింది. రాజీ కుదిర్చే విధాన మిది. కంపెనీవారి ఆస్తిహక్కులపై అతిక్రమణ కలుగకుండా రక్షించింది ఈ శాసనం. మొగల్ చక్రవర్తి కంపెనీకి ఇచ్చియుండిన దివానీని,- లేక భూమి రాజస్వపరిపాలనను,- కంపెనీకే, వదలి పెట్టింది. ఆంగ్లమంత్రుల చేతులలో ఆశ్రయ పోషణాధికారాలు ఉండడంవల్ల కలిగే అపాయాలను కూడా, ఈ శాసనం తొలగించింది. ఇట్లు, కంపెనీయొక్క ఆస్తిపై వారికిగల స్వామ్య హక్కులను రక్షించి, ఇండియాలోని ఆంగ్లేయ నివాస స్థానాలపైనా, యుద్ధంలో జయించిన భూభాగాలపైనా గల సార్వభౌమత్వాన్ని, ఇంగ్లాండు రాజత్వంలో నిహితం కావించింది, ఈ శాసనం. రాజస్వాదాయ వివరాలన్నిటినీ, కంపెనీ డైరెక్టర్లు ఇంగ్లాండు రాజ్యకోశాధికారికి తెలుపవలసి ఉంటుంది; శివిల్, మిలిటరీ వ్యవహారాలకు సంబంధించిన వ్యవహార వివరాలన్నిటినీ, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి తెలుపవలసి ఉంటుంది.

ఈ వినిమయక శాసనం, హేస్టింగ్సును గవర్నర్ జెనరల్‌గా నియమించి, అతని మండలిలోని నలుగురు సభ్యులను కూడా నియోగించింది. ప్రధాన న్యాయమూర్తితో ఒక సర్వోచ్చ న్యాయస్థానాన్ని ఏర్పరచి, అతనికి సహాయకులుగా ముగ్గురు న్యాయాధిపతులను నియమించింది. ప్రధాన న్యాయమూర్తిని, న్యాయాధిపతులను నియమించే అధికారము ఇంగ్లాండు రాజుది. సక్రమ వ్యవస్థకు, పౌర ప్రభుత్వ పరిపాలనకు ఆవశ్యకములైన నియమాలను, అత్యావశ్యక ఆదేశాలను, వినియమాలను కావించే అధికారాలను, గవర్నర్ జెనరల్‌కు, ఈ శాసనం కలిగించింది.

ఈ విధంగా, శాసన నిర్మాణము, న్యాయ పరిపాలన, కార్య నిర్వహణము, అనే ప్రభుత్వ కార్య కలాపాలన్నిటికీ ఈ శాసనంవల్ల, ఏర్పాటు జరిగింది. నూతన ప్రభుత్వ విధానానికి పునాదులు ఏర్పడినవి. కాని, నూతనంగా ఒక కట్టడాన్ని నిర్మించడం సులభం కాదు. హేస్టింగ్సు పూనుకొన్న కార్యం, నిజంగా, హెర్క్యులీస్ సాధించవలసినట్టి మహాకార్యం. వాణిజ్య కంపెనీలోని, వర్తకులను, అడితీదార్లను, గుమాస్తాలను, పరిపాలన యంత్రాంగాలుగా మార్చవలసి వచ్చింది. "దేశ ప్రజల ఆచారాలను, మతాలను, సాంఘిక ప్రవర్తనలను, ఏ మాత్రమూ తెలియని వాణిజ్య సంస్థను తెచ్చి, నశించిపోతున్న ఇండియా వ్యవస్థ యొక్క స్థానంలో నిలపడం, అతడు పూనుకొన్న కార్యం. అంతేకాక, ఈ వాణిజ్య సంస్థలోని వ్యక్తులు, ప్రజల ఉనికిని గుర్తించిన వారూ కారు; వారిపట్ల బాధ్యత వహించిన వారూకారు. ఐనప్పటికీ, అడ్డులేని సంపూర్ణమైన నిరంకుశత్వాధికారాన్ని కార్యరూపంగా, ఈ ప్రజలపై ప్రవర్తింపచేసే దుష్టశక్తి వీరికి లభించింది.

అసంగతములైన రెండు విషయాల మధ్య, ఘర్షణ ఏర్పడడం అనివార్యమైనది. అపజయానికి లోనై రక్తపాతంలో మునిగియున్న భారతదేశానికీ, ఉన్నత స్థానంలో ఉన్న సార్వభౌమత్వాన్ని, సామ్రాజ్యాన్ని అందుకోడానికి ఆరోహిస్తున్న ఇంగ్లాండు దేశానికీ, మధ్యగల అంతరాన్ని పూడ్చడం సాధ్యంకాని పని. తన జీవితానికి రూపం ఏర్పడే కాలంలో ఇండియాలో నివసించిన హేస్టింగ్సు, భారతీయుల సాంప్రదాయిక పద్ధతుల విషయాలను, ప్రభుత్వాల నిర్మాణ విషయాలను, గౌరవించినవాడు. "స్వజాతి ఉత్కృష్టత, లేక, పతితోద్ధరణ కర్తవ్యము, అనే భావనలతో అతని దృష్టి కలుషితమై ఉండలేదు." అమెరికా ఖండంలో బ్రిటిష్ సామ్రాజ్యం కూలిపోతున్న సమయంలో, ఇండియాలోని తమ రాజ్యానికి

కలుగనున్న ఆపదనుంచి దానిని అతడు రక్షించినప్పటికీ, నిరియమక శాసనం అతని మార్గంలో కల్పించిన ప్రతి బంధకాలను అతడు జయించినప్పటికీ, ప్రాచ్యపాశ్చాత్య సంప్రదాయాలకు రెండింటికీ పొందికగా, పరిపాలన వ్యవస్థను ఏర్పరచడానికి, అతడు కావించిన ప్రయత్నం పూర్తిగా ఫలించలేదు. ద్వంద్వ ప్రయత్నంవల్ల ఏర్పడిన అ స్తవ్య స్తతను, ప్రజాపీడను, అతడు అంతం కావించినాడు. కాని, ప్రభుత్వానికి నూతన వ్యవస్థను ఏర్పరచడంలో, అతనికి అడ్డు తగిలిన కష్టాలు, సాధారణ వ్యక్తులను ముంచివేసి ఉండేవి. ఎన్ని కష్టాలు వచ్చినా, చేతరించుకొని, నిలబడగలిగిన సహజశక్తి, స్వభావసిద్ధమైన పట్టుదలా, కల అసాధారణవ్యక్తి కాబట్టి, హేస్టింగ్సు, నిలబడ గలిగినాడు.

భూమి రాజస్వవిధానాన్ని, న్యాయ పరిపాలన విధానాన్ని, వ్యవస్థీకరించడానికి, అతడు చేసిన ప్రయత్నాలూ, సివిల్ మిలిటరీ ఉద్యోగులలో, క్రమశిక్షణను, సంస్కరణలను ప్రవేశపెట్టడానికి అతడు పూనుకొన్న ఉద్యమాలూ, విత్తపరిస్థితిని బాగుచేయడానికి అతడు చేసిన ప్రయత్నమూ, విఫలమైనవి. ఐనా, ఇతడు కావించిన ప్రయత్నాలు, తరువాతికాలంలో ఈ విషయాలను సుస్థిరంగా నెలకొల్పడానికి ఆధారములైనవి.

కంపెనీకి, నవాబుకు మధ్య ఏర్పడియుండిన ద్వంద్వ ప్రభుత్వాధికార పద్ధతిని తొలగించి, హేస్టింగ్సు సమస్తాధికారాన్నీ కంపెనీ హస్తగతంచేసిన మాట నిజమే; కాని కంపెనీ వ్యవస్థలో ఉండిన ద్వంద్వ ప్రభుత్వ విధానాన్ని మార్చలేము. కంపెనీ సార్వభౌమత్వాధికారం పార్లమెంటుచేతుల్లో నిలిచింది; కాని, ఆ అధికారాన్ని నిర్వహించే పరిపాలనాంగం, ఏర్పడలేదు. ఇండియాలో గవర్నరు జెనరల్‌యొక్క అధికారం, అతని మండలి సభ్యులవల్లను, సర్వోచ్చ న్యాయస్థాన ప్రధాన న్యాయమూర్తివల్లను, పరిమితమైనట్టిది. గవర్నర్ జెనరల్‌కు, మద్రాసు బొంబాయి గవర్నర్లకు, మధ్యగల సంబంధాల నిష్కర్ష జరగలేదు.

న్యాయ పరిపాలన పద్ధతులలో కూడా ద్వంద్వ విధానం సాగుతూ ఉన్నది. సుప్రీంకోర్టు, ఇంగ్లాండు న్యాయసూత్రాలను వర్తింపచేసి, న్యాయనిర్ణయాలను కావిస్తూ ఉండగా, సదర్ దివానీ అదలత్, సదర్‌నిజామత్ అదలత్, ఇతర అధీన న్యాయస్థానాలు, గవర్నర్ జెనరలూ అతని మండలీ, పొందు పరచిన దండనీతి సూత్రాలను, వినియమాలను అనుసరించి, న్యాయనిర్ణయాన్ని జరుపుతూ ఉండినవి. అధికార పరిధి విషయంలో కూడా, ఘర్షణ ఏర్పడింది. తనకుగల పౌరాధికారపరిధి, కంపెనీ న్యాయస్థానాలకు కూడా వర్తిస్తుందని సుప్రీంకోర్టు న్యాయశాస్త్రాన్ని వాఖ్యానించేది. ఈ రెండు వర్గములైన న్యాయస్థానాలలో అనుసరించే ప్రక్రియావిధానాలు కూడా విభిన్నమైనవి. రాజస్వాన్ని వసూలుచేయడానికి, భద్రతా రక్షణలను పాలించడానికి, జిల్లాలలో నెలకొల్పిన పరిపాలన విధానము, మొగల్ విధానాన్ని అనుసరించినట్టిది. ఆంగ్లేయులూ, భారతీయులూ కూడా, ఈ వ్యవస్థలో అధికార స్థానాలలో పనిచేసేవారు. కాని, కంపెనీయొక్క సంవిధానము, దాని కేంద్ర వ్యవస్థయొక్క కార్య నిర్వహణ పద్ధతి, ఇంగ్లాండు న్యాయ సూత్రాలకు బద్ధమైనట్టివి.

కంపెనీకిగల అధికారాలు, రెండు మూలాధారాలనుంచి వచ్చినట్టివి; కాబట్టి, రెండు విధములైన బాధ్యతలకు కంపెనీ లోనయింది. మొగల్ సార్వభౌముని అనుదాన పత్రం ద్వారా సిద్ధించినవి, పౌర సంబంధమైన అధికారాలు; సాధారణ ఆధిపత్యం బ్రిటిష్ రాజత్వంనుంచి సిద్ధించింది. మొగల్ చక్రవర్తిపట్ల విశ్వాస నిష్ఠను వహించి యుండడం న్యాయరీత్యా

అవసరం కాబట్టి, ఇండియా న్యాయ సూత్రాలను, మతాలను, ఆచారాలను గౌరవంతో చూడ వలసిన బాధ్యత కంపెనీపై కలదు. ఇక రెండవ పక్షంలో, బ్రిటిషు ప్రభుత్వంయొక్క కార్యకర్త కాబట్టి, బ్రిటిషు పద్ధతులను, నియమాలను సమర్థించి నిలబెట్టడం కంపెనీయొక్క అవశ్య కర్తవ్యం. ఈ విధంగా, పరిపాలన విధానాన్ని భారతదేశ పద్ధతుల ప్రకారం నడప వలెనని వాదించే పక్షంవారికీ, ఆంగ్ల పద్ధతుల ప్రకారం నడపవలెనని పట్టుపట్టిన రెండవ పక్షం వారికీ మధ్య, ఘర్షణ సిద్ధించడం, అనివార్యమయింది.

వారెన్ హేస్టింగ్స్ గవర్నర్ జెనరల్‌గా రావడంతో, పరివర్తనం ప్రారంభమయింది. "దివాన్ బాధ్యతలను, కంపెనీ ఉద్యోగుల కార్యకర్త బాధ్యతలను వహించి, సమస్తమైన రాజస్వాదాయాన్నీ జాగ్రత్తగా పరిపాలించ వలసిందని" ఇండియాలోని అధ్యక్షునికి, మండలికి, ఇంగ్లాండు కంపెనీ సంస్థయొక్క డైరెక్టర్లు ఉత్తర్వులను జారీచేసియుండిరి. చారిత్రకంగా ప్రధానమైనది ఈ నిశ్చయం. అది కలిగించిన పరిణామాలను, జేమ్స్ మిల్, చక్కగా వ్యక్తంకావించినాడు,- "దీనివల్ల కలిగిన మార్పు అతి విస్తారమైనది; పరివర్తనం కలిగించడమే ఈ నిర్ణయం యొక్క స్వభావం. పూర్వం ఎన్నడూ ఊహించనట్టి విప్లవాత్మకమైనట్టిది ఈ మార్పు. హిందూ పరిపాలకులను తోసివేసి ముస్లిము పరిపాలన ఏర్పడినప్పుడు కూడా ఇట్టి ప్రవర్తనం జరుగలేదు. హిందూ పరిపాలన నశించి, ముస్లిము పరిపాలన ఏర్పడడంవల్ల, అధికారాన్ని ఆదరాన్ని వహించియుండిన చేతులు మాత్రమే మారినవి. రాజ్యపాలన యంత్రములో జరిగిన మార్పు అత్యల్పమైనది. సమాజ సంయోజనంలో కలిగిన మార్పు ఇంతకంటె అల్పమైనది. సౌకర్యం కొరకు. పౌరసంస్థల పరిపాలన సమస్తమూ, చాలవరకు, హిందువుల చేతులలోనే నిలిచిపోయింది. రాజస్వాదాయాన్ని నిర్వహించడంలో, ఇప్పుడు కలిగిన సమగ్రమైన మార్పువల్ల, వ్యక్తుల పరిస్థితులకు, సాంఘిక పరిస్థితులకు కూడా తగిలిన ఆఘాతమెట్టిదో, యూరోపు దేశీయులు సులభంగా ఊహించలేరు. *దేశములోని సమస్తమైన ఆస్తినీ, న్యాయ పరిపాలన వ్యవస్థతో సహా, కొత్త పునాదులపై నిలిపింది, ఈ నవీన కల్పన."*

ఏప్రిల్ 13 వ తేదీనాడు, హేస్టింగ్సు, గవర్నర్ పదవిలో ప్రవేశించినాడు. నయిబ్ దివాన్ పదవిని తొలగిస్తూ, డైరెక్టర్ల కోర్టు జారీచేసిన ఉత్తర్వు, ఏప్రిల్ 14 వ తేదీనాడు, అతనికి అందింది. ఆ సమయంలో నవాబు ఇంకా బాలుడే. కాబట్టి, నయిబ్‌దివాన్ పదవిని రద్దుచేయడంవల్ల, ఇండియాలోని సర్వోచ్చాధికారాన్ని వహించిన ఆంగ్లేయులకు, ప్రజలతో ప్రత్యక్ష సంపర్కం ఏర్పడింది. పరిపథ సమితివారు (Committee of circuit) ఈవిధంగా ఆదేశాన్ని పంపినారు;- "విధానంలో సమగ్రమైన మార్పు కలగవలెనని కోర్టు వారు ఆదేశిస్తున్నారు. ఈ మార్పును తేవడంలో, అవలంబించవలసిన ప్రణాళికను, దాని నిర్వహణ విధానాన్ని, కంపెనీ బోర్డుయొక్క విచక్షణకే వదలివేసినారు. వేరొకవిధానానికి వర్తింపచేయడానికై, బోర్డువారు ఇదివరలో పొందుపరచుకొనియుండిన, వినియమాలను విధివిహితంగా రద్దుచేయవలసిన ఆవశ్యకం లేదు. వాటిని రద్దుపరచడంవల్ల వాటికి అధీనమైయున్న సహాయకసంస్థలు కూడా, లోపించిపోవడం జరగగలదు. ఆ సంస్థలు నూతన వ్యవస్థతో ఏకీభవించేటట్లు చేయవలసి ఉంటుంది. ఏకీభవించనప్పుడు మాత్రమే మార్పు అవసరం."

రాజస్వాన్ని వసూలుచేసే కర్తవ్యాన్ని, ఇప్పుడున్న జమీందారులకు గుత్తవిధానంపై అప్పగించడమా, లేక, వేలంలో ఎక్కువ డబ్బు చెల్లించే ఇతరులకు గుత్తకు ఇవ్వడమా, అనే విషయం చర్చకు వచ్చింది. గవర్నరుయొక్క సమితి సభ్యులకు, కంపెనీ కోర్టు డైరెక్టర్లకు మధ్య, ఈ చర్చ, చాలకాలం జరిగింది. జమీందారులకు విరామవేతనాలను కల్పించి పంపివేయడంవల్ల, రైతులకు తమఅధీనంలోని భూములపై కార్యతః, స్వామ్యం ఏర్పడగల దనే విషయాన్ని గ్రహించి, కడపటికి, ఇప్పుడు వ్యవహారంలోఉన్న పద్ధతినే నిలపడానికి నిశ్చయించుకొన్నారు. ఈ విషయమై హేస్టింగ్సు ఈవిధంగా డైరెక్టర్లకు వ్రాసియున్నాడు. "జమీందారులను, తాలూకుదార్లను ఈవిధమైన అనిశ్చితస్థితిలో త్రోయడం, మనం అనుసరిస్తున్న ధర్మన్యాయానికి (Equity), సమ్మతమైనది కాదు; మీ ఆదేశాలకు అనుగుణమైనది కూడా కాదు. మనం తెచ్చే మార్పులవల్ల, సంవిధానం ఒక్కసారిగా మారిపోకూడదని, జమీందారులు చిరకాలంగా అనుభవిస్తూఉన్న విశేషాధికారాలకు, రక్షణలకు, భంగం కలుగకూడదని, మీ ఆదేశాలే నిర్దేశిస్తున్నవి." కాని, ప్రస్తుత పద్ధతినే అనుసరించినా కూడా, రాజ్య ప్రయోజనాలకు నష్టం కలుగకూడదు. కాబట్టి, జమీందారులు, తాలూకుదార్లు ఉన్న ప్రదేశాలలో, ప్రభుత్వం వారితో ఒప్పందాలను చేసుకోవడం, కొత్త గుత్తేదార్లను తీసుకోవడంకంటె, ఎక్కువ ప్రయోజకమైనది. కాని, జమీందారులు లేని ప్రదేశాలలోను, ఇతరులు చెల్లించడానికి పూనుకొన్న శిస్తును చెల్లించడానికి వీరు ఇష్టపడని సందర్భంలోను, ఇతర గుత్తేదార్లతో ఒప్పందం చేసుకోవచ్చు. పూర్వం ఏ హక్కులూ లేనట్టి ఇతర గుత్తేదారులనుంచి, కంపెనీ రాబట్టుకోగలిగిన రాజస్వధనాన్ని చెల్లించడానికి, జమీందారులు ఇష్టపడినప్పుడే జమీందారులకు ఈ హక్కు నిలిచియుండే నిశ్చయం జరిగింది. ఐదుసంవత్సరాలకు ఒకసారి శిస్తు బేరీజు జరిగేటట్లు. 1772 లో కంపెనీ నిశ్చయించింది.

హేస్టింగ్సు కావించిన ఈ పరిష్కారాలవల్ల, రైతులూ, భూమి యజమానులూ కూడా, అమిత నష్టాలకు గురియై నశించిపోయే స్థితికి వచ్చిరి. ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు అనిశ్చయమై యుండడంవల్ల, వ్యవసాయాన్ని బాగుపరచుకొనే సంకల్పం, రైతులకు లేక పోయింది. శిస్తు వసూలు చేసే ఉద్యోగులు విస్తారమైన అధికారాలు కలవారు; న్యాయాధికార, దండనాధికారాలు రెండూ, ప్రభుత్వం వీరికి అప్పగించింది. కాబట్టి, ఈ అధికారులు పెట్టే బాధలనుంచి, హింసలనుంచి రైతులకు రక్షణ లేకపోయింది. ఈస్ట్ ఇండియా కంపెనీలోని అధికారులే, స్వయంగా, ఈ దోపిడిలో పాల్గొంటూ వచ్చిరి. నోట మాటలేని నిస్సహాయులైన బెంగాలు రైతులు చిరకాలంగా వస్తున్న హక్కులతో అనుభవిస్తున్న పొలాలు, ఈ విధంగా కంపెనీవారి దోపిడికి గురియైపోయినవి. హేస్టింగ్సు సేవలో ఉన్న, కుంటూబాబూ, అనే దేశీయ సేవకునికి, పెద్ద జమీందారీని గుత్తకు ఇచ్చి ఉండడం ఇందుకు నిదర్శనం. కుంటూ బాబూ కుమారుడైన పదేండ్ల పిల్లవాని పేరిట, ఈ గుత్త పత్రం రిజిస్టరు అయింది. ఇది, తన సేవకునికి తాను చేసిన ఉపకారం కాదనీ, అత్యధికమైన గుత్త చెల్లించే కరారుపై అతనికి ఇవ్వబడిందనీ, హేస్టింగ్సు తాను చేసిన ఘనకార్యాన్ని సమర్థించినాడు. సంశయాస్పదములైన ఇట్టి వ్యవహారాలు జరిపిన వాడు, హేస్టింగ్సు ఒక్కడేకాడు. కంపెనీ ఉద్యోగులు తమ సేవకుల పేరిటా, లేక, బనియాల పేరిటా జమీందారీలను గుత్తకు తీసుకొనే అలవాటు, 1773-93 సంవత్సరాల మధ్యకాలంలో ఎక్కువ విస్తారమై ఉండింది. పరిపాల సమితి

లోని అధికసంఖ్యాక సభ్యులు ఈవిధంగా వ్రాసియున్నారు. "సాలుసు పదమూడున్నర లక్షలు ఆదాయం వచ్చే జమీందారీ గుత్తలు, కంపెనీ మూల ధనానికి ఇచ్చిన, వేరే పదహారు లక్షలకు మించిన కరార్లు, గవర్నర్ బనియా పేరిటా, లేక, అతని కుమారుని పేరిటా, లేక అతని సోదరుని పేరిటా, పూర్తిగా వారి లాభం కొరకే అంటకట్టలేదని, మేము ఖండితంగా నమ్ముతున్నాము. యజమానికీ, అతని సేవకూలకూ మధ్యఉన్న. పరస్పర ప్రయోజన సంబంధాలు అసహ్యకరంగా, విస్పష్టంగా వ్యక్తమౌతూ ఉండగా వేరే సాక్ష్యాన్ని చూపడానికి ప్రయత్నించడం అనవసర ప్రయాస మౌతుంది; అట్టిది సాధ్యంకూడా కాదు. ఇంత వరకు రుజువు చేయబడిన అధికార దుర్వినియోగాలన్నిటిలోను, మధ్యవర్తిగా ఉన్నవాడు బనియా. పైకి మాత్రం. ఇతనిపేరిట ఉన్నట్లు కనపడే గుత్త పత్రాలన్నీ, కరారులన్నీ, వాస్తవంగా యజమానివే, అనే విషయాన్ని కోర్టు డైరెక్టర్లు గమనించవలసి ఉంది. షారీగర్ జమీందారీకి, ఫ్లీట్‌వుడ్ యొక్క బనియా, పేరుకు మాత్రమే గుత్తేదారు. ఇదే విధంగా, సిల్హెట్ జమీందారీ వాస్తవానికి, ఠాకేరిది; బాంజోరా, అపోలే జమీందారీలు, క్రిస్టీవి. జేల్లోవా, లోని ఉప్పు పొలాన్ని ఈ విధంగానే, బనియా పేరిట, బార్టన్, గుత్తకు తీసుకొన్నాడు. ఈ ప్రాంతాలలోని భూములలో, మూడవ వంతుకు తక్కువ కాని పొలాలను ఇండియాలోని ఇంగ్లీషు పెద్ద మనుష్యులు, బనియాల పేరిట గుత్తకు తీసుకొన్నారని మేము విశ్వసించడానికి తగినంత ఆధారాలు ఉన్నవి."

ఇది 1776 నాటి పరిస్థితి. ఆ తర్వాతకూడా ఈ దుష్ట వ్యవహారం సాగుతూనే వచ్చింది. 1793లో, శాశ్వత భూమి పరిష్కారం జరిగే నాటికి, బెంగాలులోని భూమిని, సగానికి పైగా, 'బనియాలు' ఈ విధంగా దురాక్రమణ కావించియుండిరి.

ప్రాచీనమైన ఇండియా గ్రామీణ ఆర్థిక వ్యవస్థపై వారెన్ హేస్టింగ్సు, మరణాంతకమైన దెబ్బకొట్టినాడు. దేశంలోని భూమి సమస్తమూ, ప్రభుత్వముయొక్క స్వామ్యము అనే అభిప్రాయ మతనిది. కాబట్టి, రైతు చేసినకష్టానికి తగిన కూలి, అతడు వ్యవసాయానికి పెట్టిన మూలధనంపై లాభము మాత్రమే,- అతనికి చెందవలసిన పంట భాగమని, రైతు భాగాన్ని పరిమితం కావించినాడు. పన్నులు వసూలుచేసే వ్యక్తికి చెందవలసినంత రుసుము మాత్రమే మధ్యవర్తియైనవాని భాగం. తక్కిన పంటభాగమంతా, ప్రభుత్వానికి చెందవలసింది, అని హేస్టింగ్స్ చేసిన ఏర్పాటు. ఈ సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టడంవల్ల కలిగిన పరిణామాలు వినాశకరమైనట్టివి. వంశానుగతంగా వచ్చిన భూస్వాముల హక్కులు, నిరాధారములని వాటిని తోసివేయడం జరిగింది. భూములను వేలంవేసి, అందరికంటె పెద్ద మొత్తాన్ని పాడిన వ్యక్తి నుంచి, హామీ మొత్తాన్ని జమకట్టించుకొని, వానికి ఆ భూమిని గుత్తకు ఇచ్చేవారు. మొదటి ఐదుసంవత్సరాల గుత్తవేలం 1772 లో జరిగింది. ఆ తరువాత, ప్రతి సంవత్సరమూ, వేలం జరుపుతూ వచ్చిరి.

ప్రభుత్వానికి బాకీపడిన శిస్తులను వసూలుచేయడానికి, హేస్టింగ్సు చేసిన ఏర్పాటు, మరియొక ముఖ్యమైన మార్పు. "జమీందారులు పూర్తిగా శిస్తు చెల్లించక బాకీపడిన సందర్భంలో, వారిని జమీందారీనుంచి తొలగించి, వారి భూములను పూర్తిగాకాని, లేదా, బాకీ మొత్తం వసూలు కావడానికి తగినంత భాగాన్నికాని, అమ్మి, ప్రభుత్వ నష్టాన్ని పూర్తిచేసుకోవడం జరుగుతుంది." అనేది ఇతడు కావించిన ఏర్పాటు. అధికార దుర్వినియోగానికి ఇది

మంచి అవకాశాన్ని కల్పించింది. పన్నులు వసూలుచేసే వ్యక్తులు కఠినచర్యలకు పూను కోవడము, హింసాకాండను జరిపి రైతుల నుంచి చరాస్తులను లాక్కోవడము, రైతులు మరుగుపడి, లేక డబ్బు దాచుకొని, పన్నులు ఎగకొట్టడము,- మొదలైన దుష్టచర్యలన్నీ ప్రారంభమైనవి.

హేస్టింగ్సు ప్రవేశపెట్టిన మార్పుల కారణంగా, జమీందారులలో పెక్కుమంది నాశమై పోయిరని, పన్నులు వసూలు చేయడానికి చిన్న ఉద్యోగాల సిబ్బందిని ప్రభుత్వం నియోగించిందని, ఫిలిప్ ఫ్రాన్సిస్, లిఖించి ఉంచినాడు. ఈ విషయాలను పునరావలోకనంచేస్తూ, ఆర్. సి. దత్ ఈవిధంగా వ్రాసినాడు. "బెంగాలులోని పెద్ద జమీందారులు, ప్రాచీన కుటుంబాలు, అందరూ, ఈవిధానంలోని ప్రతిసంవత్సర శిస్తు పరిష్కారాలకు, పదేపదే జరిగిన శిస్తు పెంపకానికి, తాము ఇదివరలో ఎన్నడూ అనుభవించనట్టి, క్రూరచర్యలకు లోనై, నాశమైపోయిరి. తమ జమీందారీలు, సంస్థానాలు, వడ్డీ వ్యాపారస్థులకు, కలకత్తాలోని అతి సాహస వ్యాపారస్థులకు వశమైపోవడం, ప్రాచీన వంశాల సంతతివారు చూడవలసిన పరిస్థితి ఏర్పడింది. ప్రభుత్వము నియోగించిన కార్యకర్తలు, దురాశాపరులై తమ జమీందారీలలోని ప్రజలను హింసిస్తూ ఉండడం, భర్తృవిహీనలైన జమీందారీ స్త్రీలు, యుక్తవయస్కులుకాని భూస్వాములు, నిస్సహాయులై, ఏమీ చేయజాలక చూస్తూఉండవలసి వచ్చింది." బెంగాలు లోని పెద్దసంస్థానాలైన బర్ద్వాన్, రాజషాహీ, దినాజ్‌పూర్‌ప్రాంతాలలోని ప్రజలకు కలిగిన దుస్థితిని, వారిని పెట్టిన కష్టాలను, ఈ పరిస్థితులకు నిదర్శనంగా ఇతడు వివరించినాడు.

*పిట్ ప్రతిపాదించిన ఇండియా చట్టము :* ఇతర వ్యవహారాల సాధారణ పరిస్థితి కూడా సక్రమంగా ఉండలేదు. విత్త సంబంధమైన తీవ్ర పరిస్థితులకు, కంపెనీ లోనై ఉండింది. మైసూరుపై జరిపిన అప్రతిష్ఠాకరములైన యుద్ధాలవల్లను, మహరాష్ట్రులపై జరిపిన అతి వ్యయంతో కూడిన దండయాత్రల వల్లను, కంపెనీ ద్రవ్య మూలాధారాలు వట్టిపోయి నవి. ఇంగ్లాండు కూడా ప్రపంచ యుద్ధంలో ప్రవేశించడంవల్ల, నౌకాపరివహన సంబంధ మైన ఖర్చులు అధికమైనాయి. అందువల్ల, కంపెనీ వాణిజ్యానికి నష్టం కలిగింది. వినియమక శాసనం, కార్య రూపంలో విఫలమయింది. ప్రభుత్వము, కంపెనీ, ఇండియా లోని కంపెనీ ఉద్యోగులు, గవర్నర్ జెనరల్, అతని మండలి, మూడు రాజధానుల గవర్నర్లు,-మొదలైన వారి వేర్వేరు అధికారాలను, అధికార పరిధులను బాధ్యతలను ఈ శాసనం స్పష్టంగా ప్రత్యేకపరచి వివరించక పోవడం, గొప్ప లోపంగా, పరిణమించింది. అధికార దుర్వినియో గంతో కుళ్ళు పట్టింది పరిపాలన విధానం. "అతి వ్యయముతో కూడిన సంస్థాపనయొక్క బాధ్యత వహించిన విధానం ఇది. అసంఖ్యాకులైన ఆశ్రితులు, ఆశ్రయదాతల ప్రోత్సాహ మనే శాపము, సంస్కరణ ప్రయత్నానికి ప్రతిబంధకాలు. చిరకాలంగా అలవాటు పడిన విషయ లాంపట్య వైవిధ్యంవల్ల నిస్సారమైపోయిన ప్రభుత్వము; అత్యాశాపరులైన వ్యక్తుల పీడనకు లోనైన దేశం ఇది. ఈ వ్యక్తులు సేకరించుకొన్న విస్తృత సంపదలను చెలామణీ నాణెముల రూపంలో, ప్రతి సంవత్సరమూ ఎగుమతి చేస్తూ ఉన్నందువల్ల, దేశానికి ప్రాణా ధారములైన మూలాధారాలు లోపించిపోతూ ఉన్నవి." అని వారెన్ హేస్టింగ్సే, ఈ నూతన ప్రభుత్వ విధానాన్ని నిరసన వాక్యాలతో విమర్శించినాడు.

కంపెనీకి సంభవించిన చిక్కులు, కేవలం ఇండియాదేశానికి మాత్రమే సంబంధించినవి

కావు. గత ఇరవై సంవత్సరాలుగా, ఇంగ్లాండులోని ప్రతిపక్షవర్గంవారు తమ ప్రాతికూల్యాన్ని ప్రబలంగా వ్యక్తంచేస్తూనే ఉన్నారు. అమెరికా వలసరాజ్యాలతో ఏర్పడిన యుద్ధపరిస్థితి ప్రతికూలమౌతూ రావడము, హిస్పానో-ఫ్రెంచి సంయోగం, ఇంగ్లాండుపై దాడి జరపడానికి సన్నాహాలు జరుపుతూ ఉండడము,- అనే కారణాలవల్ల ఇంగ్లాండులో ఏర్పడిన చింతావ్యాకులత్వాన్నీ. సంశయాన్నీ, వారెన్ హేస్టింగ్సు చర్యలు తీవ్రం కావించినవి. సాలుకు 40 లక్షల పౌనుల రాజస్వాదాయం లభించే ఇండియా భూభాగాలను కంపెనీ సంపాదించి ఉండినది. ఇంగ్లాండు మంత్రుల ఆశాదృష్టి, ఈ భూభాగంపై పడింది. ఇండియా ఇచ్చే ఆశ్రయ దాతృత్వంతోను, ఆ దేశంవల్ల లభించే ధనంతోను, తమ చిక్కులు చాలభాగం తొలగి పోగలవు. జాతీయరుణాన్ని తగ్గించే విషయమై చర్చిస్తూ, ఆడం స్మిత్, ఈవిధంగా వ్రాస్తాడు. "ఈస్ట్ ఇండియా కంపెనీ సంపాదించిన ఇండియా ప్రాంతాలను, ఇంగ్లాండు రాజత్వానికి, వాటిపైగల నిస్సంశయమైన హక్కులను,- అనగా, ఇంగ్లాండు ప్రభుత్వానికీ ఇంగ్లాండు ప్రజలకూ వాటిపైగల హక్కులను,- ఇంగ్లాండు ఆదాయానికి మరొక మూలాధారంగా చేసుకోవచ్చు. దీనివల్ల సిద్ధించే రాజస్వాదాయం, ఇదివరకు వివరించిన వాటన్నిటికంటె, విస్తృతమైనట్టిది కావచ్చు.

ఇండియా ప్రాంతాలు, ఇంగ్లాండుకంటె మిక్కిలి సారవంతములైనవని, విస్తారమైనవని, విస్తృతికి అనుగుణమైన అధిక సంపద, జనాభా ఉన్నవని, మనకు ఇదివరకే విన్నవించబడింది." ఈ విషయాన్ని పార్లమెంటు ఆమోదించక, అనిశ్చిత స్థితిలో నిలిచింది. ప్రభుత్వపు కర్చులను తగ్గించవలసిందని ప్రజలు ఒత్తిడి చేస్తున్నారు. చిరకాలంగా హేస్టింగ్సుకు బద్ధవిరోధియైన ఫిలిప్ ఫ్రాన్సిస్, గవర్నర్ జెనరల్‌పైనా కంపెనీపైనా, దోషారోపణలను వరుసగా విసురుతూనే ఉన్నాడు. రాజకీయవాదులలో వర్గవైమనస్యం, తీవ్రమౌతూ వచ్చింది. రాజుకు విశిష్టములైన అధికారాలను పునఃస్థాపించడానికి, రాజుయొక్క ఆధిపత్యాన్ని పునఃప్రతిష్ఠించుకోడానికి; జార్జి రాజు III చేస్తున్న పిచ్చి ప్రయత్నాలవల్ల, దేశంలో, అసమాధాన భావం, వ్యాపించింది. హ్విగ్ పక్షంవారు (Whigs), రాజు ఆస్థాన పక్షానికి వ్యతిరేకులై నిలిచిరి, హ్విగ్ పక్షానికి నాయకుడైన షాక్స్‌కూ, రాజాస్థానంలో ఆప్తులైనవారి ఆలంబనం లభించిన పిట్‌కూ, మధ్య, వ్యక్తిగత ఈర్ష్యాస్పర్థలు, ఏర్పడి ఉండినవి. ఈ స్పర్థలవల్ల, ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యవహారాలు తీవ్రమైన కష్టాలకు గురి ఐనవి. ఆడం స్మిత్‌వంటి పర్యాలోచన శక్తిగల వ్యక్తులు, కంపెనీ పూనుకొన్న సామ్రాజ్య నిర్మాణ కార్యక్రమాలపట్ల అసమ్మతిని ప్రదర్శించిరి.- "వర్తకుడు, సార్వభౌముడు అనే విలక్షణ వ్యక్తు లిద్దరూ పరస్పరం అసంబద్ధమైనవారు. ఇట్టి అసంబద్ధత, మరే ఇరువురి వ్యక్తుల మధ్యా ఉండదు. ఆంగ్ల ఈస్ట్ ఇండియా కంపెనీవారి వాణిజ్య స్వభావంవల్ల వారు పనికిమాలిన సార్వభౌములుగా సిద్ధించగా, సార్వభౌమాధికారోత్సాహంవల్ల వారు పనికిరాని వర్తకులుగా, మారిపోయినారు. వారు కేవలం వర్తకులుగా ఉన్నంతకాలమూ తమ వర్తకాన్ని తృప్తికరంగా సాగించుకొని, వారు సంపాదించిన లాభాలనుంచి, సాధారణమైన లాభాంశాలను భాగస్వాములకు ఇవ్వగలిగినారు. సార్వభౌములైన తర్వాత, 30 లక్షల పౌనుల రాజస్వాదాయం వస్తూఉన్నా కూడా, దివాలాతీసే ప్రమేయం ఏర్పడి, అసాధారణ సహాయం కొరకు, ప్రభుత్వాన్ని అర్థించవలసిన గతి, కంపెనీకి పట్టింది. పూర్వపు సన్నివేశంలో,

ఇండియాలోని కంపెనీ ఉద్యోగులు, తాము వర్తకుల గుమాస్తాలమని భావించుకొనేవారు; ఇప్పటి సన్నివేశంలో ఈ ఉద్యోగులు, సార్వభౌమునికి తాము మంత్రులమని భావించు కొంటున్నారు." అని ఆడం స్మిత్ వ్రాసియున్నాడు.

ఈ విధంగా, విత్తసంబంధమైన చిక్కులకులోనై కంపెనీ, ప్రభుత్వము యొక్క సహాయానికై, విన్నప పత్రాన్ని పంపడంతోనే, విమర్శలూ, దూషణలూ ప్రవాహ రూపంలో ఒక్కసారిగా బైటపడినవి. విచారణ జరపడానికి, గోప్యంగా, సెలెక్టు కమిటీలను నియ మించిరి. ఈ కమిటీలు విచారణ జరిపి, అసంఖ్యాకములు, విస్తారములు ఐన, నివేదికలను పార్లమెంటు సమక్షంలో ఉంచినారు. పార్లమెంటు వీనిని చదివి, ఉద్రేకంతో ఉడికిపోయింది సంస్కరణ మార్గాలను సూచిస్తూ, వివిధ పక్షాలవారూ తమ ప్రతిపాదనలను పార్లమెంటుకు పంపిరి. దీనికంతకూ పర్యవసానంగా. 1784లో, పిట్, ప్రతిపాదించిన ఇండియా బిల్లును పార్లమెంటు ఆమోదించింది. ఇక ముందు 75 సంవత్సరాల దాకా, ఇండియా వ్యవహారాలను నడపడానికి ఆధారములైన సూత్రాలు ఏర్పడినవి. ఇండియా రాజ్యాలపై తనకుగల సార్వ భౌమత్వాధికారాన్ని, పార్లమెంటు, సందేహానికి ఆస్పదంలేని విధంగా ఉద్ఘాటించి, దాని నిర్వహణకై ఒక నియంత్రణ పరిషత్తును ఏర్పరచింది. విత్తశాఖా మంత్రి, ఒక ప్రభుత్వ కార్యదర్శి, నలుగురు ప్రీవీ కౌన్సిలు సభ్యులు,-వీరితో ఏర్పడింది ఈ పరిషత్తు. నియంత్రణ పరిషత్తులో నిహితమైయున్న అధికారాన్ని, కార్యాచరణంలో ప్రవర్తింప చేసేవాడు, ప్రధాన కమీషనర్. విత్తశాఖామంత్రి, ప్రభుత్వ కార్యదర్శి, ప్రధాన కమీషనర్ పదవిని నిర్వహించ డానికి వీలులేదు. ఈ ప్రధాన కమీషనర్, పరిషదధ్యక్షుడు (Board President) అని వ్యవహరింపబడేవాడు. తూర్పు ఇండియా ద్వీపాలలోని బ్రిటిష్ భూభాగాలన్నిటిలోనూ, శివిల్, మిలిటరీ పరిపాలనకు, రాజస్వపరిపాలనకు సంబంధించిన – (ఏ విధంగా నైనాసరే)- అన్ని చట్టాలను, కర్తవ్య నిర్వహణలను, సంస్థలను, పర్యవేక్షించడానికీ, నిర్దేశించడానికీ, అధీనంలో నిలుపుకోడానికీ, అవసరమైన అధికారాలన్నీ ఈ పరిషత్తుకుకలవు. మంత్రులలో ఒకరిని అధ్యక్ష పదవికి నియోగించిరి. పరిషత్తుయొక్క అధికారాలన్నీ, ఇతని అధీనమైనవి. ఈ విధంగా, కంపెనీ, తన రాజకీయాధికారాన్ని కోల్పోయి, పార్లమెంటు అధీనంలోని కార్య కర్తగా మాత్రమే నిలిచింది. కార్యకర్తగా ఏర్పడిన ఈ కంపెనీ మూలంగా, పార్లమెంటు, ఇండియా వ్యవహారాలను జరుపుతూ వచ్చింది.

*కారన్ వాలీసు, కంపెనీ బహదూరు :* వినియమక శాసనంలోని దోషాలనన్నిటినీ, ఇండియాచట్టం, నివారించింది. మండలి విషయంలోనూ, బొంబాయి మద్రాసు రాజధానీల విషయింలోను కూడా, గవర్నర్ జెనరల్ యొక్క ప్రతిష్ఠను ఇది ఎక్కువ చేసింది. మండలి చేసిన తీర్పులను రద్దుచేసే అధికారం, గవర్నర్ జెనరల్‌కు సిద్ధించింది. మదరాసు బొంబాయి రాజధానీలు కూడా, ఇతని అధికారానికి అధీనమైపోయినవి. గవర్నర్ జెనరల్ పదవిని మాత్రమేకాక, సైన్యాధ్యక్ష పదవిని కూడా ఇతనికి ఇచ్చి, కారన్ వాలీస్ అధికారాన్ని, ఇంగ్లాండు ప్రభుత్వం బలవత్తరంగా చేసింది.

"సమర్థమైన పరిపాలన యంత్రాన్ని ఏర్పరచడం, కారన్‌వాలీస్‌కు నియమితమైన కర్తవ్యం. దేశంలో శాంతిని నెలకొల్పి, న్యాయాన్ని సక్రమంగా పరిపాలించడము, అవ్యవస్థ నిర్వహణంవల్లను, అధికారదుర్వినియోగంవల్లను, నాశమొందిన కంపెనీ విత్తపరిస్థితిని బాగు

పరచడము, ఇండియావస్త్రాలకూ, చైనాతేయాకుకూ కంపెనీ ప్రతిసంవత్సరమూ పెట్టెసమూల ధనాన్ని పర్యవసానంగా కొనడానికి తగిన రాజస్వాదాయాన్ని క్రమంగా సమకూర్చడము,- ఆశయాలుగా, కారన్‌వాలీస్ కర్తవ్యాన్ని ప్రభుత్వం నిర్దేశించింది." ఈ కర్తవ్యాలను నిర్వహించడంలో కారన్‌వాలీస్, ఇంగ్లాండులోని సంపన్న భూస్వాముల అభిప్రాయాలను ప్రవృత్తిలో పెట్టినాడు. ఇంగ్లాండు దేశముయొక్క అభ్యుదయానికి, ఉద్దేశపూర్వకమైన శక్తిని చేకూర్చినవారు, ఆ దేశంలోని భూస్వాములు. "అటువంటి పాశ్చాత్యపద్ధతిపై, ఇండియాలో, సంపన్న భూస్వామ్యసంస్థను స్థాపించడానికి నిశ్చితాభిప్రాయం వహించినవాడు," కారన్‌వాలిస్. అతడు హ్విగ్ రాజకీయపక్షంలోనివాడు కాబట్టి, ఆ సూత్రాలను ఇండియా ప్రభుత్వ విధానానికి వర్తింపచేయదలచినాడు. అనగా, కార్యనిర్వాహకశాఖకుకల అధికారాలను పరిమితం కావించడము, కార్య నిర్వాహకశాఖనుంచి న్యాయపాలనశాఖను వేరుచేయడము, ఆర్థిక విషయాలలో ప్రభుత్వముయొక్క ప్రభావప్రాబల్యాన్ని తగ్గించడము, ఒడంబడికల విషయంలో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని బలపరచడము,- అనేవి ఈ పరిపాలనవిధానంలోని సూత్రాలు. కాని, ఇండియా పరిస్థితుల పరిజ్ఞానం అతనికి లేకపోవడము, ఇండియా ప్రజలతోను, వారి వ్యవహారాలతోను, పరిచయం లేకపోవడము, దురదృష్టవిషయం. ఇండియాలోని సంస్థలు, పద్ధతులు హీనమైనవని అతని అభిప్రాయం. తమ జాతి ఉత్కృష్టమైనదని విజేతలైనవారు తలంచే భావానికి ఇతడుకూడా లోబడినవాడు. ఆంగ్లేయుల సంఖ్య-పురుషులు, స్త్రీలుకూడా,- ఇండియాలో అధికంకావడంతో దేశీయులతో ప్రభుత్వానికి సంపర్కం తగ్గిపోయింది.

ఇట్టి అభిప్రాయాల ప్రాబల్యంలో, పరిస్థితుల్లో, బ్రిటిషు పరిపాలన పద్ధతికి ఆకారం ఏర్పడి, వృద్ధిచెందింది. దీని ఫలితం రెండు విధాలైనది. ఒకవైపు పూర్వవ్యవస్థను నశింపచేసింది; మరొకవైపు, పర్యవసానంగా, నూతన భారతదేశవ్యవస్థ ఉత్పన్నం కావడానికి తగిన శక్తులను, ప్రవృత్త మొనర్చింది.

కారన్‌వాలిస్ పదవీకాలంలో, విజేతల ప్రభుత్వానికి రూపము, వ్యవస్థావిధానము ఏర్పడినవి. అతడు ఉద్యోగంనుంచి విరమించుకొని పోయేనాటికి, సమూలమైన అభ్యుదయ పరివర్తనం ఏదీ కలుగలేదు. ముఖ్యములైన అల్పపరివర్తనాలు కొన్ని కలిగినప్పటికీ, పరిపాలనవ్యవస్థయొక్క స్థూలరూపం, పూర్వవలెనే 1858 దాకా, నిలిచిఉన్నది.

సర్వోచ్ఛాధికార విషయంలో మాత్రం, పిట్ ఇండియాచట్టం, కంపెనీ నుంచి, దానిని పార్లమెంటుకు బదలీచేసింది. ఇండియా ప్రభుత్వ పరిపాలనకు అవసరములైన శాసనాలను కావించి, పార్లమెంటు, ఇండియా రాజ్యాలలోని శివిల్ మిలిటరీ వ్యవహారాలను, స్వయంగా నిర్వహించడానికి అరంభించింది. విధానాలను నిర్ణయించి, నిర్దేశించే అంత్య నిర్ధారాధికారాన్ని కంపెనీ నుంచి తొలగించి, దానిని నియంత్రణ పరిషదధ్యక్షునిలో, [లేక, కమీషనరులలో] నిహితం కావించింది. ఈ అధ్యక్ష స్థానం ప్రభుత్వ కార్యదర్శి పదవిలో లీనమయింది. కంపెనీకోర్టు డైరెక్టర్లకు, కంపెనీ యజమానులకు ఇదివరలో ఉండిన, విశేషాధికారాలు, ఇప్పుడు కేవలం నామ మాత్రమై నిలిచినవి. ఆశ్రయ పోషణకు సంబంధించిన హక్కులను వీరు కోల్పోలేదు ; కంపెనీ నిర్వహణ వ్యవహారాల వివరాలను కూడా పరిశీలిస్తూ వచ్చిరి. కాని పరిషత్తు ఆమోదించిన ఆజ్ఞల విషయంలో, వీరు జోక్యం కలుగ చేసుకో కూడదని, ప్రభుత్వం నిషేధించింది. యుద్ధము, సంధి ఒడంబడికలు, ఇండియా రాజ్యాలతోను, రాజులతోను, జరిపే

సంధానాలు, సమాలోచనలు, మొదలైన రాజకీయ విషయాల నుంచి, వీరిని పూర్తిగా బహిష్కరించింది ప్రభుత్వం. కంపెనీ ఉద్యోగులను పదవిలో నుంచి తీసివేయడము, లేదా, ఇంగ్లాండుకు పిలిపించుకోవడము అనే చర్యలకు సంబంధించిన అధికారాన్ని, ఇంగ్లాండు రాజత్వంలో నిలిపి, కంపెనీకిగల ఆశ్రయ పోషణ విశేషాధికారాన్ని తగ్గించి వేసింది. కంపెనీ వ్యవహార పత్రాలన్నిటినీ పరిశీలించే అధికారాన్ని, నియంత్రణ పరిషత్తువహించింది. వర్తక విషయాలు తప్ప తక్కిన వ్యవహారాలకు సంబంధించిన అన్ని ఆదేశ పత్రాలను, నిర్దేశ పత్రాలను ఇండియాకు పంపేముందు, పరిషత్తు ఆమోదించవలసినట్లు, కట్టుదిట్టం కావించినారు.

ఇండియా (హోమ్ గవర్నమెంట్) స్వదేశ ప్రభుత్వంగా సిద్ధించిన ఈ వివిధములైన పరిపాలన వ్యవస్థలు కొంతవరకు, సంకీర్ణములైనట్టివి. పరిషత్తుకు, కంపెనీ డైరెక్టర్లకుగల ఆధిపత్యాధికారం సంయుక్తమై ఉండడం, ఈ సంకీర్ణతకు హేతువు. ప్రథమ దశలో పరిషత్తు, తన బాధ్యతలను ఎంత వరకు నిర్వహించింది. అని నిర్ణయించడం, కష్టంగా ఉండింది. కాని, ఆంతరంగిక పరిపాలనకు, విదేశప్రభుత్వాల వ్యవహారాలకు సంబంధించిన అధికారం సర్వస్వమూ, త్వరలోనే, ఇండియా ప్రభుత్వ కార్యదర్శికి హస్తగతమైపోయింది. "ఒక పట్టణము యొక్క నిగమాధ్యక్షునికీ, నగర ముఖ్యునికీ ఉన్న స్థానానికి" వచ్చింది కంపెనీ డైరెక్టర్ల సంస్థ. ఈ విషయమై కేయే, (Kaye) ఈ విధంగా విమర్శించినాడు. "ఇక ముందు ఇంగ్లాండులోని ఇరువది నలుగురు పెద్దమనుష్యులతో ఏర్పడిన, పర్యాలోచక సంస్థయొక్క సంకల్పంపై, ఇండియా ప్రజల శ్రేయస్సు ఆధారపడి ఉండదు; ఈ రోజు ఉండి రేపు వెళ్ళిపోయే ఒక వ్యక్తి యొక్క అనిశ్చిత ప్రవర్తనపై ఎక్కువగా ఆధారపడి ఉంటుంది. ఈ వ్యక్తి పరిషత్తుకు అధ్యక్షుడుగా ఉండి, పదహైదు రోజులకాలం, ఇండియా దేశ పరిపాలనను సాగించవచ్చు. తర్వాత, పార్లమెంటుయొక్క అనిశ్చిత స్వభావాన్నిబట్టి, అందులో చెలరేగే ఏదో ఒక దుమారంకారణంగా, ఈ వ్యక్తి ఒక్కసారిగా పదవీభ్రష్టుడై పోవచ్చు. అనుభవం లేని ప్రభుత్వ పక్ష నాయకుని ఉపాయకౌశల దోషంవల్ల కావచ్చు, లేదా, అసమర్థుడైన ప్రభుత్వ పక్ష విప్ (Whip) యొక్క అశ్రద్ధవల్ల కావచ్చు,-పరిపాలనాధికారం వహించిన ప్రభుత్వ పక్షం, పార్లమెంటు సమావేశంలో ఓడిపోవడంతో, ఇండియా పరిషదధ్యక్షుడు, పదవీచ్యుతుడై పోవడం జరుగుతుంది."

ఇట్టి సమస్తమైన అధికారాలనూ వహించిన, నియంత్రణ పరిషదధ్యక్షుడు, గొప్ప మొగల్ నవాబువంటివాడైనాడు. నవాబుకూ, ఇతనికీగల భేదం కేవలం ఒక్క విషయంలోనే. నవాబు నివసించింది ఢిల్లీనగరంలో; అతని ఉత్తరాధికారియైన పరిషదధ్యక్షుడు నివసించేది, ప్రజలకు 6000 మైళ్ళదూరంలో ఉన్న లండన్ నగరంలో. అధ్యక్షుని పదవీకాలావధికూడా, స్వల్పకాలికమైనదే. ఆంగ్లజాతియొక్క ప్రయోజనాలను అభివృద్ధిపరచే బాధ్యతను ఈ అధ్యక్షపదవిలో ఉన్న వ్యక్తిపై నిలిపినది పార్లమెంటు. ప్రజలు ఎన్నుకొన్న ప్రజాప్రతినిధుల ద్వారా ఏర్పడింది పార్లమెంటు; కాబట్టి అధ్యక్షుని కర్తవ్యనిర్వహణను, తమ ప్రతినిధుల ద్వారా, ప్రజలు సునిశితంగా పరిశీలిస్తున్నారు. ఇతని కర్తవ్యనిర్వహణం తృప్తికరంగా లేకపోతే, ఇతనిపై చర్యతీసుకొనే అధికారంకూడా ప్రజలకు కలదు.

*కంపెనీ ప్రభుత్వ సూత్రాలు :* పిట్ చట్టం ప్రకారం, ఇండియాలో స్థాపించిన

ప్రభుత్వవిధానం, భారతీయులకు పూర్తిగా నూతనమైనది. సార్వభౌమత్వమనేది సజీవమైన ఒక వ్యక్తిలో నిహితమై ఉన్నదని భారతీయులు ఇంతవరకూ భావించియుండిరి. కాని, ఇప్పటి కొత్త సార్వభౌమత్వం కేవలం భావ మాత్రమైనదే. ఈ సార్వభౌమ పరిపాలనలోనికి వచ్చిన ప్రజలకు దాని స్వరూప మెట్టిదో తెలియదు. ఆ సార్వభౌమత్వం క్రింద ఇండియాలో పనిచేసే కార్యకర్తల ఆజ్ఞలకు, ప్రజలు బద్ధులై ఉండవలసివచ్చింది. ఈ కార్యకర్తలు కూడా ఇండియాలో తాత్కాలికంగా నివసించే వారే; పదే పదే మారిపోతూ ఉండేవారే. కలవర పెట్టుతున్న ఈ పరిస్థితిలో, తమకు అగోచరమైయున్న ఈ సార్వభౌమత్వానికి ఒక వాస్తవిక రూపాన్ని కల్పించుకొని, దానిని "కంపెనీ బహదూర్" అని ప్రజలు వ్యవహరిస్తూ వచ్చిరి.

కంపెనీ బహదూరుకూ, అతని అధికారాన్ని తాత్కాలికంగా ఇండియాలో వహించిన వారికీ, భేదమున్నదనే విషయాన్ని కూడా గుర్తించిరి. ఇట్లు స్వంత బాధ్యతలు, పౌర బాధ్యతలు అనే రెండు విధములైన కర్తవ్యాలను వ్యక్తి నిర్వహిస్తాడనే భావం ప్రజల మనస్సులలో దృఢంగా నాటుకొంది.

పిట్ చట్టం మూలంగా, ఇండియా దేశ వ్యవహారాలపై సమగ్రమైన అధికారమూ, పార్లమెంటుకు సిద్ధించింది. కాని అతి విస్తృతమై, అతి దూరంలో నిలిచియున్న రాజ్యాల పరిపాలనను లండన్‌నుంచి సమర్థంగా నిర్వహించడం సాధ్యంకాదని, పిట్, గ్రహించినాడు. కాబట్టి ఇండియా రాజ్య పరిపాలనకు సంబంధించిన కర్తవ్యాలన్నిటినీ, ఇండియాలోని, గవర్నర్ జెనరల్‌కు, అతని సలహామండలికి అప్పగించెను. కాని, ఈ కర్తవ్యాల నిర్వహణం మాత్రం, ఇండియా ప్రభుత్వ కార్యదర్శి యొక్క పర్యవేక్షణకు, నిర్దేశానికి, అధీనానికి లోనై ఉంటుంది. మొదటి గవర్నర్ జెనరల్‌గా నియమింపబడిన కారన్ వాలిస్, చట్టములోని ఉపబంధాలకు ధారాళమైన వ్యాఖ్యానం కావించి, తన అధికారాన్ని స్వేచ్ఛగా అతి విస్తృతం కావించుకొన్నాడు.

బెంగాలులో పోర్ట్ విలియం వద్దఉన్న, కంపెనీవాసస్థానంలోను, దానికి అధీనమై ఉన్న ఇతర స్థానాలలోను, సువ్యవస్థను నెలకొల్పడానికి, పౌర ప్రభుత్వాన్ని ఏర్పరచడానికి తగిన నియమాలను, అధ్యాదేశాలను, వినియమాలను రచించే అధికారం, 1773 నాటి, వినియమకశాసనం ద్వారా, గవర్నర్ జెనరల్‌కు, అతని మండలికి సిద్ధించి ఉండింది. శాసన నిర్మాణ విషయంలో, గవర్నర్ జెనరల్‌కు గల అధికారం, దీనికి మాత్రమే పరిమితమైనట్టిది. ప్రాంతీయ న్యాయ స్థానాలకు. గవర్నర్ల మండలులకు, సంబంధించిన వినియమాలను చేసే అధికారం, 1784 శాసనం ద్వారా సిద్ధించింది. ఆ తర్వాత 1793లో, "బెంగాలులోని బ్రిటిషు రాజ్యాల ఆంతరంగిక ప్రభుత్వ పరిపాలన విషయమై చేసే వినియమాలనన్నిటినీ కూర్చి, ఒక సంహితంగా ఏర్పరచవలెనని, ఒక నియమం," ఆమోదింపబడింది. మిక్కిలి ప్రయోజకము, అర్థవంతము ఐన కార్యమిది. వ్యక్తులకు, ఆస్తులకు, సంబంధించిన హక్కుల విషయమైన న్యాయసూత్రాలన్నీ, దేశభాషల అనువాదాలతో సహా, సంహిత రూపంలో ముద్రించి ప్రకటించవలెననీ, ఈ న్యాయసూత్రాలను ఏర్పరచడానికి ఆధారములైన విషయాల వివరణాన్ని కూడా, దీనికి పీఠికగా చేర్చవలెననీ, ఈ వినియమం, ఆదేశించింది. ఈ సంహితద్వారా, ప్రజలు, తమ హక్కులను విశేషాధికారాలను. రక్షణలను గ్రహించడం

జరుగగలదని, దీని ఉద్దేశం. కాలం గడిచేకొద్దీ, అనుభవాన్ని బట్టి, ఈ సంహితలోని సూత్రాలను సరిదిద్దడానికీ, మార్చడానికి కూడా అవకాశం కలదని, ఒక అనుబంధంకూడా ఈ వినియమంలో చేర్చినారు.

ఈవిధంగా లిఖితపూర్వకమైన న్యాయసూత్రాలను, వినియమాలను ఆధారంగా చేసుకొని పరిపాలన జరిపే ప్రభుత్వస్థాపనకు, పునాదులు ఏర్పడినవి. ఇంతవరకూ ఆచారంలో ఉన్న, కేవలం వ్యక్తిగతమైన రాజపరిపాలన, దీనితో అంతరించింది. సార్వభౌముని సంకల్పం, వినియమాల ద్వారా, శాసనాలద్వారా, వ్యక్తమయ్యే పద్ధతి అమలులో వచ్చింది. ఈ శాసనాలను మొదలైనవాటిని వ్యాఖ్యానించి నిర్ణయించే అధికారం, న్యాయస్థానాలు వహించినవి. గవర్నర్ జెనరల్‌కు ఇచ్చిన శాసన నిర్మాణాధికారం, ఒక్క విషయంలో మాత్రమే వర్తించదు. 1793 నాటి, వినియమం, ఈ క్రిందివిధంగా శాసించింది. "ఉత్తరాధికారము, వారసత్వము, వివాహ సంస్కార దాంపత్య సంబంధాలు, కులము, సమస్తమైన మతవ్యవహారాలు, మతసంస్థలు, మొదలైన విషయాలకు సంబంధించిన కోర్టు వ్యాజ్యాలలో, ముస్లిములపట్ల, మహమ్మడన్ న్యాయశాస్త్రాన్ని, హిందువులపట్ల హిందూధర్మశాస్త్రాన్ని, సాధారణ నియమాలుగా గ్రహించి, వాటి ప్రకారం, న్యాయాధిపతులు న్యాయనిర్ణయాన్ని చేయవలసి ఉంటుంది." వినియమం పేర్కొన్న కారణాలపై ఏర్పడిన వ్యాజ్యాలలోతప్ప, తక్కిన విషయాలలో హిందూ ముస్లిము న్యాయశాస్త్రాలు వర్తించవు; అనగా, పైన వివరించిన విషయాలలో మాత్రమే అవి వర్తిస్తాయి ; తక్కిన విషయాలలో చెల్లవు. ఈ కారణాలకు సంబంధించిన వ్యాదేశాల వ్యాఖ్యాన విషయంలో ఏర్పడిన వివాదాలను, న్యాయాధిపతుల నిశ్చయానికి పంపించడము, వారి వ్యాఖ్యానాన్నిబట్టి వ్యాదేశాలను సరిదిద్దడము,- అనే, ప్రసిద్ధమైన న్యాయశాస్త్ర పరిణామ విధానాన్ని, ప్రజాప్రతినిధుల అధికారంనుంచి తొలగించి, ప్రభుత్వోద్యోగులకు అప్పగించడం జరిగింది. ఆయా మతానుయాయుల దృష్టిలో, మతసంబంధమైన న్యాయసూత్రాలు పవిత్రమైనవి కావచ్చు. కాని, 1793 నియమనాన్ని అనుసరించిన ప్రభుత్వ నిర్ణయం వీటికి ఆధారమౌతుంది, అని భావించడానికి వీలున్నదా ?

దండనీతివిషయంలో, ముస్లిమ్ సంహిత 1772 దాకా, ప్రవృత్తిలో ఉండింది. 1773 నాటి, వినియమకశాసనం ద్వారా, ఈ సంహితను మార్చే హక్కు, అధికారము, ప్రభుత్వానికి సిద్ధించింది. తత్ఫలితంగా ప్రధానమైన పెక్కు విషయాలలో దానిని పరిమిత మొనర్చి, దాని ప్రవృత్తిని నిర్బంధించిరి. తరువాతి కాలంలో జరిగిన వినియమాలను అనుసరించి, అది పూర్తిగా రూపాంతరం పొందింది.

1793 నాటి, బెంగాల్ వినియమక శాసనం, ఇతర బ్రిటిష్ ప్రాంతాలకు మాదిరిగా ఏర్పడింది. దీనికి సదృశములైన న్యాయసంహితలను, మదరాసు ప్రాంతము 1802 లోను, బొంబాయి ప్రాంతము 1799, 1827 లోను, తయారు చేసుకొని, వాటికి శాసనరూపాన్ని కలిగించినవి. హిందూ ముస్లిం న్యాయశాస్త్రాల విషయంలో చేసిన పరిమితులు, ఈ రాజధానీలకు కూడా వర్తింపచేసిరి.

ఇండియా సమాజ పాలనకు వర్తించే ఈ న్యాయసూత్ర నికాయాన్ని నిశ్చయించినవారు, చాలవరకు విదేశీయులు. శివిల్‌క్రిమినల్ న్యాయానికి సంబంధించిన సమస్త విషయాలకూ సమగ్రంగా వర్తించడమేకాక, ఇది, హిందూ ముస్లిము మతవర్గాల వ్యక్తిగత న్యాయా

లను పరిమితులను కూడా నిర్దేశిస్తుంది. కోర్టు వ్యవహారాలలోని కక్షిదారులు, హిందూ ముస్లిము మతస్థులుకాక, ఇతర మతస్థులైఉన్న సందర్భాలలో, న్యాయానికి, ధర్మన్యాయానికి, ఆత్మ సాక్షికి సంబంధించిన సూత్రాలు వర్తిస్తాయని కూడా, ఈ న్యాయసంహిత నిర్ణయించింది.

ఖోజాలు, మేమన్లు, కొన్ని పంజాబు ముస్లిం జనజాతులు, మొదలైనవారిలో, మత విధులకంటె ఆచారానికే ప్రాముఖ్య మెక్కువ. ఈ పద్ధతినే సంహితలోని వినియమాలు కూడా, అంగీకరించినవి.

ఈవిధంగా, క్రమబద్ధమైన శాసన నిర్మాణ కార్యక్రమాలను నిర్వహించే ప్రభుత్వ పరిపాలన కిందికి, ఇండియాలోని ఒక భాగం రావడం, ఇదే మొదటిసారి. మానవ సంకల్పంచే మార్చడానికి వీలుగల క్రియాత్మకమైన న్యాయవిధాన పరిపాలన ప్రజలకు ఏర్పడింది. పవిత్రమైన మతధర్మశాస్త్రం, భగవత్సంకల్పంవల్ల సిద్ధించినది కాబట్టి, మార్చరానిది. దానికి పూర్తిగా విరుద్ధమైనది, ఇప్పుడు దేశంలో నెలకొన్న మానవ కల్పిత న్యాయవిధానం ఈ న్యాయాలను ప్రవర్తింపజేసేవారు పురోహితులు కారు, పవిత్ర శాస్త్ర పండితులూ కారు. కేవలం లౌకికములైన ఈ న్యాయస్థానాలలోని న్యాయాధిపతులు, భిన్నజాతులకు భిన్నమతా లకు చెందిన వ్యక్తులైనప్పటికీ, జాతిమత కులవివక్ష పాటించక, అందరికీ సమానమైన న్యాయాన్ని కలిగించేవారు.

ఇహలోకాధికారాన్నో, లేక, పరలోకాధికారాన్నో ఆధారంగా చేసుకొని, సమస్తమైన బాధ్యతనూ వాటిపై పెట్టి, స్వేచ్ఛానుసారంగా వ్యక్తులు చేస్తూఉన్న నిర్ణయాలతో, వ్యక్తికీ వ్యక్తికీ, వర్గానికీ వర్గానికీ, కులానికీ కులానికీ విభేదం పాటిస్తూ, విభిన్న ధర్మసూత్రాలను వర్తింపచేస్తూ ఉండినపద్ధతితో, ఏర్పడినట్టిది, ఇండియాలోని పూర్వపున్యాయవిధానం. బాధ్యత వహించిన లౌకికవ్యక్తులు పర్యాలోచనతోకూర్చి శాసనరూపాన్ని కల్గించిన పౌరన్యాయశాస్త్ర సంహితను, వర్గవిభేదాదులను పాటించక, సర్వసామాన్యంగా ప్రవర్తింపచేసేది, ప్రస్తుతం ఏర్పడిన న్యాయపరిపాలనవిధానం. వ్యక్తియొక్క భావప్రవర్తనలోను, సాంఘికభావప్రవ ర్తనలోను, కూడా, తీవ్రపరిణామాలను కలిగించిన ఈమార్పు, విప్లవాత్మకమైనట్టిది.

పరిపాలకులు తమ ఆశయాలను, ఉద్దేశాలను, సాధించడానికి అనుగుణమైనవిధంగా, దేశంలోని పరిపాలనవ్యవస్థను ఏర్పరుస్తారు. ఇండియావిషయంలో, ఈఉద్దేశాలను నిర్దేశించి సూత్రీకరించింది, ఈస్ట్ఇండియాకంపెనీ. కంపెనీసంవిధానంప్రకారం, ఈఉద్దేశసాధన, తక్కిన అన్నివిషయాలకంటె ప్రధానమైనట్టిది. ఇండియాలోని తమ రాజ్యభాగాలనుంచి, అత్యంతమైన లాభాన్ని సాధించడమే వారిపరమోద్దేశం. ఈలాభసాధనవిషయంలోమాత్రం, కంపెనీవారికీ, వారియజమానులైన ఇంగ్లాండుప్రభుత్వాధికారులకూ, ఏమాత్రమూ అభిప్రాయభేదంలేదు. సర్వోచ్ఛాధికార నిర్వహణాన్నిమాత్రమే పార్లమెంటువహించి, వాణిజ్యవిధానాల నిశ్చయాధి కారాన్ని, ఇండియా వాణిజ్య ఏకస్వామ్యాన్ని, 1813 వరకూ కంపెనీకే వదలిపెట్టింది. కాని, ఇందులోకూడా, కంపెనీ భాగస్వాముల లాభాలను రక్షించేవిషయం, అటుండగా, పౌరసంబం ధమైన విధానాన్ని నిర్ణయించే విషయంలోకూడా, ఇంగ్లాడు దేశజాతీయ ప్రయోజనాల రక్ష ణమే ప్రధానమయిందికాని, ఇండియాప్రజల ప్రయోజనాలు కావు.

*శాశ్వతపరిష్కారము :* కారన్‌వాలీస్ ప్రవేశపెట్టిన శాశ్వత పరిష్కారపద్ధతివల్ల ఇండియా సామాజికవ్యవస్థకు ఆధారమూలములైన విషయాలలో తీవ్రమైన మార్పు కలిగింది.

ప్రాచీన గ్రామసంస్థ దీనివల్ల నశించిపోయింది; ఆస్తులసంబంధాలు మారిపోయినవి; నూతన సాంఘికవర్గాలు బయలుదేరినవి; గ్రామసీమలలో సామాజికవిప్లవం సిద్ధించింది.

వారెన్ హేస్టింగ్స్ చేసిన మార్పులవల్ల, బెంగాలు ప్రాంతమంతా కసాయివాని కార్ఖానాగా మారిపోయింది. "ప్రజల దుస్థితికి ప్రదర్శకములైన జాడలు, ఉపప్లవాలు, క్షామ పరిస్థితులు." అతడు సృష్టించి దేశంలో వదిలిపెట్టిపోయిన పరిస్థితులివి. ఈ పెంట కుప్పలను తుడిచివేసి, దేశాన్ని శుభ్రపరచడము, కంపెనీ ప్రయోజనాలను రక్షిస్తూ, దేశీయుల శ్రేయస్సును, భూస్వాముల రక్షణను, సాధించడానికి తగిన పరిష్కారాన్ని చేయడము, కారన్‌వాలిస్ కర్తవ్యాలుగా ప్రభుత్వం నిర్దేశించింది. ఇండియా రావడంతోనే, వ్యవసాయ పద్ధతులకు, అనుభోగ కాలావధులకు, పన్నులకు సంబంధించిన విషయాల విచారణకు, అతడు పూనుకొన్నాడు.

ఈ విచారణ సమితికి అధ్యక్షుడైన జాన్‌షోర్, తన రిపోర్టును, జూన్ 1789లో అర్పించినాడు. భూముల హక్కుల విషయంలో, ఇతని అభిప్రాయాలు హేస్టింగ్సు అభిప్రాయాలకు భిన్నములైనట్టివి. "జమీందారులు భూములకు స్వాములని నేను భావిస్తున్నాను. వంశపారంపర్యంగా సిద్ధించే హక్కులవల్ల వీరికి ఈ ఆస్తి సిద్ధించింది. ఇది కూడా వారి మత ధర్మశాస్త్రాలకు అనుగుణమైనదే. న్యాయప్రకారం, వీరు దానికి వారసులై ఉన్నప్పుడు, దానిని తొలగించడం కాని, మార్చడంకాని, సార్వభౌమాధికారాన్ని వహించిన ప్రభుత్వానికి న్యాయమైనదికాదు. విక్రయం ద్వారాకాని, తాకట్టు పెట్టడం ద్వారాకాని, తమ భూములను అన్యాక్రాంతం చేసే విశేషాధికారం వారికి, ఆధారమూలమైన హక్కువల్ల సిద్ధించింది. మనము దివానీని తీసుకోడానికి పూర్వమేవారు ఈ అధికారాన్ని వహించి ఉండినారు. కాబట్టి, ఈ అధికారాన్ని తీసివేయడం, న్యాయరీత్యా విరుద్ధమైనది." అని, తన నివేదికలో అతడు స్పష్టంకావించినాడు.

హేస్టింగ్సు నిర్ణయంవలెనే ఇతని నిర్ణయం కూడా తప్పే. కాని, ఆంగ్ల పద్ధతిపట్ల అభిమానం వహించినవాడు, కారన్‌వాలిస్. ఇతనికి పూర్వం, అధికారం వహించిన హేస్టింగ్సు చేసిన ప్రయత్నాలు విఫలమైన విషయాన్ని కూడా, ఇతనికి వివరించి, హెచ్చరించియుండిరి. అందువల్ల, జాన్‌షోర్ సమర్పించిన ప్రణాళికను అంగీకరించి, కారన్‌వాలిస్, దానిపై తన అధికార ముద్రనువేసినాడు. కాని, శాశ్వత పరిష్కార విషయం, 1789 లో, చర్చకు వచ్చే నాటికి రాజస్వాన్ని చెల్లిస్తూ ఉన్న గుత్తేదారుల నూతనవర్గం ఒకటి, వేరే ఉన్నదనే విషయం బయటపడింది. వాస్తవానికి, ఈ వర్గం బ్రిటిషువారు నూతనంగా కల్పించిందే. ఫ్లౌడ్ కమీషన్ సూచించినట్టుగా, బెంగాలులో, నాలుగు జమీందారీ వర్గాలు ఏర్పడి ఉండినవి. వీరితో, 1793 లో బ్రిటిష్ ప్రభుత్వం రాజస్వవిషయమైన శాశ్వత పరిష్కారాన్ని చేసుకొని ఉండినది. మొగల్ పరిపాలకులకు రాజస్వరూపంలో కప్పములను చెల్లిస్తూ, తమ సంస్థానాలను నిలుపుకొని యుండిన పురాతన వంశాల కూచ్ బీహార్‌రాజులు, అస్సామ్, త్రిపురా రాజులు, మొదటి వర్గంలోనివారు. స్వతంత్ర సర్దారుల రీతిగా పరిపాలకులకు శిస్తుచెల్లిస్తూ, ప్రాచీన కాలం నుంచీ స్థిరపడియుండిన, రాజషాహీ, బర్ద్వాన్, దినాజ్‌పూర్ రాజకుటుంబాలు, రెండవ వర్గంవారు. రాజస్వాన్ని వసూలు చేయడానికై మొగల్ ప్రభుత్వం ప్రవేశపెట్టిన వ్యక్తులు, మూడవ వర్గంవారు. పెక్కు తరాలుగా, వీరు ఈ కార్యాన్ని నిర్వహిస్తూఉండినందువల్ల, వీరి

ఉద్యోగాలు వంశపారం పర్యంగా నిలిచే పరిస్థితి ఏర్పడింది. తర్వాత, ఈస్టిండియా కంపెనీకి దివానీ లభించిన తర్వాత రాజస్వాన్ని వసూలుచేయడానికై కంపెనీవారు గుత్తేదార్లుగా నియమించిన వ్యక్తులు నాలుగోవర్గంవారు. వీరిని సాధారణంగా, కంపెనీ "జమీందార్లు" అని వ్యవహరించేవారు. వేలంలో గుత్తపాటపాడి, జమీందారీలను గుత్తకు తీసుకొన్న "కలకత్తా బనియాలూ", కంపెనీ ఉద్యోగస్థుల పరంగా బినామీగా భూములను గుత్తకు తీసుకొన్న వ్యక్తులూ కూడా, ఈ వర్గంలో చేరిన వారు. కంపెనీ ఉద్యోగులందరూ కూడా, దేశీయ బనియాల పేరిటా, తమ సేవకుల పేరిటా భూములను గుత్తకు తీసుకొన్నవారే.

ఫ్లౌడ్‌కమీషన్, ఈవిషయమై ఈవిధంగా వ్రాసింది,-శిస్తుపరిష్కారం చేయవలసి ఉంటే, మొదటి రెండువర్గాలవారికీ బలవత్తరమైన హక్కు కలదు. మూడవవర్గానికికల హక్కు సాధారణమైనట్టిది. నాలుగోవర్గంవారికి ఏమాత్రము హక్కులేదు."

గ్రామంలోని, చిన్నవృత్తికార్మికులు, గ్రామసేవకులు, సహాయకులు, కూడా, కారన్‌వాలిస్ ప్రవేశపెట్టిన రాజస్వపద్ధతివల్ల నష్టపడినవారే. వారివిషయాన్ని గణించకపోయినా కూడా, పంటపొలాల ఉత్పత్తిలో భాగస్థులైనవారిని గణించకతప్పదు. ప్రభుత్వము, మధ్యస్థులు, లేక, జమీందార్లు, రైతులు, అనేవారు ఈభాగస్థులు. ఈవిషయంలో మొదటి రెండో భాగస్థులకుగల హక్కులను ప్రభుత్వం స్పష్టంగా వ్యక్తీకరించింది. పంటలో, ప్రభుత్వానికి చెందవలసినభాగాన్ని శాశ్వతంగా, నిర్ధారణ కావించింది. ప్రభుత్వానికి అత్యంతమైనలాభం సిద్ధించేటట్లు నిర్ణయించడం, అసంభావ్యమైనది కాదు.

విత్తవిషయంలో ఇదివరకు ఎన్నడూలేని ఉన్నతస్థాయిలో, శిస్తుబేరీజు నిశ్చితమయింది. భూములపై అంచనావేసిన భాటకమొత్తంలో, 89 శాతం ప్రభుత్వభాగంగా నిశ్చయింపబడింది. దీనితో, పన్నులు వసూలుచేసిన సేవకు, జమీందారుకు, 11 శాతంమాత్రమే మిగిలింది. ఈవిధంగా, ఆదాయంలో కలిగే వ్యత్యయాలవల్ల ఏర్పడే క్లిష్టపరిస్థితులనుంచి, ప్రభుత్వానికి రక్షణ సిద్ధించింది. అంతేకాక, తన వాణిజ్యావసరాలను,-అనగా వాణిజ్య మూలధనానికి ఇంగ్లాండుకు రవాణాచేయడానికి, ప్రభుత్వవ్యయానికి,-ఆవశ్యకమైనధనం, విస్తారంగా, నిశ్చితంగా సిద్ధించేపరిస్థితి ఏర్పడింది. మరిన్ని,-ఇదివరకే సాగులోఉన్న భూములపై విధించిన శిస్తుబేరీజు నిశ్చితమై ఉన్నాకూడా, వ్యవసాయాన్ని విస్తరించడంవల్ల కొత్తగా సాగుకువచ్చే భూములపై ఎక్కువపన్నును విధించే అవకాశాన్ని, ప్రభుత్వం ఉపయోగించుకోవచ్చు.

ఇదిమాత్రమేకాక, తాసిల్దార్లు, కానుంగోలు, పట్వారీలు, ఇతర రాజస్వాధికారులు,-మొదలైన ఉద్యోగులతో ఏర్పడిన, రాజస్వయంత్రాంగాన్ని రద్దుచేయడంవల్ల విత్తవిషయకంగా అధికప్రయోజనంకూడా సిద్ధిస్తుంది.

విత్తవిషయంలో సిద్ధించిన లాభాలకంటె, ఈపరిష్కారంవల్ల కలిగిన రాజకీయ సౌకర్యాలు, ప్రధానమైనవి. మొగల్‌పరిపాలనలో జమీందారులకు ఎక్కువ అధికారాలుండినవి. పన్నులు వసూలుచేసే కర్తవ్యాన్ని నిర్వహించడమేకాక, తమ అధీనములోఉన్న ప్రదేశాలలో దండనీతి అధికారాలను, కార్యనిర్వహణాధికారాలనుకూడా, వీరు నెరవేర్చేవారు. సార్వభౌమపదవికి సంబంధించిన బాహ్యరూపాధిపత్యాన్ని, ఈజమీందారులు, కార్యరూపప్రయోజనాలన్నిటిలోనూ, తమ ప్రాంతాలలో ప్రదర్శించేవారు. ఇతరుల అధికారానికి లోబడియుండే

స్వభావంకాదు వీరిది ; ప్రభుత్వం దుర్బలమైయున్న సందర్భాలలో దానిని ధిక్కరించడము, ఒకొకప్పుడు ఎదురుతిరగడము, వీరికి పరిపాటే. వీరితో, కారన్‌వాలిస్, ఒక ఒప్పందాన్ని ఏర్పరచుకొన్నాడు. ఇంతవరకూ వారు అనుభవిస్తూఉండిన రాజకీయాధికారాలను తీసివేసి, వాటికిబదులుగా, వారి అధీనంలోఉన్న భూములపై నిరవధికమైన స్వామ్యాధికారాలను వారికి కలిగించినాడు. ఆభూములపై ఇంతవరకు, వారికి స్వామ్యం ఉండిందికాదు. అంతేకాక, ఈభూములపై పన్నులను వారి ఇచ్ఛానుసారంగా, పెంచే అధికారంకూడా, వారికిపుడు సిద్ధించింది. వారి రాజకీయాధిపత్యమూ, ప్రభుత్వాన్ని ఎదిరించే అవకాశమూ, ఈవిధంగా నశించినవి. కాని, రైతులపై వీరికిగల ఆర్థికాధికారం ప్రబలంగా వృద్ధిపొందింది. అప్పటి నుంచీ, ఈఒప్పందాన్ని చేసుకొన్న రెండుపక్షాల [ప్రభుత్వము, జమీందార్లు] వారిమధ్యా, శాంతిసహకారాలు ఏర్పడినవి. ఒకపక్షంవారు రాజకీయాధిపత్యాన్నీ, రెండోపక్షంవారు ఆర్థికాధికారాన్నీ, ప్రవర్తింపచేస్తూ వచ్చిరి. పొలందున్ని పంటపండించే రైతుమాత్రం, రెండు పక్షాలవారూకూడా పీడిస్తూ, అతన్ని పీక్కుతింటూవచ్చిరి. ఈఒప్పందంవల్ల కలిగిన రాజకీయ ప్రయోజనాన్నిగూర్చి, సెటన్‌కార్, ఈవిధంగా వ్రాస్తాడు.–"కేవలం రాజకీయ ప్రయోజనాలదృష్ట్యా పరిశీలిస్తే, శంకలను, సందేహాలను ఉపశమింపచేయడానికి ఇది మంచిసాధనమయింది. కుట్రలు, విద్రోహాలు ప్రబలమైయున్న ఆకాలంలో, జమీందారుల సత్ప్రవర్తననూ, ప్రభుత్వంపట్ల కార్యరూపమైన విశ్వాసాన్నీ వారు ప్రదర్శించడానికి, ఈఏర్పాటు ప్రోత్సాహకమయింది."

జమీందారుల జీవన పోషణానికీ, ప్రభుత్వ కోశాన్ని నించడానికీ అవసరమైన సంపదను చెమటోడ్చి ఉత్పాదిస్తున్న రైతులు మాత్రం, ఈ శాశ్వత పరిష్కారంవల్ల, నష్టకష్టాలకు గురియైపోయిరి. పరిష్కార విధానాన్ని ఏర్పరచడంలో, రైతు ప్రయోజనాలను ప్రభుత్వం ఏమాత్రమూ గమనించలేదు. "బెంగాలు రైతుల హక్కుల విషయంలో ఈ పరిష్కార విధానం, ఏ విషయాన్నీ సూచించక మౌనం వహించింది. కాబట్టి, రైతులు కేవలం జమీందారుల ఇష్టానిష్టాలపై, పూర్తిగా ఆధారపడినవారైనారు." అని, కంపెనీ డైరెక్టర్లకోర్టు కూడా అంగీకరించింది. "రైతు వద్ద నుంచి జమీందారు రాబట్టుకో తగిన పన్ను ఎంత అనే విషయాన్ని, పరిష్కార విధానం, నిష్కర్షకావించలేదు. కాబట్టి, ఎవరో కొద్ది మంది తప్ప - తక్కిన జమీందారు లందరూ రైతుల వద్దనుంచి సాధ్యమైనంత వరకూ ద్రవ్యాన్ని లాక్కొంటూ వచ్చిరి. ఈ విధమైన, దోపిడీపూర్తి ఐన తర్వాత, రైతుకు మిగిలింది అతని జీవన పోషణకు కూడా చాలినదికాదు. అనడంలో, సందేహమేమాత్రమూలేదు. ఈ పరిష్కారంతో, రైతుకు హక్కులనేవి లేవనే విషయం నిశ్చితమైపోయింది; ఏదైనా సాధించుకో దలచుకొంటే, అతడు ఇంతటి నుంచీ జమీందారుతో ఘర్షణ పడవలసిందే," అని, కేయే, (Kaye) ఈ పరిష్కారాన్ని విమర్శించినాడు.

జమీందారులవద్ద భూములను గుత్తకు తీసుకొన్న, అధీన భూస్వాములు, లేక, తాలూకాదార్లూ, స్థానికరైతులూ, మాత్రమే, ఈ పరిష్కార విధానం నుంచి వినాయితీ పొందినవారు. వీరు చెల్లించే గుత్తలను, పన్నులను పెంచడానికి వీలులేకుండా ఉండే రక్షణ చాలవరకు, వీరికి లభించింది. కాని, తక్కిన వారందరూ,-1793 తర్వాత, అనుభోగ హక్కులను సంపాదించుకొన్న స్థానిక రైతులతో సహా,-జమీందారుల దయాదాక్షిణ్యాలపై

ఆధారపడియుండవలసివచ్చింది. జమీందార్లు వీరిని తొలగించివేస్తే, అడ్డుకోడానికి ఎట్టి అవకాశమూలేదు. "రైతులు జమీందారులకు చెల్లించవలసిన పన్నులు, లేక, భాటకాలు, కేవలం వారిరువురి మధ్యా జరిగే ఒప్పందంపై ఏర్పడినట్టివి; ప్రభుత్వానికి వాటితో సంబంధమేలేదు." అని, షోర్, ఇదివరకే ప్రకటించియున్నాడు.

జనాభా పెరగడము, వ్యవసాయం విస్తరించడము, పరిశ్రమలు క్షీణించి పోవడము, వర్తక వ్యవహారాలలోను, పరిశ్రమంలోను పనిచేస్తూ ఉండిన ప్రజానీకం, వ్యవసాయ వృత్తికి పూనుకోవడము,-మొదలైన కారణాలవల్ల, పంటపొలాలకు గిరాకీ కలిగి, వాటి ధరలు పెరిగినవి. హింసాకాండతో రైతులవద్ద పన్నులు, భాటకాలు, వసూలుచేసే దౌర్జన్యాలుకూడా మితిమీరిపోయినవి.

భూములపై ప్రభుత్వం విధించిన శిస్తురేట్లు మితిమీరినవి కావడంవల్ల, జమీందార్లు విషమస్థితికి లోనైరి. 1793 నుంచి, 1815 వరకు, జరిగిన ఇరవై రెండేండ్ల కాలంలో, బెంగాలు పంట భూమిలోని సుమారు అర్ధభాగం, అమ్మకానికి వచ్చిందని, ఇతరులకు హస్తాంతరమై పోయిందని, ప్రభుత్వపు అభిలేఖలనుబట్టి తెలుస్తుంది. తత్పూర్వం రైతులు జమీందారులకు చెల్లిస్తూ ఉండిన భాటకాన్ని మాత్రమే గ్రహించవలసిన బాధ్యతకు, భూములను కొన్న వ్యక్తులు లోనైనవారు కారు; కాబట్టి, ఈ క్రొత్త యజమానులు భాటకాలను పెంచి, రైతులను పీడిస్తూ వచ్చిరి. తక్కిన జమీందారులు కూడా వీరి ఆచర్యాన్ని అనుసరించడానికి ప్రారంభించిరి. "ప్రచారంలో ఉన్న భాటకాన్ని ఎప్పుడైతే కొత్త భూస్వాములు పెంచిరో, తక్కినరైతులపై భాటకాలను, వారి యజమానులైన ఇతర జమీందారులు కూడా అదే స్థాయికి పెంచడంలో ఏమాత్రము కష్టమూకలుగలేదు," అని, డాక్టరి ఫీల్డ్, సూచించినాడు.

రైతులతో కరారులు (పట్టాలు) కావించుకోవలసిన బాధ్యత జమీందారులపై ఉండిన మాట వాస్తవమే. ప్రాంతీయాచారాలకు సంబంధించిన రుసుములతోసహా, రైతు నిష్కర్షగా చెల్లించవలసిన భాటకపుమొత్తము, అతడు సాగుచేస్తున్న పొలంవిస్తీర్ణము, పన్నులరేట్లు, నిషిద్ధచర్యలకు చెల్లించవలసిన జరిమానాలు, కొత్తశిస్తులను ప్రభుత్వం విధించిన సందర్భంలో రైతు చెల్లించవలసిన ఎక్కువమొత్తాలు,-మొదలైన విషయాలన్నీ, ఈకరారుపత్రాలలో లిఖితమై ఉండడంకూడా, న్యాయరీత్యా అవసరమే. కరారులోని ఏషరతులకైనా భంగం కలిగినసందర్భంలో, న్యాయస్థానంలో వ్యాజ్యంవేసే అవకాశంకూడా ఉన్నది. కాని, వృథా కాలహరణంతోను, అధికవ్యయంతోనూ కూడిన ఈవిధానం, సామాన్యుడైన రైతుకు అందుబాటులో లేనట్టిది.

కాబట్టి, ఈపరిష్కారంఫలితంగా యాభైసంవత్సరాల దీర్ఘకాలం, ఎట్టి ఉపశమన విధానాలూ లేనివారై, రైతులు వర్ణించరాని దుర్భరకష్టాలను అనుభవించినవారైరి. "1800 (లేక 1812) నుంచి 1945, వరకూగల మధ్యకాలంలో జరిగిన ఈపరిష్కార శాసనప్రతిపత్తిని సమర్థించడంకష్టం. అప్పుడు ప్రభుత్వంచేసిన తప్పులు ప్రాణాంతకమైనట్టివి." అని బేడెన్‌పౌవెల్, ఒప్పుకోవలసి వచ్చింది. 1793 నాటి శాసనాన్నిగురించి, "ఈశాసనంలోని రాక్షసములైన అనుబంధాలను చదివినప్పుడు ఆగ్రహం కలుగకపోదు." అని అతడే వచించినాడు. ఈవిషయంలో, 1859 వరకూ ఎట్టి ఉపశమనచర్యకూ ప్రభుత్వం పూనుకోలేదు.

*ప్రభుత్వ పరిపాలనుంచి భారతీయులకు బహిష్కారం :* నూతన ప్రభుత్వ వ్యవ

స్థను అనుసరించి, ఆధిపత్యము, ప్రాభవముగల పదవులన్నిటినుంచీ, భారతీయులు బహిష్కృతులైనారు. సార్వభౌమాధికారమంతా బ్రిటిష్ పార్లమెంటులో, నిహితమైఉన్నది. ఇంగ్లాండులోని నియంత్రణ పరిషత్తుద్వారా, పార్లమెంటు తన రాజకీయ అధికారాన్ని ప్రవర్తింపచేస్తుంది ; వాణిజ్యసంబంధమైన విషయాలను, కంపెనీ డైరెక్టర్ల సంస్థద్వారా నిర్వహిస్తుంది. బ్రిటిష్ పరిపాలనకు అధీనమైయున్న ఒకశాఖ, ఇండియాలో సర్వోచ్చాధికారాన్ని వహించి, బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధిగా తనకు సిద్ధించిన అధికారాలను, శాసననిర్మాణ, రాజకీయ, కార్యనిర్వహణ రంగాలలో ప్రవర్తింపచేస్తూ ఉన్నది. పార్లమెంటూ, నియంత్రణ పరిషత్తుతోను కంపెనీ డైరెక్టర్లబోర్డుతోను ఏర్పడిన స్వదేశప్రభుత్వమూ, గవర్నర్ జెనరల్ తోను అతని సహాయకమండలితోను ఏర్పడిన ఇండియా ప్రభుత్వమూ,-ఈమూడుసంస్థలూ కూడా సమగ్రంగా ఆంగ్లేయులతో ఏర్పడినట్టివి; ఇండియా ప్రజలపట్ల ఏమాత్రమూ బాధ్యతలేనివి.

ప్రభుత్వ సేవాశాఖలను ఏర్పరచడంలో, అన్ని ఉన్నతోద్యోగాల నుంచి భారతీయులను బహిష్కరించడానికి, కారన్ వాలిస్ నిశ్చయించినాడు. ఇండియా దేశచరిత్రలో, ఇది వినూత్నమైన సంఘటన. ఈ విధమైన జాతి వివక్షతను పాటించడానికిగల కారణాలు అనేకములు. "ఇండియాలో తాము స్థాపించిన రాజ్య తంత్రాల విషయంలోనేకాక, తమ దేశంలో అధిక సంఖ్యాక ప్రజల ద్వారా ఏర్పడిన రాజకీయ సంస్థల విషయంలోకూడా" దురహంకారంతో కూడిన స్వాతిశయాన్ని వహించినవారు, ఈ ఆంగ్లేయాధికారులు. "తాను, తప్పక శ్రేష్ఠుడైనవాడు; తన ప్రతిష్ఠకు సాధనములైనవన్నీ తప్పక ఉత్కృష్టములైనవి కావలెను,- అనే స్వాతిశయభావం, అసభ్యమైన హృదయ దౌర్బల్యంవల్ల ఉత్పన్నమౌతుంది. ఈ దౌర్బల్య ప్రభావానికిలోనై, తాము ఇంగ్లాండులో ఏర్పరచుకొన్న సంస్థలను, తమ వ్యవహారాలను, ప్రమాణములైనవిగా గ్రహించి, ప్రపంచములోని తక్కిన సంస్థలను, వ్యవహారాలను, వీటితో పోల్చిచూస్తూ, వాటి గుణదోషాలను నిర్ణయిస్తూ వచ్చిరి." కాబట్టి, బ్రిటిష్ భావాలకు అనుగుణంగా ఇండియాలో తాము స్థాపించిన పరిపాలన వ్యవస్థను నడపడానికి, ఆంగ్లేయులు మాత్రమే అర్హులు, అనేభావం వీరిని ఆవేశించింది.

అంతేకాక, భారతీయుల యోగ్యతాసామర్థ్యములు, సత్యనిష్ఠ, గుణశీలాలు, మొదలైనవి, అతి హీనములైనవనే అభిప్రాయాన్ని వహించినవారు, బ్రిటిష్ పరిపాలకులు. "ఇండియాలో నైతిక శీలమనేదే లేదు. సానుభూతి, విరోధభావము అనేవి, మతనిర్ణయాన్నిబట్టి ప్రవృత్తమౌతూ ఉన్నవేకాని, నైతిక నిర్ణయాన్నిబట్టికాదు," అని, మిల్, తన అభిప్రాయాన్ని వ్యక్తపరచినాడు. క్లాప్‌హామ్ మతశాఖలో సభ్యుడు, విల్బర్‌ఫోర్స్‌కు సహోద్యోగి, ఐన ఛార్లెస్‌గ్రాంట్, కలకత్తాలోని వర్తకసంఘంలో సభ్యుడుగాను, నియంత్రణ పరిషత్తుకు అధ్యక్షుడుగాను, పార్లమెంటు సభ్యుడుగాను, వ్యవహరించినవ్యక్తి; ఇండియా ప్రజలనుగురించి, ఇతడు, "శోచనీయమైన విధంగా అవనతిచెంది, హీనస్థితిలో ఉన్నజాతి ఇది. వీరిలో నిలిచియున్న నైతిక కర్తవ్యభావం అతి దుర్బలమైనట్టిది. ఐనప్పటికీ, సమంజసమైనదని తమకు తెలిసిన విషయాన్నికూడా పాటించమని మొండి పట్టుదల కలవారు. ఇతరులకు హానికరములు. స్వేచ్ఛా ప్రవృత్తములు ఐన భావోద్రేకాలకు లోనైనవారు."

"అతి విస్తారము, సర్వసాధారణము ఐన భ్రష్ట ప్రవర్తనల కారణంగా, సమాజములో

సిద్ధించిన దుష్టఫలితాలకు ప్రజల దృష్టాంతమైనవారు; తమ దుర్వ్యసనాల దుర్గతిలో మునిగి యున్నవారు." అని వర్ణించియున్నాడు. "హిందూస్తాన్ దేశీయుడైన ప్రతివ్యక్తి, నీతి భ్రష్టుడే (అని నేను నిజంగా నమ్ముతున్నాను), అని కారన్‌వాలిస్ చెప్పినాడు. 1802 లో, ప్రభుత్వం ప్రసారం చేసిన ఒక ప్రశ్నాపత్రికి జవాబువ్రాస్తూ, దెక్కౕలోని పేటర్‌సన్ ఇండియా వాసులను గురించి ఈ విధంగా అభిప్రాయాన్ని ప్రకటించినాడు,-"వారి మనస్సులు పూర్తిగా సంస్కార విహీనములైనవి ; నైతిక ధర్మాల విషయమే వారికి తెలియదు. హృదయనైచ్యాన్ని అనుసరించి ఏర్పడే కపట ప్రవృత్తి వీరిలో అత్యంతంగా వృద్ధిచెందింది. వారు సోమరులు : అశ్లీలమైన విషయానుభవంలో ఆసక్తులైనవారు ; క్రౌర్యము, వికికితనము, దురహంకారము, నైచ్యము, వీరి సహజ లక్షణాలు. మత విషయకమైన పరిజ్ఞాన మేమాత్రమూ లేనివారైనా అంధ విశ్వాసంతో మూఢులై ఉన్నవారు. అడవిజాతుల జీవితంలోని దుర్వ్యస నాలన్నీ వీరిలో ఉన్నవి; కాని ఆ జాతుల సుగుణాలలో ఒక్కటి కూడా వీరిలో లేవు, అని వీరిని సంక్షేపంగా వర్ణించవచ్చు."

ఇంగ్లాండు మత సంస్కర్తలైన,-మెథాడిస్టులు, ఎవాంజెలిస్టులు కూడా, ఇండియా ప్రజలను ఈ విధంగానే వర్ణించినారు. బహుదేవతారాధకులైన హిందువులు పూజించే దేవతలు "కామోద్రేకము, అన్యాయము, దౌష్ట్యము, క్రౌర్యము, అనేవాటికి వశులైన రాక్షసులు. వారి మత వ్యవస్థ, బాహ్యాడంబరముతో కూడిన ఒక రోత." అని విల్బర్‌ఫోర్స్ అభిప్రాయం.

కాబట్టి, బ్రిటిషు పరిపాలనను చిరస్థాయిగా సాగించడానికి, భారతీయులను పూర్తిగా నిస్సహాయ స్థితిలో నిలిపి, వారి మనస్సులలోని ఉత్కాంక్షా బీజాలను పూర్తిగా నిర్మూలిం చడం అవసరమయింది. షోర్, ఈ విధంగా వ్రాసినాడు,- "మన లాభ ప్రయోజనాలకు గాను, ఇండియా జాతి నంతటినీ, అన్ని విధాలా, సాధనంగా ఉపయోగించుకోవడమే ఆంగ్లేయుల రాజ్యపరిపాలనకు ఆధార సూత్రం. కాబట్టి గౌరవము, ప్రతిష్ఠగల అన్ని పద వుల నుంచీ వారిని బహిష్కరించడం జరిగింది. ఎట్టి హీనుడైనా సరే, ఆంగ్లేయ జాతివానికి ఈ ఉద్యోగాలను అప్పగించవచ్చు."

అప్పటి సందర్భాలను బట్టికూడా, దేశీయులను అధికార పదవులలో లేకుండా చేయడం అవసరమయింది. ఇండియాలో నిలిపిన ఇంగ్లాండు రాజ సైన్యాధికారులు, కంపెనీ సైన్యంలోని యూరోపు దేశీయాధికారులను నిరసన భావంతో చూడడం, కంపెనీ అధికారు లకు అసమాధాన హేతువయింది. ఈ పరిస్థితిని బాగుచేయడానికి కారన్‌వాలిస్ ఉద్దేశించి నాడు. కాని, కంపెనీ సేనలో ఉన్న ఇండియా అధికారులను, రాజ సేనాధికారులు గౌర వంతో చూచేవారు. అతి పురాతనమైన సైనిక దళాలన్నీ, ఇండియా సేనాధికారుల పేర్లను వహించి ఉండినవి. యూసుఫ్‌ఖాన్‌వంటి ఇండియా ఆఫీసర్లు కంపెనీ సేవలో ప్రఖ్యాతి సంపాదించుకొన్నారు. యూసుఫ్‌ఖాన్ ఆధీనంలో, రెండు నూడువేల మంది సిపాయిల దళంలో యూరోపు దేశ సైనికులుకూడా ఉండినారు. ప్రథమ దశలో జరిగిన కర్ణాటక యుద్ధాలలో యూసుఫ్‌ఖాన్ పోరాడిన వాడు. "అతడు ముట్టడులను సాగించి, కోటలను రక్షించుకొని, విషమ పరిస్థితులలో శత్రువుల ప్రాంతాల మీదుగా, సామగ్రిని, పరికరాలను, సహాయక సేనలను తరలించుకొని పోయిన నాయకుడు." తిరుచినాపల్లిని శత్రువుల దాడి

నుంచి రక్షించడము. శ్రీరంగంలో ఫ్రెంచివారు లొంగిపోవడము, యూసుఫ్‌ఖాన్ ప్రదర్శించిన చాకచక్యంవల్లనే సాధ్యమైనవని, జెవిరిక్ట్, వ్రాసియున్నాడు. "ఈ యుద్ధ వీరుని పేరు,-ఇతడు తప్పక వీరుడే,-ఆంగ్ల చరిత్రకారుని (Robert Orme) గ్రంథంలోని ప్రతి పుటలోనూ, లారెన్స్, క్లైవుల పేర్లు వచ్చిన విధంగా, పదేపదే వస్తూ ఉంటుంది," అని, మాల్కాం వ్రాసినాడు. సర్ హెన్రీలారెన్స్ ఇతనిని గూర్చి వ్రాస్తూ, "విశ్వాస పాత్రుడు, వీరధర్మి, సాహసోద్యమ ఉత్సుకుడు."ఇత్యాది ఉజ్జ్వల గుణవాచకాలను ప్రయోగించినాడు,- "మన జాతివారైన ఫోర్డ్, క్యాల్‌ఫాడ్, కూట్ మొదలైన సేనానాయకుల వీర కృత్యాలకు ఏ మాత్రమూ తీసిపోక చిరస్మరణీయులై నిలిచిన మహమ్మద్ యూసుఫ్, జమాల్ సాహేబ్, మరి ఇతరులు జరిపిన సాహస వీరకృత్యాలు చరిత్రలో శాశ్వతంగా నిలిచి పోయినవి." అని ఒక ఆంగ్ల రచయిత వ్రాస్తాడు.

అలీఖాన్, హుసేన్ అలీఖాన్, భవానీసింగ్‌వంటి సుబేదార్లు తమవృత్తిని తేజోవంతం కావించినారు. కంపెనీ సేనలోని యూరోపు అధికారులను రాజసేనాధికారుల స్థాయికి తేవలచు కొంటే, ఈ భారతీయ సేనానాయకులనుకూడా అదేస్థాయికి తేవలసిఉంటుంది. కాని, ఇండియా సిపాయిదళాలకు అధికారులైయున్న ఇండియా సేనాధికారులను నమ్మడం, ప్రభుత్వానికి సాధ్యంకాలేదు. కేవలం సైన్యశక్తిపై ఆధారపడిన ప్రభుత్వానికి భారతీయ, ఆంగ్లేయుల ఐక్యతతో ఏర్పడిన సేనాశాఖ సైన్యంలో ఉండడం, అపాయకరంగా తోచింది. కంపెనీ డైరెక్టర్లు ఈవిషయాన్ని, తమ 1808, డిశంబర్ 15వ తేదీ జాబులో విశదం కావించినారు. "150,000 సంఖ్యగల సైన్యాన్ని మనం నిలుపుకొని ఉన్నాము. ఈసైన్యాన్ని సాధనంగా చేసుకొని, సమగ్ర ఇండియాదేశమూ కంపెనీపట్ల శాంతిభావంతో ప్రవర్తించేటట్లు చూచు కొంటున్నాము, అనిమాత్రమే మేము చెప్పగలిగినవిషయం." అని వారుతెలిపినారు. కోర్టుకు వ్రాసినజాబులో, కారన్‌వాలిస్‌కూడా ఈఅభిప్రాయాన్నే ఇంకా బలవత్తరంగా ఉద్ఘాటించి నాడు. "సక్రమంగా నియమితమైన, విస్తృత పాశ్చాత్య సైన్యసహాయంతోతప్ప, అమూల్యములైన ఈరాజ్యాలపై మన ఆధిపత్యం స్థిరంగా ఉండజాలదు, అనేసత్యాన్ని, అందరూ అంగీకరింపక తప్పదు."

"న్యాయసూత్రాలు, మతవ్యవస్థ, ఆచారాలు మొదలైన సమస్త విషయాలలోను విభిన్నమైనది, ఈవిస్తృత ప్రజానీకం. అట్టిసందర్భంలో, మనము ఎంతచక్కగా వీరిని ఆదరించి అభిమానించినా, హృదయపూర్వకంగా మనకు ఎల్లకాలమూ వీరు విధేయులై ఉంటారని ఆశించలేము. ఏవ్యక్తికైనా మనవల్ల కలిగిన కష్టంకాని, మననిర్ణయంలో జరిగిన ప్రమాదం కాని, లేక, ఊహించలేని ఏఇతర సంఘటనకాని, ప్రజలు విప్లవోన్ముఖులు కావడానికి, కారణంకావచ్చు. అట్టిసందర్భాలలో, విప్లవాన్ని అణచడానికి, దేశీయులతో ఏర్పడిన సైన్యాలపై ఆధారపడడం వివేకంకాదు."

శివిల్‌శాఖలలోని ఉద్యోగాలకు వ్యక్తులను గ్రహించడంలోకూడా, ఈవిధమైన కారణాలనే ఆధారంగా చేసుకొని, దేశీయులను బహిష్కరించిరి. గ్రాంట్ ఈవిధంగా వ్రాస్తాడు. "సమాజభద్రతకు, సమాజహితానికి అవసరములైన గుణాలు, సాధారణంగా బెంగాలీలలో ఏమాత్రమూ లేకపోవడము, వాస్తవం. ఇది నిజంగా వింత. యాథార్థ్యము, సత్యపరత, ప్రామాణికత, అనేవి, వీరికి బొత్తిగాలేవు. సత్యసంధత లేకపోవడం వీరికి స్వాభావికమై

పోయింది; కాబట్టి, సత్యమైనవిషయాన్ని సమర్థించవలసి వచ్చినప్పుడుకూడా, అసత్య విషయాన్ని దానికి ఆలంబనంగా చేసుకోడానికి తప్పక పూనుకొంటారు. బద్ధశత్రుత్వాన్ని వహించి, ఒకొకప్పుడు తండ్రికొడుకులమధ్యకూడా, ఒకరినొకరు వెంటాడడంలో, వీరు వహించే మాత్సర్యము, చేసేమోసాలు, మోపే మిథ్యాపవాదాలు, ఇత్యాదులు, మానవస్వభావంపై విరక్తిపుట్టిస్తాయి."

భారతదేశీయుల గుణశీలాలలోగల లోపాలవల్ల వారిని ఉన్నత ఉద్యోగాలకు నియమించకూడదనేవాదం అత్యంతమూ కుటిలమైనట్టిది. ఇండియాకువచ్చిన ఆంగ్లేయులుమాత్రం, సౌశీల్యానికి ఆదర్శవ్యక్తులా: "సూయెజ్‌కాలువకు ఇవతల, దశవిధ దైవాజ్ఞలు (Ten Commandments) అనేవేలేవు." అని, కిప్లింగ్, వ్రాసినదానికి ఈఆంగ్లేయుల ప్రవృత్తి సమగ్ర నిదర్శనమై, దానిని పూర్తిగా సమర్థిస్తుంది. చరిత్రకారులైన, థాంసన్, గ్యారట్ అనే ఆంగ్లేయులే ఈవిధంగా వ్రాసినారు. "పంథొమ్మిదో శతాబ్దపు ప్రథమదశలో, ఇండియాలో నివసించిన పాశ్చాత్యుల జీవితాన్ని చిత్రించడానికి, విస్తారమైయున్న సమకాలీన సారస్వతం సహకరిస్తుంది. ఇండియా ద్వీపకల్పాన్ని పూర్వం ఆక్రమించిన ఉత్తరఖండాలవారిని లోబరచుకొన్న దుర్వ్యసనాలకు, సోమరితనానికి, వీరుకూడా సులభంగా లొంగిపోయినారు. ప్రతిజ్ఞాపత్రాలతో ఇండియాకు వచ్చిన ఉద్యోగులు పదహారు, లేక, పదిహేడేండ్ల బాలురు. వెల్లస్లీకాలంవరకూ, వీరికి ఇంగ్లాండులోకాని, ఇండియాలోకాని, తగిన శిక్షణను ఇచ్చే ఏర్పాట్లు జరుగలేదు; తరువాతికాలంలో వచ్చినవారికంటె, వీరే ఇండియాదేశాన్ని బాగుగా అర్థంచేసుకొన్నారనే వాదంకూడా, ఒకటి ఏర్పడింది. ఇండియా దేశప్రజలను, జీవిత విధానాలను గ్రహించడానికి వారికి ఒకమార్గం, లభించింది. ఇండియాదేశంలో, ఉంపుడుకత్తెలను పెట్టుకోవడం ఆంగ్లేయులకు ఆచారమై ఉండింది. కాని, దీనివల్ల ఇండియాదేశంపట్ల, వారికి గొప్పగౌరవం ఏర్పడిందో, లేక, ఇండియాదేశ ఆచారాలలో వారికి ఎక్కువ ఆసక్తి కలిగిందో, సందేహమే." ఈవ్యభిచారి స్త్రీలుచేసిన సేవకు, వీరికి లభించింది నెలకు నలభై రూపాయలు మాత్రమే, అని విలియంసన్ వ్రాసియుంచినాడు. ఆకాలపు పాశ్చాత్య సమాజంలోని అద్భుతమైన సోమరితనాన్నిగురించీ, నిస్త్రాణమైన విషయ లాంపట్యాన్ని గురించీ, ట్రెవిల్యన్, వ్రాసినాడు. యథాతథంగా వ్రాయడానికి అర్హమైనది అతని వ్రాత. "మితిమీరిన కర్బుల ఫలితాలవల్ల పూర్తిగా మునిగిపోయి, హిందూ స్త్రీల నిర్బంధ ప్రతిబంధాలకు, చామనచాయ పిల్లలగుంపుల నిర్బంధాలకు లోనై, ఇండియా సముద్రతీరాలను వదలిపోవడానికి సంకల్పముకాని, శక్తికాని, లేనివారై యున్నారు, ఈఇంగ్లీషు పెద్దమనుష్యులు...పంద్రెండుమంది సేవకులు ముందూ, పంద్రెండుమంది వెనకా, వీరిపదవులను, బిరుదులను చాటిచెప్పుతూ, పరుగెత్తుతూ అనుసరిస్తూఉండే, గొప్పవారు, ప్రభుత్వపు కోచిబండ్లంలో తిరుగుతూ ఉంటారు. అల్పోద్యోగులు పల్లకీలలో చేరగిలబడికాని, లేక గుర్రపుబగ్గీలను తామే స్వయంగా నడుపుకొంటూకాని, ఇటూఅటూ సంచారం సాగిస్తారు. ఈబగ్గీలకు వారు, బాడుగ ఇవ్వరు; ఇక వీటికి కట్టినగుర్రాలో: సంపన్నులైన బెంగాలీ బాబులను బెదిరించో, బుజ్జగించో, తెచ్చుకొన్నవి. ఈవిధమైన జీవితానికి సహజమైన పరిణామంగా, ఒకప్పుడు, ముప్పై ఐదేండ్లకాలం ఇండియాలో నివసించిన ఆంగ్లేయులు, సుమారు నూరుమంది, అప్పులవాండ్లకు బాధ్యులై, ఇండియాలో నిలిచిపోయినారు. వీరివల్ల యువకుల జీవిత

సూత్రాలు విషపూరితములై భ్రష్టమైపోవడమేకాక, బాధ్యతతోకూడిన ఉన్నత స్థానాలకు ఉత్తములైనవారు రావడానికికూడా, వీరు ప్రతిబంధకాలుగా ఏర్పడిరి."

భారత దేశీయులను ఉన్నతోద్యోగాలకు, కారన్ వాలిస్ నియమించక పోవడానికి, అతనికి వారి పట్లగల అవిశ్వాసం కారణంకాదు; పాశ్చాత్యాధికారులను, ఇంతకంటె ఎక్కువగా నమ్మకపోవడమే, దీనికి ప్రబల కారణమని, కేయే, అభిప్రాయము.

బ్రిటిష్ అధికారులలో, నీతి భ్రష్టత సర్వసాధారణంగా వ్యాపించియుండినదనడానికి, అనేక నిదర్శనాలు ఉన్నవి. బెనారసులోని స్థానికాధికారి స్థిరవేతనం, నెలకు 1000 రూపాయలు మాత్రమే. కాని, ఏకస్వామ్య వర్తకంనుంచి, ఇతర అక్రమ మార్గాలనుంచి అతనికి వచ్చే ఆదాయం, సాలుకు నాలుగు లక్షల రూపాయలు. కలెక్టర్లకు ఇస్తూఉన్న జీతం నెలకు 1200 రూపాయలు. కాని, అతనికి ముట్టుతూ ఉన్న పై సంపాదన సామాన్యంగా లక్ష రూపాయలు.

కాబట్టి, భారత దేశీయులను ఉన్నతోద్యోగాలనుంచి బహిష్కరించడానికి కారణం వేరు. అధిక లాభదాయకమైన ఉద్యోగాలను ఆంగ్లేయులకు అంటగట్టి, వారి దురాశను తృప్తిపరచడమే దీని కంతటికీ ఆధారమైన మూలకారణం. అంతేకాక, అపజయానికి పాలైన భారత దేశీయులను, వారికి తగిన అధమ స్థానంలో ఉంచడము, పూర్వపు పరిపాలక వర్గాల వారిని అవమానపరచడము, ఆశ్రిత జీవితానికీ, దరిద్ర జీవనానికీ, వారికి అలవరచడము, స్వాతంత్ర్య భావాల అవశేషాలను, ఆత్మగౌరవ అవశేషాలను వారి మనస్సులనుంచి తుడిచివేయడము, కూడా, దీనికి ప్రబల హేతువులైనవి. ఆంగ్లోద్యోగులకు ఆరోగ్యకరమైన సులభ జీవితం ఏర్పరచడానికి, సమస్త ప్రయత్నాలూ జరిగినవి. ప్రలోభాలకు వారు లోగకుండా ఉండడానికీ, ప్రభుత్వ ఆజ్ఞలకు విధేయులై ఉండడానికీ, వర్తకములో ప్రవేశించకుండా ఉండడానికీ, బహుమతులను, లంచాలను, గ్రహించకుండా ఉండడానికీ, తగిన అధిక వేతనాలను వారికి నిశ్చయించినారు. న్యాయ పరిపాలన వ్యవస్థను భూమి శిస్తుల వ్యవస్థనుంచి వేరుచేసి, వారివారి కర్తవ్యాలను నిష్కర్షగా, స్పష్టం కావించిరి. న్యాయపరిపాలక వర్గానికి, పోలీసుశాఖను అధీనంకావించి,అత్యాచారాలు, జరుగకుండా చూచినారు. అనగా, ఐశ్వర్యాన్ని, అధిపత్యాన్ని బాధ్యతను ఆంగ్లేయోద్యోగులకు కలిగించిరి. ఆత్మప్రతిష్ఠను, ఉత్తమధ్యేయాన్ని, ప్రశంసా సంపాదనసంకల్పాన్ని నేర్పడానికి ఈసౌకర్యాలు ఉత్తమ అధ్యాపకులుగా ఏర్పడినవి.

న్యాయశాఖ : న్యాయ శాఖలో మున్సిఫ్, సదర్ అమీన్ పదవులను దాటిపోవడానికి భారత దేశీయులకు అవకాశం ఇవ్వలేదు. పోలీస్ శాఖలో దరోఘాస్థానము, పరిపాలన శాఖలో డిప్యూటీ కలెక్టరు స్థానము,- ఇవి మాత్రమే భారత దేశీయులు ఆశించగల ఉన్నతోద్యోగాలు. ప్రతిజ్ఞాపత్ర ఉద్యోగాలని ఆనాడు వ్యవహరింపబడిన స్థానాలు, భారతీయులు ప్రవేశించరాని సంవృత రంగం లోనివి.

భారతీయులు బాధ్యతను ప్రదర్శించడానికి అవకాశం లేని విధంగా ఈ అన్ని శాఖల విధానాలూ కూర్చబడినవి. వీటిని నిర్వహించే వారందరూ పాశ్చాత్యులే. దీనివల్ల భారతీయుల మానవ ఔన్నత్యమే, క్రుంగిపోయింది. ప్రాచీన సాంఘిక-రాజకీయ వ్యవస్థ, దీనితో భగ్నమైపోవడం, అంతకంటె అధమమైన పరిణామం. పౌరవ్యవహారాలకు, దండనీతి వ్యవహారాలకు సంబంధించిన న్యాయనిర్ణయ విధానాన్ని, చిరకాలంగా నిర్వహిస్తూఉండిన వ్యక్తులనుంచి

తొలగించింది, కారన్‌వాలిస్ ప్రవేశపెట్టిన నూతనప్రణాళిక. గ్రామపంచాయితీలు, జమీందార్లు ఫౌజ్‌దార్లు, సుబేదార్లు, కాజీలు, పండితులు, మొదలైనవారు నిర్వహిస్తూఉండిన, ఈకర్తవ్యాలను, కారన్‌వాలిస్, వారినుంచి తప్పించి, గ్రామసీమలలో ఏమాత్రము స్థానమూలేనట్టి నూతన అధికారశ్రేణికి అప్పగించినాడు.

ఇండియాలో బ్రిటిషువారు ప్రవేశపెట్టిన న్యాయపరిపాలన విధానంలో, జాతి విచక్షను ప్రవేశింపచేసియుండడం, ముఖ్యంగా గమనించతగిన విషయం. ఈవిధానం, ఇండియా దేశవాసులను రెండువర్గాలుగా విభజించింది: (1) ఆంగ్ల-పాశ్చాత్య దేశాలప్రజలు, వారి న్యాయబద్ధమైన సంతానము, ఒకవర్గం. (2) హిందువులు, ముస్లిములు, ఏషియా జాతులు, ఆర్మీనియన్‌జాతులు, క్రైస్తవులు, ఇతరులు రెండోవర్గం. ఈ రెండు వర్గాలవారికీ సంబంధించిన శివిల్, క్రిమినల్ వ్యవహారాలను విచారించి నిర్ణయించడానికి, రెండువిధములైన న్యాయస్థానాలను నెలకొల్పిరి. బ్రిటిష్‌రాజత్వం, న్యాయవిషయంలో విధివిహితంగా ప్రసాదించిన నియత శాసనాలద్వారా, ప్రపత్రాలద్వారా, వారిచే స్థాపించబడిన న్యాయస్థానాలు మొదటి వర్గంవారికి వర్తిస్తాయి. ఈ న్యాయస్థానాల అధ్యక్ష న్యాయాధిపతులనుకూడా, ఈ రాజశాసనాధికారమే నియమిస్తుంది. వీటిని, రాజు న్యాయస్థానాలు, లేక రాణీన్యాయస్థానాలు అని వ్యవహరించేవారు. వీటికితోడుగా, శాంతిస్థాపక న్యాయమూర్తి, దండనాధికారులు, దుర్మరణ విచారాధికారులు కూడా ఉండినారు.

ఈస్ట్‌ఇండియాకంపెనీ అధిపత్యంలో స్థాపితములై, కంపెనీ నియమించిన న్యాయాధిపతులు పరిపాలించే న్యాయస్థానాలు, రెండవవర్గం ప్రజలకు ఉద్దిష్టములైనవి. ఈ న్యాయస్థానాలలోని న్యాయాధిపతులు రెండు వర్గములుగా ఏర్పడియుండిరి. ప్రతిజ్ఞాపత్రంద్వారా ఇంగ్లాడునుంచి వచ్చినవారు ఒకవర్గం; ఇతరులు రెండవవర్గం.

మొదటిరకపు న్యాయస్థానాలలో, కలకత్తా, మదరాస్, బొంబాయి నగరాలలోని అత్యుచ్చ న్యాయస్థానాలు ప్రధానములైనవి. వాటినిగురించి వివరించడం, ఇప్పుడు, అనవసరం. వినిమయక శాసనాన్ని అనుసరించి కలకత్తాలో అత్యుచ్చన్యాయస్థానాన్ని స్థాపించిన సందర్భంలో, మొదట, అస్తవ్యస్తత ఏర్పడింది. 1781, 1786, 1793, సంవత్సరాలలో ఈ న్యాయస్థానంయొక్క అధికారాలను పరిమితంచేసి, నిష్కర్క కావించిన శాసనాలద్వారా, ఈ అస్తవ్యస్తత తొలగింది. ఇంగ్లాండులోని సామాన్య న్యాయాలను నియతశాసనాలనూ, ఇండియా గవర్నర్ జెనరల్ అతని మండలితోసహా విధించి, అత్యుచ్చ న్యాయస్థానంలో రిజిష్టర్‌చేసిన వినియమాలనూ, హిందూముస్లిములు ప్రతివాదులైన సందర్భాలలో హిందూ ముస్లిం న్యాయసూత్రాలనూ. ఈ అత్యుచ్చ న్యాయస్థానాలు పాటించి, న్యాయనిర్ణయాన్ని కావించేవి.

1793, 1802, 1827, సంవత్సరాలలో పారితమైన వినియమాలద్వారా, కంపెనీ న్యాయస్థానాలు, మూడు రాజధానీలలోనూ స్థాపితమైనవి. సంతృప్తికరమైన వ్యవస్థను ఏర్పరచడానికి, 1772 నుంచీ, అనేక ప్రయోగాలు జరిగినవి. కాని వీటికి, 1795 దాకా, స్థిరత్వం ఏర్పడలేదు. ఆ తర్వాత, న్యాయాలయాలకు సంబంధించిన విశాల సూత్రాలు స్పష్టంగా నిరూపించబడినవి. తర్వాత జరిగిన అన్ని పరివర్తనలకూ, కారన్‌వాలిస్ రచించిన వినియమసంహిత ఆధారంగా ఏర్పడింది.

(1) పోలీసు వ్యవహారాలను, న్యాయనిర్ణయ విషయాలను ఇంతవరకు నిర్వహిస్తూ

ఉండిన జమీందారులను, ఇతర సాంప్రదాయిక కార్యకర్తలను, ఈ అధికారాలనుంచి తొలగించడము.

2) ప్రత్యేకంగా ఆంగ్లేయాధికారులతో ఏర్పడిన ప్రతిజ్ఞాపత్ర సేవాశాఖలో, నిర్దేశాధికారాన్ని, ఆధిపత్యాన్ని, ఉన్నతోద్యోగాల కేంద్రీకరణాన్ని నిహితం కావించడము.

3) భూమిశిస్తుల వసూలును, న్యాయపరిపాలన శాఖనుంచి వేరుపరచి రాజస్వన్యాయస్థానాలను రద్దుచేయడమూ,- అనే మూడూ, ఈ సంహితకు ఆధారాలైన ఉద్దేశాలు.

ఈవిధానంలోని న్యాయస్థానాలు, తరతమశ్రేణిలో ఏర్పడినవి. అన్నిటికంటె క్రింది దశలోని న్యాయస్థానాలు దేశీయులైన కమీషనర్ల పరిపాలనలోనివి. యాభై రూపాయలకు మించని వాదమూలంగల (Cause of action) వ్యవహారాల ప్రథమవిచారణ గావించి వీరు తీర్పులిచ్చేవారు. అమీనులు, స్యాలిసాస్లు, మున్సిఫ్లు,- అని యీ న్యాయస్థానాలు మూడు విధములైనవి. వీరి తీర్పులవిషయంలో, జిల్లా న్యాయస్థానాలకు అపీలుచేసే అవకాశంకలదు. దేశీయ న్యాయస్థానాలకు పైదశలోఉన్నవి, రెజిస్ట్రార్ల న్యాయస్థానాలు. జిల్లాన్యాయస్థానాలకు, నగర న్యాయస్థానాలకు అనుబంధములైన ఈ న్యాయాల రెజిస్ట్రార్లు, ప్రతిజ్ఞాపత్రంతో ఉద్యోగాలకు వచ్చిన విశిష్టాధికారులు. 200 రూపాయల వాదమూలంకల వ్యవహారాలను విచారించే అధికారంకలవారువీరు. వీటికి పైదశలోనివి, జిల్లా, నగరన్యాయాలయాలు. విశిష్టాధికారాలు గల న్యాయాధిపతులు ఈన్యాయాలయాల అధ్యక్షులు. హిందూముస్లిము విద్వాంసులు, ఒక రెజిస్ట్రారు, ఈన్యాయాధిపతికి వ్యవహారకార్యాలలో సహకరించేవారు. సమస్తమైన శివిల్ వ్యవహారాల విచారణాధికారమూ, ఈన్యాయాలయాలు వహించినవి. వీరితీర్పులపై ప్రాంతీయ న్యాయస్థానాలకు అపీలుచేయవచ్చు. బెంగాలులో ఇరవైఆరు జిల్లా న్యాయాలయాలు ఉండినవి.

ప్రాంతీయ అప్పీలు న్యాయస్థానాలు, కలకత్తా, డెక్కా, ముర్షిదాబాద్, పాట్నా అనే నాలుగు కేంద్రాలలో స్థాపింపబడినవి. ఈ ప్రతిన్యాయస్థానంలోను, ముగ్గురు ఆంగ్ల న్యాయాధిపతులు, ఒకరెజిస్ట్రారు, ఒకకాజీ, ఒకముఫ్తి, ఒకపండితుడు, ఉండేవారు. వేయిరూపాయలకు మించని వ్యవహారాలలో, ఈ న్యాయస్థానాల తీర్పు అంతిమమైనవి. వేయి రూపాయలుదాటిన వ్యవహారాలపై వీరిచ్చిన తీర్పులపై, సదర్ దివానీ అదలత్‌కు అప్పీలుచేసుకొనే అవకాశం ఉన్నది. నియమనాల ఆధారంగా ఏర్పడిన న్యాయస్థాన విధానానికి, శిఖరప్రాయమైనది సదర్ దివానీ అదలత్. గవర్నర్ జెనరల్ (అధ్యక్షుడు), అతని సలహామండలి సభ్యులు, ఈన్యాయస్థానానికి అప్పీలులో వచ్చిన వ్యవహారాలను పరిశీలించి, అంతిమనిర్ణయం కావించేవారు. ప్రాంతీయ స్థానాలనుంచి, ప్రాంతీయ మండలినుంచి, రాజస్వపరిషత్తునుంచి, లేక, సమితులనుంచి, అప్పీలులోవచ్చిన వ్యవహారాలనుకూడా, ఈన్యాయస్థానమే నిర్ణయించేది.

దండనీతికి సంబంధించిన న్యాయపరిపాలనను, కంపెనీ 1790 తర్వాత వహించింది. పోలీసు సిబ్బందికీ, దండనీతి న్యాయపాలనకూ చెందిన అధికారాన్ని, అంతవరకూ వహించియుండినవాడు, బెంగాలు డిప్యూటీగవర్నర్. 1790 లో, ఈ అధికారాలను అతనినుంచి తప్పించి, వాటినిర్వహణకై, తరతమాధికారాలుగల మూడు దండనీతి న్యాయాలయాలను, కంపెనీ స్థాపించింది.

జిల్లా, నగర న్యాయాలయాల న్యాయాధిపతులను, దండనాధికారులు (Magistrate) అని వ్యవహరించేవారు. హంతకులు, దారిదోపిడిగాండ్లు, దొంగలు, కన్నపుదొంగలు, దౌర్జ

న్యాలు, అత్యాచారాలుచేసిన ఇతరులు,- మొదలైనవారిని బంధించే అధికారం, ఈ దండనాధికారులకు, వారి అధీనాధికారులకు, అప్పగించబడింది. చిన్న అపరాధాలవిషయంలో, అంతిమ నిర్ణయంకావించి, శిక్ష విధించడంకూడా వీరే జరిపేవారు.

ప్రాంతీయములైన నాలుగు అప్పీలు న్యాయస్థానాలూ పరిపథన్యాయాలయాలుగా కూడా వర్తించేవి. అన్నిజిల్లాలలోను (చాలవరకు) ఆరుమాసాలకొకసారి, జైలుశిక్షకు సంబంధించిన అపరాధ విచారణలు జరిపేవి. మరణదండనను, యావజ్జీవ కారాగారశిక్షను కూడా విధించే అధికారం వీటికికలదు. కాని, ఈశిక్షలను సదర్ నిజామత్ అదలత్, స్థిర పరచడం అవసరం.

అత్యుచ్చదండన న్యాయస్థానం, గవర్నర్ జెనరల్‌తోను, అతని మండలి సభ్యులతోను, ఏర్పడినట్టిది; ప్రధాన కాజీ, ముఫ్తీలు, వీరికి సహాయకులు. ఈన్యాయస్థానముయొక్క అధికారపరిధి, దండనీతికి, పోలీసుకు సంబంధించిన సమస్త వ్యవహారాలకూ వ్యాపించినట్టిది. ఈకోర్టు తీర్పులపై అప్పీలుకు అవకాశంలేదు. కాని, క్షమాపణచేసే అధికారము, శిక్షను తగ్గించే అధికారము, గవర్నర్ జెనరలుకుకలదు.

ప్రభుత్వం నియమించిన అధికారులతో, పోలీసుశాఖ ఏర్పడింది. ఇంతవరకూ జమీందారులు, ఇతరులు, నిర్వహిస్తూఉండిన అపరాధనిరోధక బాధ్యతలన్నీ ఈశాఖవహించి, వారికి విముక్తి కలిగించింది. సుమారు ఇరవై చదరపుమైళ్ళ విస్తీర్ణంపై అధికారపరిధిగల ఠాణాలుగా, జిల్లాలు విభజింపబడినవి. దరోఘా, అతని సహోద్యోగులూ, ఈఠాణాల పర్యవేక్షణాధికారాన్ని వహించిరి. ఈసిబ్బంది వేతనాలను ప్రభుత్వము భరించేది. నగరాలను కొత్వాలుల పర్యవేక్షణలో ఉంచిరి. ఠాణాలదరోఘాలు జిల్లా మ్యాజిస్ట్రేటుల అధీనంలో వర్తించేవారు.

శివిల్ క్రిమినల్ న్యాయాలయాలను స్థాపించడము, సంకీర్ణములైన ప్రక్రియానియమాలను ప్రవేశపెట్టడము, శ్రేణీబద్ధమై ఏర్పడిన న్యాయస్థానాలకు అప్పీలు చేసుకొనే అవకాశాలు సిద్ధించడము,- మొదలైన ఏర్పాట్లు జరగడంతో తప్పనిసరిగా, న్యాయవాదవర్గం సృష్టికి వచ్చింది.

ఆంగ్లేయులు స్థాపించిన న్యాయపరిపాలన విధానము, స్వభావవిషయంలోను, నిర్మాణ విషయంలోనుకూడా, పూర్వపు న్యాయపాలనవ్యవస్థకు పూర్తిగా విభిన్నమైనట్టిది. ప్రాచీన విధానం, ధనవ్యయంతో కూడినటువంటిదికాదు; విధివిహితప్రకారంగా జరిగేదికూడా కాదు. పవిత్ర వ్యక్తులుగా పరిగణింపబడిన మధ్యవర్తుల నిర్ణయంద్వారా, శీఘ్రకాలంలో వ్యవహారాలు తీరిపోతూ ఉండేవి. ఆవిధానముయొక్క స్థానంలో ఏర్పడిన ప్రస్తుత న్యాయాలయాలలోని తీర్పులపట్ల, పూర్వపు భక్తిభావం లేదు. కేవలం లౌకికమైన ఈ న్యాయనిర్ణయ విధానం, న్యాయవాదులకు తర్కానికి ప్రాధాన్యం కలిగించింది. కాబట్టి, మిథ్యావివాదాలకు, అప్రమాణాలకు, వంచనకు, న్యాయాలయాలు ఆకరములైపోవడం ఆశ్చర్యమైనదికాదు. అభియోగ వ్యసనం (Litigousnees) ప్రజలలో విస్తారంగా వ్యాపించింది.

ఐనప్పటికీ న్యాయాలయాలమూలంగా హక్కులకు సంబంధించిన భావచైతన్యం ప్రజలలో ఉత్పన్నమయింది. కేవలం స్వధర్మ పరిపాలనపై ఆధారపడియుండే పద్ధతి అంతమయింది. కేవలం వ్యక్తిగత వివేచనపై ఆధారపడిన న్యాయనిర్ణయపద్ధతి, భిన్న జాతి, మత, వర్గాలవారి విషయంలో విభిన్న ప్రమాణాలను అనుసరించిన పద్ధతి, సామాన్యులు, మన్ప

లులు ఐనవారికి న్యాయం లభించనిపద్ధతి,- మొదలైనవన్నీ అంతరించినవి. పరిపాలక వర్గానికి చెందిన వ్యక్తులవిషయంలో తప్ప (అనగా ఆంగ్లేయులు) తక్కిన ప్రజలందరి విషయంలోను, నిష్పక్షపాతమైన న్యాయము, న్యాయశాస్త్ర నియమాల పరిపాలన, ఇండియాదేశంలో నెలకొన్నవి. వ్యక్తుల నైతిక వ్యవస్థ విషయంలోను పౌరసంబంధాల విషయంలోను, ఈ మార్పు అత్యంతమూ ప్రధానమైనట్టిది.

కారన్‌వాలిస్ స్థాపించిన పరిపాలన విధానముయొక్క ఆధార సూత్రాలు, దాని కార్యక్రమపద్ధతులు వినూత్నమైనవి ; భారతదేశీయులకు అపరిచితములైనట్టివి. కాబట్టి, ప్రజలు వాటికి అలవాటు పడడానికి కొన్ని ఏండ్లు పట్టింది. ఈ విధానంపట్ల ప్రథమంలో ప్రజలు తమ అయిష్టాన్ని ప్రతిక్రియా రూపంలో ప్రదర్శించిరి. శివిల్ మిలిటరీ శాఖలలోని ప్రాభవాధికార స్థానాలనుంచి తొలగించబడినవర్గాల వ్యక్తులు, అసమాధానంతో, ద్వేషభావాన్ని వహించిరి. భూములు ఒక వ్యక్తి నుంచి మరొక వ్యక్తికి, శీఘ్రంగా మారిపోతూ వచ్చినవి. రైతుల కష్టాలు, పరపీడన ఎక్కువైనాయి ; భూస్వాములు వ్యవసాయదారులుకూడా కలవరపడిపోయిరి. నూతన న్యాయపరిపాలన విధానం ప్రవేశపెట్టిన కొత్త న్యాయసంహిత, న్యాయవ్యవహార పద్ధతి, ప్రజలకు అర్థం కాలేదు. అభియోగాసక్తి ప్రజలలో ఎక్కువయింది. వీటి ఫలితంగా, ప్రాచీన సాంఘిక అనుబంధాలు, ఆచారాలు, సడలిపోసాగినవి. దౌర్జన్యము, దుర్వ్యసనాలు, హింసా చర్యలు, అమితంగా పెరిగిపోయినవి.

బ్రిటిష్ అధికారుల ప్రవర్తనవల్ల, పరిస్థితులు మరింత చెడిపోయినవి. "శివిల్ మిలిటరీ సంస్థల ఆంగ్లేయోద్యోగులలో, అధిక సంఖ్యాకులు, ఉన్నత మధ్యమవర్గాల దేశీయులను దూరంగా ఉంచి, దురహంకారంతో వారిపట్ల ప్రవర్తించడం, దేశీయుల ద్వేషాగ్నికి ఇంధనంగా పరిణమించింది.

సైన్య వ్యవస్థ : కారన్‌వాలిస్ స్థాపించడానికి పూనుకొన్న పరిపాలన విధానంలో, సాయుధబలాల పునర్వ్యవస్థీకరణం కూడా, ఒక భాగం. పరదేశంలో స్థాపించుకొన్న రాజ్యాల భద్రతా రక్షణలు సైన్యబలంపై ఆధారపడడం, పరిస్థితులకు సహజమైనదే. పద్దెనిమిదో శతాబ్దపు కడపటి రోజులలో ఇండియాదేశంలోని అధిక భూభాగం, ఇంకా, స్వతంత్ర స్థితిలోనే నిలిచియుండింది ; అది ఇంకా బ్రిటిషు పరిపాలనకు ప్రథమ దశ. ఇండియాదేశీయ రాజులతో ఫ్రెంచివారికి ఏర్పడియుండిన సంపర్కం, బ్రిటిషువారికి తీవ్రాపాయకరమైనట్టిది. కాబట్టి, అట్టి పరిస్థితులలో "రాజ్యనిర్మాణానికి, ఆధిపత్య స్థాపనకు, సైన్యమే ఆధారము, సాధనము" కావడం, విస్పష్టమైన విషయమే. "బ్రిటిష్ పరిపాలన, ప్రజల అభిమానంపై ఆధారపడి నిలువగలదనే భ్రాంతి, బ్రిటిషు అధికారులకు ఎన్నడూ లేదు. బ్రిటిష్ అధికారం అజేయమైనది, అనే భావాన్ని ప్రజలలో కలిగించడంవల్లనే, తమ రాజ్యానికి స్థైర్యం ఏర్పడగలదు." "మన ప్రభుత్వానికీ, బలవత్తరమైన మన సైన్యానికీగల ఐక్యమే, మన రాజ్యవిస్తరణకు, ఉత్కృష్టమైన సాధనం" అని, మన్రో, బ్రిటిషువారి ఉద్దేశాన్ని వ్యక్తం చేసినాడు.

కాబట్టి, ప్రభుత్వ భాగమైన సైన్యశాఖను సమర్థతతో నిర్వహించడానికి, కారన్‌వాలిస్ పూనుకోవడం, స్వాభావికమైనదే. కంపెనీయొక్క సంస్థాపనలో, మిక్కిలి అభిమాన పాత్ర

మైనది సైన్యం. గవర్నర్ జెనరల్ పదవిని, సైన్యాధ్యక్షపదవిని జతపరచి, కారన్‌వాలిస్‌కు అప్పగించి యుండడమే దీనికి ప్రబల సాక్ష్యం. ఐనా, సైన్య వ్యవస్థలో తొందరలు, చిక్కులు, విస్తారంగా ఏర్పడియుండినవి. దీనికి హేతువులు అనేకములు. ఇండియా ప్రభుత్వాధీనంలో ఉంచిన సైన్యం ప్రత్యేక విధానాలపై ఏర్పడిన రెండు వర్గాలుగా ఉండడం మొదటి చిక్కు. ఇంగ్లాండు ప్రభుత్వ సైన్యంలో ఒక భాగాన్ని, కంపెనీ సేవకై ఇండియాలో నిలిపినారు. పాశ్చాత్య సైనికులతో ఏర్పడిన ఈ సేనాభాగం,- లేక, రాజసేన, మొదటివర్గంగా ఏర్పడినది. కొంతమంది పాశ్చాత్య సైనికులతోను, ప్రధానంగా దేశీయ సిపాయిలతోను ఏర్పడిన, కంపెనీ సేన, రెండవ వర్గం. మొదటివర్గమైన రాజసేన, బ్రిటిషు సంస్థాపనకు చెందినదేఐనా, దాని కర్చు లన్నిటినీ, ఇండియాలోని కంపెనీ రాజస్వాదాయం భరించేది. తన సైన్యపు కర్చులను, కంపెనీ, భరించడం ఎట్లాగూ తప్పనిది. ఈ ఏర్పాటు ప్రకారం, ఇండియాకు బ్రిటిషు ప్రభుత్వం పంపించిన సైన్యం అంతటితోనూ కంపెనీకి అవసరం లేకపోయినా, ఆ సైన్యానికి సంబంధించిన విత్త బాధ్యతలన్నిటినీ కంపెనీపై మోపడానికి పూనుకొన్నది, బ్రిటిషు ప్రభుత్వం. ఇది మాత్రమేకాక, సైన్యంలోని కలతకు మరొక ప్రబల కారణం కూడా ఉంది. రాజసైన్యంలోని అధికారులకు, కంపెనీ సైన్యంలోని అధికారులకుగల స్థాన ప్రతిష్ఠలకు సంబంధించిన సమస్య, ఈ కలతకు మూలకారణం. స్థానప్రతిష్ఠల విషయంలో రాజసేనాధికారులు ప్రవర్తిస్తున్న శ్రేష్ఠతా, వారికి లభించే అధిక వేతనాలు, కంపెనీ సేనాధికారుల హృదయాలకు వేధకములైనవి. తత్ఫలితంగా విషమ పరిస్థితులు ఏర్పడినవి.

కంపెనీ సైన్యంలోకూడా అసంతృప్తి ప్రబలమై ఉండేది. "లండన్ నగరంలోని దళారీలు పోగుచేసిన పోకిరీమూకతోను, ఇంగ్లాండు జైళ్ళలోనుంచి జమచేసుకొని వచ్చిన దుష్టులతోను, లండన్ నగరవీధులలోని చెత్తా చెదారంతోను, ఏర్పడింది కంపెనీవారి సైన్యం. ఇందులోని సేనాధికారులందరు సాధారణంగా, తమజీవితాలను నాశంకావించుకొని, తమ దేశాన్నివదలి పారిపోయి వచ్చిన యువకులు, లేదా, ఇండ్లనుంచి బైటికితోయగా, తమ బ్రతుకుతెరువుకై ఇండియాకు వచ్చిన దిక్కులేనివారు. కాబట్టి డబ్బుచేసుకొనే ప్రయత్నంలో వీరుదేనికీ వెనుదీసేవారుకారు."

ఇక రెండవపక్షంలో, ఇండియాదేశీయసైన్యం "ఉత్తమరీతిలో, మంచి అచ్చుకట్టుగా ఉండింది." కాని, వేతనాల విషయంలో పాశ్చాత్య సైనికులకు, ఇండియా సిపాయీలకు ఎక్కువ అంతరం ఉండింది.

కంపెనీ సైనికులకు కలిగిన అసంతృప్తికి ముఖ్యకారణం, భత్తాలకు సంబంధించినట్టిది. ఈవిషయమై క్లైవు, హేస్టింగ్సులు కూడా తీవ్రమైన కష్టాలను ఎదుర్కొవలసి వచ్చింది. అవిధేయప్రవృత్తి విస్తారమై యుండడం, కారన్‌వాలిస్, ఇండియా రావడంలోనే గమనించినాడు.

తర్వాత కంపెనీవర్తకులు, గుమాస్తాలు వహించిన శివిల్ ఆధిపత్యానికీ, సైనికాధిపత్యానికీమధ్య ఘర్షణ సాగుతూవచ్చింది. సైనికవృత్తి ఉన్నతమైనదని, వాస్తవంగా కంపెనీ రాజ్యాలను సంపాదించినవారు తామే అని స్వాతిశయంతో సైనికులు ప్రవర్తించినారు. సైన్య సంఖ్య పెరగడంతో, దాని ప్రాధాన్యం ప్రబలమయింది. క్లైవు ప్లాసీయుద్ధాన్ని నిర్వహించిన సమయంలో; 2100 మంది ఇండియా సిపాయీలు, 900 మంది పాశ్చాత్య సైనికులు, 200

మంది సంకరజాతి పోర్చుగీసువారు మాత్రమే, ఇతని సైన్యంగా ఏర్పడినది. 1794 నాటికి కంపెనీసైన్యసంఖ్య 70,000. వీరిలో 13,500 మంది బ్రిటిషువారు, ఆతర్వాత, సైన్యసంఖ్య, వేగంగా అధికమౌతూ వచ్చింది. హేస్టింగ్సు జైతయాత్రలు, రాజ్యాక్రమణ ప్రయత్నాలు, పూర్తిఅయ్యేనాటికి, కంపెనీయొక్క స్థాయీసేన, రష్షియామినహా తక్కిన ప్రపంచమంతటిలోనూ, గొప్పది.

సైన్యంలోని అసంతృప్తికారణాలను తొలగించడానికి, కారన్‌వాలిస్ చేసిన ప్రయత్నాలు, పూర్తిగా సఫలంకాలేదు. కంపెనీ సేనాధికారులు, రాజసేనలోని అధికారులు, తమ తమసేవా కాలపరిమితులను అనుసరించి, వాటికి అనుగుణమైన స్థానాలను వహించవలసిందనీ, ఈఏర్పాటు, రాజసేన ఇండియాలో ఉన్నంతకాలమే వర్తిస్తుందనీ, సమాధాన మార్గాన్ని నిశ్చయించినాడు. కాని, ఇతర అసంతృప్తికారణాలకు నివారణ కలుగనందువల్ల, పదేపదే కల్లోలాలు, తిరుగుబాట్లు, కూడా సంభవిస్తూవచ్చినవి. అట్టిపరిస్థితులలో కూడా, ఇండియాలోని బ్రిటిషురాజ్యం, కూలిపోకుండా నిలువడానికి ప్రబలకారణాలు కలవు:- (1) విషమపరిస్థితి ఏర్పడిన సందర్భాలలో, తమ స్వంతకష్టాలను, బాధలను, పూర్తిగా విస్మరించి, తమదేశ ప్రయోజనాల రక్షణార్థం అందరూ ఏకమై నిలవడంలో, బ్రిటిషు అధికారులు, సామాన్యసైనికులు, కూడా,వహించిన సామర్థ్య దక్షత ప్రథమమైనది. (2) తామందరూ ఏకమై, తమబలాలన్నిటినీ వ్యవస్థీకరించుకొని, తమకందరికీ సమానమైన శత్రువును ఎదుర్కొనే సామర్థ్యము, దక్షత, ఇండియా దేశీయులకు లేకపోవడం, రెండవకారణం.

కంపెనీ సైన్యసంస్కరణకై వేసుకొన్న ప్రణాళికను నిర్వహించడంలో, కారన్‌వాలిస్, కృతార్థుడు కాలేదు. దేశీయులకు విరుద్ధంగా, అతడు జరిపినచర్యలవల్లనే, అతని ప్రయత్నం బలహీనమైపోయింది. ఇండియా సేనాధికారులను హీనపరచి, వారి వేతనాలను అధమ స్థితిలో ఉంచి, పై పదవులను ఆశించే అవకాశం లేకుండా చేసి, వారి సంఖ్యను కూడా తగ్గించివేసినాడు. 1857 లో, సైన్యవిప్లవం బయలుదేరినప్పుడు, సైనికులను క్రమశిక్షణలో నిలిపియుంచడానికి తగినంతమంది ఇండియా అధికారులు లేకపోవడం, దీనిపరిణామఫలం.

కారన్‌వాలిస్ నిర్మించిన ప్రభుత్వ విధానాన్ని ఆధారంగా చేసుకొని, బ్రిటిషువారు, ఆ తర్వాత నూటయాభై సంవత్సరాల కాలం, ఇండియాను పరిపాలించగలిగిరి. ఇతడు స్థాపించిన నూతన విధానానికి, రెండు సూత్రాలు ఆధారములైనవి;- విదేశ ప్రభుత్వాన్ని శాశ్వతం చేయడము, పరిపాలకుల దేశప్రయోజనానికై ఇండియాదేశ ప్రజల సంపదను ఉపయోగించడము,- అనేవి ఈ సూత్రాలు. పిట్ ఇండియా చట్టము కల్పించిన పరిపాలన యంత్రమువల్లను, కారన్ వాలిస్ ప్రయత్నంవల్లను, ఈ రెండువిధములైన బ్రిటిషు ప్రభుత్వ ఉద్దేశాలూ, అద్భుతంగా నెరవేరినవి. ఇండియాలోని రాజ్యాలకు బ్రిటిషు పార్లమెంటు అత్యుచ్చాధికారంగా సిద్ధించింది. ఈ అధికారాన్ని నిర్వహించే కార్యకర్తలు, ఇండియాలోని గవర్నర్ జెనరలు, అతని సలహామండలి, ప్రాంతీయ గవర్నర్లు, ఇత్యాది ఉన్నతాధికారులు. సర్వోచ్చాధిపత్యం వహించిన పార్లమెంటుయొక్క అభిప్రాయాలను, ఆజ్ఞలను, అమలు జరిపే కార్యకర్తలు మాత్రమే వీరు. శివిల్ మిలిటరీ శాఖలలోగల అన్ని ప్రధాన స్థానాలలోనూ, పరిపాలక వర్గానికి చెందిన వ్యక్తులనే నిలుపుకొన్నారు. ఈ పాశ్చాత్యులు ఇండియాలో నడుపుతున్న ఈ ఆధిపత్యానికి అధికార ముద్రను కలుగ చేసింది, వారి సైన్యప్రాబల్యం.

దేశంలో లభించే ఆదాయాన్ని, సార్వభౌమాధికారం వహించిన ఇంగ్లాండుకు కప్పమురూపంగా ఇస్తూ రావడానికి ఉపయోగించిందేకాని, ఇండియాలోని వ్యవసాయాన్ని, పరిశ్రమలను, బాగు పరచి, ఉత్పత్తిని అభివృద్ధి చేయడానికి కాదు.

ఈ మార్పులవల్ల, దేశప్రజల నైతిక, భౌతిక పరిస్థితులలో కలిగిన పరిణామం, దురంతమైనట్టిది. విషణ్ణత, ఉదాసీన ప్రవృత్తి, స్థైర్యలోపము, నిరుత్సాహము. మొదలైన మనోజాడ్యాలు ప్రజను ఆక్రమించినవి. స్వాతంత్ర్యనాశాన్ని దాస్య స్థితిని అనుసరించి ఏర్పడే నైతిక లోపాలు, దుర్వ్యసనాలు, దేశంలో వ్యాప్తికి వచ్చినవి.

# 8
# బ్రిటిష్ పరిపాలనాభివృద్ధి 1793 నుంచి, 1857 వరకు

## యూరోపు ఆర్థిక రాజకీయ విప్లవాల ఆఘాతం

కారన్‌వాలిస్ స్థాపించిన రాజకీయ విధానంలోని లోపములు ఏవైనప్పటికీ, అవ్యవస్థా పరిస్థితులను తొలగించి అతడు క్రమవ్యవస్థను నెలకొల్పియుండడం, వాస్తవం. ప్లాసీయుద్ధం తర్వాత, బ్రిటిషువారు సంపాదించుకొన్న ప్రాంతాలలో వ్యాప్తమైయుండిన అరాజకత్వం అంత మయింది. క్రమబద్ధమైన నూతన మార్గాలలో బెంగాలు జీవితం నడవడానికి ఆరంభించింది. బ్రిటిషు పరిపాలన ఇండియాదేశమంతటా వ్యాపించడంతో, బెంగాలులో ఉత్పన్నమైనట్టి పరిపాలన సమస్యలే, ఆ ప్రాంతాలలో కూడా ఉత్పన్నమైనవి. వాటిని పరిష్కరించడానికి, కారన్‌వాలిస్ విధానం, ఆదర్శంగా ఏర్పడింది. ఇతని విధానంలోని కొన్ని భాగాలను యథాతథంగా అవలంబిస్తూ, తక్కినవాటిని కొంత మార్చినా, దానికి ఆధారమైన మూలభావాలను ఆక్షేపించడం మాత్రం జరిగింది. ఈ ప్రక్రియ పూర్తికావడానికి అర్ధశతాబ్దం పట్టింది; పరిపాలన విధానములోని పద్ధతులు పూర్తిఐనవి.

*యూరోపు – ఇంగ్లాండు* : కాని, ఈ కాలావధిలో యూరోపుఖండం గొప్ప సంక్షోభాలకు గురిఐనది. ఇండియాలోని పరిపాలకులు నూతన మనోధర్మాన్ని, దృక్పథాన్ని, అలవరచుకొనిరి. ఇంగ్లాండులోని కార్యరంగంలోను, భావరంగంలోను కూడా, అత్యంతమైన మార్పులు వచ్చినవి. "ఇంగ్లీషు పార్లమెంటు చరిత్రలో లంచగొండితనానికి ప్రసిద్ధిచెంది, నికృష్ట దశకు వచ్చిన" పద్దెనిమిదోశతాబ్దపు ఉత్తరార్ధం అంతమౌతూ వచ్చింది. కాని, నూతన సమస్యలు బయలుదేరినవి; నూతన శక్తుల ప్రవృత్తి ఆరంభమయింది. విస్తృత పరిమాణంలో, ధనాన్ని ఉత్పాదించే నూతన మార్గాలు వ్యాప్తికి వస్తున్నవి. వీటిని అనుసరించి, నూతన మనోభావాలు, వర్తనలు, నీతులు, పొడచూపినవి. జీవన సముద్రంపై వీస్తున్న నూతన భావ చైతన్య ప్రభావం, ఇండియాపై ప్రసరించక తప్పదు; పాశ్చాత్యదేశాలలో కలిగిన అలజడి యొక్క పరిణామాల ప్రభావానికి, ఇండియాదేశం, లోనుకావడం, అనివార్యమైనది.

పద్దెనిమిదో శతాబ్దపు మధ్యకాలంలో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవ సంవేగం, వృద్ధిపొందుతూ వచ్చింది. ఇంగ్లాండు, అత్యంత వేగంతో పారిశ్రామిక దేశంగా పరిణమిస్తూ ఉంది; అంతేకాక, విజ్ఞానశాస్త్ర సాంకేతిక శాస్త్రాలలోను, పరిశ్రమలలోను, యూరోపు ఖండానికి అగ్రస్థానం వహించే స్థితికి అభివృద్ధి చెందింది. కర్మాగార విధానాభివృద్ధివల్లను, సంపదయొక్క అభివృద్ధివల్లను, ఇంగ్లాండు సమాజముయొక్క సంయోజనమే మారిపోతూ వచ్చింది. విజ్ఞానశాస్త్ర సాంకేతికశాస్త్రాలు, మానవునికి, ప్రకృతిశక్తులపై ఇంతకుముందు

ఎన్నడూ లేని అధికారాన్ని కలుగచేసినవి. అవధిలేని అభ్యుదయమార్గం, మానవజాతి దృష్టికి గోచరించింది. యూరోపుదేశాలవారి ప్రతిస్పర్థను ఎదుర్కొనడానికి అవసరమైన సాధనాలను, మూలధనాన్ని, ఇంగ్లాండుకు, పారిశ్రామిక విప్లవం కలిగించియుండడం, ఆ దేశముయొక్క అదృష్టం.

ఇంగ్లాండు సముద్రపు కాలువకు అవతల, మరొక విప్లవం బయలు దేరి, ఫ్రాన్సులో నూతన యుగానికి ప్రారంభోత్సవం జరిపి, యూరోపు ఖండముయొక్క అభ్యుదయానికి ప్రేరకమయింది. ప్రాచీన భూస్వామ్య వ్యవస్థను తుడిచివేసి, మధ్యమతరగతి ప్రజల విజయాన్ని, ఈ విప్లవం, ప్రపంచానికి చాటింది. మానవ సమానత్వము, స్వాతంత్ర్యము, భ్రాతృత్వము, అనే సూత్రాలను ప్రసారం కావించిన ఈ విప్లవ సైన్యాలు, యూరోపుఖండములోని శిథిలావస్థలో ఉన్న రాజ్యాలను కూలద్రోసినవి. మహావైభవోపేతుడైన నెపోలియన్, అనే ప్రతిభాశాలియొక్క నాయకత్వంలో, ఫ్రెంచి సైన్యాలు యూరోపుఖండాన్ని తుడిచివేసి, బ్రిటన్‌దేశాన్ని ఎదుర్కొని నిలిచినవి. వారి అఖండ విజయపరంపరలు ఏషియాఖండమంతటా ప్రతిధ్వనించినవి.

ఈ రెండు విప్లవాలూ, యూరోపుఖండంలో స్వేచ్ఛావిహారానికి వదలిపెట్టినశక్తులు, దారిద్ర్యశృంఖలాలను, మానసిక దాస్యబంధనాలను, ప్రభుశక్తిని, భగ్నం కావించి, జాతీయ యుగానికి ప్రారంభోత్సవం జరిపినవి.

వాల్టేర్, రూసో, విశ్వజ్ఞానులు, క్యాంట్,- అనే పర్యాలోచకులు, మానవప్రవర్తన, భావన, భావము, మొదలైనవాటిలో విప్లవాన్ని కలిగించినారు. ఈ నూతన భావచైతన్యం, ఇంగ్లాండులో, వర్డ్స్‌వర్త్‌వంటి కవులను, ఆడంస్మిత్‌వంటి అర్థశాస్త్రవేత్తలను, బెంథాంవంటి తత్త్వశాస్త్రజ్ఞులను, ఉత్తేజనపరచింది. భూతభవిష్యద్వర్తమానాలన్నీ ఐక్యమై, కళలు, నీతి, ఉత్కృష్టత, అనే వాటికి ఆకరమైన సమాజంయొక్క స్వప్నదర్శనంతో మురులు చెందినాడు, బర్క్. సంప్రదాయాన్నీ, పూర్వాచార నిరంతరత్వాన్నీ, సమర్థించినవాడు బర్క్. అత్యధికసంఖ్యాకప్రజలకు సిద్ధించవలసిన అత్యధిక శ్రేయస్సును సమర్థించిన ఉదారవాది, బెంథాం. మానవచరిత్రలోని రహస్యార్థాన్ని, మానవసురక్షితస్థితిని ప్రధానంగా ప్రతిపాదించి, మానవహృదయాలను ఆకర్షించినవాడు ఒకడు ; మానవ జీవనాభ్యుదయాన్ని ఆశించే వారందరినీ తన మతానికి త్రిప్పుకొన్నవాడు రెండవవాడు. ఈ ఇరువురి ప్రభావాలూ ఆంగ్లేయుల మనస్సులను వశపరచుకొన్నవి.

తత్త్వశాస్త్ర విషయంలో జరిగిన ఉద్యమమేకాక, మత జీవిత విషయంలోకూడా, గాఢమైన అలజడి బయలుదేరింది. హానోవర్‌రాజుల యుగంలో వ్యాప్తికి వచ్చిన సాధారణ మత నిష్ఠా ప్రవృత్తికి, నైతిక భ్రష్టతకు, విరుద్ధమైన తీవ్ర ప్రతిక్రియ బయలుదేరింది. మెథాడిజం, అని, ప్రసిద్ధికి వచ్చిన, మత పునరుజ్జీవనానికి జీవితాలను అంకిత మొనర్చిన నాయకులు, వెస్లీ, వేక్‌ఫీల్డులు. బొగ్గుగనుల కార్మికులు, మిల్లుకార్మికులు, బట్టవాండ్లు, వర్తకులు, అంగడివాండ్లు, కూలీలు, మొదలైన సామాన్య ప్రజానీకానికి పల్లెలలోను, చిన్న పట్టణాలలోను, వీరు తమ అభిప్రాయాలను, బోధిస్తూవచ్చిరి. మానవత్వం భ్రష్టమైపోయిందని, అట్టి ప్రవృత్తిని నిరసించి, మానవులు ప్రాజ్ఞులై ధర్మపథానికి మరలవలెనని, అప్పుడే వారి జీవితం పవిత్రమైన భగవంతుని దయకు పాత్రమౌతుందని, వారు ప్రజలకు ఉపదేశించిరి.

ఈ సంస్కర్తల ఉత్తేజకరమైన వాగ్ధాటి, వారి పవిత్ర జీవనము, ప్రజలలో ప్రబల పరిణామాన్ని కలిగించినవి. "ఈ మెథాడిజం అనే ఉద్యమంకాని, లేదా, తత్సదృశమైన ఇతర సంస్కరణ సాధనంకాని, ఆనాడు బయలుదేరకపోయి ఉంటే, ఇంగ్లాండు అధోగతికి పోయి ఉండెడిదనడం, నిస్సందేహమైనది" అని మెథాడిజం చరిత్రకారుడు వ్రాసియున్నాడు.

ఎవాంజెలికల్, అనే, మత సంస్కర్తలు వీరితో సంబంధించినవారే. కాని వీరు ఆంగ్లికన్ చర్చికి బద్ధులైయుండి, తమ ఉద్యమాన్ని ప్రవర్తింపజేసిరి. "ఇది కట్టుదిట్టంగా ఏర్పడిన చిన్నసంస్థ; ప్రజల మనస్సులను చక్కగా గ్రహించినట్టిది. మతసంస్థలన్నిటిలోనూ ఎక్కువ తీవ్రప్రభావాలను కలిగిన ఈసంస్థ, ఇతర మత సంస్థలపై ఘర్షణపడ పూనుకొనే ప్రవృత్తికలది;" క్లాప్‌హామ్‌సంస్థ వీరివర్గాలలో ఒకటి. దాసజన వర్తకనిషేధాన్ని సమర్థించి, ప్రచారంచేసిన విల్బరుఫోర్స్, ఆంగ్లకవి కౌపరు, ఈవర్గంలోనివారు. ఈవర్గంవారిలో "ప్రతి మానవ ప్రయోజనానికీ ఒకరక్షకుడు. ప్రపంచంలోని ప్రతిమతానికీ ఒక ప్రతినిధి, "ఉండినాడని" ఆకాలంలో భావించేవారు.

*ఇండియా ఆర్థిక వ్యవస్థపై కలిగిన పరిణామాలు*: ఇంగ్లాండు ప్రభుత్వం, ఇండియాదేశంలో ప్రగతి పరమైన విధానాన్ని అవలంబించడానికి, ఫ్రెంచి విప్లవయుద్ధాలు, నెపోలియన్ యుద్ధాలు, ప్రేరకములైనవి. ఇండియావ్యవహారాలలో ఫ్రెంచిరాజ్యం ప్రవేశిస్తుందనే అతిశయభీతి, వెల్లెస్లీ హేస్టింగ్సుల సామ్రాజ్యపన్నాగాలకు ప్రేరకమయింది. బ్రిటిషువారి వాణిజ్యవిషయంలో, నెపోలియన్ చేసిన నిర్ణయాలవల్లను, యూరోపు ఖండములోని రేవు పట్టణాలనుంచి వీరిని నిరోధించడంవల్లను, ఇంగ్లాండులోని కొత్తకర్మాగారాలు ఉత్పాదిస్తున్న వస్తువుల విక్రయానికై, కొత్తబజార్లను అన్వేషించుకోవలసిన అవసరం ఏర్పడింది.

ఇంగ్లాండుదేశపు ఆర్థిక వ్యవస్థయొక్క స్వభావాన్ని పూర్తిగా మార్చివేసిన పారిశ్రామిక విప్లవం. ఇండియా ఇంగ్లాడు మధ్య ఏర్పడిఉండిన ఆర్థిక సంబంధాలను కూడా మార్చివేసింది. ఇండియాలో తయారైన గుడ్డలను ఇంగ్లాండుకు ఎగుమతిచేసి, వాటికిబదులుగా వెండిని ఇండియాకు దిగుమతిచేసే పద్ధతిపై, ఇంతవరకూ, ఇండియా ఇంగ్లాండు వాణిజ్యం జరుగుతూ ఉండేది. "పద్దెనిమిదోశతాబ్దం వరకు, ఇండియా ఆర్థికపరిస్థితి, ఇతరదేశాలకంటె, అభ్యుదయదశలో ఉండింది. ఇండియావారు అనుసరించిన ఉత్పాదన పద్ధతులు, వారివాణిజ్య విధానము, ప్రపంచంలోని ఏఇతరదేశ పద్ధతులకూ, తీసిపోయేవికావు." అని వేరా ఆన్‌స్టే (Vera Anstey) తెలిపినాడు.

కాని, పారిశ్రామిక విప్లవఫలితంగా, నూలువస్త్రాలను, ఇతర వస్తువులను విస్తృత పరిమాణంలో తయారుచేసే దేశంగా సిద్ధించింది, ఇంగ్లాండు. దీనితో, ఇండియా ఇంగ్లాండు దేశాలమధ్య జరుగుతూఉండిన వస్తువుల వినిమయం, తారుమారైపోయింది. ఇంగ్లాండులోని కర్మాగార యంత్రాలలో తయారైన వస్త్రాలతో, ఇండియాలోని చేనేత వస్త్రాలు పోటీకి నిలువలేకపోయినవి; కాబట్టి, ఇండియా వస్త్రపరిశ్రమ నాశనమైపోయింది. గ్రామాలలోని వృత్తికార్మికులకు, సాలెవాండ్లకు జీవనోపాధి పోవడంతో, వీరు, పొలాలులేని సామాన్య శ్రామికుల స్థితికి దిగజారిపోయిరి. ప్రభుత్వం అవలంబించిన భూమిశిస్తుల విధానమూ, గ్రామ పరిశ్రమల వినాశమూ, ఈరెండూ, ప్రాచీనగ్రామీణ వ్యవస్థను పూర్తిగా భగ్నం కావించినవి.

పారిశ్రామిక విప్లవంవల్ల, ఇంగ్లాండుయొక్క ప్రాచీన వాణిజ్యవిధానం, నష్టదాయకంగా పరిణమించడంతో, వర్తకంపైఉన్న నిర్బంధాలను, ఏకస్వామ్యాలను, తొలగించవలసిందని, ఆర్థిక శాస్త్రవేత్తలు, ప్రభుత్వాన్ని ఒత్తిడిచేయసాగిరి. ఉద్యమ స్వాతంత్ర్యం లభించడంతో, వర్తకపరిశ్రమలకు ఒక్కసారిగా ఉత్తేజనం కలిగింది. అతివేగంతో దేశసంపద పెరుగుతూ వచ్చింది.

పరిశ్రమాభ్యుదయంవల్ల సిద్ధించిన దేశసమృద్ధితో, ప్రజల ప్రవర్తనకు ఉపశాంతి కలిగింది. నెపోలియన్‌తో జరిగిన సంఘర్షణలో, ఆంగ్లేయుల గుణశీలాలు విషమ పరీక్షకు నిలిచి, మరింత దృఢమైనవి. మతనైతిక విషయాలలో జరిగిన సంస్కరణోద్యమాలు, ప్రజలలో, శ్రద్ధాగాంభీర్యాలు అభివృద్ధిచెందడానికి దోహదంచేసినవి. స్వాతిశయము, స్వాభిప్రాయాతిశయము, అనేభావాలు, ఆంగ్లజాతికి విస్పష్టలక్షణాలుగా సిద్ధించినవి. తమ జాతి ఉత్కృష్టమైనదనే భావన, ప్రపంచ పురోభివృద్ధి శ్వేతజాతివారి కర్తవ్యభారము అనేభావము, ఆంగ్లేయుని ప్రవర్తనకు రూపం కల్పించిన ఉత్తేజకశక్తులు. ఇంతటి ఉదాత్తభావనలకు లోనై యుండికూడా, తమదేశానికి ధనలాభాన్ని చేకూర్చే ఆతురతమాత్రం, ఏమాత్రమూ తగ్గలేదు. "1800 తర్వాత, ఇండియాలోని బ్రిటిషుప్రభుత్వం, ఇంగ్లాండుదేశ ప్రభుత్వానికి, కేవలం ఒక సాధన పరికరంగా మాత్రమే సిద్ధించింది. విస్తృత సామర్థ్యంగల ఇండియా బజార్లను, బ్రిటిషు పరిశ్రమల ప్రయోజనానికై సాధించుకోవడానికి అనుకూలించే విధంగా, శాంతి భద్రతలను నెలకొల్పే సాధనంగా ఏర్పడింది, ఇండియాలోని ఆంగ్లప్రభుత్వం."

*పరిపాలన వ్యవస్థలో నూతన చైతన్యోత్సాహం:* కారన్‌వాలిస్ ప్రణాళికలు, హ్విగ్ రాజకీయ పక్షపు సూత్రాలపై ఆధారపడినవని, మళ్ళీ చెప్పడం అవసరం. సాంఘిక వ్యవహారాలలో ప్రభుత్వపు జోక్యం పరిమితమై ఉండడము, వ్యక్తికి అస్వాయించని సర్వసామాన్యమైన న్యాయ విధానం పరమ ప్రధానం కావడము, న్యాయ పరిపాలనాధికారాలనుంచి కార్యనిర్వాహక అధికారాలను వేరుపరచడము, న్యాయపరిపాలన వ్యవస్థకు సర్వోత్కృష్ట స్థానం సిద్ధించడము,-ఈ ఆధార సూత్రాలు. స్వచ్ఛంద ప్రవృత్తికి, క్రమ వ్యవస్థకు మధ్య, క్రమ తౌల్యాన్ని నిలుపగలిగింది ఆస్తికాబట్టి, సమాజ సుస్థిరత్వానికి ఆస్తి, ఆవశ్యకమైనదని విశ్వసించిన వారు, హ్విగ్గులు.

ఇప్పుడు ఆరంభమైన నూతన యుగంలో, ఈ సూత్రాలన్నీ ఆక్షేపణలకు గురిఐనవి, బెంథమైట్ అభ్యుదయ వాదుల వర్గంలో, ప్రాధాన్యం కలవాడు, జేమ్సుమిల్. ఈ వర్గంలో తనకు గల పలుకుబడిని, ఈస్ట్ ఇండియా కంపెనీ సంస్థాపనలో తనకుగల స్థానాన్ని ఉపయోగించి, కారన్‌వాలిస్ విధానాన్ని మార్చడానికీ, కంపెనీ ప్రభుత్వాన్ని అభివృద్ధి పరచడానికీ, తోడ్పడినాడు. ఎవాంజెలిస్టులు కూడా, అభ్యుదయవాదుల అభిప్రాయాలను, చాలవరకు సమర్థించినవారే; కాని వీరు అనుసరించిన మార్గంవేరు. పార్లమెంటు ద్వారా, కంపెనీపై ఒత్తిడి తెచ్చి, తమ అభిప్రాయాలను కొన్నిటిని అంగీకరించేటట్లు చేసినారు. వీరి అభిప్రాయాలు ఉన్నత వర్గాలవారిలో వ్యాపించడంతో, ఇండియాలోని పెక్కుమంది ఉన్నతాధికారులు, వీరి నిర్దేశం ప్రకారం నడుస్తూవచ్చిరి. బర్క్ ప్రతిపాదించిన అభ్యుదయ మార్గాలకు కూడా వీరు విరుద్ధులే. ఆ కాలపు పరిపాలకులలో అత్యంత సమర్థులైన, మన్రో, మాల్కాం, ఎల్ఫిన్‌స్టన్, మెట్‌కాఫ్,లు ఈ వర్గంలోని వారే.

## II బ్రిటిష్ పరిపాలన స్వభావము

ఇంకను ఎక్కువ భూభాగాలు బ్రిటిషు ఆధిపత్యంలోనికివచ్చి, ఆ నూతన ప్రాంతాలలో పరిపాలన వ్యవస్థను స్థాపించవలసిన సమస్య సిద్ధించడంతో, కారన్‌వాలీస్ విధానంలోని గుణ దోష విషయమైన చర్చ, ఆరంభమయింది.

కాని, పరిపాలన వ్యవస్థకు సంబంధించిన సమస్యలను అనుసరించి, మరొక అత్యావశ్యకమైన విషయాన్నికూడా చర్చించవలసివచ్చింది. ఇండియాపై సిద్ధించిన బ్రిటిషు పరిపాలన స్వభావము, దాని అంతము,-అనేది ఈ మూలాధార విషయం. అట్టి విషయం, ఎన్నడో ఒక నాడు ఉత్పన్నం కాక తప్పదు. వర్షాకాల నదీప్రవాహము వంటిది, రాజ్యాక్రమణం. ప్రవాహ మార్గంలోని భూభాగంపై ఉండిన గుర్తులన్నీ కప్పుపడిపోయి, చుట్టుప్రక్కల ప్రదేశాలన్నీ నాశనమైపోవడం జరుగుతుంది. పరులుదేశాన్ని ఆక్రమించడంవల్ల కూడా దేశానికి ఇట్టి అవస్థే కలుగుతుంది. ఆక్రమణను అనుసరించి అన్యాయము, వంచన, పశుప్రవృత్తి, హింసాకాండ అనే దుష్ట ప్రవృత్తులు ఉత్పన్నమౌతాయి; కాబట్టి, దేశాక్రమణ మనేది అసభ్యమైన చర్య. పరాజయం పొందిన దేశీయులను హీనపరచి, అవమానపరచి, దరిద్రులుగా చేయడమే కాక, విజేతలైన వారిని కూడా నీతి భ్రష్టులుగను, అధములుగను చేసే ఉపద్రవమిది. అది పూర్తి ఐన తర్వాత, రెండు వర్గాలవారూ, అంతరంగ పరిశీలనకు పూనుకోక తప్పదు. తమ పరాజయానికి గల కారణాలను వెదకుకొని, వాటితో, సమాధానపడి, తమ ఆత్మగౌరవాన్ని నిలుపుకోడానికి ఓడిపోయినవారు ప్రయత్నిస్తారు. తాము జరిపిన హింసాకాండ న్యాయమైనదని సమర్థించి, తమ ఆత్మసాక్షిని తృప్తిపరచుకోడానికి, విజేతలు ప్రయత్నిస్తారు.

ఇంగ్లాండులో ఏర్పడిన పర్యాలోచన సంస్థలు కూడూ,- బెంథమైట్ అభ్యుదయ వాదులు, ఎవాంజెలిస్టులు, సంప్రదాయవాదులు,-తమ తమ అభిప్రాయాల ప్రకారం, ఈ కర్తవ్యాన్ని (బ్రిటిషు ఆక్రమణ సమర్థన) నిర్వహించడానికి ప్రయత్నించిరి.

అభ్యుదయ వాదులు : అభ్యుదయవాదులది, లౌకికదృక్పథం. ఇండియాలో శాంతి భద్రతలను నెలకొల్పడానికి బ్రిటిషువారి ఆక్రమణ అవశ్యమైనదని, వారిసమర్థన. పరస్పర విభేదాలతోను, భ్రాతృఘాతుక యుద్ధాలతోను, ఛిద్రమైపోతూ, రాజులు, నవాబులు చేసే దుష్పరిపాలనక్రిందబడి కూలుగుతున్న దేశంలో, శాంతిని క్రమవ్యవస్థను స్థాపించడానికి బ్రిటిషువారు ఇండియాను జయించిరని, వీరివాదం. న్యాయపరిపాలనలో విశ్వాసంకలవారు వీరు. కనుక, అరాజకత్వాన్ని నిర్మూలించి, ప్రజలు ప్రశాంతంగా జీవించే పరిస్థితులను కలిగించడం, ప్రథమావసరం. దేశంలో క్రమవ్యవస్థను నెలకొల్పడము, వ్యక్తులహక్కులను స్పష్టపరచి రక్షించే న్యాయసంహితను కల్పించడము, దానిని మితవ్యయంలో కాలహరణం లేకుండా అమలు జరిపే న్యాయపరిపాలన విధానాన్ని ప్రవేశపెట్టడము, ధనికవాద సమాజం లోని సభ్యుడైన వ్యక్తియొక్క ఆత్మసిద్ధికి అవకాశాలను కల్పించే రాజకీయ ఆర్థిక వ్యవస్థలను నిర్మించడము, మొదలైన మహాకార్యాలను సర్వసమర్థమైన రాజ్యముమాత్రమే నిర్వహించగలదు. అట్టి ఇంగ్లాండురాజ్యం, ఇండియాలో తన కార్యకర్తగా ప్రాతినిధ్యం వహించిన ప్రభుత్వానికి, తనసమస్తాధికారాలను అప్పగించి, దానిద్వారా ఈమహాకార్యాన్ని జరిపిస్తూ ఉంది. దయాదాక్షిణ్యరహితంగా, కఠోరమైన కుల బంధనాలకు బద్ధమై, మధ్యయుగాల

ఆచారాలతో దట్టమై, జడప్రాయంగా నిలిచిపోయి, సమిష్టివాదంపై ఏర్పడియున్న ఇండియా నాగరికతను సహించనివారు, ఈ అభ్యుదయవాదులు. భూస్వాములు, పురోహితులు పీడిస్తున్న ప్రజానీకంతో ఏర్పడిన ఇండియా సమాజ నాగరికత, వీరికి అసహ్యమైనదిగా తోచింది. సమూలంగా, దీనిని పెకలించివేసి, సమాజాన్ని పూర్తిగా పాశ్చాత్య పద్ధతులపై నెలకొల్పడం, వీరు సూచించిన నివారణోపాయం. సాంఘిక పరిస్థితులను బాగుపరచి, రాజకీయ విప్లవం రాకుండా రక్షించుకోడానికి, ఇదిఒక్కటే మార్గమని వీరిభావం.

ఆర్థిక విషయాలలో, మాల్థస్, రైకార్డో సిద్ధాంతాలను అనుసరించినవారు; తాటస్థ్య సిద్ధాంతంలో (Laissez faire) విశ్వాసం కలవారు. వ్యక్తిఉద్యమము, స్వతంత్ర వాణిజ్యము, వీరి అభిమత విషయాలు. ప్రభుత్వసహాయము, జోక్యము,- ఈరెండు పద్ధతులను వీరు ఖండించినారు. రాజస్వపరిపాలన విషయంలో, ఇంగ్లాండులోని భూస్వామ్యం వంటి విధానాన్ని ఏర్పరచడము, లేక ఇప్పుడున్న భూస్వామ్య విధానాన్ని విస్తరింపచేయడము, అనే, ఈరెండు పద్ధతులకూ వీరు విరుద్ధులే. ప్రభుత్వము, ప్రత్యక్షంగా రైతులతో వ్యవహారాలు జరిపేవిధానం మంచిదని, వీరు సమర్థించిరి. భూమిశిస్తు విషయంలో, రైకార్డ్ సిద్ధాంతాన్ని ఎక్కువగా సమర్థించేవాడు జేమ్స్‌మిల్. ప్రభుత్వం స్వయంగా భూస్వామి స్థానంలో నిలిచి, భూమికి సంబంధించిన పూర్తి అధిశేషాన్ని (Economic Rent) గ్రహించవలసిందని బలవంతం చేసినాడు. రైతుకూలీలు, అతడు వ్యవసాయంపై పెట్టిన మూలధనంపై లాభము,- ఈరెంటినీ మొత్తం ఉత్పత్తిలోనుంచి తీసివేయగా మిగిలేది అధిశేషము అని, ఆర్థికవేత్తలు నిర్ధరించినారు.

ఎవాంజెలిస్టులు : వీరిది మతవిషయక దృష్టి. క్రైస్తుమతాన్ని అవలంబించడంవల్ల మాత్రమే, ఇహలోక శ్రేయస్సు, మోక్షము సిద్ధించగలవని వీరిభావం. ఇండియాదేశాన్ని బ్రిటిషువారు ఆక్రమించడం, దైవానియామక మైనదని వీరిభావం. ఇండియా ప్రజలపాపాలకు "నిజమైన దేవునిని ఆరాధించక అధోగతిలో పడిఉన్న ధర్మభ్రష్టతకు," తగిన శిక్షగా దేవుడు దీనిని విధించినాడు. "ఏకాలంలోనూ జరగనివిధంగా, నీతిభ్రష్టము, క్రూరము ఐన అంధవిశ్వాసానికి దాసులై పతితులైపోయిన" ఈ ప్రజలను ఉద్ధరించడానికి భగవంతుడు ప్రసాదించినవరమే, బ్రిటిషువారి దేశాక్రమణమని వీరినమ్మకం. కాబట్టి, ఇండియా ప్రజలను క్రీస్తుమతంలోకి తీసుకొని, యూరోపుదేశాల క్రైస్తవ మతవిధానంలో, విలీనం కావించడానికి, వీరు పూనుకోవడం సహజమైనదే. క్రీస్తుమతేతరులైన ఇండియాప్రజల ఆత్మలను ఉద్ధరించడం మాత్రమే, వీరిముఖ్య ప్రయోజనంకాదు. ప్రజల జీవనం ఆంగ్లీకరణం కావడంతో ఆంగ్ల దేశంలో తయారైన వస్తువులపై మోహంకూడా ఉత్పన్నం కాగలదని గ్రహించిన బుద్ధిమంతులు వీరు. క్రైస్తవ మతపద్ధతులు దేశంలో వ్యాప్తికి రావడంతో క్రైస్తవ దేశాలలో తయారైన వస్తువులు, ప్రవాహరూపంలో ఇండియాకు దిగుమతి ఔతాయి. ప్రశంసార్హములైన ఈ ఆశయాలు సిద్ధించడానికి ఆంగ్లేయులు, మిషనరీలు, అధికసంఖ్యలో ఇండియాకువచ్చి, నివసించడం అవసరం. కాబట్టి, వారి ప్రవేశవిషయంలో, ఇంతవరకూఉన్న నిర్బంధాలను తొలగించవలసి వచ్చింది. అదేవిధంగా, ఆంగ్లపత్రికలు, ఆంగ్లవస్తువులు, ఇండియాలో ప్రవేశించడంలోగల నిర్బంధాలను ప్రభుత్వం, తీసివేసింది.

క్రీస్తుమతాన్ని ప్రచారంచేయడానికి, శాంతిభద్రతలను దేశంలో నెలకొల్పి రక్షిం

చడం, క్రైస్తవ ప్రభుత్వముయొక్క కర్తవ్యం. శాంతి పరిస్థితులు ఏర్పడినప్పుడే మిషనరీలు పూనుకొన్న ఆశయం ఫలించడానికి అవకాశం కలుగుతుంది. అంతేకాక, విద్యావ్యాప్తికి వీరు ఎక్కువ ప్రాధాన్యమిచ్చి, అట్టి ప్రయత్నానికి పూనుకొనిరి. ప్రజల మనస్సులను వశపరచు కోవడంవల్ల, తక్కిన ఉద్యమాలన్నిటిలోనూ విజయం చేకూరుతుందని గ్రహించినారు.

సంప్రదాయవాదులు : ఉద్దేశాల విషయంలో, సంప్రదాయవాదులకూ, తక్కిన రెండు సంస్థలవారికీ, భేదంలేదు. బ్రిటిషు పరిపాలనయొక్క పునాదులను దృఢపరచడమే, వీరంద రికీ ప్రధానమైన ప్రయోజనం. ఎన్నడో ఒకనాడు, ఇండియా దేశం స్వతంత్రమౌతుందనే భావం, స్వప్నదృశ్యంవలె కొందరికి గోచరించి యుండవచ్చు. ఇండియాకు స్వాతంత్ర్యం సిద్ధించిన దినాన్ని, ఇంగ్లాండుదేశ చరిత్రకు ప్రతిష్ఠకలిగించే దినంగా, మెకాలేవంటి వ్యక్తి ఊహించియుండవచ్చు. కాని, అట్టి ఆరాధనీయమైన దృశ్యం తాము ఊహించకలిగినంతటి భావికాలంలో సిద్ధిస్తుందనే భ్రాంతి, వీరికెవ్వరికీ కలుగలేదు. ఇండియా పరిస్థితులను వ్యవహారాలను, కార్యరూపదృష్టితో చూచిన, వీరు, పితృప్రాయమైన ప్రభుత్వమొక్కటే, ఇండియా దేశానికి అత్యంతమూ తగినదని భావించిరి. బ్రిటిషువారికి సిద్ధించిన ఇండియా రాజ్యాధికారం, భగవంతుడు సంకల్పించి, వీరిచేతులలో పెట్టిన, న్యాసము,- అని వీరి సిద్ధాంతం. బ్రిటిషు అధికారులు- కలెక్టరు, గవర్నరు, గవర్నర్ జెనరల్- దివ్యులు అనే సిద్ధాంతాన్ని వీరు సమర్థించినారు. రక్షించడం, పోషించడం, నశింపచేయడం, అనే భగవంతుని లక్షణాలన్నీ ఇతనిలో నిహితమై యుండడంవల్ల, బ్రిటిషుఅధికారి, తమ ప్రయోజనార్థం, 'స్వర్గంనుంచి దిగివచ్చిన దేవత', అని ప్రజలు భావించవలసి ఉన్నది. భారతీయుల సంప్రదాయానికికూడా, ఈప్రభుత్వం అనుగుణమైనదే. [సృష్టి, స్థితి, లయ, కారకుడైన భగవంతుడే, పృథివీపతి అనేభావం]. భారతదేశీయులను ఆంగ్లీకరణం కావించవలెననే, ఉద్దేశానికి వీరు వ్యతిరేకులు; అది వాంఛనీయమైనది కాదని, సాధ్యమయ్యేదికూడా కాదని, వీరిఅభిప్రాయం. బర్కువలెనే, వీరికికూడా, అవాస్తవ భావాలపై విశ్వాసంలేదు. మానవచరిత్ర, సంస్కృతి, ప్రకృతి సూత్రాలనుబట్టి నడిచిపోవలసినవేకాని, ఒక్కసారిగా పరివర్తనం పొందేవికావు అని వీరి నమ్మకం. గవర్నర్ జెనరల్‌కు హెచ్చరిక ఇస్తూ, మౌంట్‌స్టూవర్ట్ ఎల్ఫిన్‌స్టన్, ఈవిధంగా వ్రాసినాడు.;- "ప్రజల గుణశీలాలకు, వ్యవహారాలకు, వ్యతిరేకంగా ఉన్న ప్రభుత్వం, న్యాయమైన ప్రభుత్వమైనప్పటికీ, ప్రజలకు అదిసంతోష విషయం కాజాలదు,- అనేది జ్ఞాపకం ఉంచుకోవలసిన విషయం. గ్రామపంచాయితీల మూలంగా జరిగే న్యాయనిర్ణయ విధానాన్ని సమర్థిస్తూ అతడు ఈ విధంగా వ్రాసిఉన్నాడు. "పంచాయితీ సభ్యులకు వివాద విషయంతో సన్నిహిత పరిచయం ఉండడము, అనేక సందర్భాలలో, వివాద పక్షాల వారి శీల స్వభావాదులు కూడా చక్కగా తెలిసి ఉండడము, కారణాలుగా, వారి నిర్ణయాలు చాల వరకు సమంజసమైనవి. ఈ విధమైన విచారణలో, గణించరాని విలువగల సౌకర్యం కూడా ఉంది. పంచాయతీ సభలోని నిర్ణయాధికారులందరూ, ప్రజావర్గం నుంచి గ్రహింప బడిన వారు కాబట్టి, సాధారణంగా ప్రజలకు అర్థంకాని సూత్రాలను, వీరు విచారణ ప్రక్రియలో అనుసరించడం, జరుగదు. న్యాయసూత్రాల, అనిశ్చితత్వానికికాని, న్యాయం యొక్క అస్పష్టతకు కాని అవకాశం కలుగదు, కాబట్టి, అభియోగాలకు పూనుకొనే ప్రయత్నమే నశిస్తుంది."

తన అధీనోద్యోగులకు, ఇతరోద్యోగులకూ పంపిన అనుదేశంలో ఈ విధంగా సూచించినాడు. "మన ప్రామాణికత, వివేకము, బలము ఇత్యాదులు, తమ పరిపాలకులకంటె శ్రేష్ఠమైనవి అనే ప్రజల సాధారణాభిప్రాయంపై, మన ఇండియా పరిపాలన ఆధారపడి ఉన్నది. వారి ప్రవర్తనపట్లా, సంస్థలపట్లా, మతంపట్లా, మనం ప్రవర్తించే దాక్షిణ్యంతోను, వారిపట్ల మన నడవడికలో చూపే సౌమ్యము, సమాధాన ప్రవృత్తి, దయ, మొదలైన వాటితోను, వారికి మనపైగల సదభిప్రాయం వృద్ధిచెందుతుంది. వారి నమ్మకానికి, అంధవిశ్వాసానికి, బాధకలిగించే ప్రతి చర్యా; వ్యక్తుల విషయంలోను, వర్గాల విషయంలోను మనం పాటించే అలక్ష్యము, అశ్రద్ధా, మన సామ్రాజ్యానికి హానికరమైనవే. ఈ గొప్ప సామ్రాజ్యాన్ని స్థాపించడానికీ, దానిని రక్షించుకొని నిలుపుకోడానికీ, ఆవశ్యకమైన సూత్రాలను, మనము, విజేతల దురహంకారంతో విస్మరించినామనే అభిప్రాయం ఏమాత్రం వారికి కలిగినా, మనకు తప్పక హాని కలుగుతుంది.

కార్యనిర్వహణ శక్తులు, న్యాయపరిపాలన శక్తులు-ఈ రెండూ సంయుక్తమై ఉండవలెననీ, కార్యకర్తృత్వాధికారం, వ్యక్తులలోకాక, సామూహిక పరిషత్తులలో నిహితమై ఉండవలెననీ, భూమి పరిష్కారం రైతు వారీపద్ధతిపై జరుగవలెననీ వీరి అభిప్రాయాలు. ఈ పద్ధతులపై ఏర్పడినదే పితృప్రాయమైన ప్రభుత్వమని, వీరి భావం.

*పరిపాలనాభివృద్ధి చరిత్ర :* వివిధ వర్గాల నాయకులు ప్రతిపాదించిన ప్రస్తాపనలను, వాటి విషయంలో జరిగిన వివాదాలను, విస్తారంగా చర్చించడం అనవసరం. కాని, ఈ చర్చలవల్ల కలిగిన ఫలితాన్ని, కారన్‌వాలిస్ నుంచి క్యానింగు దాకా, పరిపాలన వ్యవస్థకు ఆకారం ఏర్పడిన విధానాన్ని పరిశీలించడం వాంఛనీయమైనది.

***1813 నాటి శాసనం :*** కంపెనీ వ్యవహారాల విచారణ, 1808 లో, ప్రారంభమయింది. పార్లమెంటు కామన్స్‌హౌస్‌లోని సభ్యులతో ఈ విచారణ సమితి ఏర్పడింది. నాలుగేండ్ల తర్వాత, ఈ సమితి తన నివేదికను పార్లమెంటుకు సమర్పించింది. కంపెనీ ప్రపత్రానికి మళ్లీ ప్రాణంపోసిన 1813 నాటి చట్టం, ఈ నివేదికపై ఆధారపడినట్టిది. ఈ ప్రపత్రం ప్రకారంగా జరిగిన ముఖ్యమైన మార్పులు ఇవి : (1) కంపెనీ వాణిజ్యముయొక్క ఏక స్వామ్యం, దీనితో రద్దు అయింది. టీ ఆకు వర్తకము, చైనాతో కంపెనీ జరిపే వర్తకము మాత్రమే, కంపెనీకి ఏక స్వామ్యంగా మిగిలినవి. (2) ఇండియా రాజస్వాదాయంతో పోషింపబడే, బిషప్ అధికారంలో, చర్చి సంస్థాపనను నిలపడం జరిగింది. (3) ఇండియా దేశంలో ఆంగ్లేయులు నివాసమేర్పరచుకొని, భూములను తమ అధీనంలో ఉంచుకోడానికీ, ప్రజలకు ఉపయోగకరమైన జ్ఞానాన్ని దేశంలో ప్రవేశపెట్టి, మత, నైతిక, విషయాలలో ప్రజలను అభివృద్ధికి తెచ్చే ప్రచారాన్ని సాగించే అవకాశం మిషనరీలకు కలిగించడానికీ, ప్రభుత్వమిచ్చిన అనుమతి పత్రాలతో న్యాయబద్ధమైన ప్రయోజనాలకై వర్తకులు వ్యాపారాన్ని జరుపుకోడానికీ, అవకాశంలభించింది.

***1833 నాటిశాసనం :*** ఇరవైఏండ్ల తర్వాత, అనగా, 1833లో సంవిధానం మళ్ళీ మార్పు చెందింది. తేయాకు వాణిజ్యంలోను, చైనాదేశ వాణిజ్యంలోను, కంపెనీకి ఉండిన ఏక స్వామ్యం, ఈ శాసనంతో రద్దయింది. అంతేకాక, వాణిజ్య వ్యవహారాలను ముగించవలసిందని కూడా, ఈ శాసనం ఆజ్ఞాపించింది కాని, కంపెనీయొక్క పరిపాలన విధానమూ, రాజకీయ

వ్యవహారాలకు సంబంధించిన అధికారాలు, అంతంకాలేదు. ఇండియా ఉద్యోగాల విషయంలో కంపెనీకిగల ఆశ్రయపోషణాధికారం కూడా అంతరించలేదు.

ఇండియా ప్రభుత్వ విషయంలో, ఈ శాసనాన్నిబట్టి, శాసన నిర్మాణ విషయాలకై, నాలుగో సభ్యుడు కూడా గవర్నర్ జెనరల్ మండలిలో నియమించబడినాడు. ఇది, అర్థవంతమైన చర్య. కేంద్ర ప్రభుత్వంలోని కార్యనిర్వహణ శాఖయొక్క కర్తవ్యాలనూ, శాసన నిర్మాణశాఖయొక్క కర్తవ్యాలనూ, ఇది వేరుచేసింది. అస్పష్టములైన కార్యకలాపరంగాలతో ఏర్పడిన వివిధ శాసన నిర్మాణ సంస్థలూ, న్యాయాలయాలూ, దీనితో అంతరించినవి. గవర్నర్ జెనరల్, మదరాసు బొంబాయి ప్రాంతాల గవర్నర్లు,-(తమ సలహామండలి సభ్యులతో సహా) శాసనం కావించిన వినియమాలు, కంపెనీ న్యాయస్థానాలలో మాత్రమే వర్తించగలవు. [మదరాసు, బొంబాయి రాజధానీల వినియమాలు, చాలవరకు, పరస్పర విరుద్ధములుగా ఉండేవి.]

ఇవికాక, అనేకములైన, టీకలు వ్యాఖ్యానాలు గల హిందూ ముస్లిం న్యాయశాస్త్రాలు వేరే ఉండినవి. సుప్రీంకోర్టులలోను, మేయర్లకోర్టులలోను (రాజన్యాయస్థానాలు) అనుసరించే సామాన్యన్యాయసూత్రాలు, ధర్మన్యాయసూత్రాలు, మొదలైన ఆంగ్ల నియత శాసనాలుకూడా పాటింపబడేవి. 1833 శాసనంప్రకారం, రాజధానీ ప్రభుత్వాల శాసన నిర్మాణాధికారాలు తొలగిపోయి, ఈ సమస్తాధికారమూ, మండలితో కూడిన గవర్నర్ జెనరల్ ఆధిపత్యంలో నిలిచింది. బ్రిటిషు పరిపాలనలో ఉన్న దేశంలోని అందరిప్రజలకూ-[బ్రిటిషువారు, దేశీయులు, విదేశీయులు, ఇతరులు అందరికీ]-అన్ని న్యాయాలయాలకూ [ప్రపత్రంద్వారా స్థాపితమైనవి, ఇతరములైనవి కూడా] వర్తించే శాసనాలను, వినియమాలను చేసే అధికారం, మండలితో చేరిన గవర్నర్ జెనరల్ అధీనమయింది. ఇండియా విషయంలో పార్లమెంటుకు గల శాసన నిర్మాణాధికారం, దీనివల్ల నష్టం కాలేదు.

న్యాయపరిపాలనవిషయంలో విచారణ జరపడానికి, అమలులోఉన్న న్యాయశాసనాల స్వభావాన్నీ, వాటి ప్రవృత్తినీ, పరిశీలించడానికి, ఒక "ఇండియా న్యాయకమిషన్"ను, నియమించవలసిందని ఇంగ్లాండు ప్రభుత్వం గవర్నర్ జనరల్‌ను ఆదేశించింది. ఈ కమిషనుకు అధ్యక్షుడుగాను, నాలుగో సభ్యుడుగాను, మెకాలేను నియమించిరి. ఈ కమిషను జరిపిన చర్యలఫలితంగా, ఇండియా దండవిధి సంహిత, శివిల్ ప్రక్రియా సంహిత, దండప్రక్రియా సంహిత, సారభూతన్యాయాలకు, ప్రక్రియన్యాయాలకు సంబంధించిన ఇతర సంహితలూ, ఏర్పడినవి. వివిధములైన న్యాయసూత్రాలన్నీ ఏకీకృతం కావడము, ఏకసమమైన న్యాయ పరిపాలనపద్ధతి, ఏకసమమైన ప్రక్రియాపద్ధతులు ఏర్పడడము, దేశంలో ఐక్యత వృద్ధికావడానికి ప్రబలమైన ఉత్తేజకములుగా పరిణమించినవి.

*1853* శాసనం : ఇస్ట్ ఇండియా కంపెనీ ప్రపత్రాన్ని 1853 లో, కడపటిసారిగా, వినూతనం కావించిరి. శాసననిర్మాణ ప్రయోజనార్థం గవర్నర్ జెనరల్ మండలిని విస్తృతం కావించి, పన్రెండుగురు సభ్యులను నియమించిరి. ఈ సభ్యులందరూ వేతనం పుచ్చుకొంటున్న ప్రభుత్వాధికారులే. వీరేకాక, గవర్నర్ జెనరల్, అతని మండలిసభ్యులు నలుగురు, సైన్యాధ్యక్షుడు, బెంగాలు ప్రధానన్యాయమూర్తి, ఒక సాధారణన్యాయాధిపతి, బెంగాల్, మదరాస్, బొంబాయి, ఉత్తరప్రదేశ్ ప్రాంతాలకు ప్రతినిధులుగా నలుగురు సభ్యులు, ఈ

శాసనసమితిలో చేరినవారు. ఈ శాసనసమితి సమావేశాలను బాహాటంగా జరిపి, సమావేశ కార్యక్రమాలను అధికారరీత్యా ప్రకటన కావించేవారు.

1833 తర్వాత, కంపెనీ, వాణిజ్యసంస్థగా నిలిచియుండలేదు; ఇంగ్లాండు రాజు పరంగా ఇండియా ప్రభుత్వాన్ని నిర్వహించే సాధనంగా ఏర్పడింది. విస్తారమైన సామ్రాజ్యాన్ని ఇట్లు, పరోక్షవిధంగా పరిపాలించడం పూర్తిగా అసంబద్ధమైనది; డెబ్బై ఐదేండ్లకాలం, పరిపాలన ఈ పద్ధతిలో జరిగియుండడం అత్యాశ్చర్యకరమైన విషయం. కడపటికి, 1857లో ఉత్పన్నమైన విప్లవం, దీనిని తుదిముట్టించింది. అంతటితో, ఇండియా ప్రభుత్వ పరిపాలనను ఇంగ్లాండు రాజత్వం, స్వయంగా పూనుకొంది.

*పరిపాలనపద్ధతుల మార్పువల్ల కలిగిన ఫలితాలు :* కంపెనీ పరిపాలన లోని కడపటి యాభై సంవత్సరాల కాలంలో, పరిపాలన వ్యవస్థా నిర్మాణం పూర్తిఅయింది. బెంగాలు పరిపాలనకై కారన్‌వాలిస్ ప్రఖ్యాపన కావించిన వినియమాలు, ఈ వ్యవస్థా నిర్మాణానికి ఆధారములైనవి. కాని, నూతన అభిప్రాయ ప్రాబల్యంవల్లను, అనుభవంతో కలిగిన జ్ఞానంవల్లను, వీటిని మార్చడం అనివార్యమయింది. అందులోనూ, వేర్వేరు ప్రాంతాలలో నూతన ప్రభుత్వాలను ఏర్పరచే సందర్భాలను బట్టి, ఈమార్పులు తప్పనిసరి ఐనాయి.

బ్రిటిషు పరిపాలకులు ఎదుర్కొనవలసివచ్చిన సమస్యలు అత్యంతమూ క్లిష్టములైనట్టివి. తమ జాతి ప్రజల ప్రయోజనాలను భద్రం కావించడము, తమ సామ్రాజ్యానికి సుస్థిరత్వం కలుగచేయడము, వారి ప్రథమకర్తవ్యం. పరిపాలక వర్గానికి, పాలిత ప్రజాజాతికి గల సంబంధాలతో కూడిన సమస్యలను, మొదట పరిష్కరించవలసి యున్నది. భారతదేశ సంప్రదాయాలలో వేటిని విసర్జించి వేటిని ఆమోదించవలెను, పరిపాలన వ్యవస్థలోని ఏ భాగాన్ని దేశీయులకు అప్పగించవలెను, పరిపాలకులకు పాలితప్రజలకు మధ్యగల వ్యవహారాలకు ఎట్టి అవధులను ఏర్పరచవలెను,– అనే సమస్యలు వీటిలో ప్రధానములైనవి.

ఈ సమస్యలను పరిష్కరించడానికి, కారన్‌వాలిస్ విధానము ప్రయత్నించింది. పరిపాలన కార్యక్రమాలు, పెట్టుబడి అనే రెండు ప్రయోజనాలకూ ఆవశ్యకమైన రాజస్వాదాయం, భూమి పరిష్కార పద్ధతివల్ల స్థిరంగా నిశ్చితమయింది. పరిపాలన వ్యవస్థలో ప్రాబల్యం సంపాదించుకొనే అవకాశాలేవీ దేశీయులకు లేకుండా చేయడంవల్ల, బ్రిటిషు ఆధిపత్యానికి భంగంకలుగగలదనే భీతికి ఆస్పదమే లేకుండా పోయింది. కాని, శాశ్వత పరిష్కారంతో నూతన సమస్యలు బయలుదేరినవి. ఒక నూతన ధనికవర్గం దేశంలో ఉత్పత్తికివచ్చింది; బ్రిటిషు పరిపాలనకు ఎప్పటికైనా, ఈవర్గంవల్ల అపాయం కలుగవచ్చు. న్యాయపరిపాలనను, కార్యనిర్వహణశాఖను వేరుచేయడంవల్ల, కార్యనిర్వాహక అధికారుల ఆధిపత్యం బలహీనమై, ప్రభుత్వ ప్రతిష్ఠకు భంగం వాటిల్లింది.

***1793 తర్వాత బ్రిటిషువారి వైఖరిలో కలిగిన మార్పు :*** ప్రథమదశలో ఇండియాకువచ్చిన ఆంగ్లేయులు, తమకూ, భారతదేశీయులకూ గల భేదాలను గుర్తించిన వర్తకులు, రాజదూతలు. వీరు, జాతి దురహంకారం లేనివారు కాబట్టి, సాంస్కృతిక, సాంఘిక విషయాలలో రెండుజాతులవారి మధ్యా, సంపర్క సహచర్యలు ఎర్పడి యుండినవి. వారిలో చాలమంది, దేశభాషలను అభ్యసించి, దేశీయుల పద్ధతులను, నడవడులను కూడా అవలంబించి, దేశీయులతో స్నేహ సాహచర్యాలను కావించుకొని ఉండిరి. పారసీక,

బెంగాలీ భాషలతో ఎక్కువ పరిచయం కలవాడు, వారెన్‌హేస్టింగ్స్. సంస్కృతంలో మంచి విద్వాంసుడైన, సర్ విలియమ్ జోన్స్ కాళిదాసుని 'శాకుంతల' నాటకాన్ని ఇంగ్లీషులోనికి అనువదించినాడు. సంపన్నులైన భారతీయులు, నవాబులు, రాజులు, ఏర్పాటుచేసిన వినోద కార్యక్రమాలలో వీరు స్వేచ్ఛగా పాల్గొనేవారు. "రెండువర్గాలమధ్యా మంచి పొందిక ఏర్పడిఉండింది." అని, స్పియర్, వ్రాసియున్నాడు. "దేవదాసీల నాట్య ప్రదర్శనంలో, చాలకాలంగా, అభిరుచిని అలవరచుకొని యుండిరి. తరువాతికాలంలో, ఏనుగుల పోట్లాటను చూడడము, హుక్కా పీల్చడము కూడా ఆరంభించిరి. ఇండియా నవాబులు పాశ్చాత్యుల ఆహారపదార్థాలకు, మద్యపానీయాలకు అలవాటుపడిరి." పందితొడల మాంసంపై మక్కువకలిగిన ముసల్మానులు, దానిని "విలాయితీ హిరణ్"- ఇంగ్లీషు జింకమాంసము - అనే పేరుతో తినేవారు. పరస్పర స్నేహాలు వృద్ధి ఐనవి. హేస్టింగ్సు మైత్రీబృందంలో, జెనెరామ్, అతని సోదరుడు బిషంబర్ పండిత్, గంగా గోబిందసింగ్, ఆలీ ఇబ్రహీంఖాన్, అనే దేశీయులు చేరియుండిరి.

కాని, కారన్‌వాలిస్ పరిపాలనతో, పరివర్తనం ప్రారంభమయింది. పరస్పరం వినోద కార్యక్రమాలలో చేరడం తగ్గిపోయింది; స్నేహబంధాలు ఆగిపోయినవి. పరిపాలన వ్యవస్థలోని ఉన్నతపదవులన్నీ ఆంగ్లేయులకు ప్రత్యేకింపబడినవి. ప్రభుత్వోద్దేశాలు "సామ్రాజ్య నీతిని పాటిస్తూ వచ్చినవి; దురహంకారంతో దేశీయులకు దూరంగా నిలిచే వైఖరి ఆంగ్లేయులలో ప్రబలమయింది." అభ్యుదయవాదుల అభిప్రాయాలు, ఎవాంజెలిస్టుల అభిప్రాయాలు ప్రసారం కావడంతో, ఆంగ్లేయుల వైఖరి పూర్తిగా మారిపోయింది. దేశీయులపట్ల సహనభావంపోయి, నిరసనభావం, విముఖత, ఏర్పడినవి. "ఇండియాదేశపు సంస్థలన్నీ నికృష్టమైనవనీ, ప్రజలందరూ నీతిభ్రష్టులనీ మాత్రమేకాక, దానిసహజ ప్రకృతినిబట్టి, ఈదేశం ఏనాటికీ బాగుపడడం సాధ్యంకాదనే భావాన్ని, వహించిరి. ఈవిధమైన ఉత్కర్షభావనా గ్రంథి, (Complex) ఆంగ్లేయులలో పెరుగుతూ వచ్చింది. భారతదేశీయులు వ్యక్తులుగాను, సంఘంగాను, కూడా, అధములు అని ఆంగ్లేయులు ముద్రవేసినారు.

*నూతన భూమి పరిష్కారాలు* : నూతన అభిప్రాయాలతో ఏర్పడిన వాతావరణంలో, పరిపాలన వ్యవస్థయొక్క పరివర్తనం జరిగింది. సామ్రాజ్య విస్తృతి కారణంగా, నూతన రాజస్వ పరిష్కారంపై ఆధారపడిన పరిపాలన వ్యవస్థ ఆవశ్యకమయింది. బెంగాలులోని శాశ్వత పరిష్కారాన్ని, దాని వివిధ రీతులను, అంశాలను దీర్ఘంగా చర్చించిన తర్వాతనే, నిశ్చయించడం జరిగింది. కాని, జమీందారులతో పరిష్కారం జరుపవలెననే విషయంలో మాత్రం, ఎట్టి సంశయమూ కలుగలేదు. దక్షిణదేశంలో జరిగిన యుద్ధాల ఫలితంగా జమీందారీ అనుభోగంలోలేని భూములతో కూడిన ప్రాంతాలు, ఎక్కువగా బ్రిటిషువారి పరిపాలన క్రిందికి వచ్చినవి. చిన్నచిన్న జమీందారులు, స్థానిక నాయకులు ఉన్న జమీందారీ ప్రదేశాలు, స్వల్పంగా, అక్కడక్కడ, చెదిరి ఉండినవి. కాబట్టి, సాధారణ భూములు విస్తారంగా గల ప్రాంతాలలో బెంగాలు పద్ధతిని ప్రవేశపెట్టడం సంభావ్యమైనదా, అనే ప్రశ్న ఉదయించింది. మహారాష్ట్రులు పరాజయాన్ని పొంది, బ్రిటిషు రాజ్యం దక్కను ప్రాంతంలో కూడా వ్యాపించడంతో, ఈ సమస్య ఇక్కడ కూడా ఎదురయింది.

జమీందారీ విధానంవల్ల లభిస్తాయని అనుకొన్న ప్రయోజనాలు పూర్తిగా ఫలించలేదు.

బ్రిటిషు రాజ్యముయొక్క క్రమవ్యవస్థకు, స్థైర్యానికి ఆలంబనంగా జమీందారులు నిలుస్తారనీ, వారి ప్రయోజన రక్షణమే ఆధారంగా స్థాపింపబడిన బ్రిటిషు ప్రభుత్వం పట్ల ఆదరాభిమానాలను వహిస్తారనీ, ఆనాడు తలచి యుండిరి. కాని, కార్యరూపంలో, తద్విపరీత పరిణామం సిద్ధించింది. బెంగాలులోను, ఉత్తర సర్కారులలోను, శాశ్వత పరిష్కారం ఏర్పడిన వెంటనే, స్థానిక ప్రభుత్వాలకూ జమీందారులకూ మధ్య, ఘర్షణ ప్రారంభమయింది. "క్షాత్రమము, అప్రామాణికత, పలాయనము, అనేవి మాత్రమే ఒక పక్షంవారు ఎల్లప్పుడూ అవలంబిస్తారనీ, రెండవ పక్షంవారు నాగరికమైన తీవ్రచర్యలను మాత్రమే జరుపుతారని" ఊహించడానికి వీలు కాని విధంగా ఈ ఘర్షణసాగింది. కలెక్టర్ల పేరిట, తమ సాయుధ బల సహాయంతోను, కొన్ని సందర్భాలలో సైన్యదళంతోను ఒక పక్షములోను, జమీందార్లు తమ ఆస్థాన సిబ్బందీతోను, పోలీసుతోను, ఇతర రక్షక సహాయులతోను, మరొక పక్షంలోను నిలిచి, యుద్ధానికి సిద్ధపడిరి. పరిపాలన విధానంలో సహకరించడానికి మారుగా, జమీందార్లు, ప్రభుత్వాన్ని చిక్కులలో పడవేయడానికి ప్రయత్నించిరి. రైతులతో తమకుగల వ్యవహార సంబంధాల విచారణకు వ్యతిరేకించి, రైతుల హక్కులను నిర్ణయించే ప్రయత్నానికి అడ్డు తగిలిరి. తమకోర్టులను దాటి, న్యాయానికై పైకోర్టులకు పోకుండా, రైతులకు నిర్బంధం కలిగించిరి. లంచగొండితనానికి, అధికారదుర్వినియోగానికి, ప్రోత్సాహం కలిగించడమేకాక, పరోక్షంగా, దౌర్జన్య చర్యలను జరిపిస్తూవచ్చిరి. జమీందారీ ప్రాంతాలన్నీ, దారి దోపిడిగాండ్ల తండాలకు, బందిపోటు దొంగల ముఠాలకు, ఆకరములై యుండినవి. ఉత్తర సర్కారు ప్రాంతాలలోని జమీందారులు, పదే పదే తిరుగుబాటు కావిస్తూ ఉండిరి.

ప్రభుత్వానికీ, ప్రజకూ, మధ్యగల అనుబంధాలు సడలిపోవడానికి, ఈ జమీందారీ విధానం మంచి సౌకర్యంగా ఏర్పడింది. ప్రభుత్వము నిర్ధరించిన శిస్తుమొత్తాన్ని జమీందారు క్రమంగా చెల్లిస్తూ ఉన్నంతకాలమూ, ప్రభుత్వం, అతనిని స్వేచ్ఛావిహారానికి వదలివేసింది. - "పశ్చాద్భూమిలో నిలిచియున్న కలెక్టరు ఒక దుర్దైవరూపంలో, అస్పష్టంగా గోచరిస్తున్నాడు. దైనందిన వ్యవహారాలలో అతనిని లెక్కపెట్టినవారే లేరు." అంతర్భాగంలోని సీమలలో ఆంగ్లేయాధికారులకు పరిచయజ్ఞానం లేకపోవడము, ప్రజలతో ప్రత్యక్ష సంపర్కాన్ని వారు కలిగించుకోకపోవడము కారణాలుగా, దేశాన్ని అధీనంలో ఉంచుకొనే సామర్థ్యం, ప్రభుత్వానికి సిద్ధించలేదు. కాబట్టి దాని అధికారం బలహీనమయింది.

ఈ విధానంలోని ఇతర అనానుకూలాలు కూడా త్వరలోనే బైటపడినవి. శాశ్వత పరిష్కారంతో ప్రభుత్వానికి చెల్లించేశిస్తు శాశ్వతంగా నిర్ధరింపబడినందువల్ల, ఆర్థిక పరిస్థితులు బాగున్నరోజులలో సిద్ధించే అధికోత్పత్తిలోభాగం, ప్రభుత్వానికి రావడంలేదు. ఈ అధికభాగమంతా జమీందారులు రైతులవద్దనుండి గ్రహించేవారు. ఇదిమొదటిలోపం. అత్యల్పసంఖ్యాకులైన జమీందారులను ఆదరించి, వారి పీడలకు లోనైయున్న రైతుల ప్రయోజనాలను పూర్తిగా అలక్ష్యంచేసింది ప్రభుత్వం. రైతుల విముఖతను, వారి అసంతృప్తిని, ప్రభుత్వం గమనించనూలేదు, వారిని అభిమానించనూలేదు. ఈ విషయం, మన్రో ఈవిధంగా వ్రాసినాడు. "ప్రభుత్వముయొక్క రాజస్వంలోని భాగాన్ని, ఈపన్నులను సమస్తమూ చెల్లించే రైతులకు ఇవ్వకుండా, స్వల్పసంఖ్యాకులైన జమీందారులకు, ముదేవాళ్లకు ఇవ్వడంవల్ల

దేశానికి లాభకరమౌతుందని భావించడం, అసాధారణమైన విషయం."

రీడ్, మన్రోలు ఇరువురూ, ఈశాశ్వత పరిష్కారంపై నిర్విరామంగా దాడిసాగించి, ఇతర ప్రాంతాలలో దీనిని వ్యాపింపచేయడం అసమంజసమైనదని, ఇంగ్లాండులోని అధికారులను ఒప్పించిరి. 1813 లో, కంపెనీకి నూతన ప్రపత్రాన్ని ప్రసాదించేముందు, దాని వ్యవహారాలను పరిశీలించడానికై ఏర్పాటుచేసిన సెలెక్టు కమిటీ [కామన్స్ సభలోనిది] రైతువారీ పరిష్కారానికి అనుకూలంగా నిశ్చయం కావించింది.

"ఒక పెద్దప్రాంతముయొక్క పరిష్కార సమస్యను దృష్టిలో ఉంచుకొన్నప్పుడు, ప్రజానీకముయొక్క శ్రేయస్సు మాత్రమే మన ఉన్నతాశయం కావలసి ఉంటుంది; తక్కిన విషయాలన్నీ వెనకపడవలసినదే," అని మన్రో, ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసినాడు. రైతువారీ పరిష్కారపద్ధతి మూలంగా, ఈ ఆశయం సిద్ధిస్తుందని మన్రో భావించినాడు. రైతువారీ పద్ధతిలో, ప్రభుత్వానికీ రైతుకూమధ్య వ్యవహారకర్త లేడుకదా, అనే ఆక్షేపణకు ఆయన ఈ విధంగా సమాధాన మిచ్చినాడు. "ఇండియాలోని రైతుపరిస్థితిని అర్థంచేసుకోకపోవడంవల్ల కాపించిన ఆక్షేపణ ఇది. ఇంగ్లాండులోని భూస్వామినీ, రైతునూ శాశ్వతంగా వేరుపరచిన విధంగా, ఇండియాలో వేరుపరచడం ఎన్నడూ జరగదు. ఆస్తి చిన్నచిన్న ముక్కలుగా విభక్తమైపోతూ ఉండడంవల్ల, ప్రతివాడూ రైతుగా మారిపోక తప్పదు. ఎక్కడో కొన్ని మాత్రం ఈవిధంగా కాకపోవచ్చు. భూస్వామికూడా తన భూములను తానే సాగుచేసుకోక తప్పదు. కాబట్టి, రైతునే భూస్వామిగా గ్రహించి, అతనినుంచి, ప్రభుత్వం స్వయంగా పన్నును వసూలుచేసుకోవలసి యున్నది. పన్నులు వసూలుచేసే రాజస్వాధికారికీ, రైతుకూ మధ్య వేరొకవ్యక్తి ఉండవలసిన అవసరమే లేదు. అట్టివ్యక్తులనే ఏర్పరచేపట్ల, జమీందారులను ఏర్పరచడం జరుగుతుంది. ఈ జమీందారులు కూడా కొంతకాలానికి, చిన్నరాజులుగానైనా సిద్ధిస్తారు, లేదా, రైతులుగా మారిపోతారు. కాబట్టి, "మరేవిధంగానూ సాధ్యంకాని ఎక్కువ శిస్తును నిర్ధారణచేసి, రైతులవద్దనుంచి వసూలుచేసి, ప్రభుత్వానికి చెల్లిస్తామని పూనుకొనే" జమీందారులనుకాని, ఇతర గుత్తేదార్లనుకాని, కల్పించవలసిన అగత్యమేలేదు."

దక్కనులో, శతాబ్దాలుగా నిలిచిఉన్న వ్యావసాయిక సంబంధాలను రైతువారీ పరిష్కారం, యథాతథంగా, శాశ్వతపరుస్తుందని భావించిరి. రైతుసాగిస్తున్న భూములపై అతనికిగల వ్యవసాయ స్వామ్యహక్కులను స్థిరపరచే ఉద్దేశం కలిగింది. కాని, ప్రభుత్వపు శిస్తును క్రమంగా చెల్లించే షరతుపై ఇది ఆధారపడుతుంది. ఈ పద్ధతివల్ల అతనిలో కూలి, రైతు, భూస్వామి, అనే స్వభావాలన్నీ కలిసిపోవడం జరుగుతుంది. ఇది, ప్రభుత్వానికీ రైతుకూ కూడా లాభకరమైన పద్ధతి. వ్యవసాయాన్ని విస్తృతిపరచడంవల్లను, ఉత్పత్తి కావించిన సరకుల ధరలు పెరగడంవల్లను, సిద్ధించే లాభంలో ఒక అంశం ప్రభుత్వానికి రాజస్వ రూపంలో లభిస్తుంది; తక్కిన భాగం రైతుకు మిగలడంవల్ల అతనికి లాభకరం. రైతు జనాభాయొక్క అభిమానాన్ని సంపాదించుకొని, వారిని బ్రిటిషు పరిపాలనకు ఆలంబనంగా నిలుపుకోవడం, ప్రభుత్వానికి సిద్ధించే వేరొక ముఖ్యప్రయోజనం. దీనివల్ల, కొంతమంది జమీందారులపై మాత్రమే ప్రభుత్వం ఆధారపడవలసిన అగత్యం కూడా తొలగిపోతుంది. బ్రిటిషు పరిపాలన సామర్థ్యం, సంతృప్తికరంగా జీవించే ప్రజానీకంపై ఎక్కువగా ఆధారపడింది కానీ, రైతులను పీడించి బాగుపడే కొందరు వ్యక్తులపై కాదని, ప్రభుత్వం గ్రహించ

వలసి ఉంటుంది. భావికాలపు వ్యవసాయాభివృద్ధికి కూడా, జమీందారీ పద్ధతి కంటె, రైతు వారీ పద్ధతే ఎక్కువ సుకరమైనది, ప్రయోజనకరమైనది. రైతుసాగుచేస్తున్న పొలంపై, అతనికి వంశపారంపర్యమైన హక్కులు స్థిరపడడంతోనే, అతడు వ్యవసాయాన్ని బాగుపరచ డానికీ, విస్తృతిచేయడానికీ, తన శక్తినీ తన మూలాధారాలనూ వినియోగిస్తాడని, ఈ పద్ధ తిని సమర్థించేవారు వాదించిరి. స్వంత ఆస్తి అనేది ఇంద్రజాలంవలె రైతు ఉద్యమాన్ని ప్రోత్సహించి, వ్యవసాయ ప్రమాణాన్ని వృద్ధిచేస్తుంది.

రైతు వారీ పద్ధతిని సమర్థించే వాదసారాంశాన్ని, మన్రో ఈ విధంగా వ్రాసి యున్నాడు. "పరిశ్రమలను పెంపొందించి, దేశంయొక్క ఉత్పత్తిని వృద్ధిచేయడానికికూడా, ఈ పద్ధతి అనుకూలిస్తుందని చెప్పవచ్చు. భూమిపై స్వామ్యంకల యజమానులను, వ్యవసాయ దారులను ఎక్కువచేసి, సామాన్యశ్రామికుల సంఖ్యను తగ్గిస్తుంది; జమీందారీ, ముఠేదారీ పద్ధతులలో ఇది జరగదు. భూమికి యజమానుడై ఉన్నప్పుడే, దానిని బాగుపరచుకోవలెననే ఉద్దేశం, రైతుకు కలుగుతుంది. కాని, జమీందారుకు కేవలం భాటకదారుడుగా ఉన్నప్పుడు ఇది కలుగదు. పన్నులను తక్కువచేసిన సందర్భంలో కలిగే లాభం పూర్తిగా, రైతుకే లభిస్తుంది; జమీందారీ పద్ధతిలో, రైతుకు కొంత మాత్రమే లాభించవచ్చు, ఏమీ లభించ కుండా కూడా పోవచ్చు. కాబట్టి, రైతువారీ పద్ధతిలో భూమిని బాగుపరచుకొనే శక్తి రైతుకు సిద్ధిస్తుంది. చిన్న పొలానికి యజమానియైన రైతు, తన పొలాన్ని చక్కగా నిర్వ హించుకోవడమేకాక, వ్యవసాయంకూడా, సమర్థతతో సాగించుకోగలడు; జమీందారుల ప్రయోజనానికంటె తన ప్రయోజనం ప్రధానమైనది కాబట్టి, వ్యవసాయంలో ఎక్కువ శ్రద్ధవహించి, ఎక్కువ కష్టించి, ఎక్కువ పంటను పండించుకొంటాడు. ఇప్పుడున్న సాగు బడి భూమి విస్తీర్ణం, ఇదే పరిమాణంలో నిలిచియున్నా కూడా, ఇది నాలుగైదు వందల భూస్వాముల చేతులలో ఉండడానికంటె, నలభై యాభై వేలమంది చిన్న రైతు యజమానుల చేతులలో ఉండడం, దేశానికి శ్రేయస్కరమైనట్టిది. పన్నులను తక్కువచేసిన సందర్భంలో కలిగేలాభం, సూటిగా, తక్షణమే, రైతుకు అందుతుంది కాబట్టి, ప్రభుత్వాదాయానికి ప్రధాన మూలాధారమైన రైతువర్గంవారి పరిస్థితులు బాగుపడడానికి అవకాశం కలుగుతుంది. దీనితో ఎక్కువ ఆహారధాన్యాలను వీరు పండించడము, తత్ఫలితంగా, ప్రజాసంఖ్య వృద్ధి చెందడం కూడా జరుగుతుంది. సాగుబడిలో ఉన్న భూమి విస్తీర్ణాన్ని బట్టి రాజస్వం ఒకప్పుడు పెరగడము, ఒకప్పుడు తగ్గడము, జరిగినా కూడా, రైతుకు కొంత విరామం లభిస్తుంది. కొన్ని సంవత్సరాల సరాసరి ఉత్పాదననుబట్టి శిస్తు నిర్ణయం జరగడంవల్ల, ప్రభుత్వానికి కూడా, నష్టం కలుగదు. రైతులు ధనవంతులయ్యేకొద్దీ, ఈ వ్యత్యాసం కూడా తగ్గుతూ వచ్చి, చెరువుల సాగుబడిలో ఉన్న పొలాలకు మాత్రమే, ఈ వ్యత్యాసం పరిమితమౌతుంది. సాగుకు రాని బంజరుభూమి సమస్తమూ ప్రభుత్వం చేతిలో ఉండడంవల్ల, రైతులపై కొత్త పన్నుల భారాన్ని మోపకుండా, ఆదాయాన్ని క్రమంగా వృద్ధిచేసుకొనే అవకాశం ఎంతైనా ఉంది. ఒక్క ఎకరాబీడు భూమిదేశంలో నిలిచి ఉన్నంతవరకూ, ప్రభుత్వానికి ఆదాయావ కాశం ఉండనే ఉంటుంది."

బెంగాలుతప్ప, తక్కిన ప్రాంతాలలోని పరిస్థితులలో రైతువారీ కట్టుబడి విధాన మొక్కటే సాధ్యమైనపద్ధతి. "ఇండియాలో చిరకాలంగా నిలిచిఉన్నది ఈవిధానమే; తక్కిన

దేదీ, శాశ్వతంగా నిలువజాలదు. నూతనపద్ధతులు, ప్రస్తుతం, ఎంతభిన్నమైనవిగా కనబడినా కడపటికి రైతువారీ విధానంగా మారిపోవడం తప్పదు. సార్వజనీనంగా జరిగే బాల్యవివాహాలు కొడుకులకందరికీ సమానంగా భూమిని పంచిఇవ్వడము, కొడుకులు లేనిసందర్భంలో దత్తు చేసుకోవడము, మొదలైన సర్వసామాన్యమైన ఆచారాలవల్ల, ఎంతపెద్ద భూఆస్తికూడా, చాలాకాలం ఒక కుటుంబంలో నిలిచిఉండదు. మూపేదారీ విధానంకంటె ఈపద్ధతి సరళమైనదికూడా. భూములను విభజన కావించకుండా నిలపడానికై, కృతకములైన ఎట్టి నిర్బంధాలనూ చేయవలసిన అవసరంకూడా లేదు; ఇట్టి నిర్బంధాలు, దేశాచారాలకు, వారసత్వ సంబంధములైన న్యాయసూత్రాలకు విరుద్ధమైనవికూడా. అంతేకాక, చిన్నవీ పెద్దవీఐన అన్నివిధములైన పొలాలుకూడా రైతువారీ పద్ధతికి అనుగుణమైనట్టివే." అని మన్రో వివరించినాడు.

అనేకులైయున్న జమీందారుల స్థానంలో ప్రభుత్వము అనే ఒక్క జమీందారును మాత్రమే నిలపడం రైతువారీ విధానముయొక్క విస్పష్టమైన లక్షణం; జమీందారీ పద్ధతి నుంచి దీనిని వేరుపరచేదికూడా ఇదే. ఏకైకమైన భూస్వామిగా నిలిచిన ప్రభుత్వముతో, రైతులకు ప్రత్యక్ష సంబంధాలు ఏర్పడినవి. భూమిపై శ్రమించే రైతులకు, దేశాన్ని పరిపాలించే అధికారులకు, మధ్యఎట్టికార్యకర్తలూలేకుండాచేసింది, ఈవిధానం. రైతుసాగుబడిలో ఉన్న పొలంపై, అతనికి సర్వసామాన్యమైన హక్కు కలదనే విషయాన్ని ఈ విధానం గుర్తించింది.

రైతువారీ విధానంవల్ల ప్రభుత్వానికీ ప్రజలకూ మధ్య సన్నిహిత సంబంధాలు ఏర్పడినవి. అధికారులు, స్వయంగా ప్రతి పొలం యజమానివద్దనుంచీ శిస్తులు వసూలు చేయవలసిందని శాసించియుండడం దీనికి హేతువు. ప్రతి పొలాన్నీ కొలిచి, సర్వేజరిపి, అవధులను ఏర్పరచి, వాటికిగుర్తులుగా నంబరురాళ్ళను ఏర్పరచడం, ఆవశ్యకమయింది. పొలాలకు గ్రామాలకు, తాలూకాలకు, సర్వేపటాలను తయారుచేయడానికి, సర్వేయర్ జెనరల్‌శాఖ అంతా పూనుకొన్నది.

ప్రతి పొలానికీ శిస్తును నిర్ధరించేముందు, సర్వేచేయడం ప్రాథమికచర్య. రైతుచెల్లించవలసిన శిస్తునిర్ణయం, ఉత్పత్తి పరిమాణంపై ఆధారపడుతుంది. తరీభూములు, ఖుష్కీభూములు, వ్యవసాయభూములు, తోటలు, మొదలైన భూమి వర్గీకరణము, ఇండ్లు, చెట్లు, చెరువులు, నదులు, నల్లాలు (చిన్నకాలువలు), కొండలు, రస్తాలు, బంజరుభూములు, బావులు, స్మశానాలు, మొదలైనవి ఆక్రమించిన విస్తీర్ణాలు, వాటికి సంబంధించిన ఇతర వివరాలు; మొదలైనవాటిని సేకరించిన పిమ్మటనే, ఉత్పాదనను నిశ్చయించడం సాధ్యమౌతుంది. ఉత్పాదనను అంచనా వేసిన తర్వాత, పరిష్కారంజరిగి, ప్రభుత్వానికీ రైతుకూ సంబంధించిన పట్టా వ్రాయడం జరుగుతుంది.

ఈవిధంగా నిర్ణయమైన శిస్తుమొత్తాన్ని ప్రతిరైతువద్దనుంచీ వసూలుచేసే విస్తారమైన ప్రక్రియ, రైతులకు ప్రభుత్వంతో సన్నిహిత సంబంధాన్ని కలిగిస్తుంది. సర్వేలు, పరిష్కారాలు. ప్రతిసంవత్సరమూ, పరిశీలనకు, మార్పులకు లోనౌతాయి అనే విషయాన్నిబట్టి, పరిపాలన, ప్రజలకెంత సన్నిహితమైయుండి, సూక్ష్మ వివరాలను గ్రహిస్తుందనే స్వభావం, వ్యక్తమౌతుంది.

మదరాసు, బొంబాయి రాజధానీలలో ప్రవేశపెట్టిన రైతువారీ విధానం, ఈ ప్రాంతాలలో ప్రాచీనకాలంనుంచీ ఆచరణలో ఉండిన ఇండియా పద్ధతికి దగ్గరగా ఉన్నదని అభిప్రాయపడిరి. కాని, వాస్తవంగాచూస్తే, బెంగాలు జమీందారీ విధానానికి ఇది ఎంత విభిన్నమైనదో, ప్రాచీన వ్యవహారాలను, ఆచారాలను కూడా అంత విభిన్నమైనదే. ఈనూతన విధానం, భూమివిషయంలో స్వంతఆస్తిని సృష్టికితెచ్చింది; గ్రామజీవితంలోని సంయోజనను, ఐక్యతను నాశంచావించింది; రాజస్వాన్ని వసూలుచేసే అధికారుల దయారహితమైన పీడన చర్యలకు రైతులను గురిచేసింది. క్షామపరిస్థితులు ఏర్పడి, పంటలుపండక, పన్నులు చెల్లించడానికి రైతుకు మూలాధారాలు లేని సంవత్సరాలలో కూడా, ఈ అధికారులు రైతులను బాధించి, పన్నులు వసూలుచేసేవారు.

కడపటి మరాఠాయుద్ధంలో హేస్టింగ్సుకు సిద్ధించిన విజయాలవల్ల, గంగానదీలోయ ప్రాంతం బ్రిటిష్ పరిపాలనలోనికి వచ్చింది. ఆ తర్వాత పంజాబును, ఔధ్, నాగపూర్, ప్రాంతాలను, తమ రాజ్యంలో చేర్చుకోవడంతో ఇండియాలోని బ్రిటిష్‌రాజ్యం పూర్తి అయింది.

దీనితో, ఈ ప్రాంతాలలోని భూములను పరిష్కరించవలసిన అవసరం ఏర్పడింది. బెంగాలు జమీందారీపద్ధతిలోని కొన్ని అంశాలను, రైతువారీ విధానంలోని కొన్ని అంశాలను గ్రహించి కల్పించిన నూతన పద్ధతులను ప్రయోగించి చూచినారు. వీటిలోకొన్ని స్వతంత్రములైన అంశాలుకూడా చేరినవి.

పశ్చిమోత్తర ప్రాంతాలని, ఆనాడు వ్యవహారంలోఉన్న గంగానదీ లోయప్రాంతంలో [నేటి ఉత్తరప్రదేశ్] రాజస్వాన్ని వసూలుచేయడానికి, గ్రామాన్ని ఒక ఏకాంశంగాగ్రహించి ప్రభుత్వం ఆగ్రామంతో ఒప్పందం కావించుకొంది. హోల్ట్ మెకెంజీ సలహాను అనుసరించి, జారీచేసిన 1822 నాటి, వినియమం ఆధారంగా, గ్రామ రాజస్వపద్ధతి అమలు జరిగింది. భూములను సాగుచేసే వ్యక్తులతోకాక, సమగ్రమైన గ్రామ సంస్థతో శిస్తుకరారును ప్రభుత్వం చేసుకోవడం, ఈవిధానంయొక్క ప్రధానలక్షణం. ప్రతిగ్రామానికీ మొత్తంగా శిస్తును నిర్ణయించి, బాధ్యతగల గ్రామస్థులద్వారా, దానిని ప్రభుత్వానికి చెల్లించేటట్లు, గ్రామంపైబాధ్యత మోపింది ప్రభుత్వం. తాము సాగుచేస్తున్న పొలాల శిస్తులను, పరస్పర అంగీకారంతో, ఆయా రైతులు వేర్వేరుగా తమ గ్రామప్రతినిధికి చెల్లించేవారు. ఈశిస్తుల వరుసను కాలావధులలో మార్చేవారు; కాని, అది సాధారణముగా ముప్పేండ్లకొకసారి జరిగేది. ప్రభుత్వంతో వ్యవహారంజరిపే ప్రతినిధి, గ్రామముకద్దమ్. రిజిస్టర్లనూ, లెక్కలనూ తయారుచేసే పట్వారీ ఇతనికి సహాయకుడుగా ఉండేవాడు. ఆయాకాలావధులలో జరుగవలసిన పరిష్కారాలను కలెక్టరు, తహసీల్దారు, నిర్వహించేవారు. ఈ విషయంలో, కానుంగో, పట్వారీ, గ్రామస్థులు తెలియజేసే విషయాలపై వీరు ఆధారపడేవారు.

ఈ విధంగా, కాలావధులలో జరిగే పరిష్కారాల కారణంగా, ప్రజలకు ప్రభుత్వాధికారులతో సంపర్కం ఏర్పడింది. కాని, శిస్తు పరిష్కారం వ్యక్తులతోకాక, మొత్తం గ్రామంతో ఏర్పడినందువల్ల గ్రామ సంస్థయొక్క వ్యవస్థకు భంగంకలుగలేదు.

పంజాబు ప్రాంతంలో, కొంతమార్పుతో కూడిన మహల్ వారీ పద్ధతిని ప్రవేశపెట్టిరి. జాన్‌లారెన్స్ వివరించిన ప్రకారం, "పొలం యజమానులు ప్రభుత్వంతో స్వంతంగా శిస్తు

పరిష్కారం కావించుకోలేదు; మొత్తం గ్రామంతో ఈ పరిష్కారం ఏర్పడింది. గ్రామంలోని భ్రాతృత్వం గ్రామ ముఖ్యుని ద్వారా, లేదా, గ్రామ ప్రతినిధి ద్వారా శిస్తు మొత్తాన్ని, కొన్ని సంవత్సరాలదాకా చెల్లించడానికి అంగీకరించి, ఆ మొత్తాన్ని తమ భూములనుబట్టి విభజించు కొనేవారు. ప్రథమంలో, తన పొలాన్ని తానే సాగుచేసుకొని శిస్తులోని తన భాగాన్ని చెల్లించే వాడు. కాని, పర్యవసానంలో, తన సహచరుల శిస్తు బాధ్యత ఇతనిపైనా, ఇతని శిస్తు బాధ్యతవారిపైనా, ఉండేది. ఈ విధంగా గ్రామంలోనివారంతా ఉమ్మడిగా, ప్రభుత్వ రాజస్వానికి బాధ్యత వహించేవారు.

*పౌర పరిపాలన,- న్యాయపరిపాలన :* కారన్‌వాలిస్ తర్వాత వచ్చిన గవర్నర్ జెనరల్‌లు, హక్కుల తీర్మానానికి ప్రాధాన్యం ఇవ్వడానికి మారుగా, దేశంలో క్రమ వ్యవస్థను నెలకొల్పడానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చిరి; వ్యక్తిగతమైన న్యాయాన్ని ప్రవర్తింపచేయడానికి బదులుగా, వ్యక్తుల స్వంత వివేచనకు ప్రాధాన్యం కలిగించిరి; శివిల్ పరిపాలనకు మారుగా, మిలిటరీకి సంబంధించిన క్రమశిక్షణకు ప్రాధాన్యం కల్పించిరి. తత్ఫలితంగా, అధికారాధిపత్యం సమస్తమూ ఒకచోట కేంద్రీకరించి, మిలిటరీ క్రమశిక్షణకు సదృశమైన పరిస్థితి దేశంలో ఏర్పడింది.

జిల్లాకు సంబంధించిన దండనీతిని, పోలీస్ ఆధిపత్యాన్ని, న్యాయాధిపతి-దండనాధి కారిలో, కారన్‌వాలిస్ నిహితంకావించి ఉండినాడు; రాజస్వాన్ని వసూలుచేసే అధికారాన్ని కలెక్టర్‌కు విధించి ఉండినాడు; రాజస్వ పరిషత్తును కలకత్తాలో నెలకొల్పి ఉండినాడు. 1329 లో, కమీషనర్ పదవిని సృష్టించి, అతనికి విస్తృతమైన అధికారాలను ఇవ్వడంతో, కారన్‌వాలిస్ విధానానికి భంగం కలిగింది. దేశంలోని వేర్వేరు భాగాలు వేర్వేరు కమీషనర్ల ఆధిపత్యంలో నిలిపినారు. కలెక్టర్ల కార్యక్రమాలను పర్యవేక్షించడము, న్యాయాధిపతుల పరిపాలనపైనా, దండనాధికారుల పరిపాలనపైనా, పోలీసు అధికారులపైనా విచారణ జరపడము, ఇతని కర్తవ్యాలుగా నిశ్చయింపబడినవి. సెషన్ న్యాయాధీశుని కర్తవ్యాలు, ప్రాంతీయ అప్పీలు న్యాయాలయాల కర్తవ్యాలు ఇతని అధికారానికి బదిలీచేయడంతో, కమీషనరు, ఒక న్యాయపరిపాలన అధికారిగా సిద్ధించినాడు. ప్రాంతీయ రాజస్వ పరిషత్తులు, ప్రాంతీయ అప్పీలు న్యాయాలయాలు, రద్దుకావింపబడినవి.

కమీషనరు సంస్థాపన ఖర్చులు అమితమై ఉండడాన్ని గమనించి, రెండేండ్ల తర్వాత, మళ్ళీ మార్పులు కావించిరి. కమీషనర్ దండనాధికార పరిధిని ఒకజిల్లా న్యాయాధిపతికి బదిలీ చేసి, న్యాయాధిపతియొక్క దండనాధికార కర్తవ్యాలను కలెక్టరుకు అప్పగించిరి. ఈ విధంగా 1831 నాటికి, న్యాయపరిపాలనశాఖ పరిపాలన వ్యవస్థలో ప్రత్యేకంగా, నిలిచిఉన్నా, కార్య నిర్వాహకశాఖను "శ్రేణీబద్ధమైన ఒక ఆధిపత్యంగా సంయోజన పరచిరి." దండనాధికారము, పోలీసు అధికారము, భాటక రాజస్వాలకు సంబంధించిన న్యాయపరిపాలనాధికారము,- ఈ మూడు అధికారాలూ కలెక్టరులో నిలిచినవి. ఇతనికి సహాయంగా, శ్రేణీబద్ధమైన ఉద్యోగ వర్గాన్ని నియమించిరి

ఈ విధంగా, అధికార వర్గీకరణము, పరిషత్తుల ద్వారా నిర్వహించే సమష్టిబాధ్యత, అనే పరిపాలనాభిప్రాయాలను విసర్జించి, సర్వాధికార సంయోగము, ప్రత్యేక వైయక్తిక బాధ్యత అనే పితృప్రాయ పరిపాలన సూత్రాలను అవలంబించిరి. "ప్రాంతీయ కమీషనరు,

జిల్లా అధికారి, అనేవారితో కూడిన ద్వంద్వసంస్థను శాశ్వతంగా ఏర్పరచడంతో, కారన్ వాలిస్ విధానం మార్పుచెందింది. ఈవిధంగా ఏర్పడిన నూతన వ్యవస్థ, బ్రిటిషు వలస రాజ్యాల భావిపరిపాలనకు సాంప్రదాయిక ఆదర్శంగా ఏర్పడింది."

న్యాయపరిపాలనశాఖకు గల ప్రాధాన్యాన్ని గుర్తించినప్పటికీ, ఇదివరకూ దానికి సిద్ధించియుండిన పరమాధిపత్యాన్ని తగ్గించిరి. న్యాయపరిపాలన వ్యవస్థ విషయంలో జరిగిన మార్పు ఇది. 1793 తర్వాత, జరిగిన ముఖ్యమైన మార్పుల ప్రభావం, పరిపాలన వ్యవస్థకు చెందిన అన్నివర్గాలకూ వ్యాపించింది. మండలిలోని గవర్నర్ జెనరల్ అధీనమైయుండిన సదర్ దివానీ అదలత్, సదర్ నిజామత్ అదలత్‌లు, 1801 లో, అతని అధికారంనుంచి వేరైనవి. ఒక ముఖ్య న్యాయమూర్తితోను, కంపెనీ విశిష్టోద్యోగ వర్గంనుంచి ఏరుకొన్న ముగ్గురు న్యాయాధిపతులతోను, సదర్ దివానీ అదలత్ 1801లో, క్రొత్తరూపాన్ని పొందింది. ప్రాంతీయ అప్పీలు న్యాయస్థానాలను 1831లో, రద్దుచేసి జిల్లా న్యాయస్థానాల అధికారాలను పెంచిరి. 5000 రూపాయలకు మించిన అభియోగ మూలములున్న వ్యాజ్యాల విచారణను జరపడానికీ, సదర్ అమీనుల న్యాయాలయాలనుంచి వచ్చిన అప్పీలులను పరిశీలించడానికీ, గల అధికారాలు జిల్లాన్యాయస్థానాలకు సిద్ధించినవి. వీటితీర్పులపై, సదర్ దివానీ అదలత్‌కు అప్పీలు చేసుకొనే అవకాశమున్నది. దండనీతికి సంబంధించిన పరిపాలనవ్యవస్థలో, ప్రధాన సదర్ అమీన్, మున్సిఫులు, సదర్ అమీనులు, దండనాధికారులు, వారి అధీనోద్యోగులు,- అపరాధులుగా నిర్ణయింపబడిన వారిపై శిక్షవిధించే అధికారం వహించిరి.

సివిల్‌వ్యవహారాలకు, దండనీతి ఫిర్యాదులకు సంబంధించిన అభియోగాల విచారణలో దేశీయులైన, పాంచ్‌లను, అసెసర్లను, జూరర్లను సహాయకులుగా తీసుకోడానికి, 1832 లో అనుమతి లభించింది. కాజీలను, ముఫ్తీలను న్యాయవిచారణలో సహాయకులుగా తీసుకొనే అవసరం పోయింది. అందులోనూ, ముస్లిము మతేతరులకు ముస్లిము న్యాయశాస్త్రం వర్తించడంలేదు కనుక, వీరి ఆవశ్యకంలేదు.

పోలీసు వ్యవస్థలో కూడా కొన్ని మార్పులు జరిగినవి. తమ జీవనోపాధికై జమీం దారులపై ఆధారపడియుండిన గ్రామీణచౌకీదార్లు, తమ కర్తవ్య నిర్వహణంలో, ఠాణాల దరోఘాలకు బాధ్యులైఉండిరి. కాని, ఈ కర్తవ్యాలను నిర్వహించడానికి వీరు సమర్థులు కారని వ్యక్తమయింది; అపరాధాలను, దౌర్జన్యాన్ని, వీరు అణచ లేకపోయిరి. దోపిడీ దొంగల ముఠాలు గ్రామసీమలలో దౌర్జన్యాలు జరుపుతూ, ప్రజలను బాధిస్తూవచ్చినవి. దరోఘాలకు సహాయకులుగా, గౌరవనీయులైన వ్యక్తులను అమీనులుగా నియమించే ప్రయత్నం జరిగింది; కాని వేతనం లేకుండా పని చేయవలసినవారు ఈ వ్యక్తులు. అంతతో, ఈ పద్ధతి క్రమంగా నశించిపోయింది. జమీందారుల అధికారాధిపత్యాలను ఇదివరకే తీసివేయడం జరిగింది. కాబట్టి అపరాధ పరిశోధన, అపరాధ చర్యల నిరోధము, మొదలైన కర్తవ్యాలను వహించడానికి వారు నిరాకరించిరి. స్వార్థ ప్రయోజన రహితమైన ఈ కర్తవ్యం, వారికి రుచించలేదు. ప్రాంతీయ పోలీస్ సూపరింటెండెంటు పదవి, 1808 లో, సృష్టికి వచ్చింది; కాని, 1829లోనే ఇది రద్దుకావింపబడింది. ఆ పైన, ఈ కర్తవ్యాలను కమీషనర్లపై మోపింది ప్రభుత్వం. రెండు సంవత్సరాల తర్వాత, జిల్లాకలెక్టర్-దండనాధికార్లు, పోలీసు బందోబస్తుకు సంబం ధించిన వ్యవహారాలను పర్యవేక్షించే బాధ్యతను వహించిరి. అపరాధ దౌర్జన్య నిరోధక

కర్తవ్యాలను కార్యరూపంలో నిర్వహించే వారు జిల్లా పోలీసు సూపరింటెండెంట్లు; దరోఘాలు వీరికి సహాయకులు.

సైన్యవ్యవస్థ : రాజ్యం విస్తృతి చెందడంవల్ల కార్యనిర్వాహకశాఖను బలపరచ వలసిన ఆవశ్యకం ఏర్పడింది. కాని, తగినంతమంది ఆంగ్లేయులు ఇండియాలో లేకపోవడం వల్ల, అధీనోద్యోగాలకు, దేశీయులను, అధికసంఖ్యలో, నియమించవలసివచ్చింది. ఈ కారణాల వల్లనే, సైన్యాన్ని కూడా పెంచవలసిన అవసరం సిద్ధించింది. సైన్యము నిర్వహించిన కర్తవ్య ధర్మాలను హేస్టింగ్సు ఈ విధంగా వివరించి ఉన్నాడు;-

1. ప్రజలలో ఏ విధమైన ఉద్రేకము రాకుండా జాగ్రత్తవహించడము; సివిల్ అధి పత్యానికి సకాలంలో తోడ్పడడానికై దేశమంతటా సైనిక స్థావరాలను స్థాపించి ఉంచడము;

2. బ్రిటిషు రక్షణలో ఉన్న దేశీయరాజులకు, ప్రజల సంక్షోభాలవల్ల అపాయం కలుగ కుండా, రాజులకు సహాయ పడడము;

3. ప్రయాణ మార్గాలలో దోపిడిదొంగలు, బందిపోటు ముఠాలు లేకుండా చేయడము; వర్తకులకు రక్షణ కలిగించడము;

4. సైన్యాల నుంచి తీసివేసిన, అసంఖ్యాకులైన దేశీయ సైనికులకు ఉద్యోగావ కాశాలు కలిగించడము;

5. స్వతంత్రులైయున్న ఔధ్, పంజాబ్, గ్వాలియర్ రాజుల సైన్య శక్తులకు సమ తూకంగల సైన్యశక్తిని సిద్ధపరచడము.

ఇంగ్లాండులోని రాజసైన్యంలో నుంచి తగినంత సేనాబలాన్ని ఇండియాకు కొని రావడం సాధ్యముకానిపని. నెపోలియన్ యుద్ధాలు ఇంకా జరుగుతూ ఉండడంవల్లను, యూరోపుఖండమంతా సంక్షోభాత్మకమై ఉండడంవల్లను, ఆదేశాలలో నిలిచియున్న బ్రిటిషు సేనలలోని సైనికదళాలను ఇండియాకు పంపడం సాధ్యంకాదు. అంతేకాక, అతి వ్యయంతో కూడిన పాశ్చాత్య సైన్యాలను భరించడానికి కంపెనీ ఇష్టపడక పోవడం ప్రధాన కారణం. పాశ్చాత్యసేనా దళాలను ఇండియాలో నిలిపి, తమపై వాటి ఖర్చులను మోపుతున్నారని కంపెనీవారు బ్రిటీషు ప్రభుత్వానికి, నిరంతరంగా, మొరపెట్టుతూనే ఉన్నారు.

సైన్యాన్ని భర్తీచేసుకొనే విషయంలో, ఇండియాలోని పరిస్థితి చాల అనుకూలమైనది. మంచి యోగ్యతకల సైనికులకు ఇండియాదేశం గొప్ప ఆకరమై ఉంది. ఆయుధమే వృత్తిగా గల కులాలవారు, జనజాతులవారు, వీరిలో అధిక సంఖ్యాకులు. పరాజితులైన ఇండియా రాజుల సైన్యాల నుంచి బైటపడిన సైనికులు కూడా, దేశంలో అనేకులున్నారు. వీరందరూ, ధైర్యశాలులైన యోధులు; సహనశీలురు; క్రమ శిక్షణకు, తరిఫీదుకు లొంగి ఉండేవారు. తమకు అన్నంపెట్టేవారిని భక్తివిశ్వాసాలతో సేవించడం వీరి సంప్రదాయం. కాబట్టి, తమ కర్తవ్యాలపట్ల, భక్తి శ్రద్ధలను పాటించడంలోను, అధికారుల ఆజ్ఞలకు విధేయులై ప్రవర్తిం చడంలోను, ఏవిధమైన మానసిక ఘర్షణలూ లేనివారు. వీరి ఆశించే వేతనాలుకూడా స్వల్ప మైనవే.

కారన్‌వాలిస్, పదవినుంచి విరమించుకొనే సమయంలో సైన్యసంఖ్య 70,000. వీరిలో 13,500 మంది బ్రిటిషువారు. 1826 నాటికి, సైన్యసంఖ్య 281000 మందికి అభి వృద్ధిచెందింది. వీరిలో కంపెనీ సేనలకు చెందిన ప్రాశ్చాత్యులు 10,541 మంది; ఇంగ్లాండు

రాజసేనకు చెందినవారు 22000 మంది ప్రాశ్చాత్యులు. 1857 నాటి విప్లవానికి పూర్వం, బ్రిటిషు ప్రభుత్వసైన్యం, 3,11,374 మందితో ఏర్పడినట్టిది. వీరిలో 45,322 మంది ప్రాశ్చాత్యులు. ఈ క్రింది వేతన వివరాలనుబట్టి, ఇండియా సిపాయి ఎంతచౌకగా లభించి నాడో స్పష్టమౌతుంది. నెలకు 7 రూపాయలు మాత్రమే అతనికి లభించేజీతం. కమీషన్ పదవిలేని ఇండియా సేనాధికారులకు లభించేజీతం 25 నుంచి 67 రూపాయలకు లోబడినది. 1856 లోని దేశీయసైన్యం, 2,75000 మందితో ఏర్పడినట్టిది. వీరందరికోసమూ, నెలకు 300 రూపాయల జీతంకల దేశీయ సైన్యాధికారులు ముగ్గురు మాత్రమే.

కారన్‌వాలిస్ అవలంబించిన ఇండియా ప్రతికూల విధానానికి, సైన్యవ్యవస్థలో అత్యంతమైన అవకాశం లభించింది. 1794 తర్వాత, దేశీయ సైన్యదళాలకు పాశ్చాత్య అధికారులనుకూడా చేర్చడం జరిగింది. 1790-1796 ల మధ్యకాలంలో, సైన్యసంస్థను పునః వ్యవస్థీకరించడం జరిగింది. ఈమార్పును అనుసరించి, పాశ్చాత్యసైనికుల సంఖ్య అధికమయింది. ప్రతి సిపాయిదళానికీ తొమ్మిదిమంది పాశ్చాత్య సేనాధికారులు నియమితులైరి. 1848 లో, 750 - 750 మంది సిపాయిలతో ఏర్పడిన ప్రతిసేనాదళానికీ, సహాయకులుగా 24 మంది పాశ్చాత్య అధికారులను చేర్చడం జరిగింది. అట్లే, ప్రతిదేశీయ అశ్వికదళానికీ ఇరవైమంది పాశ్చాత్యాధికారులను చేర్చిరి. 1826 నాటికి, సైన్యాధికారం వహించగల అవకాశం దేశీయులకు లేకుండాపోయింది. ఒక దేశీయ రిసల్దార్, ఈక్రిందివిధంగా ఘోషించడం, సర్ హెన్రీలారెన్స్ విన్నాడు;- "ఏవిధమైన ఆశా, లేనివారమై బ్రతుకుతూ, చచ్చిపోతున్నాము," ఇది అతని ఆక్రోశము. ఇండియా సేనాధికారులను తొలగించియుండడం శోచనీయమైనదని, కల్నల్ వెల్లెస్లీవంటి ఉన్నతాధికారికూడా తన అయిష్టాన్ని తెలిపియున్నాడు. [తర్వాతి కాలంలో ఇతడే డ్యూక్ ఆఫ్ విల్లింగ్టన్.]

*బ్రిటిషు పరిపాలనయొక్క అర్ధసైన్య స్వభావం :* ఇండియాదేశ ప్రభుత్వాన్ని నిర్వహించడంలో సైన్యప్రవృత్తి బాహ్యంగా ప్రత్యక్షంకాకపోయినా, అతి ప్రధానమైన పాత్ర వహించింది. ఇది, బ్రిటిషు పరిపాలనయొక్క సాధారణ స్వభావానికి అనుగుణమైనదే. క్రొత్తగా జయించి చేర్చుకొన్న రాజ్యాల ఆధిపత్యాన్ని, పరిపాలనను సైన్యాధికారులకు అప్పగించియుండడం, అప్పటి సందర్భాలను బట్టి ఊహించతగిందే. అదేవిధంగా, పంజాబ్ సింధ్ ప్రాంతాలను, ఇంతకు పూర్వమే జయించిన దత్తమండలాలను, సైన్యాధికారుల ఆధిపత్యంలో ఉంచడం కూడా ఆశ్చర్యకరమైన విషయంకాదు. కాని, పౌరవ్యవహారాలకు సంబంధించిన పరిపాలన శాఖలను సైన్యాధికారుల ఆధిపత్యంలో ఉంచి యుండడం విచిత్రమైన విషయం. ఇండియాలోని దేశీయ రాజ్యాల వ్యవహారాలను నిర్వహించే రాజకీయశాఖ, చాల భాగం మిలిటరీ అధికారుల ఏకస్వామ్యమైపోయింది. ప్రభుత్వ ప్రతినిధి పదవులు, ప్రభుత్వకార్యభార స్థానాలు, వారి ప్రత్యేక పరిరక్షణ స్థానములైపోయినవి.

సైన్యముయొక్క అలంబనంపై ఎక్కువగా ఆధారపడిన మరియొక ప్రభుత్వశాఖ, పోలీసు. పౌర సంబంధములైన కల్లోలాలను అణచడానికై సైన్యాన్ని ఉపయోగించే పద్ధతిని ఖండిస్తూ, ప్రభుత్వం ఆదేశాలను జారీచేసి ఉండినాకూడా, దండనాధికారులు, సైన్యాన్ని పిలిపించడం ఆపివేయలేదు. సైన్యం నిర్వహించవలసిన పోలీసు కర్తవ్యాలు ఎక్కువౌతూ వచ్చినందువల్ల, సైన్యంలోని సగం భాగంకూడా, తమ స్థావరాలలో శాశ్వతంగా నిలిచి

యుండేదికాదు. సైన్యస్థావరాల సంఖ్య పెరిగిపోయింది; ఆశ్రిత స్థావరాలు కూడా సైనికులచే ఆక్రమించబడినవి. ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి తరలించుకొనిపోయే ప్రభుత్వ కోశాన్ని సైనికులు అనుసరించేవారు; అట్లే, కలకత్తా నుంచి ఇతర నగరాలకు రవాణాచేసే సామగ్రినికూడా, వీరే అనుసరించి పోవలసివచ్చింది. ఖైదీలను కూడా తమ అధీనంలో నిలుపుకోవలసివచ్చింది. బెంగాలులోని పోలీసుశాఖలో "ప్రాంతీయ సైన్యదళాలను" చేర్చి ఉంచడం కూడా జరిగింది. బెంటింక్ వచ్చి ఈ పద్ధతిని అంతం కావించినాడు. బొంబాయి రాజధానిలోని ఉత్తరదక్షిణ ఖాందేశ్‌లో, సైన్య రక్షకశాఖను నిలిపియుంచిరి. పంజాబు ప్రాంతంలో, 8100 మంది సైనికులను పోలీసు కర్తవ్యాలను నిర్వహించడానికై ఉపయోగించినారు. వీరిలో, రెండుభాగాలు పదాతిసైన్యము, ఒకభాగం అశ్వికదళము. సింధుప్రాంతంలో కూడా పోలీసు కర్తవ్యాలకు సైన్యాన్ని ఉపయోగించడం జరిగింది.

ఈ ఆవశ్యక ప్రభుత్వ విభాగాలు మాత్రమే కాక, అనేకములైన ఇతర కర్తవ్యాలను కూడా సైన్యంపై మోపడం జరిగింది. సర్వే విభాగాన్ని ఏర్పరచి భూరాజస్వాధికారులకు సర్వే ప్రక్రియను నేర్పినవారు సైనికోద్యోగులే. సంచార వ్యవస్థ, ప్రాథమికంగా మిలిటరీ బాధ్యతకాబట్టి, సైన్యమే రహదారులను రైలుమార్గాలను, నిర్మించింది. పంజాబులోని రహదారి వ్యవస్థసమస్తమూ, సిక్కులను కనిపెట్టి ఉండడానికై, ప్రథమోద్దేశంగా నిర్మింపబడింది. బ్రిటిష్‌రాజ్య రక్షణమే ముఖ్యోద్దేశంగా, డల్‌హౌసీ, గ్రాండ్‌ట్రంక్ రోడ్డును, లాహోరునుంచి పెషావర్‌దాకా విస్తరింపచేసినాడు. ఈస్టిండియా రైలుమార్గ నిర్మాణాన్ని ఒక కంపెనీకి అప్పగించి, వారికి లాభవిషయమై హామీఇస్తూ, ప్రభుత్వం తమసేనలను, సేనా సామాగ్రినీ రవాణాచేసే కార్యానికి, ప్రథమ ప్రాధాన్యం ఇచ్చేటట్లు కంపెనీచే, కరారు కావించుకొన్నది. సైన్యరాజకీయాలదృష్ట్యా, పశ్చిమోత్తర రైలుమార్గం అత్యంతమూ ముఖ్యమైనదిగా భావింపబడింది. ప్రభుత్వముయొక్క ఉద్దేశం విస్పష్టంగానే ఉండడంవల్ల, దీనిని గురించి, విస్తృతంగా చెప్పనక్కరలేదు. సామ్రాజ్య సంయోజన పరిరక్షణ సైన్యముయొక్క ప్రహారశక్తి,- ఈరెండూ పూర్తిగా సంచారమార్గాలపై ఆధారపడి యున్నవి.

ఆరోగ్య స్వాస్థ్యరక్షావిషయము, అడవుల ఉపయుక్తత, నీటిపారుదల విధానాభివృద్ధి, పౌరనిర్మాణాల నిర్వహణము,- మొదలైన కార్యక్రమాలలో కూడా సైన్య సహాయాన్ని తీసుకొంటూవచ్చిరి. భూరాజస్వపరిపాలన విషయంలోకూడా, సైన్యాధికారుల సహాయాన్ని ఉపయోగించుకొన్నారు. అనేక సందర్భాలలో, వీరిని, శిస్తు ఇజారాదార్లగా హేస్టింగ్సు ఉపయోగించుకొన్నాడు. రైతువారీ పరిష్కార విధానాన్ని నిర్మించినవారు రీడ్, మన్రోలు. దక్కనులో, ఈపరిష్కారాలను నిర్వహించినవారు, రాబర్ట్‌సన్, బ్రిగ్స్, పాటింజర్, విన్‌గేట్, బార్‌వెల్, సైక్స్, అనే సేనాధికారులు. సింధులో యీకార్యాన్ని జేకబ్ నిర్వహించెను. సేనాధికారులను ఈపనులలోనియమించడం ప్రభుత్వానికి ఇష్టంలేకపోయినా, వారిని ఉపయోగించుకోవడం తప్పలేదు. పంజాబ్, సింధ్, మధ్యప్రదేశ ప్రాంతాలలో శిస్తు వసూలుచేసే బాధ్యత అంతా వీరిపై మోపడం జరుగుతూనే వచ్చింది.

బ్రిటిషు ప్రభుత్వముయొక్క అర్ధసైన్య స్వభావం, పరిపాలన వ్యవస్థలో వారుచేసిన ఈ ఏర్పాట్లవల్ల స్పష్టంగా వ్యక్తమౌతుంది. ఈ విషయమై, డ్యూక్ ఆఫ్ విల్లింగ్టన్ ఈవిధంగా సాక్ష్యమిచ్చి ఉన్నాడు. "ఇండియాలోని ప్రభుత్వ వ్యవస్థ, అధికారముయొక్క పునాది,

ప్రభుత్వానికి ఆలంబనంగా చేసుకొన్న పద్ధతులు, ప్రభుత్వ వ్యవహారాలను నిర్వహించే విధానాలు, ఇవన్నీకూడా, యూరోపు దేశాలలో పాటించబడుతున్న పద్ధతులకు, విధానాలకు, పూర్తిగా విభిన్నమైనవి ... ... ఇండియాలోని సమస్తాధికారానికి మూలాధారము, సాధనము, ఐనది, ఖడ్గమే."

గవర్నర్ జెనరల్ పదవికి వ్యక్తులను నియమించడంలో, ఈ విషయం చక్కగా నిరూపింపబడింది. కారన్‌వాలిస్, విస్తృతమైన యుద్ధానుభవంకల వ్యక్తి. అమెరికా స్వాతంత్ర్య యుద్ధాలలో పాల్గొన్నవాడితడు; యుద్ధంలో ఓడిపోయినా, ప్రభుత్వాదరణను కోల్పోలేదు. మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్సుకూడా, అమెరికా స్వాతంత్ర్యయుద్ధాలలోను, ఫ్లాండర్స్‌లోని విప్లవయుద్ధాలలోను పోరాడి యుండినాడు. నెదర్‌ల్యాండ్ యుద్ధంలోను, ఆస్ట్రియా సైన్యాలతో ఇటలీలో ఏర్పడిన యుద్ధాలలోను, స్పెయిన్‌లో జరిగిన పెనిన్‌సులార్ యుద్ధాలలోను, బెంటింక్ పాల్గొని ఉండినాడు. నెపోలియన్‌తో జరిగిన అనేక యుద్ధాంలో ఆరితేరిన వాడు హార్డింజ్. అంతేకాక, సిక్కులతోజరిగిన యుద్ధంలో, ఇతడు, ఇండియా సేనాధ్యక్షుడైన హ్యూ గఫ్ (Hugh gough) ఆధీనంలో యుద్ధంచేసిన వ్యక్తి. వెల్లెస్లీ, ఆక్‌ల్యాండ్, ఎల్లెన్ బరోలు, యుద్ధకర్మను వృత్తిగా అవలంబించిన సైనికులకంటె, ఎక్కువ యుద్ధాసక్తిగల వ్యక్తులు. సామ్రాజ్యనీతియొక్క అగ్రప్రేషణ విధానానికి వీరు నాయకులై ఉండడమేకాక, సైనికులపట్ల అత్యంతమైన ఆదరణనుచూపి, వారికి సహాయం చేసినవారు. అందువల్లనే హెన్రీ టారెన్స్, అపహాసపూర్వకంగా తన ఆక్షేపణను, పద్యరూపంలో వ్యక్తం చేసినాడు. దాని అర్థం:- బి. శి. ఎస్. కలెక్టర్లు తప్ప, మునిసిఫులందరూ నిష్కళంకులే, జడ్జీలందరూ అసమర్థులే; తమకు ఆంతరంగికుడైన సైనికుడెవ్వడూ (ఎట్టివాడేకాని) తప్పుచేయడు; ఫిరంగి దళాధిపతులందరూ, స్వర్గంలో జనించిన కమీషనర్లు."

*శివిల్ సేవాశాఖ:* పరిపాలన వ్యవస్థకు ముఖ్యాధారమైనవి శివిల్ సేవా విభాగాలు. కేవలం వర్తకసంస్థగా ఉండిన ప్రథమదశలో, కంపెనీ ఉద్యోగాలకు వచ్చినవారందరూ మధ్యమ వర్గాలలోనుంచి, సామాన్యప్రజావర్గాలలోనుంచి గ్రహింపబడినవారు. తరువాతి కాలంలో, పీయర్, నైట్స్, స్క్వైయర్స్ అనే ఉన్నతకుటుంబాలవారు కంపెనీ సభ్యులుగా ఏర్పడిరి. దానితో, పద్దెనిమిదో శతాబ్దపు ఆరంభకాలానికి, ఉత్తమ వంశజులైన వారు కంపెనీ సేవలో ప్రవేశించడం ఆరంభమయింది. బాల్యదశలోనే అభ్యాసకులుగా ప్రవేశించినప్పుడు వీరికి ఎట్టి విద్యాయోగ్యతలూ ఉండినవి కావు. ఏడేండ్లు పనిచేసినతర్వాత, వీరిని లేఖకులుగా నియమించేవారు. లేఖకులకు పై ఉద్యోగాలు, చిన్న గుమాస్తా, పెద్ద గుమాస్తా అనేవి. గుమాస్తాలుగా అనుభవం కలిగిన తరువాత, వర్తకులుగా నియమింపబడే వారు. వీరికి లభించే వేతనాలు స్వల్పమైనవి. అభ్యాసకునికి 5 పౌనులు, లేఖకునికి 10 పౌనులు, చిన్న గుమాస్తాకు 20 పౌనులు పెద్ద గుమాస్తాకు 30 నుండి 40 పౌనులు, సంవత్సరవేతనాలుగా లభించేవి. కంపెనీ ఋణపత్రాలలో నిలువచేసి కాని, లేక, స్వంతంగా వ్యాపారం జరుపుకొనికాని, తమ ఆదాయాన్ని పెంచుకోడానికి, కంపెనీ అనుమతించింది.

దక్కనులోను, బెంగాలులోను జరిగిన యుద్ధాలఫలితంగా, 1744 కు 1765 కు గల మధ్యకాలంలో కంపెనీ వర్తకులు దేశంలోని ప్రాంతాలకు పరిపాలకులుగా మారిపోయిరి. బెంగాల్, బీహార్, ఒరిస్సాప్రాంతాల దివానీ లభించడంవల్ల, కంపెనీయొక్క వాణిజ్య కార్య

కలంపాలకు, పరిపాలన కర్తవ్యాలు వచ్చి చేరినవి. లేఖకులు, గుమాస్తాలు, వర్తకులు మొదలైనవారిపై ఈ కర్తవ్యం పడింది; కాని, ఈ కార్యాలను నిర్వహించడానికి తగిన యోగ్యతలు, ఏమాత్రమూలేని వ్యక్తులు వీరు. కాబట్టి ప్లాసీ యుద్ధంతర్వాత గడచిన ముప్ఫై సంవత్సరాల కాలమూ అస్తవ్యస్తతతో కూడినట్టిది. ఆత్మ ప్రతిష్ఠాపనకు మూలములైన దుష్టప్రవృత్తులన్నిటికీ, స్వేచ్ఛా ప్రాబల్యంగలిగిన కాలమిది. తత్పరిణామాలు భయంకరములైనవి. బెంగాలు ప్రాంతమంతా ఈ విదేశీయుల దురాశాక్రౌర్యాలవల్ల ధ్వంసమై పోయింది. కంపెనీ ఉద్యోగులు, తమ ఇచ్ఛానుసారం, ధనాన్ని సంగ్రహించుకొనిరి. కాని, కంపెనీకిమాత్రం విస్తారమైన నష్టం కలిగింది.కంపెనీయొక్క భావిప్రయోజనాలన్నీ ఆపదకు గురియైపోవడం, ద్రవ్య నష్టానికంటె దుష్టమైన పరిణామం.

క్లైవు కాలమునుంచీ, వ్యవహారాలను చక్కపరచే ప్రయత్నాలు జరిగినవి. లంచగొండితనాన్ని, అధికార దుర్వినియోగాన్ని, దొంగవ్యాపారాన్ని ఉద్యోగాల విషయంలో ప్రబలులైన వ్యక్తులుచేసే ఒత్తిడిని, తగ్గించే ఉద్దేశంతో, ఉద్యోగుల జీతాలను పెంచే అవసరం ఏర్పడింది. కంపెనీకి ఉప్పువర్తకంలోగల ఏకస్వామ్యములో నుంచి ఒకనిధిని ఏర్పరచి, దానిలో జీతాలను పెంచవచ్చునని క్లైవు ప్రతిపాదించిన ప్రణాళికను, కంపెనీ డైరెక్టర్లు నిరాకరించిరి. కాని, పై పదవులలోని ఉద్యోగుల జీతాలను డైరక్టర్లే పెంచినారు. 1772-73 లో, నిర్ధరించిన సేవా ప్రతిఫలాల ప్రకారం, బెంగాల్ గవర్నరుకు లభించే వరమానం సంవత్సరానికి, 23,000 పౌనులు. అతని మండలి సభ్యులకు, వారిస్థానాన్నిబట్టి, 1500 పౌనులనుంచి 3000 పౌనుల వరకు వరమానం నిశ్చితమయింది.

1793లో, ఈవిషయం శాశ్వతంగా నిశ్చయింపబడింది. తగ్గువర్గాలోని సహాయకోద్యోగుల వేతనాలు నెలకు 300, 400, 500 రూపాయలు కలెక్టరుజీతం నెలకు 1500 రూపాయలు; ఇదికాక, ఇతడు వసూలుచేసే రాజస్వ మొత్తంలో 1 శాతం ఇతనికి రుసుముగా లభించేది. కాని అతనికి సంవత్సరానికి లభించే మొత్తము వరమానం, 27500 కు మించకూడదు.ఈవిధంగా జీతాలు, వరమానాలు, ఏర్పడినవి.

సేవాశాఖలను విశుద్ధంగా ఉంచడానికి, కారన్‌వాలిస్, ఎంతో ప్రయత్నం కావించినాడు. ఉన్నత పదవులలోని వ్యక్తులకు, ప్రభుత్వంపై ప్రాబల్యం కలవారికి, ఆప్తులైన అనర్హ వ్యక్తులను ఉద్యోగాలకు నియమించే దురాచారాన్ని నిష్కర్షగా అణచివేసినాడు.శివిల్ ఉద్యోగులుగా వచ్చినయువకుల యోగ్యతను అభివృద్ధికావించదలచిన, వెల్లెస్లీ, వీరి శిక్షణకై కలకత్తాలో ఫోర్ట్ విలియం కళాశాలను స్థాపించెను. కొత్తగా ఉద్యోగాలలో ప్రవేశించిన ఈ యువకులకు, తమ కర్తవ్య నిర్వహణలో అవసరమైన వివిధ విషయాలను సులభ గ్రాహ్యమయ్యే మార్గంలో, మూడు సంవత్సరాలకాలంలో నేర్పడం, ఇతని ఉద్దేశం. కాని, దురదృష్టంవల్ల కంపెనీ డైరెక్టర్లను, వెల్లెస్లీ, నొప్పించి ఉండినాడు. అందువల్ల, ఇతని ప్రణాళిక పూర్తిగా మారిపోయింది. ప్రాచ్యభాషలను అభ్యసింపచేసే పాఠశాలగా సిద్ధించింది, ఇతడు స్థాపించిన కళాశాల. కాని, తర్వాత, ఉన్నత విద్యయొక్క ప్రాముఖ్యాన్ని గుర్తించిన డైరెక్టర్లు, హేల్‌బరీ కళాశాలను స్థాపించిరి. రెండు సంవత్సరాల కాలపరిమితిగల విద్యాప్రణాళికను ఈ కళాశాల అనుసరించింది. ప్రథమ దశలో, కళాశాల ప్రవేశానికి 15 ఏండ్ల వయస్సు నిర్ణయమయింది; కాని 1833 లో దానిని 17 సంవత్సరాల వయస్సుకు పెంచిరి. 23 సంవత్సరాల వయస్సు

దాటిన వారికి, ఈ కళాశాలా ప్రవేశం లభించదు. "మనము పాలించి, రక్షించి, తరువాతి వారికి అందచేయవలసిన సత్సంప్రదాయాలు కొన్ని ఉన్నవని, ... ... ఆదరంతో పోషించ వలసిన రాజకీయ విశ్వాసము, నిష్కర్షగా పాటించవలసిన ప్రభుత్వ, స్వంతగౌరవ ప్రతిష్ఠలను సంబంధించిన నైతిక సంహిత కలదనీ," వీరు గ్రహించేటట్లుచేసి, సమర్థులైన పరిపాలనాధి కారులను తయారుచేయడం ఈ కళాశాలయొక్క ఆశయం. "హేయిల్‌బరీ సంప్రదాయంలో ఐ. సి. ఎస్. ఉద్యోగులు నడచినంతవరకూ వారు తప్పుత్రోవలోపడరు." అని, బ్లంట్, అన్నాడు. కాని 1853 లో, మెకాలే ప్రతిపాదనను అనుసరించి, సివిల్‌సేవా ఉద్యోగాలను కంపెనీవారి ఆధీనము నుంచి తొలగించిరి. పోటీ పరీక్షల ద్వారా, అర్హులైన వారిని ఏరుకో వలసినట్లు నిశ్చయింపబడింది. మొదటి పరీక్ష 1855 లో, జరిగింది. హేయిల్‌బరీ కళాశాలను, 1957 లో, మూతపడింది.

పైన వివరించిన సంస్కరణలవల్ల, పరిపాలన వ్యవస్థ ఒక ఉక్కు చౌకట్టులో ఇమిడి పోయి, బ్రిటిషు సామ్రాజ్యాన్ని నూటయాభై సంవత్సరాల కాలం నిలిపియుంచింది. బ్రిటిషు జాతియొక్క కార్యరూప ప్రతిభ కావించిన అత్యద్భుత నిర్మాణము, ఇండియా ప్రభుత్వ పరి పాలన సేవాసంస్థ. ప్రపంచదేశాలన్నిటిలోనూ అత్యధికమైన వేతనములతో ఏర్పడిన ఈ సంస్థ, అతివ్యయంతో కూడినది. కాని, ఆత్మగౌరవ ప్రతిష్ఠలు వహించిన సంస్థయిది. దీని అధికారాలు, బాధ్యతలు, విస్తృతమైనవి, గొప్పవి. వీరిపై ప్రభుత్వము మోపిన కర్తవ్యవైవి ధ్యాన్ని నిర్వహించిన వీరి సర్వతోముఖ శక్తి అద్భుతావహమైనది. దైవనియామకమైన కర్తవ్యం, తమపై ఉన్నదనే భావం కలవారు వీరు. అతివిస్తారమైన భూభాగాలపైనా, అనంత మైన ప్రజానీకంపైనా, బ్రిటనుదేశము ద్వారా సిద్ధించే శాంతిని స్థాపించడానికి, భగవంత్స కల్పమువల్ల తాము జనించినారనే భావాన్ని విశ్వసించినవారు వీరు.

*బ్రిటిషు పరిపాలన ఫలితాలు* : నూతన పరిపాలన వ్యవస్థకారణంగా, తక్షణమే దేశంలో ఏర్పడిన ఫలితాలు, అత్యంతమూ విషాదకరమైనవి. ఉన్నతోద్యోగాలనుంచి, భారత దేశీయులను పూర్తిగా బహిష్కరించడంవల్లను, ప్రభుత్వ పరిపాలనలో భారతీయులను మొత్తంగా విసర్జించడంవల్లను, దుష్పరిణామాలు సిద్ధించినవి. ఈవిధానంలోగల అన్యా యాన్నీ, అవివేకాన్నీ గుర్తించిన, కంపెనీ ఉన్నతాధికారులు లేకపోలేదు. కంపెనీ డైరక్టర్ల సభకు, వెల్లెస్లీ ఈవిధంగా వ్రాసియున్నాడు. "ఇండియాలో మనము స్థాపించిన సంవిధాన మూలంలోనే గొప్ప న్యూనత ఏర్పడింది. మన ప్రభుత్వ పరిపాలనలోకి వచ్చిన విశిష్ట ప్రజల అభిమానాన్ని సంపాదించే ఉద్దేశం, మనము అవలంబించిన ఏవిధానానికీ ఉన్నట్లు తోచదు; వారికిగల అసంతృప్తిని తొలగించి, వారిని మనకు సుముఖంగా చేసుకొనే పద్ధతికి కూడా మనం ప్రయత్నించలేదు. వరమానము, గౌరవము, అధికారము, ప్రాప్తించగల పరిపాలనలో నుంచి, వారిని బహిష్కరించినాము; ఆత్మప్రతిష్ఠ, సంపద, అధికారము, కోల్పోయినందువల్ల సహజంగా వారిలో ఉత్పన్నమైన భావోద్రేకాలకు ఉపశమనం కలిగించి, వాటిని సక్రమమార్గాలలో ప్రవర్తింపచేసే ప్రయత్నమే, మన పరిపాలన విధానాంలో లేదు."

1817, ఆగష్టు, 12వ తేదీ, హేస్టింగ్సు ప్రభువుకు పంపిన నిర్దేశపత్రంలో మన్రో ఈవిధంగా వ్రాసియున్నాడు,- ప్రతి విద్రోహచర్యను, విదేశీయ దండయాత్రను అణచివేసి, ప్రజలకు రక్షణ కలిగించగల శక్తి సామర్థ్యాలు బ్రిటిష్ ప్రభుత్వానికి కలవు; ఇట్టి శక్తి

సంపద మరేదేశీయ రాజ్యానికీ లేదు. ప్రభుత్వం స్థాపించిన న్యాయవిధానము, పరిపాలన సంస్థలు అంతర్దేశీయములైన పీడక చర్యలను కూడా రూపుమాపి, ప్రజలకు ప్రశాంతతను కలిగించినవి. ఇట్టిపరిస్థితులు దేశీయరాజుల ప్రాంతాలలో ఇదివరకెన్నడూ ఊహించనవి. కాని, ఈఅనుకూల పరిస్థితులను సంపాదించుకోవడంలో దేశప్రజలు ఒక అమూల్యమైన విషయాన్ని కోల్పోయినారు. జాతీయశీల స్వాతంత్ర్యాన్ని బలిగాఇచ్చి, ఈ అనుకూలాలను కొన్నారు; జాతిగౌరవానికి ఆధారములైన వాటినన్నిటినీ, ఈసౌకర్యాలకై బలికావించినారు. ఇండియా దేశ ప్రజలు నిర్భయంగా, తమతమ వృత్తులను, ఉపజీవికలను అనుసరిస్తూ బ్రతుకవచ్చు; తమ శ్రమకు లభించినదాన్ని, ప్రశాంతంగా అనుభవించవచ్చు. నిజమే. కాని, పశుప్రాయమైన ప్రశాంత జీవనస్థితిలో శాశ్వతంగా పడియుండడం తప్ప, ఉత్తమస్థితికి దేనికీ ఉత్సహించే అవకాశమే వీరికెవ్వరికీ లేకుండాపోయింది. తమదేశ ప్రభుత్వానికి సంబంధించిన, రాజకీయ పౌర, సేవా వ్యవస్థలలో భాగం వహించే అవకాశమే ఎవ్వరికీ లేదు. ప్రభుత్వ పదవులలో ఉన్న, తమ దేశీయులనూ, అట్టిపదవులకు అర్హులైన తమవారినీ, చూడడం వల్లనే, దేశీయులలో గుణశీలాలు ఏర్పడగలవు. అట్టి ఉత్తమ వ్యక్తులే తమలోలేని సందర్భంలో, జాతియొక్క శక్తిసామర్థ్యాలన్నీ నశించిపోవడం తప్పదు. ఈ పరిస్థితియొక్క ఫలితాలు, బ్రిటిష్ ప్రాంతాలలో అంతటా విస్పష్టంగా గోచరిస్తూనే ఉన్నాయి. అతి హీనస్థితికి దిగజారిపోయిన ఇండియా జాతికి ఈ బ్రిటిష్ ప్రాంతాలలోని ప్రజానీకం, నిదర్శనంగా ఉంది. సైన్యంలోచేరిన దేశీయులలో ఎవ్వరికీకూడా, సుబేదార్ దర్జానుదాటి పైకిపోయే అవకాశమేలేదు. సేనాధ్యక్షుని పదవికి ఎన్‌సైన్ పదవి ఎంతకిందఉన్నదో, ఇండియనులు ఆశించగల సుబేదార్ పదవి ఎన్‌సైన్‌పదవికి అంత కిందదశలో ఉన్నది. అట్టిపరిస్థితులలో, ఈదేశీయ సిపాయీల గుణశీలాల అభ్యుదయం, అసంభవం. ఇక, శివిల్‌పరిపాలనలో దేశీయులు ఆశించగలిగింది, న్యాయశాఖలోను, రాజస్వశాఖలోను గల చిన్న ఉద్యోగాలు మాత్రమే. అంతకంటె పై ఉద్యోగాల అవకాశమే లేనప్పుడు, వారికి ఏ ఉత్కాంక్షలూ ఉండడానికి, ఆస్కారమేలేదు. ఈఉద్యోగాలవల్ల తమకు లభించే అత్యల్పవేతనాన్ని అధికార దుర్వినియోగంద్వారా పూర్తిచేసుకోవడం తప్పనిసరి ఔతుంది. కాబట్టి, బ్రిటిష్‌వారు సాయుధబలంతో ఇండియా దేశాన్ని జయించి, దేశాన్ని ఆక్రమించడం, దేశీయుల గుణశీలాలను నాశంచేసి, వారిని అధోగతికి ఈడ్చడానికి పనికివచ్చిందే కాని, వారిని బాగుపరచి, పైకితేవడానికి ఉపకరించలేదు. బ్రిటిషువారి దేశాక్రమణవల్ల సిద్ధించిన ఫలితం ఇట్టిది. పరిపాలన వ్యవహారాలలో ఏమాత్రమైన భాగమూ కలిగించక దేశీయులను బహిష్కరించిన బ్రిటిషు ఇండియా విధానానికి సదృశమైనది, ప్రపంచములోని దేశాక్రమణ చరిత్రలో ఎక్కడా ఉండదు."

ఆ పిమ్మట, 1918 నవంబర్ 12 వ తేదీనాడు, మళ్ళీ ఈ విధంగా వ్రాసినాడు; – "పరదేశ విజేతలు, దేశీయులపట్ల క్రౌర్యంవహించడము, హింసాకాండకు పూనడము, ప్రపంచ దేశాలలో జరిగిన విషయాలే. కాని, మనము ఇండియా దేశీయులను చూచినంత తృణీకార భావంతో, తిరస్కారంతో, ఆ విజేతలెవ్వరూ, ఆదేశీయులను చూడలేదు. దేశీయు లందరూ విశ్వాసార్హులుకారని, ప్రామాణికులు కారని, మనము చేయలేనట్టి చేయరానట్టి, పనులకు మాత్రమే తగినవారని, జాతి సమస్తంపైనా, మనము కళంకం ఆపాదించినట్లు, ఆ విజేత

లెక్కవూ చేయలేము. మన పరిపాలనకు వశమైపోయిన జాతీయుల్ని ఈ విధంగా హీన పరచడం, కేవలం అన్యాయం మాత్రమేకాదు; అవివేకము, అనౌచిత్యము కూడా. విశ్వాసము, పరమానముగల పదవుల నుంచి దేశీయులను బహిష్కరించి ఉంచడం, మన పరిపాలన వ్యవస్థకు స్వభావమైపోయింది; కాని ఈ పద్ధతివల్ల ప్రభుత్వానికి ఏమాత్రము శ్రేయస్సు, సిద్ధించలేదు."

తాను కూడా ఒక సాధనమై ఇండియాదేశంపై మోపిన ప్రభుత్వ పరిపాలన పద్ధతి దానికి, ఇంగ్లాండు దేశము గురిఐనట్లయితే, ఇంగ్లాండు పరిస్థితి ఎట్లా ఉంటుందనే భావనను మన్రో, కొన్ని ఏండ్ల తర్వాత లోనై, ఈ విధంగా వ్రాస్తాడు; "ఇంగ్లాండు దేశం, రేపు, పరదేశ ప్రభుత్వ పరిపాలనకు స్వాధీనమైపోయి, ప్రభుత్వ పరిపాలన నుంచి, ఇంగ్లాండు ప్రజలందరూ బహిష్కృతులైపోయి, అన్ని ప్రభుత్వ గౌరవాలకు, విశ్వాసము, పరమానము, గల అన్ని పదవులకూ, బాహ్యులైపోయి, ఏసందర్భంలో కూడా ఇంగ్లాండు ప్రజలు విశ్వాసార్హులు కారనే కళంకానికి గురియైన సందర్భం, ఏర్పడితే,- ఆంగ్లేయుల విజ్ఞానంకాని, సారస్వతంకాని పవిత్ర, లౌకిక, గ్రంథాలు కాని, ఆంగ్లజాతిని రక్షించలేవు. ఒకటి రెండు తరాలలోనే, ఆంగ్లేయులు నీచమైన, వంచకమైన, అప్రామాణికమైన జాతిగా మారిపోవడం తప్పదు."

ఎల్ఫిన్‌స్టన్, ఈ విధంగా వ్రాస్తాడు. "భారతదేశీయుల సహజశక్తి సామర్థ్యాలను సమూలంగా శుష్కింపచేసినామని, మనపై మోపిన దోషారోపణ అసత్యమైనదికాదు. విజ్ఞానాభి వృద్ధికి అవసరమైన ప్రోత్సాహం ఏమాత్రమూ లేకుండాచేసింది మన పరిపాలన స్వభావం. అంతమాత్రమేకాదు, భారత జాతి విజ్ఞానమే, నశించిపోయే పరిస్థితి ఏర్పడింది; ప్రాచీన ప్రతిభాశాలుల రచనలన్నీ, విస్మృతమైపోయే అవకాశం కూడా ఉంది."

మరాఠా యుద్ధాలు ముగిసిన పిమ్మట, మాల్‌కామ్, ఈ విధంగా, వ్రాసినాడు. మనకు ఇప్పుడు లభించిన విశ్రాంతిస్థితి వాస్తవమైనదికాదు; కేవలం బాహ్యానికి గోచరించేది మాత్రమే; ఎంతోకాలం నిలిచియుండేది కూడా కాదు. ఈ ప్రశాంత స్థితిని అంతంచేయడానికి ప్రవృత్తమయ్యే కారణాలు అనేకములు. మన అధీనంలో ఉన్న ఈ ప్రాంతాలను పరిపాలించడంలో, మనం అవలంబించే ఆదరణ రహితమైన విధానము, మన న్యాయసూత్రాలను, నియమనాలను ప్రవేశపెట్టే పద్ధతులు, ప్రజలలో భావోద్రేకాన్నీ, అపాయభీతినీ, కలిగించడం తప్పదు. నిద్రాణులై ఉన్న ప్రజలు మేల్కొడానికి, అదేసమయం. పరప్రభుత్వంపట్ల ఏర్పడియుండిన భయభ్రాంతి, మెప్పు తొలగిపోయి, వాటిస్థానంలో అసహ్యభావము, అసంతృప్తి ఏర్పడతాయి. ఇదివరలో, పదవులను అధికార ప్రభావాన్ని అనుభవించియుండిన రాజులు, సర్దారులు, ఇతరులు, తప్పక మేల్కొంటారు. పరప్రభుత్వం ప్రవేశపెట్టుతున్న పరిపాలన పద్ధతివల్ల, తాము శీఘ్రమే క్షీణించిపోయి, పర్యవసానంలో పూర్తిగా నశించిపోతామని, తప్పక గ్రహిస్తారు."

"దేశీయ రాజుల ప్రభుత్వంలోని పదవులకు స్థానాలకు కొన్ని ప్రజావర్గాల వ్యక్తులు నియమితులయ్యేవారు; అది దేశసంప్రదాయం. అట్టిపద్ధతి మన ప్రభుత్వ విధానంలో, జరగడం లేదు. ఆ వ్యక్తులకు తమ రాజుల విషయంలో ఉండిన భావాలు, ఉద్దేశాలు, మన ప్రభుత్వం పట్ల ప్రవృత్తంకావు. మన పరిపాలన న్యాయమైనదే; కాని ప్రజలపట్ల ఆదరంలేనిది, కఠిన

మైనది; ప్రజలకు అపాయభీతిని కలిగించకపోవడం నిజమే; కాని, మనతో సమానమైన స్థితికి రావడానికి అవసరమైన ఆసక్తినీ, ఉత్సాహాన్నీ వారిలో ఏమాత్రమూ కలిగించేదికాదు. మన ప్రభుత్వం ప్రజలకు రక్షణ కలిగించి యుండడం నిజమే; కాని వారిలో చైతన్యాన్ని, ఉత్సాహాన్ని ప్రేరేపించలేదు, వారి అభిమానాన్ని సంపాదించుకోలేదు. మన పరిపాలనలో, నివసించే దేశీయుని కెప్పనికీ ఆపద, అన్యాయము కలుగకపోవడం కూడా, చాలవరకు, వాస్తవమైనదే; కాని, వ్యక్తి వైశిష్ట్యాన్ని గుర్తించి, ఆదరించి అతనిని ప్రోత్సహించడము, అతనిని పైకిలేవడము అనే విషయాలు, జరుగక పోవడం కూడా వాస్తవమే."

దేశీయుల విషయంలో ప్రఖ్యాతి, సంపద, అధికారము.- మొదలైనవాటిని సాధించుకొనే మార్గాలన్నీ, మూతపడిపోయినవి; ప్రభుత్వ సేవావకాశాలన్నీ లోపించిపోయినవి. పౌర కర్తవ్యాలు నిర్వహించడానికి, తనదేశాన్ని రక్షించుకోడానికి, దేశసంపదను అభివృద్ధి పరచడానికీకూడా, భారతీయునికి అవకాశం లేకుండాపోయింది. ఈవిధమైన బహిష్కారంవల్ల, ప్రజలలో ప్రభుత్వంపట్ల అసంతృప్తి, లేక, విరుద్ధభావమూ ఏర్పడుతుందనీ, అట్టిది జరగని సందర్భంలో, "జాతిశీలము క్షీణించిపోయి, తమ ఆకలి బాధలను తీర్చుకోడానికి తప్ప, మరేవిధమైన ఉన్నతకార్యాలకూ అనర్హులైన తుచ్ఛ, సోమరులమూకగా, ప్రజలు అధోగతికి దిగజారిపోతారని," ఇదివరకే మన్రో, భావిసూచన కావించి ఉన్నాడు. "స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన వ్యక్తియొక్క శీలంకూడా సగంనశించి పోతుందని" అతడు పల్కినవాక్యం ప్రామాణిక మైనది. "స్వతంత్ర వ్యక్తికిగల విశేషాధికారాలు దాస్యంలో ఉన్నవ్యక్తికి, లేని విధంగానే, పరదాస్యానికి లోబడిన జాతియొక్క విశేషాధికారాలుకూడా నశిస్తాయి. తనపై పన్నులు మోపుకొనే అధికారము, తనకు ఆవశ్యకములైన న్యాయశాసనాలను నిర్మించుకొనే అధికారము, పరిపాలనలో భాగంవహించే అధికారము, ప్రభుత్వాన్ని నిర్వహించుకొనే సామాన్యాధికారము,- అన్నీ నశించిపోతాయి. బ్రిటిష్ ఇండియాలోని దేశజాతికి ఈ అధికారాలేవీ లేకపోవడమే, ఈవిషయంలో నిదర్శనం.

మృత్యుసదృశమైన మబ్బు దేశాన్ని ఆవరించింది. దీనిప్రభావానికిలోనై, ప్రజావర్గాలు అడగిపోయినవి; ప్రజలకు ఊపిరి ఆడకుండా ఐపోయింది. ముస్లిం హిందూరాజులను, ప్రభుత్వం, నిరాయుధులనుకావించి, ప్రజానీకానికి దూరంగా, ప్రత్యేకంగా నిలిపింది. పూర్వపు రాజులకు, సైనికులను, పరిపాలకులను, నాయకులను సమకూర్చియుండిన హిందూ ముస్లిం కుటుంబాలను, జనజాతులను, కులవర్గాలను, బాధ్యతాయుతములైన పదవులనుంచి బహిష్కరించి, గులాముగిరిచేస్తూ బ్రతకవలసిన స్థితికి త్రోసివేసింది. ముస్లిం హిందూ విద్వాంస వర్గాలకు ఆదరణ పోషణలు లేకుండాచేసి, ఆవృత్తులను వారు వదలివేసేటట్లు కావించింది. ఇక ప్రజానీకం విషయంలో,- అమిత భారమైన పన్నులు, వాటిని వసూలుచేయడంలో ప్రయోగించిన కఠినచర్యలు, జనాభావృద్ధి, సాగుబడి పొలాలకుగల గిరాకీ,- మొదలైనవన్నీ చేరి, ఇదివరకే తగ్గుస్థాయిలో ఉండిన జీవన ప్రమాణాలను మరింత తగ్గించివేసినవి. ప్రభుత్వం అవలంబించిన ఆర్థికవిధానం, ఇండియా కర్మకారులను, వృత్తి కార్మికులను, నాశమొనర్చి, వారిని పొలాలులేని సామాన్య శ్రామికులుగా మార్చివేసింది. దేశపరిశ్రమల అభివృద్ధి విషయంలో, ప్రభుత్వంపెట్టిన నిర్బంధాలవల్ల, పరిశ్రమలు లోపించినవి. నిర్వ్యాపారులైన ఈ కార్మికులకు, శ్రామికులకు, జీవనోపాధికి నూతన అవకాశాలే, లేకపోయినవి.

ఇంగ్లాండు అవలంబించిన వాణిజ్యనీతి విధానాన్ని గురించి, బ్రాస్టూ, 1837 లో, ఈవిధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తంచావించినాడు. "క్రూరమైన స్వార్థపరత్వమే ప్రధాన ప్రయోజనమైన ఆంగ్ల వాణిజ్యవిధానం క్రిందపడి, నలిగి, దీనావస్థలో ఉన్న, ఈభారతదేశ ప్రజానీకాన్ని మరింత దరిద్రావస్థలో త్రోయడానికి, మనకు సాధ్యమైన ప్రయత్నమంతా చేసినాము."

నూతనజాతి ఉద్భవించడానికై పాతజాతి అత్యంతమైన యాతనను అనుభవించి, పరుల హింసలకు గురియై, నశించిపోవడం, ప్రాయశః ఆవశ్యకమై ఉండవచ్చు.

# 9
# బ్రిటిషు పరిపాలనయొక్క సాంఘిక ఆర్థిక పరిణామాలు

## గ్రామీణ ఆర్థిక వ్యవస్థ శిథిలంకావడం

ఇండియాదేశంపై ఇదివరలో జరిగిన ఆక్రమణలకు విభిన్నమైనది, బ్రిటిషువారి దేశాక్రమణ స్వభావం. పూర్వంలో, పరిపాలకులు మారిపోవడంతో, ప్రజలపై రాజకీయాధికారాన్ని వహించియుండిన రాజవంశము మాత్రమే, మారిపోవడం జరిగింది. బ్రిటిషు పరిపాలనలో, సమస్త విషయాలూ మారిపోయినవి. దీనితో ప్రారంభమైన సాంఘిక - ఆర్థిక విప్లవంవల్ల, ప్రాచీన సంస్థలన్నీ నశించిపోయి, నూతన సాంఘికవర్గాలు, నూతన శక్తులు ఉత్పన్నమైనవి.

*భూముల ఒడంబడికలు :* వ్యవసాయంపై ఎక్కువగా ఆధారపడిన ఆర్థిక వ్యవస్థగల దేశాలలో, ప్రజల ఆదాయానికి ముఖ్యమైన మూలాధారం పంటభూమి. దేశంలో భద్రతా రక్షణలను నెలకొల్పి, దేశానికీ, తమకూ, రక్షణకల్పిస్తున్న సేవకు ప్రతిఫలంగా, పరిపాలకులకు, ఉత్పాదనలోని ఒకభాగాన్ని, ప్రజలు చెల్లిస్తారు. పెట్టుబడి విధానం ఏర్పడని రోజులలో, గ్రామంలో పండిన పంటను, గ్రామం మొత్తానికీ, ప్రభుత్వానికీ మధ్యా ఒక నిష్పత్తిలో పంచడం జరిగేది. ఇది అప్పటి పరిస్థితి. సహకార పద్ధతిపై ఏర్పడిన ఒకసంస్థగా నిలిచియుండేది, ఆనాటిగ్రామం. గ్రామంలోని ప్రజావర్గాల కర్తవ్యాన్నీ ఆచారాన్నీ సంప్రదాయాన్నీబట్టి, ఏర్పడియుండేవి. ప్రతివ్యక్తీ, గ్రామసంస్థలోని ఒక అంశంగా లీనమై ఉండేవాడు. పరిపాలకులు, గ్రామవాసులుకూడా, పొలాన్ని ఉపయోగించి పండించడంలో, ఆసక్తి వహించినవారేకాని, భూమి స్వామ్యంపై ఎవరికీ ఆసక్తి ఏర్పడలేదు. సాగుబడిలోనికి రాని భూమి, విస్తారంగాఉండడంవల్ల, నీటిని, గాలిని, స్వేచ్ఛగా అందరూ ఉపయోగించినట్లే దీనిని కూడా ఉపయోగించడానికి వీలు ఉండేది. అట్టి సందర్భాలలో, వ్యక్తికి భూమిపైగలహక్కు, అనే, సమస్యే ఉత్పన్నం కాలేదు. భూమిపై చెల్లించవలసిన భాటకాలు, పన్నులు, సంప్రదాయ సిద్ధములైన విషయాలుగా భావించేవారు. కాబట్టి, శిస్తులను విధించడము అనే అభిప్రాయమే ఆనాడు కలుగలేదు.

భూములను తమ ప్రయోజనార్థం ఉపయోగించడము, దానినుంచి లభించిన ఉత్పత్తిని గ్రామస్థులందరూ పంచుకోవడము అనే కార్యక్రమంపై, గ్రామీణుల పరస్పర ఆర్థిక, సాంఘిక సంబంధాలు ఏర్పడినవి. కాబట్టి, సామాజిక వ్యవస్థ, ప్రభుత్వముయొక్క స్వరూపము, దాని కర్తవ్య ధర్మాలు మొదలైనవి, గ్రామీణుల, ఆర్థిక, సాంఘిక, సంబంధాలనుబట్టి నిర్ణయమైనవి.

వ్యావసాయిక ఆర్థిక వ్యవస్థకు చెందిన సామాజిక స్వరూపము, సంపదను ఉత్పాదన కావించి పంచుకోవడము,- ఈ రెండూ భూమికి సంబంధించిన ఒప్పందాలపై ఆధారపడినవి. బ్రిటిషువారు, ఇండియా స్థిరపడిన ప్రథమదశలో, నూతనములైన ఒప్పందాలను ప్రవేశపెట్టిరి. వీటిని అనుసరించి, గ్రామసీమలలోని ఆర్థిక సాంఘిక సంబంధాలలో, విప్లవం బయలుదేరింది.

బెంగాలు ప్రాంతంలోని కొన్ని ప్రదేశాల రాజస్వ పరిపాలనను ఈస్టిండియా కంపెనీకి 1765 లో అప్పగించడం జరిగింది. కాని, ఈ విధమైన పరిపాలన కర్తవ్యాలను నిర్వహించడానికి, కంపెనీ వర్తకులు సమర్థులు కారు; తగినవారూకారు. కాబట్టి, రాజస్వాన్ని వసూలు చేయడానికి కొంతకాలందాకా, పూర్వపు పద్ధతులనే అనుసరించినాడు, క్లైవ్. ఈ కర్తవ్యాన్ని, అతడు బెంగాలు నవాబుయొక్క డిప్యూటీ దివానుకు అప్పగించెను. ఈ పద్ధతి తృప్తికరంగా, జరగనందువల్ల గవర్నర్ పదవిని వహించిన వెంటనే హేస్టింగ్సు, డిప్యూటీ దివాను నుంచి ఈ కర్తవ్యాన్ని తప్పించి వేసినాడు (1772). అంతనుంచీ, సంతృప్తికరంగా ఉండే పద్ధతిని ఏర్పరచడంలో, అనేక ప్రయత్నాలు జరిగినవి. రాజస్వ విషయంలోను, దీనిని వసూలుచేసే బాధ్యత విషయంలోను, విధానాలను ఏర్పరుస్తూ, మారుస్తూ, పోయినారు. ఈ విషయాలపై జరిగిన చర్చలలో అనేకములైన ప్రశ్నలు బయలు దేరినవి. ఇండియాలోని వ్యవసాయ భూములకు యజమాని ఎవరు? ప్రభుత్వానికి రాజస్వాన్ని చెల్లించే పర్యవసాన బాధ్యత ఎవరిది? ఉత్పాదనలో ప్రభుత్వానికి చెందవలసిన భాగమెంత? మొగలుల పరిపాలనలోని జమీందారులు, గుత్తదార్లు, ఆయా భూములపై స్వామ్యముకల యజమానులా? లేక రైతులకు ప్రభుత్వానికీ మధ్యవర్తులు మాత్రమేనా? మొదలైన భావరూప ప్రశ్నలన్నీ చర్చింపబడినవి.

భూమిసమస్తమూ సార్వభౌముని స్వామ్యమనీ, రైతులవద్దనుంచి పన్నులు వసూలు చేసే మధ్యవర్తులందరూ కార్యకర్తలుగా రుసుము తీసుకొనేవారనీ, భావించి, హేస్టింగ్సు ఈవిషయాన్ని నిర్ణయించడానికి పూనుకొన్నాడు. దీనిని బట్టి బజారు వేలంలో ఇతరులు చెల్లిస్తామని పూనుకొన్న రాజస్వాన్ని చెల్లించడానికి అంగీకరిస్తేనే, జమీందారులకు ఈకర్తవ్యాన్ని అప్పగించడం జరుగుతుంది. ఆవిధంగా వేలంలో, జమీందారులను కూడా ఇతరులతో సమానంగా పరిగణించి, ఎక్కువ మొత్తం రాజస్వం వచ్చేటట్లు చూచుకొన్నారు. తత్ఫలితంగా, బెంగాలు భూములలో అధికభాగం, కొత్తగుత్తేదార్లకు అప్పగించడం జరిగింది. ఈ విధంగా ప్రాచీన జమీందారీ కుటుంబాలు అనేకములు తొలగిపోయినవి. "ప్రభుత్వానికీ రైతులకూ మధ్య చిరకాలంగా ఏర్పడియుండిన సంబంధసాధనం" తెగిపోయింది. జమీందారులకూ వారి భూములను సాగుచేసే భాటకదారులకూ మధ్యఉండిన ప్రాచీన సంబంధాలు చెడిపోయినవి. జమీందారులకు కలిగిన ఈపరాభవాన్ని ప్రభుత్వ పద్ధతులు మరింత తీవ్రం కావించినవి. అత్యధికమైన శిస్తును వీరిపై మోపడము, ప్రభుత్వాదేశాన్ని అనుసరించి, కలెక్టర్లు శిస్తువసూలు చేయడంలో జమీందారులపై తీవ్రములైన కఠినచర్యలు జరపడము, వీరి బాధలను ఉద్రేకపరిచినవి. ఈ బాధలు రైతులకు కూడా తప్పలేదు. శిస్తులను పెంచడం వల్ల, దానిని చెల్లించవలసిన వారుకూడా రైతులే; కాబట్టి, గుత్తేదార్ల దురాశకు వీరు బలి ఐపోయిరి. గుత్తేదార్లు రైతులను హింసించడము, మొత్తంగా వారిని భూములనుంచి తీసివేయడము, దీని ఫలితాలు "శిస్తు చెల్లించలేని జమీందార్లు, శిస్తులు చెల్లించక పారిపోయిన

గుత్తేదార్లు, పొలాలను వదిలిపోయే రైతులు," ఆనాడు ఏర్పడిన పరిస్థితి. ఇండియా గ్రామీణ వ్యవస్థలో ఏర్పడిన మొదటి చీలిక, ఇది.

హేస్టింగ్సు అవలు జరిపిన చర్యల కారణంగా, దేశంలో శోచనీయమైన పరిస్థితులు ఏర్పడినవి. అందువల్ల. భూమిస్వామ్యం విషయంలో ఇతడు ఆధారంగా తీసుకొన్న భావం, బాహాటంగా చర్చకు వచ్చింది. భూమికి స్వాములు జమీందారులే కాని, సార్వభౌముడుకాదనే అభిప్రాయాన్ని, ఫిలిప్‌ఫ్రాన్సిస్, ప్రతిపాదించెను. ఈ అభిప్రాయానికి విరుద్ధంగా నిలిచినవాడు హేస్టింగ్సు. ఈ చర్చల ఫలితంగా, 1777నుంచి 1793 వరకు గల కాలంలో నూతన పద్ధతులు ఏర్పడినవి. వీటి ప్రకారం, జమీందారుకు ఎక్కువ ప్రాముఖ్యం కలగడము, రైతు ఇంకా ఎక్కువ నష్టానికి గురి కావడము జరిగింది. అపై, 1793లో, శాశ్వత పరిష్కారాన్ని బెంగాలులో నెలకొల్పడానికి, కారన్‌వాలిస్ నిశ్చయించెను.

1793 నాటి శాశ్వత పరిష్కారాన్నిబట్టి, అతని అధీనంలో ఉన్న సంస్థానంపై పరమస్వామ్యము, యాజమాన్యము, జమీందారుకు ఏర్పడింది. ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తును ప్రభుత్వానికి అర్పించి, తక్కిన భాటకమంతా, అతడు సంగ్రహించుకోడానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చింది. ప్రథమ దశలో అతనికి చెందవలసిన భాగం, మొత్తం రాజస్వంలో, 11 శాతం మాత్రమే. కాబట్టి తక్కిన భాగాన్నంతా అతడు ప్రభుత్వానికి అప్పచెప్పవలసి ఉండింది. కాని, ఈ కొత్త పద్ధతి ప్రకారం జమీందారు ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తు, నిష్కర్షగా నిశ్చితమయింది కాని, రైతులనుంచి జమీందారు గ్రహించే భాటకాన్ని నిర్ధారించనూ లేదు, పరిష్కారము కావించనూ లేదు. ఇందువల్ల, రైతువద్ద నుంచి సాధ్యమైనంతవరకూ, డబ్బు లాగడానికి, జమీందారుకు మంచి అవకాశం కలిగింది. ఈ విధంగా, భూమినుంచి ఉత్పన్నమయ్యే అధిశేషాన్ని (Economic rent) గ్రహించడానికి పూనుకొన్న ప్రభుత్వోద్దేశం, సఫలమయింది.

కాని, ఈ శాశ్వత పరిష్కారంవల్ల పర్యవసానంలో బాగుపడింది జమీందారే కాని, ప్రభుత్వం కాదు. జనాభా వృద్ధిచెందడము, వ్యవసాయము విస్తృతి చెందడము, ధాన్యాల ధరలు పెరగడము, సాగుబడి భూమి దుర్లభమైపోవడము,- ఇత్యాది కారణాలవల్ల, జమీందారు స్థితి బాగుపడింది. సంస్థానానికి ఉత్తరాధికారిగా ఏర్పడడానికి పూర్వము రీతిగా, ఏ విధమైన అధికార పత్రాన్నీ, అతడు, ఇప్పుడు పొందనక్కరలేదు; అతని హక్కును స్థిరపరచడానికై ఏ పేష్‌కష్‌ను, నజరానాను కూడా చెల్లించ నక్కరలేదు. ఇతని సంస్థాన విషయంలో, పై అధికారి ఎవ్వడూ ఇప్పుడు లేడు కాబట్టి, తన భూములను ఇతరులకు హస్తాంతరం చేయడానికి, అమ్మడానికి, తనఖా పెట్టడానికి, దానంగా ఇవ్వడానికి, ఎవ్వరి అనుమతినీ పొందనవసరంలేదు. మొగల్ పరిపాలనలోని క్లేశకరములైన నియమాలన్నీ తొలగిపోయినవి. మొగల్ వినియమాల ప్రకారం, అతని అధికారం పరిమితమై ఉండింది. నిర్ధరించబడిన శిస్తుకంటె అధికంగా రుసుములను రైతులనుంచి వసూలు చేయడము, రైతుల నుంచి వచ్చిన ఆదాయానికి, బటవాడాలకు సంబంధించిన లెక్కలను, ప్రభుత్వానికి సమర్పించడము, అతని బాధ్యతగా ఉండింది. అవన్నీ ఇప్పుడు తొలగిపోయినవి. కాని, ఒక్క విషయంలో మాత్రము, ఆ కాలపు జమీందారుకు, ఇప్పటి జమీందారుకూ భేదమున్నది. జమీందారుకు ఉండిన రాజకీయ పరిపాలనాధికారాలన్నీ, బ్రిటిష్ పరిపాలన కాలంలో ఊడి

పోయినవి. మొగలుల కాలంలోని భూస్వామికాదు, ఇప్పటి జమీందారు; ఒక చిన్న పెట్టుబడి దారుగా, "కుక్క గొడుగు వంటి శ్రీమంతుడుగా" తయారైనాడు.

ఇంతకు ముందున్న గుత్తేదార్లు, ఇంగ్లాండులో ప్రకారం, సంస్థానాలకు యజమానులు గాను, లేక, భూస్వాములుగాను, ఏర్పడిరి. ఇంగ్లాండులోని భూస్వాములకు ఉన్న హక్కులే, ఇండియాలోని గుత్తేదార్లకు కూడా సిద్ధించినవి. ఉత్పాదనలోని భాగాలపై ప్రభుత్వానికీ, గుత్తేదార్లకూ హక్కు ఉన్నప్పటికీ కూడా, రైతు అనుభోగంలో ఉన్న భూమిని రైతునుంచి లాగుకొనే హక్కు లేకపోవడము, లేక, ఆ భూమిపై భాటకాన్ని స్వేచ్ఛగా ఎక్కువచేసే అధికారము వారికి లేక పోవడము, ఇందుకు నిదర్శనం. బ్రిటిషువారి ఆక్రమణకు పూర్వం, జమీందారులకు రైతులు చెల్లించే భాటకానికీ, ప్రభుత్వం జమీందారుల నుంచి వసూలు చేసే శిస్తుకు, భేదం, దేశంలోని ఏ భాగంలో కూడా లేకపోవడం, వాస్తవం. ఈ పూర్వ పద్ధతిని శాశ్వత పరిష్కారం నాశనం చేసి, జమీందారులకు భూములపై స్వామ్యపు హక్కులను అంటగట్టింది.

జమీందారుయొక్క స్థానప్రతిష్ఠల విషయంలోను, కర్తవ్యాలవిషయంలోను కలిగిన మార్పులవల్ల, గ్రామముయొక్క సాంఘిక-ఆర్థిక వ్యవస్థకూడా పరివర్తనకు లోనయింది. కడపటికి, దాని ప్రత్యేకత, స్వయంపోషక సామర్థ్యము నశించినవి. వీటిలో ముఖ్యమైన మార్పులు రెండు,- (1) భూమిపై సర్వస్వామ్యాన్ని కలిగించడము; దానిని, నూతన ధనిక వర్గంవారికి బదిలీచేయడము. తాము భూమిపై వెచ్చించే పెట్టుబడిపై అత్యంతమైన ప్రతి ఫలాన్ని ఆశించడం తప్ప, భూమివిషయంలో ఏవిధమైన ఆసక్తి లేనివారు ఈ ధనికులు. (2) సంస్థానాలను, భూములను గుత్తకు తీసుకొన్న వ్యక్తులు, వాటిని విభజించి, చిన్న గుత్తేదారులకు అప్పగించడము. భూములకుగాను పైపోటీ ఉండడంతో, గుత్తేదారులసంఖ్య కూడా పెరుగుతూ వచ్చింది. చిన్న, పెద్ద గుత్తేదారులూ, పన్నులు వసూలుచేసే మధ్య వర్తులూ, జమీందారుకు రైతులకు మధ్య, ఒక శ్రేణిగా సిద్ధించిరి.

ఈ మార్పులు, ప్రథమంగా, ముర్షిద్ ఆలీఖాన్ హయాములో ప్రారంభమైనవి. పూర్వపు జాగీర్దార్లను, తాలూకుదార్లను తీసివేసి, ఇతడు కొత్తగుత్తేదార్లను నియమించి ఉండి నాడు; ఈ కొత్తవారందరు చాలవరకు హిందువులు. అందువల్ల, బెంగాలును బ్రిటిషువారు ఆక్రమించుకొనే సమయానికి, బెంగాలులోని జమీందారీ కుటుంబాలన్నీ, చాలభాగం, ముర్షిద్-అలీ-ఖాన్, పరిపాలన కాలంలో సృష్టికి వచ్చినట్టివే. నూరు, నూటయాభై, ఏండ్లకాలంనాటి, జమీందారీ వంశాలు చాల తక్కువ.

జమీందారీ వర్గాల సంయోజనంలో మరొక విప్లవాన్ని కలిగించినవి, హేస్టింగ్సు ప్రవేశపెట్టిన రాజస్వ పరిష్కారాలు. శిస్తులు విధించడంలో వహించిన నిర్దాక్షిణ్యము, వాటిని వసూలుచేయడంలో చూపిన కాఠిన్యము, పరిస్థితిని మరింత పాడు చేసినవి. 1793లో కావించిన శాశ్వత పరిష్కార శాసనంతో, ఈ వినాశప్రక్రియ పూర్తి అయింది. ఈ పరి ష్కారం జరిగిన తర్వాత ఇరవై ఏండ్ల కాలంలో, బెంగాలు సాగుబడి భూమి, సగానికి పైగా, విక్రయాలకులోనై, ఒకరిచేతినుంచి మరొకరికి, బదిలీఔతూ వచ్చింది. ఈ విధంగా భూములను కొన్నవారందరూ,-కలకత్తాలోని వర్తకులు, ధనికవర్గంవారు.

శాశ్వత పరిష్కారంవల్ల సృష్టికి వచ్చిన కొత్త జమీందారులు ఈ విధంగా, అతి

శీఘ్రకాలంలోనే పేరు లేకుండాపోయిరి. జేరీజుల అధిక భారము, విక్రయానికి సంబంధించిన న్యాయము కఠినమై ఉండడము,- ఈ జమీందారుల వినాశనానికి హేతువులైనవి. బ్రిటిషు పరిపాలన ప్రథమదశలోని రాజస్వపరిస్థితి, ఈ క్రింది పట్టికలోని వివరాలవల్ల విశద మౌతుంది.

| | | | భూరాజస్వం. జేరీజు. |
|---|---|---|---|
| తోడర్‌మల్ చేసిన జేరీజు | (1596) | — | రూ. 107 లక్షలు. |
| ముర్షీద్‌అలీఖాన్ ,, | (1722) | — | రూ. 145 ,, |
| అల్లావర్దీఖాన్ ,, | (1755) | — | రూ. 186 ,, |
| మీర్ కాసీం ,, | (1763) | — | రూ. 256 ,, |
| కారన్ వాలిస్ ,, | (1793) | — | రూ. 236 ,, |

ఈ పట్టికపై వ్యాఖ్యానం కావించేముందు, ఒక ముఖ్య విషయాన్ని జ్ఞాపకం ఉంచుకో వలసి ఉన్నది. నవాబుల కాలంలో, జేరీజుల మొత్తం, ఎన్నడూ పూర్తిగా వసూలు కాలేదు; సంవత్సరం సంవత్సరమూ, విస్తారంగా బాకీపడుతూనే ఉండేది. కాని, కంపెనీ పరిపాలన కాలంలోని జేరీజు, అత్యధికమైనప్పటికీ, దానిలో 97 1/2 శాతాన్ని వసూలు చేసుకొన్నారు. బాకీపడిన జేరీజుమొత్తం $2\frac{1}{2}$ శాతం మాత్రమే. "మొగల్ కార్యకర్తలు, బెంగాలులో 1764-65 సంవత్సరం వసూలుచేసిన రాజస్వ మొత్తం విలువ 818,000 పౌనులు. ఈస్ట్ ఇండియా కంపెనీవారు, మొదటి విత్తసంవత్సరం (1765-66) వసూలు చేసుకొన్న మొత్తం విలువ 1,470,000 పౌనులదాకా పెరిగింది. 1790-91 నాటికి 2,860,000 పౌనులు విలువగల రాజస్వాన్ని బలవంతంతో వసూలు చేసినారు. ఈ వసూలు మొత్తాన్ని ఆధారంగా చేసుకొని, శాశ్వతపరిష్కారాన్ని నిర్ధరించింది కంపెనీ ప్రభుత్వం."

1793 లో, జమీందారులు రైతులవద్దనుంచి వసూలుచేసిన భాటకమొత్తంలో, 89 శాతం, కంపెనీవారు తమ భాగంగా గ్రహించిరి. అదే సంవత్సరం, ఇంగ్లాండు ప్రభుత్వం తన దేశంలో రాబట్టుకొన్న భాటకాంశం, 5 శాతంనుంచి 10 శాతంవరకు మాత్రమే. ఇండియాలోని జమీందారుకు మిగిలిన భాగం మిక్కిలి స్వల్పం. భాటకాన్ని వసూలు చేయ డంలో పడిన కష్టానికి, ప్రభుత్వంపట్ల తన బాధ్యతలను తీర్చడానికి, తన స్వంతకర్చులను భరించడానికి,- ఈ శేషభాగం చాలిందికాదు.

జమీందారులు, ప్రభుత్వానికి చెల్లించవలసిన శిస్తులను, నిర్ణయమైన రోజుకు సరిగా, సూర్యాస్తమయంలోపల తప్పకుండా చెల్లించవలసినట్లు చేసినకట్టడి, ఈ విధానమంతటి లోనూ కష్టతమమైనది. ఆ నిర్ణీత సమయానికి సరిగా చెల్లించని పక్షంలో, జమీందారును తొలగించి, అతని సంస్థానాన్ని పూర్తిగాకాని, భాగంకాని, వేలంలో అమ్మి, తమ శిస్తుబాకీ రాబట్టుకొనే వారు. జమీందారుకు, అనివార్యమై ఏర్పడిన ఇబ్బందులను కాని, ఏ విధమైన ఇతర సంజాయిషీని కాని, గమనించేవారు కారు. ఈ విధంగా జమీందారును ఒత్తిడిచేసి, ప్రభుత్వం తన డబ్బును రాబట్టుకోగలిగేది. కాని రైతులు సకాలంలో పన్నులు కట్టేటట్లు ఒత్తిడిచేసే శక్తి, జమీందారుకు లేదు. ఈ విషయమై మిడ్నాపూర్ కలెక్టర్ ఈ విధంగా వ్రాసినాడు;-"ఈ దేశంలో, ఇంతటి పీడాకరమైన కఠిన విధానాలను, ఏ ప్రభుత్వమూ ఇంతవరకూ ప్రయోగించి ఉండలేదని, జమీందారులందరూ ఘోషపెట్టుతున్నారు.........

జప్తులతోను, వేలం అమ్మకాలతోను కూడిన ఈ విధానంవల్ల, బెంగాలులోని గొప్ప జమీందారులందరూ, కొన్ని ఏండ్లలోనే, దుస్థితికీ, భిక్షుకస్థితికీ, దిగిపోయిరి. కేవలం అంతర్దేశీయమునైన ప్రభుత్వ నియమాల మూలంగా, బెంగాలులోని వ్యవసాయ భూముల విషయంలో, ఇంత త్వరలో జరిగినంతటి సమూలమైన మార్పు, ఏ యుగంలోనూ, ఏ దేశంలోనూ జరుగలేదు."

"శాశ్వత పరిష్కారం జరిగిన మొదటి కొన్ని ఏండ్ల లోపలనే, జమీందారుల సంస్థానాలు అన్యాక్రాంతమై పోవడం మితిమీరిపోయి, రానున్న ఆపదను సూచకమయింది. 1796లో, లెక్కల ప్రకారం, 28,70,061, రూపాయల శిస్తు విలువగల భూములు,- అనగా బెంగాలు, బీహారు, ఒరిస్సా ప్రాంతాలలోని వ్యవసాయ భూమిలో పదోవంతు;-ఒక్క సంవత్సరంలో అమ్ముడైపోయినవి. 1796-97 సంవత్సరంలో, 14 లక్షలు శిస్తు విలువగల భూములూ, 1797-98లో 22.7 లక్షలు శిస్తు విలువగల భూములూ, అమ్మకమైపోయినవని, బేడెన్‌పొవెల్, వ్రాసియున్నాడు. "ఈ శతాబ్దం ముగిసేనాటికి, నాడియా, రాజషాహీ, బిషన్‌పూరి, దినాజపూర్ రాజుల సంస్థానాలలోని అధికభాగం అన్యాక్రాంతమైపోయింది. బర్ద్వాన్ సంస్థానముయొక్క శక్తి సామర్థ్యాలు ఉడిగిపోయినవి; బీర్‌భూమ్ జమీందారులు పూర్తిగా నాశమైపోయిరి. చిన్న జమీందారులనేకులకు కూడా ఇదే గతి పట్టింది. శాశ్వత పరిష్కారం అమలు జరిగిన పదేండ్లలోపుగానే, పరిష్కారానికి ప్రధాన విషయమైన సంస్థానాల సంవిధానంలోను, సంస్థానాల స్వామ్యంలోనూ సమగ్రమైన విప్లవం జరిగింది, అని చెప్పడం ఏమాత్రమూ అతిశయోక్తికాదు."

జమీందారులలోనైన దుస్థితిని గమనించి, వారికి తోడ్పడే ఉద్దేశంతో ప్రభుత్వం, 1799 లో, కొత్త వినియమాలను ప్రవేశపెట్టింది. వీటివల్ల కంపెనీ ప్రభుత్వానికి కలిగిన దుష్కీర్తి, దేశవ్యాప్తమైనట్టిది. రైతులను భూములనుంచి తీసివేయడానికి, బాకీమొత్తానికై అతని పశుధనాన్ని, ఇతర పరికరాలను జప్తుచేయడానికి అవసరమునైన స్వచ్ఛందాధికారాలు జమీందారుకు, ఈ నియమాలవల్ల సిద్ధించినవి. ఈ నియమాలు ఒకవైపు, నిస్సహాయులైన రైతులను పీడించి, స్వప్రయోజనాన్ని సాధించుకొనే విస్తారావకాశాన్ని జమీందారులకు కల్పించి, మరొకవైపు, గుత్తేదారుకు సంస్థానంపైగల సర్వస్వామ్యాన్ని స్థిరపరచినవి.

జమీందారీహక్కులలో ఏర్పడిన ఉపమాన్యపద్ధతి, (Sub infeudation), శాశ్వతపరిష్కారం కలిగించిన మార్పుల ఫలితాలలో రెండవది. ఈ ప్రక్రియ చాల వేగంగా జరిగింది. బెంగాల్ బీహార్ ప్రాంతాలలోని ముప్ఫై తొమ్మిది జిల్లాలలోని సంస్థానాలు, ఇరవైఏండ్లలో, 1,10,456 చిన్నచిన్న భాగాలుగా మారిపోయినవి. వీటిలో, 20,000 ఎకరాల విస్తీర్ణంకల సంస్థానాలు 0.4 శాతం మాత్రమే. మధ్యరకానికి చెందినవి,- అనగా, 500 ఎకరాలకు 20,000 ఎకరాలకు మధ్యఉన్నవి,- 11శాతం, 500 ఎకరాలకంటె చిన్నవి ఐన సంస్థానాలు 88 శాతం. ఇంగ్లాండు విషయంలో, 13 ఎకరాల [illegible] విస్తీర్ణంకల జాగీర్లు 2.4 శాతం; 130 ఎకరాలజాగీర్లు 12 శాతం; 4260 ఎకరాలజాగీర్లు [illegible] శాతం. ఇరవై ఏండ్లలోగా, పాట్నా విభాగంలోని సంస్థానాల సంఖ్య [illegible] విభాగంలోనివి, మూడింతలైనవి. ఈ విధమైన ఉపవిభాగానికి [illegible]నవి, వినియమ శాసనాలు. మొగలుల పరిపాలనలో, కుటుంబయజమానిని జమీందారుగా గ్రహించేవారు.

బ్రిటిషువారు ఈ పద్ధతిని పరిత్యజించి, వ్యక్తులకు భూమిపై స్వామ్యమున్నదనే వాదాన్ని అంగీకరించిరి. కాబట్టి, వారసత్వ సంబంధమైన న్యాయశాస్త్రం వీటికి వర్తింపడం జరిగింది. అందువల్ల, ఆస్తులను దాయాదులకు పంచిపెట్టే ప్రవృత్తి, త్వరలోనే ప్రారంభమయింది. ఈ విధంగా పట్టాభూములు విస్తీర్ణంలో చిన్నవై పోవడంవల్ల కలిగే ప్రమాదాన్ని, వాటిని సాగు చేయడం ఆర్థికంగా ఫలకారికాదనే విషయాన్ని, డైరెక్టర్లసభ 1809నాటికే గుర్తించింది; కాని ఎట్టి నివారణచర్యనూ తీసుకోలేదు. జమీందారుల కుమారులలో చిన్నవారికి [పెద్దకొడుకు తప్ప ఇతరుల] ఉద్యోగావకాశాలు, వేరే లేనందువల్ల, ఇండియాలో, జ్యేష్ఠాధికారపద్ధతిని (Primo-geniture) ప్రవేశపెట్టడం సాధ్యంకాలేదు. కాబట్టి, ఆస్తివిభాగపద్ధతిని ఆపడానికి వీలులేకపోయింది.

సాగుబడిభూముల ఏకాంశాలుమాత్రమేకాక, భాటకాన్ని వసూలుచేసే హక్కులు కూడా ఉపవిభజనకు పాల్పడినవి. నూతన జమీందారీ హక్కులకు విలువ ఏర్పడింది. రాజస్వపు జేరీజులో 11 వ శాతం మాత్రమే జమీందారుకు లభించే భాగమై ఉన్నాకూడా, శాశ్వతపరిష్కారం జరిగిన ఇరవైఏండ్లకాలానికే, ఈ జమీందారీ హక్కులకు, ఇరవైఎనిమిది సంవత్సరాల విలువకు అమ్ముడుపోయే విలువ ఏర్పడింది. కంపెనీ డైరెక్టర్లసభ ఈవిధంగా వ్రాసింది,- "జమీందారుల భత్తాలు, ఆదినుంచీకూడా నామమాత్రమైన వాటికంటె అధికమై ఉండడం జరిగి ఉంటుంది; లేదా స్వచ్ఛందాధికారాన్ని ప్రయోగించి, వారు తమ వరమానాన్ని పెంచుకొని ఉండడం జరిగి ఉంటుంది; లేదా, ఈ మధ్యకాలంలో, దేశముయొక్క వ్యవసాయసంపదా, భూమియొక్క విలువా, సాధ్యశ్యంలేనివిధంగా, వేగంగా పెరిగిపోయి ఉంటుంది; అని దీనినిబట్టి తెలుస్తుంది."

ఏది ఎట్లున్నా, భాటకాన్ని వసూలుచేసే హక్కులకు, పూర్వంకంటె ఎక్కువవిలువ ఏర్పడిందనే విషయం వాస్తవమైనది; కాబట్టి బజారులో కొని, అమ్మేవస్తువుగా సిద్ధించింది ఈ హక్కు. పదార్థాల ఉత్పాదనకు మూలసాధనంగాను, రైతులకు జీవనోపాధిగాను ఉండ వలసిన వ్యవసాయభూములు, ఊహాపోహలతో జరిపే పెట్టుబడి వ్యాపారానికి పనికివచ్చే వ్యవహారాలుగాను, ధనికవర్గానికి లాభం కూర్చే మూలసాధనాలుగాను, తయారైనవి. జమీందారు, తన అధీనంలోని రాజస్వాన్ని 'పట్నీదార్' అనే మధ్యస్థునికి గుత్తకు అప్పగిస్తాడు. ఇతడు మళ్ళీ 'దార్ పట్నీదార్' అనే ఉపగుత్తేదార్లతో కరారు చేసుకొంటాడు; ఇతడుకూడా 'సేహ పట్నీదారు'లు, అనే తన అధీనవ్యక్తులతో ఒప్పందాలు చేసుకొని, తన గుత్తను భాగాలుగా వారికి అప్పగిస్తాడు. ఈ విధంగా రాజస్వాన్ని వసూలుచేసే గుత్తేదార్లపరంపర, శ్రేణీబద్ధంగా ఏర్పడుతుంది. ఈ దుష్ప్రవృత్తి అత్యంతంగా పెరిగిపోయింది. జమీందారీ వ్యవస్థను రద్దుచేసే కాలానికి కొన్ని పట్టాభూముల విషయంలో మూలజమీందారుకూ రైతుకూ మధ్య, నూటయాభై మంది గుత్తేదార్లు ఏర్పడియుండిన విషయం బైటపడింది. ఈ గుత్తేదార్ల శ్రేణిలో ఉన్న ప్రతికార్యకర్తా, తన కిందివానిని పీడించి, సాధ్యమైనంత డబ్బును లాక్కోడానికి ప్రయత్నించేవాడు. ఈ గుత్తేదార్లందరూ ఒకరినొకరు పీడించి సంగ్రహించుకొన్న ద్రవ్యభారమంతా, పర్యవసానంలో రైతు భరించవలసి వచ్చింది.

ఆస్తి సంబంధాల విషయంలో కలిగిన ఈ విప్లవమువల్ల దేశములో కలిగిన పరిణామము, రెండు నూతన సాంఘికవర్గాల సృష్టికి హేతువయింది. (1) అత్యంతమైన ద్రవ్య

లాభాన్ని చేకూర్చే స్వంత ఆస్తిగా వ్యవసాయభూమిని పరిగణించిన సంపన్న భూస్వాముల వర్గం. (2) తాము సాగుచేస్తున్న భూములనుంచి తీసివేయగా వేరేమార్గంలేక, జీవనోపాధికై తమ శ్రమను అమ్ముకోవానికి సిద్ధపడిన రైతువర్గం.

ఈ రెండువర్గాలవారికీ మధ్యఉన్న గుత్తేదార్లందరూ ధనికులు కారు. ప్రతివాని యొక్క స్వప్రయోజనమూ స్వల్పమైనదే. వీరి ఆర్థిక పరిస్థితికూడా, ఆదాయవిషయంలో రైతుకంటె కొంచెము మాత్రమే మేలైనది. ఈ ఉపమాన్యపద్ధతియొక్క ప్రక్రియ జమీందారునూ, మధ్యస్థునీ, రైతునూకూడా, ఒక్క సమతలానికి అణచివేసింది. ఈ పరిస్థితిని గురించి, సర్. హెచ్. స్ట్రాచీ, ఈ విధంగా వివరించినాడు. "మనము, సమస్తాన్నీ చక్కగా మార్పు చేసినాము. మనము ప్రవేశపెట్టిన వినియమాలయొక్క సమతలన శక్తిచే, రైతూ, జమీందారూ, గోమాష్టా, అందరూ చాలవరకు సమానస్థితికి వచ్చినారు."

తత్ఫలితంగా, ఈరెండు వర్గాలవారి ప్రయోజనాలమధ్యా ఘర్షణ సిద్ధించింది; ఈ రెండు వర్గాలవారికీ సమానమైన విషయమే లేకపోవడం, ఇంతకంటె ముఖ్యమైన విషయం. వ్యవసాయ భూములను విక్రయించుకొన్న ఈ నూతన భూస్వాములలో అధిక భాగం వ్యాపారస్థులు. తమవద్ద మిగులుగాఉన్న ద్రవ్యాన్ని భూములపై పెట్టుబడిపెట్టి, అధికలాభాలను సాధించుకో దలచినవారు. వ్యవసాయ వ్యవహారాలతో పరిచయం లేనివారు; వ్యవసాయాభివృద్ధి విషయంలో ఆసక్తిలేనివారు. కాబట్టి, ఈ వ్యవహారాలను రైతుకు వదలి వేసినారు. కాని, వ్యవసాయాభివృద్ధికి అవసరమైన పెట్టుబడి, పరిజ్ఞానము, లేకపోవడమేకాక, అట్టిదానికి పూనుకొనే సంకల్పం కూడా లేనివాడు, కూలికి పనిచేసేరైతు.

యూరోపులోని వ్యాపసాయిక విప్లవాన్ని తెచ్చినవారు, ఉద్యమ సాహసికులైన భూస్వాములు; వీరు ధనాన్ని పెట్టుబడిపెట్టి, వ్యవసాయ విధానాన్ని అభివృద్ధికితెచ్చి, ఈ కార్యాన్ని సాధించిరి. ఇక, ఇండియాలోని భూస్వాములు, ఏనగరంలోనో దూరంగా నివసిస్తూ భాటకాన్ని వసూలు చేసుకోవడంలో మాత్రమే, ఆసక్తివహించిన వ్యాపారస్థులు. కాబట్టి వ్యవసాయాన్ని అభివృద్ధి చేయడంలో వీరు ఆసక్తి వహించలేదు. గ్రామీణ ప్రజానీకానికి నాయకులుగా ప్రవర్తించడానికి మారుగా, కంపెనీకాలంలోని ఇండియా భూస్వాములు, పరదేశ ప్రభుత్వాధికారానికి కార్యకర్తలుగా వర్తిస్తూ ఉండిరి. నిర్ధారణమైన రాజస్వ మొత్తాన్ని, ప్రభుత్వానికి సక్రమంగా చెల్లించే హామీపై జమీందారీ హక్కులను విక్రయించుకొని, రాజకీయంగా నిస్సహాయులు, ఆర్థికంగా దుర్బలులు ఐన రైతు వర్గాన్ని పీడించి, సాధ్యమైనంత లాభాన్ని సాధించుకొంటూ ఉండిన, వ్యక్తులు ఈ భూస్వాములు. పూర్వం, ఇండియాలోని రైతు తానే శ్రామికుడుగా, గుత్తేదారుగా భూస్వామిగా వర్తించినవాడు; బ్రిటిష్‌రాజస్వ విధానం శ్రమికవర్గాన్ని గుత్తేదారు వర్గాన్నీ, భూస్వామి వర్గము నుంచి వేరుపరచి, స్వప్రయోజన సాధకవర్గము, ధనిక పీడితవర్గము, అనే నూతన వర్గాలను రెంటినీ సృష్టికి తెచ్చింది.

*స్వార్థసాధనకై రైతువర్గాన్ని ఉపయోగించడము - వ్యవసాయ మాంద్యం:* వివరించడానికి సాధ్యముకాని దుస్థితికి రైతును పాల్పరచడం, నూతనవినియమాల పరిణామాలన్నిటిలోనూ అత్యంతమూ దుష్టమైనది. ఈ నూతన భూస్వాములు పూర్వపు జమీందారుల వంటివారుకారు; గ్రామంలో స్థానప్రతిష్ఠలు లేనివారు. తమ పెట్టుబడిపై వచ్చే లాభాలను గ్రహించడం మాత్రమే ప్రధాన ప్రయోజనంగాగల, లాభాంశజీవులు (Rentiers). కాబట్టి,

రైతులకు అన్యాయం చేయడం వీరికి సహజమైనదే. రైతులకు, సాంప్రదాయికంగా సిద్ధించి యుండిన అనుభోగ హక్కులను, ఒకదెబ్బతో తొలగించివేసి, వారిని తమ ఇచ్ఛా సంకల్పాలకు అధీనులైన భాటకదారుల స్థితికి, ఈడ్చివేసిరి. హింసాకాండతో, భాటకాన్ని వసూలు చేయడము, భూములనుంచి తీసివేయడము, మొదలైన క్రూరచర్యలకు రైతులను గురిచేస్తూ వచ్చిరి. భాటకదారుల బ్రతుకుకు మాత్రమే చాలినంత పొలాన్ని వారికి వదలి, తక్కిన పొలాన్నంతటినీ సంగ్రహించుకొనిరి.

కారన్‌వాలిస్ ప్రవేశపెట్టిన విధానంవల్ల వ్యవసాయ భూమి ఒక ఆస్తిగా సిద్ధించింది. ఈ ఆస్తి స్వభావం, పాశ్చాత్యభావానికి సరిపోయినట్టిదని సంక్షేపంగా చెప్పవచ్చు. ప్రాచీన కాలంలో విభక్తమైయుండిన వ్యవసాయభూములపై గల హక్కులు, పదేపదే జరిగిన సంస్థాన విక్రయాలవల్ల అమ్ముడుబోయే బజారు వస్తువుల స్థితికి, వచ్చినవి. వీటిని సమకూర్చుకొని, ప్రత్యేక స్వామ్యంగా చేసుకొన్నారు కొందరువ్యక్తులు. కాని, సంస్థానాల నూతన యజమానులు, గ్రామప్రయోజనాలకూ, వారి రైతులకూ బద్ధులైన ఒకసంస్థగా ఏర్పడినవారు కారు. సంస్థానాలను విక్రయించుకొన్న ఈ భూస్వాములు దూరపు నగరాలలో నివసిస్తూ, తమ భూములను చూడడానికి ఎన్నడూ వచ్చేవారు కారు; వీరి కార్యకర్తలు భాటకదారులైన రైతుల జీవితంలో ఏ మాత్రం సంబంధమూ కలిగించుకోని వ్యక్తులు.

*వడ్డీవ్యాపారస్థుడు,- రైతువారీ పరిష్కారాలు :* మదరాసు బొంబాయిప్రాంతాలలో ప్రవేశపెట్టిన రైతువారీ పద్ధతివల్ల ఏర్పడిన ఫలితాలు కూడా, ఈ విధంగానే విప్లవాత్మకములైనట్టివి. జమీందారుకు మారుగా, భూమికి రైతు యజమానిగా ఏర్పడడమొక్కటే, ముఖ్య భేదం. వ్యవసాయ భూమిని స్వంతఆస్తిగా గుర్తించడంతో, గుత్తకు, తనఖాకు, విక్రయానికి సంబంధించిన హక్కులన్నీ ఇప్పుడు రైతుకు సిద్ధించినవి. ఈ హక్కులు పూర్వం ఉండినవి కావు; ఒక సందర్భంలో, ఉండినప్పటికీ, వాటికి నిష్కర్ష ఐన పరిమితులు, ఏర్పడియుండినవి. అమూల్యములైన ఈ హక్కులు సిద్ధించినా కూడా, రైతు పరిస్థితి బాగుపడకపోవడం, దురదృష్టం. ప్రభుత్వము రైతుపై మోపిన బరువు దుర్భరమైనది కావడంవల్ల అతనికి మిగిలిన పంట అత్యల్పమైనది. కాబట్టి, భూసంబంధమైన ఆస్తివిలువ అతిహీనమైపోయి, దానిని విక్రయించుకోవడం లాభకారి కాకపోవడం, ప్రప్రథమంగా కలిగిన పరిణామం.

మితిమీరిన శిస్తులు విధించడం అవివేకమని, ప్రభుత్వం, త్వరలోనే గ్రహించి, వాటిని క్రమంగా తగ్గించే ప్రక్రియకు పూనుకొన్నది. తత్ఫలితంగా ప్రభుత్వపు శిస్తును చెల్లించగా మిగిలిన డబ్బును అనుభవించే అవకాశం, రైతుకు ఏర్పడింది. వెంటనే, భూముల విలువ పెరిగే సూచనలు కలిగినవి. భూములవల్ల లాభం సిద్ధించడంతో, పెట్టుబడిదారులు ఆకర్షింపబడిరి. బెంగాలులోని ధనికవర్గంవారు, జమీందారీ హక్కులను సమగ్రంగా విక్రయించుకొనిరి. బొంబాయి మదరాసు ప్రాంతాలలో, రైతును భూములనుంచి తొలగించడం అవసరమయింది; కాబట్టి, వడ్డీ వ్యాపారస్థుడు, రైతుకు అప్పులిచ్చి, అతని భూములను, పంటలను తన అధీనానికి లోబరచుకొన్నాడు. ఇది సాధ్యం కావడానికి కారణం, శిస్తులు వసూలు చేయడంలో ప్రభుత్వం అనుసరించిన కఠిన విధానం. పంటలు పండని సంవత్సరాలలో కూడా శిస్తులు చెల్లించవలసినట్లు రైతులను నిర్బంధించడంవల్ల, రైతులు అప్పులు చేయవలసివచ్చి, రుణదాతల చేతులలో చిక్కుకొన్నారు. రైతుయొక్క అజ్ఞానాన్ని, అతని దారి

ద్ర్యాన్ని, చక్కగా ఉపయోగించుకొన్నాడు రుణదాత. నిరంతరంగా అప్పులలో పడియుండే చిక్కులలో రైతును ఇరికించి, అతనికి కావలసిన అప్పులను ఇస్తూ వచ్చినాడు.

రైతు ఒక్కమారు రుణదాత చేతుల్లో చిక్కుపడడం చాలు. తన ఉపాయాన్నీ వంచనను, సమగ్రంగా ప్రయోగించి, తన దురాశకు బలిగా చిక్కిన రైతును బంధనాలలో ఇరికించి వేస్తాడు రుణదాత. రుణంపై విధించిన వడ్డీరేట్లు అత్యధికం కావడంవల్ల, ప్రతి సంవత్సరమూ వడ్డీ చెల్లించడమే రైతుకు కష్టంగా ఉండేది. తనకు వస్తూఉన్న ఆదాయం స్వల్పమైనదేకాక. పరిస్థితులనుబట్టి వ్యత్యాసాలకు గురిఔతూ ఉండడంవల్ల, అసలు మొత్తాన్ని తీర్చే అవకాశమే కలుగదు; అతనికి సాధ్యంకూడాకాదు. అసాధారణంగా కష్టపడి, మిగిల్చి ఏ రుణగ్రస్తుడైనా, అప్పు తీర్చివేసి, బంధన విముక్తి పొందడానికి ప్రయత్నించినా, రుణదాత, దాన్ని పడనిచ్చేవాడు కాదు. అప్పు లెక్కలను దిద్ది, దొంగ దస్కతులతో, రుణ పత్రాలను మార్చి, వడ్డీ మొత్తం బాకీఉన్నట్లు చూపించి, అప్పు తీసుకొన్న రైతును చిక్కుల్లో పెట్టేవాడు. రైతుకు ఏ విధమైన రక్షణా లేనందువల్ల నిస్సహాయస్థితిలో పడి పోయినాడు. న్యాయాలయాలను మొరపెట్టుకొనే అవకాశం అందరికీ ఉన్నదే. కాని, బ్రిటిషు వారు స్థాపించిన న్యాయపరిపాలన విధానంలో, ధనవంతుడైన రుణదాతకు విరుద్ధంగా నిలిచి గెలవడమనే అవకాశం, దరిద్రుడైన రైతుకు ఎన్నడూ లేదు. అతి దీర్ఘకాలం జరిగే కోర్టు వ్యవహారంలో దిగడానికి తగిన మూలాధారం ఉన్నవాడు కాదు రైతు. అట్టి సాహసోద్యమానికి పూనుకొన్న సందర్భంలోకూడా, అతనిని ఎదుర్కొనే చిక్కులు అనేకములు. తనకు ఏ మాత్రమూ అర్థంకాని కోర్టు దస్తావేజులలో, వ్రేలిముద్రలు వేయవలసి వచ్చేది. బ్రిటిషు న్యాయవిచారణ పద్ధతిలో మునిగియుండిన న్యాయస్థానాలు, రుణదాత దాఖలుచేసిన రుణ పత్రాలను, లెక్కల రిజిస్టర్లను, అప్పును నిరూపించే ఆధారసాక్ష్యాలుగా అంగీకరించి, రుణదాత ప్రవేశపెట్టిన, తప్పుడు సాక్ష్యాన్ని విశ్వసించి, అతనిపరంగా తీర్పులు ఇచ్చేవి. రైతు కోర్టుకుపోని సందర్భాలలో, రుణదాత, రైతు పొలంలోని పంటపై ధారణాధికారాన్ని (Lien) వహించి, బజారు ధరలకంటె తక్కువ వెలకు, ఉత్పత్తి సరకులను తానే విక్రయం కావించుకొనేవాడు. రైతు కోర్టుకు పోవడం జరిగిన సందర్భంలో, రుణదాతకు ఇవ్వవలసిన బాకీకై, తన పొలాన్ని, పోగొట్టుకోవడం, సాధారణంగా జరుగుతూ ఉండిన విషయం. గుత్తేదారులైన భూస్వాములకు, భాటకదారులైన రైతులకుగల సంబంధాలలో, విప్లవాన్ని తెచ్చి పెట్టింది జమీందారీ విధానం; రుణదాతకు, రుణగ్రస్తునికిగల సంబంధాలలో, విప్లవాన్ని కలిగించింది రైతువారీ విధానం. ఈ విధంగా రైతులను దురాశతో స్వార్థ ప్రయోజనం కొరకు ఉపయోగించుకొనే, రుణదాత అనే అంశాన్ని, గ్రామీణ సమాజంలో ప్రవేశపెట్టింది రైతు వారీ విధానం.

అప్పటినుంచి, రుణదాతలు, రైతులు, అనే రెండువర్గాల వారికీ మధ్య, నిరంతరమైన సంఘర్షణ ప్రారంభమయింది. రైతు శ్రమించి, ఉత్పాదించిన సాంవత్సరికాదాయంలో, అత్యధిక భాగాన్ని సంగ్రహించడానికి ప్రయత్నించేవాడు, రుణదాత. బ్రిటిషు నియమాల సహాయంతోను, వారి న్యాయశాస్త్ర ఆధారంతోను, రుణదాత, తన ఉద్దేశాన్ని సులభంగా సాధించుకొనేవాడు. 1852లో, క్యాప్టన్ వింగేట్, వివరించిన ప్రకారం, "రుణదాతకు, రుణ గ్రస్తునికి మధ్య జరుగుతున్న ఈ తుచ్ఛమైన ఘర్షణ, ఇరువురికీపూర్తిగా హీనస్థితిని కలి

గించేది. దేశంలో వేగంగా వ్యాపిస్తున్న ఈ విధమైన వర్గవైషమ్యము, ఈ విధమైన ప్రజల అవనతి, మన న్యాయవిధానంవల్లను, మన పరిపాలనవల్లను ఏర్పడిన, పరిణామములని భావించడానికికూడా నిరుత్సాహం కలుగుతుంది;కాని, ఈ వాస్తవ విషయాన్ని కప్పిపుచ్చడం, మన మనో దౌర్బల్యానికి నిదర్శనమౌతుంది. కొంతమంది వ్యక్తులను మాత్రమే ధనవంతులుగా చేయడానికై ప్రజానీకాన్ని నీతిభ్రష్టం కావించి, దరిద్రులుగాచేసే ప్రక్రియ, కొన్ని జిల్లాలలో అత్యధికంగా వ్యాపించియుండడం, సంతాపకరమైన విషయం. ఈ దుష్ప్రవృత్తి అన్ని జిల్లాలకు కూడా, వేగంగా వ్యాపిస్తూ ఉంది. న్యాయపరిపాలన విధాన, ప్రక్రియవల్ల, విపరీతమైన అధికారం రుణదాతకు సిద్ధించి ఉండడమే, ఈ దుస్థితి కంతటికీ హేతువుని, నా అభిప్రాయం." రుణదాతల వర్గాన్నిగురించి, విన్‌గేట్ ఇచ్చిన సాక్ష్యం ఈ విధంగా ఉన్నది;- "నీచులైన కుసీదకులతో (Usurers) ఏర్పడిన వర్గం, వేగంగా సృష్టికివస్తూ ఉంది. అత్యధికమైన వడ్డీరేట్లపై స్వల్పమైన అప్పులను, అతిహీనదశలో ఉన్న వ్యక్తులకు, స్వల్పకాలాల అవధులపై ఇచ్చే కుసీదకులు బయలుదేరినారు. ఈ అప్పులు తీసుకొనే వ్యక్తులు, ఏమాత్రమైన పరపతిలేనివారు కాబట్టి, గౌరవనీయులైన, గ్రామ బ్యాంకర్లవద్ద వీరికి రుణం లభించదు."

[ఈ విషయంలో, మరికొందరు విదేశీయుల అభిప్రాయాలను వివరించడం, అవసరము. బొంబాయి ప్రాంతానికి సర్వే కమీషనరుగా పనిచేసిన. క్యాప్టన్ విన్‌గేట్, రుణదాతకు, రుణగ్రస్తునికిగల సంబంధించిన సమస్యను, అతి సూక్ష్మంగా పరిశీలించినాడు. బ్రిటిషు పరిపాలనలోని దక్కను ప్రాంతంలో, రైతుల రుణాలు ఏ విధంగా పెరిగిపోయినవనే విషయాన్ని, అతడు వివరించినాడు. "మరాఠా పరిపాలనలో రుణదాతకు, రుణగ్రస్తునికి గల సంబంధాలను నిశ్చయించడంలో, అప్పులను చెల్లించడానికి సాధనమైన న్యాయవిధానాన్ని కార్యరూపంగా వర్తింపచేయనేలేదని, దృఢంగా చెప్పవచ్చు. అప్పు తీసుకొనే వ్యక్తియొక్క విశ్వాసంపైనా, సత్యసంధతపైనా, ముఖ్యంగా ఆధారపడినాడు, రుణదాత. దీన్నిబట్టి, అప్పులివ్వడం స్వేచ్ఛగా జరిగే వ్యవహారంకాదు. సొమ్ములను, భూములను, ఇండ్లను, లేక పంటపొలాలను, తనఖాపెట్టితేతప్ప, రుణం లభించేదికాదు. వ్యావసాయిక గ్రామాలలో రుణదాతకు రైతులకు, గల సంబంధాలు, పరస్పర ప్రయోజనాలపైనా, పరస్పర విశ్వాసంపైనా ఏర్పడియుండేవి. రైతు తీర్చగలిగినంత ద్రవ్యాన్ని మాత్రమే, రుణదాత, అతనికి అప్పుగా ఇచ్చేవాడు; దానిపై విధించిన వడ్డీకూడా, ఆకాలపు వ్యవహారంపైనా, ప్రజాభిప్రాయంపైనా, ఆధారపడేది. ఎక్కువవడ్డీని బనియా విధించియుండినట్లయితే, రుణగ్రస్తులు క్రమంగా జమ కట్టి ఉండేవారుకారు. వారిపై చర్యతీసుకొనే అవకాశం, రుణదాతకు ఉండేదికాదు. అట్టి పరిస్థితులలో, గ్రామంలోని రుణదాత, రైతులు, సామరస్యంతో తమ వ్యవహారాలను జరుపుకొనేవారు. ఇరువురూకూడా, సుఖదుఃఖాలను సమానంగా పంచుకొనే వారు."

"పరస్పరమూ అనుకూలములైన ఇట్టి పూర్వ పరిస్థితులు, మన పరిపాలన విధానంలో తారుమారైపోయినవి. రైతుయొక్క అభ్యుదయస్థితి, గ్రామరుణదాత యొక్క అభ్యుదయానికి ఆవశ్యకంకాదు. పరస్పర విశ్వాసానికి, పరస్పరాభిమానానికి మారుగా, అపనమ్మకము విద్వేషము ఏర్పడినవి. రుణగ్రస్తుని వ్యక్తిపైనా, అతని ఆస్తిపైనా, కోర్టు అభియోగంద్వారా, సంపూర్ణాధిపత్యం సాధించుకొనే అవకాశం, రుణదాతకు ఎప్పుడూ సిద్ధంగానే ఉంది. రైతు

జీవనమాత్రానికి అవసరమైన పంటనుమాత్రమే అతనికి వదలి, తక్కిన అతని శ్రమఫలితాన్నంతా సంగ్రహించుకోడానికి అవకాశం కలిగించే విధంగా, రైతును అప్పులలో ముంచియుంచడం, ఋణదాతకు ఎక్కువ ప్రయోజనకరమైనపద్ధతి. ఇది అతనికి సులభసాధ్యమయింది. రైతు ఎక్కువ అప్పులలో చిక్కుకోనంతవరకూ, ఋణదాత, అతని దుబారాకర్చులకు దోహదంచేస్తూ వస్తాడు. అతడు చెల్లించవలసిన కంతుల విషయంలోకూడా అతనిని బాధించడు. అప్పు అట్లే నిలిచియుండవచ్చు, రైతు తన సౌకర్యాన్ని అనుసరించి తీర్చవచ్చు అని అతనిని మభ్యపరుస్తాడు. సరళ స్వభావం కలవాడూ, పర్యాలోచన లేనివాడూఐన రైతు, ఋణదాతపన్నిన ఉచ్చులో సులభంగా పడిపోతాడు. బంధనాలు పదిలములై, తప్పించుకోడానికి వీలులేని సందర్భం ఏర్పడినప్పుడే, తన అవివేకాన్ని గుర్తిస్తాడు. ఆరోజునుంచి, రైతు, ఋణదాతకు దాసుడై పోతాడు. వడ్డీమొత్తాన్ని తగ్గించడంతప్ప, ఋణదాత మరేవిధంగానూ రైతుకు సహాయం చేయడు. ఎంతప్రయత్నించినా కూడా, రైతు, అసలుఋణాన్ని తీర్చజాలడు. ఋణదాత విశ్రాంతికై, రైతు శ్రమిస్తాడు; ఫలాన్ని ఋణదాత అనుభవించడానికై, ఇతడు భూమిని సాగుచేస్తాడు."

దక్కనుప్రాంతంలోని కొన్ని జిల్లాలలోను, ఉత్తరభారతంలోని కొన్నిజిల్లాలలోను, పూర్వపు పరిష్కారాధికారులు మహల్వారీ పరిష్కారాన్ని,- అనగా సమష్టి గ్రామపరిష్కారాన్ని- ప్రవేశపెట్టి ఉండినారు. ఈ పద్ధతి, ఇండియాదేశపు ప్రాచీన పరిష్కార పద్ధతికి అనుగుణమైనది. కాని, దీనిని అమలుజరిపిన ప్రథమ దశనుంచీకూడా, ఈ పద్ధతి కేవలం తాత్కాలికమైనదని, పర్యవసానంలో రైతువారీ పద్ధతిని ఏర్పరచవలెనని, ప్రభుత్వం ఉద్దేశించి ఉండినది. మదరాసు రాజస్వ పరిషత్తు ఈవిధంగా వివరించింది. "గ్రామ పరిష్కారం, ప్రతి గ్రామముయొక్క రాజస్వ బేరీజును నిశ్చయించడంతో, ప్రారంభమయింది. గ్రామ ప్రజలకు సమష్టిగానో, లేదా గ్రామ ముఖ్యునికో, గ్రామంలోని వ్యవసాయ భూములను, ప్రభుత్వం అప్పగించింది. కాని ఈభూలను, క్రమంగా విభాగించి, రైతులకు పంచడము, ప్రభుత్వముయొక్క ఉద్దేశము. ఈ విభజన ప్రతిపొలానికీ సంబంధించిందికాదు; ప్రతి రైతు అధీనంలోనూఉన్న సమస్తమైన పొలాన్నీ, ఏకాంశంగా గ్రహించి చేసే, విభజన ఇది. తత్ఫలితంగా, సమష్టిగాఉన్న పరిష్కారాన్ని, వ్యక్తిపరంగా పరిష్కారం కావించడం, ప్రభుత్వముయొక్క ప్రయత్నం. కాని, గ్రామసమస్తానికీ సంబంధించిన ప్రయోజనాలు ఈ మార్పులకు అనుగుణమై ఉండే విధానాన్నే, ప్రభుత్వం అనుసరిస్తుంది. రైతువారీ విధానములోని ప్రధాన సౌకర్యం ఈవిధంగా, గ్రామ పరిష్కారంతో సంయోజనం పొందింది. కాని, ఈ పరిపాలన చర్య సార్వత్రికంగా, తక్షణమే అమలు జరగలేదు. ప్రభుత్వ విధానము తాత్వికంగా, ఎంత అనుకూలమైనదిగా తోచినప్పటికీ, వ్యవసాయపు ఒప్పందాలకు, ప్రాచీనసంస్థలకు, దేశవాసుల పరిస్థితులకు వ్యతిరేకమై ఉండినట్లైతే, దానిని ప్రజలపై, బలవంతంగా విధించడానికి, ప్రభుత్వం ఇష్టపడలేదు. ప్రజల ఐశ్వర్యం వృద్ధిచెందడంతో, ఈపద్ధతికి ప్రతి బంధకములైన వాటిని అధిగమించవచ్చుననీ, దీనిని కలెక్టర్లు అధికారరీత్యా ప్రవేశపెట్టడానికంటె, క్రమంగా అభివృద్ధి పరచడమే శ్రేయమనీ, ప్రభుత్వం ఆశించింది."

*ఇండియా మధ్యమతరగతి యొక్క ఉద్భవం :* రైతువారీపద్ధతి ప్రవేశపెట్టడంలో రాజకీయోద్దేశాన్ని, థాకెరీ, చక్కగా వివరించినాడు. ఈపద్ధతిని సమర్థిస్తూ అతడు ఈవిధంగా

వ్రాసినాడు. "ఇండియా వ్యవహారాలను మనము ఆంగ్లేయ దృక్పథంతో గమనిస్తూ, ప్రాశ్చాత్య భావాలను కార్యరూపంలో పెట్టుతూ ఉండడంవల్ల, స్థాన విషయంలో ఉన్న వ్యత్యయాలను గురించి చర్చించడం, అవసరమయింది. అనగా క్రమబద్ధమైన సామాజిక వ్యవస్థకు పరిస్థితుల వ్యత్యాసం అవసరమని, కొందరు భావిస్తున్నారు. కాని, అది ఇండియా విషయంలో ఎంతవరకు వర్తిస్తుంది అని చర్చించవలసి యున్నది."

"భూమికి సంబంధించిన ఆస్తి విషయంలో సమాన పరిస్థితులు ఏర్పడడము, రైతులందరికీ వ్యవసాయ భూములను సాధారణంగా పంచడము, అనే పద్ధతులు వ్యవసాయాభివృద్ధికి అత్యంతమూ అనుగుణమైనవి కాకపోవచ్చు. కాని, ఇండియాలోని ఆస్తియొక్క స్థితిని, పరివర్తనలను, సంస్థలను అభివృద్ధికి తేవడానికి, ఈపద్ధతి ఎక్కువ అనుగుణమైనది. కొంతమంది పరదేశీయుల ప్రభుత్వానికి లోబడి యుండడంవల్ల, ఆత్మగౌరవ ప్రతిష్ఠలకు, ఉన్నత భావాలకు, ఉత్కాంక్షలకు అవకాశంలేని పరిస్థితులలో ఈపద్ధతి ఇంకా ఎక్కువగా ఉపకరిస్తుంది. ఇంగ్లాండు దేశంలోని వ్యవసాయోత్పత్తిలోని అధికభాగాన్ని ప్రత్యేకించి, దానిని కొన్ని సంపన్న కుటుంబాల పోషణకు, సెనేటర్లు, రుషులు, వీరులు ఇత్యాది ఉన్నత వ్యక్తులను వృద్ధిపరచడానికి, దేశసేవకు దేశరక్షణకు వినియోగించడం, మిక్కిలి ఉచితమైనదే. అనగా, పార్లమెంటు, సైన్యము, నౌకాదళము, విజ్ఞానశాస్త్ర సంస్థాపనలు, ఉదార వృత్తులు మొదలైన సంస్థలలో పనిచేస్తూ, తమదేశాన్ని సేవిస్తున్న సంపన్నకులీన వర్గాలకు, వ్యవసాయ భూములనుంచి సిద్ధించే భాటకంలోని అధికభాగం వినియోగం కావలెనని, దీని అర్థం. ఈభాటకాన్ని వినియోగించుకొనే అవకాశం లభించినందువల్ల, విశ్రాంతికాలము, స్వాతంత్ర్యము, ఉన్నతభావాలు వీరికి సిద్ధించినవి. కాబట్టి, వీటిని సక్రమంగా ఉపయోగించి, బ్రిటనుదేశాన్ని అత్యచ్చస్థితికి తెచ్చి, కీర్తిప్రతిష్ఠలను దానికి కలిగించకలిగినారు. చిరకాలం, వీరు ఆవిధంగానే సంపదను అనుభవిస్తూ, తమ దేశాన్ని సేవింతురుగాక. కాని ఇండియా దేశంలోని విషయంవేరు. ఎక్కువసంపదవల్ల కొన్నిసమయాల్లో, దురహంకారము, స్వచ్ఛందత, దురవగాహమైన భావప్రవృత్తి ఏర్పడడానికి ఎక్కువ అవకాశమున్నది. ఈప్రవృత్తులు, మనరాజ్యాధికారానికి, ప్రయోజనాలకు ప్రత్యక్షంగా విరుద్ధమైనవి. కాబట్టి, వాటిని అణచియుంచడం చాల ఆవశ్యకం. ప్రకృతి పరిస్థితులు, ప్రపంచ ప్రభుత్వాల పూర్వానుభవము, ఈ విషయాన్ని సమర్థిస్తున్నవి కాబట్టి, దీనిని ఎక్కువగా విస్తరించవలసిన అగత్యంలేదు. సేనాధిపతులను, రాజనీతిజ్ఞులను, శాసన నిర్మాతలను ఇండియా దేశం మనకు ఇవ్వనక్కరలేదు; మనకు అవసరమైన వారు, శ్రమపడి పనిచేసే రైతులు ......... కాబట్టి, రాజకీయ దృష్ట్యా పర్యాలోచించిచూడగా, చిన్న యజమానులకు అనేకులకు సాధారణంగా వ్యవసాయ భూమిని పంచిపెట్టడంలో, మిక్కిలి ప్రధానమైన ఆశయం ఇమిడి ఉన్నది. అప్రధానులైన, ఇట్టి రైతు యజమానులు ప్రభుత్వాన్ని ఎదిరించి, ఐక్యంతో నిలవడం సులభంకాదు."

థాకెరీ చెప్పినట్లుగా, "ఇండియాలోని బ్రిటిషు రాజ్యాన్ని రక్షించడానికి అవసరమైన, సెనేటర్లను, రుషులను, యుద్ధ వీరులను," సరఫరాచేయగల ఉన్నత వర్గాలను ఇండియాలో ఉత్పత్తి కావించడం కాని, ప్రస్తుతంఉన్న అట్టి వర్గాలను వృద్ధిచేయడం కాని, బ్రిటిషువారి ఉద్దేశంకాదు. కాని, శాసనకర్తల కోరికల ప్రకారంగానే శాసనాలు ఎల్లప్పుడూ పనిచేయవు. వ్యవసాయ భూములకు, సివిల్ సంస్థలకు సంబంధించిన నూతన న్యాయశాసనాలను అవలం

బించిన బ్రిటిషు పరిపాలన, ఒక నూతన సామాజిక వర్గాన్ని సృష్టికి తెచ్చింది. ఈ నూతన వర్గము, తన్ను సృష్టికి తెచ్చిన అధికారశక్తినే, పర్యవసానంలో, నాశం కావించింది.

ప్రాచీన వ్యావసాయిక వ్యవస్థను భగ్నం చేయడానికి, నూతన సామాజిక వ్యవస్థను సృష్టించడానికి, బ్రిటిషు ప్రభుత్వం ప్రవేశపెట్టిన వ్యవసాయ భూమి శాసనాలు దీనికి కారణాలైనవి. భాటకాన్ని వసూలుచేసే నూతన భూస్వాములు, రుణదాతలు, వ్యాపారస్థులు, మొదలైనవారు పందొమ్మిదో శతాబ్దంలో ఉత్పన్నమైన మధ్యమ తరగతికి, కేంద్రభాగంగా ఏర్పడిరి. విద్యాబోధనలు, ప్రభుత్వసేన వృత్తులుగా ఉన్న సాంప్రదాయిక వర్గాలవారూ, వీరూ, ఆంగ్లవిద్యాభ్యాసావకాశాలను ఉపయోగించికొన్న వారిలో మొదటివర్గంవారు. పందొమ్మిదో శతాబ్దంలోని న్యాయవాదులు, అధ్యాపకులు, శివిల్ ఉద్యోగులు, వర్తకులు, పారిశ్రామికులు,- మొదలైనవారందరూ, అనేక జాతి, కులాల వారితో ఏర్పడిన ఈ మధ్యమ తరగతి వర్గంలోని విద్యావంతులు. ప్రాచ్య పాశ్చాత్య ఖండాలకు మధ్య సంబంధ సాధనంగా నిలిచి, భారత దేశీయులకు రాజకీయ నాయకత్వం వహించిన విద్యావంతులు, ఈవర్గంలో ఉత్పన్నమైనవారు. దేశముయొక్క ఉత్కాంక్షలకు, ఆశయాలకు వీరే ప్రతినిధులుగా ఏర్పడినారు.

వ్యవసాయాన్ని పోగొట్టుకొన్న రైతులు, గ్రామీణ కార్మికులు, సేవకులు మొదలైన వారందరూ, పొలాలు లేనట్టి, కూలివర్గంగా ఏర్పడిరి;- దేశముయొక్క శ్రామికవర్గం ఇది. గ్రామ సంస్థలు నశించిపోవడంలో, రైతువర్గముతో గ్రామీణ కార్మికులకు, సేవకులకు, గల సంబంధాలు తెగిపోయినవి. వర్గాల మధ్యగల సంబంధాలు పూర్వాచారంపై కాక, పోటీ పద్ధతిపై ఏర్పడుతూ వచ్చినందువల్ల, ఈ శ్రామికవర్గానికి, తక్కిన వర్గాలవారితో సన్నిహిత సంబంధ సాహచర్యాలు నశించిపోయినవి. శ్రమించి కూలి సంపాదించుకోవడమనే సమానత్వం కల, వీరందరూ, ఒక వర్గంగా ఏర్పడిరి.

కార్ల్‌మార్క్సు అభిప్రాయాన్ని అనుసరించి, "సామాజిక వ్యవస్థను నిర్ణయించే ఆధార మూలకారణాలు, ఉత్పాదన పద్ధతులు, లేక, ఉత్పాదక పరిస్థితులు, అనేవి. వీటివల్లనే, ప్రజల భావరీతులు, వారి కార్యకలాపాలు, నాగరికతలు, ఉత్పన్నమౌతాయి." కాని, ఇండియాలోని ఆస్తి విషయంలో కలిగిన పరివర్తనం, సామాజిక విప్లవానికి హేతువయింది.

కాబట్టి, చారిత్రకంగా, ఇండియాలోని మధ్య తరగతి సృష్టికి విభిన్నమైనట్టిది. అప్పటి మధ్యమతరగతి, ప్రధానంగా, వర్తకులు, పారిశ్రామికులు, బుద్ధిమంతులు, విద్వాంస వర్గంలోని వారు, ఇత్యాదులతో ఏర్పడినట్టిది. వీరు, జీవనోపాధికై వ్యవసాయంపై ఆధార పడినవారు కారు. గౌరవ ప్రతిష్ఠలను, లాభాన్ని ఉద్దేశించి, వీరిలో కొందరు, సంస్థానాలను కొనవచ్చు; కాని, కేవలం వాటిపైన ఆధారపడిన వారు కారు. ఇండియాలోని మధ్యమ తరగతి విషయం వేరు. దేశంలోని వ్యావసాయిక వ్యవస్థలో పాతుకొని పోయినది ఈ వర్గం. వ్యవసాయంవల్ల సిద్ధించే ఫలితంపై, వీరి జీవనం ఆధారపడింది. ఇక, రైతువర్గాన్ని స్వప్రయోజనార్థం ఉపయోగించుకొనే విషయంలో, ఈ నూతన వర్గంవారు, పరిపాలక వర్గానికి ఆలంబనంగా నిలిచి, దాని అధీన కార్యకర్తలుగా వ్యవహరించడంతో సంతృప్తి చెందినవారు.

బ్రిటిషు పరిపాలనయొక్క ప్రథమదశలో, అనగా పందొమ్మిదో శతాబ్దపు మధ్యకాలం వరకు, పరిపాలకులకూ, నూతన ధనిక వర్గానికీ,-[భూస్వాములు, వర్తకులు, రుణదాతలు]-

మధ్య పరస్పర సహకారభావం సిద్ధించి ఉండింది. కాని, ఈ సహకారం ఎంతోకాలం నిలిచి యుండడం సాధ్యంకాలేదు. వర్తక వాణిజ్యాలలోను, పరిశ్రమలలోను, ప్రభుత్వ సేవలోను అవకాశాలకై ప్రయత్నించడం ఈ వర్గానికి సహజసిద్ధమైన ప్రవృత్తి. కాని, ఈ విషయంలో, ఒక ప్రబలశక్తి వీరికి అడ్డు తగిలింది. ఇండియాలోని బ్రిటిషు పరిపాలనకు ఆధారశక్తిగా ఉన్న ఇంగ్లాండులోని మధ్యమతరగతి, ఇండియా మధ్యమ తరగతి వారి ఉత్కాంక్షలకు విరుద్ధంగా నిలిచింది. సంపదను, ప్రాబల్యాన్ని సాధించుకోడానికి, ఔత్సుక్యంతో పూను కొన్నది ఇండియా మధ్యమ తరగతి. ఇదివరకే ఈ రెంటినీ సంపాదించుకొని, వాటిని రక్షించుకోడానికి పూనుకొన్నది ఇంగ్లాండు దేశంలోని మధ్యమ తరగతి. ఈ రెండు తర గతులకూ మధ్య ఏర్పడిన సంఘర్షణయొక్క వ్యక్త స్వరూపమే, ఇండియాలోని జాతీ యోద్యమం.

పాశ్చాత్య దేశాలలోవలెనే, ఇండియా మధ్యమతరగతికికూడా, లాభోద్దేశమే ప్రేరక శక్తి. కాని, వర్తక వ్యాపారాలలో బ్రిటిషువారు ఏకస్వామ్యాన్ని వహించి ఉండడము, పరి శ్రమల అభివృద్ధికి తగిన సాధన సంపత్తి, పరిస్థితులు దేశంలో లేకపోవడము,- అనే విష యాలు, ఇండియామధ్యమ తరగతివారి ఆశయసిద్ధికి, ప్రతిబంధకంగా నిలిచినవి. కేవలం, నగరాలకు, పట్టణాలకు, సంబంధించిన ప్రయోజనాలతో ఏర్పడిన నాగరవర్గము, ఈమధ్యమ తరగతి. పాశ్చాత్య విద్యపట్ల తీవ్రమైన ఆశను ప్రభుత్వోద్యోగాలపై మితిలేని కోరికను, విద్యాప్రధానమైన వృత్తులపట్ల ఆసక్తిని, ఈవర్గం ఎక్కువగా పెంచుకొన్నది. పరిపాలకుల పాశ్చాత్య వ్యవహార రీతులను, ఆచారాలను, ప్రవర్తనలను, గుడ్డిగా అనుకరించసాగింది. కాని, ఈ ప్రవృత్తిని పరిపాలకవర్గవారు హర్షించనూలేదు; గ్రామీణ ప్రజలు గౌరవించనూ లేదు. గ్రామసీమలలోని ప్రజానీకము యొక్క శ్రేయస్సును గురించీ, వారి అభివృద్ధిని గురించీ ఈవర్గమువారు చేసిందికూడా ఏమీలేదు. ఐనప్పటికీ, పూర్వసంప్రదాయ వ్యవస్థ భగ్నం కావడానికి అవసరమైన శక్తిని, ఉత్పాదింపచేసింది, ఈవర్గమే. ఇండియా స్వాతం త్రోద్యమానికి ప్రముఖులైన విద్యావంతుల వర్గాన్ని, దేశానికి సమకూర్చిఇచ్చింది ఈవర్గమే. బ్రిటిషువారు ప్రవేశపెట్టిన వ్యావసాయిక శాసనాల పరిణామమే, ఈమధ్యమ తరగతి. కాని, ఈవిధమైన పరిణామం సిద్ధిస్తుందని ఎవ్వరూ ఊహించియుండలేదు.

*గ్రామీణ సంస్థల శైథిల్యం* : ఇండియాలో బ్రిటిషువారు ప్రవేశపెట్టిన భూరాజస్వ విధానాలవల్లను, సమస్తమైన న్యాయపరిపాలన, రాజ్యపరిపాలన కర్తవ్యాలన్నిటినీ ప్రభుత్వో ద్యోగులేవహించడంవల్లను, పూర్వపు మధ్యవర్తుల అధికారాలన్నీ నశించిపోయినవి. అనగా, జమీందారీ, గుత్తేదారీ, గ్రామపంచాయితి,- మొదలైన సంస్థలన్నీ తొలగిపోయినవి. గ్రామీణ రైతు ప్రజానీకముయొక్క ప్రశాంత జీవితానికి, శతాబ్దాలుగా ఆకరమై యుండిన ప్రాచీన సామాజికవ్యవస్థ, ఈవిధంగా భగ్నమైపోయింది. తరువాతికాలంలో వచ్చిన ప్రభుత్వ పరిపాల కులు ఈ దుష్ఫలితాన్ని గమనించి, తమ అసమ్మతిని ప్రదర్శించిరి. ఉత్తరభారతంలో ఐనా, ఈగ్రామసంస్థలను రక్షించి, నిలిపియుంచవలెనని, సర్‌ఛార్లెస్ మెట్‌కాఫ్, తీవ్రంగా వాదించి నాడు. ఈవిషయమై అతడు ప్రభుత్వానికి వ్రాసిన నిర్దేశపత్రం ప్రసిద్ధిచెందింది. అతడు ఈ విధంగా వ్రాసినాడు. "ఈగ్రామ సంస్థలు చిన్న గణరాజ్యాలవంటివి. ప్రజలకు ఆవశ్యకము లైనవన్నీ, వీటిలోనే నిహితములై ఉండడంవల్ల, చాలవరకు, స్వతంత్ర మైనట్టివి; ఇతర

ప్రాంతాల సంబంధాలతో, అవసరం లేనివి. శాశ్వతంగా నిలిచియుండగాల సామర్థ్యం గ్రామ సంస్థకుమాత్రమే ఉన్నది; మరేదానికీలేదు. స్వయంపోషక సమర్థములై, ప్రత్యేకములైన చిన్న రాజ్యాలవలె స్థిరపడియున్నవి ఈగ్రామసంస్థలు. భారతదేశ ప్రజలను దుస్థితికి పాల్పరచిన అన్ని విప్లవాలలోనుంచి, పరివర్తనలలోనుంచి, వారినిరక్షించి, నిలిపినది ఈగ్రామ సంస్థల సంఘమే. ప్రజల జీవితాలలో సుఖసంతోషాలను, ఎక్కువ స్వేచ్ఛను, స్వాతంత్ర్యాన్ని పోషించడానికి, ఎక్కువగా అనుకూలించేది, ఈవ్యవస్థ. కాబట్టి, ప్రస్తుత గ్రామీణ సంవిధానాలను ఏమాత్రమూ, ఎన్నటికీ మార్చరాదని నాఅభిమతం; వీటిని భగ్నం కావించే ప్రతిప్రవృత్తి కూడా, దేశవినాశకరమైనదని నా దృఢవిశ్వాసం." ఉత్తరభారతంలో, భూపరిష్కార వ్యవహారాల నిర్వహణకు పూనుకొన్న, రాబర్ట్‌బర్డ్. ఈఅభిప్రాయాన్ని కార్యరూపంలో పెట్టడానికి ప్రయత్నించెను. కాని, ఈ ప్రాంతంలోని మహల్‌వారీ పరిష్కారం, గ్రామసంస్థల వినాశప్రక్రియను ఆపలేక పోయింది. సమగ్ర గ్రామాన్ని ఆధారంగా చేసుకొని బేరీజు మొత్తాన్ని నిశ్చయించినప్పటికీ, ప్రత్యేక భూములపై వ్యక్తులకుగల హక్కులను, ప్రభుత్వం గుర్తించి, వాటి విషయంలో హామీ ఇచ్చింది. జనాభాలో అధికభాగం వ్యవసాయంపై ఆధారపడుతూ రావడంవల్ల, వ్యవసాయ భూమిపై ఒత్తిడి ఎక్కువౌతూ వచ్చింది. తత్ఫలితంగా భూమికి విలువ ఏర్పడి, దానిధరలు క్రమంగా పెరుగుతూ వచ్చినవి. వ్యవసాయపు సరకులకు, బజారులు ఏర్పడడము, రైతులు నగదు పంటలకు పూనుకోవడమూ కూడా, ఇట్టి ఫలితాలనే కలిగించినవి. ఈ పరివర్తనలన్నీ గ్రామీణ వ్యవస్థపై ప్రబలమైన ఒత్తిడిగా పరిణమించడంతో, "గ్రామీణగణరాజ్యాలుగాను" "శాత్వతంగా నిలిచియుండగల సామర్థ్యంకలవిగాను" మెట్‌కాఫ్‌దృష్టికి గోచరించిన గ్రామసంస్థలు, క్రమంగా రూపుమాసి పోయినవి బెంగాలు జమీందారీ పద్ధతి కిందను, దక్షిణభారతంలోని రైతువారీ పద్ధతికిందను జరిగిన విధంగానే, ఉత్తరభారతంలోని మహల్వారీ పద్ధతికింద, అచ్చటి గ్రామ సంస్థలుకూడా. లోపించిపోయినవి.

ఈ విధంగా ప్రాచీన గ్రామీణ వ్యవస్థ శిథిలమైపోవడంతో, గ్రామీణ సమాజంలోని వివిధాంశాలను సంయోజనపరచియుండిన, సాంఘికబంధాలు తెగిపోయినవి. అవిభక్త కుటుంబాలు, పంచాయతీలు, విచ్ఛిన్నమైపోయినవి. సహకార విధానం తొలగిపోయి, పైపోటి పద్ధతి ప్రచారానికి వచ్చింది. వస్తువుల ధరలు, బాడుగలు, కూలీలు-(Wages), అన్నీ కూడా, కొనేవారికీ, అమ్మేవారికీ మధ్య ఏర్పడే కరారులపై నిర్ధారమౌతూ వచ్చినవి. గ్రామంలోని సామూహిక జీవనంపోయి, వైయక్తిక జీవనం నెలకొన్నది.

ఉత్పాదన పద్ధతులకు గ్రామీణ ఆర్థిక వ్యవస్థకు, ఆధారభూతములైన విషయాలు కూడా మార్పుచెందినవి. వ్యావసాయిక ఉత్పాదన, గ్రామీణ ప్రజల అవసరాలకు అనుగుణంగా జరగడానికి మారుగా, బాహ్యబజారుల అవసరాలను అనుసరించి జరుగుతూవచ్చింది. రైతుకు ద్రవ్యావసరం ఎక్కువైనందువల్ల దానిని సాధించుకోడానికై, నగదు సస్యాల పెంపకానికి, ఆరంభించినాడు. పూర్వం రైతుల ఆదాయానికి సంబంధించిన అనిశ్చితస్థితి, వాతావరణ పరిస్థితులవల్ల ఏర్పడినట్టిది మాత్రమే: ఇప్పుడు బజారు ధరల అనిశ్చితత్వంవల్ల కలిగే అన్ని వ్యత్యయాలకూ గురియైనాడు. వ్యావసాయిక సరకుల ధరలు, ప్రపంచంలోని ఏ బజారులో పడిపోవడం జరిగినా, అది రైతు వ్యాకులత్వానికి హేతువయింది; దుర్భిక్షంవల్ల

కలిగే పంట నష్టమువంటిదిగా ఇది పరిణమించింది. శిస్తును సకాలంలో ప్రభుత్వానికి చెల్లించ వలసి ఉండడం వల్లను, ప్రతి సంవత్సరమూ కలిగే ఇతర స్వంత అవసరాలవల్లను, రైతుకు నగదు ద్రవ్యం, అత్యావశ్యక మయ్యేది. అందువల్ల, కోతలు పూర్తికావడంతోనే, తన సరకు లను అమ్మివేయవలసిన పరిస్థితికి లోనైనాడు. ఈ విధంగా రైతు ద్రవ్యసంబంధమైన సుడి గుండములోనికి ఆకర్షింపబడినాడు. అతని అనుభోగంలోని భూమి చిన్నది కావడము, భూమిపై విధించిన శిస్తు ఎక్కువై ఉండడము, భూస్వామి హింసాచర్యలను ప్రయోగించి శిస్తు వసూలుచేయడము, రుణదాత కుసీద పద్ధతిలోని వడ్డీబు విధించడము,- మొదలైన విష యాలన్నీ రైతుపై పడడంతో, వ్యవసాయ భూముల విషయంలో జరిగిన మార్పు, రైతుకు లాభించలేదు. ఈ పద్ధతివల్ల సిద్ధించిన ప్రయోజన లాభాన్ని అనుభవించిన వారు, గ్రామం లోని ధాన్యవర్తకుడు, సరకుల బజారులోని దలాలీ వర్తకుడు.

దేశంలోని గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో కలిగిన మార్పులవల్ల ఏర్పడిన దుష్ట ఫలితాలను అనుభవించిన వారు, కేవలం రైతులు మాత్రమే కాదు. విదేశాలనుంచి దిగుమతి ఐన వస్తు వులకు గ్రామంలో ప్రవేశం కలగడంతో, గ్రామీణ పరిశ్రమలు, వృత్తి కర్మలు, నశించి పోయినవి. వృత్తి కార్మికులు తయారుచేసిన వస్తువులను కొనేవారు లేకపోయిరి; వాటిని అమ్మడానికి తగిన బజార్లు లేవు. పారిశ్రామిక కార్మికుడు, పొలంలేని సామాన్య శ్రామికుడై పోయినాడు. వ్యవసాయ కార్యకలాపంలో, భాటకదారుడుగా కొంతకాలము, కూలివాడుగా కొంతకాలము, పనిచేస్తూ, పొట్ట పోసుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. పొలాలనుంచి తొల గించబడిన రైతువర్గం తర్వాత, పాలెవాండ్లు మొదలైన గ్రామీణ కార్మికుల వర్గం ఏర్పడింది. పందొమ్మిదో శతాబ్దపు పూర్వార్ధంలో, గ్రామ సీమలలో ఏర్పడిన ప్రధాన శ్రామిక వర్గం ఇది.

*అతి భారమైన శిస్తు - వ్యవసాయ మాంద్యత :* వ్యవసాయ భూముల ఒప్పం దాల విధానం ప్రాచీన గ్రామీణ వ్యవస్థను భగ్నంచేయగా, అతి భారమైన శిస్తుల విధానం వ్యవసాయాభివృద్ధిని ఆటంకపరచి, రైతువర్గాల వారిని హీనమైన దరిద్రావస్థకూ, మూలా ధారంలేని నిస్సహాయ స్థితికీ తెచ్చింది.

యూరోపు ఖండంలో వలెకాక, ఇండియాలోని వ్యవసాయ భూమి సమస్తమూ పరి పాలకునకు చెందినదని బ్రిటిషువారి సిద్ధాంతం. దేశాన్ని జయించి, ఆక్రమించడంవల్ల,ఇండియా భూమియొక్క స్వామ్యమంతా ఈస్ట్ ఇండియా కంపెనీకి సంక్రమించిందని, అందువల్ల, దేశా ధిపత్యం వహించిన కంపెనీ ప్రభుత్వానికి, భాటకంలోని అధిశేషమంతా గ్రహించే హక్కు ఉన్నదనీ, వీరివాదన. ఉత్పాదన సరకుయొక్క విలువలోనుంచి ఉత్పాదన కర్చులను తీసి వేయగా మిగిలింది, ఈ అధిశేషము. దీనిని ఈ విధంగా నిశ్చయించిన ఆర్థికవేత్త, రైకార్డు.

బెంగాలులో శాశ్వత పరిష్కారాన్ని విధించిన కాలంలో, ఈ అధిశేషంలోని 89 శాతం, ప్రభుత్వ భాగంగా నిశ్చయింపబడింది. మిగిలిన 11 శాతాన్నీ, రాజస్వాన్ని వసూలు చేసినందుకు ప్రతిఫలంగా జమీందారుకు నియమితమయింది. ఉత్తర భారతంలో, 1822 వినియమాల VII ప్రకారం, భూసంబంధమైన ఆస్తిలో 80 శాతం, ప్రభుత్వ రాజస్వంగా నిశ్చయింపబడింది.

1824 - 28 లో, జరిగిన మొదటి క్రమబద్ధమైన పరిష్కారానికి ముందు, ప్రయోగాత్మకంగా జరిపిన పరిష్కారాలప్రకారం, బొంబాయి రాజధానిలో విధించిన శిస్తులు, అత్యమితమై ఉండినందువల్ల, గవర్నర్ కూడా ఈవిషయమై వ్రాయవలసి వచ్చింది. "ప్రణాళిక ప్రకారం, ఇక్కడ అవలంబించిన శిస్తువిధానం, అమలు జరగడానికి సాధ్యంకానిది. గత సంవత్సరమే, శిస్తు నాలుగున్నర లక్షలు పెరిగింది. ఈపరిస్థితినాకు ఏమాత్రమూ, తృప్తి కలిగించలేదు. అధికంగా విధించిన ఈరాజస్వాన్ని వసూలుచేయవలసిన మార్గాలూ, వాటి మూలాధారాలూ నాకు తెలుపలేదు; అంతేకాక, రాజస్వాన్ని వృద్ధిచేయడానికిగల కారణాలు కూడా నాకు తెలియనీయకుండా, గోప్యంగా ఉంచుకొన్నారు." వేలంలో ఎక్కువడబ్బును పాడినవానికి భూములను గుత్తకు ఇచ్చేపద్ధతిని, అహమదాబాదు జిల్లాలో ప్రవేశపెట్టడం వల్ల, "ప్రభుత్వరాజస్వాన్ని బలవంతంతో పెంచే ప్రవృత్తి ఏర్పడింది." రాజస్వవిషయంలో దక్కనులోని జిల్లాలలోను, ఖాందేష్ జిల్లాలలోను ఇట్టి పరిస్థితులే సిద్ధించినవి. సర్వేను, పరిష్కారాలను, సంబంధించిన, క్రమబద్ధమైన కార్యక్రమాలను 1824 లో, ప్రింగల్, ప్రారంభించినాడు. కాని, ఈకార్యాన్ని ప్రభుత్వం 1828 లో, వదలివేసింది. భూరాజస్వ డిమాండ్‌ను నిర్ధారణ చేయడంలో, నికరమైన ఉత్పాదనలో 55 శాతం ప్రభుత్వభాగంగా, నిర్ణయించే సూత్రాన్ని ప్రభుత్వం అంగీకరించింది. కాని ఈ అంగీకారం నిర్ణయపత్రంలోని వ్రాతగానే నిలిచిపోయింది. కార్యరూపంగా వసూలుచేసిన మొత్తం, దీనికంటె ఎంతోఎక్కువ. పొలంకొలతలు "పూర్తితప్పుగా ఉండడము," శిస్తుడిమాండుకు ఆధారమైన "ఉత్పాదన అంచనాలు," అతిశయోక్తులతో ఏర్పడియుండడము, ఇందుకు హేతువులు. 1835 లో ప్రారంభమైన రెండవసర్వేలో, గోల్డ్‌స్మిడ్, విన్‌గేట్‌లు, పేరీజుయొక్క ఆధారాన్నే పూర్తిగా మార్చివేసిరి. భూమిలో ఉత్పత్తిఐన సరుకులో ఒకభాగాన్ని ప్రభుత్వంకోరడానికి మారుగా, భూమి విలువయొక్క అంచనాపై శుల్కాన్ని రాజస్వంగా విధించింది ప్రభుత్వం.

అంతకుపూర్వం మదరాసు ప్రాంతంలో జరిగిన పరిష్కారాల ప్రకారం, ప్రభుత్వపు డిమాండు, ఉత్పాదన మొత్తంలో 45 నుంచి 55 శాతంవరకు నిశ్చయించడం జరిగింది. ఉత్పాదన కర్చులు, సమగ్ర ఉత్పత్తిలో సగంగా నిర్ణయించి, మదరాసు ప్రభుత్వము పూర్తి అధిశేషాన్ని, తన భాగంగా గ్రహించివేసింది. ఈపద్ధతి, పీడాకరమైనదని తర్వాత గమనించి, మదరాసు ప్రభుత్వం. సమగ్ర ఉత్పాదనలో మూడోవంతును ప్రభుత్వభాగంగా, గ్రహించవలసిందని, కంపెనీ డైరెక్టర్ల సభకు వ్రాసిరి. "మూడోవంతునుకాని, లేదా, ఉత్పాదనలోని ఏభాగాన్నైనాకాని, స్థిరమైనదిగా గ్రహించి, దానిని ఆధారంగా చేసుకొని, శిస్తులను నిర్ధరించడం సాధ్యమౌతుందా. అనే, సందేహాన్ని, డైరెక్టర్లసభ లేవదీసింది." ఐనా, ఈరాజధాని విషయంలో, సమగ్రోత్పత్తిలో మూడోవంతును రాజస్వంగా ప్రభుత్వం గ్రహించే సూత్రాన్ని, కట్టకడపటికి ప్రభుత్వం, అంగీకరించింది. కాని, సమగ్రోత్పాదనలో సగభాగం. ఉత్పాదన కర్చులకు వినియోగమౌతుందనే భావాన్ని ఆధారంగా చేసుకొని, సమగ్ర ఉత్పత్తి అధిశేషంలోని 66 2/3 శాతం, ప్రభుత్వముయొక్క శిస్తుగా, నిశ్చితమయింది. ఉత్పాదనకర్చులు అధికంగా ఉన్న చిన్న వ్యవసాయ భూముల విషయంలో, ఈ శిస్తుభాగం 66 2/3 శాతంకంటె ఎక్కువగా ఉండడం తప్పదు. కాబట్టి రైతుయొక్క నికరాదాయాన్నంతా, ప్రభుత్వం, తన రాజస్వ డిమాండుగా చేసిన సందర్భాలు కూడా ఉన్నవి.

శిస్తు రేట్లు ఇంత అధికమై ఉన్న పరిస్థితిలో వ్యవసాయ వ్యవస్థలో మూలధనం ఏర్పడడానికి ఏ మాత్రమూ సాధ్యంకాదు. కాబట్టి, వ్యవసాయ భూమిని అభివృద్ధి పరచుకొనే అవకాశం, యజమానునికి ఏ మాత్రమూ సిద్ధించదు. శాశ్వత పరిష్కారం ఏర్పడిన ప్రదేశాలలో, భాటకాన్ని వసూలుచేయడం మాత్రమే, తన విధ్యుక్తధర్మంగా భావించినాడు, జమీందారు. తాను వసూలుచేసే భాటకం, ఉత్పాదనకు అనుగుణమైనదా, లేదా, అనే ప్రశ్న అతనికి సంబంధించింది కాదు. ఈ ప్రదేశాలలో, భాటకదారులతో జమీందారు, లేక భూస్వామి చేసుకొన్న కరారుపై భాటకం ఆధారపడిందే కాని, భూమిలో ఉత్పాదన కావించిన సరకుపై ఆధారపడలేదు. భూస్వామి, భాటకదారులను హింసాకాండకు గురిచేసి, అధిశేషాన్ని సంపూర్ణంగా తన వశం కావించుకొని, కేవలం జీవనాధారాన్ని మాత్రమే రైతులకు వదలివేసినాడు; ఋతుకాలిక వ్యత్యయాలను, ఇతర దురదృష్ట పరిస్థితులకు సంబంధించిన రైతు దుస్థితులను ఏ మాత్రమూ గమనించలేదు. రైతువారీ పద్ధతి ప్రచారంలో ఉన్న ప్రదేశాలలో, ప్రభుత్వమే, హింసాకాండకు పూనుకొన్న భూస్వామిగా ప్రవర్తించింది. మదరాసు, బొంబాయి రాజధానులలోనూ, తాత్కాలిక పరిష్కారాలు జరిగిన ఉత్తరభారత మహల్వారీ ప్రాంతాలలోనూ, విధించబడిన రాజస్వ డిమాండు, అత్యధికమై, వ్యవసాయ భూమిలో ఉత్పత్తిఐన మిగులునంతా, సమగ్రంగా మింగివేసింది. కాబట్టి, రైతులవద్ద, ఏ మాత్రమూ డబ్బు మిగలకపోవడంవల్ల, వ్యవసాయంలో ఏ మాత్రమూ పురోభివృద్ధి జరుగలేదు.

ఇంతటి బాధాకరమైన భూమి రాజస్వవిధానాన్ని, ప్రభుత్వం అవలంబించడానికి కారణాలు, లేకపోలేదు. ఇండియా దేశాన్ని జయించి, ఆక్రమించడంలో కంపెనీకి కలిగిన అమితమైన ఖర్చును, అతి వ్యయంతో కూడిన తమ పరిపాలన వ్యవస్థయొక్క ఖర్చును, భరించడంలోగల వ్యాకులత్వం ముఖ్యకారణం. 1799-1800 సంవత్సరంలో, కంపెనీ మొత్త వ్యయం, 100 లక్షలు పౌనులు; 1801-1802లో 124 లక్షలు. ఆపైన, ఖర్చులు వరుసగా ఎక్కుతూ పోయినవి. 1825-26 నాటికి, ఈ వ్యయం 242 లక్షల పౌనులకు పెరిగింది. విలియంబెంటింక్ ప్రభువు, ఇండియాకు వచ్చిన 1823 సంవత్సరంనుంచీ, ఆరేండ్లవరకూ, ఖర్చులు తగ్గించడానికీ, పరిపాలన వ్యవస్థలోని, ఉద్యోగాలను తగ్గించడానికీ, అతడు ప్రయత్నం చేసినాడు. ఈ ప్రయత్న ఫలితంగా. 1835-36 నాటికి, సంవత్సర వ్యయం 160 లక్షల పౌనులకు దిగిపోయింది. ఆతర్వాత, మళ్ళీ ఖర్చులు పెరగడం ఆరంభమయింది. 1857 లో జరిగిన విప్లవం నాటికి,320 లక్షల పౌనులదాకా వ్యయం పెరిగింది.

పరిపాలనకు సంబంధించిన ఖర్చులను ఇండియాదేశం భరించవలసిందిగా, కంపెనీ ప్రభుత్వం నిశ్చయించింది. కాని, ఇండియాలోని, ఆదాయమూలాధారాలు, అప్పటికే సన్నగిల్లుతూ వచ్చినవి. పరదేశీయ విజేతలు, ఇండియాలోని వర్తకాన్నీ పరిశ్రమలనూ ఇదివరకే నాశంకావించి ఉండడంవల్ల, ఈపన్నుల భారమంతా దరిద్రులైన రైతులపై పడింది. 1792-93 సంవత్సరంలో, బెంగాలు రాజధానిపై ప్రభుత్వం మోపిన రాజస్వడిమాండు 31 లక్షలు పౌనులు; 1835-36 నాటికి, దానిని 33 లక్షలకు పెంచిరి. ఈ ప్రాంతం ఇదివరకే శాశ్వత పరిష్కార విధానంకిందికి వచ్చిఉండడంవల్ల, ఈశిస్తుయొక్క ఆధిక్యం, సాగుబడి భూముల విస్తృతికి సంబంధించినట్టిది. మదరాసు, బొంబాయి, పశ్చిమోత్తర ప్రాంతాలలో మోపిన అధికశిస్తుల బేరీజువల్ల, రాజస్వంలోని ఈ ఆధిక్యం ఏర్పడింది. ఇందుకు నిదర్శ

నంగా;- 1810-11 సంవత్సరంలో మదరాసు రాజధానిలో వసూలైన రాజస్వ మొత్తం, 10 లక్షలు పౌనులకు కొంచెం అధికం మాత్రమే; కాని, 1825-26 నాటికి ఇది 40 లక్షలకు పెరిగింది. అనగా, పదహైదు సంవత్సరాలలో, ప్రభుత్వముయొక్క ఆదాయం నాలుగురెట్లు వృద్ధి చెందింది. బొంబాయిదేశంలో కూడా ఈ విధంగానే ఆదాయం పెరిగింది. 1817 సంవత్సరంలో 800,000 (8 లక్షలు) పౌనులై ఉన్న ఆదాయం, 1818 నాటికి (ఒక్క సంవత్సరం కాలంలోనే) 1,500,000 (15 లక్షలు) పౌనులకు అధికమయింది. 1837-38 నాటికి 186 లక్షల పౌనుల ఆదాయం ప్రభుత్వానికి లభించింది. [ఇరవై సంవత్సరాలకాలంలో, పదిరెట్లకు పైగా ఆదాయం పెరిగిందని ఈ లెక్కలనుబట్టి తెలుస్తుంది.] ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలనకాలంలో, ఈ రాజస్వ ఆదాయమే విత్తవ్యవస్థ కంతటికీ ఆధారమై ఉంది. శిస్తు బేరీజులను నిర్ణయించడంలో తమ ప్రభుత్వముయొక్క అవసరాలను దృష్టిలో పెట్టుకొన్నారేకాని, వాటిని చెల్లించగల శక్తి రైతులకు ఉన్నదా అనే విషయాన్నే, గమనించలేదు. కాబట్టి, ధర్మ న్యాయసమ్మతం కానట్టి, ఈ శిస్తు పద్ధతివల్ల రైతువర్గం, నాశమైపోయిఉండడం, ఆశ్చర్యం కాదు. తత్ఫలితంగా, వ్యవసాయ వ్యవస్థ అత్యంతమైన మాంద్యస్థితికి వచ్చింది.

"దోషయుక్తమైన వ్యవసాయ భూమి విధానానికీ, వ్యవసాయభూములపైగల అత్యాసక్తికీ మధ్య ఏర్పడే ఘర్షణవల్ల, వ్యావసాయిక సంబంధమైన చిక్కులు, దురవస్థలు, సిద్ధిస్తాయి. మితవ్యయపద్ధతిని ఏ మాత్రమూ పాటించని, వ్యావసాయిక వర్గాలవారు కూడా, ఈ అత్యాసక్తికి లోనైనవారే." ఇటువంటి విరుద్ధ పరిస్థితులలో కూడా, ఇండియా రైతు, భూమిని అంటిపెట్టుకొని, కష్టపడి, చెమటోడ్చి, లాభకరం కానట్టి ఈ వృత్తినే ఆధారంగా చేసుకొని, పొట్ట పోసుకొంటున్నాడు."

భూమిపై రైతుకుగల "అత్యాసక్తి" దీనికి కారణం కాదు ; జీవనోపాధిని కలిగించే మరొక అవకాశం లేకపోవడమే, ఇందుకు కారణమని స్పష్టంగా విదితమౌతూనే ఉంది. క్షీణదశకు వస్తున్న వ్యవసాయ వ్యవస్థపై వృద్ధిఔతున్న జనాభా, ఆధారపడి జీవించవలసిన దురదృష్టం పట్టింది. ప్రజానీకానికి కలిగిన దురవస్థా, క్షామాలు రోగాలు మాటిమాటికీ ఏర్పడడమూ, దేశంలో పాతుకొనిపోయిన నిరుద్యోగస్థితీ,- ఇవన్నీ, ప్రభుత్వవిధానమువల్ల, అనివార్యమై సిద్ధించిన దుష్ఫలితాలు.

బ్రిటిషువారి రాజ్యాదాయ విధానమువల్లను, వ్యవసాయభూమి విధానమువల్లను, ప్రాచీన సంస్థలూ, శతాబ్దాలుగా, రైతుల శాంతి జీవనానికి ఆకరములై ఉండిన గ్రామీణవ్యవస్థా, నశించిపోయినవి. సామాజిక వ్యవస్థను, బాహ్యప్రభావ ప్రాబల్యాల నుంచి రక్షిస్తూ ఉండిన రక్షక కవచం, ఈ విధంగా భగ్నమైపోయింది. స్వంత ఆస్తి, వైయక్తిక ఉద్యమప్రయత్నం, మూలధన సంచయనం, సాంకేతిక విజ్ఞానాభివృద్ధి,- మొదలైనవాటిపై ఆధారపడిన సమాజం ఏర్పడడానికి, అవకాశ మార్గాలు సిద్ధమైనవి.

# 10

# బ్రిటిష్ పరిపాలనయొక్క సాంఘిక ఆర్థిక పరిణామాలు వ్యాపార పరిశ్రమల క్షీణత

## I పదిహేడో శతాబ్దంలో, ఇండియాయొక్క పారిశ్రామిక, వాణిజ్య ఆధిపత్యం

పదిహేడో శతాబ్దపు కడపటి రోజులలో, ఇండియాదేశము పారిశ్రామిక రంగంలో ఆధిపత్యం వహించిఉండింది. ఇంగ్లాండు దేశములోని సంప్రదాయ వైఖరులలోను, దుస్తుల విషయంలోను విశిష్టమైన మార్పులు కలగడంవల్ల, ఇండియా దేశంలో తయారైన నూలు వస్త్రాలకు ఒక్కసారిగా, గిరాకీ ఏర్పడింది. శతాబ్దాలుగా ధరిస్తూఉండిన మొరటు ఉన్ని గుడ్డలపై ఆంగ్లేయులకు విసుగుపుట్టి, తేలికగా, నాజూకుగా ఉండే ఇండియా వస్త్రాలపై ఆసక్తి కలిగింది. ఇండియాలో తయారైన కలంకారీ వస్త్రాలపైనా, చీటీ గుడ్డలపైనా ఆంగ్ల స్త్రీలకు మోజు ఏర్పడింది. పద్దెనిమిదో శతాబ్దాదిలో ప్రకటింపబడిన ఒక పత్రికలో, ఈ విధంగా వ్రాసిఉంది, "మన స్త్రీలందరూ,-ధనికులు, బీదలుకూడా-హఠాత్తుగా చీటీ వస్త్రాలను ధరిస్తూ ఉండడం మనం చూస్తున్నాము. ఈ వస్త్రాల రంగులు ఎంత మెరుగుగా ఉంటే, ఎంత ఆడంబరంగా ఉంటే, అంత ఎక్కువగా వాటిపై ఇష్టపడుతున్నారు." అనేక రకములైన ఇండియా చీటీ గుడ్డలు, పూర్వంకూడా, ఇంగ్లాండులోకి దిగుమతి ఔతూఉండేవి; కాని వాటిని దుస్తులుగా ఉపయోగించేవారు కారు. దుస్తుల విషయంలో, ప్రజల సంప్రదాయ వైఖరులు మారడంవల్ల, "ఇంతవరకూ నేలపై పరవడానికీ, కుర్చీలపైనా, సోఫాలపైనా, బల్లలపైనా పరవడానికీ ఉపయోగిస్తున్న, ఈ గాజు మెరుగు గుడ్డలు ఇప్పుడు జాకెట్లకు ఉపయోగిస్తున్నవి.

"ఇండియా నూలు వస్త్రం, మన ఇండ్లలోనికి, అలమారాల లోకి, పడక గదుల్లోకి కూడా ప్రాకింది. పరదాలు, కుషన్లు, కుర్చీలు, కడపటికి, పరుపులుకూడా, ఇండియా చీటీ గుడ్డలతోను, ఇతర రకాల వస్త్రాలతోను తయారైనవి". అని, డిఫో, తన దుఃఖాన్ని వ్యక్తంచేసినాడు. దీని ఫలితంగా "స్త్రీల దుస్తుల విషయంలోకాని, మన ఇండ్లలోని ఆసన పరికరాలవిషయంలో కాని, ఉన్నితోను, పట్టుతోను తయారౌతూ ఉండిన సమస్త వస్త్రాలనూ, ఇప్పుడు ఇండియా వాణిజ్యం మనకు సరఫరా చేస్తున్నది."

ఈ గిరాకీవల్ల కలిగిన అవకాశాన్ని ఉపయోగించుకొని, ఈస్ట్ ఇండియా కంపెనీ, ఇండియాలో తయారైన వస్త్రాలను విరివిగా ఇంగ్లాండులోనికి దిగుమతి చేయడం ప్రారంభించింది. డచ్చివారు సాగిస్తూఉండిన మిరియాల వర్తకానికి పోటీగా, ఈస్ట్ ఇండియా కంపెనీ

1600 లో, మొదట ఏర్పడింది. ఆ పైన, చాలకాలంవరకూ, ప్రధానంగా మిరియాలు, ఇతర మసాలా దినుసులు ఇంగ్లాండుకు, దిగుమతిచేస్తూ ఉండింది, 1670 ప్రాంతంలో. ఇండియా నూలు వస్త్రాలకు ఒక్కసారిగా గిరాకీ ఏర్పడింది. వీటిని ఇండియాలో కొనడానికై, కంపెని డైరెక్టర్లు పంపిన ఆజ్ఞాపత్రాలలో ఈ విషయం వ్యక్తమై ఉన్నది. ఈ వస్త్రాలకు ఇంగ్లాండులో ఏర్పడిన ప్రజాదరణంవల్ల, ఇంగ్లాండు ప్రభుత్వం వీటిపై దిగుమతి సుంకాలు లేకుండా చేసింది. (1684). దానితో, ఈ వస్త్రాల గిరాకీ మరింత ఎక్కువయింది. ఇంతలో, ఫ్రెంచ్సుదేశ వస్తువుల దిగుమతిని, ఇంగ్లాండు ప్రభుత్వం నిరోధించింది. కడపటికి, కంపెనీవారు ఇండియా నుంచి దిగుమతి చేస్తున్న వస్తువు లన్నిటిలోనూ, ఇండియా నూలు వస్త్రాల మొత్తమే పెద్దది. ఇంతవరకూ, కంపెని దిగుమతి సరకుల పట్టీలో, సూరేకారము, నీలిమందు, మిరియాలు, మొదలైనవి ప్రధాన వస్తువులు; కాని, 1688 తర్వాత, పట్టీలోని స్థలమంతా వివిధరకాల నూలు వస్త్రాలకు, ఏకస్వామ్యమైపోయింది. నీలిమందు, మసాలా దినుసులు, అప్రధాన వస్తువు లైనవి.

ఇండియా వాణిజ్యంలోని దిగుమతి వస్తువులలో ఈ మార్పు కలగడంతో, ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకమైఉన్న పక్షంవారి ప్రతిఘటన, మళ్ళీ ప్రారంభమయింది. వాణిజ్య వాదులు ఉన్నివస్త్రాలను, పట్టువస్త్రాలను విస్తృత పరిమాణంలో తయారుచేసే పారిశ్రామికులు, కంపెనీపై దాడి ఆరంభించిరి. ఇంగ్లాండులోని వెండి బంగారురూపమైన సంపద, ఈ వాణిజ్యంవల్ల ఇండియాకు ఎగుమతి ఔతున్నదనే విషయాన్ని ఆధారంగా చేసుకొన్నవారు, వాణిజ్యవాదులు. ఇంగ్లాండుయొక్క వెండి బంగారాలకు వినిమయంగా, మనకు లభిస్తున్నవి ఇండియా మస్లిన్‌వస్త్రాలు. "ఈవినిమయం నిజంగా ఛాయా రూపమైనదిమాత్రమే." "యూరోపు దేశాలు ఇండియావాణిజ్యాన్ని మానివేయడానికి అంగీకరిస్తే, పాశ్చాత్య ఖండాలనుంచి, నిరంతరంగా బైటికిపోతున్న ధనం అధికంగా మిగులుతుంది." అని, దేవ్‌నాంట్ వ్రాశాడు. మరొక రచయిత, బైబిల్‌లోని ఉత్తమశైలిని అవలంబించి, "ఓ! జెరూసెలమా, జెరూసెలమా, నీ వినాశం నీవు తెచ్చిపెట్టుకొన్నదే. ఓ, ఇంగ్లాండు దేశమా, కొత్తవారెవరో నిన్ను మింగివేస్తున్నారు, పరులు నిన్ను భక్షించివేస్తున్నారు. భ్రాంతివల్ల నీవు మోహిస్తున్న వస్తువులే, నీ వినాశ హేతువులు" అని ఘోషించినాడు

నూలు వస్త్రాల దిగుమతివల్ల, ప్రాచీనమైన ఉన్ని వస్త్ర పరిశ్రమలు, కొత్తగా ఏర్పడిన పట్టువస్త్ర పరిశ్రమలు, నశించిపోయి, నేతగాండ్లకు జీవనోపాధి లేకుండాచేసి, వారిని దుస్థితికి పాల్పరచినదని, రెండవవర్గం వారు దాడి సాగించిరి. ఇండియా వస్త్రాలదిగుమతివల్ల, ఇంగ్లాండులో తయారైన వస్త్రాలకు స్వదేశపు బజారులలోను, యూరోపుదేశపు బజారులలోను గిరాకీ లేకపోవడము, తన్మూలంగా, వస్త్రాల పరిశ్రమలలో నిరుద్యోగ సమస్య ఏర్పడి, నేతగాండ్లకు కష్టము కలిగియుండడము, వాస్తవమైనవే; సందేహంలేదు. కాని, ఆకాలపు, కరపత్ర రచయితలు ఈ విషయాలను అతిశయోక్తులతో వర్ణించి. నేతగాండ్ల కష్టాలను భయంకరమైన విధంగా చిత్రించి, దేశంలో ప్రచారం కావించిరి. ఇండియా దిగుమతులపై నిర్బంధాలను విధించే విషయాన్ని, జాతీయ సమస్యగా సిద్ధింపచేయడంలో, వీరు కృతార్థులైనారు. పదిహేడో శతాబ్దం కడపటికి, నేత పరిశ్రమలలో ఉండిన వారిలో సగం మంది, దేశంలో నిరుద్యోగులై త్రిమ్మరుతూ, క్యాంటర్‌బరీనుంచి లండనుకు, లండన్‌నుంచి నార్విచ్‌కు, తినడా

నికి రొట్టెను అడుక్కొంటూ తిరుగుతూ ఉండేవారిని, ఈ కరపత్రాలలో వర్ణింపబడింది.

కాని, నిరుద్యోగులై, తిండికి లేక తిరిగే కష్టాలు, కేవలం నేతగాండ్రకు మాత్రమే పరిమితమై ఉండలేదు. రాజస్వాదాయం తగ్గిపోవడంవల్లను, బీదలకు ఇస్తున్న సహాయంతో [దోల్స్-అని వ్యవహారం] ప్రభుత్వ వ్యయం ఎక్కువ కావడంవల్లను, ప్రభుత్వముయొక్క విత్తపరిస్థితి చిక్కులకు లోనై ఉండినది. భూములపైనా, ఇండ్లపైనా వస్తున్న భాటకాలు తగ్గిపోవడంతో, భూస్వాముల లాభాలు తగ్గిపోయినవి. అట్టి పరిస్థితులలో, ఇండియా వస్త్రాల దిగుమతిని గురించిన ఆందోళన దేశమంతటా విస్తరించడం ఆశ్చర్యంకాదు. ఇండియాలోని నేతగాండ్లకు సలహాలివ్వడానికై కంపెనీవారు ఇంగ్లాండునుంచి పంపియుండిన ఆంగ్ల నేత గాండ్లను, వాపసు పిలిపించుకోవడం, ఈ ఆందోళనవల్ల కలిగిన ఫలితాలలో మొదటిది. వస్త్రాల విషయంలో పాశ్చాత్య దేశాల ప్రజల అభిరుచులను, వారికి అభిమతములైన రకాలను, కూర్పులను,- ఇండియా దేశంలోని నేతగాండ్రకు బోధించి, వాటికి అనుగుణంగా వస్త్రాలను తయారు చేయించడానికై, ఈ ఇంగ్లాండు నేతగాండ్లను, కంపెనీ, పంపిఉండినది. ఇప్పుడు వారిని వెనుకకు పిలిపించుకొన్నది. ఇంతమాత్రమైన చిన్న రియాయితీతో, ప్రజాభిప్రాయానికి సంతృప్తి కలుగలేదు. జాతీయభావం, అత్యంతంగా ఉద్రిక్తమయింది. నూలు వస్త్రాల దిగుమతిని పూర్తిగా నిరోధించడానికి, లేక, దానిపై తగిన నిర్బంధాలను విధించడానికి అవసరమైన శాసన నిర్మాణకార్యాన్ని ఎంతోకాలం, తప్పించుకోవడం సాధ్యం కాలేదు.

*బెంగాలు ఆక్రమణకుపూర్వం బ్రిటిషువారి సంరక్షణ వాదం* (Protectionism) : దాని ననుసరించి, ఇంగ్లాండు ప్రభుత్వం, 1700 సంవత్సరం, ఈ క్రిందివిధంగా శాసించింది. మైకేల్‌మస్ మొదలుకొని [1701, సెప్టెంబర్, 29] ఇంగ్లాండుదేశంలోనికి, వేల్సు అధినివేశ రాజ్యంలోనికి, బెర్విక్-ఆన్-ట్వీడ్ పట్టణంలోనికి ఇప్పుడు దిగుమతిఔతూ, లేక, ఇకముందు దిగుమతి కాబోయే "తయారైన పట్టువస్త్రాలు, 'బెంగాల్సు' అనే వస్త్రాలు, పట్టుతోను, నారతోను కలిసిన గుడ్డలు; పర్షియా, చైనా, ఈస్ట్ ఇండియా ద్వీపాలలో తయారైన వస్త్రాలు; ఆ దేశాలలో రంగువేసి, అచ్చు గుద్ది, కలంకారీచేసి తయారైన అన్ని చీటిగుడ్డలు, మొదలైన వాటిని, ఈ దేశంలో ఎవ్వరూ ధరించకూడదు; ఇతరవిధంగా కూడా వాడకూడదు." అద్దకం ద్వారా, లేక, అచ్చు ద్వారా ఇంగ్లాండులో తయారయ్యే చీటిగుడ్డలకు ఈ శాసనం వర్తించదు. దీనివల్ల "ఇండియా చీటిగుడ్డలను నాణ్యపరచడము, రంగులువేయడము మొదలైన నిపుణ కర్మలపై ఆధారపడిన ఇంగ్లాండులోని సహాయక పరిశ్రమలకు, రక్షణ లభించింది." ఆబద్ధ వస్తు గిడ్డంగులను (Bonded Ware-houses) స్థాపించడం కూడా, ఈ శాసనంలో నిర్దిష్టమయింది. దిగుమతి వస్తువులను ఈ గిడ్డంగులలో మొదట నిలువచేసి, దేశీయ వినియోగానికి కావలసిన వస్తువులను, పైదేశాల వ్యాపారానికి ఎగుమతిచేయవలసిన వస్తువులనుంచి వేరుపరచడం జరిగేది. ఈవిధంగా, విదేశవస్తువుల ఎగుమతి వ్యాపారంవల్ల సిద్ధించే లాభాలకు రక్షణ కలగడమేకాక, బ్రిటిషు నౌకాపరివహనానికి, నౌకానిర్మాణ పరిశ్రమకు కూడా ప్రోత్సాహం కలిగింది.

కాని, ఇండియా చీటిగుడ్డల దిగుమతిని పూర్తిగా ఆపలేకపోయింది ఈ 1700 నాటి శాసనం. కాబట్టి, అలంకారాలు లేని ఇండియా వస్త్రాలపై, 15 శాతం దిగుమతి సుంకాన్ని

విధించే శాసనం, 1702 లో, ఏర్పడింది. దీనితో, చౌకధరలుగల మొరటు వస్త్రాలపై గిరాకీ తగ్గిపోయి, సున్నితమైన మస్లిన్ గుడ్డలకు గిరాకీ ఏర్పడింది. తెల్లగుడ్డల దిగుమతి ప్రారంభమయింది.

ఇండియాలో తయారైన, నాజూకైన తెల్లగుడ్డలు ఇంగ్లాండులోనికి విస్తారంగా దిగుమతి కాసాగినవి. 1698 లో, వీటి దిగుమతి 247,214 థానులు. 1701 లో 951,109 థానులు; 1718 లో 1,220,324 థానులు; ఈవిధంగా పెరుగుతూపోయిన దిగుమతులు 1719 నాటికి, 2058,451 థానులు కావడం ఆశ్చర్యకరమైన విషయం. దిగుమతిచేసిన ఈ తెల్లగుడ్డపై, ఇంగ్లాండులోని కార్మికులు చేతిపని చేసేవారు. ["రంగులు వేయడం, అద్దకంపని, కసూతి, మొదలైనవి"] – దీని ఫలితంగా, రంగుల పరిశ్రమ, అద్దకపు పరిశ్రమ బాగా అభివృద్ధికి వచ్చినవి. బ్రిటిషు ప్రభుత్వం అవలంబించిన "సంరక్షణ విధానం" వల్ల లాభం పొందినవి ఈ కొత్త పరిశ్రమలు మాత్రమే. నేతగాండ్రకు ఏవిధమైన ప్రయోజనమూ, ఈ విధానంవల్ల, సిద్ధించలేదు. సాంప్రదాయిక వృత్తియైన ఉన్నివస్త్రాల నేతను వదలిపెట్టి, నూలుగుడ్డ నేతకు పూనుకొన్నవారికి మాత్రమే, ఇది లాభించింది. నూలువస్త్రాల పరిశ్రమ, ఇంగ్లాండులో అప్పుడప్పుడే స్థిరపడుతూ ఉండినది.

ఇండియా వస్త్రాల దిగుమతిపై 1719 లో, మళ్ళీ ఆందోళన ప్రారంభమయింది. దీనితో, మరొక శాసనం 1720 లో, బయలుదేరింది. ఇంగ్లాండులో రంగులు వేసి, అద్దకం చేసిన ఇండియా వస్త్రాల వాడుకను కూడా, ఈ శాసనం నిషేధించింది. ఈ వస్త్రాలను ధరించిన వ్యక్తిపై, ప్రతిసారీ 5 పౌనులు జరిమానాను, అమ్మినవానిపై 20 పౌనులు జరిమానాను, ఈ శాసనం విధించింది.

ఈ నూతన శాసనంకూడా, పూర్వపు శాసనంవలెనే, ఫలకారి కాలేదు. తెల్ల వస్త్రాల దిగుమతి 1722 నాటికి, 716,678 థానులకు తగ్గిపోయింది; కాని 1723 నాటికి, 1115,011 థానులకు, 1724 నాటికి, 1291,614 థానులకు మళ్లీ పెరిగింది. 1721లో, ఇంగ్లాండుకు దిగుమతిచేసిన బెంగాలు పట్టుగుడ్డలు, 55491 థానులు. 1722 నాటికి, ఇది 18439 థానులకు తగ్గిపోయింది. కాని, 1723 నాటికి మళ్ళీ 59729 థానులకు, 1727లో, 79602 థానులకు, అధికమయింది. ఇండియావస్త్రాల ఉపయోగాన్ని ఖండిస్తూ, మళ్ళీ, కరపత్ర రచయితలు ఆందోళన ప్రారంభించిరి. ఇండియా వస్తువుల దిగుమతిని ప్రభుత్వ శాసనం, ఆపలేక పోయినందుకు విచారిస్తూ, ఒక అతిబుద్ధిమంతుడైన రచయిత, 'ఆంగ్ల వాణిజ్య ప్రణాళిక' (A Plan of the English commerce) అనే తన గ్రంథంలో ఈ విధంగా వ్రాసినాడు. (1725)— "మన అధికారానికి లోబడనట్టి రెండు విషయాలు మన సమాజంలో వ్యాప్తమైఉన్నవి; అవి, మన ప్యాషన్లూ, ఫ్యాషన్లూ" [మనోవికారాలు, సంస్కారవైఖరులు] (Passions and Fashions).

ఇండియా వస్తువుల దిగుమతులకు విరుద్ధంగా సంరక్షణ వాదాన్ని అవలంబించిన దేశం, ఇంగ్లాండు ఒక్కటే కాదు. ఆనాడు వాణిజ్యవాదం, యూరోపులో అంతటా ప్రబలమై ఉండింది. ఒక్క హాలండుదేశంతప్ప, తక్కిన అన్నిదేశాలూ, ఇండియా వస్త్రాల దిగుమతులను పూర్తిగా నిషేధించడమో, లేదా, భారమైన శుల్కాలను విధించడమో చేసినవి. ఆకాలపు భావాలకు, 1726నాడు, లూయీ XV చేసిన శాసనం నిదర్శనం. ఇండియా వస్త్రాలను

ఫ్రాన్సులో వాడినా, అమ్మకంచేసినా, కఠినమైన దండనలకు గురిఔతారని ఈ శాసనం ప్రకటించింది. ఈ వస్త్రాలను గోప్యంగా దేశంలో ప్రవేశపెట్టిన మూడోసారి నేరానికి, మరణ దండన విధించింది ఈ శాసనం.

ఈ మధ్యకాలంలో, ఇంగ్లాండులో, నూలుబట్టల పరిశ్రమ వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. పద్దెనిమిదోశతాబ్ద మధ్యకాలానికి, అది బాగా స్థిరపడింది. 1714 లో, కంపెనీ డైరెక్టర్లు ఈవిధంగా, ఇండియా ప్రభుత్వానికి వ్రాసినారు. "గుడ్డల అద్దకపు పరిశ్రమ ఈ దేశంలో ఉత్కృష్ట స్థితికి అభివృద్ధి చెందింది. కాబట్టి, ఈ అనుదేశాలను పాటించడానికి సాధ్యం కాకపోతే, ఇంగ్లాండుకు పంపే గుడ్డల పరిమాణాన్ని తగ్గించవలసి ఉంటుంది." బ్రిటిషు అద్దకం పనివాండ్ర నైపుణ్యాన్ని గురించి, ఆ కాలంలోని అభిప్రాయం ఈవిధమైనది. "ఇండియాలో అవలంబించిన ఉత్తమ అద్దకం పద్ధతిని అనుకరించి, ఆ కర్మకౌశలంలో ఉత్కృష్టతను సాధించడం, బ్రిటిషు వృత్తి కార్మికులకు మాత్రమే సాధ్యమయింది. వీరు ఇంతటి శ్రేష్ఠమైన వృత్తిని సాధించగలరని ఎవ్వరూ ఊహించియుండలేదు." 1754 సంవత్సరంలో, వేల్సు రాజకన్యకు (Princess of Wales) ఒక వర్తకుడు కానుకగా సమర్పించిన అద్దకం థాను, పనితనంలో, ఇండియా గాజు మెరుగువస్త్రాన్ని కూడా మించి ఉన్నదని భావించబడింది.

యూరోపుదేశాల దిగుమతులపై ఏర్పడిన నిర్బంధాలవల్లా, ఇంగ్లాండులో జరిగిన నూలు వస్త్రాల పరిశ్రమాభివృద్ధివల్లా, యూరోపుదేశాల ఇండియా వాణిజ్యం, పద్దెనిమిదోశతాబ్ద మధ్యకాలం నుంచీ క్షీణిస్తూ వచ్చింది. ఐనప్పటికీ, ఇండియాలో తయారైన నూలువస్త్రాలు, పట్టూ, 1750 సంవత్సరం తర్వాత కూడా, యూరోపుదేశాలలోనికి, గణనీయమైన ప్రమాణంలో, దిగుమతిఔతూ వచ్చినవి. ఇండియా పరిశ్రమలస్థితిస్థాపకశక్తినీ, ఇండియా వస్తువుల ఉత్కృష్టతనూ, ఈ విషయం నిరూపిస్తుంది. ప్లాసీయుద్ధం తర్వాత, 1760 సంవత్సరంలో, [దిగుమతులకు ఈ సంవత్సరాన్ని ప్రమాణంగా గ్రహించవచ్చు.] ఇండియానుంచి, కేవలం ఇంగ్లాండు దేశానికి మాత్రమే ఎగుమతిచేసినవి, 966, 709 థానులు తెల్లగుడ్డలు, 51,108 థానుల బెంగాలు తయారు పట్టువస్త్రాలు, 212,910 థానుల రంగుచీటీగుడ్డలు, 665 థానుల సూసీలు,— అని, లెక్కలవల్ల నిశ్చితమయింది. అదేసంవత్సరంలో, ఇండియానుంచి ఇంగ్లాండుకు ఎగుమతిచేసిన ఇతర సరకులు,- 3133,884 పౌనుల మిరియాలు. 186 పౌనుల కాఫీగింజలు, [క్రితం సంవత్సరం కాఫీ ఎగుమతి 671, 464 పౌనులు] 75, 543 పౌనులు ఉన్ని, 37, 780 హండ్రెడ్‌వెయిట్ల సూరేకారము.

పరదేశీయుల ప్రభుత్వం దేశంలో దృఢంగా స్థిరపడేవరకూ, నూతన పరిపాలకులు తమ అధికారాన్ని దుర్వినియోగంచేసి, పాలిత ప్రజల వృత్తికళలను, వృత్తికర్మలను నలిపి వేసేవరకూ, ఇండియా పరిశ్రమలు పూర్తిగా అంతం కాలేదు. పందొమ్మిదో శతాబ్దంలోని ప్రథమ శతాబ్దం వరకూ, ఇవి తమ స్వశక్తిపై ఆధారపడి నిలిచిఉండినవి. 1820 తర్వాత ఇండియా వస్తువులకు పాశ్చాత్యదేశపు గిరాకీ పడిపోవడంతో, ఈ పరిశ్రమలకు గొప్ప దెబ్బ తగిలింది. 1795-96కూ, 1829-30కూ, మధ్యగల ముప్పైఐదేండ్ల కాలంలో, ఇండియా నూలుగుడ్డల ఎగుమతి ఏ విధంగా క్షీణించిపోయినదో ఈ కిందపట్టిక ప్రదర్శిస్తుంది.

| సంవత్సరం | బ్రిటన్ | అమెరికా | హ్యాంబర్గ్ | కోపెన్ హేగన్ | పోర్చుగల్ | అన్ని దేశాల మొత్తం |
|---|---|---|---|---|---|---|
| 1795-96 | 195750 | 4814121½ | 344286 | 186549 | 527068 | 2122089½ |
| 1796-97 | 162195 | 522692 | 104574 | 307078 | 185077 | 1712247 |
| 1797-98 | 162276 | 457945 | 28532 | 64374 | 401391 | 1466142 |
| 1798-99 | 177197 | 239928 | 88277 | 8415 | 183125 | 1454163 |
| 1799-1800 | 805119 | 776919 | 8744 | 169473 | 1122353 | 3026253 |
| 1823-1824 | 106516 | 38140 | ... | ... | ... | 2135926 |
| 1824-1825 | 167524 | 123748 | ... | 9178 | 112165 | 1543095 |
| 1825-1826 | 111295 | 146184 | ... | 1646 | 123514 | 1256573 |
| 1826-1827 | 47592 | 21648 | ... | ... | 83887 | 970223 |
| 1827-1828 | 50654 | 10521 | ... | ... | 54002 | 978558 |
| 1828-1829 | 82626 | 28750 | ... | ... | 20045 | 819170 |
| 1829-1830 | 13043 | 8771 | ... | ... | ... | 695725 |

## II ఇండియాయొక్క పరిశ్రమల క్షీణత

పందొమ్మిదో శతాబ్దపు ప్రథమభాగంలో విధించబడిన దిగుమతి సుంకాలుకాని, ఆవిరి శక్తిని, యంత్రాలను ఉపయోగించడంతో ఉత్పాదన కర్చులు తగ్గడమువల్లకాని, ఇండియాలో తయారైన వస్త్రాలతో యూరోపుదేశాల బజారులలో పోటీచేయడం, ఇంగ్లాండుకు సాధ్యం కాలేదు. ఇంగ్లాండు వస్త్రాల ధరలకంటె ఇండియా వస్త్రాల ధరలు, 50 మొదలు 60 శాతం దాకా, తక్కువగా ఉంటూ వచ్చినాయి. కాబట్టి, తన దేశంలో, ఉత్పాదించబడిన వస్తువులకు అనుకూల పరిస్థితులను కలిగించడానికై ఇంగ్లాండు దేశము, తాను జయించిన ఇండియా దేశంలోని పరిశ్రమలను నశింపచేయడానికై తన రాజకీయ శక్తిని ఉపయోగించింది. ఇండియా వస్తువులపై విధించబడిన శుల్కాలు, దిగుమతులకు పూర్తిగా నిషేధకములైనవి. అంతేకాక, ఈ వస్తువులను తయారుచేసే భారతదేశీయులపై ముందుకు అడుగు వేయడానికి, వీలులేనట్టి భారాలను మోపింది. ఇంగ్లాండు దేశానికి ఎగుమతి చేసే వస్తువులపై మోపిన శుల్కాల రేట్లను, ఈ కింది పట్టిక వివరిస్తుంది;—

| | |
|---|---|
| చిత్రాలులేని తెల్ల చీటీలు, దళసరిఐన తెల్లని పడకగది పరదాలు. | పౌనులు 68–6–8 శాతము యథామూల్య శుల్కముతో సహా పౌనులు 3–6–8 గిడ్డంగి శుల్కము. |
| పూర్తిగా, లేక, భాగంగా నూలుతో తయారైన వస్తువులు, ఇతర శుల్కాలు విధించబడినవి. | యథామూల్యంపై, పౌ. 27-6- సుమారు శుల్కముతోసహా. సుమారు పౌ. 10-0-0 |
| చాపలు, జనుము వస్తువులు. | యథామూల్యంపై, పౌ. 68-6-8శుల్కము దానితో సహా, పౌ. 2-13-4. |
| పట్టుతో తయారైన వస్తువులు. | గృహోపయోగానికి నిషిద్ధములు. |
| పలుచని పట్టు వస్త్రాలు, చిత్రితములు, అచిత్రితములు, ఐన ఇతర పట్టు వస్త్రాలు. | do |
| పై వస్తువులను దిగుమతి చేసుకొని, మళ్లీ ఇతర దేశాలకు ఎగుమతి చేయడానికి విధించబడిన గిడ్డంగి శుల్కాలు. | యథామూల్యంపై, పౌ. 3-6-8. |
| నురుగురాని సాబూన్. | పౌ. 68-6-8 శుల్కముతో సహా యథామూల్యంపై, పౌ. 2-13–4 శాతం. |
| చక్కెర. | హండ్రెడ్ వెయిట్‌పై, సుమారు, పౌ 1-13-0. |
| నీలిమందు. | ప్రతి 100 పౌనుల బరువుకు, పౌ. 0-14-6 తో సహా, యథామూల్యంపై, పౌ. 2-13-4 శాతం. |

"ఇండియా దిగుమతి వస్తువుల విలువపై దెబ్బై, ఎనభై శాతందాకా, శుల్కాలను విధించి, లేదా, దిగుమతులను పూర్తిగా నిషేధించి, బ్రిటిషు పారిశ్రామికులను సంరక్షించడం, ఆవశ్యకమయింది. మనం ఈ పద్ధతిని అవలంబించక పోయిఉంటే, పేయిస్లీ, మ్యాన్‌ఛెస్టర్, మిల్లులు ఆరంభదశలోనే మూతపడిపోయి ఉండేవి. ఆవిరి యంత్రాల సహాయంతో కూడా వాటిని మళ్లీ జరపడం సాధ్యమయ్యేదికాదు. ఇండియా పరిశ్రమలను బలిచేయడం వల్లనే ఈ మిల్లులు సృష్టికి వచ్చినవి. ఇండియా స్వతంత్రదేశమైఉంటే, దీనికి తగిన ప్రతిక్రియచేసి ఉండేది; బ్రిటిషు వస్తువులపై నివారక శుల్కాలను విధించి, తన ఉత్పాదన పరిశ్రమలు నాశమైపోకుండా రక్షించుకొని ఉండేది. ఇట్టి ఆత్మరక్షణ చర్యకు పూనుకోడానికి ఇండియాకు అవకాశం లేకుండాపోయింది; పరదేశీయుని దయాదాక్షిణ్యాలపై ఆధారపడింది. ఏ విధమైన శుల్కాలనూ, ఇండియాదేశానికి చెల్లించక, బ్రిటిషు వస్తువులను ఆదేశంపై బలవంతంగా తోసినాము. పరదేశీయ పారిశ్రామికునికి, ఆపుగా నిలిచింది అన్యాయ రాజకీయ శక్తి. సమానావకాశాలలో నిలిచి పోటీ చేయడానికి సాధ్యంకాని, ఇండియా పరిశ్రమలను అణచివేసి పర్యవసానంగా నశింపచేసి, ఇంగ్లాండు పారిశ్రామికునికి సంరక్షణ కల్పించింది, బ్రిటిష్ ప్రభుత్వమనే అన్యాయ రాజకీయ శక్తి." అని, విల్సన్ వ్రాసియున్నాడు.

ఈస్ట్ ఇండియా కంపెనీయొక్క వాణిజ్య ఏకస్వామ్యాన్ని రద్దుపరచి, ఇండియా వాణిజ్యావకాశాలను అందరికీ కలిగించడంవల్ల, 1813 నుంచి బ్రిటిషువారి, శ్రామిక వస్తువుల ఎగుమతి విస్తారంగా పెరిగింది. బ్రిటిషు వస్తువుల ధరలు పడిపోవడం, ఈ విస్తృతికి కారణమని కొందరు వ్యక్తులు, సెలెక్ట్ కమిటీ ఎదుట సాక్ష్యమిచ్చినారు. కాని, అది వాస్తవము కాదు. బ్రిటిషువారి వాణిజ్య విధానమూ, ఇండియాదేశంపై, వారికిగల రాజకీయాధిపత్యమూ, దీనికి నిజమైన కారణాలు.

*పరిశ్రమలను నాశ మొనర్చడానికై రాజకీయాధికారాన్ని ఉపయోగించడం :* ఇండియా ప్రజల ఉత్పాదన కార్యాలను ప్రోత్సహించి, వారి సంపదను అభివృద్ధిచేయడం, సార్వభౌమాధికారాన్ని వహించిన కంపెనీకి, ఎక్కువ ప్రయోజనకారియై ఉండేది; అది, రాజ్యాధిపతులు అనుసరించే విధానం. కాని, వర్తకులతో ఏర్పడిన సంస్థ కావడంవల్ల, లాభాలను వృద్ధి చేసుకోవడం మాత్రమే, తన ప్రయోజనంగా అవలంబించింది ఈస్ట్ ఇండియా కంపెనీ. ఆడంస్మిత్, ఈ విధంగా వ్రాస్తాడు. "ఈస్ట్ ఇండియా కంపెనీ, సార్వభౌమత్వ బాధ్యతను వహించినదైతే ఇండియాలోకి దిగుమతిఐన విదేశ వస్తువులు చౌకగా అమ్ముడుపోయేటట్లుచేసి, ఇంగ్లాండుకు పంపిన ఇండియా వస్తువులను, ఈ దేశంలో సాధ్యమైనంత ఎక్కువ ధరలకు అమ్మించే ఏర్పాట్లు చేసిఉండేది. కాని, దీనికి సరిగ్గా వ్యతిరిక్తమైన విధానమే, వర్తకులైన కంపెనీ వారికి ప్రయోజకంగా తోచింది. ఒక దేశానికి సార్వభౌములైన వారి ప్రయోజనాలూ, వారు పరిపాలించే, దేశముయొక్క ప్రయోజనాలూ, సరిగ్గా ఒకటై ఉంటాయి. వర్తకులకు సంబంధించిన ప్రయోజనాలు, దేశ ప్రయోజనాలకు సరిగ్గా విరుద్ధమైనవై ఉంటాయి." ఇండియా పరిశ్రమల కార్మికులకు నష్టం కలిగే విధంగా, ధరలను తికమికలు చేసింది కంపెనీ; నేతగాండ్రను పీడించి వారి వృత్తిని అరికట్టింది. ఇతరములైన నిర్బంధ విధానాలను అమలు జరిపి, ఇండియా పరిశ్రమలను, అందునూ ముఖ్యంగా, బెంగాలు నూలు వస్త్ర పరిశ్రమను, కంపెనీ ప్రభుత్వం, ధ్వంసంచేసింది. కంపెనీకి సము

కాలిపడు, కంపెనీ విధానాలను విమర్శించినవాడు, ఐన, విలియం బోల్ట్స్, 1767లో ఈ విధంగా వ్రాసినాడు. "ప్రస్తుత పద్ధతి ప్రకారం జరుగుతున్న సమస్తమైన అంతర్దేశీయ వ్యాపారము, అంతకంటె ఎక్కువగా, యూరోపు దేశాల ప్రయోజనానికై ఇండియా దేశం కావిస్తున్న పెట్టుబడి పద్ధతి,- ఇవి రెండూ నిరంతరమైన పీడా చర్యలకు దేశాన్ని గురి చేసినవి. దేశంలోని ప్రతి శ్రామికుడూ, ప్రతి నేతగాడూ, వినాశకరమైన ఈ చర్యల ఫలితాలను అనుభవిస్తున్నాడు. దేశంలో తయారైన ప్రతి వస్తువూ, కంపెనీవారికి ఏకసామ్యమై పోయింది. ఈ పీడా విధానంలో, ఆంగ్లేయులు, బనియాలతోను, నల్లగోమాస్తాలతోను [దేశీయులైన దలాలీలు] చేరి, ప్రతి పారిశ్రామికుడూ తయారు చేయవలసిన వస్తు పరిమాణాలను, వాటికై అతనికి లభించే ధరలను, స్వచ్ఛందంగా, తమ ఇష్టాన్ని బట్టి నిర్ణయిస్తారు."

ఇండియా వస్తువులను విక్రయించుకోడానికీ, ఇండియాలో పెట్టుబడి కావించడానికి కంపెనీకి అవసరమైన ధనాన్ని చేకూర్చడానికీ, ఉపాయ కౌశలంతో ఏర్పరచిన యంత్రాగం, దేశ పీడనకు సాధనమయింది; "దరిద్రులైన నేతగాళ్ళి మోసం చేయడానికి బాగా ఉపకరించింది." గోమాస్తాలు, అనే కార్యకర్తలను, కంపెనీ, నెల జీతాలపై నియమించుకొంది. ఒక గుమాస్తాను, ఖజాంచీని వెంటబెట్టుకొని, ప్రతి గోమాస్తా, ఆయాకాలాలలో దేశాంతర్భాగాలకుపోయి, వస్తువులను కొనేవాడు. మీర్ జాఫర్‌ను బెంగాలు సింహాసనంపై కంపెనీవారు, నిలిపేనాటికి (1757), ఆంగ్లేయుల కార్యకర్తలైన గోమాస్తాలకు అత్యంతమైన ప్రాబల్యము, విస్తారమైన అధికార పరిధి, సిద్ధించి ఉండింది. "దేశంలోని రాజుల అధికారము, జమీందారుల అధికారము, వీరి ప్రాబల్యాన్ని నిరోధించడానికి సాహసింపలేకపోయినవి." బెంగాలు ప్రాంతంపై నవాబుకుగల సార్వభౌమాధికారము అనే తెరను, బాహాటంగా తొలగించివేసిన తర్వాత, కంపెనీవారు, దేశసార్వభౌముడైన ఢిల్లీ చక్రవర్తినుంచి తమ ఆధిపత్యాన్ని గ్రహించి, అతని పేరుతో తమ అధికారాలను సాగిస్తూవచ్చిరి. ఇంతనుంచీ, వీరు కేవలం వాణిజ్య ప్రతినిధులు మాత్రమే కారు. శాసనకర్తలుగా, దండనాధికారులుగా సిద్ధించిన, కంపెనీ అధికారుల నిర్ణయాలపై అప్పీలు చేసుకొనే అవకాశం కూడా ప్రజలకు లేనట్టి పరిస్థితి ఏర్పడింది. "దీనులైన నేతగాండ్ర అంగీకారము అవసరమని, వీరు పరిగణించలేదు. కంపెనీ పెట్టుబడి విధానంలో, నియోగింపబడిన గోమాస్తా, తన ఇష్టము వచ్చిన ఒప్పంద పత్రాలపై నేతగాండ్ల వేలిముద్రలను తీసుకొనేవాడు. గోమాస్తాలు ఇచ్చే డబ్బును నిరాకరించినట్లయితే, నేతగాండ్ల నడుములకు ఈ డబ్బును కట్టి, వారిని కొరడాలతో బాది, పంపివేసిన సందర్భాలు అనేకములు," అని విలియంబోల్ట్స్, వ్రాసి యున్నాడు.

కంపెనీ రిజిస్టర్లలో, అనేకులు నేతగాండ్ల పేర్లు గుర్తింపబడి ఉంటాయి. ఈ నేతగాండ్లు, కంపెనీకి తప్ప, ఇతరులకు ఎవ్వరికీ పనిచేయకూడదు. అంతేకాక, ఒక గోమాస్తా అధీనంనుంచి మరొక గోమాస్తాకు, వీరిని "దాస్యంలో ఉన్న మానవ ప్రాణులవలె బదిలీ చేసేవారు. ప్రతి గోమాస్తాచేసే మోసాలకు, కృతిమాలకు, అతడు పెట్టే బాధలకు వీరు ఓర్చుకొని పడిఉండవలసిందే." ఈ వృత్తి కార్మికులను తనిఖీ చేయడానికై, చప్రాసీలను, కాపలావాళ్లను నియోగించిరి. కంపెనీ గోమాస్తాకు తప్ప, ఇతరు లెవ్వరికీ, కార్మికులు వస్తువులను అమ్మకుండా చూడడం వీరి పని. ఏ కార్మికుడైనా, అట్టి పనికి ప్రయత్నిస్తున్నాడని,

ఏ మాత్రం సంశయం కలిగినా, మగ్గంపైఉన్న వస్త్రం, పూర్తికాక మునుపే, దానిని కత్తిరించుకొని తీసుకొని పోయేవారు. కంపెనీవారు ఇంత జాగ్రత్త వహించి ఉన్నప్పటికీ, ఏ నేతగాడైనా, దలాలీ సంధానంతోనో, సహాయంతోనో, తన వస్తువులను ఇతరులకు అమ్మినట్లైతే, కంపెనీ అధికారులు, "అతనిని, దలాలిని, పట్టుకొని, జైలులోపెట్టి చేతులు తగిలించి, పెద్ద మొత్తాలను జరిమానాగా విధించి, కొరడాలతో బాదేవారు. అంతేకాదు. ఎంతో పవిత్రమైనదిగా భావించుకొంటూ ఉన్న కార్మికుల కులాన్ని భ్రష్టం కావించే, అప్రతిష్ఠాకరమైన, అవాచ్యమైన ప్రయోగాలను వీరిపై కావించినారు." కంపెనీ పెట్టుబడితో, గోమాస్తాలు తమ స్వంత వ్యాపారాన్ని కూడా సాగించుకొంటూ, తమకుగల స్వచ్ఛందాధికారాలను ఉపయోగించి, కంపెనీకి వస్తువులను కొనే చౌక ధరలకే, తమ వ్యాపారానికి కూడా వస్తువులను గ్రహిస్తూ వచ్చిరి. "ఈ వ్యవహారంలో వీరు జరిపిన తుంటరితనము, పోకిరీతనము, ఊహించడానికి కూడా సాధ్యము కానివి. గోమాస్తాలు చేసిన కృతిమాలన్నీ, దరిద్రులైన నేతగాండ్లను వంచించి దోచుకోవడంలో పర్యవసానం పొందినవి. గోమాస్తాలు, వీరితో కలిసిన. షాచేందార్ల కూటము కార్మికుల వస్తువులపై నిర్ణయించే ధరలు, అన్ని ప్రదేశాలలోనూ, బజారు ధరలకంటె 15 శాతం తక్కువగాను, కొన్ని సందర్భాల్లో 40 శాతం తక్కువగానూ, ఉండినవి."

ఇండియా కార్మికులకు నష్టంకలిగే విధంగా ముడిసరకుల ధరలను తారుమారు గావించడం, వీరు అవలంబించిన మరొక కృతిమ పద్ధతి. ఈ విషయంలో ఒక నిదర్శనను ఉదాహరించవచ్చు. బెంగాలు ప్రాంతంవారికి అవసరములైన, నాజూకు దూది రకాలను, బొంబాయినుంచీ, సూరత్‌నుంచీ, తెప్పించుకొనేవారు. కంపెనీ ఉద్యోగులు కౌన్సిలు సభ్యులతోచేరి, కలకత్తాలో ఒక స్వంత వ్యాపార సంస్థను లేవదీసిరి. ఈ దూది రకాలను వశపరచుకొని, వాటి ధరలను బెంగాలులో పెంచి, తాము లాభం పొందడం, వీరి ఉద్దేశం. 25 లక్షలు రూపాయల విలువగల దూదిని సూరత్‌లో కొని, వీరు తమ అధీనం చేసుకోవడంతో 16-18 రూపాయలైఉండిన మణుగు దూది ధర, ఒక్కసారిగా 28-30 రూపాయలకు పెరిగిపోయింది. ఈ కొత్త ధరతో నేతగాడు నాశమైపోయినాడు. ఇతడు తయారుచేసి కంపెనీకి సరఫరా చేయవలసిన వస్తువుల ధరలను, కంపెనీ ఏజెంట్లు, ఇదివరకే స్వచ్ఛందంగా నిర్ణయించి ఉన్నారు. ఇప్పుడు తాను, విపరీతమైన ధరలు పెట్టి దూదిని కొనవలసి వచ్చింది. కాబట్టి, ఇతని వినాశానికి కారణమయింది, కంపెనీ ఉద్యోగులు స్వార్థానికై చేసిన, కృత్రిమం.

కంపెనీ వారు, వారి ఉద్యోగులు అవలంబించిన పద్ధతుల ఫలితం, వినాశకరం కాక తప్పదు. వృత్తి కార్మికులు నాశమైపోయినారు. కంపెనీ సేవలోని కొందరు సాహసికులు మాత్రం, కావలసినంత ధనాన్ని చేకూర్చుకొని, ఉద్యోగాలనుంచి విరమించుకొని, సుఖ జీవనాన్ని, అనుభవించడానికై, ఇంగ్లాండు చేరుకొనిరి. కాని, వీరు చేసిన పని, 'బంగారు గుడ్డు పెట్టే బాతును చంపిన దురాశాపరుడు' చేసిన పనికి సదృశమైనది. ఇండియాలో తయారైన వస్తువుల ధరలను పెంచినారేకాని, వాటికి అనుగుణంగా, శ్రామికుల కూలీలను పెంచలేదు. దాని ఫలితంగా, ఇండియా వస్తువుల వనితనం, క్షీణించిపోయింది. బ్రిటిషు పరిపాలన చరిత్రలోని ప్రథమ ఘట్టం, ఈ విధంగా విధ్వంసక చర్యలతోను, దోపిడీలతోను, ప్రజా

పీడన చర్యలతోను, ఇండియా ప్రజల చేతి పనులను, వృత్తికర్మలను నాశం కావించిన దుష్ట విధానంతోను, ఏర్పడింది. ఒకప్పుడు పారిశ్రామికంగా ఉచ్ఛ్రయస్థితిలో ఉండిన పట్టణాల లోని జనాభా తగ్గిపోయి, పట్టణాలు దరిద్రమైపోయినవి. సాంప్రదాయికంగా, తరతరాలుగా వచ్చిన వృత్తులను వదలి, వృత్తి కార్మికులు, శిల్పులు, దినకూలీలుగా వ్యవసాయ రంగంపై పడవలసివచ్చింది.

ముర్షీదాబాదులో కంపెనీ స్థానిక అధికారిగా ఉండిన, బెచ్చెర్, 1769 లో, ఈవిధంగా వ్రాసాడు. "అత్యంతమూ నిరంకుశంగా నడిచిన పూర్వపు ప్రభుత్వ కాలంలో కూడా, ఉచ్ఛ్రాయ స్థితిలో ఉండిన ఈ ఉత్తమదేశం, పరిపాలనలో ఆంగ్లేయులు అధిక బాధ్యత వహించిన నేడు, సర్వనాశమైపోయే స్థితికి వచ్చింది. దేశంలో తయారైన అన్నివస్తువులనూ, కంపెనీ పేరుతో, ఏకస్వామ్యం కావించుకోవడమే ఈ వినాశస్థితికి ప్రధాన హేతువని, నాకు దృఢమైన విశ్వాసం కలిగింది. దేశానికి దాపురించిన ఈ దుష్టపరిస్థితిని చూచి, సహించడం కష్టంగా ఉంది." బ్రిటిషు పార్లమెంటు వ్యవహారాలలో బాధ్యత వహించిన, విలియమ్ ఫుల్లర్‌టన్, అనే సభ్యుడు, బెంగాలులో కంపెనీ సాగిస్తున్న పరిపాలన విధానాన్ని, ఇంత కంటె నిష్కర్షమైన వాక్యాలలో నిరసించినాడు. "పూర్వకాలాల్లో, బెంగాలు ప్రాంతాలు, ఇతర దేశాలకు కూడా, ధాన్య భండారాలై ఉండినవి; వాణిజ్యానికి, సంపదకు, పరిశ్రమలకు ప్రాచ్యదేశాలలోని సంగ్రహశాలలుగా ఉండినవి. స్వస్థత ఏమాత్రమూలేని మన దుష్పరిపాలన శక్తుల ప్రవృత్తివల్ల, ఇరవై ఏండ్ల కాలంలోనే, ఈ ప్రాంతాలలోని అనేక ప్రదేశాలు, మరు భూముల స్థితికి వచ్చినవి. వ్యవసాయ భూములన్నీ బీడుపడినవి; విస్తారమైన భూభాగాలు పొదలతో, దుబ్బులతో కప్పుపడిపోయినవి; రైతులు దోపిడీల పాలైపోయినారు; పారిశ్రామికులు పరపీడనకు లోనై అణగిపోయినారు; పదేపదే ఏర్పడుతున్న క్షామబాధలను సహించవలసి వచ్చింది; ప్రజాసంఖ్య బాగా తగ్గిపోయింది." సుఖసంపదలకు ఆవాసమై యుండిన బెంగాలు ప్రాంతం 1789 నాటికి, పూర్తిగా నాశమైపోయింది. "హిందూస్తాన్ దేశంలోని కంపెనీ భూభాగంలో మూడోవంతు, అడవి మృగాలు వసించడానికి మాత్రమే యోగ్యమైన అరణ్యంగా ఏర్పడింది." అని కారన్‌వాలిస్ ప్రభువు కూడా చెప్పవలసిన గతిపట్టింది, బెంగాలు ప్రాంతానికి.

*ఆర్థిక క్షీణతకు అంతర్గతములైన హేతువులు :* దేశముయొక్క పారిశ్రామిక వ్యవస్థ ఎంత దృఢంగా ఏర్పడియుండినా కూడా, పరదేశ పరిపాలకుల విరుద్ధ విధానాలకు ఆగలేక పోయింది. కాని, ఇండియా పరిశ్రమల వ్యవస్థా నిర్మాణంలో కూడా, లోపాలు లేకపోలేదు. పరిశ్రమలు క్షీణించడానికి ఇవి కూడా, కొంతవరకు, కారణములైనవి. తమ వస్తువుల విక్రయానికి తగిన బజార్లను విస్తరించుకోడానికి, భారతదేశీయులు ఏమాత్రమూ ఆసక్తి వహించక పోవడం, మొదటి లోపం. ఈ లోపంవల్ల శ్రమవిభజన పరిమితమైపోయి, పారిశ్రామిక అభ్యుదయం కూడా, పరిమితమై పోయిందని, ఆడం స్మిత్, సూచించినాడు. ఆంగ్లేయులు దేశాన్ని ఆక్రమించడానికి పూర్వపురోజుల్లో కూడా, ఇండియా విదేశీయ వాణిజ్యం సమస్తమూ, పరదేశీయుల హస్తగతమై ఉండడం, ఇంతకంటె గొప్ప లోపం. ఇతర దేశాల బజార్లలో, తమ వస్తువులు అమ్ముడుబోయే విషయంలో, ఇండియా వృత్తి కార్మికులు, పారిశ్రామికులు కూడా, పరదేశ వర్తకుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడవలసి వచ్చింది. ఈ లోపంవల్ల కలిగిన ఫలితం ఇది. ఇక రెండవది;- పరాక్రమణశీలమైన పాశ్చాత్య వాణిజ్య నీతిని ఆగ

గల, జాతీయ వాణిజ్యవిధానం ఇండియాలో ఏర్పడియుంతలేదు. తమ అధికారం అత్యుచ్ఛ దశలో ఉండిన కాలంలో కూడా, మొగలు చక్రవర్తులు, పరదేశ రాజ్యాల వాణిజ్యచర్యలను చూస్తూ, మౌనం వహించి ఉండినారు. ఇండియాలో కర్మాగారాలను నిర్మించుకొంటూ, ఇండియా వాణిజ్యాన్నీ, ఇండియా బజార్లనూ తమ వశం చేసుకోడానికై, ఇతర దేశాలవారు ప్రాకులాడుతూ, కలహిస్తూ ఉండగా, తమ కేమీ పట్టనట్లు, ఇండియా చక్రవర్తులు ఉదాసీనులై ఉండిరి.

పదిహేడు పద్దెనిమిదో శతాబ్దాలలో ఇంగ్లాండుకు దిగుమతి చేస్తున్న ఇండియా వస్తువులపై అతి భారమైన శుల్కాలను, ఆ దేశ ప్రభుత్వం విధించగా, ఇండియాదేశ ప్రభుత్వం, సార్వభౌమ ప్రభుత్వమై ఉండీకూడా, ప్రతిక్రియకు పూనుకోలేదు. ఆర్థిక సమస్యలను జాతీయ ప్రయోజనాల దృక్పథంతో చూచే ప్రవృత్తి ఇండియాలో ఏర్పడి ఉండక పోవడమే, ఇందుకు హేతువు. రాజకీయ పరిస్థితులు చెడిపోకుండా ఉండినా కూడా, విదేశ వాణిజ్య సమస్యను మరొక దృక్పథంతో, దేశం, పరిశీలించి ఉండేదా అనే విషయం సందిగ్ధమైనదే.

మూడవది,-రాజకీయంగా, ఇండియాదేశం పరాక్రమణకు లోనై పోవడానికి, సముద్రాలపై ప్రాబల్యం లేకపోవడం ముఖ్య కారణం; దేశముయొక్క పారిశ్రామిక క్షీణతకు కూడా ఈ దౌర్బల్యమే ప్రబల హేతువు. పదిహేడు పద్దెనిమిదో శతాబ్దాలలో, యూరోపు దేశాల రాజ్యాలు సముద్ర వ్యాపారాన్నీ, సముద్రంపై జరిపే దోపిడినీ జతపరచి, తమ కార్యక్రమాలను సాగించుకొన్నవి. ఈ ఓడ దొంగలనుంచి రక్షించగల సాయుధబలం వెంటలేకుండా ఏ వర్తకుడూ, సరకులను తీసుకొని, ఇతర దేశాలకు ప్రయాణం చేసేవాడు కాడు. ఇట్టి, సముద్ర సేనాబలం,- లేక, నౌకాబలం లేనందువల్ల, ఇండియాదేశం, విదేశాల బజార్లను నిలుపుకోలేకపోయింది. యూరోపు దేశ రాజ్యాలు, వాటిని బలత్కారంతో తమ వశం చేసుకొన్నవి. తత్ఫలితంగా, యూరోపు ఖండంలో పారిశ్రామిక విప్లవం వేగంగా జరుగుతూ రాగా, ఇండియాదేశం పారిశ్రామికంగా, క్షీణించి, వెనుకకుపోయి, మళ్లీ వ్యావసాయిక దేశమై నిలిచిపోయింది.

నాల్గవది;- మధ్యయుగాల యూరోపు దేశాల పరిశ్రమ వ్యవస్థకు, వ్యాపార వ్యవస్థకు, ప్రధాన లక్షణములుగా ఏర్పడిన కార్మిక సంస్థలు, లేక, గిల్డులు, అనేవి ఇండియాలో అతి దుర్బలములైనవి. ఈ సంస్థల కర్తవ్యాన్ని నిర్వహిస్తూఉండిన కుల వ్యవస్థ, బాహ్య ఘాతములనుంచి, పరిశ్రమలను రక్షించ లేకపోయింది. ఇండియాలోని పారిశ్రామిక వస్తువులను కొనడానికై పరదేశీయులు వ్యాపార రంగంలో ప్రవేశించినప్పుడు, పరదేశీయ విక్రయదారుల సువ్యవస్థితములైన ఏకస్వామ్యాలను, ఇండియా వృత్తి కార్మికుడు ఒంటరిగా నిలిచి ఎదుర్కొవలసివచ్చింది. విక్రయదారుడు కోరిన వస్తువులను తయారుచేయడానికై, అతడు ముందుగా ఇచ్చిన డబ్బుపై చాలవరకు, వృత్తి కార్మికుడు ఆధారపడవలసివచ్చింది. స్వతంత్రమైన వృత్తి కార్మిక సంస్థలు, విత్త సంబంధమైన వ్యవస్థలు లేనందువల్ల, వస్తువుల ధరలను నిర్ణయించడంలో కాని, సంచకారపు డబ్బుపై ఆధారపడకుండా వస్తువులను తయారు చేయడానికి కాని, ఇతనికి తాహతు లేకపోయింది.

ఐదవది: ఇంగ్లండుదేశములో ఉన్నట్టి, పారిశ్రామిక ఉద్యమకర్తల వర్గం, ఇండియాలో

లేకపోవడం, మరొక లోపం. నూతన వైజ్ఞానిక నిర్మాణాలు, సాంకేతికశాస్త్రాభివృద్ధులు, ఇండియాలో జరగకపోవడానికి, భారతీయులకు బుద్ధి, శక్తిసామర్థ్యాలు, తక్కువై ఉండడం కారణం కాదు; పాశ్చాత్య దేశాలలోఉన్న అభ్యుదయ సాధకవర్గం, ఇండియాలో లేకపోవడమే ప్రధాన కారణం. వారు, ముందుగా బజార్లను వశం కావించుకొని, ఆ బజార్లకు ఆవశ్యకము లైన వస్తువుల ఉత్పాదనకు తగిన వ్యవస్థలను తమ దేశాలలో ఏర్పరచుకొన్నారు. అట్టి వర్గం, ఇండియాలో ఏర్పడి యుండలేదు.

*వ్యవసాయము క్షీణించడం :* ఇండియా పరిశ్రమలు నాశమైపోవడము, వర్తక వ్యవసాయాలు క్షీణించడము ఒకే కాలంలో జరిగినవి. రాజకీయ విషయాలే దీనికి ప్రధాన హేతువులు.

ప్రభుత్వము దుర్భరమైన పన్నులు విధించడంవల్లను, కంపెనీ ఉద్యోగులు రైతుకు ఆవశ్యకమైన సరకులను కాక, తమకు లాభదాయకమైన సరకులను పండించేటట్లు రైతులను నిర్బంధించడంవల్లను, వ్యవసాయము దెబ్బతిన్నది. మసాలా దినుసులు పండే ద్వీపాలలోని (Spice Islands) డచ్చివారు "సుభిక్ష కాలంలో బాగుగా పండిన భూములలోని పంటలో, లాభకరంగా యూరోపుదేశాలలో అమ్ముకోడానికి తగినంత భాగాన్ని మాత్రమే మిగిలించి, తక్కిన భాగాన్ని కాల్చివేస్తారని" డచ్చి వర్తకులను గురించి చెప్పుతారు. ఇంగ్లీషు కంపెనీ కూడా, బెంగాలు ప్రాంతంలో ఈ పద్ధతినే అనుసరించింది. "బాగుగా పండిన గసగసాల పొలాన్ని దున్నివేసి, దానిలో వరిపంటనుకాని, లేదా, తనకు అవసరమైన ఇతర పంటనుకాని పండించవలసిందని, ఇంగ్లీషు కర్మాగారంలోని అధికారి,- అనగా ప్రధాన గుమాస్తా, రైతును ఆజ్ఞాపించడం, తరచు జరుగుతూ ఉండిందని" ఆడం స్మిత్ వ్రాసినాడు. ఆహారధాన్యాలు కొరతపడకుండా చూచే పద్ధతి, అని దీనిని సమర్థించడం, వంచన. నిజమైన కారణం వేరు. ఈ అధికారివద్ద విస్తారంగా నిలువఉన్న అపీమును, లాభదాయకంగా అమ్ముకోడానికై చేసిన కార్యం ఇది. వేరే సమయాలలో, దీనికి వ్యతిరేకమైన ఆజ్ఞలను ఇవ్వడం కూడా జరిగింది. వరిపంటా, ఇతర ధాన్యాల పంటలూ, బాగుగా వృద్ధికి వచ్చిన పొలాలను దున్నించివేసి, గసగసాలను నాటించిన సందర్భాలుకూడా కలవు. అపీమును గిరాకీ ఎక్కువగా ఉండడాన్ని గమనించిన అధికారి, ఈ కార్యాన్ని చేయించినాడు.

*వ్యాపారాన్ని భగ్నంచేయడం :* వ్యవసాయానికి, పరిశ్రమలకు కలిగిన దుస్థితే, ఇండియా వ్యాపారానికి కూడా సిద్ధించింది. ఏకస్వామ్యాల పద్ధతిని స్థాపించడమే, వ్యాపార వినాశానికి ప్రధాన కారణమయింది. ఈ ఏకస్వామ్యాలు కూడా, అన్నీ న్యాయబద్ధమైనవి కావు; చాలవరకు కృత్రిమములైనవే ఎక్కువ. వీటిని సంపాదించుకొన్న కంపెనీ ఉద్యోగులు, వీటిని సక్రమ మార్గాలలో ఉపయోగించక, దుర్వినియోగం కావించిరి.

(a) *అంతర్దేశీయ వ్యాపారం :* తమ వస్తువులపై పారవహన శుల్కాలు, సీమా శుల్కాలు చెల్లించవలసిన అవసరం లేకుండా కంపెనీ, ఫరూఖ్‌సియ్యార్ కాలంలోనే విముక్తి పత్రాన్ని సంపాదించుకొన్నది. కాని, ఈ రియాయితీని కంపెనీ, దుర్వినియోగం చేసింది. కంపెనీ ఉద్యోగుల స్వంత సరకులను, దేశంలోని ఒక ప్రదేశాన్నుంచి మరొక ప్రదేశానికి పంపడంలో, కంపెనీ పేరుతో 'పరవానా'లను జారీచేసి పారవహన శుల్కాలు చెల్లించలేదు. ఈ విధంగా ప్రభుత్వకోశానికి న్యాయంగా చెల్లించవలసిన ఆదాయం, వంచిత

మైపోయింది. కంపెనీ ఉద్యోగులు జారీచేస్తూవచ్చిన దస్కతులు, అనగా, అనుమతి పత్రాలు,-బజారులో అమ్ముడుబోయే వస్తువులుగా తయారైనవి. ప్రభుత్వానికి చెల్లించవలసిన శుల్కాలను తప్పించుకోడానికై ఇండియా వ్యాపారస్థులుకూడా, ఈ దస్కతులను కంపెనీ ఉద్యోగులవద్ద కొనేవారు.

బెంగాలు ప్రాంతంపై రాజకీయాధికారాన్ని వహించిన పిమ్మట, కంపెనీ, దేశంలోని వ్యాపార వ్యవహారాలను తన అధీనంలో నిలుపుకోడానికి పూనుకొంది. పక్షపాతంతో కూడిన శుల్క విధానాన్ని ప్రయోగించి, ఇండియా వర్తకులను, ఇతర విదేశ వర్తకులను, వారి వ్యాపార కార్యక్రమాలనుంచి, క్రమంగా తొలగించివేసింది. ఎక్కువ ప్రాధాన్యమున్న సరకుల విషయంలో, ఏకస్వామ్య వ్యాపారపద్ధతిని స్థాపించి వాటిని తామే గ్రహించడంతో, ఇండియా వర్తకులకు, ఇతర వర్తకులకు వ్యాపారం, నిష్ప్రయోజకమైపోయింది. క్లైవ్ పరిపాలన కాలంలో, అంతర్దేశీయ వ్యాపారం సమస్తమూ, కంపెనీకి, కంపెనీ ఉద్యోగులకు ఏకస్వామ్యంగా సిద్ధించింది. విలియంబోల్ట్స్ ఈ విధంగా వ్రాస్తాడు;- "దేశంలో ఉత్పాదన మయ్యే ప్రతివస్తువూ, విదేశాలనుంచి దిగుమతి కావించిన ముఖ్య వస్తువుల వ్యాపారంతో సహా, అంతర్దేశీయ వ్యాపారం సమస్తమూ ఏకస్వామ్యంగా జరుగుతూ వచ్చింది. కంపెనీ సేవలోని ఉన్నతోద్యోగులు కొందరు తమ బనియాలతోను, ఆప్తులతోను, జరుపుతూఉన్న వ్యాపారం ఇది. ఇటీవల కొన్ని సంవత్సరాలుగా, కలకత్తాలోని ప్రభుత్వం అవలంబించిన ప్రతి పరిపాలన చర్యా, ఇట్టి ఏక స్వామ్యాల స్థాపనకు అభిమతంగా జరిగింది. ఇండియాలోని పరిస్థితులు తెలియక డైరెక్టర్ల సభ పంపిన పరస్పర విరుద్ధములు, న్యాయ విరుద్ధములు ఐన ఆజ్ఞలూ; ఇండియాలోని తమ ఉద్యోగాల కార్యకలాపాలతో సంధానం కలిగించుకొని ఇతర సమయాలలో పంపిన ఆజ్ఞలూ; లేడన్ హాలులోని రాజకీయ పక్షాలవారి ప్రభుత్వం పంపిన ఆజ్ఞలూ,- అన్నీకూడా ఈ అవమానకరములైన చర్యలకు దోహదం కావించినవి." ఈ ఏక స్వామ్యాలను నిలుపుకోడానికి, పారపహన శుల్క పద్ధతిని ఆలంబనంగా చేసుకొన్నారు. వ్యాపార వ్యవహారాలలో ఏకస్వామ్యంకల వ్యక్తులకు నష్టం కలుగకుండా రక్షించింది ఈ పద్ధతి.

నిదర్శనం:- ఒక సంవత్సరం ఉత్తర ప్రదేశంలోని పత్తిపంట అసాధారణంగా అభివృద్ధిచెందింది. అదే సంవత్సరమే కంపెనీ ఉన్నతోద్యోగులు ఒక ఏకస్వామ్య సంస్థగా ఏర్పడి, బొంబాయి దూదిని దిగుమతి చేయడానికి పూనుకొనియుండిరి. బెంగాలులోని దేశీయ వర్తకులు ఉత్తర ప్రదేశ ప్రాంతాలనుంచి, దక్షిణ భారతంనుంచి, దూదిని దిగుమతి చేసుకోవడం ఆరంభించిరి. వెంటనే, బీహారుమార్గంగా బెంగాలుకు దిగుమతి అయ్యే సరకులపై, కంపెనీ ప్రభుత్వం, 30 శాతం దిగుమతి పన్నును విధించి, దూది ధరలను పెంచి, దూది వ్యాపారంలో ఏకస్వామ్యంకల తమవారికి నష్టం కలుగకుండా రక్షించింది.

అంతర్దేశీయ వ్యాపారమంతా కంపెనీ ఉద్యోగుల అధీనంలో ఉండింది; దానివల్ల వచ్చిన లాభమంతా, లంచగొండులైన అధికారులకు సంక్రమించిందే కానీ, కంపెనీకికాదు. గవర్నర్ జెనరల్ కూడా, ఈ క్రయవిక్రయ వ్యవహారంలో దిగినాడు. ఈ కార్యకలాపాలు, అంతర్దేశీయ వ్యాపారంనుంచి దేశీయులను తొలగించడమేకాక, ఉత్పాదకుని, వినియోగదారునికూడా వంచించినవి. ఉత్పాదన కారకుడైన రైతు తన సరకులను చౌక ధరలకు

అమ్మేటట్లూ, వినియోగదారులైన ప్రజలు వాటిని అధిక ధరలకు కొనేటట్లు చేసినవి, కంపెనీ పద్ధతులు. వ్యాపారంలో జరిగిన ఈ, ఏకస్వామ్య వ్యవహారాలు, 1770 నాటి క్షామ పరిస్థితులను వెంటనే కలిగించినవి. "ప్రాంతంలో నిలువఉన్న బియ్యాన్ని సమస్తమూ విక్రయించుకొని, తమ అధీనంచేసుకొని, ఊహించరాని ధరలకు తప్ప ప్రజలకు అమ్మడానికి నిరాకరించి, ఆంగ్లేయులు దేశంలో ఒక క్షామాన్ని తయారుచేసినారు." అని, కార్ల్‌మార్క్స్ తన గ్రంథంలో వ్రాసిఉన్నాడు.

తనకు వ్యాపారంలో ప్రతి స్పర్ధులైన వర్తకులను పారదోలడానికి, కంపెనీ, ఇతర మార్గాలలోకూడా, తన రాజకీయాధికారాన్ని ఉపయోగించింది. "స్వయంగా కూడా-ముఖ్యంగా, ఆర్మీనియనులకు, మొగలులకు, జెంటూలకు (హిందువులు) చెందిన వస్తువులను,-తమకుగల (ఆంగ్లేయులకు) ఏకస్వామ్యాధికారాన్ని పురస్కరించుకొని,- రాజ మార్గాలలో ఆపి, బలాత్కారంతో వాటిని, వహనశుల్క గిడ్డంగులకు తరలించుకొని పోయేవారు." "ఈ సరకుల యజమానులకు ఇష్టంలేకపోయినా, వాటిని పడవలలో ఎక్కించి తమ దేశానికి పంపేవారు. ఈ పడవలపైనా, తమకు ఏ మాత్రమూ తెలియని ఈ రవాణాలపైనా విశ్వాసంలేని ఈ యజమానుల అభిప్రాయాలకు, వ్యాపార ప్రణాళికలకు విరుద్ధమైన విధంగా, కంపెనీవారు ఆ సరకులను తమ దేశానికి పంపేవారు." ఎక్కువ ప్రచారంలేని రేవులలోను, మార్గంలో లేని తావులలోను, నిలిపి ఉంచడంవల్ల, కొన్ని సమయాలలో అవి మాయమైపోవడం కూడా జరిగింది. పర్షియా, అరేబియా దేశాలతో వ్యాపారం జరిపే వారిలో ప్రధానులై ఉండిన అర్మీనియన్లు, పూర్తిగా నాశమైపోయిరి. వారి వర్తక స్థానాన్ని, కంపెనీ ఉద్యోగులు ఆక్రమించిరి.

మొగలు పరిపాలన కాలంలో కూడా, అంతర్దేశీయ వ్యాపారంపై పారవహన శుల్కాలు, సీమాశుల్కాలు విధింపబడినవి. బెంగాలులో అధికారాన్ని సంపాదించుకొన్న తర్వాత, బ్రిటిషువారు, ఈ రేట్లను బాగుగా పెంచి, ఇంతవరకూ శుల్కంలేని వస్తువులపై శుల్కాలు విధించి, కొత్తగా శుల్కద్వారాలను, రహదారీ ద్వారాలను విధించిరి. ఈ మహసూలులు (Imposts) రెండు ప్రయోజనాలను సాధించినవి. మొట్టమొదట, కంపెనీవారికి, వ్యాపారంలో ప్రతిస్పర్ధులైయుండిన డచ్చివారినీ, ఫ్రెంచివారినీ, ఇండియా వర్తకులనూ, అంతర్దేశీయ మార్గంలోకి తొలగించినవి.

కంపెనీ ఆదాయాన్ని వృద్ధిచేయడం, రెండవ ప్రయోజనం. ఈ ఆదాయంలోని కొంత భాగం మిలిటరీ శివిల్ పరిపాలన కర్చులకు, తక్కిన భాగం ఇంగ్లాండుకు ఎగుమతిచేసే వస్తువులను కొనడానికి, వినియోగమయింది. అత్యధికమైన రక్షణ శుల్కాలను విధించడంవల్ల, సాధారణంగా జరిగే విధంగా ఈ రెండు ప్రయోజనాలూ పరస్పర విరుద్ధంగా పరిణమించినవి. రక్షణ కలిగించగల అత్యధిక శుల్కాలవల్ల, రాజస్వాదాయం, ఎప్పుడూ, ఎక్కువగా లభించదు.

కట్టకడపటికి, పద్దెనిమిదో శతాబ్దం కడపటికి అంతర్దేశీయ శుల్కాలు తగ్గడం ప్రారంభించినవి. 1833లో, ఈస్ట్ ఇండియా వ్యవహారాల విచారణను పార్లమెంటు జరిపిన పిమ్మట పర్యవసానంగా, ఈ శుల్కాలు రద్దు కావింపబడినవి.

(b) విదేశ వ్యాపారం: ఇండియాలోని మూలాధారాలను బ్రిటనుదేశము యొక్క-

సంపత్తి సంవృద్ధికై ఉపయోగించవలసిన పద్ధతులను, చక్కగా గ్రహించినవారు ఇంగ్లాండు ప్రభువులు. ముడి పట్టు పరిశ్రమను బెంగాలులో ప్రోత్సహించవలసినదని, పట్టు వస్త్రాల పరిశ్రమను నిరుత్సాహ పరచవలసిందని, ఆనుదేశిస్తూ, కంపెనీ డైరక్టర్ల సభ 1769 నాడే తమ ఇండియా కార్యకర్తలకు వ్రాసింది. పట్టు కండెలను తయారుచేసే కార్మికులు కంపెనీ కర్మాగారాలలోనే పనిచేసేటట్లు నిర్బంధించవలసిందని, ఇండ్లలో పనిచేసే అలవాటును నిషేధించవలసిందని కూడా, ఆ పత్రంలోనే వివరించియుండిరి. ఇండియా ఆర్థిక వ్యవస్థను వలసరాజ్య విధానానికి అనుగుణంగా చేసే విధానముయొక్క సారాంశం, ఈ జాబులో నిహితమై ఉంది. ఇండియాలోని ముడి సరకులను చౌక ధరలకుకొని, వాటితో ఇంగ్లాండులో తయారుచేసిన వస్తువులను ఎక్కువ ధరలకు ఇండియాలో అమ్మడం, ఈ విధానము యొక్క కర్తవ్య ధర్మం. దీని విషయమై, 1783 నాటి సెలెక్ట్ కమిటీ ఈ విధంగా అభిప్రాయాన్ని ఇచ్చింది. "ఒక పక్షంలో నిర్బంధాన్ని, మరొక పక్షంలో ప్రోత్సాహాన్ని అదే శిస్తున్న ఈ పత్రంలో, బెంగాలు పరిశ్రమలను నాశంచేయుటానికై అవలంబించిన సమగ్ర విధాన పథకం ఇమిడి ఉన్నది. దీని ఫలితంగా, పారిశ్రామిక దేశమైన బెంగాలు స్వరూపమే పూర్తిగా మారిపోతుంది. బ్రిటనుదేశంలోని పరిశ్రమల ప్రయోజనాలకు అధీనమైఉంటే, వాటికి అవసరమైన ముడిసరకులను మాత్రమే ఉత్పాదనచేసే వ్యవసాయికదేశంగా మారిపోతుంది, బెంగాలు." పద్దెనిమిదో శతాబ్దంలో బ్రిటన్ అవలంబించిన వాణిజ్యవిధానానికి, ఈ పథకం అనుగుణంగా ఉంది. 1721 నాటి, తొలిరోజుల్లోనే, ఇంగ్లాండు రాజు, తన పార్లమెంటు ఉపన్యాసంలో ఈవిధంగా సూచించినాడు. "మన నౌకాసేనకు అవసరమైన వస్తువులను ఉత్పాదన కావించేటట్లు వలసరాజ్యాలను ప్రోత్సహించినట్లయితే, విదేశాలనుంచి ఆ వస్తువులను దిగుమతి చేయవలసిన అవసరం ఉండదు. దీనివల్ల, మన రాజ్యముయొక్క సంపద, శక్తి అభివృద్ధి చెందుతాయి. అంతేకాక, ప్రయోజనకరమైన ఈ సేవలో, మన వలసరాజ్యాలను నియోగించడంవల్ల, ఇంగ్లాండుదేశంలో ఉత్పన్నమయ్యే వస్తువులను తయారుచేసి, మన పారిశ్రామికులకు కష్టం కలిగించే ఉద్యమమునుంచి, ఆ దేశాలను మరొకముఖంగా మరలించడం జరుగుతుంది." ఈ రాజనీతి విధానాన్ని, మొదట, ఉత్తర అమెరికా వలసరాజ్యంలో కార్యరూపంలో ప్రవేశపెట్టిరి. కాని, అమెరికా వలసరాజ్యాలను పోగొట్టుకొన్న తర్వాత, ఇంగ్లాండు ప్రభుత్వ దృష్టి ఇండియావైపు మరలింది. ఇంగ్లాండు ఆర్థిక ప్రయోజనాలకై, 1776 దాకా, అమెరికా వలసరాజ్యాలు నిర్వహించిన కార్యభారం ఇప్పుడు ఇండియాదేశంపై పడింది. ఇండియాదేశపు ఆర్థికవ్యవస్థను సాంప్రదాయికమైన వలసరాజ్యవిధానపు అచ్చున నడిపరచే ఉద్దేశాన్ని, బ్రిటిషు పరిపాలనలోని ప్రథమ దశనుంచి కూడా ప్రబలంగా సాధిస్తూవచ్చిరి.

ఇండియా చైనాదేశాల వ్యాపారాన్ని, ఇంగ్లాండుదేశముయొక్క ఏకస్వామ్యాధికారంగా, కంపెనీ, సంపాదించుకొంది. ఇండియాలో రాజకీయప్రాబల్యం ఏర్పడనంతవరకూ, ఈ ఏకస్వామ్యాధికారం, కంపెనీకి సంబంధించని ఇతర వర్తకుల విషయంలో మాత్రమే ప్రవర్తించింది. ఇండియాను జయించి ఆక్రమించిన పిమ్మట, ఇండియా వాణిజ్యంనుంచి, ఇతర యూరోపు దేశవర్తకులను బహిష్కరించే అధికారం కంపెనీకి లభించింది. కంపెనీ భూభాగాలలోనుంచి వస్తువులను, సరకులను కొనసట్లుగా, డచ్చివారిని, ఫ్రెంచివారిని, నిరోధించింది. బ్రిటిషు కంపెనీలకు తప్ప ఇతరులకు వస్తువులను అమ్మకూడదని వృత్తి శిల్పులను, వృత్తి

కార్మికులను నిషేధించింది, డచ్చి, ఫ్రెంచి కంపెనీలకు చెందిన గోమాష్టాలను, ఇంగ్లీషు కంపెనీ ఏజెంట్లు, కొట్టి, బాధించినారు. చైనాదేశంతో అపీము వర్తకము, తేయాకు వర్తకము మాత్రమే, ఇతరదేశాల కంపెనీలు జరుపుకోవచ్చునని, వారిని ప్రోత్సహించిరి. ఈ విషయంలో కంపెనీ ప్రయోజనం లేకపోలేదు. ఇండియాలో తమకు కావలసిన "పెట్టు బడులకై" చైనాదేశపు వెండిని ఎక్కువగా సమకూర్చుకోవలసిన ఆవశ్యకం, కంపెనీకి ఉండడం వల్ల, ఈ విషయం జరిగింది.

కారన్‌వాలిస్ రావడంతో, ఇండియా విధానంలో తీవ్రమైన పరివర్తనం ఆరంభముయింది. "అనియతమై యుండిన సామ్రాజ్యనీతి, నియతమైన సామ్రాజ్య నీతిగా మారింది," అని, ఫర్బర్, దీనిని వర్ణించినాడు. "తాము ఇండియాలో సేకరించుకొన్న ధనాన్ని, ఏ విధంగానైనా ఇంగ్లాండుకు తీసుకొని పోవడానికై, పాశ్చాత్యులు తంటాలు పడడం, హేస్టింగ్సు పరిపాలనయొక్క కడపటి రోజుల్లో, మనము చూచినాము. కారన్‌వాలిస్ పరిపాలనయొక్క కడపటి దశలోకూడా, ధనాన్ని చేకూర్చుకోడానికై పాశ్చాత్యులు ప్రాకులాడడం జరిగింది; కాని ఈ ప్రయత్నం ఒక పద్ధతి ప్రకారంగా జరిగియుండడం మాత్రమే, రెంటికీగల భేదం." పిట్ తయారుచేసిన ఇండియా చట్టమూ కారన్‌వాలిస్ ప్రవేశపెట్టిన పరిపాలన వ్యవస్థా సంస్కరణాలూ, సామ్రాజ్య నీతియొక్క ప్రయోజనం పురోగమించడానికి బాగా సహకరించినవి.

ఇంగ్లాండు ప్రభుత్వానికి కంపెనీ అధీనమైపోయే పరిస్థితికి అనుకూలములైన మార్పులు కలుగుతూ వచ్చినవి. తమకు అనుకూలించే వ్యాపార సంతులనాన్ని ఇండియాలో సిద్ధింపచేసుకొని, మిగిలిన ధనాన్ని ప్రతి సంవత్సరమూ ఇంగ్లాండుకు పంపిస్తూ ఉండడం,-అనేది బ్రిటిషు వారి వాణిజ్య విధానమై ఉండింది. కాని, ఇప్పుడు కలిగినమార్పులతో, ఈ విధానం కూడా మారింది. బ్రిటిషు పరిశ్రమల ప్రయోజనాలకై, ఇండియా బజారును ఉపయోగించుకొని, వాణిజ్య పరిమాణాన్ని అధికం కావించడం, ఇప్పటి వాణిజ్యవిధానంగా ఏర్పడింది. 1773 సంవత్సరం మొదలుకొని, ప్రతి ఇరవై సంవత్సరాలకు ఒకమారు, పార్లమెంటువారు ఈస్ట్‌ఇండియా కంపెనీ వ్యవహారాలను పరిశీలించడం, పరిపాటి. ఈ పరిశీలన సందర్భాలు ఇంగ్లాండు పారిశ్రామికులకు మంచి అవకాశాలుగా ఉపకరించినవి. నూతన వాణిజ్య విధానాన్ని ఏర్పరచే విషయంలో, వీరు పార్లమెంటుపై ఒత్తిడితెచ్చి, తమకు అనుకూలమైన పద్ధతులను అనుసరించేటట్టు ప్రయత్నించిరి. బ్రిటిషు వస్తువులకు ఇండియా బజారులో విస్తృతమైన వ్యాప్తి కలిగే ప్రయత్నాలు, 1913 నుంచి, క్రమబద్ధమైన పద్ధతిలో జరుగుతూ వచ్చినవి.

1783 నుంచి 1813 వరకూగల, ఇరవై సంవత్సరాల కాలంలో, ఇంగ్లాండు ఇండియాల మధ్య జరిగిన వాణిజ్యం విలువ, సరాసరి, సంవత్సరానికి 20 లక్షలు పౌనులు. ఇండియా దేశముయొక్క విస్తృతినీ, పద్దెనిమిదో శతాబ్దంలో, ఇండియా నుంచి ఇంగ్లాండుకు తరలిపోయిన సంపదయొక్క లెక్కలనూ, బట్టి నిర్ణయిస్తే, ఈ వాణిజ్యం స్వల్పమైనదిగా తోస్తుంది. కంపెనీ వాణిజ్యానికి సంబంధించిన, ప్రపత్రాన్ని, మరల ఇవ్వవలసిన సందర్భం 1813 లో ఏర్పడినప్పుడు, కంపెనీకి గల ఏకస్వామ్యవాణిజ్యంపై దాడి మళ్ళీ ప్రారంభమయింది. కంపెనీకి ఇచ్చియుండిన విశేషాధికారాలను రద్దుచేయవలసిందని, ప్రతి పక్షంవారు

పట్టుబట్టిరి. తత్ఫలితంగా జరిగినమార్పుతో, కంపెనీ ఏకస్వామ్యాధికారం అంతమైపోయి, తక్కిన వారికి, కూడా, ఇండియావాణిజ్యానికి, అవకాశం లభించింది. ఇంగ్లాండు దేశీయులు, ఇండియాలో స్థిరనివాసం ఏర్పరచుకొనే విషయంలో ప్రభుత్వం విధించియుండిన నిర్బంధాలు కూడా తర్వాత కొంత కాలంలోనే తొలగిపోయినవి. ఇండియాలో స్థిరపడడానికి, అచ్చటి వ్యవసాయ కార్యక్రమాలలో తమ డబ్బును పెట్టుబడి పెట్టడానికి, తోటలకు సంబంధించిన పరిశ్రమలను నెలకొల్పడానికీ అవసరమైన అనుమతిని ప్రభుత్వం, ఇంగ్లాండు పెట్టుబడిదార్లకు ప్రసాదించింది.

## III తాటస్థ్య సిద్ధాంత యుగం

కంపెనీయొక్క ఏక స్వామ్యాధికారాన్ని రద్దుపరచి, ఇతరుల స్వంత వ్యాపారోద్యమాలకు కూడా అవకాశం కలిగించడంతో, ఇంగ్లాండు ఇండియాల సంబంధాల విషయంలో నూతన యుగం ఆరంభమయింది. ఏకస్వామ్యాధికారం తొలగిన వెంటనే, ఇంగ్లాండు నుంచి ఇండియాకు చేసిన ఎగుమతులు, అద్భుతావహంగా పెరిగిపోయినవి. 1814లో ఇండియాకు దిగుమతి ఐన వస్తువుల విలువ 18 లక్షల పౌనులు మాత్రమే; అట్టిది, 1829 నాటికి 45లక్షలకు పెరిగింది. ఈ సంఖ్యలుకూడా, వాస్తవమైన విలువను, సమగ్రంగా ప్రదర్శించవు. "వాణిజ్య చరిత్రలో ఇది అసదృశమైనది," అని క్రాఫోర్డ్, వర్ణించినాడు. 1814 సంవత్సరంలోని చెలామణి ద్రవ్యం విలువ, ప్రామాణిక విలువకంటె 25 లేక 26 శాతం తక్కువగా ఉండింది. దీనినిబట్టి, ఆ సంవత్సరంలోని దిగుమతుల విలువ 14 లక్షలు మాత్రమే ఔతుంది. కాబట్టి, 1827లోని 45 లక్షల దిగుమతులు ఎంత అధికమో, వ్యక్తమౌతుంది. అంతేకాక, ఫ్రెంచి యుద్ధాల కారణంగా, 1814లో, వస్తువుల ధరలుకూడా ఎక్కువే. 1828-29 నాటికి, ధరలు శాంతి సమయాల ప్రామాణిక స్థితికి దిగిపోయిఉండినవి. కాబట్టి, వస్తువుల పరిమాణాలనుబట్టి పరిశీలిస్తే ఈ పదహైదు ఏండ్లలోనూ, ఇండియాకు దిగుమతి చేసిన వస్తువులు, నాలుగు రెట్లు పెరిగినవని నిశ్చితమౌతుంది. ఇంగ్లాండునుంచి ఇండియాకు ఎగుమతిచేసిన, కొన్ని ప్రధాన వస్తువుల పరిమాణాలను ప్రదర్శించే, ఈ కింది పట్టిక, ఈ విషయాన్ని నిరూపిస్తుంది.

| వస్తువు. | 1814 సం. | 1828 సం. | నిరపేక్షిత వృద్ధి. | వృద్ధిశాతం. |
|---|---|---|---|---|
| రాగి [శుభ్రమైనది ముడిసరకు] | 37619 | 41742 | 4123 | 11 |
| ఇనుము—కడ్డీలు ఇతర రకాలు. | 186454 | 438629 | 252175 | 135 |
| వెదల్పుగల గుడ్డలు. | 17790 | 49502 | 31712 | 178 |
| చీటీ గుడ్డలు మొదలైనవి. | 680234 | 34843110 | 34162876 | 5022 |
| నూలు పురి, పౌనుల తూకంలో. | 8 | 4558185 | 4558177 | 56977213 |

"ఇండియా ప్రజలవినియోగానికై ఎగుమతి చేసే వస్తువుల పరిమాణాన్ని ఎక్కువచేయడానికిగాని, లేదా, వారి వినియోగానికి అనుగుణమైన వస్తువుల రకాలను ఎక్కువ చేయడానికిగాని ఏ మాత్రమూ అవకాశము లేదనీ, అట్లే, ఇండియా సరఫరాచేసే వస్తువులను పెంచడానికీ, వాటి రకాలను అధికం చేయడానికి కూడా అవకాశంలేదనీ, "కంపెనీని సమర్థించిన పక్షంవారు, 1813 లో, గట్టిగా వాదించి యుండిరి. కాని, ఆ తర్వాత బ్రిటిషువారు తీవ్రంగా కావించిన ఎగుమతులను, వస్తువులనుబట్టి ఇండియాలో కలిగిన వినియోగాన్నిబట్టి. ఈ వాదములోని మొదటి భాగం, తప్పని, రుజువయింది.

*ఇండియా వ్యాపార వ్యవస్థలో కలిగిన మార్పు :* ఇండియా పరిశ్రమలు క్షీణ స్థితిలో ఉన్న సమయంలో బ్రిటిషువారు, స్వేచ్ఛా వ్యాపార విధానాన్ని ఇండియాదేశంపై విధించడము, తమ వస్తువులను ఇండియాబజారుకు విస్తరింపచేసుకోడానికై తీసుకొన్న ప్రధానచర్య. బ్రిటిషువారి దిగుమతులను శుల్క రహితంగానో, లేదా, నామ మాత్రమైన శుల్కాలతోనే ఇండియా గ్రహించేటట్లు నిర్బంధించి, వాటిని ఇండియాపై బలాత్కారంగా తోసినారు. కాని, ఇండియా నుంచి ఇంగ్లాండుకు ఎగుమతిచేసిన వస్తువులపై మాత్రం అత్యధికమైన శుల్కాలను విధించింది ఇంగ్లాండు ప్రభుత్వం. ఈ విధానంవల్ల, బ్రిటిషువారి ఉద్దేశం శీఘ్రమే ఫలించింది. ఇండియా విదేశీయ వ్యాపారం వేగంగా వృద్ధిచెందింది. 1846 నుంచి 1851 వరకు మధ్యగల ఐదు సంవత్సరాల కాలంలో, ఇండియాదేశపు సముద్ర వ్యాపారముయొక్క సరాసరి సంవత్సరం విలువ 16.64 కోట్ల రూపాయల నుంచి 25.87 కోట్లకు పెరిగింది. ఆ తరువాతి ఐదు సంవత్సరాలలో జరిగిన పెరుగుదల, ఇంతకంటె అధికం. వర్తకముయొక్క సరాసరి సంవత్సరపు విలువ 52.70 కోట్లకు పెరిగింది; దీనిలో ఇండియా ఎగుమతుల విలువ 26.35 కోట్లు; దిగుమతుల విలువ 25.85 కోట్లు.

వర్తకం అభివృద్ధి చెందడం సాధారణంగా దేశానికి ప్రయోజనకరమౌతుంది. కాని, ఇండియా దేశ వ్యాపార వ్యవస్థలో సమూలమైన మార్పులను చేసియుండడంవల్ల, ఈ వర్తకాభివృద్ధి, దేశ వినాశానికి హేతువుగా పరిణమించింది. ఇండియా పరిశ్రమలు నశించిపోవడము, ప్రజలు దరిద్రులైపోవడము,—ఇవి, వర్తకాభివృద్ధివల్ల కలిగిన ఫలితాలు. పద్దెనిమిదో శతాబ్దంలో, నూలు వస్త్రాలను తయారుచేసి ఎగుమతి చేయడంలో, ప్రపంచానికంతటికీ ప్రధాన కేంద్రమై ఉండిన భారతదేశం, డెబ్బై ఏండ్ల స్వల్పకాలంలోనే, పరదేశంలో తయారైన వస్త్రాలను, ఇతర వస్తువులను, వినియోగించుకొనే దేశంగా మారిపోయింది. ఇట్టి స్థితికి తెచ్చింది, బ్రిటిషువారు దేశంలో అవలంబించిన వ్యాపార విధానం. పద్దెనిమిదో శతాబ్దపు ఇండియా ఎగుమతులలో అన్ని వస్తువులకంటె ప్రధానస్థానం వహించిన నూలు వస్త్రాలు, ఇప్పుడు, ఇండియాకు దిగుమతి చేసే వాటిలో ప్రధాన స్థానం వహించినవి. ఇండియా పారిశ్రామిక పరిస్థితిని, ఇరవై ఏండ్ల కాలంలోనే,- 1814 నుంచి 1835 వరకు – ఏ విధంగా మార్చివేసినారో, ఈ క్రింది పట్టికవల్ల విశదమౌతుంది.

| సంవత్సరం | ఇంగ్లాండునుంచి ఇండియాకు దిగుమతి చేసిన నూలు వస్త్రాలు. (గజాలలో) | ఇంగ్లాండుకు ఎగుమతిచేసిన ఇండియా నూలు వస్త్రాలు. (గజాలలో) |
|---|---|---|
| 1814 | 818208 | 1,266608 |
| 1821 | 19138726 | 534495 |
| 1828 | 42822077 | 422504 |
| 1835 | 51777277 | 306068 |

1814–1835ల మధ్యకాలంలో, ఇంగ్లాండుకు ఎగుమతి చేసిన ఇండియా వస్త్రాలు, సుమారు 13 లక్షల గజాల నుంచి, 3 లక్షల గజాలకు పడిపోయినవి. ఈ మధ్యలో, ఇతర దేశాలకు పంపుతూ ఉండిన ఎగుమతులుకూడా క్షీణించినవి. అమెరికాకు ఎగుమతి ఔతూ ఉండిన 13633 బేళ్ల నూలు వస్త్రాలు, 1829 నాటికి 258 బేళ్లకు దిగిపోయినవి. 1800లో, 1457 బేళ్ల వస్త్రాలను దిగుమతి చేసుకొన్న డెన్మార్క్ దేశం, 1820 తర్వాత 150 బేళ్ల కంటె ఎక్కువగా ఎప్పుడూ గ్రహించలేదు.

ఈ విధంగా, ఇండియా దేశంలో తయారైన వస్తువులకు విదేశాల బజార్లు లోపించి పోవడమేకాక, తన స్వదేశీయ బజార్లు, విదేశ వస్తువులతో మునిగిపోయినవి. ఇంగ్లాండులో తయారైన నూలువస్త్రాలు, ఇండియాలో ఏ విధంగా వచ్చిపడిందీ ఈ కింది పట్టిక వివరిస్తుంది;–

| లక్షల పౌనులలో | | |
|---|---|---|
| 1813 | ... | 1.1 |
| 1831 | ... | 16.5 [చైనాకు చేసిన ఎగుమతులు దీనిలో చేరినవి] |
| 1835 | ... | 17.9 |
| 1840 | ... | 38.6 |
| 1845 | ... | 42.1 |
| 1850 | ... | 52.2 |
| 1855 | ... | 58.4 |
| 1856 | ... | 63.0 |

పట్టు వస్త్రాలు, ఉన్ని వస్త్రాలు, యంత్రపరికరాలు, లోహ వస్తువులు,–మొదలైనవి, ఇండియాకు దిగుమతి ఐన ఇతర వస్తువులు. విదేశ వస్తువుల దిగుమతులతో ఏర్పడిన పోటీ వల్ల ఇండియా పరిశ్రమలు నశించినవి; వృత్తి శిల్పుల ఆదాయం నష్టమైపోయింది; శ్రామిక వర్గానికి ఉద్యోగావకాశాలు సన్నగిల్లినవి. ఇక రెండవ వైపు జరిగిన నష్టం;–ఇండియానుంచి

పైకి ఎగుమతి చేసిన సరకులలో ముడిపత్తి, ముడి పట్టు, ఆహార ధాన్యాలు, అపీము, నీలిమందు, జనుము, అనేవి ముఖ్యమైనవి. వీటి ఎగుమతులవల్ల, దేశంలోని వ్యావసాయిక మిగులు హరించుకొనిపోయి, దేశజీవనానికి రక్షణ లేకపోయింది. అంతేకాక, ముడిసరకుల ధరలు, దేశంలో పెరిగిపోయినవి. ఈ పరిస్థితులే తర్వాతికాలంలో ఏర్పడిన వ్యవసాయ సరకుల కొరతలకు క్షామాలకు, మూలము లైనవి. తత్పరిణామంవల్ల నూరు సంవత్సరాల దాకా దేశము, దుస్థితికీ, దారిద్ర్యానికీ ఆకర మయింది.

ఇండియాలో బ్రిటిషువారు అనుసరిస్తూ ఉండిన వ్యాపార విధానంపట్ల అసహ్య భావాన్నీ, ఇండియా దేశానికి కలిగిన దురవస్థపట్ల తమ వ్యథనూ ప్రదర్శించిన ఆంగ్లేయులు కూడా, కొందరు ఆ కాలంలో ఉండినారు. హెన్రీసెంట్ జార్జిటక్కర్, జార్జ్ థాంసన్, మరి కొందరు ఆంగ్లేయులు, ఈ ఉదార భావాలను ప్రకటించిన వ్యక్తులు. 1833లో, టక్కర్, ఈ విధంగా వ్రాస్తాడు. "ఇండియా విషయంలో మనము అవలంబించిన వాణిజ్య విధానమెట్టిది? ఇండియాలో తయారైన పట్టువస్త్రాలు, పట్టునూలూ కలిపి తయారుచేసిన వస్త్రాలు, మన బజారుల నుంచి, చాలకాలం కిందనే బహిష్కృతములై పోయినవి. ఇటీవల, ఇండియా వస్త్రాల దిగుమతిపై 67 శాతం శుల్కం విధించడంవల్ల, ఎక్కువ భాగము ఇండియా వస్త్రాల దిగుమతిని ఆపుచేసినాము. ఇండియాదేశానికి ప్రధానమైన ఆధారంగా ఉండిన నూలు వస్త్ర పరిశ్రమ ఈ చర్యలవల్ల నష్టమైపోయింది. అంతేకాక, మనదేశంలో తయారైన నూలు బట్టలను, ఏషియాలోని మన రాజ్యాల వినియోగానికై ఎగుమతి చేస్తున్నాము. మనము అవలంబించిన ఈ వాణిజ్య విధానంవల్ల, పారిశ్రామిక దేశంగా నెలకొని యుండిన ఇండియా దేశం, ఇప్పుడు కేవలం వ్యావసాయిక దేశస్థితికి వచ్చింది." ఇండియావస్తువులపై దిగుమతి శుల్కాలను విధించడంవల్ల ఇండియా పరిశ్రమలు నశించిపోతున్నాయనీ, కాబట్టి వాటిని రద్దుచేయవలసిందనీ, ప్రార్థిస్తూ కంపెనీ, పార్లమెంటుకు 1840లో, విన్నవించుకొంది. కాని, ఇంత ఆలస్యంగా చేసిన ఈ ఆక్షేపణలు నిరర్థకములైనవి. పారిశ్రామిక స్థితినుంచీ, వ్యవసాయిక స్థితికి ఇండియా దేశాన్ని తీసుకొనిరావడం, బ్రిటిషువారి సామ్రాజ్య నీతిలోని ఒక భాగంగా, ఎన్నడో ఏర్పడింది. దానికై వారు అవలంబించిన విధాన ప్రక్రియ, అప్పటికే చాలవరకు పూర్తిఅయింది కూడా.

## IV విదేశ వ్యాపార ఋణశేషము

బ్రిటిషు వస్తువులను ఇండియా దేశానికి ఎగుమతి చేసే విషయంలో, ఒక ప్రతిబంధనం ఇంకా నిలిచి ఉండింది. రోజురోజుకూ ప్రమాణంలో ఎక్కువౌతున్న బ్రిటిషు వస్తువుల దిగుమతులను, ఇండియా వినియోగించవలసివస్తే, ఇండియా దేశం ఏవస్తువులనైనా ఉత్పాదనచేసి, ఈ దిగుమతులకు ప్రతి ఫలంగా బ్రిటిషు వారికి ఇవ్వవలసి ఉంటుంది. దానికి అవకాశం కూడా బ్రిటిషు వారే కల్పించవలసియున్నది. కాబట్టి, ఈ వ్యాపార ఋణశేష సమస్య, సులభంగా పరిష్కారమయ్యేదికాదు. ఇండియాలోనికి దిగుమతి ఔతున్న వస్తువులతో సమానంగా, ఇండియాలోని ఉత్పాదన జరగడంలేదు; దీనితో, ఇండియాదేశముయొక్క క్రయశక్తి తగ్గిపోయింది. కాబట్టి, బ్రిటిషువస్తువుల విక్రయాన్ని ఇండియాలో విస్తరింపచేయడానికి, ఇండియా అశక్తి, ప్రతి బంధకంగా ఏర్పడింది. విదేశీ ద్రవ్యమారకానికి ముఖ్యా

ధారమై యుండిన, నూలు వస్త్ర పరిశ్రమను తామే (బ్రిటిషువారే) నాశనంకావించి, తమ దేశపు మిల్లులలో తయారైన వస్త్రాలతో ఇండియాను ముంచివేసినారు. ఇంగ్లాండు దేశానికి ఇండియా అమ్మగలిగిన మరొక వస్తువు, ముడిపత్తి. కాని, ఇండియా పత్తి ధర ఎక్కువై ఉండడమేకాక, అమెరికా పత్తివంటి నాణ్యమైనదికాదు. మిరియాలు, చక్కెర, దాల్చిని (లవంగ పట్ట)-మొదలైన సరకుల గిరాకీకూడా చాలా పడిపోయింది.

అదీకాక, ప్రపంచ బజార్లలో, ఇండియా సరకుల ధరల విషయంలో, ఎక్కువ ఆర్థిక మాంద్యత ఏర్పడింది. అందువల్ల, వ్యాపార సంబంధమైన షరతులు ఇండియా దేశానికి ఎక్కువ వ్యతిరిక్తమైనవి. ఇండియానుంచి విదేశాలకు ఎగుమతి ఔతున్న, ప్రధాన వస్తువుల ధరలలో కలిగిన మాంద్యతను ఈ కింది పట్టిక ప్రదర్శిస్తుంది.

కంపెనీ ఏక స్వామ్యాధికారాన్ని రద్దుచేసి, స్వేచ్ఛా వ్యాపార పద్ధతిని ప్రవేశపెట్టడం, ఈ మాంద్యానికి హేతువని, వాదించిరి. కాని, బ్రిటిషు బజారులో, ఇండియా వస్తువులకు గల గిరాకీని బలహీనం చేయడమే, ఇందుకు ప్రధానమైన హేతువుగా కనబడుతుంది. ఇండియా ఎగుమతి వ్యాపారవ్యవస్థ సమూలమైన మార్పుకు లోనయింది. పూర్వపు ఎగుమతులలో ప్రధానవస్తువులై ఉండిన పట్టు వస్త్రాలు, దూది వస్త్రాలు, ఇప్పుడు దిగుమతులలోని ప్రధానవస్తువులైనవి. ముడిపట్టుకుగల గిరాకీ కూడా క్షీణించింది. ఇండియా ముడిపత్తి శ్రేష్ఠమైనది కానందువల్ల, గిరాకీ ఇదివరకే పడిపోయింది. వేరే సరఫరా మార్గాలు ఏర్పడినందువల్ల మిరియాలకు, చక్కెరకు, కూడా, గిరాకీ తగ్గింది. ఇవన్నీకాక, ఇంగ్లాండుతో ఇండియాకుగల రాజకీయ సంబంధాల కారణంగా ఇండియా చెల్లించవలసిన వార్షిక ప్రభారాల (Annual charges) సమస్య కూడా ఉన్నది. వెండి బంగారాల అభావంవల్ల, ఈ ప్రభారాలను వస్తురూపంలో చెల్లించవలసిఉన్నది. ఇట్టి పరిస్థితులలో, విదేశీయ వ్యాపార సంబంధమైన షరతులు, ఇండియాకు వ్యతిరిక్తములు కావడంలో, ఆశ్చర్యంలేదు.

1832 లో, కంపెనీ ప్రపత్రాన్ని పునరుజ్జీవింపచేసే సందర్భంలో, రుణశేషాలకు సంబంధించిన పరిస్థితిపై, వ్యాఖ్యానిస్తూ, మ్యాకిలాప్ (Mackillop), పార్లమెంటు ఉపసంఘం ఎదుట ఈ విధంగా వివరించినాడు;- "ఇంగ్లాండుకు జమకట్టవలసిన ద్రవ్యాలను పంపడంలో, గొప్ప చిక్కులు ఏర్పడియున్నవి. ఈ కష్టము ఏ విధంగా ఏర్పడినదనే విషయాన్ని నిరూపించడానికి, ఒక ఉదాహరణను వివరిస్తాను. గత రెండు సంవత్సరాలలో, మనం దిగుమతి చేసిన నీలిమందువల్లా, ఇతర సరకులవల్లా కూడా, మనకు లభించిన విలువ, రూపాయకు 1 షిల్లింగు, 3 పెన్నీలు మాత్రమే, ఐ ఉండగా, రూపాయి నాణెము యొక్క ముద్రణ విలువ 1 షిల్లింగు 11 3/4 పెన్నీలు అయింది. కాబట్టే, వ్యక్తులు, కంపెనీకూడా, ఇటీవల, వస్తువులకు బదులుగా వెండిని ఇంగ్లాండుకు తీసుకొనివచ్చి, చెల్లిస్తున్నారు." శతాబ్దాలుగా, ఇండియా దేశం తన సరకులను ఇతరదేశాలకు ఎగుమతిచేసి, వాటికి వినిమయంగా, ఆ, దేశాలు ఇచ్చిన వెండి బంగారాలను గ్రహిస్తూ వచ్చింది. ఇప్పుడో, పరిస్థితులు తారుమారై పోయినవి. ఇండియాలోనికి దిగుమతిచేసే ఇంగ్లాండు వస్తువులకు వినిమయంగా ఇండియాదేశం, వెండిబంగారాలు తప్ప, మరేదీ ఇవ్వజాలదు. కాని, వెండిబంగారాలను ఇండియా, తయారు చేయడంలేదు. మ్యాకిల్లాప్ చెప్పిన రీతిగా, "ఇండియా చైనా దేశాల ద్రవ్యప్రేషణ (Remittance) విషయంలో, ఇప్పటి పద్ధతినే మనం ఇంకా కొంతకాలం సాగిస్తే, మన

| వస్తువు. | | 1793 | 1815 | ఎక్కువ లేక, తక్కువ శాతం. | 1831 | 1815 ధరలపై కలిగిన మాంద్యశాతం. |
|---|---|---|---|---|---|---|
| | | షి. పె. | షి. పె. | | షి. పె. | |
| దూది పౌను తూకము | ... | 1–3/4 | 0–11 1/2 | – 9 | 0–5 | 56 |
| నీలిమందు తూకము, | ... | 7–4 1/2 | 8–10 | + 9 | 4– 0 | 54 |
| బియ్యం (c. w. t.) | ... | — | 23– 9 | — | 14–10 | 39 |
| సురేకారం తూకము | ... | 59–9 | 87– 0 | +45 | 36– 0 | 58 |
| ముడిపట్టు పౌనుకు | ... | 21–0 | 18– 1 | – 13 | 13– 7 1/2 | 24 |
| దాల్చినిచెక్క పౌనుకు | ... | 12–0 | 13– 8 | +13 | 8– 9 | 35 |
| నల్ల మిరియాలు ,, | ... | 1–2 1/2 | 0–10 1/2 | – 27 | 0– 3 3/4 | 64 |
| చక్కెర (c. w. t.) | ... | 66–6 | 49– 1 | – 26 | 26– 2 | 46 |

దేశము నుంచి [ఇంగ్లాండు] ఆదేశాలకు పోయే దిగుమతులు ఆగిపోక తప్పవు".

*విదేశీయ ఋణశేషాల వ్యతిరిక్తతకు నివారణలు :*

(a) *వ్యావసాయాభి వృద్ధి:* ఇండియాదేశముయొక్క విదేశీయ ఋణశేషాల సమస్యను పరిష్కరించడానికీ, బ్రిటిష్ వస్తువులను కొనడానికి తగిన క్రయశక్తిని కలిగించడానికీ, ఇండియా వ్యావసాయిక మూలసాధనాలను అభివృద్ధిపరచడం, ఒక మార్గంగా నిశ్చయింప బడింది. ఇండియా వ్యావసాయిక మూలసాధనాలను అభివృద్ధి పరచడానికి తగిన ప్రయత్నాల నన్నిటినీ ప్రభుత్వం జరుపవలెనని, ఇంగ్లాండులోని వివిధ వ్యాపారసంస్థలు, పార్లమెంటు సెలక్టు కమిటీని ఒత్తిడిచేసినవి. (1832). మ్యాన్‌ఛెస్టర్ ఛేంబర్ ఆఫ్ కామర్స్, (మ్యాంఛెస్టర్ వ్యాపారసంస్థ) ఈవిధంగా వ్రాసింది;- "ఇండియా ఎగుమతి చేయగల పదార్థాలను అధికం చేయడానికి జరిపే ప్రయత్నం. ఆ దేశానికి శ్రేయస్కరమైనది మాత్రమేకాక, ఈ దేశానికికూడా శ్రేయస్కరమైనది. ఇండియా పత్తియొక్క నాణ్యాన్ని బాగుపరచడం, ఇంగ్లాండులోని పారిశ్రామికుల సంపత్సమృద్ధికి అత్యంతమూ ప్రధానమైన విషయంకాబట్టి, ఈవిషయంలో ఇండియాదేశం సాధించగలిగినదంతా అభివృద్ధికావడానికి తగిన అవకాశాలను, సౌకర్యాలను, ప్రభుత్వం కలిగించవలసి ఉంటుంది." గ్లాస్‌గో వ్యాపారసంస్థకూడా ఇదేవిధంగా, "ఇండియా ఎగుమతి చేయగల ఉత్పాదన సరకులు, నాణ్యంలోనూ, పరిమాణంలోనూ, అభివృద్ధిచెందడం, ఈ ఫలితాన్ని కలిగిస్తాయి, అనడంలో, సందేహం ఏమాత్రమూ లేదు." [అనగా, ఇంగ్లాండులో తయారైన వస్తువులకు ఇండియా బజారును విస్తరింప చేయడం.]

బ్రిటిష్ ఎగుమతిచేస్తున్న వస్తువులకు వినిమయంగా, ఇండియాదేశం, తగిన సరకులను ఉత్పాదన చేస్తేతప్ప, ఇంగ్లాండుదేశం, తనవస్తువులను ఇండియాలోనికి ప్రవహింప చేయడం, ఎంతోకాలం జరగదనే విషయం, 1840 నాటికి, అందరికీ అర్థమయింది. ఇండియాలోని వ్యావసాయిక మూలాధారాలను అభివృద్ధిచేయవలసిందని ఈస్టిండియా కంపెనీని ఒత్తిడిచేసే ఆందోళన ఇంగ్లాండు ప్రజలలో ప్రారంభమయింది. వ్యవసాయ భూములపైగల శిస్తులను తగ్గించడము, వ్యవసాయానికి అవసరమైన నీటి పారుదల సౌకర్యాలను వృద్ధి పరచడము, సంస్కరించబడిన వాణిజ్య పంటల రకాలను ముఖ్యంగా, నాణ్యమైన పత్తి పంటను ప్రవేశపెట్టడము, ఇండియాలో పండిన పత్తిని ఇంగ్లాండులోనికి దిగుమతి చేయడానికి ఎక్కువ అభిమానం చూపి, మన వలస రాజ్యాలనుంచి విడిపోయి, దాస్యవర్గ శ్రామికులచే పండిస్తున్న అమెరికా పత్తిని, ఆదరించక పోవడము,- మొదలైనవి, ఈ ఆందోళనకారులు ప్రభుత్వానికిచ్చిన సలహాలు. ఈవిషయమై, జార్జి థాంసన్, 1839 లో, ఈస్టు ఇండియా సంఘంలో, ఆరు ఉపన్యాసాలు ఇచ్చినాడు. ఇవి, ఈ ఆందోళనకు ఆదర్శప్రాయములైనవి. కాని, వీటివల్ల కలిగిన ఫలితం, తక్కువ. ఇండియాలో వ్యవసాయాభివృద్ధీ జరుగలేదు, అమెరికాదేశపు పత్తికిగల గిరాకీ, ఇండియా పత్తికి కలుగనూలేదు. కాని, ఒక్క విషయంలో ఈ ఆందోళన, ప్రయోజకమయింది. ఇంగ్లాండుదేశం, ఇండియాపై జరిపిన జరుపుతున్న, అన్యాయాలను, అక్రమాలను, ఈ ఆందోళన బట్టబయలుచేసింది; ఇండియా వ్యవసాయానికి, బ్రిటిషువారి విధానం కలిగించిన ఆఘాతమెట్టిదో, బైటపెట్టింది.

ఇండియాపత్తి యొక్క స్వభావ న్యూనతను గురించీ, బ్రిటిషు మిల్లులలో నాజూకైన బట్టల నిర్మాణానికి దాని అనర్హతను గురించీ, వ్యాఖ్యానిస్తూ, థాంసన్ ఈ విధంగా ఉపన్యసించినాడు; – "ఇండియాలోని వ్యవసాయ క్షేత్రం, ఏదో శాపానికి పాల్పడినట్లు తోస్తుంది. తనకు సంపదను కల్గించే మూలాధారంగా క్షేత్రాన్ని రైతు భావించడంలేదు; తన శ్రమకు నిరర్థకమైన ఒక కార్యరంగంగా చూస్తున్నాడు. తాను కష్టించి, దానిలో ఉత్పాదించే ఫలం తనదికాదు; దేశాన్ని జయించి, ఆక్రమించిన పరదేశీయుని సంపన్నునిగా చేయడానికి ఉపకరించేది ఈ ఫలం; తన శ్రమవల్ల ఉత్పన్నమైన దానిలోని మిగులునంతా అతడు సంగ్రహించుకొని బాగుపడుతున్నాడు, అనే భావం రైతు హృదయంలో నాటుకొని, పోయింది. కనుక, పరిశ్రమలు క్షీణించడమూ, అభివృద్ధి ఆగిపోవడమూ, ఆశ్చర్యకరమైన విషయాలుకావు. ప్రజలు, కృషక దాసుల అవస్థకు లోనై జీవిస్తున్నారు; గుత్తేదారుడైన ప్రభుత్వముయొక్క ఇచ్ఛాసంకల్పాలపై బ్రతుకుతున్నవారు. భూములపై నుంచి రాజస్వాన్ని వసూలుచేసుకోవడమే జీవితాశయమైన వ్యక్తుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడినవారు. ప్రభుత్వం విధించిన అధికతమ శిస్తులు భరింపరానివైనవి; ఏకాలంలోనూ ఇవి ఇంత పెరగలేదు, పెరగబోవు. రైతులూ, వ్యవసాయదారులూ శిస్తులు బాకీపడి ఉన్నారు; బాకీపడిన మరుక్షణం నుంచీ, జిల్లాకలెక్టరువారిని, వలిపివేయవచ్చు; కట్టకడపట వారి వద్ద మిగిలియున్న పిడికిలిపత్తినీ, ధాన్యపు గింజనూ కూడా, దోచుకొని, వారిని శిక్షించక వదలిపెట్టడం, తాను చూపిన కనికరంగా భావిస్తాడు కలెక్టరు. ఆ విధంగా, వదలివేయబడిన రైతు, అగతికుడై, గ్రామంలోని బ్యాంకిరును పిడికెడు గింజలకై బ్రతిమలాడవలసివస్తుంది. అతనిని ప్రాధేయపడి, అప్పు తెచ్చుకొన్న రెండు గింజలనూ, మళ్ళీ భూమిలో చల్లి, మిగిలిన గింజలతో తన పొట్టనూ, తనపై ఆధారపడియున్న కుటుంబ ప్రజల పొట్టలనూ, ఏదో విధంగా పూడ్చుకొంటూ, మళ్ళీ పంటవచ్చేవరకూ, ప్రాణాలను నిలుపుకోవలసిన పరిస్థితి ఇండియాలోని రైతుది." ఇట్టి పరిస్థితులలో, ఇండియా వ్యవసాయ పరిశ్రమలో ఏ విధమైన అభివృద్ధిని మనము ఆశించవచ్చు ? అని ప్రశ్నిస్తాడు, థామ్సన్.

(b) *ఇండియాను వలసరాజ్యంగా చేయడం :* వ్యవసాయాభివృద్ధికి తోడ్పడడం బ్రిటిషు ప్రభుత్వానికి అభిమతం కాదు; ఇతర ఉత్పాదన కార్యక్రమాలను వృద్ధిచేయడం, అంతకంటె అయిష్టమైనచర్య. కనుక, బ్రిటిషు పారిశ్రామికులకు తోచిన మరొక నివారణోపాయం,– ఇండియాలో ఉపనివేశ స్థాపన. బ్రిటిషు ప్రజలు ఇండియా దేశాంతర్భాగాలలో నెలకొని, తమధనాన్ని పెట్టుబడిపెట్టి, ఉత్పాదనను అభివృద్ధి పరచడం, ఈ ఉపనివేశ సంస్థాపన. లివర్‌పూల్ ఈస్టిండియాకమిటీ, పార్లమెంటు సెలెక్టు కమిటీకి ఈవిధంగా, తన సలహాను వివరించింది. "ఇండియాలో ఉత్పాదన ఔతున్న పదార్థాలను శ్రేష్ఠమైన విధంగా అభివృద్ధిపరచే పద్ధతులతో పరిచయమున్న ఆంగ్లేయులను,– శక్తి సామర్థ్యమున్నవారిని,– ప్రోత్సహించి, వారు భారతదేశాంతర్భాగాలలో స్థిరనివాసాలేర్పరచుకొని, నెలకొనేటట్లు చేయవలసిందని, మేము ప్రభుత్వాన్ని కోరుతున్నాము. మరిన్ని మూలధనం ఉన్న బ్రిటిషు వ్యక్తులను ప్రోత్సహించి, సరసమైన షరతులపై వ్యవసాయ భూమిని శాశ్వత అనుదానంగాఇచ్చి, వారి మూలధనాన్ని ఆ భూములలో పెట్టుబడి కావించేటట్లు ప్రభుత్వం చేయవలసియున్నది. దేశంలో, రహదారులను, వంతెనలను నిర్మించి, దేశంలోని వివిధ ప్రదేశాలకు సులభంగా

రాకపోకలు జరిగే ఏర్పాట్లు చేయడం అత్యవసరం." గ్లాస్‌గో వర్తకసంస్థ కూడా, ఈవిధంగానే, తన అభిప్రాయాన్ని తెలిపింది. "ఇచ్చటినుంచి ఇండియాకు వలసపోయే ఆంగ్లేయులకు ఇండియాలోని శాంతిభద్రతల రక్షణకు అనుగుణమైన విధంగా, అవకాశాలను కల్పించి, ప్రోత్సహించినట్లైతే, వారి ఉపాయ కౌశలంవల్లను, మూలధన సహాయంవల్లను, వారి ఉద్యమ ప్రయత్నాలవల్లను, అత్యంత ప్రయోజన కరములైన సత్ఫలితాలు సిద్ధించగలవని మనం ఆశించడం హేతుబద్ధమైనది." మ్యాన్‌ఛెస్టర్ వర్తకసంస్థ ఈవిధంగా వివరించింది;- "ఇంగ్లాండునుంచి ఇండియాకు వలసపోయే ఆంగ్లేయులకు, వ్యవసాయ భూముల అనుభోగానికి అవసరమైన అనుమతిని, ప్రభుత్వం ఇవ్వడమొక్కటే ఆదేశంలో, వ్యవసాయాన్ని, వ్యాపారాన్ని, వృద్ధిచేయడానికి తగిన మార్గము. హానికరములైన నిర్బంధాలను తొలగించి, బ్రిటిషువారి మూలధనము, నేర్పు, ఉద్యమ సాహసము, ఇత్యాదుల సహజప్రవృత్తుల విషయంలో ఉదార స్వాతంత్ర్యాన్ని ఇచ్చినట్లయితే, ఇండియా పంటభూములను దోహదక్రియలతో సారవంతంచేసి, సహజంగా కష్టపడి పనిచేసే శాంతిపరులైన ఇండియా రైతుల సహకారాన్ని పొంది, ఇప్పుడు మనకు ఆవశ్యకమైయున్న సమస్త కార్యాలనూ, తప్పక సాధించగలము." పాశ్చాత్యులకు ఇండియాలో స్థిరనివాసం కల్పించడంవల్ల, ప్రభుత్వాదాయానికి కలిగే, ప్రయోజనాలెట్టివో, స్పష్టంగా వివరించవలసిందని అడిగినప్పుడు, హోల్ట్ మెకెంజీ, ఈవిధంగా వివరించినాడు;- "ఇండియాలో స్థిరనివాసిగా ఏర్పడే ప్రతి ప్రాశ్చాత్య వ్యక్తీ, ఏదో కొంతలాభాన్ని ప్రభుత్వాదాయానికి సమకూరుస్తాడని నాకు దృఢవిశ్వాసమేర్పడింది. శుల్కాలు విధించిన వస్తువులను వినియోగించడంవల్ల, అతడు మనకు లాభకారియైనవ్యక్తి. ఉత్పాదక మార్గాలను అతడు తప్పక అభివృద్ధి చేయగలడు కాబట్టి, దేశంలోని సాధారణ సంపత్తిని ఎక్కువగా వృద్ధిచేస్తాడు. ఇతని పద్ధతులను అనుసరించి, దేశీయులనేకులలో పాశ్చాత్యుల వ్యవహార పద్ధతులు వ్యాప్తికి వస్తాయి. పాశ్చాత్య జీవితపద్ధతులు, దేశీయ జీవితపద్ధతులకంటె ఎక్కువ సుఖకరమైనవీ, ధనవ్యయంతో కూడినవీ ఐనా, దేశీయుల అలవాట్లలో మార్పు కలుగవలసిన అవసరం ఉండదు. దేశంలోని సంపద అభివృద్ధి కావడంతో, నానావిధములైన శుల్కాలు, పన్నులు కూడా వృద్ధిచెందుతాయి. దేశంలోని వినియోగానికి, విదేశీయ వ్యాపారానికి ఆవశ్యకములైన పదార్థాల ఉత్పాదన సమృద్ధిగా పెరుగుతుంది. పరిష్కారాలు జరగని జిల్లాలలో, వ్యవసాయంలో జరిగే అభివృద్ధి వల్ల, ప్రభుత్వ రాజస్వానికి కూడా ఎక్కువ ఆదాయం లభిస్తుంది. నీటిపారుదల పద్ధతి లేనట్టి వ్యవసాయ ప్రదేశాలలోని ప్రస్తుత ఉత్పాదన చాల తక్కువ; ఆ ప్రదేశాలలో నీటిపారుదల సౌకర్యాలను కలిగించి నట్లైతే, ఆ భూములు మిక్కిలి ఫలవంతము కాగలవు. ప్రత్యేకంగా నిర్దిష్టము కానట్టి బంజరు భూములపై భాటకాదాయమంతా ప్రభుత్వానికి చెందిందే కనుక, ఆ భూములు సాగులోనికి రావడంతో, వెంటనేకాని లేదా, శీఘ్రకాలంలోనేకాని, ఆ భూములపై వచ్చే శిస్తులు అధికమై, ప్రభుత్వాదాయాన్ని పెంచగలవు. పాశ్చాత్యుల సంపర్కసాహచర్యాలకారణంగా, దేశీయులలో, వైన్ (ద్రాక్షసారా) బ్రాందీ, విస్కీ, మొదలైన వాటి ఉపయోగం కూడా వ్యాప్తికి రాగలదని, నానమ్మకం. నైతికదృష్ట్యా, ఈ పరిణామం శోచనీయమైనదే ఐనా, ప్రభుత్వ రాజస్వ విషయంలో, లాభకరమైనట్టిది. ఇక, పాశ్చాత్యుల సేవకులుకూడా మంచి దుస్తులను ధరించేవారే. బట్టలుకూడా శుల్కపద్ధతికి అధీనమైనవే

కాబట్టి, దీనివల్లకూడా ప్రభుత్వానికి ఆదాయం లభిస్తుంది." లాభదాయకములైన ఈ ప్రయోజనాలేకాక, పరిపాలక వర్గ ప్రజలను దేశాంతర్భాగాలలో నెలకొల్పడంవల్ల, ఒక ముఖ్యమైన రాజకీయ ప్రయోజనం కూడా సిద్ధిస్తుంది. ప్రజలు కూడగట్టుకొని, పరిపాలకులకు ఎదురు తిరిగే అవకాశానికి, ఇది ప్రతిబంధకమౌతుంది. ఎప్పుడైనా, తిరుగుబాటు జరిగే సందర్భమే ఏర్పడితే, దేశంలో అన్నిచోట్లా పరిపాలక వర్గంవారు నివసిస్తూ ఉండడంవల్ల, ఆ తిరుగుబాటు ప్రయత్నాన్ని, ఆదిలోనే అణచి వేయవచ్చు.

దేశంలోని అంతర్భాగాలలో పాశ్చాత్యుల నివాస స్థానాలకు, వారు శాశ్వతంగా నెలకొడానికీ సంబంధించిన నిర్బంధాలను, 1824 సంవత్సరంలోనే, తీసివేయడం జరిగింది. తరువాతి సంవత్సరాలలో, ఇంగ్లాండు దేశప్రజలను, వారి మూలధనాన్ని ఇండియా దేశపు అంతర్భాగాలలో ప్రవేశపెట్టే ప్రయత్నాలు తీవ్రంగా జరిగినవి. వ్యవసాయానికీ, తోటల పెంపకానికీ తగిన భూములను వారికి, శిస్తురహితమైన అనుభోగానికీ, లేదా, అరవై ఏండ్ల కాలం గుత్తకూ, ఇచ్చే ఏర్పాట్లు కావించిరి. అంతర్దేశీయ వ్యాపారంలో పారవహన శుల్కాలను రద్దుచేసి, దేశంలోని సమస్త వ్యాపారాన్నీ, పరిశ్రమలనూ, పరదేశీయుల ఉద్యమ ప్రయత్నాలకు వదలివేసిరి.

వలస విధానముయొక్క వైఫల్యం: అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా న్యూజీలాండు దేశాలలో వలసలను ఏర్పరచుకొన్న విధంగా, ఇండియాలో చేయడం సాధ్యంకాదు. ఇదివరకే బాగుగా వృద్ధిచెంది, ఎక్కువ జనాభాతో కూడియున్న దేశము ఇండియా. ఆంగ్లేయులు వలసపోయి నెలకొన్న కాలంలో, అమెరికా మొదలైన దేశాలు, ఏమాత్రమూ అభివృద్ధికిరాని విస్తారమైన బంజరు భూభాగాలతో ఏర్పడియుండినవి.

అదీకాక, చిన్నవియైన వ్యవసాయ క్షేత్రాలను గ్రహించి, దేశీయులైన రైతులతో పోటీచేస్తూ, వాటిని సాగుచేయడం పాశ్చాత్యులకు సాధ్యంకానిపని. వారి వ్యవసాయోద్యమాలకు అనుకూలించినవి కాఫీ పంటలు, తేయాకు పంటలు మాత్రమే. ఇండియాదేశానికి విశిష్టమైన వ్యావసాయిక పరిస్థితులవల్ల, ఇతరవిధములైన వ్యవసాయ పరిశ్రమలు పాశ్చాత్యుల అందుబాట్లో లేనివి.

ఇక రెండవదిగా, ఆంగ్లేయులు ఇంగ్లాండుదేశంలో అలవాటుపడి ఉండిన శీతోష్ణపరిస్థితులకు పూర్తిగా భిన్నమైనవి ఇండియాలోని ఈపరిస్థితులు. బ్రిటిషువారు దేశాన్ని ఆక్రమించిన తొలిరోజులలో, ఈదేశానికి వచ్చిన పాశ్చాత్యుల మరణసంఖ్య ఎక్కువగా ఉండింది. రక్తవిరేచనాలు, మశూచి, మలేరియా, ఉదరసంబంధమైన బాధలు మొదలైన రోగాలకు, అనేకులు పాశ్చాత్యులు బలియైపోయిరి. ఈరోగాలవల్లను, ఇండియావేసవుల తీవ్రతవల్లను, చావుతప్పించుకొన్న పాశ్చాత్యుల ఆరోగ్యంకూడా బాగా దెబ్బతినింది.

కడపట, దేశముయొక్క అంతర్భాగాలలో ఏర్పడియున్న వ్యాపారోద్యమాలలో, పాశ్చాత్యులు దేశీయులతో పోటీచేసి, నిలువలేకపోయిరి. ఇండియా ప్రజలు పొదుపుతో జీవించగలిగినవారు. శ్రమపడి పనిచేయ గలిగినవారు; బుద్ధితీక్ష్ణత కలవారుకూడా. పరదేశీలువచ్చి, ఇండియాలో ఏదైనా పరిశ్రమను స్థాపించడంతోనే, దేశీయులుకూడా, శీఘ్రమే ఆ పరిశ్రమ నిర్వహణకు పూనుకొనేవారు. దేశీయుల జీవన ప్రమాణం తక్కువ కావడంవల్ల, పాశ్చాత్యులు తయారుచేసే వస్తువులను తాము తక్కువ వ్యయంతో తయారుచేసి, చౌక

ధరలకు అమ్మ గలిగేవారు. ఈ విధమైన క్లిష్టపరిస్థితి ఏర్పడగలదని, మన్రో, ఏనాడో ఊహించినాడు. 1813 నాటి పార్లమెంటు కమిటీ ఎదుట, ఈస్టిండియా వ్యవహారాలపై సాక్ష్య మిస్తూ, ఈవిధంగా వివరించియున్నాడు. "ఇండియాజాతికూడా మన జాతివలెనే వర్తక వ్యవహారాలలో సమర్థమైనది. [మనమెట్టి దుకాణాదార్లమో ఇండియావారుకూడా అట్టివారే.] తాము నిర్వహించే అంగడిని వారెప్పుడూ విస్మరించియుండరు. పౌరవిషయాలకు మతానికి సంబంధించిన వ్యవహారాలలోకి కూడా, వారు, వర్తకానికి ప్రవేశం కలిగిస్తారు. వారి పుణ్య స్థలాలు, వారితీర్థయాత్రలు, అన్నికూడా సమస్త విధములైన వస్తువులనూ అమ్మే సంత బజార్లతో కూడిఉంటాయి. ఇండియాలో, మతము, వర్తకము, అనేవి రెండూ సోదరకళలు. ఒకదాని విషయంలో ఏర్పడిన ప్రతి సమావేశంలోనూ రెండవది ఉండక తప్పదు. దేశీయులకు సహజమైఉన్న ఈ వర్తక స్వభావాన్నిబట్టి, పాశ్చాత్య వర్తకుడు కూడా, దేశాంతర్భాగాలలో స్థిరంగా నిలవడం సాధ్యముకాదని, నేను విశ్వసిస్తున్నాను; శీఘ్రంగానో ఆలస్యంగానో పాశ్చాత్య వర్తకులందరూ అంతర్భాగంలోని ప్రదేశాలను వదలిపెట్టి, సముద్ర తీర ప్రదేశాలకు చేరుకోవడం తప్పదు. పాశ్చాత్యుడు, తన తిండికి త్రాగుడుకూ, ఒకనెలకు ఖర్చుపెట్టే డబ్బు, హిందూవర్తకుడు పండ్రెండు నెలలలో వ్యాపారంవల్ల సంపాదించే లాభానికి సరిపోతుంది. కాబట్టి, పాశ్చాత్యుడు, హిందువు, సమాన ప్రతి పత్తిలో వ్యాపారానికే పూనుకోవడంలేదు. అత్యధికమైన శుల్కాన్ని చెల్లించి ఒకడు, ఏమీ చెల్లించకుండా మరొకడూ, ఒకే బజారులో వస్తువులనుకొనే ఇద్దరు వర్తకుల సాదృశ్యం, ఈ విషయంలో వర్తిస్తుంది. ఈ విధంగా అసమానమైయున్న పరిస్థితుల్లో, పాశ్చాత్య వర్తకుడు దేశీయవర్తకునితో పోటీ చేసి, ఎంతకాలమో నిలవలేడు. తనవద్ద ఉన్న విస్తారమైన మూలధనంతో, నూతన పరిశ్రమ ను దేనినైనా కొంతకాలందాకా సాగించవచ్చు; లేదా, నీలిమందు, చక్కెర మొదలైన పాత పరిశ్రమలనే వృద్ధిపరచి, కొంతకాలం నిర్వహించవచ్చు. పాశ్చాత్యుడు పూనుకొన్న నూతన ఉద్యమం ఫలించి, స్థిరంగా నిలుస్తుందా, అని, కనిపెట్టిచూస్తూ, హిందూవర్తకుడు వేచి ఉంటాడు. అది ప్రయోజనకరమైనదని, శాశ్వతంగా నిలబడుతుందని గ్రహించినవెంటనే, తానుకూడా ఆ ఉద్యమంలో ప్రవేశిస్తాడు. అంతతో, పాశ్చాత్యుడు ఆ రంగాన్ని వదలిపోవల సిందే. ఈ నిమిత్తశక్తి క్రమంగా ప్రవృత్తమై, పాశ్చాత్యులందరినీ సముద్రతీర ప్రాంతాలకు తోసివేస్తుందనే విషయంలో, నాకేమాత్రమూ సందేహంలేదు. అదేవిధంగా, ఇంగ్లాండులోని వర్తకులతో స్వయంగా ప్రత్యక్ష వ్యవహారాలను జరుపుకొనే అవకాశం ఇండియా వర్తకులకు, భావికాలంలో సిద్ధిస్తుంది అనే విషయంలోకూడా, నాకెట్టి సందేహమూ లేదు. ఇండియా వర్తకుల ఉత్తమ ఆర్థిక విధానము, వారి పొదుపుతనము,- అనే మూలకారణాలవల్లనే, ఇప్పుడు ఇండియా సముద్ర తీరప్రాంతాలలో స్థిరపడిఉన్న ఇంగ్లాండు వర్తకుల ఏజెంట్లు, ఇండియాను వదలిపోవలసి వస్తుంది, అనే, విషయంలో కూడా, నాకు సందేహంలేదు;"

తరువాతి కాలంలో జరిగిన విషయాలన్నీ ఈ భావిసూచనలను అనుసరించి యథా తథంగా జరిగియుండడం, మన్రో భావిదృష్టికి మంచినిదర్శనం. ఇండియాదేశాన్ని ఆంగ్లేయుల ఉపనివేశ స్థానంగా మార్చలేకపోయిరి. ఆంగ్లేయులకు విశిష్టాధికారాలను కల్పించి, తన్మూ లంగా ఇండియా దేశీయులను బహిష్కరించిన వ్యాపార కార్యకలాపాలలోను, పరిశ్రమల లోను మాత్రమే ఆంగ్లేయుల మూలధనం ఉపయుక్తమయింది. తేయాకు, కాఫీ తోటలు, నీలి

మందు పరిశ్రమ, నౌకాపరివహనము, విదేశీ ద్రవ్యమారకపు బ్యాంకులు, భీమాసంస్థలు,- ఇవి, పాశ్చాత్యుల మూలధన వినియోగానికి ఉపయోగించిన ముఖ్య ఉత్పాదన సంస్థలు. విదేశీయ రుణశేషానికి సంబంధించిన సమస్యను పరిష్కరించడానికి మారుగా, ఇది, ఆ సమస్యను మరింత తీవ్రం కావించింది. అదృశ్యమైన దిగుమతుల సంఖ్యను ఎక్కువ చేసినందువల్ల, వాటికి బదులుగా, ఇండియా ఆహార ధాన్యాలను, ఇతర ముడిసరకులను ఇంకా ఎక్కువగా ఎగుమతి చేయవలసి వచ్చింది.

(c) *రవాణా సౌకర్యాల అభివృద్ధి :* అంతర్దేశీయ సంచార మార్గాలను, రవాణా సౌకర్యాలను వృద్ధిచేయడము, ఇండియాలో రైలుమార్గాల జాలబంధాన్ని నిర్మించడానికి, డల్‌హౌసీ, వేసిన ప్రణాళిక,- ఇవి, ఇంగ్లాండు ప్రయోజనార్థం ఇండియా ఆర్థిక వ్యవస్థను అధీనపరచే, బ్రిటిషు పథకాలకు, బాగా ఉపకరించినవి. దేశంలోని అంతర్భాగాలనుంచి సరకులను జమ చేసుకోవడము, దిగుమతియైన, ఇంగ్లాండు వస్తువులను దేశంలోని వివిధ ప్రదేశాలకు సరఫరాచేయడము, అనే వ్యవహారాలకు, రవాణా సౌకర్య సౌలభ్యం, అవసరమైనది. రైలుమార్గాల నిర్మాణం వల్ల మరొక ప్రయోజనం కూడా సిద్ధిస్తుంది; బ్రిటిషు మూలధనానికి లాభకరమైన ఒక అవకాశం దీనివల్ల ఏర్పడుతుంది. పరిపాలనాధికారము కంపెనీ చేతులలోనుంచి ఇంగ్లాండు రాజ్యత్వానికి హస్తాంతర మైన వెమ్మటనే, రైలుమార్గాల నిర్మాణ కార్యక్రమం, ఆరంభించియుండడం వాస్తవమైనదే. కాని, ఈస్టిండియా కంపెనీ విధానంకూడా ఈ కార్యక్రమానికి ఉన్ముఖమై ఉండింది; ఆ విధానంలో ఏమార్పు కలుగలేదు; కాని, 1857 లో జరిగిన విప్లవం తర్వాతనే, ఈకార్యక్రమం వేగాన్ని అందుకొన్నది.

## V ఇండియా ఐశ్వర్యనిర్గమనం [ఐశ్వర్యపరీవాహం]

ఇండియాకు దిగుమతిచేసిన సరకుల విలువకంటె ఎక్కువగా, ఇండియానుంచి పంపిన మిగులు ఎగుమతులకు ప్రతిఫలం లభించకపోవడంవల్ల, ఇండియా ఇంగ్లాడు దేశాల ఆర్థిక వ్యవస్థలలో విస్తారమైన పరిణామాలు కలిగినవి. బెంగాలులో వసూలు చేసుకొన్న రాజస్వ ద్రవ్యంతో ఇండియా సరకులనుకొని, ఇంగ్లాండుకు పంపించే విధానాన్ని అవలంబించినది, ఈస్టిండియా కంపెనీ. ఈకొనుబడులను "పెట్టుబడులు" అని, వ్యవహరించియుండిరి. ఇవే, ఇండియా ఐశ్వర్య పరీవాహాలుగా ఏర్పడినవి. కంపెనీ బెంగాలును పరిపాలించిన మొదటి ఆరు సంవత్సరాలకాలంలో, సిద్ధించిన నికర ఆదాయం, 13,066761 పౌనులు; మొత్తం కర్చులు 90 27609 పౌనులు పోగా, 40 39152 పౌనులు మిగిలింది. దీనిని ఇండియా సరకుల రూపంలో, కంపెనీ, ఇంగ్లాండుకు పంపించింది. ఇది దేశంలోని నికరాదాయంలో మూడో భాగం. బైటికి ప్రవహించిపోయిన పూర్తి మొత్తం ఇది మాత్రమేకాదు. బెంగాలులోని ఆర్థిక మూలాధారాల నుంచి ఇంగ్లాండుకు వేరే మార్గంలో పోయిన పరీవాహ మొత్తం దీనిలో చేరలేదు. కంపెనీ ఉద్యోగులు, విస్తారమైన సంపదలను జమచేసుకొని, ఇంగ్లాండుకు పంపినారు. వీటి లెక్కలను జతపరచడం కష్టం. కాని, 1766-69 మధ్యకాలంలో జరిగిన ఎగుమతి దిగుమతుల లెక్కలనుబట్టి, ఈ ద్రవ్య పరీవాహస్వరూపం, స్థూలంగా వ్యక్తమౌతుంది. ఆ కాలంలో బెంగాలు గవర్నరుగా ఉండిన, హ్యారీ వెర్‌లెస్ట్, ఈ లెక్కలను తయారుచేసి ఉంచినాడు. వీటినిబట్టి. మొత్తం దిగుమతుల విలువ 624 375 పౌనులు; ఎగుమతుల విలువ,

5311 250 పౌనులు. మూడు సంవత్సరాల ఎగుమతుల మిగులు 4686375 పౌనులు. అనగా, ప్రతి సంవత్సరమూ 15 లక్షల పౌనులు విలువగల సరకులు బెంగాలు నుంచి, ఇంగ్లాండుకు ఎక్కువగాపోయినవి. దీనికి ఇంగ్లాండు నుంచి ఏ ప్రతిఫలమూ లభించలేదు. కాబట్టి, ఇండియా ఐశ్వర్యంలో నుంచి, 15 లక్షల పౌనుల ద్రవ్యం వృథాగా బైటికి ప్రవహించి పోయింది. తరువాతి సంవత్సరాలలో ఈ ఐశ్వర్య పరీవాహం, ఇంకా పెద్దదౌతూవచ్చింది. తరువాతికాలంలో, భారతజాతీయవాదుల ఖండనకు, విమర్శలకు ముఖ్యంగా గురిఐనది, ఈ విషయమే.

తరువాతి సంవత్సరాలలో జరిగిన ఈ పరీవాహ పరిమాణం విషయంలో అభిప్రాయ భేదమున్నది. ఆంగ్లేయోద్యోగులు తమ పేరట ఇంగ్లాండుకు పంపుకొన్న మొత్తాలను, అధికార రీత్యా ప్రకటించిన వాణిజ్యపు లెక్కలను,- ఈ రెంటినీ గ్రహించి, విలియం డిగ్బీ, "ప్లాసీ యుద్ధానికి, వాటర్లూ (Waterloo) యుద్ధానికి మధ్యకాలంలో, ఇండియాలోని మూల భండారాలలో నుంచి, ఇంగ్లాండుకు 100 కోట్లు పౌనులు ప్రవహించిపోయి ఉంటుంది." అని వ్రాసి ఉన్నాడు. దీనినిబట్టి, సరాసరి, ప్రతి సంవత్సరమూ 1.72 కోట్లు పౌనులు పరీవాహ రూపంలో ఇండియా ధనం, ఇంగ్లాండులో కలిసిపోయింది. పది "వ్యాపారకాలాల" లెక్కలను ఆధారంగా చేసుకొని, ప్రొఫెసర్ ఫుర్బర్, ఈ కింది నిశ్చితాభిప్రాయాన్ని వెలువరిచినాడు. "పైన వివరించిన విధంగా, ఇండియాలోని ఐశ్వర్యం పరీవాహరూపంగా ఇంగ్లాండుకుపోయి ఉండడం వాస్తవమైనదే. కాని దాని పరిమాణం, ఇంత విస్తృతమైనదికాదు. 1783-93 సంవత్సరాల మధ్యకాలంలో, పాశ్చాత్య దేశాలకు ప్రవహించిపోయిన ఇండియా ఐశ్వర్యం, సంవత్సరానికి 10 లక్షల పౌనులకు మించి ఉండదని అంచనావేయవచ్చు." "ప్రొఫెసర్ ఫుర్బర్ ఇచ్చిన అంచనా, వాస్తవ విషయానికి సన్నిహితంగా ఉన్నదని" జాన్‌స్ట్రాచీ అభిప్రాయం. "ఫుర్బర్, ఇటీవలికాలపు అమెరికా పరిశీలకుడు కాబట్టి, ద్రవ్య పరీవాహాన్ని తగ్గించి చూపవలసిన ఉద్దేశం ఉండదు," అని, కారణాన్ని కూడా సూచించినాడు.

యథార్థమైన మొత్తాన్ని నిశ్చయించడానికి తగిన ఆధారాలు లేనందువల్ల, ఇండియా నుంచి ఇంగ్లాండుకు బదిలీచేయబడిన ధనాన్ని నిష్కర్షగా తేల్చే వివాదాలలో పాల్గొనడం తగనిపని. డిగ్బీచెప్పిన మొత్తము, అతిశయోక్తితో కూడినదైతే, ఫుల్లర్ నిశ్చయించిన, అందాజు, న్యూనమైనదని తోస్తుంది. "ఇండియాదేశ సమస్తానికీ వర్తించే ఎగుమతి దిగుమతుల సంఖ్యా పరిగణనాలు సంపూర్ణంగాను, సమగ్రంగాను లేవు," అని, తన నిశ్చయానికి తగిన సమగ్రాధారం లభించలేదని, ఫుల్లర్ తానే అంగీకరించి యున్నాడు. ఈవిషయమెట్లున్నా, ఇండియాదేశాన్ని ఇంగ్లాడు ఆక్రమించిన ఫలితంగా, విదేశ వ్యాపారాన్ని సాధనంగా చేసుకొని, ఇండియాదేశ ప్రజల సంపదను తమ ప్రయోజనార్థం, బ్రిటిషువారు ఉపయోగించుకున్నారనే విషయం, వివాదాస్పదమైనదికాదు.

*ఇండియాకు నష్టము, ఇంగ్లాడుకు లాభము :* ఇంగ్లాండుదేశపు పారిశ్రామికాభివృద్ధికి, ఇండియానుంచి పరీవాహంగా వచ్చిన ధనం, ముఖ్య సాధనమయింది. ప్లాసీ యుద్ధానంతరం ఇంగ్లాండులో జరిగిన అద్భుతావహమైన పారిశ్రామికాభివృద్ధి, ఇండియా పరిశ్రమల వినాశాన్ని ఆధారంగా చేసుకొని జరిగిందని నిరూపించడానికి, తగినంత సాక్ష్యం సిద్ధంగాఉంది. ఇంగ్లాండులో జరిగిన పారిశ్రామిక విప్లవానికీ, ఇండియాలో బ్రిటిషు పరిపాలన ఏర్పడడానికీ,

సన్నిహిత సంబంధం కలదని, బ్రిటిషు చరిత్రకారులే స్పష్టంగా వ్రాసియున్నారు.

బ్రిటిషువారు బెంగాలును పరిపాలించిన ప్రథమదశలో, ఈస్టిండియా కంపెనీ, దాని ఉద్యోగులూ, దోచుకొనిపోయిన సంపదే, పారిశ్రామిక విప్లవపు తొలిరోజులలో పరిశ్రమలకు ఉత్తేజనం కలిగించిన మూలధనం. బ్రూక్స్ ఆడమ్స్, నిష్కర్షగా ఈవిషయమై వ్రాసినాడు. "ఇంగ్లాండులోనికి ప్రవాహరూపంలో వచ్చిన ఇండియా సంపద, జాతియొక్క ద్రవ్యరూప మూలధనాన్ని శక్తిసంపదను, అత్యధికంగా వృద్ధిపరచడమేకాక, దాని నమ్యతనూ (flexibility), గతివేగాన్నీ పెంచింది.

ప్లాసీయుద్ధము ముగిసిన తర్వాత, శీఘ్రకాలంలోనే బెంగాలు దోపిడిధనం, లండన్ నగరంలో ప్రవేశించడం ఆరంభమయింది; దీని ఫలితం మరుక్షణమే వ్యక్తమయింది. ప్లాసీ యుద్ధం జరిగింది 1757 లో. దీనిని అనుసరించి, అత్యంతమైన వేగంతో జరిగిన మార్పుకు సదృశ్యమైనది, ఎక్కడా జరుగలేదు. 1760లో మిల్లుచేతలో ఉపయోగించే నాడె (Flying Shuttle) నిర్మాణం జరిగింది; లోహాలను కరిగించడంలో కర్రలకు మారుగా బొగ్గు ఉపయోగం వచ్చింది. హార్‌గ్రీవ్స్, స్పిన్నింగ్ జెన్నీ, ని 1764 లో నిర్మించినాడు; 1779 లో క్రాంటన్, మ్యూల్ అనే నూలు యంత్రాన్ని సృష్టించెను; శక్తితో నడిపే మగ్గాన్ని (Power loom) కార్ట్‌రైట్, నిర్మించి, 1785 లో తన ఏకస్వం చేసుకొన్నాడు. ఈ అన్నిటికంటె ప్రధానమైనది, వాట్స్, 1768 లో, సమర్థంగా చేసిన ఆవిరియంత్రం. కాలగతియొక్క వేగానికి, ఈ యంత్ర నిర్మాణాలన్నీ, బహిర్గమనమార్గాలేకాని, దాని కివి కారణాలుకావు. యంత్ర నిర్మాణాలన్నీ స్వభావాన్నిబట్టి నిష్క్రియాత్మక మైనవి; తమంతట అవి ప్రవృత్తమయ్యేవికావు. శక్తిసంచయం సమృద్ధిగా ఏర్పడేవరకూ శతాబ్దాలుగా, ప్రకృతిలో ఇవి, అంతర్భూతంగా నిలిచియుండినవి. ఈశక్తిసంచయమంతా చెలామణిలో ఉండే ద్రవ్యంలో, నిహితమై ఉంటుంది. ఒక నిధిరూపంలో ఉండే ధనానికి శక్తిలేదు. ప్రవాహరూపంలో అది ప్రసరించినప్పుడే, దానికి ఈశక్తి ఏర్పడుతుంది. ఇండియా సంపద ఇంగ్లాండులోనికి ప్రవహించివచ్చి, దానిని అనుసరించిన పరపతి అభివృద్ధి చెందేవరకూ; యంత్ర నిర్మాణోద్యమం బహిర్గతం కాలేదు. యాభై ఏండ్లకు పూర్వం వాట్స్, జన్మించియుండే, అతడు, అతని నిర్మాణ చాతుర్యంకూడా పేరు ప్రతిష్ఠలు లేకుండాపోయి ఉండేవి."

"ప్రపంచం సృష్టికి వచ్చినప్పటి నుంచీ కూడా, ఇండియాను దోచుకొన్న ధనాన్ని పెట్టుబడి కావించడంవల్ల, సిద్ధించినట్టి ప్రయోజనమూ, లాభమూ ఎప్పుడూ కలుగలేదని చెప్పవచ్చు. తర్వాత, యాభై ఏండ్లదాకా, బ్రిటిసుదేశముతో స్పర్ధచేసే దేశం, ప్రపంచంలో ఏర్పడలేదు."

1694 నుంచి 1757 వరకూ, అభివృద్ధి మందంగా జరిగింది; 1760-1815 ల మధ్య, దాని వేగమూ ఎక్కువయింది, పరిమాణమూ వృద్ధి చెందింది.

ఇంగ్లాండులోని పారిశ్రామిక విప్లవానికి మూలాధారమైన సంపద ఎక్కడిది, అనే విషయాన్ని, కన్నింగ్‌హామ్, స్పష్టంచేయడు. కాని 1760 తర్వాతనే అది జరగడానికీ, అంతకుపూర్వం జరగకపోవడానికీగల కారణాల విషయంలో, ఇతడు బ్రూక్స్ ఆడమ్స్‌తో ఏకీభవిస్తాడు. అతడు ఈ విధంగా వ్రాస్తాడు. "యంత్ర నిర్మాణాలు, ఆవిష్కరణాలు, కేవలం అనుద్దిష్టమైనవని తోస్తుంది. గణించడానికి వీలులేని, ప్రత్యేకమైన నిర్మాణ ప్రతిభ

ఒక్కసారిగా పైకి ఉబికినందువల్ల, పద్దెనిమిదో శతాబ్దంలోని యంత్ర పరికరాలన్నీ సృష్టికి వచ్చినాయని, ప్రజలు తలంచవచ్చు. కాని, కార్ట్‌రైట్‌కు, వాట్స్‌కు, కాలపరిస్థితులు పక్వమై ఉండినవి అని చెప్పడంలో, వారి యోగ్యతను, అర్హతను, న్యూనతపరచే ఉద్దేశంలేదు. విలియంలీ, దోదోదస్లీ, కాలము నుంచీ కూడా, ఉత్తమ మేధాశాలురు ప్రపంచంలో లేక పోలేదు. కాని, వారికాలంలోని పరిస్థితులు, వారి విజయానికి అనుకూలించినవికావు. అధిక వ్యయముతో కూడిన సాధనలతోను, ప్రక్రియలతోను జరిపే సాంకేతిక ఉద్యమాలకు, విస్తారమైన మూల ధనము అవసరం. తగినంత మూలధనం తన అధీనంలో లేక, విస్తార మైన ప్రపంచ బజార్లు వశంలోలేక, ఎంతటి శక్తివంతుడైన వ్యక్తికూడా ఇట్టి ఉద్యమానికి పూనుకోవడం నిరర్థకం. పద్దెనిమిదో శతాబ్దంలో, అనుకూల పరిస్థితులు ఎక్కువౌతూరావడం వల్ల, ఈ అభ్యుదయానికి అవకాశం కలిగింది."

ఇండియాలోని మిగులు సరకులను ఇంగ్లాండుకు పంపించడం, 'ఐశ్వర్య పరీవాహం' కాదని, దానిని ఆ విధంగా గణించకూడదని వాదించే వర్గంవారు కూడా ఉన్నారు. బ్రిటిషు ప్రభుత్వం ఇండియాలో నెలకొల్పిన శాంతి భద్రతలకు, స్థాపించిన "మంచి ప్రభుత్వానికి" ఈ ద్రవ్యం ప్రతిఫలంగా, ఇండియా చెల్లించవలసిందని వీరి అభిప్రాయం. బ్రిటిషు పరిపాలన యొక్క ప్రథమదశకు సంబంధించిన విషయంలో, జాన్‌స్ట్రాచీ ఇచ్చిన సాక్ష్యం, నిర్ధారకమైనట్టిది. ఇతని పూర్వీకులు, ఇండియాలో ఉన్నతోద్యోగాలను నిర్వహించినవారు. అతడు ఈ విధంగా వ్రాస్తాడు. "తన్ను జయించిన బ్రిటిషు విజేతలకు తాను చెల్లించిన కప్పానికి ప్రతిఫలంగా, వారు మంచి ప్రభుత్వాన్ని స్థాపించి, దేశంలో శాంతి భద్రతలను నెలకొల్పలేదా ? అని ప్రశ్నించవచ్చు. ఈ విషయం నిస్సందేహమైనదే. యథాకాలంగా, నియతమైన ప్రభుత్వము, న్యాయపరిపాలన, క్రమవ్యవస్థ, విలువగలిగినవే. కాని, ఆక్రమణకు పదహైదేండ్ల తర్వాత, పరిసర ప్రాంతాల దండయాత్రల నుంచి బెంగాలు ప్రాంతం రక్షితమైయున్నదనే వాదము, దుస్థితికి లోనైన ఆ ప్రాంతానికి ప్రయోజకమైనదికాదు. పరిసర ప్రాంతాల వారి కంటె, ఎక్కువగా, తమ పద్ధతి ప్రకారం ఇప్పటి పరిపాలకులు బెంగాలును దోచుకొంటూ ఉండడమే, ఈ అసంతృప్తికి కారణం. సమష్టిగా కంపెనీవారూ, వైయక్తికంగా కంపెనీ ఉద్యోగులూ, బెంగాలు సమతల ప్రదేశాలను, చెమ్మలేకుండా పీల్చివేసిన విధంగా, ఏమరాఠా దండయాత్రకూడా, ఏప్రాంతాన్నీ నాశంచేయలేదు. వాస్తవంగా చూస్తే, ధన పిశాచము యొక్క ఆవేశానికిలోనై బెంగాలు రైతులు చెల్లించలేని, చెల్లించి బ్రతుకలేనంత ద్రవ్యాన్ని, వారి నుంచి దోచుకొన్నారు. వీరి చర్యలకు తగినట్లుగా రైతులు మరణించడం తప్పక జరిగింది."

బ్రిటిషు ప్రభుత్వం స్థాపించిన "మంచి ప్రభుత్వము," నెలకొల్పిన శాంతిభద్రతలు, పర్యవసానంలో, దేశానికి ప్రయోజనమైనవి, అనే అభిప్రాయంకూడా విమర్శనీయమైనదే. బ్రిటిషువారి మిలిటరీ పరిపాలన, శివిల్ పరిపాలనకూడా, ఇంగ్లాండు లాభానికై, ప్రయుక్తమైనవే కాని, ఇండియాలోని మూలాధారాల అభివృద్ధికి, ప్రజల శ్రేయోభివృద్ధికి, ఉపయుక్తం కాలేదు. ఇండియానుంచి, కప్పముల రూపంలో ధనాన్ని గ్రహించియుండడం న్యాయబద్ధమైనది కాదనే విషయంలో, ఎట్టి సందేహానికి అవకాశంలేదు. అదేవిధంగా, పారిశ్రామిక విప్లవముయొక్క ప్రథమదశా ప్రక్రియలో, ఇండియానుంచి పరీవాహరూపంలో ఇంగ్లాండు

కు చేరిన ధనం, ఎక్కువగా సహకరించిందనే విషయంలోకూడా, సందేహానికి ఏమాత్రమూ ఆస్కారం లేదు.

## VI ముగింపు

పూర్వపు డచ్చి కంపెనీని గురించి, జావాద్వీపానికి గవర్నర్‌గా ఉండిన, సర్‌స్టాం ఫోర్డ్‌రాఫేల్స్ (ఇతడు ఆంగ్లేయుడు), ఈ విధంగా వ్రాసియున్నాడు. "కేవలం లాభకాంక్ష యొక్క ప్రేరణకు మాత్రమే లోబడిన డచ్చి కంపెనీవారు, వెస్ట్‌ఇండియా తోటల యజమాని తన క్షేత్రంలో పనిచేసే కూలీల గుంపును పూర్వం, చూచినంతకంటె, అధమంగా, నీచంగా, తమ ప్రజలను చూస్తారు. ఇందుకు కారణం లేకపోలేదు. వెస్ట్ ఇండియా యజమాని, కూలీలు అనే "మానవ పదార్థాలను" వెల ఇచ్చికొన్నవాడు. డచ్చి కంపెనీవారు, తమ ప్రజలను ఆ విధంగా డబ్బిచ్చి కొనలేదు. కాబట్టి, తమ నిరంకుశ యంత్రాంగానికిగల శక్తి నంతనూ, ఉపయోగించి, ప్రజలవద్ద ఉన్నకడపటిపైసా వరకూ, పీల్చుకొని, వారిని పిప్పిగావించిరి. రాజకీయవాదుల ఉపాయ కౌశలాన్ని సంపూర్ణంగా ప్రయోగించే, ఏకస్వామ్యానికై ప్రాకులాడే వర్తకుల దురాశకు ప్రవృత్తి కల్పించి, చంచల స్వభావంతోను, అర్ధఆరణ్యక స్వభావంతోను కూడిన తమ ప్రభుత్వాన్ని, మరింత తీవ్రంకావించిరి." ఈస్ట్‌ఇండీస్ ద్వీపాలలో, తన సోదర ప్రభుత్వము నడిచిన మార్గంలోనే, ఇండియాలోని కంపెనీ ప్రభుత్వం కూడా నడిచింది. దేశంలోని వ్యాపారాన్ని, పరిశ్రమలను నాశంచేసింది. ఇండియాలో తయారైన వస్తువులను యూరోపుదేశాలనుంచి బహిష్కరించడమే ప్రథమ చర్యగా, తన విధానాన్ని ఆరంభించింది. ఆ తర్వాత, ఇండియాలోని చేతి మగ్గాన్ని విరుగగొట్టి రాట్నాన్ని నాశం కావించింది." నేతగాండ్రనూ, ఇతర వృత్తి శిల్పులనూ పీడించింది; తనకు ప్రతి స్పర్ధులైన ఉత్పాదకులపై అమానుషములైన దౌర్జన్యాలు జరిపింది. ముడిపట్టును కండెలుగా చుట్టేవారి చేతివ్రేళ్ళనూ, సున్నితమైన బట్టలను నేసేవారి చేతివేళ్ళనూ, కోసివేసిన సందర్భాలు కూడా లేకపోలేదు. దీని కంతటికీపైగా, క్రూరమూ, అన్యాయమూ ఐన, విధానాన్ని అనుసరించి, నిర్బంధంతో కప్పాన్ని గ్రహిస్తూ వచ్చింది. తత్ఫలితంగా, ఇండియాలో పెట్టుబడి సమకూరడానికీ, వ్యవసాయము పరిశ్రమలు వృద్ధిపొందడానికీ, ఏమాత్రమూ, అవకాశం లేకపోయింది. ఇండియా యొక్క ఉత్పాదక వ్యవస్థ సర్వస్వమూ నాశం కావింపబడింది. ప్రపంచమంతటా, సంపత్సౌభాగ్యములకు ప్రఖ్యాతి చెందిన భారతదేశాన్ని దారిద్ర్యానికీ, రోగాలకూ, దుస్థితికీ, ఆకలి బాధకూ ఆకరమైన దేశంగా మార్చినారు, బ్రిటిషు పరిపాలకులు.

దేశముయొక్క ఆర్థిక క్షీణతను అనుసరించి, సామాజిక విప్లవం సిద్ధించింది. సహకార జీవనాన్ని పోషిస్తూ ఉండిన గ్రామీణ సంస్థలు నశించిపోయినవి. వైయక్తికమైన ఆస్తి, వైయక్తికమైన ఉద్యమము, పైపోటీ, బజారుపై ఆధారపడిన ఆర్థికవ్యవస్థ,-మొదలైన పాశ్చాత్య భావాలపై ఆధారపడిన నూతన ఆర్థిక సంబంధాలు, ప్రాబల్యం వహించినవి. మానవజాతి భవిష్యత్తును సఫలంకావించే సాధనాలు, ఈ విప్లవంలో, నిహితమైఉన్నవని, మార్క్సు, భావించినాడు. "కేవలం అత్యంతమూ నీచమైన స్వప్రయోజన కాంక్షతో ప్రేరితులై ఆంగ్లేయులు, ఈ సాంఘిక విప్లవాన్ని హిందూస్థానంలో, కలిగించి యుండడం వాస్తవమైన విషయం. ఈ విప్లవాన్ని లేవదీయడంలో, ఇంగ్లాండు ప్రభుత్వం అవలంబించిన పద్ధతి బుద్ధిహీనమై నట్టిది.

కాని, చర్చనీయాంశం అదికాదు. ఏషియాఖండంలో సమూలమైన విప్లవం కలుగక మానవజాతి భవిష్యత్తు సఫలమౌతుందా, అనేది, ముఖ్యమైన ప్రశ్న. కాకపోతే, ఇంగ్లా. చేసిన అపరాధాలు ఎట్టివైనా కూడా, ఈ విప్లవం ఉత్పన్నం కావడానికి, ఇంగ్లాండు ప్ర త్వమే ప్రజ్ఞారహితమైన సాధనమై ఉండడం చారిత్రిక సత్యం."

వ్యావసాయిక విప్లవంవల్ల, ఇంగ్లాండులో కూడా, శ్రమికులు పొలాలను పోగొట్టు కొన్నారు; నిరుద్యోగ సమస్య తీవ్రమయింది; అత్యంతమైన దుస్థితి, కష్టాలు ప్రజలకు దాపు రించినవి. కాని, దాని వెంటనే కలిగిన పారిశ్రామిక విప్లవం, కొత్తగా స్థాపించబడిన కర్మా గారాలలోనికి, శ్రామిక జనాన్ని గ్రహించింది. కాబట్టి, నిరుద్యోగకాలమూ, జీవన కష్ట కాలమూ, శీఘ్రంగానే గడచిపోయినవి. ఇండియాలో దీనికి విరుద్ధంగా పరిశ్రమల నుంచి శ్రామికులను తొలగించివేసిరి. వీరిని లీనంచేసుకోడానికి అవసరమైన పరిశ్రమాభివృద్ధీ జరుగలేదు; వ్యావసాయిక విస్తృతీ కలుగలేదు. పరదేశముయొక్క స్వార్థపర ఆర్థిక విధా నానికి, ఇండియా ఆర్థికాభివృద్ధి, కేవలం అనుబంధంగా ఏర్పడింది. సామాజిక విప్లవంవల్ల, ఇండియాలోని మానవజాతి అనుభవించిన బాధ, అగణితమైనట్టిది, అతిదీర్ఘ కాలికమై నట్టిది.

1957 నాటికి ఆర్థిక విప్లవముయొక్క ప్రథమ దశాకాలం సంపూర్తి అయింది. ఈ మధ్యకాలంలో, నూతన వ్యవస్థను స్థాపించడానికీ, దేశాన్ని పునః నిర్మించడానికీ, తగిన నూతన శక్తుల ప్రక్రియ, ప్రారంభమయింది. ఆ సంవత్సరంలో జరిగిన ఉదంతాలు పూర్వ యుగానికి భరత వాక్యంగానూ, ఇండియా దేశచరిత్రలో నూతన ప్రకరణారంభానికి, నాందీగానూ, ఉపకరించినవి.

# సవరణలు

| పేజి | పంక్తి | సవరణ |
|---|---|---|
| xiii | 8 | గల వైశాల్యంతో |
| xv | 7-8 | ఉత్తరాధికార శుల్కాన్ని |
| XLII | 10 | గ్రీకు సంస్కృతి. |
| 2 | 16 | యుద్ధాన్ని |
| 4 | 4 | విశ్వాసపాత్రులైన |
| 6 | 21 | పోవడానికి |
| 33 | 5 | విభజింపబడింది. |
| 97 | 7 | ఆచ్ఛాదనంగా |
| 99 | 19 | సంవర్గంలోనివారే. |
| 99 | 1 | నియమితమయింది. |
| ,, | 15 | సిద్ధించలేదు. |
| 101 | 29 | పరిపాలకులకు సమాజస్థానంలో |
| 106 | 9 | బాగ్దాద్ నివాసియై |
| 113 | 14 | హీనస్థానం |
| ,, | 25 | అంతరించింది. |
| 118 | 20 | రాజ్యసంస్థ |
| 121 | 17 | ఋణంచేసినాడు. |
| 124 | 10 | జీవించడంమానవ |
| 125 | 14 | తప్పనిసరి ఐనది. |
| 138 | 20 | అన్నిదేశాలూ |
| 140 | 10 | అతి విస్తృతమైన |
| 142 | 36 | హేతువు |
| 143 | 35 | పదహేడో |
| 146 | 2 | అమ్ముడుపోయేది |
| ,, | 7 | రవాణా |
| 148 | 10 | పదహేడో |
| ,, | 16 | జీవనప్రమాణం |
| 149 | 27 | (Cotton quilts) |

| పేజి | పంక్తి | సవరణ |
|---|---|---|
| 162 | 19 | అభిప్రాయవైవిధ్యము |
| 165 | 1 | మాత్రమే తాను |
| 167 | 20 | ప్రక్రియలను |
| ,, | 35 | ప్రప్రథమంగా |
| 171 | 21 | విద్యావంతులైన |
| 172 | 14 | విషయాలతో |
| 174 | 28/30 | వాస్తుశిల్పము |
| 179 | 6 | పద్యరచనపై |
| 185 | 30 | (Laissez Faire) |
| 190 | 12 | ఎలిజబెత్ |
| 193 | 24 | చేయవలసివచ్చింది. |
| 197 | 1 | జతకూర్చుకొన్నారు. |
| ,, | 11 | సామ్రాజ్యాధికారాన్ని |
| 200 | 13 | పౌనులవాకా |
| ,, | 27 | మారేషియస్ |
| 208 | 24 | రాజ్యపాలకులు |
| 210 | 32 | అభివృద్ధి చెందింది |
| 213 | 16 | రజపుత్రులు |
| ,, | 23 | అహమద్‌షా అబ్దాలీ |
| 223 | 24 | అంతఃకలహాలతో |
| 239 | 21 | హెర్క్యులిస్ |
| 241 | 15 | పరివర్తనం |
| 245 | 24 | నిలిచిరి. |
| 246 | 8 | [illegible]డికిపోయింది. |
| 247 | 17 | సంపర్కం |
| ,, | 25 | పూర్వంవలెనే |
| 251 | 11 | న్యాయవిధానం. |
| 253 | 17 | అసంభావ్యమైనది |
| 255 | 34 | ఆగ్రహం |

సవరణ

వారిని అలవరచడము
స్పష్టమైన
...పాలనాధికారాల
...ప ఆశించే
...శ్చాత్యులు
do
...ండియాలో

| పేజి | పంక్తి | సవరణ |
|---|---|---|
| 297 | 36 | ఫలితాలు. |
| 310 | 19 | పరిపాలకవర్గంవారు |
| 311 | 1 | నిలిచియుండగల |
| ,, | 19 | రూపుమాసిపోయినవి. |
| 325 | 17 | కృత్రిమపద్ధతి |
| 330 | 19 | ఆక్రమించిరి. |

14,578

